భారతదేశ చరిత్రకు, భారతీయ ప్రజాజీవనానికి సంబంధించిన

# కథలు - గాథలు

♦ నాలుగు భాగాలు ♦

దిగవల్లి వేంకట శివరావు



విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞాన భవన్, 4-1-435, బ్యాంక్ స్ట్రీట్, హైదరాబాద్ - 01.

# అంకితము

## నా ఆప్తమిత్రులు:

శ్రీ వాడ్రేవు వేంకట నరసింహారావు పంతులు

శ్రీ చెఱుకుపల్లి వేంకటప్పయ్య

శ్రీ డాక్టరు ఘంటసాల సీతారామశర్మ గార్ల దివ్యస్మృతికి

# జగద్గురు తత్వబోధక స్వామి

స్వాములవారిలాగ నటించిన
రాబర్ట్ డీ నోబిలీ అనే క్రైస్తవ ఫాదరీ



(సమకాలికుడైన క్రైస్తవ మత బోధకుడు
క్రీ.శ. 1609లో గీసిన బొమ్మ.)

# చరిత్రకే మాట్లాడ్డం వస్తే...

భారతదేశ చరిత్రకూ, భారతీయ ప్రజాజీవనానికి సంబంధించిన చరిత్రాత్మక కథనాలివే ఈ 'కథలు - గాథలు'. చరిత్రగ్రంథాలు, జీవితచరిత్రలు, దినచర్యలు, జాబులు, యాత్రావిశేషాలు అనబడు అనుభవాలు, జ్ఞాపకాలు మొదలైనవి, ఇంకా పెద్దపెద్ద గ్రంథాలయాలలో మూల ముట్టుకొట్టుమని పడియున్న గ్రంథాలు తెచ్చి ఆసక్తితో చదివిన కొద్దీ చాలా చిత్ర విచిత్రమైన అపురూప సంగతులు తెలుస్తాయి. అవి తెలిసికోవటం ఒక వంతైతే, వాటిని జ్ఞాపకం పెట్టుకొని **'కథలు-గాథలు'గా రూపొందించటం మరియొకటి. ఆ చిత్ర విచిత్రాలను ఏరికూర్చి,** సత్యపథానుండి గీటుదాటకుండా పాఠకుల మనస్సును ఆకట్టుకొనేటట్లు **కథలూ-గాథలు చెప్పటంలో దిగవల్లి వేంకట శివరావుగారు** సిద్ధహస్తులు. అవి అన్నీ చరిత్రాధారాలపైన, గ్రంథప్రమాణాలపైన వ్రాయబడినవే గానీ పుక్కిటి పురాణాలు కావు. ఒక్కొక్కటి నవలల కంటె అద్భుతంగా **ఉంటాయి.** నవలలు ఊహాకందిన కల్పితాలు అయితే, జీవితచరిత్రలు ఊహాకందని వాస్తవాలు. వాటిలోని ఆసక్తికరమైన విషయాలు అనేకం ఉంటాయి. నవలలలో కూడా కొంత అయినా ఊహ వాస్తవానికి దగ్గరలో ఉండకమానదు. కన్నవి, విన్నవి, చూసినవీ, కాలమానపరిస్థితులు రచయితలపై ఛాయా మాత్రంగానైనా ప్రభావం కలిగి ఉండకమానవు. అయితే **'కథలు-గాథలు'** కల్పితాలకు దూరంగా ఊహకు అందని వాస్తవాలు. 'చరిత్ర' అంటే రాజుల యుద్ధాలు, జయాపజయాలు, వంశపురుషులు, తేదీలవారీ సంఘటనల జాబితాలు ఎంతమాత్రం కావు.

ప్రజాజీవనంలో క్రమ పరిణామం తెలిపేది సరియైన చరిత్ర. జాతీయభావ **చైతన్యాన్ని కలిగించేది** చరిత్ర. **"దేశమంటే మట్టికాదోయి - దేశమంటే మనుష్యులోయి"** అని మహాకవి గురుజాడ చెప్పినది చరిత్రకు నిజమైన నిర్వచనం. శివరావుగారు తన 96 సంవత్సరాల **జీవితంలో** నమ్మిన సత్యం కూడా ఇదే. ఆయన చేసిన అసంఖ్యాక రచనలలో ఈ సత్యం ప్రతిబింబిస్తుంది. **"ఆయన రచనలు సుప్రసిద్ధ చరిత్రకారుడు మేజర్ బి.డి. బసూగారి రచనలతో తుల్యమైనవ"ని** సుప్రసిద్ధ పాత్రికేయుడు నార్ల వేంకటేశ్వరరావు గారు కొనియాడారు.

ఈ **"కథలు-గాథలు"** అను శీర్షికతో 1942 నుండి ఒక దశాబ్దం పైగా ప్రచురింపబడి, ఆనాటి ఆంధ్రపత్రిక 'భారతి' పాఠకులను ఆకట్టుకొని, వారి ఆదరణ పొందగలిగాయి. వాటిలో కొన్నింటిని ఎంచి, కొన్ని మార్పులతో, ఇంకా కొన్ని - క్రొత్తవి చేర్చి రచయిత 1944-1947 మధ్య నాలుగు భాగాలుగా ప్రకటించారు. అవి చాలా త్వరితంగా పాఠకుల ఆదరణ పొందగలిగాయి. మరల అవి అచ్చువేయించటం పరిస్థితులవలన రచయితకు సాధ్యపడలేదు. ఇంత వ్యవధి అయినా కూడా వాటికోసం అడిగేవారు - ఇంకా లేకపోలేదు. నాటికీ - నేడు **విశాలాంధ్ర ప్రచురణాలయం** పూనుకొని వారి **'కథలు - గాథలు'** నాలుగు భాగాలను కలిపి చక్కగా తీర్చి, ముచ్చటగా ముద్రించటం ముదావహం. ఇలాంటి అపురూపమైన అరుదైన గ్రంథాలను శ్రద్ధగా మరల ప్రచురించి, ఆంధ్ర పాఠకలోకానికి - ముఖ్యంగా క్రొత్తతరంవారికి ఈ గ్రంథాలను గురించి తెలియచేయాలనే ఆశయంతో విశాలాంధ్ర సంస్థ వారు ఎంతో సేవ చేస్తున్నారు.

**రచయిత కుమారునిగా నేను వారికెంతో కృతజ్ఞుడను.**

తేదీ : 23-04-2010
న్యూనల్లకుంట, శివంరోడ్డు,
హైదరాబాదు - 500 044.

**దిగవల్లి వేంకట రత్నం**

# రెండవ కూర్పు పీఠిక

కథలు - గాథలు 1వ భాగము మొదటిసారి 1944లోను, రెండవభాగము 1945 లోను ముద్రింపబడినవి. దైవానుగ్రహమువలనను, పాఠకుల ఆదరాభిమానములవలనను వీనిని మరల ముద్రించుటకు అవకాశము కలిగినది.

నా రచనలను ఆదరించి, నన్నాశీర్వదించిన పెద్దలకును, సహృదయులకును సర్వదా కృతజ్ఞుడను.

ఒక నెలక్రిందట ప్రసంగవశమున ఈ పుస్తకము యొక్క పాతకూర్పు ప్రతులైపోవుచున్నవని నేను అనుటయే తడవుగా దీని నింతత్వరగా, ఇంతచక్కగా అచ్చువేయించి యిచ్చిన శ్రీ ఈదర వేంకటరావు పంతులుగారికి కృతజ్ఞుడను.

నా బంధుమిత్రులలో నాకత్యంత ప్రేమాస్పదులైయుండి దివంగతులైన శ్రీ వాద్రేవు వేంకటనరసింహారావు, చెలికపల్లి వేంకటప్పయ్య, డాక్టరు ఘంటసాల సీతారామశర్మగార్ల దివ్యస్మృతికి ఈ పుస్తకమును అంకితము చేయుచున్నాను.

బెజవాడ,
20-12-1954.

దిగవల్లి వేంకటశివరావు

# మొదటి కూర్పుకు పీఠిక

ఆంధ్రపత్రికా పాఠకులకు 'కథలు - గాథలు' అనే శీర్షిక చిరపరిచితమైనదే. అప్పుడప్పుడు భారతిలోను గడచిన ఒకటిన్నర సంవత్సరముల నుంచి ఆంధ్రపత్రిక ఆదివారం సంచికలలోను నేను వ్రాస్తూ వచ్చిన చరిత్రాత్మకమైన కథలలోను - గాథలలోను కొన్నిటినితీసి కొద్ది మార్పులతో ఇప్పుడీ రూపంగా ప్రకటిస్తున్నాను.

ఈ కథలలోను - గాథలలోను చిత్ర విచిత్రములైన సంగతులు, వింతలు - విశేషాలు కనబడుతూవున్నా ఇవి కల్పనా కథలుగాని, పుక్కిటి పురాణాలుగాని కావు. నిజంగా జరిగిన సంగతులు, చరిత్రాంశాలే. చరిత్రాధారముగాని, గ్రంథప్రమాణముగాని లేని అంశమిందులో ఒక్కటైనా లేదు.

ఇది నిజమా? కేవలము కల్పనమేనా? అని అనుమానం కలిగేటంత చిత్ర విచిత్రములైన చరిత్రాంశాలున్నవి. ప్రపంచములో ఇలాంటివాళ్లు వుంటారా? అని ముక్కుమీద వ్రేలువేసికొని ఆశ్చర్యపడేటంత విపరీత చిత్తవృత్తులుగల స్త్రీ పురుషులున్నారు. నిజంగా జరిగిన సంగతులముందర ఒక్కొక్కప్పుడు కల్పనాకథలు, నవలలు, సినీమా చిత్రాలు కూడా తీసికట్టుగా నుంటవి.

కొన్ని చరిత్ర గ్రంథాలలోను, జీవిత చరిత్రలలోను, దినచర్యలు, జాబులు, యాత్రా వృత్తాంతాలు, (Reminiscences) అనుభవాలు, జ్ఞాపకాలు మొదలైన వాటిలోను, రచ్చకెక్కిన వ్యవహారాలలోను ఇంకా ఇతర గ్రంథాలలోను నాకు కనబడిన రసవంతములైన ఘట్టములే ఈ కథలు - గాథలు. పెద్దపెద్ద గ్రంథాలయాలలో మూలపడివున్న పాత పుస్తకాల బూజు దులిపి చదివినకొద్దీ ఇలాంటివి కనపడుతూనే వుంటాయి.

భారతదేశ చరిత్రకూ, భారతీయ ప్రజాజీవనానికీ సంబంధించిన చరిత్రాత్మకములైన కథలను, గాథలను, చరిత్రాంశాలను కొన్నిటిని మచ్చుచూపించడమే ఈ సంపుటముయొక్క ముఖ్యోద్దేశం.

విజయవాడ,
20-9-1944.

**దిగవల్లి వేంకట శివరావు**

# పండితాభిప్రాయములు

## వేటూరి ప్రభాకరశాస్త్రి

నేడు తెలుగు చదువరులు ముఖ్యముగా తెలుసుకోవలసిన విషయములను గురించి సేకరించి, సులువయిన భాషలో, చక్కగా, సంగ్రహముగా, గ్రంథరూపమున మీరు వెల్లడించుచుండిరి. మీ గ్రంథములు సర్వాంధ్రజనులు కుతూహలముతో అపూర్వ విషయసంగ్రహాదోత్సాహము కొందరపఱచు చుండగా వడిగా చదివి తనియగలరు. మీరు త్వరగా గ్రంథ సంధానముచేయుగల ప్రతిభావంతులు. మీ రెండు గ్రంథములలో చాలా విషయములను అమూలాగ్రముగా చదివినాను. కొన్నిందిని స్థూలదృష్టితో చూచినాను. మనసారా చాలా పరితోషముచెంది యీ జాబు వ్రాస్తున్నాను.

తిరుపతి,
10-2-1947.

## శ్రీ చిరంతనానందస్వామి ఆశీర్వాదము

"మహాశయ! మీ రచనలను జదివి బ్రహ్మానందమునందు వారిలో నేనొకడను. దేశభక్తియు, మతభక్తియు మీ రచనలందు వెల్లివిరియుచుండును. పాఠకులందు వానిని బురికొల్పుచుండును. ఇట్టిరచనలే దేశమున కిప్పుడత్యంతావశ్యకములు. ...మీరెప్పుడైనను మద్రాసు వచ్చెనెడల ఒకసారి తప్పక మఠమునకు రాగోరెదను.

శ్రీ రామకృష్ణ భగవానుడు మీకు చిరాయురారోగ్యము నొసగి మీచే ఇతోధిక సారస్వతసేవ చేయించుగాక!

**26-7-1944.**

# ఇందులో...

## మొదటి భాగము



## రెండవ భాగము

## మూడవ భాగము



## నాలుగవ భాగము

# 1. చిలకసముద్రం కలెక్టరు

*(ఇది కల్పిత కథ కాదు. నూరు సంవత్సరాలకు పూర్వం నిజంగా జరిగిన కథ. గంజాం జిల్లాలో ఇప్పటికీ ముసలివాళ్లు ఈ కథ చెప్తుంటారు. చాలామంది పాశ్చాత్య గ్రంథకర్తలు దీనిని తమ పుస్తకాలలోకి యెక్కించారు. సర్ చార్లెస్ లాసన్‌గారు 'మెమోరీస్ ఆఫ్ మెడ్రాస్' అనే పుస్తకంలో దీనిని గురించి ఒక ప్రకరణం వ్రాశారు. నేను వ్రాస్తూవున్న సంగతులలో చాలాభాగం వారి గ్రంథానికి అనువాదం.)*

గంజాం జిల్లాలో చిలకసముద్రం అనే మహాసరస్సు ఒకటి వున్నది. ఇది 44 మైళ్ళు పొడుగున బంగాళాఖాతానికి అనుకుని ఉన్నది. సముద్రానికీ దీనికీ 200 గజాలు వెడల్పు గల ఇసుకపర్ర మాత్రమే అడ్డు. ఇది సముద్రభాగమే అని చెప్పవచ్చును. డిశంబరు నుంచి జూన్ వరకూ నీళ్ళు ఉప్పుగా ఉంటాయి. వర్షాకాలంలో మాత్రం తియ్యగా ఉంటాయి. ఈ సరస్సు యొక్కలోతు మూడు మొదలు ఐదు అడుగులు ఉంటుంది. ఎక్కడా ఆఱడుగులు దాటదు. దీనికి దక్షిణాన, పడమర, చిన్నచిన్న గుట్టకొండలు నీటిలోకి చొచ్చుకొని లంకల్లాగు ఉంటాయి. అలాంటి ప్రదేశాలలో ఒకదానికి బ్రేక్‌ఫాస్టు ఐలెండు (Break-fast Island) అనిపేరు. ఈ సరస్సు మధ్య కళ్ళికోట రాజా గారి భవనం ఒకటి ఉన్నది. ఇండియా దేశానికి వైస్రాయిగా వుండిన కర్జను ప్రభువు ఇక్కడికి వచ్చినప్పుడు "ఈ చోటునుంచి కనబడే దృశ్యం భారతదేశంలోనికల్లా సుందరమైనదిగా నాకు తోస్తూంది" అని అన్నాడట! మన కథ ఈ ప్రదేశానికి సంబంధించినదే!

మన కథానాయకుడి పేరు థామస్ స్నాడ్‌గ్రాస్. ఇతను గేబ్రియెల్ స్నాడ్‌గ్రాసు కొడుకు. ఇతడు 1759 లో జన్మించాడు. తండ్రి ఇండియాలో కుంపిణీవారి కొలువులో పనిచేశాడు. అతని ప్రాపకంవల్ల థామసుకు కూడా 1777 లో చెన్నపట్నం సెంట్ జార్జికోట పరిపాలన క్రింద ఒక రైటరుగిరీ (Writer-ship) యిచ్చారు. 1782 లో ఈ కుర్రవాడికి ఫ్యాక్టరు (Factor) గా ప్రమోషను యిచ్చారు. 1790లో ఇతడు సీనియరు మర్చెంటు హోదాను, గంజాం అసిస్టెంటు రెసిడెంటు పదవినీ పొందినాడు. భారతదేశంలో ఎక్కడ చూసినా వరహాల చెట్లు వుండిన రోజులు - అవి. ఆ చెట్లను ఆశ్రయించుకొని దులిపినకొద్దీ బంగారు వర్షం కురిసేది. తక్కిన దొరలలాగునే ఈ స్నాడ్‌గ్రాసుకూడా ఉద్యోగరీత్యా తనకు లభించిన అవకాశాన్ని వృథా పోనివ్వకుండా ఆ వరహాల చెట్టును గట్టిగా పట్టుకొని దులపడం ప్రారంభించాడు. ఇతడు రెసిడెంటుగా వచ్చిన రెండు సంవత్సరాలలో గంజాంలో కఱవు వచ్చింది. ఈ కఱవులో ఇతడు తెలివిగా పనిచేశాడు, జమీందార్లను అదుపులో వుంచాడు. ఆ కాలంలో ఇతడు తిండిలేక మాడుతూన్న వాళ్లచేత పనులు చేయించి సర్కారు డబ్బులతో వారికి గంజికూడు పెట్టించాడు. ఇతడు వాళ్లచేత కట్టించిన బిల్డింగులలో గంజాం పట్టణానికి పదిమైళ్ళలోవున్న రంభలో చిలకసముద్రంయొక్క ఒడ్డును అనుకొని ఇరవైవేల నవరసులు పెట్టి కట్టిన సుందరమైన భవంతి ఒకటి. ఇది అతని సొంతం.

ఈ భవనం అంటే అతనికి అతిప్రీతి. దానిలోనే ఇతడు కాపురం వుంటూ వుండేవాడు. అది ఇప్పటికీ వున్నది. అప్పుడు చెన్నపట్నం గవర్నరు సర్ చార్లెస్ ఓక్లే. కఱువు కోసం అని చెప్పి స్నాడ్‌గ్రాసు ఖర్చుపెట్టిన సొమ్ము చాల ఎక్కువగా ఉన్నదని విమర్శించాడు. ఈసంగతి ఏమిటో కనుక్కోవాలనిన్నీ కుంపినీవారి రెవెన్యూ ఉద్యోగులందరూ చేయవలసినట్లు పార్లమెంటువారు నిర్ణయించిన ప్రమాణం ఇతనివల్ల తీసుకోగలందులకున్నూ ఇతన్ని చెన్నపట్నం రమ్మన్నారు.

ఇతడు గంజాంనుంచి అవతలికి అడుగుపెట్టడంతోటే అక్కడి జమీందార్లు చాలమంది ఇతని దుబాషీ (ద్విభాషి) అయిన గోపాలకృష్ణమ్మకు తాము దఫాలవారీగా చాలా మొత్తాలు చెల్లించినామనిన్నీ, దానికి అతడు రశీదులు యివ్వలేదనిన్నీ ఫిర్యాదు చేశారు. ఇతనిస్థానేవచ్చిన ఆక్టింగు రెసిడెంటు దీనిని గురించి దర్యాప్తు చేశాడు. దీనివల్ల స్నాడ్‌గ్రాసు తన 'ద్విభాషికి' తగని చనువూ అధికారమూ ఇచ్చాడనిన్నీ, అతడు అధికారం దుర్వినియోగంచేసి లాభం పొందినాడనిన్నీ బయటపడింది. అంతట ఆ దుబాషిమీద కేసుపెట్టి అతడు అపహరించిన సొమ్ము భర్తీచేయవలసిందని నిరోధించాడు. అతడు మొదట తప్పించుకోచూచాడుగాని ఖయిదులో వుంచి కొంచెం బాధించేటప్పటికి మెత్తబడి, సొమ్ము కక్కివేశాడు. అతినిని వదిలివేయగా మళ్ళీ ఎక్కడా కనబడకుండా పోయాడు. ఈ తవాయివల్ల స్నాడ్‌గ్రాసుకు మళ్ళీ పని యివ్వడానికి సందేహించారు. 1794 లో రెసిడెంటు పదవికి బదులు కలెక్టరు పదవి యేర్పాటు చేసి వాల్టర్ బాల్ఫర్ అనే అతనిని ఆ పనికి నియోగించారు. (ఇతడు 1845 లో చనిపోయేటప్పటికి 10 లక్షల పౌనులు సంపాదించినట్లు తేలింది) అయితే కొద్దికాలంలోనే స్నాడ్‌గ్రాసు యొక్క అకృత్యాలు మరచిపోయి 1797లో బాల్ఫర్ స్థానంలో మళ్ళీ ఇతనిని కలెక్టరుగా నియమించారు. పనిలేకుండా వుండిన ఈ నాలుగు సంవత్సరాలో స్నాడ్‌గ్రాసు తన నడతను మార్చుకొనే టందుకు బదులుగా ఇంకా కొన్ని దురభ్యాసాలుకూడా అలవర్చుకొని చెడినందువల్ల ఇతని హయాంలో - గంజాం జిల్లా మాన్యూలు వ్రాసిన మాల్టుబి (Maltby) చెప్పినట్లుగా గంజాం జిల్లా పరిపాలనలోని అన్నిశాఖలూ పుచ్చిపోయాయి. పాతదుబాషీ గోపాలకృష్ణమ్మ మాయమైనాడు. కాని అతనికి బదులు అలాంటివాడే జగన్నాథరావు అనేవాడు ఒకడు తయారైనాడు.

స్నాడ్‌గ్రాసు ఇతనిని దుబాషీగా నియమించి అతనికి సర్వాధికారాలు యిచ్చాడు. దానితో సర్కారుదస్తు తరుగులూ, మోసాలూ, ప్రజాపీడనము సర్వసామాన్యమై పోయినాయి. గంజాంపట్నంలో ఈ 'దుబాషీ' తన దివాణం (కోర్టు) ఒకటిపెట్టి సాగించాడు. ఇతనిని మంచి చేసుకోదలచిన జమీందారులు ఇతరులు అక్కడకు వెళ్ళి ఈయన దర్శనం చేయాలి. ఎవరూ వట్టిచేతులతో వెళ్ళకూడదు. స్నాడ్‌గ్రాస్ దొరగారికి యిదేమీ పట్టలేదు. ఇతడు తన సిపాయిలతోటి బంట్రోతులతోటి, ఇతర పరివారంతోటి ఎప్పుడూ రంభలోనే దర్జాగా ఉండేవాడు. తన మనస్సుకు నచ్చిన అందమైన బోగముదాన్ని ఒకతెను వుంచుకున్నాడు. అమె చాలా తెలివైనది. అతన్ని తనవలలో వేసుకుని అనేక తంత్రాలు, తమాషాలు చేస్తూ అమితవ్యయం చేయించేది. తన యిష్టం వచ్చినట్లల్లా ఆడించేది.

ఇలాగు కలెక్టరు ఉపేక్షవల్లా, దుబాషీ దుర్మార్గం వల్లా జిల్లా వ్యవహారం దుస్థితిలోకి దిగిపోయింది. సర్కారు శిస్తు వసూలు మందగించింది. అప్పుడు చెన్నపట్నం రాజధాని

గవర్నరు క్షయివు ప్రభువు శిస్తులు ఎందువల్ల సరీగా వసూలు కావడంలేదని సంజాయిషీ అడిగాడు. వర్షాలు సకాలంలో కురవలేదనిన్నీ, అందువల్ల పంటలు బాగా పండలేదనిన్నీ, ప్రజలలో డబ్బు లేదనిన్నీ, జిల్లాలో జమీందారులు చెప్పిన మాట వినడం లేదనిన్నీ, ఖోండు జాతివాళ్ళు అల్లరిచేస్తున్నారనిన్నీ, శాంతిభద్రతలు నెలకొల్పడానికి శిస్తు వసూలుకు తగిన మిలిటరీ బందోబస్తు సిబ్బందీ తనకు లేదనిన్నీ స్నాడ్‌గ్రాస్ జవాబు చెప్పాడు. కాని చెన్నపట్నం రెవిన్యూ బోర్డువారు మోసపోయేవారుకారు. సర్కారుదస్తు ఫాజలు (అపహారం) కేసు కప్పిపుచ్చటానికి ఇంత తెలివితేటలైన జవాబు ఇదివరలో ఏ కలెక్టరూ చెప్పినది లేదని అన్నారు. గవర్నమెంటువారుకూడా ఇలాగే అభిప్రాయబడి స్నాడ్‌గ్రానును కలెక్టరు పదవిలోనుండి తొలగించి బ్రౌను అనే అతనిని కలెక్టరుగా నియమించారు. ఈ బ్రౌను గంజాం వచ్చేటప్పటికి కొంతకాలం పట్టింది. వచ్చిన తరువాత స్నాడ్ గ్రానును చార్జీ వప్పగించేటట్లు చేయగలిగేటప్పటికి ఇంకా కొంతకాలం పట్టింది. స్నాడ్‌గ్రానును రంభదగ్గరనుంచి కదిలించేటప్పటికి గవర్నమెంటు వారి తాతలు దిగివచ్చారు.

స్నాడ్‌గ్రానుస్థానే నియమింపబడిన క్రొత్తకలెక్టరు బ్రౌను గంజాంజిల్లా వ్యవహారాలన్నీ చక్కబెట్టడానికి ప్రయత్నించాడు. కాని అది సులభ సాధ్యం కాలేదు. అవి అంత గందరగోళంలో వున్నాయి. మంచి అభివృద్ధిలో వుండిన జిల్లా పాడైపోయిందనిన్నీ, జనసంఖ్య కూడా క్షీణించిందనిన్నీ ఇతడు పైకి వ్రాశాడు. దుబాషీని అరెస్టు చేశారు కాని అతడెంత సొమ్ము అపహరించిందీ సరిగ్గా తెలుసుకోవటానికి వీలు కాలేదు. బయటపడిన రెండువద్దులే ఒక లక్ష అరవై ఎనిమిది వేల రూపాయిలు దాకా తేలినాయి. ఈ ద్రవ్యాపహరణానికి అతనిమీద దస్తుఫాజిల్ కేసు పెట్టాడు. కాని దేశం అల్లకల్లోల స్థితిలో నుండుటవల్లా, గుంసూరులో తిరుగుబాటు జరిగినందువల్లా ఈ కేసువిచారణ జయప్రదంగా నడపడానికి బ్రౌనుదొరకు అవకాశం లేకపోయింది.

1793కూ 1801కీ మధ్య యీ జిల్లా పరిపాలనను గురించిన తప్పీలు తెలుసుకోడానికి రికార్డులు ఏమీలేవని జిల్లామాన్యూలు వ్రాసిన మాల్ట్‌బీ వ్రాసినాడు. ఈ రికార్డులేమైనవని విచారించగా బ్రౌనుదొరగారే వానిని తగల వేశారని స్పాటిస్‌వుడ్ అనే కలెక్టరు వ్రాశాడు. కాని ఇది విశ్వసించ తగినట్లు లేదు. ఈ జిల్లాలో దీనిని గురించి ఒక కథ చెప్పుకుంటారు. తనపైని సాక్ష్యం దొరకకుండా రెవిన్యూ లెక్కపుస్తకాలన్నీ స్నాడ్‌గ్రాసు చిలకసరుస్సులో పారవేశాడట. "రంభదగ్గరకు వచ్చేటట్లయితే ప్రాణం తీస్తా"నని బ్రౌనుదొరను బెదిరించాడట!

రంభలో కూర్చుని స్నాడ్‌గ్రాసుచేసిన విచిత్రాలను గురించీ, అతన్ని అక్కడనుండి కదిలించడం గవర్నమెంటుకు ఎంత కష్టసాధ్యమైనదో ఆ సంగతిని గురించి ఇంకా కొన్ని కథలు ప్రచారంలో ఉన్నాయి. వాటిని ఆంగ్లేయ గ్రంథకర్తలు తమ పుస్తకాలలోకి కూడా ఎక్కించారు.

కలకత్తాలో సండే స్టేట్సుమన్ అనే పత్రికలో 1938 సంవత్సరం అక్టోబరు 23వ తేదీన సి.బి.సి. అనే పొడి అక్షరాలతో ఈ స్నాడ్ గ్రాసును గురించిన కథ వ్రాయబడినది.

దానిలో పైన చెప్పిన సంగతులుగాక ఇంకా కొన్ని విశేషాలు వ్రాయబడినాయి.

స్నాడ్‌గ్రాస్‌కు 1791లో గంజాం రెసిడెంటు ఉద్యోగం వచ్చిన తర్వాత గోపాల కృష్ణమ్మను తనకు సహాయ దుబాషీగా ఏర్పరచుకొని అతని సహాయంతో రెవిన్యూలో నూటికి 90 వంతులు మాత్రం సర్కారుకు జమకట్టి తక్కినది స్వంతానికోసం అట్టేపెట్టుకోవడం ప్రారంభించాడు. రంభలో కట్టించిన ఇంటికి 20 వేల పౌనులు ఖర్చు అయినదట. జమీందారులు ఎందుకు బకాయి పెడుతున్నారో తెలుసుకోవలసిందని 1794లో చెన్నపట్నాన్నుంచి ఒక ఉద్యోగిని పంపగా వాళ్ళందరూ తమ పేష్కషు నదివరకే ఇచ్చివేశారని తేలింది. తప్పుడు లెక్కలు వ్రాయవలసిందని స్నాడ్‌గ్రాను తనను నిర్బంధించాడని గోపాలకృష్ణమ్మ ప్రమాణం చేశాడు. నేనలాంటిపని చేయమనలేదని స్నాడ్‌గ్రాసు అన్నాడు. స్నాడ్‌గ్రాసు కూడా దీనిలో భాగస్వామే అని తేలినా సరియైన రుజువు దొరకనందువల్ల అతడు తాను చేయవలసినపని తిన్నగా నిర్వహింపక ఉపేక్ష చేసినాడని సస్పెండు చేశారు. గోపాలకృష్ణమ్మను జైలులో పడవేసి సొమ్ముకక్కేవరకు నిర్బంధించి వుంచారు. శిస్తురశీదు కవుంటరు ఫాయిలు కాగితాలు లెక్కలతో సరిగా వున్నయా లేవా అని చూడడం మాత్రమే తన పని అనిన్నీ, అవి సరిగానే వున్నాయనిన్నీ, కవుంటరు ఫాయిలులో వసూలుచేసిన దానికన్న గోపాలకృష్ణమ్మ తక్కువ మొత్తాలు వేసినట్లైతే తానేమిచేయకలననిన్నీ స్నాడ్‌గ్రాసు చెప్పి తాను నిర్దోషినని వాదించాడు. 1797లో ఇతనికి మళ్ళీ పని యిచ్చారు.

రెండవమారు 1800 నాటికే మళ్ళీ ఇతనిపైని ఫిర్యాదులు చెలరేగాయి. ఇతని సంజాయిషీకి రెవిన్యూబోర్డు వారూ, గవర్నమెంటు హర్షించలేదు. ఇతనిని చార్జీ వప్పగించవలసిందని బ్రౌను అనే దొరను పంపించారు. ఆ బ్రౌను వచ్చేటప్పటికి తన ఆఫీసు దగ్గరకు తుపాకీబారు మేరదూరంలోకి వస్తే కాల్చివేస్తానని బెదిరించి అతని ఎదుటనే లెక్కపుస్తకాలూ, రికార్డులూ చిలకసరస్సులో పారవేశాడు. తన పీకమీదికి తేగల సాక్షిసాధనాలన్నింటినీ అలా మాపుచేసి జిల్లాలో తనకుగల వ్యవహారాలన్నీ మెల్లగా చక్కబెట్టుకొని అఖరుకు చెన్నపట్నం వెళ్ళాడు.

* * * *

'జాన్‌లా' అనే అయన 1908 లో 'గ్లింప్సెస్ ఆఫ్ హిడెన్ ఇండియా' అనే పుస్తకంలో ఈ విధంగా వ్రాశాడు.

"స్నాడ్‌గ్రాసు రంభలో కట్టించిన దివ్యభవనాన్ని ఎంతో చక్కగా అలంకరించాడు. తన సాలలో మంచి గుఱ్ఱాలనూ, ఏనుగులనూ కట్టించివుంచాడు. పెద్ద నవాబులాగు జీవించేవాడు. రంభ మారుమూలగా వున్నది. చెన్నపట్నంనుంచి కలకత్తా వెళ్ళేదొరలు సముద్రం మీదనే సరాసరి వెడతారు. కాని యీ పక్కకిరారు. ఎవరైనా వస్తేమాత్రం ఇతడు వాళ్ళనువదలి పెట్టేవాడుకాదు. వాళ్ళకు విందులుచేసి, వేటలు ఏర్పాటుచేసి ఆదరించేవాడు. ఇతడు కాపురం ఉన్న ఇంటికి ఎదురుగా చిలకసముద్రంలో రెండుమైళ్ళ దూరంలో పదిహేను అడుగుల చతురంగల ఒక చిన్న లంక వున్నది. దానికి బ్రేక్‌ఫాస్టు ఐలెండు అనిపేరు. తనపనికి ఎవరూ అంతరాయం కలిగించకుండా ప్రశాంతంగా

చేసుకోవడానికని ఆ లంకమీద ఒక్కటే గది కట్టించి అది తన ఆఫీసు అన్నాడు. ఆ గదిపైన స్తూపీబురుజులాగు గోపురం ఒకటి కట్టించాడు. ఆ బురుజులో ఒక దీపం వేళ్ళాడగట్టేవాడు. దీనిని దీపస్తంభం అనేవాడు. తన రెవిన్యూ లెక్కలూ, రికార్డులూ అన్నీ ఈ గదిలో పెట్టించాడు.

ఈ జిల్లాపరిస్థితులు బాగా లేవని మద్రాను గవర్నమెంటు పంపిన తాఖీదును ఇతడు చిత్తుకాగితాల బుట్టలో పడవేశాడు. లెక్కపుస్తకాలన్నీ చెన్నపట్నం పట్నుకు రావలసిందని మళ్ళీ తాఖీదు వచ్చింది. దానికి సరియైన సమాధానం వ్రాయలేదు. వర్షాకాలంలో పూరీరేవులోకి ఓడలు నరగారాలేవని ఇతడు ఎరుగును. ఇలాగు రెండేళ్ళు గడిచిన తరువాత అధికారులు కలెక్టరేటును వశంచేసుకొని స్నాడ్‌గ్రాసును, అతని పుస్తకాలను చెన్నపట్నం తీసుకొని రావడానికి కొంతమంది సోల్జర్లను పంపడానికి నిశ్చయించారని ఇతనికి తెలిసింది. వీళ్ళు ఇక్కడికి రావడానికి ఆరునెలలు పడుతుందని ఇతడెరుగును. వాళ్ళు వచ్చే జాడలు ముందుగా తనకు తెలియచేయడానికి వేగుల వాళ్ళనుపెట్టి వాళ్ళు వారంరోజుల దూరంలో ఉన్నారని తెలియగానే ఇతడు లెక్కపుస్తకాలన్నీ ఒక పడవలో పెట్టించి ఒడ్డుకు పట్టమన్నాడు. పడవ బ్రేక్‌ఫాస్టులంకకు తీరానికి మధ్యకు రాగానే పడవ చీల ఒకటి ఎలాగో వూడి వచ్చింది. ఆ పడవ, దానితో పాటు పుస్తకాలూ మునిగిపోయాయి. పడవవాళ్ళు మాత్రం ఈదుకుంటూ ఒడ్డుకు వచ్చారు. సోల్జర్లు వచ్చినాక స్నాడ్‌గ్రాసు ఈ సంగతి ఆ చిన్న దళాధిపతికి చెప్పాడు. అతడు ఏంచేస్తాడు? స్నాడ్‌గ్రాసును చెన్నపట్నం తీసుకొని వెళ్ళాడు*

ఇక బ్రౌనుదొర ఏం చేస్తున్నాడో చూద్దాము. ఎలాగైతేనేమి బ్రౌను ఎంతో తంటాలుపడి చాలా సంగతులు బయటికి లాగాడు. వీటినిబట్టి స్నాడ్‌గ్రాసుపైని కేసు పెడదామని మద్రాను గవర్నమెంటువారు ఆలోచించారు. కాని ఇలాంటికేసు విచారించడానికి చెన్నపట్టణం సుప్రీంకోర్టు వారికి అధికారం ఉన్నదో లేదో అని అనుమానం కలిగినందువల్ల ఇది మానుకున్నారు. 1800 సంవత్సరం మొదలు 1804 వరకూ ఏమీ పనిలేకుండా స్నాడ్‌గ్రాసును చెన్నపట్నంలోనే వుండనిచ్చారు. విలియం బెంటింక్ గవర్నరుగా ఉండగా ప్రభుత్వంవారు 1804లో ఇతనిపని తీసివేశారు. అంతట స్నాడ్‌గ్రాసు తన డబ్బాడవాలీ సర్దుకుని, సామానులు తీసికొని ఇంగ్లాండుకు ఓడ ఎక్కాడు. ఇతడు 27 సంవత్సరాలు కంపెనీ వారి కొలువులో పనిచేసి జీతం కొద్దిపాటిదైనా పెద్దసంపద ఆర్జించాడు. ఇతడు తన సంపదతోపాటు ఇంగ్లాండుకు పరువు ప్రతిష్ఠలుకూడా తెచ్చుకోనందువల్ల తూర్పుఇండియా కంపెనీ డైరెక్టర్లు తమ ఉద్యోగుల కిచ్చే పింఛను ఇతనికి యివ్వడానికి నిరాకరించారు. దీనికి ఉపాయమేమిటని ఇతడు ఆలోచించాడు. తనహక్కు నిలబెట్టుకోవాలనీ, కక్షసాధించాలనీ, ఇతనికి బుద్ధి పుట్టింది. తనకు న్యాయం చేయకపోతే తమకు కష్టం కలిగేటట్లు ప్రవర్తించవలసి వస్తుందని ముందుగా డైరెక్టర్లను ఇతడు హెచ్చరించాడు. ఈ బెదిరింపులకు వారు ఏమీ జవాబు చెప్పక ఉపేక్షించారు. కొన్నాళ్ళు గడవనిచ్చి ఇతడు కార్యాచరణకు పూనుకున్నాడు. చిరిగిపోయిన పాతదుస్తులూ,

* Glimpses of Hidden India-John Law 1908 pp 91-93

పాకీవాళ్ళు వీధులూడిచే చీపురుకట్టా కొని, ఆ పాతదుస్తులు వేసుకొని చీపురుతో లీడెన్ హాలువీధిలో తూర్పుఇండియా కంపెనీ వారి దివ్యభవనం ఎదుట నిలిచి రోడ్డు ఊడ్చడం ప్రారంభించాడు. తాను ఎవరో ఇతరులకు తెలియకుండా ప్రచ్ఛన్నంగా గాక, బహిరంగంగా వచ్చిపోయే వారితో కుంపినీవారికి ఇండియాలో ఉన్న మంచి ధనవంతమైన రాష్ట్రంలో తాను ఒక జిల్లాకు కలెక్టరుగా పనిచేసినదిన్నీ, వారిక్రింద తాను ఇన్ని సంవత్సరాలు కష్టపడి నమ్మకంగా పనిచేసినప్పటికీ తన పెద్దతనంలో తనకు ఏమీ యివ్వకుండా తినడానికి కూడు, కట్టుకోవడానికి బట్టకూడా లేకుండా వీధులలో ముష్టియెత్తుకొని బ్రతకమని వదలివేశారనిన్నీ తన కథ చిత్రవిచిత్రముగా వర్ణిస్తూ అతిదీనంగా చెప్పుకోసాగినాడు.

ఇప్పటివలెనే ఆ రోజులలో కూడా లీడెన్ హాలువీధి లండనులో వచ్చిపోయేవారితో నిండి కిటకిటలాడే రాజవీధి. తూర్పుదేశపు సంపదలకును, ఇంగ్లాండుకును గల పరస్పర సంబంధానికి బాహ్యచిహ్నంగా ఆ వీధిలో కంపెనీవారి దివ్య భవనం అందరికి కనబడుతూ వుండేది. ఇండియా దేశంలో సంపదలార్జించి వచ్చిన దొరలను 'నవాబు'లని చెప్పుకునేవారు. వీళ్లు లెక్క లేనంత ధనమార్జించి ఆ ధన కనక వస్తువాహనాలలో దొర్లుతూ ఒళ్ళుపైని తెలియక సౌఖ్యాలు అనుభవిస్తూ నీతినియమాలు లేక కళ్ళు నెత్తిని పెట్టుకొని ప్రవర్తించడాన్ని గురించి ప్రజలు ప్రత్యక్షంగాచూస్తూ, కథలలో వింటూ, నాటకాలలో దర్శిస్తూవుండేవారు. ఇట్టిస్థితిలో ఆ ఇండియాలోనే పనిచేసివచ్చిన నిర్భాగ్యుడైన ఈ ఉద్యోగి ఈ వీధిలోనే ఇలాగ పాకీపని చేస్తూవుండడం చూసి అనేకమంది ఇది ఏమిటని ఆలోచించడం ప్రారంభించారు. లండన్ నగరంలో గొప్పవారు నివసించే పడమటి భాగంలో దీనిని గురించిన గుసగుసలు బయలుదేరినవి. స్నాడ్‌గ్రాసుకూడా తానువేసిన వేషానికి అనుగుణ్యంగానే ప్రవర్తించేవాడు. పాపం అన్యాయం జరిగిన కంపనీ ఉద్యోగి అనిచెప్పి ఎవరైనా పెన్నీలు (సీమదేశపు నాణెం - నాలుగు డబ్బులు) యిస్తే కృతజ్ఞతతో పుచ్చుకొని జేబులో వేసుకొనేవాడు.

ఇత డీ కంపెనీ భవనం ఎదుట ఇలావుండడం చూసేటప్పటికి కంపెనీ డైరెక్టర్లకు తలంపుగా తోచింది. అందులో ముఖ్యంగా ఇతడు చీపురుపెట్టి వూడ్చే పెద్దమెట్లపైని ఉన్న పెద్ద సింహద్వారం దగ్గరనే ఈడైరెక్టర్లు తమ గుఱ్ఱపుసార్టు బండ్లలో దిగి లోపలికి వెళ్ళవలసివచ్చేది. ఈ దివ్యభవనానికి వెనక ఒక చిన్న సందులోనుంచి లోపలికి పోవడానికి ఇంకో దారి ఉన్నమాట నిజమేకాని అది నౌకర్లకోసం ఏర్పడినదారి. ఈ పాపిష్టి ముండా కొడుకు మొఖం కనపడకుండానూ, అక్కడ ఈ చిత్రం చూస్తూ నిలబడినవాళ్ళ లేవిడీలు తప్పించుకోవడానికిన్నీ అలాగ సందులోనుంచి లోపలికి దూరడం వారికి చాలా పరువు తక్కువగా తోచింది. పోనీ ఒక పోలీసువాడిని పిలిచి ఈ 'న్యూసెన్సు' మాన్పిద్దామనుకుంటే ఇతడేమి నేరం చేశాడని ఫిర్యాదు చేయగలరు? స్నాడ్‌గ్రాసు తన చర్యలవల్ల ఎలాంటి నేరమూ చేయడంలేదు. మునిసిపాలిటీ నిబంధనలలో దేనినీ మీరడంలేదు. పైగా అతడు చేసేపని పరోపకారంగా కూడా వున్నది. ముఖ్యంగా వర్షం కురిసి బురదగా ఉన్న రోజున మహోపకారంగానూ వున్నది. అదిగాక అతనిపట్ల ప్రజలందరికీ అమితమైనజాలి కలుగుతూ వున్నది.

ఈ కంపెనీ డైరెక్టర్ల కోర్టువారికి హిందూదేశం పైన అమితమైన అధికారాలున్నాయి. అక్కడ తమ నిరంకుశాధికారాలను చలాయించడంలో వీరు ఏ మాత్రము వెనుదీయరు. ఎంత క్రూరంగానైనా ప్రవర్తిస్తారు. కాని తమ కార్యాలయం గుమ్మం ఎదుటనే తమక్రింద పూర్వం పనిచేసిన తాబేదారుడొకడు తమ అధికారాన్ని ధిక్కరించి నవ్వులాటు చేస్తూవుంటే వీరు దీని కే ప్రతిక్రియనూ చేయలేకపోతున్నారు. ఇదిచూచి ఇతరులుకూడా ఇలాంటి పెంకితనాలు మొదలుపెడతారేమో! అందువల్ల డైరెక్టర్ల కోర్టువారు మొదట కోపంతో మండిపడినా వీధిలో ఈ అప్రతిష్ఠ మాన్పుకోడానికి ఏదో ఒక మార్గం యోచించక తప్పినదికాదు. స్నాడ్‌గ్రాసుతో రాజీ చేసుకోవడమే ఉత్తమ మార్గంగా కనబడింది. ముందుగా అతడు చేస్తూ ఉన్న చర్య మానివేస్తే అతని వ్యవహారం మళ్లీ ఆలోచిస్తామని కబురంపారు. తనతోపాటు ఉద్యోగం చేసిన వారికి న్యాయంగా వచ్చే పింఛను మొత్తమునే తన పని తొలగించిన తేదీ లగాయతూ తనకుకూడా మంజూరు చేసేవరకు తన చర్యను విరమించనని అతడు చాల మర్యాదగా మళ్ళీ కబురంపాడు. డైరెక్టర్లున్నూ, వారి చైర్మెనుగారున్నూ బింకాలు మానివేసి స్నాడ్‌గ్రాసు కోరికలను చెల్లిస్తూ తీర్మానాలు చేశారు. అంతట ఆ మర్నాడు స్నాడ్ గ్రాసు మంచి క్రొత్తసూటు, దొరటోపీ వేసుకొని జోడుగుర్రాల బండియెక్కి *డైరెక్టర్ల కోర్టువారికి వందనాలర్పించడానికి వచ్చి "అయ్యా! ఇప్పుడు మీరు నా ఆదాయం సాలుకు 5 వేల పౌనులు అయ్యేటట్టు చేసినా"రని అన్నాడట! ఈ మాట వినేటప్పటికి వాళ్ళందరూ తెల్లపోయారు. ఈ దృశ్యం సరిగా వర్ణించడానికి ఎవరితరము?

స్నాడ్ గ్రాసు చిలక నరస్సు దగ్గర రుచిమరగిన సౌఖ్యాల నన్నింటినీ మళ్ళీ స్వేచ్ఛగా అనుభవించడానికి మళ్లీ అతనికి అవకాశం కలిగింది. అతడు మళ్ళీ తలయెత్తాడు. ఇప్పటిలాగే ఆ రోజులలో షోకీలాలందరూ నివసించే యేఫెయిరులో చెస్టరు ఫీల్డు వీధిలో ఒక దివ్యభవనాన్ని ఇతడు తీసుకున్నాడు. దానిని చక్కగా అలంకరించాడు. కొన్నాళ్ళు అయ్యేటప్పటికి ఉద్యోగరీత్యా అతనికి తటస్థించిన లోటుపాటులు అందరూ మరిచి పోయారో, లేకపోతే ఇలాంటి లోపాలు అందరికీ వుంటాయని సరిపెట్టుకున్నారో కాని అందరూ అతనిని మర్యాదచేసేవారు. ఇతడు తనకాలంలో ఇండియానుండి వచ్చిన ప్రముఖులైన వారిలో ఒకడైనాడు. ఇలాగ అతడు నలుగురిలో గౌరవంగా వుంటూ 1824లో ఓరియంటల్ క్లబ్బు స్థాపించడానికి కారకుడైనాడు. దానిలో ఇండియాలో గవర్నర్లుగానూ, సేనానులుగానూ పనిచేసిన డ్యూక్ ఆఫ్ వెల్లింగ్టన్, విలియం బెంటింకు, సర్‌జాన్ మాల్కలం, సర్ థామస్ హిస్లప్ మొదలైనవారు ఇతనితో పాటు సభికులైనారు. ఇతడు మెరైన్ సొసైటీలో 15 సంవత్సరాలు సభికుడిగా వుండినాడు. స్త్రీల ఆసుపత్రికి కూడా ఇతడు పోషకుడుగా వుండినాడు. ఇలాగ లండనులో పేరెన్నిక పొందిన వారిలో ఒకడుగానుంటూ ఇతడు 1834వ సంవత్సరం ఆగస్టు నెల 29వ తేదీన దివంగతుడైనాడు.

స్నాడ్‌గ్రాను చనిపోవడానికి మూడేండ్లక్రిందట ఒక విల్లువ్రాశాడు. ఇతడు రసెల్ అనే వితంతువుయొక్క పెళ్ళిగాని పెద్దకుమార్తెయైన ఎలిజాకు ఒక లక్ష 73వేల పౌనులు

---

* ఈ కథ కొన్ని సంవత్సరాల క్రిందట పయొనీరు పత్రిక వ్రాసింది. విలియంగారు కూడా మళ్ళీ వ్రాశారు. అతడు నాలుగు గుర్రాల బండిలో వెళ్ళాడని పాఠాంతరము.

చెందచేసినాడనిన్నీ, దీనికి కారణం ఆమె తండ్రి తనపట్ల దయగా వుండడమే ననిన్నీ ఇండిక్షెన్సు మేగజీనులో ప్రకటించారు. కాని ఇది సరికాదనిన్నీ, ఆ విల్లు తాను చూచినా ననిన్నీ, ఇండియాలో చిలకసరస్సు తీరం దగ్గర తనకు ఉన్న ఇంటినీ, భూమినీ తన స్నేహితుడైనట్టిన్నీ, ఫౌండ్లింగు ఆసుపత్రిలో ఉన్నట్టిన్నీ గేబ్రేల్ గిల్బర్టుకు చెందచేసినాడనిన్నీ తన స్నేహితులకూ, స్నేహితురాండ్రకూ యీ క్రింది విధంగా చాలా మొత్తాలు చెందచేసినా దనిన్నీ ఛార్లెస్ లానన్ గారు మెమొరీస్ ఆఫ్ మద్రాస్ (Memories of Madras) అని తాను రచించిన పుస్తకంలో వ్రాశారు. స్నాడ్ గ్రాసు వ్రాసిన మరణ శాసనము ప్రకారము అతడు చెందచేసిన ఆస్తి చాలా ఉన్నది.

అప్పర్‌గిల్లు స్ట్రీటు ఫౌండ్లింగ్ హాస్పిటలులో నున్న గేబ్రేల్ గిల్బర్టుకు రంభలో చిలుక సరస్సు ఒడ్డున ఉన్న ఇల్లు, భూమి (గడిచిన 30 సం.ల నుంచి ఖాళీగా ఉండి కంపెనీవారి తాలూకూ 2500 పౌనుల బాండుక్రింద వుంటూవున్న) ఆస్తిని ఇచ్చినాడు.

ఎలిజారస్పెల్‌ను, కిల్లెటును, హ్యూ ఎడ్వర్డ్‌నును, మేజర్ జాన్ స్మిత్తును, ఎగ్జిక్యూటర్లుగా నియమించి వారికి చెరి ఒక వేయిపౌనులు మొత్తం పౌ4000-0-0లు యిచ్చాడు.

1000-0-0 పౌనులు ఎలిజబెత్తు గిల్లెటుకూ, మిసెస్ కవర్డుకూ దానిపైని అయివేజు ఇవ్వగలందులకు...

1000-0-0 పౌనులు (నవరసులు) అనీ జెఫ్రీకి

1000-0-0 పౌనులు (నవరసులు) చార్లటీ హాంప్‌స్టెడ్‌కు

400-0-0 పౌనులు (నవరసులు) థామస్ ఫ్లక్‌కు

200-0-0 పౌనులు (నవరసులు) హెన్రీ బానన్‌కు

200-0-0 పౌనులు (నవరసులు) రెబెకా పాట్రిడ్జికి

100-0-0 పౌనులు (నవరసులు) సారా ఫ్లిన్‌సన్‌కు

1000-0-0 పౌనులు (నవరసులు) మెరైను సొసైటీ ట్రస్టీలకు

1000-0-0 పౌనులు (నవరసులు) సిమెన్సు ఆసుపత్రికి

5000 పౌనులు తన సోదరికి దానిపైన అయివేజును యిచ్చుటకు, ఇదిగాక తనకు సాలుకు 1200 పౌనులు ఆదాయము వచ్చే రొఖ్ఖం 40 వేల పౌనుల విలువగల పదిలక్షల ఫ్రాంకులు ప్యారిసులో పత్రములువున్నవనిన్నీ, ఈ పత్రములున్నూ చస్టరుఫీల్డు వీధిలో ఉన్న 10వ నెంబరు యిల్లునూ, అందులోవుండే సామానులున్నూ, గుఱ్ఱపుబండి, ఇతర చరాస్తిన్ని, మరణశాసనంలో చెప్పకుండా విడిచిన ఆస్తియావత్తున్నూ ఎలిజారస్పెల్ కన్యకు చెందచేస్తున్నాననిన్నీ, మరణశాసనం ప్రకారం మిగిలిన ఆస్తి తన ఎగ్జిక్యూటర్లకు చెందవలెననిన్నీ శాసించాడు. రంభలోవున్న స్నాడ్‌గ్రాసు తాలూకు భవనం యిప్పుడు కళ్ళికోట రాజాగారి అధీనంలో ఉన్నది.



# 2. జిల్లా శిరస్తాదారు

*ఇంగ్లీషు వర్తక కంపెనీవారు దేశాన్ని పరిపాలించడం ప్రారంభించిన తరువాత చాలాకాలంవరకూ ప్రభుత్వ శాఖలలో పెద్ద వుద్యోగాలేవీ దేశీయుల కిచ్చేవారు కారు. ఉద్యోగాలివ్వడంలో జాతి, మత, వర్ణ వివక్షత చూపబడదని పార్లమెంటు వారు 1833లో శాసించినప్పటికీ కూడా తెల్లవారు చెయ్యడానికి అంగీకరించని చిన్న జీతాల ఉద్యోగాలను మాత్రమే మనవాళ్ళ కిచ్చేవారు.*

అప్పట్లో రెవిన్యూశాఖలో మనవాళ్ళు చేసే పెద్ద ఉద్యోగం తాశిల్దారీ. అప్పటికి చదువుకున్నవాళ్ళు బ్రాహ్మలే గనుక చాలామంది తాశిల్దారులు బ్రాహ్మణులే. ఈ తాశిల్దారులకు ఆ కాలంలో రెవిన్యూ వసూలుతోపాటు నేరాలు విచారించే పోలీసు అధికారం కూడా వుండేది. అయితే వీళ్ళజీతం చాలా స్వల్పంగా ఉండేది. ఇంగ్లాండులో ఒక బిళ్ళబంట్రోతు కిచ్చే జీతమైనా లేదు. కలెక్టరుకు వీళ్ళపైన సర్వాధికారాలు వుండేవి. చీటికీ మాటికీ వీళ్ళని బదిలీ చెయ్యడమూ, జుల్మానా వెయ్యడమూ, పనిలో నుండి తగ్గించడమూ, తీసివేయడమూ జరుగుతూ వుండేది. తెల్లవారిలో చాలామందికి నల్లని వాళ్ళని చూస్తేనే అసహ్యం. తాశిల్దారులను ఇలాగ అగౌరవంగా చూస్తూ వున్నందువల్ల ప్రజలకు వాళ్ళమీద గౌరవం పోయి కొండెములు చెప్పడం ఎక్కువ అయింది. కలెక్టరులు ఆ మాటలు విని తాశిల్దారులను కఠినంగా శిక్షిస్తూ వుండేవారు. తమ ఉద్యోగం ఎప్పుడు పోతుందో అనే భయముతో వుంటూ, జీతాలు చాలక, ఉద్యోగం ఉన్న నాలుగు రోజులలో నాల్గు డబ్బులు సంపాదించుకుందామని కొందరు తాశిల్దారులు లంచాలు పుచ్చుకొనేవారు. తాశిల్దారు లందరూ లంచగొండులే ననే అభిప్రాయంతో కలెక్టర్లు అందరినీ కఠినంగా చూడడము ప్రారంభించారు.

ప్రతి తాశిల్దారు సత్ప్రవర్తనకు పూచీగా రెండువేల రూపాయలకు హామీ ఇవ్వాలని నిర్ణయించారు. తాశిల్దారులు తమకు అక్కవున్న వూళ్ళలో ఉద్యోగాలు చెయ్యకూడదన్నారు. అంతేగాని వాళ్ళజీతాలను వృద్ధిపరచలేదు. వాళ్ళ గౌరవాన్ని కాపాడేటట్లు ప్రవర్తించనూలేదు. ఈ స్థితిని కొంత చక్కపరచదలచి చెన్నపట్నం ప్రభుత్వంవారు 1835లో తాశిల్దారులను చీటికీ మాటికీ శిక్షించి ప్రజల దృష్టిలో వాళ్ళ గౌరవానికి భంగం కలిగించవద్దనిన్నీ, వాళ్ళకు ఉద్యోగాలు స్థిరములనే నమ్మకం కలిగించాలనిన్నీ కలెక్టర్లకు తాఖీదులు జారీచేశారు. ఈ సలహాలిచ్చి పాతికేళ్ళు దాటినా కలెక్టర్లు పూర్వంలాగానే నిరంకుశంగా ప్రవర్తిస్తూ వచ్చారు. తాశిల్దారుల జీతాలు వృద్ధికాలేదు. విశాఖపట్నంలో 1856 ఆ ప్రాంతములలో ఇద్దరు తాశిల్దారులు తమకు నెల 1కి 10 నవరసుల జీతం యివ్వవలసిందని అర్జీపెట్టుకుంటే అప్పుడు జిల్లాకలెక్టరులపైన అధికారిగా వుండే ఉత్తరసర్కారుల కమిషనరు వాళ్ళకు నెల 1కి 8 నవరసులు చాలునని వుత్తర్వుచేశాడు.

## శిరస్తాదారులు

కలెక్టరు కచేరీలలో శిరస్తారులుగాను, శిరస్తామదద్గారు, లేక డిప్యూటీ శిరస్తాదార్లుగాను పనిచేసే దేశీయుల స్థితికూడా ఇలాగే వుండేది. నిజానికి ఈ శిరస్తాదారు ఉద్యోగం దేశీయులు పొందే హోదాలలోకల్లా గౌరవతరమైనదీ, కొంచెం ఎక్కువజీతం కలద్దీదీ అయినా 1858 కి పూర్వము పదేళ్ళలో ఉత్తరసర్కారులలో ప్రతిజిల్లాలోనూ కూడా శిరస్తాదారు లందరినీ ఏదో కారణంమీద పనిలోనుంచి తొలగించారు.

1842 నం॥లో విశాఖపట్నం జిల్లా కలెక్టరుగానూ, చెన్నపట్నం గవర్నరు ఏజంటుగానూ ఉండిన పి.బి.స్మాలెట్టుగారు (P.B.Smollett) 1859లో 'Madras and its civil administration' అనే పుస్తకంలో యీ పరిస్థితుల నన్నింటినీ వర్ణిస్తూ ఆ జిల్లాలో తనకు పూర్వం పనిచేసిన కలెక్టరు పోయి తానూ వచ్చేలోపుగా తాత్కాలికముగా పనిచేసిన కలెక్టరు క్రింది సీనియరు అసిస్టెంటు దొర అక్కడి శిరస్తాదారుల్ని, సగం మంది దేశీయోద్యోగులనూ పనిలోనుంచి తీసివేసిన సంగతి వ్రాశారు.

## కంభం నరసింగరావుగారు

ఈయన 1844-52 మధ్య రాజమహేంద్రవరం జిల్లా కలెక్టరు కచేరీలో శిరస్తాదారుగా వుండేవారు. అప్పట్లో గోదావరి జిల్లాను రాజమహేంద్రవరం జిల్లా అనేవారు. ఆ కాలంలో చెన్న రాజధానిలో హెడ్డుశిరస్తాదారు అంటే కలెక్టరు దొరగారి దివాను అన్నమాట. రెవిన్యూశిస్తు వసూలు విషయాలలో అతడే కల్టెరుకు ముఖ్య సలహాదారు. కలెక్టరు కచేరీలో నుంచి జారీ అయ్యే తాఖీదు లన్నింటిపైనా అయన చేవ్రాలు వుండాలి. అతణ్ణి 'నేటివు కలెక్టరు' అనేవారు.

నరసింగరావుగారు ఇంగ్లీషు వర్తకకంపెనీ సర్కారు కొలువులో 27 సంవత్సరాలు పనిచేసిన రెవిన్యూశాఖలో పెద్ద ఉద్యోగాలు చేసిన అనుభవజ్ఞుడు. రాజమహేంద్రవరం జిల్లా పరిపాలన బాగా లేకపోవడం వల్ల అక్కడ పనిచెయ్యడానికి ఇతణ్ణి ఏరి కోరి నియమించారు. ఈయన పై యధికారి రాజమహేంద్రవరం కలెక్టరు. మొదటి ఏడేళ్ళవరకూ ఇతనిని ప్రశంసిస్తూ పైవారికి వ్రాసేవాడు. ఇదివరకు వ్యవహారాలు సరిగా జరగనందువల్ల అధోగతిలో ఉన్న ఈ జిల్లా రెవిన్యూ వసూలు నరసింగరావుగారు అమలులో పెట్టిన మంచిపద్ధతుల వల్లను, అయన అజమాయిషీ క్రిందను చాలా అభివృద్ధి జెందింది. వెల్లిదాశిరితో గోదావరికి అనకట్ట ఒకటి కట్టడం 1846లో ప్రారంభించినందువల్ల ఈ జిల్లా అదాయం అభివృద్ధి చెందిందని (డి.పి.డబ్లియు) ఇంజనీరింగుశాఖవారు అంటారుగాని ఈ జిల్లాను గురించి స్వయంగా ఎరిగున్న వారీమాటను నమ్మరనిన్నీ, అక్కడ స్థానికులుగా ఉన్న ఇంజనీర్లు కూడా ఇప్పుడు ఈ చిలకపలుకులు పలకడానికి సాహసించరనిన్నీ స్మాలెట్టుగారు వ్రాశారు.

## పిఠాపురం జమీందారు

పిఠాపురం జమీందారు శ్రీరాజా రావు వెంకట మహీపతి గంగాధర రామారావు బహద్దరుగారి తండ్రిగారైన శ్రీ రాజారావు వెంకటసూర్యారావుగారు సాధారణ నామ

సంవత్సర కార్తీక బహుళ 9 (27-11-1850) తేదీన చనిపోయారు. ఆయన కొమాళ్ళు చిన్నవాళ్లైనందువల్ల వాళ్లను దొరతనమువారి సంరక్షణక్రింద 'వార్డులు'గా వుంచారు. సూర్యారావుగారు చనిపోయిన సంగతి తెలియగానే అప్పటి రాజమహేంద్రవర కలెక్టరు ప్రెండర్ గాస్టుగారు (Prendergast) న్నూ, ఆయన హెడ్డు శిరస్తాదారున్నూ జమీందారు గారి ఆస్తిని వశపరచుకోడానికి తక్షణమూ పిఠాపురం వెళ్ళారు. జమీందారుగారి ముఖ్య బంధువులెవ్వరూ దీనికి ఇష్టపడక కొంత సాత్వికనిరోధం చేశారు.

ఈ పిఠాపురం జమీందారీ చాలా ముఖ్యమైన జమీందారీ. చనిపోయిన రాజాగారి చిన్నతనంలో 12 లేక 14 సంవత్సరాలు కంపెనీసర్కారువారి సంరక్షణలో 'వార్డు'గా ఉన్నారు. జమీందారీని సర్కారువారు చక్కగా వ్యవహరించి నిల్వతో ఆయనకు వప్పచెప్పడానికి బదులుగా జమీని దుస్థితిలోకి తెచ్చి అప్పుతో వప్పగించినందువల్ల జమీందారుగారు తమ జమీందారీని నిలబెట్టుకొనడానికి సగం జమీందారీని గవర్నమెంటుకు యిచ్చివేయవలసి వచ్చింది. 1844 మొదలు 1850 వరకూ సూర్యారావు గారి పరిపాలనలో జమీందారీ మళ్లీ బాగుపడి కొంత నిల్వలో ఉంది. మళ్లీ సర్కారువారి అజమాయిషీ రాగానే వ్యవహారాలు పాడవడం ప్రారంభమైంది. 1853లో ప్రకటించిన లెక్కలనుబట్టి నిలవలేకపోగా ఆ సాలు తాలూకు శిస్తులో 65000 రూపాయలు బకాయి కనబడింది. దానికి కలెక్టరు జమాఖర్చు చెప్పలేదు. కలెక్టరుగారి అజమాయిషీని గవర్నమెంటువారు పరిశీలించడంలో దీనిని గురించి ఏమీ సెలవివ్వలేదు.

## దిగవల్లి తిమ్మరాజుగారు

పైన చెప్పినట్లు జమీందారుగారి ఆస్తిని స్వాధీనపరుచుకోవడానికి వెళ్లినప్పుడు జమీందారుగారి తాలూకు విలువగల చరాస్తిలో చాల కొద్దిభాగం మాత్రమే ఆయన రాజబంధువులు కలెక్టరుగారికి వశపరచగా కోటను సోదా చెయ్యడానికి వారంటు జారీ చెయ్యవలసినదని హెడ్డు శిరస్తాదారుగారు సలహాయిచ్చారు. కాని కలెక్టరు ఆ సలహా ప్రకారం జరుపలేదు. ఆఖరికి ఒకనెల జరిగిన తరువాత యాభైవేల రూపాయల విలువల గల చరాస్తి కలెక్టరుగారికి వశమైంది. అప్పుడు ఈ జమీందారీ వ్యవహారాలను చక్కబెట్టడానికి నెలకు 250 రూపాయల జీతంపైన శ్రీ దిగవల్లి తిమ్మరాజు పంతులుగారిని (కోర్టు ఆఫ్ వార్డ్సు) మేనేజరుగా నియమించారు. పిఠాపురం జమీందారీ శిస్తులు వసూలు చెయ్యడానికి కచేరీలో పనికోసం నిరీక్షిస్తూ వాలంటీరుగా వుమ్మేదువారు చేసే ఆయనను ఒకనిని తాశీల్దారుగా నియమించారు.

ఈ తిమ్మరాజుగారు చాలా అనుభవజ్ఞులైన ఉద్యోగి. ఆయన కృష్ణాజిల్లాలో కొయ్యూరు నుంచి 1807లో ఏలూరు వచ్చి ఇంగ్లీషు చదువుకొని 1811లో రాజమహేంద్రవరం వచ్చి అక్కడ జిల్లాకోర్టులో పీటర్‌రీడ్ కాజులెట్‌గారి కాలంలో రికార్డు కీపరు మదద్గారీ, శిరస్తామదద్గారీ, శిరస్తా హెడ్ మదద్గారీ పనిన్నీ చేసి, 1824 లో జిల్లాజడ్జీ చేసిన హెన్రీ వైబార్టు దొరగారి శిఫారసువల్ల కలెక్టరు ఆఫీసులో ఇంగ్లీషు రికార్డు కీపరుపని, సాల్టుసైటరీ, అమల్‌దారి, నాయబు శిరాస్తదారి, ఆక్టింగు హెడ్ శిరస్తాదారి మొదలైన ఉద్యోగాలు చేశారు. తరువాత సదరామీన్ పనికూడా చేసి పింఛను పుచ్చుకొని

1856సం. ఫిబ్రవరి 6వ తేదీన స్వర్గస్థులైనారు. వీరు కాకినాడలో శ్రీభీమేశ్వరస్వామిని ప్రతిష్ఠించి 1828లో ఒక గొప్ప దేవాలయాన్ని కట్టించారు. 1862లో శ్రీ గంగాధర రామారావుగారికి మైనారిటీ తీరి పిఠాపురం జమీందారు అయిన తరువాత తిమ్మరాజుగారి పెద్దకుమారుడైన వెంకట శివరావుగారిని మొదట శిరస్తాదారుగానూ, తరువాత 1872లో మేనేజరుగానూ, పిమ్మట దివానుగానూ నియమించారు. రాజుగారు 1890 లోనూ, శివరావుగారు 1892లోనూ చనిపోయారు. వీరిని గురించి ఇప్పటికీ చాలాకథలు చెప్పుకుంటారు.

## నరసింగరావు గారి మీద కేసు

పైన చెప్పినట్లు తిమ్మరాజుగారు మేనేజరుగా ప్రవేశించిన కొద్దిరోజులలో జమీందారీ వ్యవహారాలు తనిఖీ చేయగా ఎస్టేటు తాలూకు లెక్కపుస్తకాలలో చాలా పుస్తకాలు కనబడలేదు. దర్యాప్తును బట్టీన్నీ, సంగతి సందర్భాలనుబట్టీన్నీ ఆలోచించగా ఆ లెక్కలవల్ల జమీందారీ తాలూకు యావత్తు నగలూ, రొక్కమూ, చరాస్తీన్నీ కలెక్టరుగారికి స్వాధీనం కాకుండా ఇంకా చాలా మిగిలిపోయినవనే సంగతి బయటపడుతుందనే భయంతో కొందరు కుట్రచేసి ఆస్తిని హరించి పుస్తకాలను గైరువిలియా చేయించారని తోచినది. ఈ కుట్రలో నరసింగరావు కూడా భాగస్వాములై వున్నట్లు అనుమానం కలిగింది. ఈ సంగతిని మేనేజరుగారు కలెక్టరుగారికి తెలియజేశారు. అప్పటికి కొంతకాలం నుంచి కలెక్టరు గారికి నరసింగరావుగారిమీద మంచి అభిప్రాయం లేనందువల్ల ఈ సంగతిని విన్న తక్షణమే కలెక్టరుగారు ఆయనను పనిలోనుంచి తగ్గించి సస్పెండు చేసి ఖైదులో పెట్టి ఆయనను గురించి స్వయంగా విచారణ చేయడం ప్రారంభించారు. రాజు తలచుకుంటే దెబ్బల కేమి కొదవ? నరసింగరావుగారంటే గిట్టనివాళ్ళందరూ ఉన్నవీ లేనివీ కల్పించి చెప్పారు. క్రొత్తగా పిఠాపురం తాశిల్దారుగా ప్రవేశించిన ఆయన ఈ వ్యవహారంలో నరసింగరావుగారికి వ్యతిరేకంగా పనిచేశాడు, నరసింగరావుగారు పిఠాపురం జమీందారీని దగాచేసి అక్రమలాభం పొందే దురుద్దేశంతో కాగితాలు ఫోర్జరీ చేసినట్లున్నూ, లెక్కలను మాపుచేసినట్లున్నూ కలెక్టరు గారు నేరాలు మోపి సెషన్సు జడ్జీ కోర్టులో విచారణ చేయడానికి ఇతనిని కమిటుచేశాడు. కలెక్టరే మేజిస్ట్రేటు అయివున్నందువల్ల తానే ఫిర్యాదీయున్నూ, నేరారోపకుడున్నూ (ప్రాసిక్యూటరున్నూ, కమిటింగు మేజిస్ట్రేటున్నూ) అయి నేరమును గురించి చిన్న అక్షరాలతో కొన్నితావుల వివరణ పత్రికను వ్రాశాడు. జామీనుమీద విడుదల చెయ్యవలసినదని ముద్దాయి కోరిననూ వదలక చెరసాలలోనే వుంచాడు. అవమానంకంటె చావు మేలని ఆయన అన్నాడని, వదలి పెడితే ఆత్మహత్య చేసుకుంటాడనే నెపంతో జిల్లాల కల్లా గొప్ప దేశీయోద్యోగిని ఇలాగ ఖైదులో పడవేసి వుంచారు.

## కలెక్టరు రికార్డుల సోదా

ఈ ముద్దాయిపైన మోపిన నేరాలలో శిరస్తాదారుగారి దగ్గరవున్న లెక్కలనుబట్టి కనబడే పిఠాపురం జమీందారుగారి చరాస్తి, నగలు యావత్తూ స్వాధీనం కాలేదనే సంగతిని ఈ శిరస్తాదారు కలెక్టరుగారికి తెలియపరచలేదనేది ఒకటి. తాను మరుగుపరచినట్లు చెప్పే సంగతులన్నీ మూజువానీగానూ, లిఖితమూలంగానూ కూడా కలెక్టరుగారికి

తెలియచేశానని శిరస్తాదారుగారు జిల్లాకోర్టువారికి మనవి చేశారు. లిఖితమైన జాబితా యేదీ లేదని జిల్లాకలెక్టరుగారు మొదట అన్నారు. జిల్లాకోర్టువారి వుత్తర్వు ప్రకారము కలెక్టరుగారి రికార్డులను సోదాచూడగా అలాంటి కాగితం ఒకటి దొరికింది. అంతట శిరస్తాదారు దానిని తనకు ఇచ్చివుండవచ్చునని కలెక్టరుగారు ఒప్పుకొన్నారు. ఈ కాగితాన్ని కోర్టువారికి పంపుతూ జమీందారుగారి ఆభరణాలను గురించి శిరస్తాదారుగారు తనకు తెలిపినా, లెక్కలన్నీ ఆయనదగ్గిర ఉన్నందువల్ల ప్రత్యక్షంగా కనబడుతూవున్న 67,000 రూపాయల లోటుసంగతిని తనకు చెప్పలేదనిన్నీ, శిరస్తాదారు గారి దుర్మార్గంవల్లనే ఈ సొమ్ము (ఫాజలు) అపహరించబడిన దనిన్నీ కలెక్టరుగారు వ్రాశారు.

## ముద్దాయి విడుదల

కలెక్టరుగారు నరసింగరావుగారిని పనిలోనుంచి తీసివేసిన తరువాత ఆయన స్థానంలో తాత్కాలికంగా తిమ్మరాజుగారినే శిరస్తాదారుగా నియమించారు. పైన చెప్పినట్లు జిల్లాకోర్టువారు కలెక్టరు కచ్చేరీ రికార్డును సోదాచూసి లెక్కజాబితాను పట్టుకు వెళ్ళిన తరువాత పిఠాపురం ఎస్టేటుకు కలిగిన నష్టాన్ని గురించి కలెక్టరుగారు ఒక స్టేటుమెంటు (తఖ్సీళ్ళవారీ వివరణము) ను తయారుచేయించి ఈ స్టేటుమెంటు ముద్దాయి (నరసింగరావుగారి) నేరాన్ని స్పష్టముగా ఋజువు చేస్తుందని వ్రాస్తూ దానిని జిల్లాజడ్జీగారికి పంపించారు. నరసింగరావుగారి కేసు జిల్లాకోర్టులో పదహారు నెలలు వాయిదాలు పడిపడి చివరకు విచారణ అయింది. కలెక్టరుగారు పంపించిన స్టేటుమెంటు అనేది మొదటినుంచి చివరిదాకా అభూతకల్పనమని కోర్టువారికి నచ్చేటట్లు ముద్దాయి ఋజువు చెయ్యగలిగాడు. విచారణ సందర్భంలో ఈ కేసు దాఖలవడానికి మూల కారకుడైన పిఠాపురం అమలుదారు ఫిర్యాదును సమర్థించడం కోసం అబద్ధపు సాక్ష్యం యిచ్చినట్లు జడ్జీగారికి తోచి అతనిని ఖైదులో పెట్టారు. అతని పనిని కూడా తీసివేశారు. ముద్దాయి నరసింగరావుగారిని నిర్దోషి అని విడుదల చేశారు. పదహారు నెలలు ఖైదులో మగ్గి మనోవ్యథ అనుభవించి ఆయన బయటికి వచ్చాడు.

## కలెక్టరుగారి పగ

ఒకమూల ఈ కేసు జరుగుతూ వుండగానే కలెక్టరు గారు నరసింగరావుగారిని గురించి తన పై యధికారియైన ఉత్తరసర్కారుల కమీషనరుగారితో ఉత్తర ప్రత్యుత్తరాలు జరపడం ప్రారంభించాడు. ఈ శిరస్తాదారు యొక్క దుష్ప్రవర్తనవల్ల సర్కారు సంరక్షణలో ఉన్న మైనరు జమీందారుకు కొన్ని వేల నవరసుల నష్టం కలిగిందనిన్నీ, ఘోరమైన ఈ అన్యాయపు మోసమును గురించీ, అపహరణమును గురించీ తన కచ్చేరీ వుద్యోగులు తనకు తెలియనియ్యకుండా కుట్రచేశారనిన్నీ, తన ఒక్కడికీతప్ప రాజమహేంద్రవరం జిల్లాలో అందరికీ తెలుసుననిన్నీ, క్రొత్తగా తనకు అనుచరులైన తిమ్మరాజుగారున్నూ, అమల్దారున్నూ తన నీ చిక్కులోనుంచి బయటికి తీశారనిన్నీ కమీషనరుగారికి తెలుపుతూ, ఈ క్రిమినలు కేసులో ఆ ముద్దాయికి శిక్షపడుతుందనే దృఢనమ్మకంతోనూ, తాను వ్రాసిన సందర్భాలలోనూ ఆ ముద్దాయి ఇదివరకు చేస్తూవుండిన నౌకరీలోనుంచి అతనిని

తొలగించడానికి తనకు అధికారం ఇవ్వవలసిందనిన్నీ, ఒకవేళ కమిషనరు గారు ఇందుకు ఇష్టపడనిచో, ఒకవేళ ఆ ముద్దాయిని కోర్టువారు నిర్దోషి అని వదలివేసినా, తనకూ ఆ శిరస్తాదారుకూ యిక సహకారంగాని, సామరస్యంగాని వుండడం దుస్తరమనిన్నీ, అందువల్లనైనా అతనిని పనిలోనుండి తొలగించడానికి అంగీకరించవలసినదనిన్నీ ఈ కలెక్టరుగారు గట్టిగా వ్రాసినందువల్ల అతనిని పనిలోనుండి తీసివేయడానికి కమీషనరుగారు అధికారం యిచ్చారు.

## నరసింగరావు గారికి ఉద్వాసన

అంతట కలెక్టరుగారు యీ విధంగా ఒక తాఖీదు జారీచేశారు:

"కంభం నరసింగరావుకు -

నీ ప్రవర్తనను గురించిన విచారణ అయ్యేవరకూ నిన్ను పనిలోనుండి సస్పెండు చేసినట్లు ఇదివరకే నీకు తెలుపబడి వున్నది. పిఠాపురం ఎస్టేటు ఆస్తిని కోర్టు ఆఫ్ వార్డ్సువారికి పశపరచగలందులకు నిన్ను నియమించి పంపినంతలో నీ ప్రోత్సాహం వల్లను, దుష్ప్రవర్తనవల్లను ఆ జమీందారీ తాలూకా చాలా వస్తువులున్నూ, సొమ్మున్నూ అపహరించబడినట్లు దరిమిలాను చేయబడిన దర్యాప్తువల్ల ఋజువు అయినది. నీవు ఇతరమైన అక్రమచర్యలు కూడా చేసినావు. నీవు విశ్వాసపాత్రుడవు కానందువల్ల నీ విషయమై ఉత్తరసర్కారుల కమిషనరుగారికి తెలియపరచగా నిన్ను తొలగించుటకు ఆయన అధికారం యిచ్చినారు. నీవు సర్కారు నవుకరీకి తగవు గనుక నిన్ను సస్పెండు చేసిన తేదీ లగాయతూ నీకు జీతము ఏమీ యివ్వబడదు."

ఈ హెడ్డు శిరస్తాదారుయొక్క నేరాలతో సంబంధం లేకపోయినా ఆయన జరిగించిన మోసకృత్యాలను బయటికి తియ్యడంలో కలెక్టరుగారికి సహాయం చేయలేదనే నెపంమీద అతని క్రిందియుద్యోగియైన డిప్యూటీశిరస్తాదారును కూడా పనిలోనుండి తీసివేశారు.

## కలెక్టరు సంజాయిషీ

జిల్లాకోర్టువారు అతనిని నిర్దోషి అని వదలగానే కంభం నరసింగరావు గారు తనపైన వచ్చిన దస్తుఫాజలు నేరమనేది అభూతకల్పన మనిన్నీ, తనను పనిలోనుండి తీసి వేయడము అక్రమమనిన్నీ, పిఠాపురం జమీందారీ తాలూకు ఆస్తియేదిన్ని బీరుపోలేదనిన్నీ, అలాపోయినట్లు చూపడానికి తయారు చేయబడిన లెక్కలు అబద్ధములనిన్నీ ఉత్తర సర్కారుల కమిషనరుగారికి అర్జీద్వారా తెలియపరిచారు. ఇతడు వ్రాసిన సంగతులను కమిషనరుగారు కలెక్టరుకు పంపించి, దానిని గురించి సంజాయిషీ యివ్వమని కోరారు. దానికి జవాబుగా 1853 సం. నవంబరు 2వ తేదీన కలెక్టరుగారు ఒక ఉత్తరం వ్రాశారు. తిమ్మరాజుగారిని పిఠాపురం మేనేజరుగానూ, కలెక్టరు కచ్చేరీ శిరస్తాదారుగానూ నియమించిన సందర్భాలను గురించి ఆ జవాబులో మొట్టమొదట వివరించారు. ఈ జిల్లాలో ఏర్పడిన క్లిష్టపరిస్థితిలో విశ్వాస పాత్రుడైన ఉద్యోగి ఒకడు తన ఖుద్దున వుండడం అవసరం గనుక ఈ తిమ్మరాజుగారిని ప్రత్యేకంగా ఏరి

శిరస్తాదారుగా నియమించానని వ్రాశారు. నరసింగరావుగారిమీద మోపిన దస్తుఫాజలు నేరాలన్నీ నిరాధారాలనేసంగతిని కలెక్టరుగారు ఒప్పుకొన్నారు. నరసింగరావుగారి లెక్కలనుబట్టి పిఠాపురం జమీందారీ తాలూకు 67000 రూపాయలకు లెక్క తేలలేదనే విషయాన్ని గురించి అతికష్టంమీద తిమ్మరాజుగారివల్ల సంజాయిషీ పుచ్చుకోగలిగినాననిన్నీ, అయితే ఆ సంజాయిషీ చాలా అసంతృప్తికరంగా వున్నదనిన్నీ, అందువల్ల నిజంగా ఆ సొమ్ము లోటుపడలేదని అంగీకరించినట్లే ఎంచవలసి వుంటుందనిన్నీ వ్రాశారు. ఆ లెక్కను తాను చూడనేలేదనిన్నీ, దానిని తయారుచేయడంలో తన కేమీ ప్రసక్తిలేదనిన్నీ, దానిని తయారు చేసినవారు కలెక్టరుగా రెన్నడూ విశ్వాసముంచని చిన్న వయస్సుగల ఇద్దరు గుమస్తాలనీ తిమ్మరాజుగారు చెప్పినాడని కలెక్టరుగారు తమ ఉత్తరంలో వ్రాస్తూ ఇంకా యీ క్రింది సంగతులు కూడా వ్రాశారు.

"ఆ లెక్క నాదగ్గరికి తెచ్చినప్పుడు మేజిస్ట్రేటు కేసులో ఏదైనా పొరబాట్లువస్తే చాలా చిక్కులు కలుగుతాయి గనుక నేను క్షమించను సుమా అని చెపుతూ ఆ కాగితాన్ని నేను శిరస్తాదారు శాఖలోకి పంపించాను. అందులో ఏదో అనుమానం తోచి దానిని మళ్ళీ ఇంకోసారికూడా సరిచూడడానికి నేను పంపించినట్లుకూడా నాకు జ్ఞాపకం. అయితే ఆ సంగతిని నేను గట్టిగా చెప్పలేను.

ఆ లెక్కను జాగ్రత్తగా సరిచూచే విషయంలో నేను చేయగలిగినదంతా చేశానని అనుకున్నాను."

## "తిమ్మరాజుగారే జవాబుదారు"

"దస్తులో 67,000 రూపాయల లోటు కనబడుతూ వుందని నేను సెషన్సు కోర్టుకు వ్రాసినప్పుడు పైన చెప్పినవిధంగా హెచ్చరించిన తరువాత కూడా పై యిద్దరు గుమస్తాలున్నూ నన్ను మోసం చేయడానికి సాహసిస్తారని నేను అనుకోలేదు. తిమ్మరాజుగారు తన ఉద్యోగాన్నిబట్టి చేయవలసినపని చేయకుండా ఇంత అజాగ్రత్త వహిస్తాడనిన్నీ నేను అనుకోలేదు. ఈ తప్పిదాన్ని మన్నించే విషయంలో నేనేమి చెప్పడానికి నాకు తోచడంలేదు. నేను ఎంతో విశ్వాసముంచిన మనిషి పాతశిరస్తాదారును నష్టపరచడానికి ఒక దొంగలెక్క తయారుచేసినాడనిగాని, తాను స్వయంగా పరిశీలించ కుండానూ, లేదా తన క్రింది వుద్యోగులచేత జాగ్రత్తగా సరిచూపించకుండానూ ఆ కాగితాన్ని తన కచ్చేరీలోనుంచి జారీచేశాడని గాని ఇటువంటి అపవాదుకు గురి అయ్యేటందుకు అవకాశం యివ్వడం నా మనస్సుకు చాలాకష్టం కలిగిస్తూ వుంది."

"ఇది చాలా విపరీతమైన సంగతిగా ఉంది. ఇదివరకెన్నడూ యిటువంటి అజాగ్రత్తను, బుద్ధిమాంద్యమును తిమ్మరాజు ప్రదర్శించి యెరుగడు. ఈమారు అతడు ఇలాగు ఎందుకు చేశాడో తెలియడంలేదు. ముద్దాయి (శిరస్తాదారు) పైన పన్నబడిన ఒకకుట్రలో ఇతడొక భాగస్వామి అనడానికి ఎంతమాత్రమూ వీలులేదు. వివేకంగల వాడెవ్వడూ అలాంటి దుర్మార్గంలో చేరడు. ఎంత స్వల్పమైన లోపమునుగాని పట్టుకోకుండా వదలని తెలివితేటలుగల అతిసమర్థుడైన అకౌంటెంట్ (తిమ్మరాజుగారు) ఉన్నాడు కదా

అనే నమ్మకంతో నేను స్వయంగా సరిచూడకుండా ఆ లెక్కమీద సంతకం పెట్టాను. ఈ విధంగా ఆలోచిస్తే ఇది అంత పెద్దపొరపాటు కాకపోయినా దాన్ని గురించి నేను సమర్థించుకోవడానికి ప్రయత్నించను. కలెక్టరు సంతకముతో జారీఅయ్యే లెక్కల యొక్క నిర్దుష్టతకు కలెక్టరే బాధ్యుడని (రూల్సులో) ఇప్పుడు నిర్ణయించబడినట్లు అప్పటికి విధించబడి యుండనందువల్ల ఈ తప్పుడు లెక్కకు తిమ్మరాజుగారే జవాబుదారు అయివున్నాడు" అని కలెక్టరుగారు కమిషనరుగారికి వ్రాసి తన బాధ్యతను తప్పించుకోవడానికి తిమ్మరాజుగారిమీదకి త్రోసివేసి వూరుకున్నాడు.

"ముద్దాయి నేరాన్ని స్థాపించే లెక్క" అని తాను తయారుచేయించి జిల్లాకోర్టువారికి పంపించిన లెక్క తప్పుడు లెక్క అని తేలింది. ముద్దాయి నిర్దోషి అని ఋజువు అయింది. ఇలాగ నిష్కారణంగా ఒక నల్లవాడిని సామాన్య ఖైదీలనుంచే బందిఖానాలో పడవేసి వుంచడము, పదహారునెలలు విచారణలో నిర్బంధించి వుంచడమూ అంతగా విచారించ తగిన అంశము కాదని ఈ దొరగారు అనుకొని వుంటారు.

## ఇంకో కేసు

ఒక ప్రక్క ఈ శిరస్తాదారుగారి కేసు జరుగుతూవుండగా ఈ కలెక్టరుగారు పిఠాపురం మైనరు జమీందారు సంరక్షకుడైన రాజబంధువు (Uncle) మీదకూడా ఒక నేరాన్ని మోపి ఆయనను ఖైదులో వుంచారు. పైన చెప్పిన 67 వేల రూపాయలతో సహా ఇంకా కొంత ఎస్టేటు ఆస్తిని హరించి నేరం చేశాడని ఆయనమీద ఒక కేసు దాఖలు చేశారు. ఆ కేసును సర్కారుతరఫున నడపడానికి నాలుగువందల మైళ్ళ దూరాన్నుంచి ఇంగ్లీషు బారిస్టర్లను తెచ్చి దీనికోసం అయిన సొమ్మును పిఠాపురం జమీందారీ ఖజానాలో నుంచి ఖర్చు పెట్టారు. ఆ కేసులోకూడా ముద్దాయిని నిర్దోషి అని వదలి వేశారు. "సర్కారు సంరక్షణ క్రింద వుండే మైనరు జమీందారుల సొమ్మును ఎలాగ వృథాగా ఖర్చుపెడతారో దీనివల్ల తెలుస్తుంది. 1854 నాటికి పిఠాపురం లెక్కలలో నిల్వయేమీ లేకుండా పోవడానికి ఇది ఒక కారణమని చెప్ప వచ్చును" అని స్కాలెట్టుగారు వ్రాశారు.

## నరసింగరావుగారి అర్జీలు

పైన చెప్పిన కలెక్టరుగారి సంజాయిషీ వుత్తరం ఉత్తర సర్కారుల కమిషనరుగారికి చేరినమీదట ఆయన తానీ విషయంలో జోక్యం కలిగించుకోవడానికి నిరాకరించి పనిలో నుంచి తీసివేసిన శిరస్తాదారును కావలిస్తే గవర్నమెంటుకు చెప్పుకోమని అన్నాడు. చెన్నపట్నం గవర్నమెంటువారు క్రిందివారి వుత్తరువును ఖాయపరిచారు. జిల్లాజడ్జీ తన్ను నిర్దోషి అని నిర్ణయించి ఆ కోర్టులోనే ఒక ఉద్యోగం తన కిస్తానని అన్నారనిన్నీ, సర్కారు నౌకరీని మళ్ళీ చేసుకోవడానికి అనుజ్ఞ యిప్పించవలసిందనిన్నీ, మళ్ళీ రాజమహేంద్రవరం కలెక్టరు క్రిందనే పనిచెయ్యాలని తన ఉద్దేశ్యంకాదన్నీ నరసింగరావుగారు మళ్ళీ అర్జీ దాఖలు చేసుకోగా ఈ అర్జీదారు ఏశాఖలోనూ సర్కారునౌకరీ చేయడానికి వీలులేదని సభాయుతులైన గవర్నరుగారు నిష్కర్షగా శాసించారు! పది రూపాయలకు పైబడిన జీతంగల

ఏ దేశీయోద్యోగినీ కూడా అతడు చేసిననేరం నకలును అతని కిచ్చి అతడు చెప్పే సంజాయిషీని, తెచ్చుకునే సాక్ష్యాన్ని వినిగాని అతనిని పనిలో నుండి తీసివెయ్యకూడదని, అంతకు పూర్వం కొంతకాలం క్రిందటనే దొరతనము వారొక తీర్మానాన్ని చేసివున్నా, ఇప్పుడు ఈ నరసింగరావుగారి విషయంలో అందుకు విరుద్ధంగా ప్రవర్తించారు.

పిఠాపురం ఎస్టేటు తాలూకు చాలాసొమ్ము అపహరించడానికి ఇతడు మద్దతు చేశాడనే నేరంమీద ఇతనిని పనిలోనుండి తీసివేశారు. అయితే ఇతడు నిర్దోషి అని కోర్టు వారు తీర్మానించారు. అంతట ఇతడు ఎంతమాత్రమూ విశ్వాసపాత్రుడు కాడనే నెపంమీద ఎంతోకాలం నమ్మకంగా పనిచేసి సమర్థుడనీ, నమ్మకమైనవాడనీ కలెక్టరువల్లనే అనేక యోగ్యతా పత్రాలు పొందిన ఈ దేశీయోద్యోగి పనిని తీసివెయ్యడాన్ని సమర్థించారు!

చెన్నపట్నం దొరతనమువారివల్ల న్యాయం కలగకపోగా నరసింగరావుగారు ఈ సంగతులన్నీ తెలుపుతూ ఇంగ్లాండులోవున్న కంపెనీ డైరెక్టర్ల సభవారికి 1855లో ఒక విన్నపము పంపించారు. అంతట సర్కారుకొలువులో ఏ ఉద్యోగమూ ఇవ్వకూడదనే నిషేధాన్ని తొలగిస్తూ 1856లో ఉత్తర్వులు వచ్చాయి. అయితే ఈ లోపుగా నరసింగరావుగారు విజయనగరం ఎస్టేటు దివాను అయి ఆ జమీందారీ రెవిన్యూపరిపాలన చక్కగా నిర్వహిస్తూ ఉన్నందువల్ల మళ్ళీ సర్కారునౌకరీలో చేరడం అసంభవము అయింది.

## గంజాం శిరస్తాదారు కథ

ఈ దేశీయుల్ని ఇలాగ బాధించి ఉద్యోగులలోనుంచి తొలగించి దీనికంతా కారకుడైన రాజమహేంద్రవరం కలెక్టరు ప్రెండరుగాస్టుగారికి గంజాం జిల్లాలో గవర్నరుగారి ఏజెంటు హోదాతో పెద్ద గౌరవపుద్యోగం యిచ్చారు. ఈ దొరగారు అక్కడికి వస్తున్నాడనేటప్పటికి అక్కడివారిలో చాలామందికి భయం కలిగింది. ఈక్రొత్త ఏజంటుగారు ఆపనిలో ప్రవేశించిన కొన్ని వారాలలోనే, గంజాంజిల్లాలో పెద్దఉద్యోగాలు చేస్తూవున్న దేశీయులను చాలామందిని పనిలోనుంచి తొలగించాడు. సర్కారుక్రింద నలభై సంవత్సరాలు నమ్మకంగా పనిచేసి అతడు చేసిన రాజకీయసేవకు ఒక బిరుదును పొందడానికీ, పింఛను పుచ్చుకోవడానికి సిద్ధంగా ఉన్న హెడ్డు శిరస్తాదారుపైన ఈ దొరగారు ఏదో నేరం మోపి పట్టుకొని శ్రీకాకుళం సెషన్సు కోర్టుకు పంపారు. ఆ కోర్టు జడ్జీగారు ఈ ఫిర్యాదులోని సంగతులు చాలా హాస్యాస్పదమైన స్వల్ప విషయాలై వుండడం చూచి ఆయన మీద నేరం మోపి కేసు విచారించడానికి యిష్టపడక ఆఖరికి దానిని కొట్టివేశారు. ఇది జరిగిన పదిహేను నెలలు అయినా ఉద్యోగరీత్యా ఆ శిరస్తాదారుగారి వ్యవహారం పరిష్కారం కాకుండా ఇంకా విచారణలోనే వుంది. దానికి సంబంధించిన కాగితాలు పైఅధికారుల దగ్గర చాలా నెలలనుంచి పడివున్నాయి. ఆ ఉద్యోగి ముసలివాడు. ఆయన జబ్బుమనిషి. బహుశా ఈయన వ్యవహారం పైసలు అయ్యేలోపుగానే స్వర్గస్థుడయి విముక్తి పొందుతాడేమో అని స్మాలెట్టుగారు వ్రాశారు.

ఈ గంజాం హెడ్డు శిరస్తాదారుమీద మోపిన నేరాలలో చెన్నపట్నం రాజధానిలో శిరస్తాదారు ఉద్యోగం చేసేవారు వహించేదానికన్న యెక్కువ దర్జాగల గౌరవ వాచకాన్ని తన పేరుతో కలిపి వాడుతున్నాడనే నేరం ఒకటి! ఇంకా ఇలాంటి పనికిమాలిన నేరాలు

కొన్నింటిని మోపారుగాని ఆపాదించిన దోషాలలో ఒక్కటైనా సరియైన సాక్ష్యంతో ఋజువుపరచడానికి ప్రయత్నించలేదు. ఈ అక్రమాన్ని గురించి ఈ గంజాం జిల్లా శిరస్తాదారుగారు ఇంగ్లాండులో కంపెనీ డైరెక్టర్ల కోర్టువారికి అర్జీ యిచ్చుకోగా ఆయనకు పూర్తి పింఛను ఇచ్చేటట్లు వారు ఉత్తరువు చేశారు.



# 3. చక్రవర్తికి శిక్ష విధించిన దివానులు

ఈ దేశానికి వర్తకం చేసుకోవడానికి వచ్చిన ఇంగ్లీషు వారు 1765లో అప్పటి మొగలాయి చక్రవర్తియైన షా అలం పాదుషాను ఆశ్రయించి వంగరాష్ట్రంలోను, బీహారు, ఒరిస్సా పరగణాలలోను చక్రవర్తి ప్రతినిధులుగా శిస్తులు వసూలుచేసి సివిలు పరిపాలన జరిపే 'దివానిగిరీ' అధికారాన్ని సంపాదించడంతో రహస్యంగా ప్రారంభమైన బ్రిటిషు రాజ్యతంత్రము 1858లో జరిగిన సిపాయిల విప్లవమనే స్వాతంత్ర్య యుద్ధంలో పాల్గొని ఐరోపావారి వధలకు మద్దతు చేసినాడనే నేరంమోపి అప్పటి మొగలాయి చక్రవర్తియైన బహుదూరుషా పాదుషాను పట్టుకుని యావజ్జీవ కారాగారశిక్ష విధించి రంగూన్‌లో నిర్బంధించి ఇండియాలో కంపెనీ పరిపాలనను రద్దుచేసి ఇంగ్లీషురాణి ప్రభుత్వము ప్రకటించడంతో స్థిర రూపం దాల్చింది.

ఇంగ్లీషు వర్తక కంపెనీకి దివానిగిరీని ప్రసాదించిన షా అలం చక్రవర్తి అసలు పేరు అలీగౌహర్. ఆయన అలంగీరు చక్రవర్తి కుమారుడు. అతడు 1728లో జన్మించాడు. తండ్రికి ఆయనమీద దయ తప్పగా అప్పట్లో అయోధ్యలో రాజప్రతినిధిగా ఉన్న 'నవాబు వజీరు' షుజాఉద్దౌలాను ఆశ్రయించి అక్కడ తలదాచుకున్నాడు. షుజాఉద్దౌలా బలవంతుడై చక్రవర్తిని కూడా లోబరుచుకొన్నాడు. అలంగీరు చక్రవర్తి 1759లో దుర్మరణము పొందగా షా అలం చక్రవర్తియైనాడు. ఈయనకూడా షుజాఉద్దౌలా చెప్పుచేతలలోనే ఉన్నాడు.

మూర్షిదాబాదును రాజధానిగా చేసికొని వంగరాష్ట్రాన్ని పరిపాలిస్తూ వున్న రాజప్రతినిధియైన అలావర్దీఖాను చనిపోగా ఆయన మనుమడు, దత్తపుత్రుడునైన సురాజుద్దౌలా 1756లో నవాబు అయినాడు. క్రొత్తనవాబు చాల చిన్నవాడు. అప్పట్లో కలకత్తాలో వర్తకం చేసుకుంటూవున్న ఇంగ్లీషువారి అక్రమచర్యలను హర్షించక వారిని దండించాడు. అంతట వారు ఆయన మంత్రులను తిరుగదీసి ఆయన బంధువున్నూ, మంత్రిన్నీ అయిన మీర్జాఫరుచేత స్వామిద్రోహము చేయించి 1757 ప్లాసీయుద్ధంలో నవాబును ఓడించారు. ఈ యుద్ధంలో విజయంపొందిన క్లైవుయొక్క ధైర్యసాహసాలకు అయోధ్య నవాబున్నూ, చక్రవర్తిన్నీ కూడా సంతోషించారు. సురాజుద్దౌలా దుర్మరణం పొందగా మీర్జాఫరును నవాబుగా అంగీకరింపజేయడానికి క్లైవున్నూ, ఇతర ఇంగ్లీషు ఉద్యోగులున్నూ చాలసొమ్ము లంచము పుచ్చుకొని, చక్రవర్తికి శిఫారసు చేసిన మీర్జాఫరును నవాబుగాచేసి కృతకృత్యులైనారు.

వంగరాష్ట్ర వ్యవహారాలలో క్లైవు చూపిన చాకచక్యానికి చక్రవర్తి అతనిని ఆరువేల గుర్రపుదళానికి అధికారియనే గౌరవబిరుదు నిచ్చాడు. ఆ ఉద్యోగమునకు న్యాయంగా సాలుకు ముప్పైవేల నవరసులు జీతము తనకు రావలెనని క్లైవు మీర్జాఫరును నిర్బంధించి అందుక్రింద 24 పరగణాలను జాగీరుగా పుచ్చుకొన్నాడు. ఈ మీర్జాఫరు కేవలము ఇంగ్లీషు కంపెనీ ఉద్యోగుల చేతులలో కీలుబొమ్మగా వుండినందువల్ల వారికి అమిత లాభం కలిగింది. త్వరలోనే మీర్జాఫరును అతని కుమారుణ్ణి కూడా త్రోసిరాజని అతని అల్లుడైన మీర్ఖాసీమును నవాబుగా చేశారు. ఇతడు మీర్జాఫరులాగ ఇంగ్లీషు వర్తకులు చేసే అన్యాయాలన్నింటినీ సహించలేక వారికిగల ప్రత్యేక హక్కులను తీసివేసేటప్పటికి ఇంగ్లీషువారాయనను పదభ్రష్టుణ్ణిచేసి మళ్ళీ మీర్జాఫరును తక్తుమీదికి యెక్కించారు.

1760–1764 మధ్య వంగరాష్ట్రంలో అరాజకం ప్రబలింది. ఇంగ్లీషు వర్తకులు చేసే అన్యాయాలకు మితిలేకుండా పోయింది. వారి దుర్మార్గాలు సీమలో అధికారులకు కూడా తెలిసి ఇక్కడి పరిస్థితులను చక్కబెట్టవలసినదని క్లైవుకు మళ్ళీ గవర్నరుగా నియమించి పంపించారు. అతడు 1765 మే నెలలో ఇక్కడికి వచ్చాడు.

ఈలోపుగా వంగరాష్ట్ర రాజకీయ పరిస్థితులలో కొన్ని మార్పులు వచ్చినవి. పదచ్యుతుడైన మీర్ఖాసీము అయోధ్య నవాబును ఆశ్రయించాడు. అంతట అయోధ్య నవాబున్నూ, షా ఆలం చక్రవర్తిన్నీ అతనికి సహాయులైనారు. 1764లో బక్సారువద్ద జరిగిన యుద్ధములో వారికి అపజయం కలిగినందువల్ల కంపెనీవారి సైన్యాలు అయోధ్యమీదికి చెలరేగి దండయాత్రలు చేయడం ప్రారంభించినవి. క్లైవు వచ్చేటప్పటికి అయోధ్యలో యుద్ధం పూర్తయింది. మీర్జాఫరు 1765 జనవరిలోనే మరణించాడు. ఇక్కడి కంపెనీ యుద్యోగులు అతడి రెండవ కొడుకు దగ్గర లంచములు పుచ్చుకొని అతణ్ణి నవాబును చేశారు.

వంగరాష్ట్ర సింహాసనంమీద ఒక బలహీనుడైన నవాబును నిమిత్త మాత్రంగా వుంచి కీలుబొమ్మలాగు ఆడించినందువల్ల ఇంగ్లీషు కంపెనీ ఉద్యోగులందరికీ వారు ఆడింది ఆటగానూ, పాడింది పాటగానూ సాగింది. వారు పుచ్చుకునే లంచాలకు, జరిగించే అక్రమాలకు హద్దుపద్దు లేకుండా పోయింది.

## దివానిగిరీ

వంగరాష్ట్రంలో ప్రభుత్వాధికారాలను కంపెనీవారికి చేజిక్కించాలనే ఉద్దేశ్యం కంపెనీ ఉద్యోగులు చాలామందికి కొంతకాలంనుంచి కలిగింది. ఆ ఘనకార్యం సాధించిన గౌరవం క్లైవుకే దక్కింది.

ఆ కాలంలో దేశంలో ప్రతి నవాబున్నూ చక్రవర్తి పేరిటనే ప్రభుత్వం జరుపుతూ వుండేవాడు. ఏ రాజ్యతంత్రం ప్రయోగించాలన్నా చక్రవర్తిపేరుతో ఒక ఫర్మానా పుట్టుతూ ఉండేది. చక్రవర్తిని చేజిక్కించుకొన్నవాడిదే రాజ్యంగా సాగేది. అందువల్లనే అయోధ్యనవాబు వజీరు చాలా బలవంతుడైనాడు. 1765లో క్లైవు రాగానే చేసిన పని అయోధ్య నవాబుతోనూ, చక్రవర్తితోనూ రాయబారాలు సాగించి కంపెనీవారికి లాభకరమైన సంధియేర్పాటులు చేయడమే.

షా అలం చక్రవర్తి అలహాబాదు మకాములో వుండగా క్లైవు స్వయముగా అయనను దర్శించి అయనవల్ల కంపెనీ వారికి వంగరాష్ట్రానికి, బీహారు ఒరిస్సా పరగణాలకూ దివానిగిరీ అధికారాలను సంపాదించాడు. చక్రవర్తి సంరక్షణకోసము అలహాబాదులో ఇంగ్లీషు సైనికదళము నుంచేటట్లున్నూ, కంపెనీవారు వంగరాష్ట్రం, బీహారు, ఒరిస్సా పరగణాలలో దివానుగా ఉండి శిస్తులను వసూలుచేసి పరిపాలన జరిగించుటకున్నూ, కంపెనీవారు చక్రవర్తికి సాలుకు 20 లక్షల రూపాయలు చెల్లిస్తూ ఉండేటట్లున్నూ ఏర్పాటు జరిగింది. ఈ దివానిగిరీతోపాటు దక్షిణదేశంలో ఉత్తరసర్కారు జిల్లాలను కూడా కంపెనీవారికి దయచేస్తూ షా అలం చక్రవర్తి ఫర్మానా జారీచేసినాడు.

చక్రవర్తి యిచ్చిన దివానిగిరీని బట్టి కంపెనీవారు (సివిలు) ప్రభుత్వాధికారాలన్నీ చలాయించడానికి వీలున్నప్పటికి వెంటనే అలాగ జరిగించక పన్నులు వసూలుమాత్రం తాము చేస్తూ మిగతా ప్రభుత్వాధికారాలన్నీ నవాబు క్రింది ఉద్యోగుల ద్వారానే జరగనిచ్చారు. దీనికి కారణం వెంటనే తామీ ప్రభుత్వాధికారాలన్నీ చలాయించేటట్లైతే చాలా పెద్ద సిబ్బందిని నియోగించి, చాలా సొమ్ము ఖర్చుపెట్టవలసి వస్తుందనిన్నీ, పైగా తమతోడి పాశ్చాత్య వర్తక కంపెనీలకు కన్నుగుట్టి తమ ఆదాయానికి భంగం రావచ్చుననిన్నీ దూరాలోచనతోనే ఇంగ్లీషు వర్తక కంపెనీవారు ఈ విధముగా ప్రవర్తించారు. దీనివల్ల ప్రభుత్వంయొక్క బాధ్యతలన్నీ నవాబుమీదనే యుంటూవున్నా దానివలన లాభాలన్నీ కంపెనీ వారికే కలుగుతూవుండేవి. నవాబు సర్కారు వుద్యోగుల నందరినీ కంపెనీవారు తమ శిస్తు వసూలు వ్యవహారాలలో బాగా ఉపయోగించుకొనేవారు. ఇలాగ వంగరాష్ట్రంలో కొంతకాలము ద్వంద్వ ప్రభుత్వం నడిచింది. ప్రభుత్వ వ్యవహారాలు జరపడానికని కంపెనీవారిచ్చే సొమ్ము చాలక నవాబు చాలా చిక్కులు పడేవాడు.

ఈ విధానం వల్ల ప్రభుత్వబాధ్యతలు లేకుండా అధికారాలన్నీ కంపెనీవారు చలాయించడానికి వీలుకలుగుతుందనిన్నీ, తక్కిన పాశ్చాత్యులకు కన్నుకుట్టకుండా వుంటుందనిన్నీ, కంపెనీవారికి సాలుకు 122 లక్షల రూపాయల నికరాదాయం వస్తుందనిన్నీ 1765వ సంవత్సరం సెప్టెంబరు 30వ తేదీన క్లైవు సీమకు వ్రాశాడు. ఈ దివానిగిరీవల్ల ఇంగ్లీషు వర్తక కంపెనీవారు మొగలాయి చక్రవర్తిక్రింద దివానుగా రాజప్రతినిధి హోదాను కలిగి వంగరాష్ట్రానికి నిజమైన పరిపాలకులైనారు. క్రమక్రమముగా అధికారాలన్నీ కంపెనీవారే చలాయించడానికి అవకాశం కలిగింది. పేరునకు నవాబు రాజ్యం చేస్తున్నాడు గాని సాక్షాత్తుగా పరిపాలించేది కంపెనీవారే. 1772లో వారన్ హేస్టింగ్స్ గవర్నరైన తరువాత ఈ ద్వంద్వ ప్రభుత్వ నాటకాన్ని రద్దుచేసి నవాబుకి 16 లక్షలు మనువర్తినిచ్చి కంపెనీవారే ప్రభుత్వం చేసే పద్ధతిని స్థాపించాడు. వంగరాష్ట్రంలో నవాబుస్థానే కంపెనీ వారే రాజప్రతినిధులై పరిపాలన చేయసాగినారు.

హిందూదేశంలో మహారాష్ట్రులు బలవంతులై దేశాక్రమణ చేస్తూ, దేశాలను కొల్లగొట్టుకుంటూ ఉన్న కాలంలో వారు మొగలాయి చక్రవర్తిని పట్టుకుని తమ వశంలో వుంచుకున్నారు. 1771లో మొగలాయి చక్రవర్తిని ఢిల్లీ సింహాసనముమీద నిలిపి ఆ మొగలాయిచక్రవర్తి పేరున తాము దేశపరిపాలన ప్రారంభించారు. ఆ కాలంలో ఇంగ్లీషు

వారు షా అలం చక్రవర్తికి తామివ్వవలసిన సొమ్మును ఇవ్వకుండా బిగబట్టారు. 1788లో రోహిలాల నాయకుడైన గులాంఖాదిర్ ఢిల్లీని పట్టుకొని షా అలం చక్రవర్తి గ్రుడ్లు పీకివేసినాడు. తరువాత మహారాష్ట్ర రాజ్య సమ్మేళనములో నొక రాజైన సింధియా యీ అంధ చక్రవర్తిని మళ్లీ ఢిల్లీ సింహాసనముమీద కూర్చుండబెట్టి కీలుబొమ్మలాగ ఆడించడం ప్రారంభించాడు. ఇంగ్లీషు వర్తక కంపెనీ వారు మహారాష్ట్రులతో యుద్ధముచేసిన సందర్భములో 'లేక్' సేనాని ఢిల్లీ నగరాన్ని పట్టుకుని 1803లో షా అలం చక్రవర్తిని మళ్ళీ ఇంగ్లీషు కంపెనీవారి సంరక్షణలో ఉంచగలిగాడు. ఐతే అంధుడైన ఈ ముసలిపాదుషా 1806వ సంవత్సరం నవంబరు 10వ తేదీన చనిపోవడంతో అయన బాధలు తీరినవి.

## పూర్వపు మర్యాదలు

ఆంగ్లేయ వర్తక కంపెనీ యుద్యోగులును, వారి అధికారులును, గవర్నరులును కూడా మొదటి రోజులలో మొగలాయి చక్రవర్తికిని, నవాబులకును దాసానదాసులై ఎంతో భయభక్తులతో ప్రవర్తించేవారు. వారికి జోహారులు చేయడము, నజరులు సమర్పించడము, వారియెదుట నిలిచి యుండడము మొదలైన పూర్వపు మర్యాదలన్నిందినీ చాలా కాలంవరకూ పాటించేవారు. వాస్కోడిగామా కళ్ళికోట రాజైన జామొరిన్ పాదముల దగ్గర మోకరించియుండిన చిత్రము, జహంగీరు చక్రవర్తి దర్బారులో ఇంగ్లీషురాజు రాయబారియైన సర్ థామస్‌రో నిలిచియుండడము, షా అలం చక్రవర్తి అలహాబాదులో కొలువుదీర్చి యుండగా క్లైవు నిలిచియుండడము మొదలైన పటములు ఆ కాలమునాటి మర్యాదలను ప్రదర్శిస్తున్నవి. కంపెనీ ఉద్యోగులు మొదలు గవర్నరు జనరలు వరకును, తుదకు సీమలోని డైరెక్టర్ల వరకును గల వారందరూ మొగలు చక్రవర్తిగారికిని, నవాబులకును వ్రాసే ఉత్తరాలలో వారివారి బిరుదావళిని ఉదాహరించి ఎంతో వినయముతోనూ, నమ్రతతోనూ చేసిన విన్నపము లిప్పటికిని కంపెనీవారి కవిలెలలో నున్నవి.

1171లో కలకత్తా విలియంకోట ప్రెసిడెంటు (గవర్నరు)గా నుండిన ఇంగ్లీషు వర్తక కంపెనీ ఉద్యోగి వంగరాష్ట్ర నవాబుగారికి అతివినయముగా దాసోహముచేసి, "ఏలినవారి సేవకే అంకితము చేయబడిన నా ప్రాణములను తమ పాదముల సన్నిధిని ఉంచుచున్నాను" అని వ్రాశాడు. ఇతడే రెండేళ్ల తరువాత ఫరుక్, షయ్యరు చక్రవర్తిగారికి వ్రాయుచు "ఏలినవారి సేవకుడును, అత్యల్పమైన ఇసుక రేణువును అగు తూర్పు ఇండియా వర్తకం కంపెనీ ప్రెసిడెంటు జాన్‌రస్సెల్ తన నుదుటిని నేలపైన మోపి చేయు మనవి" అని తాను సాష్టాంగప్రణామము చేయుటను ఆ ఉత్తరములో సూచించినాడు.

ఆ రోజులలో ఇంగ్లీషువర్తక కంపెనీవారును, వారి తాబేదారులును మొగలాయి చక్రవర్తులకును, వారి రాజప్రతినిధులకును అడుగులకు మడుగులొత్తి అతివినయముగా ప్రవర్తించుచు వారి కనేక విధములైన వస్తువులను బహుమతిగా సమర్పించేవారు. వారిని దర్శించినప్పుడు రొక్కపు నజరులను నమర్పించి, వారిని తృప్తిపరచి ఫర్మానాలను సంపాదించేవారు.

చాలాకాలంవరకూ గవర్నర్లు, గవర్నరు జనరలులు కూడా మొగలాయి చక్రవర్తుల ఎదుట నిలచియుండవలసినదే గాని కూర్చుండుటకు వీలులేదు. వారన్ హేస్టింగ్సు గవర్నరు జనరలుగా నున్నప్పుడు (1774-85) ఢిల్లీ చక్రవర్తి ఏనుగుపైన హౌదాలో కూర్చుండగా తాను ఆయన వెనుకగా కూర్చుండవలసి వచ్చినది.

1813లో హేస్టింగ్సు గవర్నరుజనరలు అగునప్పటికి ఆంగ్లేయుల వలుకుబడిన్నీ, బలమున్నూ హెచ్చినందువల్లను మొగలుచక్రవర్తి చాలా బలహీనుడై మహారాష్ట్రుల చెప్పుచేతలలో నున్నందువల్లను చక్రవర్తి హేస్టింగ్సు నొకమారు రమ్మని కోరినప్పుడు అతడు వెళ్ళడాని కెంతో జాగుచేసి తుదకు చక్రవర్తితో సమానముగా కుర్చీలో కూర్చుండే గౌరవమును పొందగలిగాడు.

గవర్నరు జనరలైన డల్‌హౌసీ ప్రభువు 1848లో ఢిల్లీకి వెళ్లినప్పుడు చక్రవర్తిని దర్శించడమే తనకు పరువు తక్కువగా యెంచి వెళ్లడము మానివేశాడు. డల్‌హౌసీ మెల్లిగా చక్రవర్తికిని, నవాబులకును చూపవలసిన మర్యాదల నన్నింటినీ పూర్తిగా తీసివేశాడు.

1765లో దివానిగిరీని సంపాదించినది మొదలు 1858లో కంపెనీవారి పరిపాలన రద్దుచేయబడి ఇంగ్లీషు రాణీ ప్రభుత్వము స్థాపించబడువరకూ కూడా ఇంగ్లీషు వర్తక కంపెనీవారు జారీచేసే ఉత్తర్వులలోనూ, ప్రకటనలలోనూ మొగలాయి చక్రవర్తి సార్వభౌమత్వమునకు లోబడి తాము పరిపాలిస్తూ ఉన్న సంగతిని తెలిపే ("Under the king's realm and the Company's rule") ఇంగ్లీషు మాటలను వాడుతూ వచ్చారు.

ఇంగ్లీషు వర్తక కంపెనీవారు చివర వరకూ మొగలాయి చక్రవర్తిగారి సార్వభౌమత్వాధికారానికి లోబడియే హిందూ దేశాన్ని పరిపాలించారు గాని క్రమక్రమంగా ఆయన రాజ చిహ్నాలను, దర్జాలను తొలగించారు.

1803లో లేక్ సేనాని ఢిల్లీ నగరాన్ని ముట్టడించి షా ఆలం చక్రవర్తిని మహారాష్ట్రుల స్వాధీనం నుండి తప్పించి ఇంగ్లీషు కంపెనీవారి స్వాధీనంలోకి తెచ్చినప్పుడు అదివరకు సింధియా చేసినట్లే ఢిల్లీ నగరాన్ని చక్రవర్తి పేరిటనే పరిపాలించసాగినాడు. చక్రవర్తిన్నీ అంతకు ముందు సింధియాకు గొప్ప బిరుదును ప్రసాదించినట్లే దాని తరువాత గొప్ప బిరుదైన సంసామ్ ఉద్దౌలా, అజ్బార్ ఉల్ ముల్కు ఖాన్, దేరాన్‌ఖాన్ పత్తేజంగ్ అనే గొప్ప బిరుదును ఇప్పుడు లేక్‌సేనానికి ప్రసాదించాడు. ప్రపంచలోకెల్లా ప్రఖ్యాతిజెందిన మొగలాయి చక్రవర్తుల వంశీకుడైన పాదుషావల్ల ఇలాంటి బిరుదులను పొందడము తనకు చాలా గౌరవమని లేక్ సేనాని యెంచి దానిని సంతోషముతో శిరసావహించాడు.

చక్రవర్తికి ఇంగ్లీషు వర్తక కంపెనీవారు సాలియానా ఫించనుగా కొంతసొమ్ము ఇస్తూ ఉన్నమాట వాస్తవమే. కాని ఇది కప్పము అనికూడా చెప్పతగివున్నది. పైగా మొగలు చక్రవర్తి ఇంగ్లీషు వర్తక కంపెనీవారి న్యాయస్థానాల అధికారానికి లోబడిన సామాన్య వ్యక్తి వంటివాడు కాడు. ఇంతేగాక సాక్షాత్తుగా సామ్రాజ్యం ఏలకపోయినా చక్రవర్తి ఢిల్లీలో తన రాజభవనములో ఒక విధమైన దర్బారులో కొలువుతీరుస్తూ, తన దర్జాను నిలబెట్టుకుంటున్నాడు.

కంపెనీవారు మొగలు చక్రవర్తికి చేయవలసిన మర్యాదలను, గౌరవాలను క్రమక్రమంగా తగ్గించడం ప్రారంభించారు. ఇంగ్లీషు ఉత్తర ప్రత్యుత్తరాలలో ఆయనను 'చక్రవర్తి' యని పేర్కొనడం మానివేసి 'ఢిల్లీరాజు' అని వ్యవహరించడం ప్రారంభించారు. అయితే షా ఆలం చక్రవర్తి గాని, ఆయన తరువాత 1806 మొదలు 1830 వరకు రాజ్యం చేసిన అక్బరుషా చక్రవర్తిగాని, 1837 మొదలు 1857 వరకు చక్రవర్తిగా నున్న రెండవ బహదూర్‌షాగాని తమకు జరుగవలసిన మర్యాదలలో లోపము జరగడానికి అంగీకరించినవారు కారు. అందువల్ల పారశీకభాషలో జరిగే ఉత్తరప్రత్యుత్తరాలన్నిటిలోనూ పూర్వములాగానే చక్రవర్తి అని అర్థమిచ్చే 'పాదుషా' అనే బిరుదు ఉపయోగింపబడుతూ వుండేది.

1828 వరకు కూడ మొగలాయి చక్రవర్తులు ఇతరులకు బిరుదులు ప్రసాదించేవారు. వాటిని కంపెనీవారు హర్షిస్తూ వచ్చారు. చక్రవర్తిగారిమీద ఆధారపడే సన్నిహితులైన వారి విషయంలో తప్ప ఇతరుల కిచ్చే బిరుదులను అంగీకరించమని కంపెనీవారు 1828లో నిరాకరించారు.

1835 వరకున్నూ దేశంలో చలామణి అయ్యే నాణెములను తూర్పు ఇండియా కంపెనీవారు మొగలాయి చక్రవర్తి పేరుతోనే ముద్రించేవారు. కంపెనీ రూపాయలమీద చక్రవర్తిగారి పేరే వుండేది. ఆ సంవత్సరంలో మొదటిసారి ఇంగ్లీషు రాజైన నాలుగవ విలియంగారి పేరుతో నాణెములను ముద్రించి హిందూదేశంలో కంపెనీ పరిపాలనలో ఉన్న రాజ్యభాగములో ప్రవేశపెట్టారు.

1835 వరకూ హిందూదేశంలో ఉన్న వివిధ రాజ్యాల వారు మొగలాయి చక్రవర్తి దర్బారులో తమ తమ ప్రతినిధులను రాయబారులుగా నుంచేవారు. ఆ పద్ధతిని కంపెనీవారు 1835లో రద్దుపరిచారు.

గవర్నరు జనరలైన హేస్టింగ్సు ప్రభువు కాలంనాటి వరకూ గవర్నరు జనరులు సహా ఇంగ్లీషు అధికారులందరూ ఢిల్లీ చక్రవర్తికి నజరులు సమర్పించేవారు. హేస్టింగ్సు ఈ మర్యాదను పాటించకపోగా 1823-26 మధ్య కలకత్తాలో క్రైస్తవ మతాధికారిగా వుండిన బిషప్ హెబరుగారు హేస్టింగ్సు చర్యను విమర్శించాడు. తరువాత కంపెనీ క్రింది అధికారులు మాత్రం 1843 వరకూ చక్రవర్తికి నజరులు చెల్లించేవారు. గవర్నరు జనరలైన ఎల్లెన్ బరో ఈ ఆచారాన్ని కూడా 1843లో మాన్పించాడు.

ఢిల్లీ చక్రవర్తిగారి రాయబారిని తన దర్బారులో నుంచుకోవడానికి గవర్నరు జనరలైన డల్‌హౌసీ ప్రభువు 1853లో నిరాకరించి చక్రవర్తిని ఒక సామాన్య వ్యక్తి స్థితి లోకి దింపినాడు. ఢిల్లీ చక్రవర్తిని, ఆయన వారసులను ఢిల్లీ కోటలో నుంచి సాగనంపాలని కూడా ఆ కాలంలో ప్రయత్నించారు గాని అది సాగలేదు. ఇదంతా దేశీయుల మనస్సులకు కష్టం కలిగించింది.

## చక్రవర్తికి ఖైదు

1837 మొదలు బహదూరుషా మొగలాయి చక్రవర్తిగా వుంటూయున్నాడు. 1857లో ఇంగ్లీషు వర్తక కంపెనీవారి దొరతనాన్ని సిపాయిలు ధిక్కరించగా దేశంలో

జరిగిన మహాయుద్ధంలో కంపెనీవారిమీద కత్తికట్టినవారిలో బహదూరుషా ఒకడనిన్నీ, తెల్లదొరల వధలకు అయన మద్దతు చేశాడనిన్నీ, ఇంగ్లీషుకంపెనీ ప్రభుత్వంవారు అయనమీద నేరంమోపి 1858 జనవరిలో అయనను తమ న్యాయస్థానం యెదుట విచారణకు పెట్టారు. ఇంగ్లీషు న్యాయస్థానంవారు బహదూరుషా చక్రవర్తి నేరస్థుడని నిర్ణయించి 1858, మార్చి 29వ తేదీన అయనకు యావజ్జీవఖైదు విధించారు. ఆ తీర్పునుబట్టి కంపెనీవా రాయనను రంగూన్‌లో నిర్బంధించియుంచగా అయన 1862వ సంవత్సరం నవంబరు 7వ తేదీన దివంగతుడైనాడు.

1765లో మొగలు చక్రవర్తి వల్ల దివానుగిరీని పొందినది మొదలు 1857 వరకూ ఇంగ్లీషు కంపెనీవారు దేశ పరిపాలనమంతా చక్రవర్తి పేరు క్రిందనే జరిగిస్తూ వచ్చారు గాని తాము స్వతంత్ర ప్రభువులమని ఎన్నడూ ప్రకటించలేదు. క్రమక్రమంగా చక్రవర్తికి చేయవలసిన మర్యాదలను తగ్గించినా వారు బహిరంగముగా చక్రవర్తిని పదచ్యుతుని చేయలేదు. బహదూరుషా చక్రవర్తి రాజ్యపరిత్యాగమున్నూ చేయలేదు. అందువలన అయనను తమ న్యాయస్థానం యెదుట పెట్టి శిక్షించేటప్పటికి కూడా ఇంగ్లీషు ప్రభుత్వము చక్రవర్తికి ప్రతినిధులుగా వ్యవహరిస్తూ ఉన్న తాబేదారీ వ్యవస్థగానే ఉన్నది. కంపెనీ వారు చక్రవర్తికి ప్రతిసాలునా చెల్లిస్తూ ఉన్న సొమ్ము (పింఛను) ఉపకార వేతనమని వారు చెపుతూ ఉన్నా ఆదిలో అది కప్పంగా వుండినందువల్ల దానిస్వభావం మారలేదు. ఇంగ్లీషు కంపెనీవారు చక్రవర్తిని త్రోసిరాజన్నంత మాత్రంచేత దేశానికి స్వతంత్ర ప్రభువులుకారు. అందువల్ల దివానులుగా పనిచేస్తూఉన్న సేవకులే చక్రవర్తికి శిక్ష వేసినట్లైనదని కొందరు విమర్శించారు. పైగా ఎంత చెడ్డా మొగలురాజు స్వతంత్రరాజు. అంతర్జాతీయ న్యాయశాస్త్రధర్మము ప్రకారము అయన సామాన్య న్యాయస్థానముల అధికారమునకు లోబడిన సామాన్యవ్యక్తికాదు. అందువల్ల ఇంగ్లీషు న్యాయస్థానమువా రాయనకు విధించిన శిక్ష న్యాయమైనదిన్నీ, చెల్లతగినదిన్నీ కాదని కొందరు ధర్మశాస్త్రజ్ఞులు విమర్శించారు. ఏమైతేనేమి? బలవంతులైన ఇంగ్లీషు వారిచర్యను ఎవరు కాదనగలరు? అందువల్ల చెల్లిపోయింది. మొగలాయి చక్రవర్తి నిర్బంధములో వుంటూనే 1862లో చనిపోయినాడు.



# 4. తురకల దశావతారములు

మహమ్మదీయులలో షియాలు, సున్నీలు అనే రెండు తెగలున్నవి. మహమ్మదు ప్రవక్తను గౌరవిస్తూ, ఖురానును పవిత్రంగా ఎంచే రెండు విషయాలలో తప్ప మరే విషయాలలోనూ సున్నీలకూ, షియాలకూ సామరస్యం లేదు. ఒకరిని చూస్తే ఒకరికి పరమద్వేషం.

మహమ్మదుగారి కుమార్తె అయిన ఫాతిమాకు, అయన చిన్నభార్య అయిన అయేషాకునుగల క్రోధజ్వాలలు ప్రజ్వలించి మహమ్మదీయ ప్రపంచాన్ని షియా, సున్నీలనే

రెండు కులాలుగా చీల్చినవి. ఈ రెండు తెగలమధ్యా వచ్చే తగాదాలలో రక్తపాతంకూడా కలుగుతూ వుంటుంది. చిన్న చిన్న మహమ్మదీయ తెగలవారు వీరిమధ్య నలిగిపోతూ వుంటారు. మనదేశంలో సున్నీలే అధికసంఖ్యాకులు గనుక వారిమధ్య జీవించే స్వల్ప సంఖ్యాకులుగా వుండే మహమ్మదీయ తెగలవారు తమ కేమి కీడు మూడుతుందో అనే భయంతో వుంటారు.

భగవంతుని దూతయైన మహమ్మద్‌ప్రవక్త తన తరువాత ఎవరు మతగురువుగా వుండవలసినదీ నిర్ణయించకుండా క్రీ.శ. 632 లో చనిపోయాడు. అయన కుమార్తె ఫాతిమా యొక్క భర్తయున్నూ, అయన ప్రథమశిష్యుడున్నూ అయిన అలీ అయన తరువాత కాలీఫు అవుతాడని అందరూ అనుకున్నారు. కాని మహమ్మదుగారి చిన్నభార్యా అయేషా ఫాతిమాపట్ల విరోధం వహించి ఒక కక్ష లేవదీసి తనతండ్రి అబుబేకరును కాలీఫుగా ఎన్నుకొనేటట్లు చేసింది. అయన తరువాత ఓమరు, ఓస్మాను కాలీఫు లయ్యారు. క్రీ.శ. 656 లో ఓస్మాను చనిపోయిన తరువాత అఖరికి అలీ కాలీఫు అయినాడు. కాని 661 లో అతనిని ఒక మహమ్మదీయుడు వధించాడు. అతనికి హస్సను, హుస్సేనులని ఇద్దరు కుమారులు. హస్సనుకు విషం పెట్టించి చంపారు.

ఇరాకు, అరబ్బీదేశముల (మెసపొటోమియా) రాజు అహ్వానంమీద హుస్సేనుగారు మెదీనానుంచి క్యూఫాకు వెడ్తూ వుండగా దారిలో 'కెర్బాలా' దగ్గర అయనను, అయన కుమారుని ఆ రాజు సైనికులే అన్యాయంగా చంపారు. ఇంకొక కొడుకును, భార్యను, సోదరిని ఎత్తుకొనిపోయారు. హుస్సేను తలను క్యూఫాలో ఊరేగించారు.

## షియాలు - సున్నీలు

అబుబేకరు, ఓమరు, ఓస్మానులను అంగీకరించక అలీని ఈశ్వరుని అవతారమని నమ్మి అయన వంశీయులను ఇమాములుగా గౌరవించేవారే షియాలు. అయనను ఒక కాలీఫుగా మాత్రమే పరిగణించేవారే సున్నీలు. క్రమక్రమంగా ఈ రెండు తెగల ఆచార వ్యవహారాలు భేదించి విరోధాలు ఏర్పడ్డాయి. అవి కుల కక్షలుగా పరిణమించాయి.

సున్నీలు ఖురానులోని ధర్మాలనేగాక సున్నత్ అనే మహమ్మదుగారి జీవిత విధానాన్ని కూడా ప్రమాణంగా అంగీకరిస్తారు. సున్నీలు రోజుకు అయిదుసార్లు ప్రార్థనచేస్తారు. షియాలు రోజుకు మూడుసార్లే ప్రార్థన చేస్తారు. సున్నీలు ప్రార్థించేటప్పుడు చేతులు ముడుచుకొని రొమ్ముమీద ఉంచుకొంటారు. షియాలు చేతులు ప్రక్కకు వాల్చుకునే వుంటారు. షియాలు మహమ్మదుగారి అల్లుడైన అలీగారినీ, కుమార్తె అయిన ఫాతిమాను ఈశ్వరాంశ సంభూతులుగా పరిగణిస్తారు. మహమ్మదుగారి చిన్న భార్య అయేషా బంధువులైన అబుబేకరు, ఓమరు, ఓస్మానులు అక్రమంగా కాలీఫులైనవారని అసహ్యించుకుంటారు. ఈ ముగ్గురు కాలీఫులను సున్నీలు శుక్రవారపు ప్రార్థనలలో భక్తితో స్మరిస్తారు. వారి పేర్లు పవిత్రంగా యెంచి మశీదు గోడలమీద చెక్కిస్తారు.

అలీగారి కుమారుడైన హుస్సేనుగారు మెదీనా నుంచి క్యూఫాకు పోతూవుండగా హుస్సేనుగారిని కెర్బాలా పట్నంలో వధించిన ఘోరకృత్యాన్ని స్మరిస్తూ షియాలందరూ

మొహరం నెలలో దుఃఖపడుతూ ప్రార్థనలు చేస్తూవుంటే సున్నీలు దీనిని వెక్కిరిస్తూ అకతాయులచేత పులులు మొదలైన మృగాల వేషాలు వేయించి మొహరంలో అల్లరిచేస్తూ దానిని ఒక పండగలాగ చేస్తారు. ఇదే మన దేశాలలో పులివేషాల చరిత్ర.

కెర్బులాను పవిత్రదేశంగా యెంచి అక్కడి మట్టి యుండల తావళాలతో షియాలు జపం చేస్తారు. ఆ మట్టిని నీళ్ళలో కలిపి తాగుతారు. సున్నీలు ఇదిచూచి అసహ్యించు కుంటారు.

## ఆగాఖాను

అలీ దగ్గరనుంచి ఏడవతరము వాడైన ఇస్మేల్ అనే మతగురువు భగవదవతారమని షియా ఇస్మేలీ తెగవారి విశ్వాసం.

హాస్సన్‌బిన్ సబా అనే అతడు అరబ్బీ దేశీయుడు. అతడు షియామతంవాడు. ఈజిప్టు దేశం ముఖ్యపట్టణమైన కైరోలో ఇస్మేలీ మతసిద్ధాంతాలను బాగా అభ్యసించాడు. అప్పుడు పారశీక దేశంలో సున్నీమతం ప్రబలంగా వుండేది. ఇతడు ఒక కొండమీద స్థావరం యేర్పరచుకొని క్రీ.శ. 1090 ఆ ప్రాంతంలో హింసాపద్ధతులతో బలవంతంగా మత ప్రచారం చెయ్యడం ప్రారంభించాడు. మత విరోధులను చంపే విధానాలను ప్రారంభించాడు. అతని తరువాత నాలుగవ 'ఇమాం' మత గురువు 'జాకరేసలాం' అనే ఆయనకూడా ఆ పద్ధతులతోనే మత ప్రచారం చేశాడు. తాను ఇస్మేలీ మతగురువు యొక్క వంశంలో ఏడవతరం వాడనని, దైవాంశసంభూతుడనని ప్రచురించుకొని ఇతడు ప్రఖ్యాతి చెందాడు. ఒక సందర్భంలో ఇతని చర్యలు తక్కిన మహమ్మదీయులకు చాలా హేయకరంగా తోచాయి. ఇతడు రంజాను 17వ రోజున అలమత్తుకోటలో ఒక వేదికమీదకెక్కి, తాను భగవంతుని ప్రతినిధినని ప్రచురించి, సామాన్య మహమ్మదీయ మత సిద్ధాంతాలను రద్దుచేసి ఆ పవిత్ర దినాన్ని 'ఇమాం'గారికి దివ్యత్వం సిద్ధించిన దినంగా పరిగణించాలన్నాడు. యథేచ్ఛగా పందిమాంసం కూడా తినవచ్చుననిన్నీ, తప్పు త్రాగవచ్చుననిన్నీ ప్రకటించాడు. తరువాత నాలుగేళ్ళలో ఇతనిని ఎవరో వధించారు.

1866వ సంవత్సరంలో బొంబాయి సుప్రీంకోర్టులో వచ్చిన వ్యాజ్యంలో 1వ ప్రతివాది అయిన మహమ్మదు హుస్సేన్ హుస్సేనీ అనే పేరుగల ఆగాఖానుగారు ఆ యిమాముల వంశీయులేనని ఆ కేసులో రుజువుచేశారు. ఈ ఆగాఖానుగారు ఇస్మేలీ షియా మహమ్మదీయులు అనువంశిక మత గురువు. ఏ తెగవారినైనా మహమ్మదీయుల నందరినీ 'తురక'లని వ్యవహరించడం పరిపాటి అయింది.

క్రీ.శ.16వ శతాబ్దంలో పారశీకదేశం షియా మతాన్ని స్వీకరించినది మొదలు ఇస్మేలీల బాధలు తగ్గినాయి. ఈ మహమ్మదు హుస్సేన్ హుస్సేనీగారి తాత పారశీక దేశంలో కెర్మను నగర పరిపాలకుడుగా ఉండేవాడు. ఆ ఉద్యోగం అయిపోయిన తరువాత మెహంతీ జిల్లాలో ఉండేవాడు. ఆయన కుమారుడు హుస్సేనీగారి తండ్రి యెజ్డు నగరంలో వుండగా ఆయనను 1817లో హత్యచేశారు. 1838లో ఆగాఖాను పితూరీచేసి కెర్మను

నగరం పట్టుకున్నాడు. ఆ సమయంలో ఆగాఖాను దగ్గర నౌకరుగా వుండినవాడు పారశీక రాజుదగ్గర పలుకుబడి సంపాదించి ఆగాఖాను కుమార్తెను తనకు పెళ్ళి చెయ్యమని అడిగాడు. ఇది సహించలేక ఆగాఖాను 1840లో హిందూ దేశానికి వచ్చాడు. సింధులో వుండే మూడువేల కుటుంబాలవారు ఆగాఖానుకు సాలియానా కప్పం చెల్లించడంవల్ల సొమ్ముకు ఇబ్బంది లేదు. ఆగాఖాను 1841-42 మధ్య ఆఫ్గను యుద్ధంలో ఇంగ్లీషువారికి సహాయం చేశాడు. ఇంగ్లీషువారు 1843-44లో సింధు అమీరుల రాజ్యాన్ని ఆక్రమించినప్పుడు కూడా ఆగాఖాను వారికి సహాయం చేసినందువల్ల ఆయనకు ఇంగ్లీషువారు పింఛను యిచ్చారు.

1845లో ఆగాఖాను బొంబాయిలో స్థావరంగా వుండడం ప్రారంభించాడు. "ఆయన బొంబాయిలో జమాత్ ఖానాలో అధ్యక్షత వహించి మొహరంలోనూ, పండుగ రోజులలోనూ బహిరంగంగా జరిగే నమాజులలో పాల్గొంటాడు. అప్పుడు అలీ కుమారుడు హుస్సేను చచ్చిపోయిన కెర్బాలా పట్నం మట్టిని కలిపి నీటిని అందరికీ త్రాగడానికి ఇస్తాడు. ఖోజా తెగవారు ఆయనకు పాదపూజలు సమర్పించి భక్తితో చేతిని ముద్దు పెట్టుకుంటారు. కాఠియవాడు, కచ్చి, బొంబాయి, జాంజిబారు మొదలైన ప్రాంతాలలో వుండే శిష్యులిచ్చే పాదపూజ సొమ్ముడల్ల ఆయనకు సాలియానా ఒక లక్ష యేబదివేల రూపాయల ఆదాయం వస్తుంది. ఆ సొమ్ములో చాలాభాగం గుఱ్ఱపు పందెముల క్రింద ఆయన ఖర్చుపెడుతాడు" అని 1866లో బొంబాయి సుప్రీంకోర్టు న్యాయమూర్తి ఆర్నాల్డుగారు తమ తీర్పులో అప్పటి ఆగాఖాను చరిత్రను వ్రాశారు.

ఇప్పటి ఆగాఖానుగారు కూడా చాలా ధనవంతుడన్నీ, గుఱ్ఱపుపందెములలో అందెవేసిన చెయ్యి అనిన్నీ, చాలా భోగి అనిన్నీ, ఎప్పుడూ యూరోపులోనే వుంటాడనిన్నీ అందరికీ తెలిసిన విషయమే.

## ఖోజాలు

ఖోజాలనే తెగవారు వేష భాషలలో, ఆచారవ్యవహారాలలో హిందువులు; మతంలో మహమ్మదీయులు. వీరిని గురించి వచ్చిన వ్యాజ్యాలను పరిష్కరిస్తూ బొంబయి సుప్రీం కోర్టు న్యాయాధిపతియైన సర్ ఎర్స్కిన్ పెర్రీగారు 1847లో యిచ్చిన తీర్పులోను, బొంబాయి హైకోర్టులో అడ్వకేటు జనరలుగారికీ, ఆగాఖానుగారికీ జరిగిన వ్యాజ్యాన్ని పరిష్కరిస్తూ 1866లో ఆర్నాల్డు అనే న్యాయాధిపతి ఇచ్చిన తీర్పులోనూ, 1875లో వచ్చిన వ్యాజ్యంలో సర్‌చార్లెస్ సార్జెంటు గారనే న్యాయాధిపతి యిచ్చిన తీర్పులోనూ వీరి చరిత్ర చాలా విపులంగా చర్చించబడింది. వీరికి వారసత్వ విషయములో హిందూ ధర్మశాస్త్రమున్నూ, తక్కిన విషయాలలో మహమ్మదీయ ధర్మశాస్త్రమున్నూ వర్తిస్తాయని నిర్ణయించబడింది*.

* 1 Cases Illustrative of Oriental Life-Decided in the Supreme Court of Bombay (1853) Sir Erskine Perry pp 110-129
2 The Advocate general and others vs Muhammed Hussain Husseni (Aga Khan) and

12 Bombay High Court Reports pp 294 and 323.

"ఖోజాలు హిందూదేశంలో పడమటి భాగంలో నివసించే ఒక చిన్న తెగవారు. వీరు మొదట సింధు, కచ్ఛి రాష్ట్రములనుండి వచ్చినట్లు కనపడుతూ వుంది. సుమారు అయిదు వందల సంవత్సరాల క్రిందట సదర్ దీన్ అనే మహమ్మదీయ పీరు (మహాత్ముడు) వీరిని హిందూమతంలోనుంచి తురకలలో కలిపినట్లు చెప్పుకుంటారు.

వీరు మాట్లాడేది కచ్ఛిభాష. వీరిమతం తురకమతం. వీరు ధరించే దుస్తులు, అవలంబించే ఆచార వ్యవహారాలు చాలా మటుకు హిందువులవి. వీరు మొదట నిజంగా హిందువులనే సంగతి సుప్రసిద్ధంగా వుండడాన్ని బట్టి ఆ సంగతిని నేను అంగీకరిస్తున్నాను గాని కేవలము వీరి వేషభాషలు, ఆచారవ్యవహారాలు హిందువులవిగా నున్నంతమాత్రం చేతనే నేను అలాగ నిర్ణయించేవాడిని కాను. దీనికి కారణం ఈ హిందూ ప్రజల ప్రభావం ఎంత చిత్రమైనదంటే ఏజాతి వారైన, ఏ వర్ణము వారైన వారిమధ్య కొంతకాలం వున్నారంటే వారికి హిందువుల మర్యాదలూ, భావాలు అలవడిపోతాయి. ఈ దేశంలో స్థిరనివాసం ఏర్పరచుకొన్న పారశీకులు, మొగలులు, పఠానులు, ఇస్రెలైట్లనే యూథులు, క్రైస్తవులు తమ పూర్వాచారాలను వదలి హిందువుల సభ్యతనే అవలంబించారు. దక్షిణాపథంలో నల్లరేగడి నేలలో ఏ వస్తువు పడినా దానిని తనలో లీనం జేసుకొనేశక్తి ఆ మట్టికి ఉన్నదని భూగర్భ తత్వజ్ఞులు చెప్పేమాట ఈ సందర్భంలో నాకు స్ఫురిస్తూవుంది." అని సర్ ఎర్స్కిన్ పెర్రీగారు వ్రాశారు. "ఏది ఎలావుంటే నేమి? ఈ ఖోజాలలో చాలామంది యిప్పుడు కచ్ఛి, కథియావాడు, బొంబాయి ప్రాంతాలలో హిందూప్రజల మధ్యనే స్థిరనివాసం ఏర్పరచుకొని జీవిస్తున్నారు. 1847 నాటికే బొంబాయిలో రెండువేల ఖోజాజనం వున్నారు."

1866 నాటికి సింధురాష్ట్రంలో 2800 ఖోజా కుటుంబాలుండేవి. కథియావాడులో 500 కుటుంబాలు, ఆఫ్రికాతీరాన్ని జాంజిబారులో 450 కుటుంబాలు, మస్కట్‌లో 400 కుటుంబాలు వుండేవి. కచ్ఛి, గుజరాతు రాష్ట్రాలు ఖోజాల అసలు నివాసస్థానాలే. ఆ ప్రాంతాలలో ఎన్ని కుటుంబాలుండేదీ లెక్కలేదుగాని చాలా కుటుంబాలుండేవి. వీరిలో చాలా మందికి చదువురాదు. తమ మతం సంగతి తెలియదు. వీరు తురకలలో కలిసినప్పటి నుంచి ఇప్పటివరకూ వీరి స్థితిలో ఎక్కువ మార్పులు కలుగలేదని చెప్పవచ్చు.

తాము మహమ్మదీయులమని వీరు చెప్పుకున్నా, మహమ్మదు వారిని గురించి గాని, ఖురాను గ్రంథాన్ని గురించి గాని వీరికేమీ తెలియదు. వీరికి తెలిసినదల్లా అగాఖాన్ అనే ఒక పారశీక ప్రభువును తమ మతగురువుగా గౌరవించడం మాత్రమే" నని పెర్రీగారు వ్రాశారు.

ఈ అగాఖాను పారశీక దేశంలో ఇస్మైలీలనే మహమ్మదీయ తెగవారి మతగురువు. తురకలలో వీరు షియా మతస్తులు. మహమ్మదు ప్రవక్త అల్లుడైన అలీగారిని భగవంతుడి అవతారంగా నమ్ముతారు. ఆ అలీగారి దగ్గరనుంచి ఇస్మైల్ అనే ఇమాముగారి వరకూ ఈశ్వరాంశ ఉన్నదనిన్నీ, అది అగాఖానుగారి వంశంలోని పురుషులలో పారంపర్యంగా వస్తూవున్నదనిన్నీ నమ్మి ఇస్మైలీ మతము వారందరూ అగాఖానుగారిని భగవంతునిగానే ఆరాధిస్తారు. ఆ అగాఖాను గారికి తమ శక్త్యానుసారంగా ప్రతియేటా కొంతముడుపు చెల్లిస్తారు. ఆ బాపతు ఆయనకు సాలుకు ఒక లక్ష యేబది వేల రూపాయల శిష్యార్జనవుంది.

అందువల్ల ఈ ఖోజాలుకూడా షియా ఇస్మేలీ మతశాఖలో చేరినవారని యేర్పడుతూ ఉన్నది. అసలు షియా ఇస్మేలీ మతంలోనే ఇతరుల మనస్సులకు నొప్పి కలిగించకుండా తన మతవిశ్వాసాన్ని కోల్పోకుండా వుండాలనే సిద్ధాంతం ఒకటివుంది. ఇతర మతాలవారిని తురకలలో కలుపుకునే సందర్భంలో ఇతర మతాలవారి ఆచార వ్యవహారాలను నిరాకరించక క్రూరమైన పద్ధతులతో గాక వారి మతాచారాలను చాలావరకూ అంగీకరించి వాటికి మహమ్మదీయుల మతానికి అనుగుణ్యముగా అర్థంచెప్పి మతప్రచారం చెయ్యాలనే నియమం కూడా ఒకటి ఉన్నది. పై రెండు కారణాలవల్లనూ హిందూమతంలోనుంచి తురకలలో కలిసిన ఖోజాలు చాలా వరకు హిందూ ఆచార వ్యవహారాలనే అవలంబించి వుండడానికి వీలైనది.

హిందూదేశంలో షియా మతస్థులకన్న సున్నీ మతస్థులే అధిక సంఖ్యాకులుగా ఉన్నారు. సున్నీ మతస్థుల ఆచారాలకూ, షియామతస్థుల ఆచారాలకూ చాలా తేడా లున్నాయి. తమదే శిష్టాచారమని సున్నీల ఊహ. ఈ దేశాన్ని ఏలిన మహమ్మదీయ రాజులలో చాలామంది సున్నీమతం వారే. అందువల్ల ఈ సున్నీల మధ్య జీవించే షియాలకు చాల బాధలు కలుగుతూ వచ్చాయి. అందువల్ల ఖోజాలు ఏ యెండకు ఆ గొడుగు పట్టడం నేర్చుకున్నారు.

## దశావతార్ అనే మత గ్రంథం

ఈ ఖోజాలు షియ్యామతస్థులతో తాము షియాల మంటారు. సున్నీ మతస్థులతో తాము సున్నీలమంటారు. అయితే వారికి ఈ షియామత మంటేనే తెలియదు. సున్నీ మతమంటేనూ తెలియదు. వారికి స్వభాష అయిన కచ్ఛిభాషలో గాని, వ్యాపారం కోసం నేర్చుకునే గుజరాతీ భాషలోగాని ఖురాను తర్జుమాలేదు. ఈ ఖోజాలుండే గుజరాతు దేశాన్ని చాలాకాలం తురక రాజులు పరిపాలించినా ఖొరాను దేశ భాషలోకి పరివర్తనం కాకపోవడం ఆశ్చర్యమే. ఈ ఖోజాలలో అరబ్బీ, పారశీభాషలు వచ్చిన వారెవ్వరూ లేరు, మహమ్మదీయ మతాన్ని గురించి చెప్పగల విద్వాంసులున్నూ లేరు. వారికి తెలిసిన మతగ్రంథం ఒకటే. అది కచ్ఛిభాషలో సింధీలిపిలో వ్రాయబడిన 'దశావతార'మనే పుస్తకం, ఇదే వారి మతగ్రంథం.

ఖోజాలందరూ దీనిని పూజిస్తారు. అవసానకాలంలో చదివి వినిపించుకుంటారు. హిందూ దేశములోనూ ఖోజాలు వ్యాపారం చేసుకొని జీవించే ఆఫ్రికా తీరమున జాంజిబారులోను, మస్కట్ మొదలైన ప్రాంతాలలోనూ, బొంబాయిలోనూ, జమాత్ఖానా అనే ఖోజా మతసభలోనూ ఈ దశావతారమనే గ్రంథాన్ని పురాణంలాగ చదివిస్తారని 1850లోనే ఒక వ్యాజ్యంలో స్థాపించబడింది.

## ఈ దశావతారం అనే గ్రంథంలో ఏముందో తెలుసునా?

దాని పేరునుబట్టి అందులోని విషయం స్ఫురిస్తూనే వుంది. అది పది ప్రకరణాల గ్రంథం. ప్రతి ప్రకరణంలోనూ ఒక అవతారాన్ని గురించి యుంటుంది. మొదటి తొమ్మిది ప్రకరణాలలోనూ హిందువుల త్రిమూర్తులలో ఒకడైన విష్ణుమూర్తి యొక్క తొమ్మిది

అవతారాలను గురించీ వర్ణించబడింది. పదియవ ప్రకరణములో పరమపూజ్యుడైన అలీ యొక్క అవతారాన్ని గురించి వ్రాయబడింది.

ఖోజాజమాత్ ఖానాలలో ఈ గ్రంథాన్ని చదివేటప్పుడు ఖోజాలందరూ ఈ పదియవ ప్రకరణాన్ని అతిభక్తితో వింటారు. ఈ ప్రకరణం మొదలుపెట్టగానే సభవారంతా లేచి అది పూర్తిఅయ్యేవరకూ అలాగే నుంచుంటారు. పరమపూజ్యుడైన మౌలా అలీ నామం ఉచ్ఛరించినప్పుడల్లా అతిభక్తితో ప్రణమిల్లుతూ వుంటారు.

ఇలాగ మౌలా అలీ దశావతారాలలో ఒక అవతారమైనాడు.



# 5. జగద్గురు తత్త్వబోధకస్వామి

## (రాబర్టో డీ నోబిలీ అనే క్రైస్తవ ఫాదరీ చరిత్ర)

దక్షిణ దేశాన్నంతా ఏకఛత్రంగా పరిపాలించిన విద్యానగర చక్రవర్తులలో కడపటి వాడు 1585-1614 మధ్య రాజ్యంచేసిన వెంకటపతి దేవరాయ మహారాయలు. ఆయన కొన్నాళ్ళు పెనుగొండను, తరువాత చంద్రగిరిని రాజధానిగా చేసుకుని దేశపరిపాలన చేశాడు. ఆయన రాజ్యం కృష్ణానదికి దక్షిణాన కన్యాకుమారివరకు వ్యాపించి యుండేది. శ్రీరంగపట్నంలో ఆయన తమ్ముడి కుమారుడే రాజప్రతినిధిగా వుండి మైసూరు, కర్నాటక రాజ్యాలను పరిపాలించేవాడు. 1612లో రాజ ఒడయరు మైసూరుకు పరిపాలకుడైనాడు. బేదనూరు లేక ఇక్కేరిలో ఒక సామంత మండలేశ్వరుదుండేవాడు. ఇలాగే దక్షిణదేశంలో తుండీరానికి జింజిలోను, పాండ్యానికి మధురలోను, చోళదేశానికి తంజావూరులోను, సామంత మండలేశ్వరులు ఉండి పరిపాలించేవారు.

విజయనగర సామ్రాజ్యము నేలిన చక్రవర్తులు తెలుగువారే అయినందువల్లను, వారి కాలంలో వివిధ ప్రాంతాలను వరిపాలించిన రాజప్రతినిధులు, సామంత మండలేశ్వరులు రాజబంధువులుగానో, తెలుగు నాయకులుగానో ఉంటూ ఉన్నందువల్లను దేశ ప్రభుత్వమంతా తెలుగువారి చేతులలోనే ఉండి కన్యాకుమారివరకూ గల దక్షిణ దేశమంతా తెలుగుమయంగా ఉండేది. ఆ కాలంలో ఈ దేశంలో ఉండిన పాశ్చాత్యులు చాలామంది ఈ సంగతిని గురించి వ్రాసియున్నారు.

విజయనగర సామ్రాజ్యం బలహీనమైనకొద్ది సామంత మండలేశ్వరులు బలవంతులై, కొంతకాలమునకు సామంత రాజులై, తరువాత స్వతంత్రులైనారు. తంజావూరు, మధురల నేలిన నాయకరాజులు చోళ పాండ్యరాజులని ప్రసిద్ధి చెందారు. వీరుకూడా విద్యానగర ప్రభువులలాగనే తెలుగుకవులను, గాయకులను, పండితులను పోషించి ప్రజానురంజకంగా దేశాన్ని పరిపాలించారు. వీరి కాలంలో సంగీత సాహిత్యాలు, కళలు సర్వతోముఖంగా అభివృద్ధి చెంది ఇప్పటికీ వారి కీర్తిని వేనోళ్ళ చాటుతున్నవి.

వెంకటపతి దేవరాయలకాలంనాటికి కుమార కృష్ణప్ప నాయకుడనే లింగనాయకుడు మధురకు సామంత మండలేశ్వరుడుగా ఉండేవాడు. అతడు 1602లో చనిపోగా అయన కుమారుడు ముద్దుకృష్ణప్ప నాయకుడు 1609 వరకూ పరిపాలించాడు. తరువాత ముద్దువీరప్పనాయకుడు 1623 వరకూ పరిపాలించాడు. వీరప్పనాయకుడి కాలంలో వెంకటపతి దేవరాయలు చనిపోగా వీరప్పనాయకుడు మధురకు స్వతంత్ర రాజైనాడు. అయన తరువాత తిరుమలనాయకుడని ప్రసిద్ధి చెందిన "మహారాజమాన్య రాజశ్రీ తిరుమలశౌరి అయ్యలుగారు" 1623లో మధుర రాజ్యానికి పట్టాభిషిక్తుడై 1659 వరకూ పరిపాలించాడు.

## పోర్చుగీసువారు - క్రైస్తవమత ప్రచారము

మనదేశానికి వర్తకం చెయ్యడానికి మొట్టమొదట వచ్చిన ఐరోపాజాతివారు పోర్చుగీసువారు. వీరు మన దేశ రాజులను, వారి సామంతులను ఆశ్రయించి పశ్చిమ సముద్ర తీరంలో అక్కడక్కడ కొన్ని వర్తకస్థానాలను ఏర్పరచుకున్నారు. వర్తకులతోపాటు రోమను క్యాథలిక్కు శాఖకు చెందిన జెస్యూటులనే పోర్చుగీసు క్రైస్తవ మిషనరీలు కూడా ఇక్కడికి వచ్చి మతప్రచారం చెయ్యడం ప్రారంభించారు* వింతదుస్తులు ధరించి, గొడ్డుమాంసం తింటూ, మద్యపానం చేస్తూ, కులభేదాలు పాటింపక మాల మాదిగలతో కలిసి మెలసి తిరిగే ఈ విజాతీయులనూ, వీరిలాగ ఉండేవారినీ మనవాళ్ళు 'పరంగీ'లని అనేవారు. పోర్చుగీసువారు ఎక్కువగా ఈ దేశంలో సముద్రతీరాన్ని ఉండే పరవరులనే పల్లెకారులలో క్రైస్తవమత ప్రచారం చేశారు. ఈ పరంగీలకూ, దేశీయ స్త్రీలకూ పుట్టిన సంకరజాతి ఒకటి త్వరలోనే బయలుదేరింది.

వెంకటపతి దేవరాయ మహారాయల కాలంనాటికి విజయనగర సామ్రాజ్యములో చాలాచోట్ల పోర్చుగీసువారు స్థిరపడ్డారు. మన దేశరాజులు మొదటినుంచి సర్వమతాల వారిని సమానంగా చూసే సహనబుద్ధి కలవారుగనుక రాయలవారు పోర్చుగీసువారి క్రైస్తవ మత ప్రచారానికి ఆటంకాలు కలిగించకపోవడమేగాక వారి క్రైస్తవ మత ప్రచారకులైన జెస్యూటు మిషనరీ ఫాదరీలను ఆదరించి గౌరవించేవారు. క్రైస్తవ దేవాలయాలు కట్టుకోడానికి, పాఠశాలలు స్థాపించడానికి, మతప్రచారం చెయ్యడానికి అనుజ్ఞనిచ్చేవారు.

---

* జెస్యూటు మిషనరీలు - సొసైటీ ఆఫ్ జీసస్ అనే రోమను క్యాథలిక్కు క్రైస్తవమత ప్రచారక సంఘానికి చెందిన సన్యాసులు. వీరిని మన దేశీయులు 'ఫాదరీ'లనేవారు. ఈ సంఘము 1639లో స్థాపించబడి పోర్చుగల్లు స్పెయిను రాజ్యముల ఆధ్వర్యం క్రింద దేశదేశాలలో క్రైస్తవ సన్యాసుల మఠాలను స్థాపించి అతి తీవ్రమైన మతప్రచారం సాగించింది. ఈ సంఘంలో చేరిన జెస్యూటు మిషనరీలు కొంతకాలం నియమంగా మతవిద్యనభ్యసించి, కాంతాకనకములను వర్జించి, బ్రహ్మచర్యవ్రత మవలంబించి, క్రైస్తవమత ధర్మాలను త్రికరణశుద్ధిగా నాచరించే దీక్షను వహించి సన్యాసాశ్రమం స్వీకరించేవారు. ఇటలీ దేశంలో రోమను నగరంలోనున్న క్రైస్తవమత జగద్గురువైన 'పోపు' గారి అధికారానికి లోబడి ఈ జెస్యూటుల మఠాలు పనిచేసేవి. క్రైస్తవ సంఘంలోని ప్రొటెస్టెంటులు పోపుగారి అధికారాన్ని ధిక్కరించినప్పుడు ఈ జెస్యూటులు పోపుగారికి కుడిభుజంగా నిలిచి పనిచేశారు. ఈ సంఘమువారు బలవంతులై క్రమక్రమంగా లౌకిక వ్యవహారాలలోనూ, రాజకీయాలలోనూ పాల్గొంటూ ధనసంపాదనకోసం వర్తక వ్యాపారాలలో ప్రవేశించినందువల్ల ఈ సంఘములో కొన్ని దురాచారాలు ప్రబలినవి. మత ప్రచారంలో వీరు కొన్ని అన్యాయ పద్ధతులు కూడా అవలంబించారు.

మన దక్షిణ హిందూదేశంలో పడమటి సముద్రతీరాన్ని పోర్చుగీసు వర్తకుల రేవుపట్టణమైన గోవానగరంలో జెస్యూటుమఠం ఒకటి 1542లో స్థాపించబడగా ఇక్కడ మతప్రచారం ప్రారంభమైంది.

చోళమండలంలో సముద్రతీరాన్ని ఉండే పరవరులనే పల్లెకారిజనంలో చాలా మందిని పోర్చుగీసు క్రైస్తవమత ప్రచారకులు రోమను కాథలిక్కుమతంలో కలిపినందువల్ల వాళ్ళ క్షేమంకోసం పోర్చుగీసు క్రైస్తవ మతాధికారులొక మిషనరీ ఫాదరీని నియమించారు. ఇందుకోసం నియమింపబడిన జెస్యూటు క్రైస్తవమిషనరీ అయిన 'గొంజాలో ఫెర్నాండెజ్' అనే ఫాదరీ 1569 లో మధురానగరానికి వచ్చి అక్కడ తననివాసం ఏర్పరచుకున్నాడు. అప్పుడు మధురరాజ్యాన్ని పరిపాలించే సామంతమండలేశ్వరుడైన కుమార కృష్ణప్ప నాయకుడు ఆ ఫాదరీని ఆదరించి మధురలో ఒక క్రైస్తవ దేవాలయం కట్టుకోవడానికి అనుజ్ఞ నిచ్చాడు. ఇలాగ పాండ్య రాజధానిలో క్రైస్తవ మత ప్రచారం చెయ్యడానికి అవకాశం ఒకటి ఏర్పడింది. ఫెర్నాండెజ్ ప్రజలతో కలిసిమెలిసి తిరిగేవాడు. ఏదో ఒక సందర్భంలో ఏసుక్రీస్తును గురించి చెప్తుతూ ఉండేవాడు. ఆయన మంచితనమూ, సద్గుణములూ, బ్రహ్మచర్యవ్రతమూ చాలామందిని ఆకర్షించినవి. చాలామందికి ఆయనపైన సదభిప్రాయం కలిగింది. అంతట ఆయన సంగతి తెలుసుకుందామనీ, ఆయన క్రొత్తమతం సంగతి తెలుసుకుందామనీ కుతూహలంతో కొందరు బ్రాహ్మణులు కూడా ఆయనదగ్గరకు వచ్చి మాట్లాడుతూ ఉండేవారు. ఆయన యింటిదగ్గర మతధర్మాలను గురించిన శాస్త్రచర్చలు తరచుగా జరుగుతూఉండేవి. ఈ జెస్యూటు మతప్రచారకుడు త్వరలోనే ఒక ఆసుపత్రిని స్థాపించి అక్కడ క్రైస్తవులకే గాక ఇతరులకు కూడా మంచి మందులిచ్చి చికిత్సలు చేసేవాడు.

## ఉత్తరాది తెలుగు జనము

అప్పట్లో మధుర రాజ్యములో అన్ని వర్గాలలోను తెలుగువారు చాలామంది ఉండేవారు. అక్కడ స్థిరనివాసం ఏర్పరచుకున్న తెలుగువారిలో వివిధ కులాల శూద్రజనాన్ని అరవవారు 'వడుకరు'లు అనగా 'ఉత్తరాదివా'ళ్ళని వ్యవహరించేవారు. ఇందులో రెడ్లు, కమ్మవారు, గొల్లలు మొదలైన కులాలవారుండేవారు. ఆ కాలంలో మన తెలుగువారు ప్రతి విషయంలోనూ అరవలకన్న చొరవకలవారుగా వుండేవారు. వీరు ఈ ఫాదరీతో ఎక్కువ స్నేహంగా ఉండి ఆయనను గౌరవించేవారు.

ఈ ఉత్తరాదిజనాన్ని క్రైస్తవమతంలో కలపాలని ఫెర్నాండెజ్ గారు విశ్వప్రయత్నాలు చేశారు. ఏసుక్రీస్తును గురించీ, క్రైస్తవమతధర్మాలనుగురించీ అతడు ఎన్ని విధాలు గానో వారికి బోధచేస్తూ వుండేవాడు. కాని ప్రయోజనం లేకపోయింది. ఈ ఫాదరీగారు ఎంత మంచివాడైనా గొడ్డు మాంసం తిని, మద్యపానంచేస్తూ మాల మాదిగలతో కలిసి మెలిసి తిరిగే పరంగిజాతివాడనిన్నీ, అందువల్ల మతంలో కలిస్తే కులభ్రష్టులమై పోతామనిన్నీ భయపడి ఎవరూ క్రైస్తవమతంలో కలవలేదు.

కుమార కృష్ణప్ప నాయకుడి తరువాత మధుర రాజ్యాన్ని పరిపాలించిన ముద్దుకృష్ణప్ప నాయకుడుకూడా క్రైస్తవమత ప్రచారకులతో స్నేహంగానే వుండేవాడు. ఇది విని పోర్చుగలు దేశపు రాజుకూడా సంతోషించినట్లు ఉత్తర ప్రత్యుత్తరాలవల్ల కనబడుతూఉంది. ఇలాగ 12 సంవత్సరాలు ఫెర్నాండెజ్ ఎంత కష్టపడినా క్రైస్తవమతం వ్యాపించలేదు.

## రాబర్టో డీ నోబిలీ

ఈ పరిస్థితులలో రాబర్టో డీ నోబిలీ అనే క్రైస్తవ మతప్రచారకుడు 1606లో మధురానగరికి వచ్చాడు. నోబిలీ ఇటలీదేశంలో మాంటీ పుల్సియానో అనే గ్రామంలో క్రైస్తవ మతగురువులైన పోపులకు బంధువులైన ఒక గొప్ప కుటుంబంలో 1577లో జన్మించాడు. అతడు చిన్నప్పటినుంచీ తెలివైనవాడు. తన పదవయేటనే ఐరోపాదేశపు సంస్కృత భాషలనదగిన గ్రీకు, లాటినులను ధారాళంగా మాట్లాడేవాడు. నోబిలీ ఇక్కడికి రాగానే క్రైస్తవమత ప్రచారం ఎందుకు బాగా జరగడంలేదని పరిశోధన చేశాడు. హిందూ దేశ సముద్రతీరాన ఉన్న కొన్ని రేవుపట్నాలు పోర్చుగీసువారి స్వాధీనంలో ఉన్నా, పోర్చుగీసు క్రైస్తవమత ప్రచారకులు హిందూదేశంలోని లోపలి భాగాలలోకి పోయి ప్రజలతో కలిసిమెలిసి వుండనందువల్ల మతప్రచారం సాగడం లేదని నోబిలీ గ్రహించాడు. 1607 డిశంబరు 3వ తేదీన నోబిలీ తన దేశానికి వ్రాసిన ఈ వుత్తరంవల్ల ఆయన అభిప్రాయాలు తెలుస్తున్నవి :

"మధుర ఈ రాజ్యానికి రాజధాని నగరము. ధనవంతులూ, యుద్ధములందు ధైర్యవంతులూ అయిన ప్రజలతో క్రిక్కిరిసిఉన్నది. కాని ఈ ప్రజలకు అసలు ఈశ్వరుని సంగతి తెలియదు. వారు కేవలము విగ్రహారాధకులు. మన క్రైస్తవ మత ప్రచారకులు 17 సంవత్సరాలనుంచి ఇక్కడ వుండి పనిచేస్తూ ఉన్నా దేశీయులలో తమ అవసానకాలానికి ముందు క్రైస్తవులైన ముగ్గురు నలుగురు తప్ప ఒక్కడైనా మన మతం స్వీకరించలేదు. ఇలాగని మన మతప్రచారకులు అసమర్థులుకారు. వారు చాలా సమర్థులు. సద్ధర్ములు."

పూర్వకాలము నాటి రోమునగరంలోని విగ్రహారాధనమువంటి విగ్రహారాధనమే ఈ మధురలో ఇప్పుడున్నదని నోబిలీ ఇంకొక ఉత్తరంలో వ్రాశాడు.

## క్రైస్తవమతం ఎందుకు వ్యాపించటంలేదు?

ఫెర్నాండెజ్ కృతకృత్యుడు కాకపోవడానికి గల కారణాలను నోబిలీ కనిపెట్టాడు. "రోము నగరంలో ఉన్నప్పుడు ఆ నగరవాసుల లాగనే ప్రవర్తించాలి" అనే సామెతప్రకారం క్రైస్తవమత ప్రచారకుడు తాను నివసిస్తూ ఉన్న దేశాచార వ్యవహారాలను గమనించి ఆ ప్రకారమే తానుకూడా ప్రవర్తిస్తేనే తప్ప లాభం లేదనిన్ని, అలా ప్రవర్తించక పోవడమేగాక హిందూదేశాచారాలయందు అగౌరవము కలిగించేటట్లు ప్రవర్తించడంవల్ల ప్రజలకు అనుమానము, అవిశ్వాసముకలిగి, వారు క్రైస్తవమతం దరికి చేరకున్నారనిన్ని నోబిలీ కనిపెట్టాడు. అప్పటి విజయనగర చక్రవర్తియైన రెండవ వెంకటపతి దేవరాయ మహారాయల ఆస్థానంలో వుంటూఉన్న అంటోనియో లూబినో అనే ఒక క్రైస్తవ పాదరీ కూడా ఇలాగే అభిప్రాయపడ్డాడు. ఈ లూబినో ఒక ఉత్తరంలో ఇలాగ వ్రాశాడు :

"మనము గొడ్డుమాంసము తిని మద్యపానముచేసే పోర్చుగీసుజాతివారమనే కారణంవల్ల ప్రజలకు మనయందు అసహ్యభావం కలిగియున్నది. అందువల్లనే మన మతానికి వారిని చేర్చే ద్వారములు మూయబడినవి. మనమీరాజ్యములో మద్య, మాంసములను విసర్జించినా మనవల్ల వారికి విరోధము, అసహ్యము కలగడానికి మన

నల్లని దుస్తులే చాలు. అందువల్ల మనలను వారొక మహమ్మారిని చూసినట్లు చూస్తారు. మనము పోర్చుగీసుదేశం నుంచి వచ్చిన క్రైస్తవ మత ప్రచారకులమనే సంగతి వాళ్ళమనసులో బాగా నాటుకొని ఉన్నది. అందువల్ల మన కృషిలో ఫలితం కలగాలంటే ముందుగా మనం ధరించే దుస్తులను మార్చుకోవాలి. తినే తిండిని మార్చుకోవాలి. వీలైనంతవరకూ వారు అవలంబించే అచారాలను మనంకూడా అవలంబించాలి. రాష్ట్రీయ క్రైస్తవ మతాధికారి (Father Provincial)కి ఈ సంగతిని గురించి నేను చాలాసార్లు వ్రాశాను. హిందువులు వేసుకునే దుస్తులు ధరింపజేసి, నన్ను ఎవ్వరూ ఎరగని వూరికి పంపించాలని ఆయన అనుకుంటున్నాడు."

## 'పరంగీలు'

క్రైస్తవమత ప్రచారం బాగా జరగకపోవడానికి ఇంకొక కారణంకూడా యున్నది. క్రైస్తవులైన దేశీయ పరవరులను, వారి మతప్రచారకులను పరంగీలని దేశీయులనేవారు. దీని నిజమైన అర్థం ఎరుగకపోవడంవల్ల క్రైస్తవ మిషనరీలు ఆ పేరును స్వీకరించేవారు. ఈ 'పరంగీ' అనే పదాన్ని ప్రజలందరూ చాలానీచమైన అర్థంలో ఉపయోగిస్తూ పరంగీల మతాన్ని కూడా నీచంగా చూసేవారు. నోబిలి జాగ్రత్తగా విచారించగా దీని కారణం తెలిసింది. "పరంగి అనే మాటను పోర్చుగీసువారనిగాని, ఐరోపాదేశీయులనిగాని, క్రైస్తవులనిగాని అనే అర్థంలో ప్రజలు వాడడంలేదు. ప్రజలకు వీరిసంగతి తెలియనే తెలియదు. 'పరంగీ' అంటే నీతి ధర్మాలు గాని, మానమర్యాదలు గాని లేక త్రాగుబోతులుగా వుండి అసహ్యకరమైన జంతువుల మాంసాలనూ, తుదకు మనుష్య మాంసాలనూకూడా పీక్కుతింటూ శాస్త్ర మతధర్మాలులేని పశుప్రాయులైన నీచమానవులని ఆ మాటకు అర్థం."

"ప్రతిభాశాలురైన పోర్చుగీసుజాతివారి నెవ్వరినీ హిందువులు చూచివుండలేదు. ఇక్కడనుండే వారు రెండు రకాలవారుగా వుంటారు. కొందరు ఇక్కడనే పుట్టిపెరిగి పోర్చుగీసు రక్తస్పర్శ అవంతయైనా లేకపోయినప్పటికీ నాలుగు పోర్చుగీసు ముక్కలు నోటికి రాగానే తమ అసలు జాతిలోనుంచి బైటపడి పోర్చుగీసువారి మైతి మనుకునే వారు. వీరిని పోర్చుగీసువారు 'టోపాజు' సంకరజాతి వాళ్ళని అంటారు. హిందూ దేశీయులు వీరిని పరంగీలంటారు. తెల్లవారైనా, నల్లవారైనా పోర్చుగీసువాళ్ళలాగ దుస్తులు ధరించే నల్లవాళ్ళ నందరిని పరంగీలనడం అలవాటయింది. ఇంక ఇక్కడకు వచ్చే ఇంకొకరకం మనుష్యులు పుట్టుకవల్ల యూదులైవుండిన్నీ పోర్చుగీసువారితో ఏర్పాటుచేసుకొని వర్తక వ్యవహారాలమీద యిక్కడికి వచ్చేవారు. వీరిని కూడా మధురా పట్టణవాసులు పరంగీలంటారు. ఈ రెండురకాల వారితో ఏమాత్రం సంపర్కంగలవారికైనా వీరి కులము, శీలము, విశ్వాసపాత్రత, శుభ్రత ఎలాంటివో బాగా తెలిసిన విషయాలేకదా! అందువల్ల 'పరంగీ' అనేమాట నీచంగా వాడబడటంలో ఆశ్చర్యమేముంది?" అని నోబిలీ వ్రాశాడు.

## 'పద్ధతి మార్చాలి'

పైన చెప్పిన సంగతి సందర్భాలన్నీ యోజించిన మీదట హిందువులను క్రీస్తుమత ధర్మాలవైపునకు ఆకర్షించాలంటే ముందుగా మిషనరీలు తమ జీవిత విధానాన్నీ, అచారాలనూ, పద్ధతినీ మార్చుకోవలసి ఉన్నదనే సంగతి స్థిరపడివుంది.

రాబర్టో డీ నోబిలీ తన ఉద్దేశ్యాలను ఆచరణలో పెట్టేటందుకు ముందు పైవారితో ఆలోచించాడు. రాష్ట్రీయ మతాధికారియైన లెయిర్షియో, నోబిలీ వేసిన పథకాన్ని మనస్ఫూర్తిగా అంగీకరించాడు. ఆయన పై యధికారియైన క్రాంగనూరు అర్చిబిషప్పు ఫ్రాన్సిస్కోరోస్ గారితో కూడా నోబిలీగారు ఆలోచించి వారి అంగీకారాన్నీ పొందినాడు. ఇద్దరూ కలిసి ఒక కార్యాచరణపద్ధతిని నిర్ణయించారు. అర్చి బిషప్పుగారు కూడ హిందువుల విగ్రహారాధనను గురించీ, మతధర్మాలను గురించీ వ్రాయబడిన పుస్తకాలను కొన్నింటిని ముందుగా చదివారు. తరువాత మలబారుతీరాన్ని ఉన్న రోమను క్యాథలిక్కు క్రైస్తవమత ప్రచారకులలో ప్రజ్ఞావంతులైన విద్వాంసులతోను, పోర్చుగల్లు దేశంలో ఉన్న మతాచార్యులతోనూ కూడా ఆలోచించారు. అందరూ కూడా వీరి అభిప్రాయాలతో ఏకీభవించారు. అందువల్ల ఈ అర్చి బిషప్పుగారు కూడా నోబిలీగారికి ఈ విషయంలో తమ అంగీకారమును తెలిపారు.

బ్రాహ్మణులు ధరించే శిఖాయజ్ఞోపవీతములు అనగా జుట్టుముడిన్నీ, జందెములున్నూ, వారు పెట్టుకునే గంధాక్షతల బొట్టున్నూ, వారు అవలంబించే ఇతరాచారాలున్నూ వారి మతసంప్రదాయాలకు సంబంధించిన చిహ్నాలు కావనిన్నీ, అవి కేవలము వారు ఉత్తమవంశజులనిన్నీ, ఉన్నతకులం వారనిన్నీ చూపడానికి యేర్పడిన బాహ్యాచిహ్నాలనిన్నీ, అందువల్ల క్రైస్తవమతంలో కలిసిన హిందువులు తమతమ కులాచారాలకు సంబంధించిన జుట్టు, కట్టు, బొట్టు మొదలయిన బాహ్యాచిహ్నాలను యేలాంటి అభ్యంతరమూ లేకుండా వుంచుకోవచ్చు ననిన్నీ క్రైస్తవ మతాచార్యులు ఆఖరికి ఒక నిశ్చయానికి వచ్చారు. ఈ సంగతులన్నీ 1609 లోను, 1613 లోను రాష్ట్రీయ క్రైస్తవ మతాధికారికిన్నీ, క్రాంగనూరు అర్చిబిషప్పుగారికిన్నీ జరిగిన ఉత్తర ప్రత్యుత్తరాలవల్ల కనబడుతున్నవి.

## జగద్గురు 'తత్త్వబోధకస్వామి'

నోబిలీ మధురానగరానికి వచ్చిన ఒక సంవత్సరానికి 1607లో తన సోదర క్రైస్తవ మిషనరీ ఫాదరీ అయిన ఫెర్నాండెజ్‌తో సంబంధం లేకుండా తానొక క్రొత్త పంథాత్రొక్కి ఒక నూతన జీవితవిధానాన్ని ప్రారంభించాడు. ఇతడు మధురానగరంలోని బ్రాహ్మణుల దగ్గరికి వెళ్ళి తాను పరంగినని కాననిన్నీ, పోర్చుగీసు జాతివాడనుకూడా కాననిన్నీ, ఇటలీదేశానికి మకుటాయమానంగా వుండి ఒక పురాతన నాగరిక సామ్రాజ్యానికి రాజధానియైన రోము నగరంలో ఒక ఉత్తమ రాజవంశానికి చెందిన రాజకుమారుడనని‌న్నీ, తనకీ ప్రపంచముమీద రోతపుట్టి వైరాగ్యంకలిగి సన్యసించితినని‌న్నీ చెప్పి ఒక సన్యాసిలాగనే జీవించడం ప్రారంభించాడు. ఆక్షణం నుంచి శూద్రసేవకుల నెవ్వరినీ తన దగ్గరికి రానివ్వక తన పరిచర్యల నిమిత్తం బ్రాహ్మణులనే నియోగించాడు. ఒక్కపూటమాత్రం ఇంత అన్నమూ, పాలూ, కూరగాయాలూ పుచ్చుకొని నియమంగా వుండేవాడు. బ్రాహ్మణ అగ్రహారంలో ఒక సంపన్నుని ఆశ్రయించి, కొంతస్థలం పుచ్చుకొని తనతోడి క్రైస్తవమత ప్రచారకుడితో సంబంధం లేకుండా అక్కడ ఒక పూరియిల్లు వేసుకొని అందులో నివసించడం ప్రారంభించాడు. ఈయింటిని మధురానగరాధికారే యిచ్చాడని ఫాదర్ గుఱెయిరో వ్రాశాడు.

"నోబిలీ బ్రాహ్మణ ఆచారాలన్నీ అవలంబించాడు. తన పరిచర్యల నిమిత్తం బ్రాహ్మణులనే నియోగించాడు. తాను రోమునగరాన్నుంచివచ్చిన ఒక ద్విజుడనని, సన్యాసినని చెపుతూ అందు కనుగుణ్యంగా ఈ దేశపు బ్రాహ్మణ సన్యాసులలాగానే ఐరోపా జాతివారితో గాని, అస్పృశ్యులతో గాని సంపర్కం లేకుండా ఏకాంతవాసం చెయ్యడం ప్రారంభించాడు" అని జాన్ డిబ్రిటో అనే క్రైస్తవమతాచార్యుడు వ్రాసియున్నాడు. త్వరలోనే ఈ నోబిలీ కేవలమూ ఒక బ్రాహ్మణవేదాంతిగా మారిపోయినాడని రాష్ట్రీయ క్రైస్తవ మతాధికారియైన ఫ్రాన్సిస్కోరోసుగారు అన్నారు. క్రైస్తవమత ప్రచారకుడైన ఫాదరు రాబర్టో డీ నోబిలీ అచిరకాలములోనే 'జగద్గురు తత్వబోధకస్వామి' అనే నూతన నామకరణంతో ప్రసిద్ధికెక్కాడు.

1607 డిశంబరు 1వ తేదీన కార్డినల్ బెల్లార్మిన్ గారికి నోబిలీ వ్రాసిన రహస్య లేఖలో అతడు ఇలాగ అన్నాడు. "ఇప్పుడు నేను చుట్టూ మట్టిగోడలుగల పూరిపాకలో వాసం చేస్తున్నాను. దివ్యసౌధంకంటె నాకిదే ఆనందకరంగా వుంది. ఈశ్వరసేవ కోసం ఈ విధంగా దేశాంతరంలో ఏకాంతవాసం చెయ్యడంలో వుండే మానసిక శాంతి ఇంకొక దానిలో లేదు. అయినా నేను పూనిన ఈ దీక్షలో వుండే శ్రమ ఒక్కొక్కప్పుడు చాలా బాధాకరంగా వుంటున్నది. నా యావజ్జీవమూ ఇలాగ శ్రమపడాలేమోననే ఆలోచనవల్ల చివరదాకా నిగ్రహించలేనేమోనని ఒక్కొక్కప్పుడు అధైర్యం కలుగుతూవుంటుంది. నా నిత్యజీవితం ఇలాగ జరుగుతూవుంది: ప్రొద్దున్ననుంచి సాయంత్రందాకా ఎక్కడికీ కదలకుండా నేను నా యింట్లోనే కాలక్షేపం చేస్తూవుంటాను. నాతో ఎవరైనా మాట్లాడడానికి గానీ, చర్చించడానికి గాని వస్తే నేను ఈశ్వరప్రార్థనము చేసిన తరువాత వాళ్ళకు దర్శనమిస్తాను. దేశీయులలో ప్రబలియున్న పొరబాటు మత సిద్ధాంతాలను ఖండిస్తూ దేశభాషలో వ్రాసేటందుకు మిగతా కొద్దికాలాన్ని వినియోగిస్తూవుంటాను. నేను ఎల్లప్పుడూ నాయింటిలోని చిన్న గదిలోనే కాలక్షేపం చేస్తూ ఉన్నందువల్లనూ, మాంసముగాని, కోడిగ్రుడ్లుగాని నా గడపలోకి రావడానికి వీలులేదని నేను నిషేధించినందువల్లను, నేను తినే ఆహారము నాకు తగినబలము నివ్వనందువల్లనూ, నాకు ఎప్పుడూ ఏదో జబ్బుగానే వుంటూవున్నది. నా కడుపులోనో, తలలోనో నొప్పిలేకుండా ఉన్న రోజులు బహుతక్కువ. నేను తినే ఆహారము వరి అన్నమూ, కూరగాయలూ, పళ్ళూను. నేను ఇవి తప్ప ఇంకొకటి తినకూడదు. ఈ దేశంలో తత్వబోధ చేసే మతాచార్యులూ, సన్యాసులూ ఇంకా కఠినమైన యమ నియమాలతో జీవిస్తారు. ఒక్క మెతుకు అన్నమైనా తిననివాళ్ళు గూడా ఉన్నారు. ఈ దేశం ప్రజలు నానురొట్టె తినడం ఎరుగనే ఎరుగరు. ఇక మద్యం అనగా సారాయమును 'మాస్' అనే క్రైస్తవ ప్రార్థన నిమిత్తం మాత్రమే నేను ఉపయోగిస్తున్నాను. అన్నంగూడా వర్జిస్తే ఇక మనిషి తినే ఆహారం ఎంత స్వల్పంగా వుంటుందో ఊహించండి. అన్నం వర్జించడానికి నేను సాహసించలేదు. ఇప్పుడు నేను పెట్టుకున్న నియమాలే - అనగా మాంసము, చేపలు, గ్రుడ్లు వర్జించడమే నేను నిజమైన మతాచార్యుడనని ప్రజలు అనుకునేటందుకు చాలును. ఈ వుత్తరం వ్రాస్తూవున్న సమయంలో నేను ఉబ్బసం, దగ్గువల్ల వూపిరి ఆడక బాధపడుతున్నాను. అందువల్ల దీనిని మెల్లమెల్లగా వ్రాస్తున్నాను."

నోబిలీ ఒక బ్రాహ్మణవంటవాడిని పెట్టుకున్నాడు. శూద్రుడిచేతి అన్నం తినడానికి సాహసించేవాడు కాదు. సన్యాసులందరిలాగనే అతడు మధ్యాహ్నం నాలుగు గంటలవేళ ఒంటిపూట భోజనం చేసేవాడు. దినమంతా అతడు దేశభాషలను చదవను వ్రాయను నేర్చుకునేవాడు. అతడు ఈ దేశానికి రాగానే కొచ్చినులోనే అరవం నేర్చుకోవడం ఆరంభించాడు. ఆరునెలలలో ఇతరులతో మాట్లాడేశక్తి సంపాదించాడు. రెండేళ్ళలో (1609లో) అతడు మళ్ళీ తన దేశానికి వ్రాస్తూ అరవంలో మాట్లాడడం కంటె ఇటాలియను పోర్చుగీసు భాషలలో మాట్లాడడమే ఇప్పుడు తనకు కష్టముగా ఉన్నదని వ్రాశాడు. ఈ అరవభాష చాలా గొప్పదనిన్నీ, అందమైన దనిన్నీ కూడా వ్రాశాడు. అతడు తమిళ గ్రంథకర్తలలో నుంచి పద్యాలు చదువుతూ, కథలు వుదాహరిస్తూ గ్రాంథికమైన అరవాన్ని చక్కగా మాట్లాడేవాడని 1608లో ఆయన తోడి మతాచార్యుడొకడు వ్రాశాడు.

అరవం బాగా వచ్చిన తరువాత నోబిలీ తెలుగును, సంస్కృతమును నేర్చుకోవడం ప్రారంభించాడు. ఇంతవరకూ తెల్లవారెవ్వరూ తెలుగు బాగా నేర్చుకోలేదు. మధుర వాస్తవ్యుడైన ఒక బ్రాహ్మణపండితుడు నోబిలీకి ఈ భాషలు నేర్పడానికి కుదిరాడు. 1609 ఏప్రిల్ 22వ తేదీన రాష్ట్రీయాధికారికి నోబిలీ వ్రాసిన ఉత్తరంలో తన పంతులవారిని గురించి ఇలాగ వ్రాశాడు: "ఈ సద్బ్రాహ్మణుడు నాకు చేసే ఉపకారానికి తగినట్లుగా నా కృతజ్ఞతను తెల్పజాలను. ఆయనవల్ల నేను సంస్కృతము, తెలుగు నేర్చుకోవడమేగాక అంతకన్న అమూల్యమైన విషయాలను ఆయనవల్ల తెలుసుకోగలిగాను. వేదాల రహస్యాలను ఆయన నాకు చెప్పాడు. వేదాలను వ్రాయడం మహాపాతకమని బ్రాహ్మణుల వూహ. దానిని ఎంతో కష్టపడి పదిపన్నెండేండ్లు పారము చెప్పించుకుని కంఠస్థము చేస్తారు. ఈ విషయంలో నా గురువు తన శంకలను మాని ఆ సూత్రాల నన్నింటినీ నాకోసం వ్రాసిపెట్టాడు. అయితే ఇది చాలా రహస్యంగా చెయ్యాలి. ఈ సంగతి ఇతర బ్రాహ్మణులకు తెలిస్తే వాళ్లు ఆయన గ్రుడ్లు పీకుతారు. ఇది నేర్పేటందుకు ప్రాణభయానికి కూడా తెగించాలి. ఎందువల్లనంటే హిందువులను క్రైస్తవమతంలో కలపాలంటే ఈ రహస్యాలు తెలియడం చాలా అవసరం." ఈ విద్యను అభ్యసించడంలో నోబిలీ అమితమైన పట్టుదలతో పనిచేశాడు. అఖరుకు క్షవరం చేయించుకుంటూ ఉన్నప్పుడు కూడా పాఠాలు చదువుతూనే వుండేవాడు.

1608 లో నోబిలీని గురించి ఒకడు వ్రాసినదానిలో ఇలావుంది. "అతడు సంస్కృతం నేర్చుకోవడం మొదలు పెట్టాడు. అప్పుడే అతడు ఆ భాషను చదవడమూ, మాట్లాడడమూ కొంతవరకు నేర్చుకొన్నాడు." రెండేళ్ళ తరువాత 1610 డిశంబరు 8వ తేదీన ఆ భాషను నోబిలీ బాగా అర్థం చేసుకోగలుగుతున్నాడనిన్నీ, ధారాళంగా మాట్లాడుతున్నాడనిన్నీ లెయిర్షియో వ్రాశాడు. నోబిలీ మూడు భాషలను బాగా నేర్చుకున్నాడనిన్నీ, వాటిలోని గుంటచిక్కులన్నీ కూడా నేర్చుకున్నాడనిన్నీ, మతాంతరులైన హిందూ దేశీయుల మతరహస్యాల నన్నిటినీ బాగా గ్రహించాడనిన్నీ రాష్ట్రీయాధికారియైన రోసుగారు 1613లో వ్రాశారు. ఆ భాషలను కొంతవరకు అభ్యసించిన అర్చి బిషప్పుగారు కూడా నోబిలీ యొక్క శక్తిసామర్థ్యాలనూ, పాండిత్యాన్నీ చూచి ఆశ్చర్యపడ్డారు.

## భేషజము - పటాటోపము

ఈ తత్వవేత్తచుట్టూ ప్రజలు గుమిగూడడం ప్రారంభమైనది. కొంద రీయనను గొప్పవాడని పొగడడం ప్రారంభించారు. ఆయనను చూడాలనీ, ఈయన చెప్పే సంగతులు వినాలనీ కొందరు ఈయన యింటికి పోవడం ప్రారంభించారు. "ఈ క్రొత్త స్వాములవారు ఎక్కడనుంచి వచ్చారు? ఇతనిది యేకులం? ఈయన సిద్ధాంతాలేమిటి? జీవిత విధానం ఎలాంటిది?" అనే సంగతులన్నీ తెలుసుకోవాలని మధురాపుర జనులలో చాలామందికి కుతూహలం కలిగింది. హిందూదేశపు స్వాముల వార్ల పద్ధతులను నోబిలీ బాగా ఎరిగినవాడైనందువల్ల మొదట తనయింటినుంచి బయటికి పోలేదు. చూడవచ్చినవారితో చాలా మితభాషణం జరిపేవాడు. నోబిలీని చూడడానికి ఎవరైనా వచ్చినప్పుడు "ఇప్పుడు సమయంకాదు, స్వాములవారు సమాధిలో ఉన్నా"రనిగాని, "నిష్ఠలో ఉన్నా"రనిగాని ఆయన శిష్యుడు చెప్పేవాడు. ప్రజలలో కుతూహలం అమితమైపోయినతరువాత చూడవచ్చినవారు ఒకటి రెండుసార్లు దర్శనంకోసం వచ్చి తిరిగిపోయిన తరువాత నోబిలీ దర్శనం ఇచ్చేవాడు. "'అయ్యరు' గారితో మాట్లాడడానికి వచ్చాము. చూడడానికి వీలౌతుందా?" అని వచ్చినవారు అడిగితే చాలా సేపటికి గాని దర్శనం ఇచ్చేవాడు కాదు. ఆఖరుకు వారిని లోపలికి రానిచ్చినప్పుడు జేగురురంగుగుడ్డ కప్పివున్న ఎత్తైన ఒక వేదికమీద ఆయన పద్మాసనం వేసుకొని కూర్చుండి వుండేవాడు. ఆయనముందు అలాంటి కాషాయరంగుబట్ట యింకొకటి వరచివుండేది. దానికి దగ్గరగా ఒక చావ వుండేది. ఆయనను చూడడానికి వచ్చినవారందరూ చేతులెత్తి ఆయనకు నమస్కరించాలని అక్కడివారు చెప్పేవారు. ఎంత గొప్పవారైనా, రాజోద్యోగులైనాకూడా ఆయనకు అలాగ నమస్కరించేవారు. ఆయనకు శిష్యులు కాదలచినవారు ఇలాగ మూడుసార్లు భక్తితో నమస్కరించి సాష్టాంగపడి మ్రొక్కేవారు. ఈ సంగతులను ఫిగోరా (Figuoroa) వ్రాశాడు.

ఈ ఐరోపా దేశపు స్వాములవారివల్ల కొన్ని సంగతులు వినాలని మధురరాజైన ముద్దు వీరప్పనాయకునికి కూడా కుతూహలం కలిగి తనదర్బారులో చాలాసార్లు అన్నాడట. అంతట నోబిలీని బాగా ఎరిగినవారొకరు ఈ సన్యాసి తనకు స్త్రీలముఖం కనబడుతుందేమో నని తన యిల్లు వదలి బయటకే రాడని అన్నారట! ఒక్కమాటైనా వీథిలో నడవకుండా ఇలాగ ఒక సంవత్సరంపాటు నోబిలీ కాలక్షేపం చేసేటప్పటికి ఆయనను గురించి ప్రజలకు గౌరవం కలిగింది. తరువాత ఎప్పుడైనా ఒక మాటు ఊరిబయట దూరంగా ఉన్న తన పెద్దయింటికి ఒక పల్లకీలో నెక్కి పోయేవాడు. అప్పుడు ఆయన పల్లకీముందు ప్రజలను తొలగమని కేకలువేస్తూ చోపుదార్లు పరుగెత్తేవారు. కొన్నాళ్ళ తరువాత నోబిలీ ఈ భేషజమంతా కట్టిపెట్టి సామాన్య స్వాములవారిలాగానే ఒక కాషాయాంబరం ధరించి ఒక పెద్ద పొడుగుపాటి దండము చేతపుచ్చుకొని ఇద్దరు బ్రాహ్మణ శిష్యులు వెంటరాగా కాలినడకనే బయలుదేరాడు.

మొట్టమొదట ఇలాంటి భేషజము చూపించాలని నోబిలీ అనుకోలేదటగాని మాటల సందర్భంలో ఒక శైవ 'పండారము' ఆయనకు ఇలాగ సలహా ఇచ్చాడట: "కేవలమూ మీమట్టుకు మీరు తరించాలంటే మీ రేమారుమూల ప్రదేశానికో పోయి దిగంబరిగా

వుండవచ్చును. కాని ఇతరులను తరింపజెయ్యాలని మీ ఉద్దేశ్యమని మీరంటున్నారు. కనుక మీరు పటాటోపం కనబరచితీరాలి. నిజమైన విరాగి పట్టుపీతాంబరాలనూ గుడ్డపీలికలనూ, భాగ్యభోగ్యాలనూ, దారిద్ర్యమునూ, మానావమానాలనూ ఒక శవము వహించేటట్లుగా నిర్లిప్తతతో భరించాలి" అని అన్నాడట.

ఆ పండారము ఈ సలహా నిచ్చినది 1608వ సంవత్సరము మధ్యలోనట. అంతకుపూర్వము నోబిలీ యింకా పోర్చుగీసు మతాచార్యుల నల్లదుస్తులనే ధరించేవాడట. 'నలుపు' అనే తెలుగు వారికిది చాలా అసహ్యకరంగా ఉన్నదనిన్నీ, దీనిని తీసివేసి ఈ దేశంలో మతగురువులు, స్వాములు ధరించే దుస్తులనే మీరుకూడా ధరించవలసినదనిన్నీ ఆ తమిళ శైవుడు ఆయనకు గట్టిగా చెప్పాడట. మీరు మాత్రం తరించాలంటే మీ ఇష్టంవచ్చిన దుస్తులు వేసుకొనవచ్చును. గాని మీరు ఇతరులకు ముక్తిమార్గాన్ని బోధించదలచుకుని శిష్యులను ఆకర్షించదలచుకుంటే మీరు సాధ్యమైనంత వరకు ఈ దేశాచారాలను అవలంబించాలని కూడా అతడు అన్నాడట. అంతట నోబిలీ ఒక స్వాములవారిలాగ తయారైనాడు.

లెయిర్టియోగారి వుత్తరంలో నోబిలీ దుస్తులవర్ణన కనబడుతూవుంది. ఆయన ఒక పొడుగైన కాషాయపు టంగీని ధరించి ఒక కాషాయపు ఉత్తరీయాన్ని కప్పుకునేవాడు. ఆ రంగుగుడ్డతోనే తల కొక తలపాగాను చుట్టుకునేవాడు. కాళ్ళకు పావకోళ్ళు తొడుగు కునేవాడు. ఇంతేకాదు, ఈ దేశంలో బ్రాహ్మణులూ, క్షత్రియులూ ఉపనయనంలో ధరించే ఉత్తరజందెములవంటివి మూడు బంగారు పోగులూ, రెండు వెండిపోగులూ గల ఉత్తర జందెములను వేసుకొని వాటిమధ్య మెడలో ఒక శిలువను కూడా ధరించేవాడు. దీనికి క్రైస్తవమతానికి సంబంధించిన ఒక అంతరార్థం వున్నదని అనేవాడు. కొన్నాళ్ళయిన తరువాత జగద్గురువు ఇలాంటి జందెము వేసుకోనక్కరలేదని నోబిలీ దానిని విసర్జించాడు.

## విచిత్ర వేదాంతము

నోబిలీ చేసే మతబోధ, ప్రచారములు చాలా చిత్రంగా వుండేవి. హిందువుల మత గ్రంథాలలోని కథలలోను, సిద్ధాంతాలలోను తన కుపయోగించే సంగతులు తీసికొని వాటిని బట్టి మతబోధ చేసేవాడు. ఈ హిందూ దేశీయులకు నాలుగు వేదములున్నవనిన్నీ, అందులో ఒకటి పోయినదనిన్నీ నోబిలీ విన్నాడు. ఇప్పుడున్న వేదాలలో బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులనుగూర్చి చెప్పబడిన దనిన్నీ, నాల్గవదానిలో కేవలమూ మోక్షమార్గమే వివరింపబడినదనిన్నీ కేవలము ఇప్పుడున్న వేదాలవల్ల తరించలేరనిన్నీ, ఆ నాలుగవ వేదమును ఉద్ధరించగల బుద్ధిమంతు డెప్పుడూ లేడని కొందరు అనుకుంటున్నారనిన్నీ విన్నాడు. ఈ ప్రజలు మోక్షమార్గమును వాంఛిస్తారు. అవచారాలకు ప్రాయశ్చిత్తాలను చేసుకుంటారు. దానధర్మాలు చేస్తారు. తమ విగ్రహాలకు అతిభక్తి విశ్వాసాలతో మ్రొక్కుతారు. అందువల్ల వీరి నమ్మకాలను పురస్కరించుకొని నోబిలీ పనిచేయదలచాడు. తాను మోక్ష మార్గమును బోధించడానికి వచ్చాననిన్నీ, తమ బ్రాహ్మణులు పోయినదని చెప్పే నాల్గవవేదంలోని మతధర్మాలనుగురించి వారికి బోధించడానికే తాను దేశంగాని దేశాన్నుంచి ఇంత దూరం వచ్చాననిన్నీ చెపుతూ నోబిలీ ప్రజలకు బోధించడం ప్రారంభించాడు.

ఈ క్రొత్తపద్ధతి క్రైస్తవ మతప్రచారము అని చమత్కారంగా వున్నదనిన్నీ, తాను క్రైస్తవులుగా చేయదలచిన ఈ హిందువుల మతవిశ్వాసాలలోనూ, సిద్ధాంతాలలోనూ గల గట్టి ఘట్టాలనూ, లోపాలనూ కూడా ఈ నోబిలీ ఎంత బాగా గ్రహించాడో దీనివల్ల బాగా తెలుస్తూ ఉన్నదనీ మాక్సుముల్లర్‌గారు వ్రాశారు.

'ఎక్సోడస్' అనే పుస్తకంలో తన ప్రచార పద్ధతిని గురించి నోబిలీగారే ఇట్లు వ్రాశారు. "హిందువుల దేవుళ్ళు పనికిమాలినవారైనా వారిని దూషించకూడదు. ఆ దేవుళ్ళను దూషిస్తే దానివల్ల మనకు లాభం కలిగేటందుకు బదులు నష్టం కలుగుతుంది. ఒక గదిలోనుంచి చీకటిని తొలగించాలంటే చీపుళ్ళు పుచ్చుకొని దులిపి కాలం వ్యర్థపరుస్తామా? ఒక దీపం వెలిగిస్తాము. చీకటి దానంతట అదే మాయామౌతుంది. స్నేహంచేత క్రైస్తవేతరుడి హృదయాన్ని ఆకర్షించాలి. అతనికి మనయందు భక్తివిశ్వాసాలు కలుగచెయ్యాలి. తరువాత అతనికి సత్యమనే దివ్వెను ఇవ్వాలి. అంతట విగ్రహారాధనమనే అంధకారము చిక్కులు లేకుండా మాయమౌతుంది."

ఇంకొక ఉత్తరంలో తాను చేసే బోధను నోబిలీ వర్ణించాడు. "నా దగ్గర వచ్చిన వాళ్ళకందరికీ భగవంతుడొక్కడేననిన్నీ, ఆయన క్రైస్తవులు నమ్మే మూడు మూర్తులలో సాక్షాత్కారం అవుతున్నాడనిన్నీ, ఆయన అనంతుడనిన్నీ, భూమండలమును, మనుష్యులను, సర్వజంతువులను సృష్టించినవాడనిన్నీ, మానవులను రక్షించేటందుకు మానవ శరీరాత్మలతో ఒక దివ్యకన్యాకుమారి కడుపున పుట్టినా డనిన్నీ, ఇలాగ పుట్టిన అవతారమూర్తి ఏసుక్రీస్తు అనిన్నీ, ఇతడు నిర్వికారుడనిన్నీ, మానవుల పాపముల నన్నింటినీ తాను భరించిన రక్షకుడనిన్నీ" చెప్పి ఆ మతధర్మాలను బోధించేవాడు.

"ఈ మతధర్మాన్ని స్వీకరించేవారెవ్వరూ తమ కులాచారాలను వదులుకోనక్కరలేదు. ఇంకొక కులంలో చేరనక్కరలేదు. తన కులాచారాలకు విరుద్ధమైన ఏపనినీ చేయనక్కరలేదు. భగవంతుని సాక్షిగా ఈ పవిత్ర మత ధర్మము అన్ని వర్ణాలకూ అర్హమైనది. బ్రాహ్మణులు, క్షత్రియులు మొదలైన ప్రజలందరు లౌకిక వ్యవహారాలలో ఈ దేశపు రాజైన మహానాయకుడి శాసనానికి ఎలా లోబడి వుంటారో ఆధ్యాత్మిక విషయాలలో మానవు లందరికి ప్రభువైన భగవంతుని ధర్మశాసనానికి అన్ని కులాలవారూ, అన్ని తరగతులవారూ లోబడివుండాలి. ఈ దేశంలో పూర్వపు ఋషులు, సన్యాసులు చెప్పే ధర్మాలనే నేనుకూడా చెప్పుతున్నాను. ఈ ధర్మాలు కేవలము అస్పృశ్యులకూ, పరంగీలకూ అర్హమైనవని ఎవరయినా అంటే వారు మహా పాతకం చేస్తున్నారన్నమాట. అన్ని కులాల మనుష్యులకూ భగవంతుడు ప్రభువు గనుక ఆయన ధర్మాన్ని అందరూ శిరసావహించాలి. ఈ ధర్మానికి లోబడినందువల్ల ఇంకను ఉన్నతమైనస్థితిని చెందని ఉన్నతకులము లేదు. తన పవిత్రతను ఆవంతయైనా తగ్గకుండా ప్రపంచంలోని అన్నికులాలమీదను, వస్తువులమీదను సూర్యరశ్మి యెలా ప్రసరిస్తున్నదో, అది బ్రాహ్మణులను అపవిత్రపరచకుండా ఎలాగ తేజస్సు నిస్తున్నదో ఈ ఆధ్యాత్మిక సూర్యరశ్మి కూడా మనుష్యులందరికీ తన పవిత్ర ధర్మాన్ని, పవిత్ర తేజాన్ని ప్రసాదిస్తుంది" అని నోబిలీ ఉద్బోధించేవాడు.

## ఉపన్యాస ధోరణి

నోబిలీ చేసే ఉపన్యాస పద్ధతికూడా చాలా చిత్రంగానూ, దేశీయంగానూ వుండి శ్రోతల మనస్సులకూ, హృదయాలకూ బాగా నాటేటట్లు వుండేది. నోబిలీ తాను స్వయంగా చక్కని పద్యాల నెన్నో రచించి వాటిని శ్రావ్యంగా చదివేవాడు. ఈ దేశంలో మతధర్మాలను, పురాణాలను చెప్పేవారి పద్ధతిలో ముందుగా తాను చెప్పదలచిన మతధర్మాన్ని గురించి భావగర్భితమైన ఒక సూత్రాన్ని చెప్పి దానికి వ్యాఖ్యానం చెప్పడంలో అనేక గ్రంథాలలోనుంచీ, తన స్వంత కవిత్వంలోనుంచీ శ్లోకాలూ, పద్యాలూ, కథలూ, గాథలు వివరిస్తూ దీర్ఘమైన ఉపన్యాసం చేసేవాడు. మంచి విచక్షణజ్ఞానంతో తప్పులు వెదకడానికి నడుముకట్టుకుని కూర్చున్నవారున్న సభలలో ఈ విదేశీయు డొక సంవత్సరంలోనే దేశభాష నభ్యసించి తన పాండిత్యానికీ, భాషాజ్ఞానానికీ సభవారు ఆశ్చర్యపడేటట్లుగా ఇంత జయప్రదంగానూ, అనర్గళంగానూ ఉపన్యసించగలిగాడంటే అతడు గొప్ప ప్రతిభాశాలి అనకతీరదని ఒక గ్రంథకర్త వ్రాశాడు.

## భూతవైద్యం

నోబిలీగారున్నూ, ఆయన శిష్యులున్నూ ఏసుక్రీస్తు శిలువను రక్షరేకుగాను, క్రైస్తవ పూజలోని పవిత్రోదకాన్ని మంత్రతీర్థంగానూ ఉపయోగించి జబ్బుపడినవారికి భూతవైద్యం చేసి కుదిర్చే తంత్రం ఒకటి ప్రారంభించారు. 1607లో ఒక ఆడమనిషికిన్నీ, 1608 లో ఒక మహమ్మదీయునికిన్నీ ఇలాగ దయ్యం వదలిపోయిందనిన్నీ, పోతూవున్న భూతము నోబిలీగారి ప్రభావాన్ని ఉగ్గడించినదనిన్నీ పాదరీల ఉత్తర ప్రత్యుత్తరాలలో వ్రాయబడి యున్నది. ఒకమాటు ఈ నోబిలీ యేలాంటివాడని ఒక దయ్యాన్ని ఆయన శిష్యుడు అడుగగా అతడు చాలా శక్తులుగలవాడనిన్నీ, ఆయన బోధించే ధర్మాలన్నీ నిజమైనవనిన్నీ దయ్యం చెప్పినదట. ఈయన తలపెట్టిన కార్యానికి మొదట విఘ్నాలు కలుగుతాయనిన్నీ, మూడేళ్ళలో జయం కలుగుతుందనిన్నీ కూడా చెప్పిందట. ఇలాగ భూతవైద్యతంత్రాలు జరపడంవల్ల మధురానగరంలో ప్రజలలో నమ్మకం కుదిరి నోబిలీ గారి ప్రభావాన్ని గురించి విపరీతంగా చెప్పుకోవడం ప్రారంభించారు. మధుర రాజసభలోకి కూడా ఆయన ఖ్యాతి ప్రాకింది. అనేకులైన ప్రభువులు ఆయనతో స్నేహంచెయ్యడం ప్రారంభించారు.

## ఫలితాలు

ఇలాగ వేషధారణచేసి కపటనాటకమార్గంద్వారా ఏసుక్రీస్తు సేవ చేసే పద్ధతి త్వరలోనే ఫలప్రదమైనది. ఈ నోబిలీ తన జీవిత విధానంవల్ల గర్విష్ఠులైన బ్రాహ్మణుల హృదయాలలో సంచలనం పుట్టించి వారిని ఆకర్షించాడు. అందువల్ల వారీయనను చూడడానికి రావడంమాత్రమే గాక భగవంతుణ్ణి గురించి ఆయన చెప్పే సంగతులను శ్రద్ధతో వినడముకూడా ప్రారంభమైంది. అంతేకాదు. అందులో కొందరు భూమిమీద ప్రణమిల్లి ఆయన పాదధూళిని శిరస్సున ధరించేవారు. ఇంత బాగా తత్వబోధ చెయ్యగలవాడింకొకడు లేడని వేనోళ్ళ పొగిడేవారు!* (The Aravidu Dynasty - The Rev. H. Heras Chap. XVIII pp. 362-396)

నోబిలీ వేసిన పథకం పారడానికి దారి ఏర్పడింది. అంతట అతడు హిందువులను బహిరంగంగా క్రైస్తవ మతంలో కలపడానికి ప్రయత్నించాడు. ఒక హిందూమత గురువుతో నోబిలీ ఇరవైరోజులు – రోజు కైదారు గంటల చొప్పున శాస్త్ర చర్చచేసి, వాదించి ఆఖరుకు తన సిద్ధాంతాలను స్థాపించినట్లు జయభేరి వేయించి ఆ గురువును క్రైస్తవ మతంలో కలిపాడట. తనకు తెలుగు, సంస్కృతములు నేర్పిన బ్రాహ్మణ గురువునుకూడా మతంలో కలిపాడు, అంతట ఒకరితరువాత ఒకరిని చాలామందిని మతంలో కలపగలిగాడు. బ్రాహ్మణులు, రాజులు, రాజోద్యోగులు, శాస్త్రజ్ఞులు, నాయకులు, గొప్పకులాలవారు, సంపన్నులు అతనిదగ్గరికి వచ్చి తరణోపాయం చెప్పమని వేడుకొనేవారు. దేశంలో చాలా గొప్పవాడని ప్రఖ్యాతిచెంది విజయనగర చక్రవర్తుల ఉద్యోగాలలో పెద్దయైన దుంబిచ్చి నాయకుడు కూడా ఈయనకు శిష్యుడు కావాలని కుతూహలపడ్డాడుగాని రాజుగారికి కోపం వస్తుందని వూరుకున్నాడు.

క్రైస్తవమతం అతిత్వరగా వ్యాపించింది. హిందూ మతం కొద్దిరోజులలో నశిస్తుందా అని చాలామందికి తోచింది. దేశమంతా గగ్గోలుపుట్టింది. నోబిలీ చేసిన ప్రచారంవల్ల బ్రాహ్మణ పురోహితుల ఆదాయం పూర్తిగా తగ్గిపోయింది. వ్రతాలు, పూజలు చేసేవారిచ్చే దక్షిణలు తగ్గిపోయినవి. హిందూ స్వాములవారికి ముడుపులుకూడా తగ్గిపోయినవి. అందువల్ల సనాతన ధర్మపరులందరూ కళ్లు తెరిచారు. నోబిలీ కట్టిన క్రైస్తవదేవాలయము స్థలం తనదని మధుర దేవాలయం ప్రధాన అర్చకుడు తగాదా పెట్టినాడు. అంతట ఈ నోబిలీగారి క్రైస్తవప్రచారానికి వ్యతిరేక ప్రచారం ప్రారంభమైనది. హెర్మెకత్తి యనే శ్రీమంతు డొకడు నోబిలీగారికి సహాయపడినందువల్ల అప్పటికి నోబిలీగారి క్రైస్తవ దేవాలయానికి ఆపద తప్పింది. ఈ హెర్మెకత్తి క్రైస్తవ మతంలో కలియకపోయినా నోబిలీగారికి ప్రాపకుడుగా వుండేవాడు. ఇంతలో నోబిలీగారికి ఇంకొక తవాయి వచ్చింది. దానివల్ల ఆయన మతప్రచారం కట్టిపెట్టవలసి వచ్చింది.

## ఆశ్వాసాంతం

ఇదివరలో మధురానగరంలో క్రైస్తవమత ప్రచారకుడుగాఉన్న ఫెర్నాండేజ్‌గారికి ఈ నోబిలీగారు అవలంబించే ప్రచారపద్ధతులు, చర్యలు క్రైస్తవధర్మాలకు విరుద్ధంగా ఉన్నట్లు తోచింది. నోబిలీగారి కొన్ని చర్యలు చాలా అసహ్యకరంగా తోచి మందలించాడు గాని లాభం లేకపోయింది. అంతట అతడు పై యధికారులకు ఈ చర్యలన్నీ వివరించి చెప్పడంవల్ల నోబిలీగారి ప్రవర్తన బాగాలేదని పై యధికారులన్నారు. గోవానగరంలో ఉన్న పోర్చుగీసు క్రైస్తవ మతాధికారులకు నోబిలీమీద ఈర్ష్యాభావముకూడా కలిగింది. క్రైస్తవమతంలో కలిసిన హిందువులు తమ పూర్వపు మతాచారాలన్నీ అవలంబించవచ్చునని నోబిలీగారు అనుజ్ఞయిచ్చినందువల్ల క్రైస్తవమతం దురాచారాలకు పుట్టినిల్లుగా మారినదన్ని, ఈ మతాన్ని గురించి ప్రపంచంలో చాలా అపఖ్యాతి కలిగినదనిన్ని వారన్నారు (1) ముఖ్యంగా నోబిలీగారు హిందూ స్వాముల వారిలాగా 'జగద్గురువు' అనే బిరుదును తాల్చడము; 2. తాను పరంగిని కానని చెప్పి నటించడము 3. హిందువుల మూఢవిశ్వాసములను సూచించే పరిభాషను, వేదాంతసూత్రములను, మాటలను

ఉపయోగించడము; 4. తనమాటలు విశ్వసించిన క్రైస్తవ మతంలో కలిసిన హిందువులను వారు పూర్వాచారం ప్రకారం వుంచుకునే జుట్టుపిలకలను వుంచుకొననివ్వడము, జందెములు వుంచుకోనివ్వడము, ముఖము మీద గంధాక్షతలు మొదలైన బొట్లు పెట్టుకోనివ్వడము, అనేక సందర్భాలలో స్నానాలు చెయ్యనివ్వడము, ఇంకా హిందూ వర్ణాశ్రమ ధర్మాలయందు అనాదినుంచీ జరుగుతూ వస్తూవున్న ఆచారాలను అవలంబించనివ్వడము - ఇవి క్రైస్తవమత ధర్మాలకు విరుద్ధమని నిందించారు.

పైన చెప్పిన విధంగా నోబిలీగారు 5 సంవత్సరాలు ప్రచారంచేసి క్రైస్తవమతం వ్యాపిస్తూవున్న స్థితిలో పైయధికారులు ఆయనచేసే ప్రచార విధానాన్ని నిషేధించారు. అతణ్ణి కొన్నాళ్లు పనిమాన్పించి తరువాత తక్కిన ఫాదరీల లాగనే ప్రచారం చెయ్యమన్నారు. నోబిలీ పడిన కష్టమంతా వృధా అయింది. క్రైస్తవమత ప్రచారకులు ఈ క్రొత్త వేషాలు మాని పూర్వ పద్ధతులతోనే ప్రవర్తించడం ప్రారంభించారు. మళ్ళీ వీరిని పరంగీలని నీచంగా చూడడం ప్రారంభమైనది. ముద్దు వీరప్పనాయకుని రాజ్యకాలంలో పరిపాలన నిరంకుశంగా జరిగిందని జెస్యూట్లు వ్రాశారు.

## ఉపసంహారం

ముద్దువీరప్ప తరువాత మహారాజమాన్య రాజశ్రీ తిరుమల శౌరినాయన అయ్యలుగారు మధుర రాజ్యానికి రాజైనాడు. ఆయన పట్టాభిషేకము 1624లో జరిగినట్లు కనబడుతూవుంది. ఈ తిరుమలనాయకుడు విజయనగర సామ్రాజ్యంలోనుంచి విడిపోయి స్వతంత్రుడై పరిపాలింప సాగినాడు. దేశం శాంతంగానూ, సుభిక్షంగానూ ఉన్నది. ఈసరికి రోమునగర క్రైస్తవాధికారులు తనపట్ల కొంత శాంతించియుంటారని రాబర్టో డీ నోబిలీగారు ఊహించి 1623లో తన పాతపద్ధతిలో మళ్ళీ క్రైస్తవమత ప్రచారం చెయ్యడానికి పూనుకొని మధురనుండి బయలుదేరాడు. ఇతడు మొదట తిరుచునాపల్లి, శుండమంగలము, సేలము మొదలైన ప్రాంతాలకుపోయి కొందరిని మతంలో కలిపాడు.

మధురలో క్రైస్తవమతాన్ని వ్యాపింపచెయ్యడానికి బ్రాహ్మణులు ఆటంకాలు కలిగించడం ప్రారంభించారు. మధుర సనాతనధర్మానికి దుర్గంగా వున్నందువల్ల అతడు మెల్లిగా తిరుచునాపల్లి మొదలైన ప్రాంతాలలోనే గట్టి ప్రచారం చేశాడు. అక్కడకూడా సనాతనులు వీరిని బాధించారు. అంతట మిషనరీలు అడవులలో కళ్లరులనే అనాగరికుల గ్రామాలకుపోయి ప్రచారం సాగించారు.

నోబిలీ ఇలాగ మొత్తంమీద నలభై రెండేండ్లు ఈ మధుర జిల్లాలో క్రైస్తవమత ప్రచారం చేశాడు. అతని ఆరోగ్యం పూర్తిగా చెడిపోయింది. అతనిదృష్టి తగ్గిపోయి గ్రుడ్డివాడై పోతున్నాడు. ఈ స్థితిలో కొంచెం చల్లని ప్రదేశానికి పంపితే అతనికి ఆరోగ్యం కలుగుతుందేమోనని 1648 ఆ ప్రాంతంలో మిషనరీ అధికారులతనిని సింహళానికి పంపించారు. కాని అతడు అక్కడ విశ్రాంతి తీసుకునేదానికి బదులుగా తన మామూలు పద్ధతి ప్రకారమే కఠిన నియమాలతో జీవిస్తూ మత ప్రచారంచేస్తూనే వచ్చినందువల్ల ఆరోగ్యం కలుగలేదు. అక్కడ కూడా కొందరును అతడు మతంలో కలిపాడు. అందువల్ల అతడు మొదటినుంచీ పనిచేస్తూవున్న ప్రదేశాలన్నిటికీ దూరంగా వుండేటట్లు చెన్నపట్నంలో

మైలాపూరికి విశ్రాంతికోసం పంపించారు. అక్కడ ఇతడు తన శిష్యులుగావున్న నలుగురు బ్రాహ్మణులతో ఒక చిన్న మట్టియింట్లో కొన్నాళ్ళు కాలక్షేపం చేశాడు. ఇంతలో గోలకొండ నవాబులు సేనాధిపతుల దండయాత్రలవల్ల చెన్నపట్నంలో రాజకీయ పరిస్థితులు అల్లకల్లోలంగా ఉన్నందువల్ల అధికారులు మళ్ళీ అతనిని ఇంకొకచోటికి మార్చారు. ఇట్టి స్థితిలో 1656లో ఈ క్రైస్తవమతాచార్యుడు స్వర్గస్థుడైనాడు.

నోబిలీ అరవంలో వ్రాసిన తొమ్మిది గొప్ప గ్రంథాల తాళపత్ర సంపుటాలు 1660లో కనబడ్డవి. (Madhura District Manual 1868-J.H. Nelson, Part II pp. 116-120, 127, 160-161, 180-181).



# 6. సీతారాముల శాపం

"దేవాలయములలోని విగ్రహాల నగలను ముట్టుకుంటే ఘోరమైన శాపం తగులుతుంది. ఆ పాపఫలాన్ని వంశపారంపర్యా అనుభవించవలసివస్తుంది" అని భారతదేశాన్ని ఏలే మొగలు చక్రవర్తి టెవర్నియరు అనే ఫ్రెంచి దేశీయుడితో అన్నాడట. ఈమాట టెవర్నియరు విషయంలోనే రుజువు అయింది.

టెవర్నియరు 1638-68 మధ్య అయిదుసార్లు హిందూ దేశానికివచ్చి దేశమంతా తిరిగిచూశాడు. టెవర్నియరు వజ్రాల వ్యాపారంచేసి చాలాసొమ్ము ఆర్జించాడు. ఎక్కడనైనా అపూర్వమైన వజ్రం ఉన్నదంటే యెలాగైనా దాన్ని సంపాదించాలని ప్రయత్నించేవాడు. ఇతడు మొగలుచక్రవర్తి దయ సంపాదించి ఆయనతో వెళ్ళి హిమాలయపర్వతాలలో వుండు వజ్రపుగనులు చూశాడు. అప్పుడు చక్రవర్తి టెవర్నియరు కొక మహావజ్రాన్ని బహుమానంగా ఇచ్చాడు. ఆ సమయంలోనే చక్రవర్తి టెవర్నియరుకు బర్మావజ్రం సంగతి ఇలాగని చెప్పాడు. "ఐరావతీ నదీతీరాన్నివున్న 'పగను' అనే నగరంలో ఒక పురాతన దేవాలయంలో ఒక గొప్ప స్ఫటికంలో చెక్కిన సీతారాముల విగ్రహాలు ఉన్నాయి. ఆ విగ్రహాల మెడలలోను, వక్షస్థలాలమీదను భక్తులు సమర్పించిన అనేక అమూల్య రత్నాల ఆభరణాలు ఉన్నాయి. వాటిలోకల్లా అందమైనదీ, అపూర్వమైనదీ ఒక వజ్రంవున్నది. అది రెండువేల సంవత్సరాలనుంచి ఆ విగ్రహాలకు అలంకారంగా ఉన్నది. దానిని పూర్వం బర్మారాజు కూతురైన ట్రిస్సన్ ధరించేది. ఆ పిల్ల ఆకతాయిలవల్ల బలవన్మరణము పొందినది. దీని పూర్వ చరిత్రను గురించి యింక ఏమీ తెలియదు" అని చక్రవర్తి చెప్పాడు.

### వజ్రాపహరణం

ఈ మాట వినేటప్పటికి ఎలాగైనా ఆ వజ్రాన్ని అపహరించాలని టెవర్నియరుకు కోరిక కలిగింది. అతడు ముందుగా మండలేపట్నం వెళ్లాడు. 'పగను' చాలా దుర్గమమైన ప్రదేశంలో వుంది. అక్కడికి వెళ్ళడం చాలాకష్టం. అయితే టెవర్నియరు ఫ్రెంచి దేశాన్నుంచి వచ్చిన ఒక గొప్పదొర అనిన్నీ, హిందూదేశాన్ని ఏలే చక్రవర్తి స్నేహితుడనిన్నీ, అతని

ప్రఖ్యాతి అతనికంటె ముందుగానే ప్రాకినందువల్ల అది సాధ్యం అయింది. అతడు గమ్యస్థానానికి దగ్గరకి వచ్చినకొద్దీ చాలా దాతృత్వం కనబరుస్తూ దానధర్మాలు చెయ్యడం ప్రారంభించాడు. తనను ఒక మహారాజు అని అందరూ అనుకోవడం మొదలుపెట్టారని టెవర్నియరే అన్నాడు.

విదేశీయుడిని - అందులో తెల్లవాడిని - దేవాలయంలోనికి సులభంగా రానివ్వరుగాని టెవర్నియరుకు ఇది సులభంగా సాధ్యమైంది. దేవాలయంలో కాలుపెట్టగానే టెవర్నియరు ఎంతో భక్తి పరుడిలాగ సాష్టాంగపడి దేవుడికి నమస్కరించాడు. ఈ సీతారాములను చూడలేక కళ్ళు మిరుమిట్లు క్రమ్మినాయేమో అనేటట్లుగా తన అంచేలి వ్రేళ్ళను కళ్ళకు అడ్డముపెట్టుకొని ఆ వ్రేళ్ళ సందులనుంచి తాను అపహరించదలచిన అపూర్వ వజ్రం ఎక్కడవుందో కనిపెట్టాడు.

తన రాకయొక్క వింత కాస్త తగ్గి పాతబడేవరకూ ఐదు రోజులు పగనులో నుండి ప్రతిరోజు ఉదయమూ, మధ్యాహ్నమూ, రాత్రికూడా దేవాలయంలోకి వెళ్ళి సీతారాములను అర్చిస్తూ వుండేవాడు. వెళ్ళినప్పుడల్లా ఒక రత్నాన్ని బహుమానం ఇచ్చేవాడు. ఆ రాళ్ళు ఎక్కువ విలువైనవి కాకపోయినా అర్చకులకు మాత్రం అతనిపైన చాలా గౌరవం కలిగింది.

ఐదోనాటిరాత్రి వెన్నెలలేదు. అందువల్ల టెవర్నియరూ, అతని అనుచరులూ ప్రయాణానికి సిద్ధపరచిన ఏనుగులను ఎవరూ గమనించలేదు. మొదట పగనుకు వచ్చేటప్పుడు వేసుకొన్న తెల్లనిదుస్తులను తీసివేసి వీళ్ళు నల్లటి దుస్తులు ధరించారు. అందువల్ల నక్షత్రాల వెల్తురు వీళ్ళపైన పడి గుర్తు తెలుస్తుందనే భయంలేదు... హఠాత్తుగా ఆ రాత్రివేళ ఇంత ప్రొద్దుపొయ్యేవరకూ ఇంకా ఆ దేవాలయంలో దిగబడిన ఏ అర్చకునిదో, సేవకునిదో ఒక్క కేక వినబడి మళ్ళీ గొంతుక నొక్కినట్లు ఆగిపోయింది. ఆగుడిలో రాతి చపటామీద సాధారణంగా పడుకునే బిచ్చగాళ్ళకు నిద్రాభంగమై ఒకమాటు ఇటూ అటూ కదిలారు. ఇంతలో వాళ్ళ కాళ్ళు, చేతులు బంధింపబడి నోటిలో గుడ్డలు క్రుక్కినందువల్ల ఏమీ చెయ్యలేకపొయ్యారు. సీతారాముల విగ్రహాల దగ్గరికి గబగబ పోతూవున్న పాదాలచప్పుడు, బంగారుగొలుసులు కదల్చిన చప్పుడు, దాని తరువాత వీధిలో ఏనుగుల పాదాలచప్పుడు వినబడినవి. ఇంతే - అంతా సద్దు అడిగింది.

ఆ మర్నాడు ప్రొద్దున్న దివ్యవజ్రం పోయిన సంగతి తెలియగానే లబాయిలూ, దిబాయిలూ! ఎవరు ఎత్తుకుపోయి వుంటారు? అని అర్చకులు ఒకరినొకరు ప్రశ్నించుకున్నారు. బిచ్చగాళ్ళను కట్టినతాళ్ళను విప్పుతూవుండగా క్రొత్తగా వచ్చినవారు ఆ రాత్రి వెళ్ళిపోయారనే కేకలు వినబడ్డాయి.

## శాపంయొక్క పీడ ప్రారంభం

టెవర్నియరు కోరిక సఫలమైంది. వజ్రం పోయిన సంగతి అర్చకులకు తెలిసేటప్పటికి అతడూ, అతని అనుచరులూ తప్పించుకొని చాలా దూరం పోయారు.

ఈ వజ్రంతో టెవర్నియరు ఫ్రెంచి దేశానికి వెళ్ళగానే ఫ్రెంచిరాజైన 14వ 'లూయీ' వజ్రంమీద కన్నువేశాడు. టెవర్నియరుకు అమ్మడం యిష్టంలేదు. ఇతనికి ఒక లక్ష నవరసులూ, ఒక ప్రభుబిరుదూ ఇస్తానని రాజు అనడంవల్లనూ, ఆ సమయంలోనే

టెవర్నియరు కొడుకు ఋణబాధలవల్ల ఆస్తినంతా తాకట్టుపెట్టినట్లు తెలిసినందువల్లనూ టెవర్నియరు ఒప్పుకున్నాడు. టెవర్నియరు మళ్ళీ తూర్పుదేశానికి వెడుతూ దారిలో తీవ్రమైన జ్వరంతో బాధపడి చనిపోయాడు. దారిలో అడవికుక్కలు పీక్కుతిన్నాయని కొందరన్నారు. ఏమైతేనేమి టెవర్నియరు దుర్మరణం పొందాడు. ఇది సీతారాముల శాపఫలితమేనని కొందరన్నారు.

## వజ్రంలో పిశాచం

ఫ్రెంచిరాజు ఈ వజ్రాన్ని చెక్కించినందువల్ల అది 67 క్యారెట్లులైంది. దాన్ని రాజు ధరించేటప్పటికి దాని నీలవర్ణకాంతులు చూసి అందరూ ఆశ్చర్యపడ్డారు. ఈ వజ్రం ధరించినందువల్ల రాజుగారి కేమీ కీడు రాలేదు. కాని దాన్ని ధరించిన ఆయన ప్రియురాండ్రకు, ఆయన స్నేహితులకు మాత్రం రాజాదరణము పోవడమో, గౌరవము పోవడమో, చెరలో దుర్మరణము చెందడమో జరిగేది. అందువల్ల ఈ వజ్రంలో ఏదో పిశాచ మున్నదనిన్ని, పెట్టుకున్నవాళ్ళను నాశనం చేస్తుందనిన్నీ పుకారులు బైలుదేరినాయి.

ఫ్రెంచి రాజు 16వ 'లూయి' భార్య మేరీ అంటాయి నెట్టు దీనిని ధరించింది. ఆపిడకు చాలా చిక్కులు వచ్చినవి. ఫ్రెంచి ప్రజావిప్లవంలో ఆ రాజు పదభ్రష్టుడైనాడు. ఆరాణి ప్రాణాలను గోల్పోయింది. విప్లవం జరిగినతరువాత 1792లో తక్కిన జవాహిరితోపాటు ఈ వజ్రాన్ని ఎవరో అపహరించారు.

## దుర్మరణాలు - దురదృష్టాలు

తరువాత కొంతకాలానికి వజ్రాలమచ్చులచావడి అనతగిన 'ఆంస్టర్‌డాం'లో 'ఫాల్స్' అనే వజ్రాల వర్తకుడిదగ్గరికి ఈ వజ్రం ఎలాగోవచ్చింది. అతనికిచ్చినవాడు దానిని కొయ్యమన్నాడు. అతడు కొన్ని నెలలు కష్టపడి పని పూర్తిచేసేటప్పటికి అతని కొడుకు దానిని హరించి అమ్మివేసి ఆ సొమ్ముతో వ్యభిచారాలలోనూ, దుర్మార్గాలలోనూ పడి, పాడై ఆత్మహత్య చేసుకొన్నాడు.

ఈ కుర్రవాడిదగ్గర ఈ వజ్రాన్ని దాని నిజమైన విలువలో 10వ వంతుకు ఫ్రాన్సిస్ బాయిలూ అనే ఫ్రెంచివాడు కొన్నాడు. అతడు దానిని ఫ్రాన్సులో అమ్మలేక, లండనుకు పోయి అమ్మదలచి అందుకు సొమ్ములేక రహస్యంగా ఆ వజ్రంలో ఒక చిన్నముక్క కోయించి అమ్మి, కోసినందుకు కొంత సొమ్మిచ్చి మిగతా సొమ్ముతో లండనువెళ్ళి ఆ వజ్రాన్ని తన జోడు మడమలో దాచుకొని తిరిగేవాడు. దానిని అమ్మడానికి భయపడి వీధులు ఊడ్చే పాకీపనిచేస్తూ జీవించేవాడు. తిండిలేక మలమల మాడి ఆకలిబాధ భరించలేక ఆఖరికి ఎలియాసన్ అనే యూదుజాతి వజ్రాలవర్తకుడిని పిలిచి తన వజ్రాన్ని 5 వేల సవరసుల కిచ్చివేస్తానన్నాడు. ఎలియాసన్ ఆలోచించి చెబుతానని తరువాత మళ్ళీ వెళ్ళేటప్పటికి ఆ యువకుడు సోషిల్లి చచ్చిపడిఉన్నాడు.

ఎలియాసన్ ఆ వజ్రాన్ని సంగ్రహించాడు. అతని దగ్గర ఆ వజ్రం 1830 వరకూ ఉంది. తరువాత అతడు దానిని తామస్ హెన్రీహోపు అనే ఆయనకు 18 వేల సవరసులకు అమ్మాడు. ఆ వజ్రం నిజానికి 30వేలు చేస్తుంది. హోపుగారి తదనంతరం ఈ వజ్రం

ఆయన వారసుడైన లార్డు ఫ్రాన్సిస్ హోపు ప్రభువునకు సంక్రమించినది. దీనికి అప్పటినుంచీ 'హోపు వజ్రం' అని పేరు వచ్చింది.

## హోపు ప్రభువు

ఈ వజ్రం వచ్చిన ముహూర్తాన హోపు ప్రభువుకి అన్నీ కష్టాలే కలిగినవి. అతడు చాలా ఆస్తి నష్టపడి కాపురం చెడి మనోవ్యాధితో బాధపడ్డాడు. హోపుగారు 1894లో మేయోహే అనే నటకురాలిని పెళ్ళాడి ఆ వజ్రాన్ని ఆమెకు యిచ్చాడు. ఆ వజ్రంయొక్క పీడవల్లనే తనకు మనశ్శాంతి లేకుండా పోయినదనిన్నీ, తాను ఇంకొకనితో లేచిపోయినా ననిన్నీ ఆవిడ తరువాత చెప్పింది. హోపు ప్రభువు 1902లో ఆమెతో విడాకులు పొందాడు. ఈ లోపుగా అతనికి సొమ్ము అవసరమై ఆ వజ్రాన్ని విక్రయించాడు. తరువాత కొంత కాలందాకా ఆ వజ్రం ఏమైనదో తెలియదు.

## ఇంకా కొన్ని దుర్మరణాలు

1908లో ఈ వజ్రాన్ని రష్యాదేశపు కోటీశ్వరుడైన కనిటో విస్కీ అనే ప్రభువు కొన్నాడు. అతడు ప్యారిసు నగరములోని ఒక నర్తకిని ప్రేమించి ఈ వజ్రాన్ని ఒకరాత్రి ధరించేటందుకు దాని నావిడకు ఇచ్చాడు. ఆ వజ్రాన్ని ధరించి ఆమె రంగస్థలంమీదికి రాగానే కనిటో విస్కీకి నేమి తోచిందోగాని ఆమెను తన తుపాకితో కాల్చివేశాడు. తరువాత యింకో రెండురోజులలో ఈ కనిటో విస్కీని ఎవరో పొడిచి చంపివేశారు. ఈ వజ్రాన్ని ఈ ప్రభువుకు అమ్మిన వర్తకుడు కొలట్ అనేవాడు తన వజ్రం ఖరీదు తాలూకు సొమ్ము తనకు రాదనే అధైర్యంతో ఆత్మహత్య చేసుకొన్నాడు.

ఆ వజ్రం మళ్ళీ ఒక గ్రీకు వర్తకుడి చేతిలో పడింది. అతడు దానిని తురుష్కసుల్తాను అబ్దుల్ హమీదుకు అమ్మాడు. అమ్మినరోజు రాత్రే ఆ గ్రీకువర్తకుడు, అతని భార్యా, పిల్లలూ, ఒక పర్వతంప్రక్క ప్రయాణంచేస్తూ అగాధమైన లోయలోబడి మరణించారు.

## తురుష్క సుల్తాను పదచ్యుతి

తురుష్క సుల్తాను దగ్గర ఆ వజ్రానికి కాపలాకాసే సేవకుడిపైన ఆ సుల్తానుకు ఆగ్రహంవచ్చి అతనిని బందిఖానాలో పెట్టి చావగొట్టినందువల్ల వానికి పిచ్చి యెత్తింది. తరువాత ఆ సుల్తానుకు విశ్వాసపాత్రుడుగా వుండే ఖొజ్జావాడిని ఎవరో గొంతుక పిసికి చంపారు. తరువాత తురుష్క యువజనపక్షంవారు ఆ సుల్తానుగారిని త్రోసిరాజన్నారు.

## ఆఖరికి అమెరికా

మళ్ళీ కొన్నాళ్ళదాకా ఆ వజ్రం ఏమైనదో తెలియదు. 1911లో అమెరికాలోని ఒక వజ్రాల కంపెనీలో మెక్లిన్ సతి అనే ఆమె దానిని కొన్నది. అప్పటినుంచీ ఆవిడ ఆ కంపెనీతో ఒక వ్యాజ్యం తగాదాలో చిక్కుకుంది.

ఈ వజ్రంమీదనున్న అపఖ్యాతివల్ల దానిని కొనేటప్పుడు ఒక గమ్మత్తుషరతు నిర్ణయించుకున్నారు. కొన్నవాళ్ళకు ఏదైనా ఆపదవచ్చే సందర్భంలో వజ్రం వాపసు చేసే పద్ధతిని దానిని 60 వేల నవరసుల ఖరీదు అని మొదట అన్నారుగాని తుదకు 52వేల నవరసులే నిశ్చయించుకొన్నారు.

1919 మే నెలలో మెక్లీన్ సతియొక్క ఏకైకపుత్రుడు కోటీశ్వరుడి కులదీపము - పసిపావడు తన దాయిదగ్గరనుంచి హఠాత్తుగా అవతలికి వెళ్ళి ఒక మోటారు బండిచక్రంక్రింద పడి చనిపోయాడు*. తరువాత ఏమి జరిగిందో ఇంకా తెలియలేదు.



# 7. మన ముసల్మానులు భారతీయులు కారా?

మన తెలుగుదేశంలో మహమ్మదీయులను 'తురక' లని వ్యవహరించడం అలవాటు అయింది. ఎవరు మీరని వారిని అడిగితే మేము 'తురక'ల మంటారు గాని నిజంగా వీరు తురుష్కదేశాన్నుంచి వచ్చిన విజాతీయులు కారు. ఒక్క ఆంధ్రదేశంలోనే కాదు; యావద్భారత దేశంలో ఉన్న ముసల్మానులలో నూటికి తొంభైమంది పూర్వము హిందువులలో నుంచి మహమ్మదీయమతంలో కలిసినవారి సంతతివారే. నూటికి పదిమందిమాత్రమే అరబ్బీ తురుష్కదేశాలనుంచీ, పారశీక అఫ్ఘనిస్థానాలనుంచీ వచ్చి ఇక్కడ స్థిరనివాసం ఏర్పరచుకొని 'షేకు' లనే ఈ దేశపు మహమ్మదీయులతో సంబంధ బాంధవ్యాలు చేసినవారి సంతతి వాళ్ళు.

ఈ ముసల్మానులు హిందూ ప్రజలలాగానే గ్రామాలలో వ్యవసాయము, ఇతర వృత్తులు చేసుకుంటూ జీవనంచేస్తూ ఉన్నందువల్ల అరబ్బీ, తురుష్క, పారశీక మతాచారాలు క్రమక్రమంగా సడలిపోయి హిందూదేశ ప్రజల ఆచారాలే వారికికూడా అలవడినవి. ఇస్లాం మతంలో కులభేదాలకు తావులేకపోయినా మనదేశంలో ఉన్న మహమ్మదీయులలో వర్ణగింజలలో ఉన్నన్ని భేదాలు ఏర్పడినవి. హిందువులలో నుంచి మహమ్మదీయ మతం అవలంబించినవారు వేరువేరు కులాచారాలు అవలంబించి, వేరువేరు తెగలుగా ఏర్పడ్డారు. ఇస్లాం ధర్మాన్నిబట్టి మహమ్మదీయులందరూ ఏకపంక్తిన భోజనము చేయవలసియున్నా మన ముసల్మానులలో భోజన, ప్రతిభోజనాల విషయంలోనూ, వివాహాల విషయంలోనూ నిషిద్ధాలు ఏర్పడినవి.

వంగరాష్ట్రం జనసంఖ్యలో నూటికి యాభైమంది మహమ్మదీయులే. వీరిలో నూటికి 35 మంది వ్యవసాయికులు. వీరందరూ హిందువులలోనుంచి మహమ్మదీయు లైనవారే. ఘూర్జర రాష్ట్రంలోని ఖోజాలు, మెమనులు, బోరాలు హిందువులసంతతివారే. వీరిప్పటికీ మన ఆచార వ్యవహారాలనే అవలంబించి యున్నారు. వేషభాషలలో ఘూర్జరదేశంలో నున్న హిందువులకూ, వీరికీ తేడాలేదు. రాజపుత్రస్థానంలోని ముసల్మానులందరూ మొగలాయి చక్రవర్తులకాలంలో మహమ్మదీయులైన రాజపుత్రుల సంతతివారే.

* The Curse of the Hope Diamond - By Richard, D.S.McMillan. *(Great Stories of real life - George Newnes Ltd.)*

తక్కినవారిలో చాలామంది మియోలు. వీరుకూడా హిందువులలో నుంచి మునల్మానులైన వారే. పశ్చిమోత్తర పరగణాలలో నున్న మునల్మానులలో కూడా విజాతీయ రక్తము బహుస్వల్పముగా నున్నది. దక్షిణ హిందూ స్థానంలో మలబారులోని మాపలాలు క్రీస్తుశకము ఎనిమిదవ శతాబ్దములో అరబ్బీ దేశాన్నించి మనదేశంతో వర్తకవ్యాపారం చేస్తూ వచ్చిన అరబ్బీ దేశీయులకును, మలబారు హిందువులలోని క్రింది తరగతుల స్త్రీలకును పుట్టినవారేగాని విజాతీయులు గారు.

మహమ్మదీయులు ప్రబలముగా నున్న పంజాబు రాష్ట్రంలో కూడా నూటికి 16 వంతులు మాత్రమే పఠాను, బెలూచీ, మొగలు వగైరా విజాతీయుల సంతతివారనిన్నీ, మిగతా 84 వంతులూ హిందువులలోనుంచి మహమ్మదీయులైనవారి సంతతివారే ననిన్నీ 1901వ సంవత్సరపు జనాభా లెక్కలవల్ల తేలినది 1901లో పంజాబులోనున్న మహమ్మదీయులు 1,41,41,122 మందిలో జాటులనే తెగవారు 20 లక్షలు; రాజపుత్రులు, అరెయినులు 10 లక్షలు; జోలా, అవాను, గుజారు, ముచీ, కుంహారు తర్ఖాను, తేలీలు ఒక్కొక్క తెగవారు ఏడులక్షల యాభై వేలమంది మొదలు 10 లక్షల దాకా వున్నారు. వీరందరు హిందువుల సంతతివారే.

మనదేశపు మునల్మానులలో హిందువులలాగనే ఒకరితోఒకరికి సంబంధ బాంధవ్యములు లేని షియాలు, సున్నీలు అనే రెండు పెద్ద తెగలున్నవి. వీరుగాక ప్రత్యేక తెగలుగానున్న సయ్యదులు, షేకులు, పఠానులు, మొగలులు, మహమ్మదీయులు, రాజపుత్రులు, జాటులు, గుజారులు, మియోలు, డిష్వానీలు, మోపలాలు మొదలైన వారున్నారు. ఈ మునల్మానులలో మెమను, బోరా, ఖోజా, జూలా, ధానియా, ఘోసీ, కుంజెరు, మనిహారు, కసాయీలు మొదలైనవారు హిందువులలాగనే ప్రత్యేక కులాచారాలనే అవలంబించి యున్నారు.

## హిందు మునల్మానుల 'భారతీయ' సభ్యత

భారతదేశంలో హిందూమునల్మానుల చిరకాల సాహచర్యంవల్ల ఈ యుభయుల వేషభాషలూ, ఆచారాలూ విడదీయలేనంతటి విధంగా కలిసిపోయి కేవలమూ మహమ్మదీయులదనిగాని, హిందువులదనిగాని చెప్పడానికి వీలులేని విధమైన 'భారతీయ' సభ్యత యొకటి యేర్పడి యున్నది. ఈ చిరకాల సాహచర్యమువల్ల ఉభయుల వేషభాషలలో, మతాచార వ్యవహారాలలో, సంగీత సాహిత్యములలో, శిల్పములో, రుచులలో, తుదకు స్వభావములలో కూడా మార్పులు కలిగినవి. దీనిని గురించి హిందువులు, మహమ్మదీయులు, విదేశీయులు, పాశ్చాత్యులుకూడా అనేక గ్రంథాలలో వ్రాసియున్నారు. ఇలాంటి రచన లన్నింటినీ సేకరించి శ్రీ రవీంద్రనారాయణ ఘోషుగారు 1911వ సంవత్సరములో కలకత్తానుంచి ప్రకటింపబడే 'డాన్‌సొసైటీ'వారి మాసపత్రికలో అయిదు గొప్ప వ్యాసాలను వ్రాశాడు.

## 'హిందీ'లనే మునల్మానులు

అనేక భాషలయం దపారమైన పాండిత్యము సంపాదించి అరబ్బీ నాగరికతను గురించి ఫ్రెంచిభాషలో లెబాన్ గారు వ్రాసిన గ్రంథాన్ని ఉర్దూ భాషలోనికి అనువదించి,

చెన్నపురి విశ్వవిద్యాలయంలో సంస్కృత పరీక్షకుడుగా కూడా పనిచేసి 1910లో దివంగతులైన సయ్యద్ అలీ బిల్ గ్రామీగారు శికందరాబాదులో ఉపన్యసిస్తూ ఇలాగ చెప్పారు :

"హిందూ దేశపు ముసల్మానులమైన మనము తురుష్కదేశమందున్నూ, ఇతర మహమ్మదీయ రాజ్యాలయందున్నూ గల ముసల్మానులందరూ మనలను ముసల్మానులనక 'హిందీ' లని వ్యవహరించేటంతగా భారతీయసభ్యతలో లీనమైనాము. ఈ 'హిందీ' అనే శబ్దము వినడానికి 'హిందూ' అనే శబ్దానికి భిన్నంగా కనబడుతూ ఉన్నా దీని అర్థం హిందువులనియే సుమండి! ఇంతేకాదు. భారతదేశపు ముసల్మానుల మగుట వల్ల మనము మధ్య ఆసియా దేశములందలి అనాగరక మూకలకన్ననూ, తురుష్క పారశీక దేశములందలి ముసల్మానులకన్ననూ, మనను 'హిందువు'లని పిలిచే జాతులవారందరికన్ననూ కూడా సాంఘికంగానూ, బుద్ధిబలంలోనూ శ్రేష్ఠులముగా నున్నాము. పారశీక దేశములోని పూర్వనాగరికతయైన 'సస్సానియనుల' సభ్యతయున్నూ, సాహిత్యమున్నూ అక్కడికి వచ్చిన ఇస్లాములో గొప్పమార్పును కలిగించి జలాలుద్దీన్ రూమీ, ఉమర్‌ఖయ్యాములవంటి మహాకవులను సృష్టించినట్లే మనదేశంలో హిందువుల పూర్వనాగరికత, తత్త్వవేదాంతములు భారతీయ ముసల్మానులను సృష్టించినవి. వివిధ దేశములందలి పూర్వనాగరికతలు, ఇస్లాములో కలిగించిన మార్పులు పరిశోధింపతగిన విషయము."

## దుస్తులు

ఉత్తర హిందూస్థానంలో హిందువులు, మహమ్మదీయులూ ధరించే దుస్తులూ, నివసించే ఇళ్ళూ ఒకే మాదిరిగా నుంటవి. బయటకు పోయేటప్పుడు హిందువులైనా, మహమ్మదీయులైనా పాయిజామాలూ, పగ్రీలూ వేసుకుంటారు. ఇళ్ళలో - ముఖ్యంగా గ్రామాలలో - ధోవతీ, ఉత్తరీయమూ ధరిస్తారు. అనేక ప్రాంతాలలో అంగీయాయన్నూ, ఘోషాకోనం మేలిముసుగుగా వేసుకొనే జలతారు ఓణీ, కుచ్చెళ్ళు పోసి కట్టిన పమిదీ పావడాను, రవికనూ ఈ వుభయమతముల వారి స్త్రీలు భేదమేమీ లేకుండా ధరిస్తారు.

## శిల్పము

ఉత్తర హిందూ స్థానములో మతాలకు సంబంధించిన మసీదులూ, దేవాలయాలూ గాక లౌకిక జీవితానికి సంబంధించిన రాజనగరులు, బాటసారులకోసం కట్టిన సరాయిలు, వీధిలోకి కట్టిన ఇళ్ళు వాకిళ్ళు, స్నానఘట్టాలూ, రాజపుత్ర స్థానంలోను, మధ్యరాష్ట్రంలోను, అయోధ్య ఆగ్రా రాష్ట్రాలలోనూ, పంజాబులోను గల గొప్పనగరాలన్నింటిలోనూ హిందూ మహమ్మదీయుల రుచులు రెండూ కనపడే శిల్పాన్ని ప్రదర్శిస్తున్నవి గాని కేవలము ఒక్కరికే చెందినట్టి శిల్పమని చెప్పడానికి వీలైనవి కావు. హిందువుల కట్టడాలపైన గల గాలి గుమ్మటములు, వికసించినపుష్పముల వంటి స్వరూపములు, అష్టభుజముల కట్టడములు, స్తూపాలు, బురుజులు, గోడలపైన, కిటికీలపైన చెక్కిన శిల్పమూ మహమ్మదీయుల శిల్పమే! మహమ్మదీయుల కట్టడములలో అందంగా చెక్కిన రాతి పోటీ పలకలు, ముందుకు చొచ్చుకుని వచ్చే మంటపములు, నలు పలకల స్తంభములు, అడ్డముగా వేసే తనాబీలు,

బల్లపరుపు కప్పులు, అతిసున్నితంగానూ, చిత్రవిచిత్రంగానూ చెక్కిన నగిషీలూ కేవలమూ హిందువుల శిల్పమే!! ఇలాగ ఈ దేశంలో ఈ హిందూ మహమ్మదీయుల శిల్పాలు రెండూ లీనమైనట్లు మహానగరాలన్నింటిలోనూ నిదర్శనాలు కనబడుతున్నవి.

## చిత్రలేఖనము

శిల్పములోలాగనే చిత్రలేఖనంలోకూడా హిందూ మహమ్మదీయ నైపుణ్యములు మేళవించిన లక్షణాలు కనబడుతున్నవి. చక్రవర్తులు, నవాబులు ఈ కళను పోషించడంపోయి, ఇవి క్షీణించినప్పటికీ దీనియందలి సామాన్య లక్షణాలు మాత్రం పోలేదు. పారశీక సాహిత్యములోని శృంగారకావ్యముల కథలును, భారతదేశ జనసామాన్యానికి అనుశ్రుతంగా సంక్రమించివచ్చిన కథలును, భారతదేశ హిందూ మహమ్మదీయ ప్రజాజీవనమును మన దేశపు చిత్తరువులలో చిత్రింపబడి యున్నవి.

మనుష్యులనూ, మృగాలనూ చిత్రించకూడదని ఖురాను నిషేధించినందువల్ల మతావేశంగల ముసల్మానులు కొందరు ఈ కళను పోషించకపోయినప్పటికీ, మొగలాయి చక్రవర్తులున్నూ, వారి ఆశ్రితులైన నవాబులున్నూ దీనిని ప్రోత్సహిస్తూనే వుండేవారు.

మహమ్మదీయుల కాలంనాటి నుంచీ కూడా చక్కని చిన్న చిత్రాలను చిత్రించే ఒక క్రొత్తపద్ధతి హిందూ మహమ్మదీయ చిత్రకారులలో వ్యాపించింది. ఈ యుభయ మతముల కళోపాసకులూ ఒండొరులను గురుశిష్యులుగా స్వీకరించడానికి యెలాంటి అభ్యంతరమూ వుండేది కాదు.

## సంగీతము

భారతదేశంలో సజీవమైయున్న లలితకళలలో సంగీతమొకటి. దీని చరిత్రను చూస్తే హిందూ మహమ్మదీయ సభ్యతలు ఏరీతిగా మేళవించినదీ తెలుస్తుంది. ఉత్తర హిందూ స్థానంలో జంత్రగాత్రముల సంగీతవిద్య వంశపారంపర్యముగా గాయకులుగా నున్న హిందూ మహమ్మదీయ కుటుంబములలో స్థిరంగా నెలకొని యున్నది. ఈ ఉభయ మతముల గాయకులూ ఒకే విధమైన సంగీతవిద్యను అభ్యసిస్తున్నారు. ఒకే పాటలను పాడుతారు. ఒకే విధమైన జంత్రములను వాయిస్తారు. ఒకే విధమైన రాగములను ఆలాపన చేస్తారు. ఈ సంగీత విద్య పూర్వకాలంనాటి హైందవ సంగీతశాస్త్ర విధానమును పారశీక పండితులతో మేళవించి నిర్మించిన ఒక అపూర్వమైన సంగీత సంప్రదాయముగా నున్నది.

ఢిల్లీలో ఖిల్జీతుగ్లకు చక్రవర్తుల ఆస్థాన విద్వాంసుడుగా నుండిన అమీర్ ఖుస్రూ ఈ యపూర్వమైన సంగీత సంప్రదాయానికి మూలపురుషుడని అంటారు. ఇప్పుడు వాడుకలో నున్న కొన్ని రాగముల పేర్లూ, రాగిణుల పేర్లూ కూడా హిందూ మహమ్మదీయ సమ్మేళనానికి నిదర్శనములుగా నున్నవి. 'ఇమాన్ కల్యాణి' అనే రాగంలో 'ఇమాన్' అనే పారశీక పదమున్నూ, 'కల్యాణి' అనే సంస్కృత పదమున్నూ కలిసి ఏకసమానమైనవి.

హిందూ మహమ్మదీయ గాయకులు ఒండొరులకు గురుశిష్యులుగా ఉండేవారు. ఇలాగే హిందూ మహమ్మదీయ రాజులు ఉభయమతముల గాయకులనూ పోషించేవారు. ఇప్పటికీ కూడా ఉత్తర హిందూస్థానములో ఒకే తివాచిపైన హిందూ మహమ్మదీయ

గాయకులు తమ వీణలను, తంబురాలను వుంచుకొని సంగీతము పాడుతారు. హిందూ మహమ్మదీయులు ఒండొరుల కచ్చేరీలలో మృదంగములను, తబలాలను వాయిస్తారు. అన్నింటికంటే అపూర్వమైన సంగతి యేమిటంటే ఈ హిందూ మహమ్మదీయ గాయకులు పాడే పాటలలో రాధాకృష్ణ శృంగారగీతములు, రామభజన కీర్తనలు, శివతత్త్వములు, మహమ్మదీయ సూఫీగీతములు, అల్లానుద్బోధించే తరంగాలూ ఎట్టి మతభేదమూ లేకుండా పాడతారు.

## పాటలు - పదాలు

సంగీత విద్యలోలాగానే ప్రజలు పాడుకునే సామాన్యమైన గాలిపాటలలోనూ, పదాలలోనూ హిందూ మహమ్మదీయ జనసామాన్యము ఇప్పటికీ ఒకే విధమైన పాటలూ, పదాలూ పాడతారు. ఉత్తర హిందూ స్థానంలో హిందూ మహమ్మదీయుల ఇళ్ళల్లో జరిగే శుభకార్యాలలోనూ, హిందూ మహమ్మదీయుల పండుగలలోనూ, బాలబాలికల పుట్టినరోజు పండుగులలోనూ, పెళ్ళిళ్లలోనూ స్త్రీలు ఒకే విధమైన పాటలు పాడతారు. పిండి విసిరేటప్పుడు, బరువు మోసేటప్పుడు, పడవలు లాగేటప్పుడూ ఇళ్ళదాబాలమీద సున్నమునకు జిగిరావడానికి కొట్టేటప్పుడు, ఇంకా నలుగురు కలిసి కాయకష్టం చేసే అన్ని సందర్భాలలోనూ కూడా మన దంపుళ్ల పాటలు, రోకండిపాటలు, పడవపాటలలాంటి పాటలనే అక్కడకూడా పాడుతూవుంటారు. ఇందులో హిందూ, మహమ్మదీయ భేదము లేనేలేదు.

బీహారు పరగణాలలోనూ, ఉత్తర హిందూస్థానములో అనేక ప్రాంతాలలోనూ ముసల్మానులిళ్లల్లో పాడే జోలపాటలు 'నంద్‌లాల్' అని శ్రీకృష్ణుణ్ణి ఉద్దేశించి వ్రాయబడిన హిందువుల పాటలే! కృష్ణుని శ్యామలవర్ణమునే 'శాన్‌వాల్య' అనే పదముగా మార్చి పాడుతూ ఉన్నట్లు పరిశోధకులు కనిపెట్టినారు.* ఇలాగే బీహారులోనూ, ఉత్తరదేశ పరిగణాలలోనూ మహమ్మదీయ స్త్రీలు పాడే పెళ్ళిపాటలుకూడా హిందువులవే. ఉదాహరణానికి ఈ క్రింది పాట చూడండి.

** అచ్ఛేలి జవ్వా మన్ కరే నంద్‌లాల్‌నే*
*సోహాగన్ జవ్వా మన్ కరా నంద్‌లాల్‌నే*
*అచ్ఛేలి నే ముఝే దరేదియా*
*శాన్‌వాల్యానే ముఝే దరేదియా.*

అనగా, "నందలాలే తన కడుపున పుట్టాలని తల్లి మనసారా కోరింది. ఆనంద భరితురాలైన ఆ తల్లి నందలాలే తన కడుపున పుట్టాలని కోరింది. మా అబ్బాయి నన్ను బాధలు పెట్టాడు; నీల (మేఘ) శ్యాముడు నన్ను బాధలు పెట్టాడు" అని యీపాట తాత్పర్యము. ఈ పాటలో "నందలాల్, శాన్‌వాల్యా" అనే మాటలు శ్రీకృష్ణుని ఉద్దేశించి నవేనని ఒక మహమ్మదీయ గ్రంథకర్త వ్రాసియున్నాడు. (1910వ సం. 'మోడరన్ బీహార్' 8వ పుటలో బ్యారిష్టర్ మజ్రుల్ హక్కు గారి వ్యాసం చూడండి)

ఉత్తర హిందూస్థానంలో పంజాబు రాష్ట్రంలో వివిధ గ్రామాలలో హిందూ మహమ్మదీయ ప్రజలు పాడేపాటలలోని కథలలో కూడా తేడాలులేవు. ఇలాగ హిందువులు మహమ్మదీయుల కథలనూ, మహమ్మదీయుల, హిందువుల కథలను పాటలుగానూ, కలాపాములుగానూ, వీథినాటకములుగానూ పాడుకొంటున్నారు.

## భాష - సాహిత్యము

వంగరాష్ట్రంలో మహమ్మదీయు లందరూ బంగాళీ భాషనే మాట్లాడుతారు. ఇలాగే పంజాబులో పంజాబీనీ, సింధులో సింధీభాషనూ, ఇతర ప్రాంతాలలో ఆయారాష్ట్ర భాషలనూ మాట్లాడతారు. ఉత్తర హిందూ స్థానంలో విద్యావంతులైన హిందువులూ, మహమ్మదీయులూ కూడా మాట్లాడేటప్పుడుగాని, పద్యగద్యరూపంగా గ్రంథాలు వ్రాసేటప్పుడు గాని ఉర్దూ భాషనే వాడతారు. ఉర్దూ భాష వ్యాకరణము మన దేశభాషల సంప్రదాయానికి చెందినదే. అందులోని శబ్దాలుమాత్రం ఎక్కువగా ఫారసీభాషలోనివి. ఈ ఉర్దూ భాషలో ఉత్తమగ్రంథాలు రచించినవారిలో హిందువులూ, మహమ్మదీయులూ కూడా సమానంగా వున్నారు. హిందువులలో ఉర్దూ భాషలో సుప్రసిద్ధుడైన కవి దయాశంకర్ నశీం. వచనంలో పేరుపొందిన గ్రంథకర్త పండిత్ రతన్‌నాథ్.

ఇంతేకాదు, పారశీకభాషలోనుంచి మన దేశభాషలలోకి కూడా చక్కనిపదాలు చాలావచ్చి కలిసినవి. మన దేశ భాషలలో పాండిత్యము సంపాదించిన మహమ్మదీయులు కూడా చాలామంది ఉన్నారు. తరువాత కొంతకాలానికి తులసీదాసు సుప్రసిద్ధమైన తన రామాయణాన్ని రచించిన అవధి - హిందీ భాషలో - క్రీ.శ. 1540లోనే మలీకు మహమ్మదు అనే ముసల్మాను కవి 'పద్మావతి' అనే చక్కని కావ్యాన్ని రచించాడు. ఇందులో భూలోక సుందరియైన పద్మావతి, ఆమె భర్త రతన్‌సింగుల ప్రణయగాథ, అల్లాయుద్దీన్ చక్రవర్తి చిత్తూరు దుర్గాన్ని ముట్టడించగా పురుషులు వీరస్వర్గాన్ని అలంకరించడము, రాజపుత్ర స్త్రీలు జోహారు చేయడము మొదలైన అంశాలను ఎంతో రసవంతంగా ఈ ముసల్మాను కవి వర్ణించాడు.

జీవాత్మ, పరమాత్మకోసం వెదుక్కునే అంతరార్థాన్ని కూడా ఆ కావ్యంలో స్ఫురింప జేయడంవల్ల ఈ కవికి హిందువుల సంగతి ఎంతబాగా తెలుసునో, వారియందెంత స్నేహభావ మున్నదో - కనబడుతూవుంది.

హిందీభాషలో ఉత్తమగ్రంథాలను రచించిన ముసల్మానులలో అక్బరు చక్రవర్తి సభలోని నవరత్నాలలో ఒకడైన రహీము ఖాన్ ఖానన్ తాను హిందీలో కవిత్వం చెప్పడమే గాక, హిందీ సాహిత్యానికి పోషకుడుగా కూడా ప్రసిద్ధి కెక్కినాడు. అతడు రాధాకృష్ణ శృంగార గీతముల నెన్నో రచించాడు.

బంగాళీభాషలో కవిత్వం చెప్పిన మహమ్మదీయులు చాలామంది ఉన్నారు. మలీకు మహమ్మదుగారి 'పద్మావతి'ని అల్వాల్ అనేకవి బంగాళీభాషలోకి చక్కగా అనువదించాడు. వంగరాష్ట్రాన్ని పరిపాలించిన మహమ్మదీయ నవాబులు చాలామంది బంగాళీ సాహిత్యాన్ని బాగా ఆదరించారు. చైతన్యస్వామి ప్రచారంచేసిన వైష్ణవమతము కొంతమంది మహమ్మదీయులను ఆకర్షించినది. ఆ కాలంలో వైష్ణవ మతంలో కలిసిన ముసల్మానులలో

హరిదాసు ఒకడు. అలాంటి వారిలో కొంతమంది రాధాకృష్ణులను గురించి, చైతన్య స్వామిని గురించి పదాలూ, పాటలూ రచించారు. దినేశ చంద్రసేను, అబ్దుల్ కరీము, బ్రజసుందర సన్యాల్‌గార్లు చేసిన కృషివల్ల బంగాళీభాషలో ఈ విధంగా వైష్ణవ గ్రంథాలను రచించిన ముసల్మాను వైష్ణవకవుల పేర్లు 24 దాకా బయటబడినవి. ఈ కవులలో సయ్యద్ మర్తుజాగారి వైష్ణవగీతము లతిరమణీయంగా నున్నవని తెలిసినవారంటున్నారు.

ఇలాగ ఈ ప్రాంతాలలో హిందువులకు, మహమ్మదీయులకు కూడా బంగాళీభాషే మాతృభాషగా నుండడమేగాక ఉభయులకూ భారతీయ సాహిత్య సంప్రదాయములే ప్రీతికరంగా ఉంటున్నవని స్పష్టంగా కనబడుతూవుంది.

పంజాబులోను, అయోధ్య, ఆగ్రా రాష్ట్రాలలోనూ చాలాకాలంనుంచి ఉర్దూ భాషా, పారశీభాషా విద్యాధికుల యాదరణకు పాత్రములై ఉంటున్నవి. వీరికి భారతీయ సాహిత్య సంప్రదాయములకంటె పారశీక సాహిత్య సంప్రదాయాలే ఎక్కువ ఆదరణ పాత్రంగా నుంటూవున్నవి. అందువల్ల యీ ప్రాంతాలలో సామాన్యజనులలో మహమ్మదీయులలాగనే హిందువులలోకూడ హైందవపురాణ కథల కన్నా, భారతీయ సాహిత్య విషయాలకన్నా 'యూసుఫ్- జులేఖా', 'షిరీన్ - ఫరీద్', 'గులేబకావలి', 'లైలా మజ్నూన్' మొదలైన పారశీక కావ్యకథలే ఎక్కువ బాగా తెలుసును. ఇటీవల కొంతకాలము క్రిందట ఆ ప్రాంతాల హిందువులు  తమ మతానికీ, పూర్వనాగరికతకూ, విజ్ఞానానికీ సంబంధించిన సాహిత్యంకూడా బాగా తెలుసుకోవడం అవసరమనే ప్రచారం కూడా చేయవలసి వచ్చింది.

## వాణిజ్యము - పరిశ్రమలు

ప్రజల వేషభాషలలోలాగనే వాణిజ్య వ్యాపారములలోను, పరిశ్రమలలోను, వృత్తులలోనూ కూడా హిందూ మహమ్మదీయ సమ్మేళనము కనబడుతూ ఉంది. హిందువులు అతిపవిత్రంగా నెంచి, అన్ని శుభకార్యాలలోనూ మడిబట్టగా ధరించే కాశీపట్టు తాపితాలు నేసేవాళ్ళు మహమ్మదీయ నేతగాళ్ళే! ఈ తాపితాలలోను, అంచులలోను నేతలోనే కనబడే పట్టుజలతారు డోరియాలు, పువ్వులు, చిత్రములు కేవలమూ హిందువుల ఆచారమునకు సంబంధించిన నమోనాలే. దీనిని మహమ్మదీయులు నేయడమూ, హిందువులు ధరించడమూ చూడగా నొకరి ఆచార వ్యవహారాల నొకరెంత చక్కగా గ్రహించి అందు కనుగుణ్యముగా కావలసిన వస్తుసామగ్రి నెంత శ్రద్ధతో తయారు చేయగలరో తెలుస్తుంది.

ఇలాగే పూజలలో ఉపయోగించే శ్రీయంత్రమును స్ఫటికముపయిన చెక్కే శిల్పులు మహమ్మదీయ పనివాళ్ళే. మంత్రశాస్త్రమునకు సంబంధించిన యంత్ర తంత్రములలో ఒక్క బీజాక్షరముగాని, భుజముగాని తప్పారాకుండా చెక్కవలెనంటే ఎంత శ్రద్ధాభక్తులతో ఆపని చెయ్యాలో ఊహించవచ్చును.

హిందూ మహమ్మదీయులు ఇళ్ళలో నుపయోగించే హుక్కాలు, పాన్‌దానులు, అత్తరదానులు, తివాచీలు, ఇంకను గొప్పవాళ్ళు ఉపయోగించే వివిధములైన వస్తువులూ, హిందూ మహమ్మదీయ పారిశ్రామికులు ఎలాంటి మతభేదమూ లేకుండా తయారుచేస్తారు. ఇత్తడి సామానులమీదా, రాగి సామానులమీదా, లక్కతో నగిషీపనిచేసే కులవృత్తి మహమ్మదీయులది. అయితే జయపురంలో హిందూ పారిశ్రామికులీపని నేర్చుకొని ఈ

వస్తువులను తయారుచేయడం ప్రారంభించి ఈ సామానులమీద హిందువుల పురాణ కథలను గూర్చిన చిత్రములూ, మతసంబంధమైన ఇతర నమోనాలు, బొమ్మలు చెక్కేవారు. ఇది చూసి ఈ జయపురపు హిందూ పారిశ్రామికుల లాగనే మహమ్మదీయ పారిశ్రామికులు కూడా ఈ బొమ్మలను, నమోనాలను వెయ్యడం ప్రారంభించారు. లుంగీలూ, పగ్గీలనే తలపాగాలూ చేసే వృత్తిలో హిందువులూ, మహమ్మదీయులూ కూడా నున్నారు. అనేక గృహ పరిశ్రమలలో ఒక వస్తువును కొంతవరకూ ఒకజాతి పనివాడూ, తక్కిన భాగమును రెండవజాతి పనివాడూ చేయడముకూడా కద్దు. కీన్కాబు, జరీ, పట్టు, ఖటేదారీ పరిశ్రమలలో మతలబును తయారుచేసే పనివాళ్ళందరూ హిందువులే. కీన్కాబు కార్ఖానాలన్నీ హిందువులవే. కాశీలో కీన్కాబు నమోనాలు తయారు చేసేవారందరూ మహమ్మదీయులు. నేతగాళ్ళలో హిందువులూ, మహమ్మదీయులు కూడా వున్నారు. వీటిని విక్రయించే వర్తకులందరూ హిందువులే. హిందూ రాజ్యాలైన రాజపుత్ర స్థానంలోని సంస్థానాలలో రాళ్ళను చెక్కే శిల్పులందరూ మహమ్మదీయులే.

## మతము

మతవిషయంలో కూడా హిందూ మహమ్మదీయ సమ్మేళనకు నిదర్శనాలు కనబడుతున్నవి. హిందూదేశంలో జన్మించిన వాళ్ళందరికీ సాకారేశ్వరారాధనమున్నూ, కర్మకాండయున్నూ సామాన్య ధర్మములుగా నుంటున్నవి. హిందూ దేశంలోని మహమ్మదీయులలో చాలామంది హిందువులుగా నుండినవాళ్ళు. ఇంతేగాక ఈ దేశంలోకి మహమ్మదీయ మతం సూటిగా అరబ్బీ దేశంలోనుంచిగాక మధ్యమజిలీయైన పారశీక దేశంలోనుంచి వచ్చినందువల్ల పారశీక దేశంలోనే కొంత మార్పుచెంది యిక్కడికి వచ్చినది. ఇలాగ కొంత మార్పు చెంది వచ్చిన యీ మహమ్మదీయ మతము ఈ దేశంలోని హిందువుల వైదికమత ధర్మాలతో ఏడు శతాబ్దాలు సహవాసం చేసింది. అందువల్ల యీ మహమ్మదీయ మతము ఆచారాలలోను, కర్మకాండలోను ఇక్కడ చిత్రవిచిత్రాలైన మార్పులను జెంది ఇతర దేశాలలోనున్న ఇస్లాము మతధర్మాలకు చాలా విషయాలలో భిన్నంగా పరిణమించి యున్నది. ఈ పరివర్తన మెంతవరకూ జరిగినదనగా ఉత్తర హిందూస్థానములోని జన సామాన్యము ఈ ప్రకారంగా మార్పు జెందిన ఇస్లాం మతముయొక్క ఆరాధనలందున్నూ, ఉత్సవములందున్నూ, పండుగలలోనూ పాల్గొనడానికి గాని, మహమ్మదీయుల పవిత్ర స్థలాలకు తీర్థయాత్రలకు పోవడానికిగాని హిందువులకు ఎలాంటి సంకోచమూ లేకుండా హిందువులు అలా చేస్తున్నారు. హిందువులలాగానే మహమ్మదీయులలో సామాన్యజనులు కూడా హిందువుల ఆరాధనలలోనూ, ఉత్సవాలలోనూ, ప్రదర్శనాలలోనూ పాల్గొంటూ వారి యాత్రాస్థలాలకు పోతున్నారు.

## పీర్లు - మొక్కుబడులు

హిందూ మతధర్మాల సాహచర్యంవల్ల మార్పు చెందిన ఇస్లాంను గురించి ప్రాచ్యపాశ్చాత్య గ్రంథకర్త లనేకులు పరిశోధనలు చేసి వ్రాసియున్నారు. ఈ మార్పు ముఖ్యంగా పీరులనబడు మహమ్మదీయ మహాత్ముల పవిత్రస్థలములలో జరిగే

మొక్కుబడులలోనూ, పూజలలోనూ, ఉత్సవాలలోనూ, సంతలలోనూ బాగా కనబడుతూ ఉంది. ఈ పీరుల యారాధనము హిందూ దేశపు సరిహద్దులు దాటినతరువాత యింకయే మహమ్మదీయ రాజ్యంలోనూ లేదు. ఇది హిందువులలో పూర్వం బౌద్ధ బోధిసత్త్వులకూ, జైన తీర్థంకరులకూ, వైష్ణవ ఆళ్వారులకూ, శైవ భక్తులకూ జరిగే ఆరాధనలు, అర్చనలు, మహోత్సవములు వంటివే.

హిందువులు ముప్పైమూడుకోట్ల దేవతలను ఆరాధిస్తూ వారికి మొక్కుకుంటూ ఉన్నట్లే మహమ్మదీయులైన హిందువులకు కూడా ఒక విధమైన ఆరాధనలు, అర్చనలు, మొక్కుబళ్ళు, ఉత్సవాలూ అవసరమై ఈ పీరుల ఆరాధన బయలుదేరింది. ఈ ప్రజలకు ఆపదవచ్చినప్పుడు పీరులకు మొక్కుకోవడమూ, సామాన్యజనులు తమ యిష్టసిద్ధులు చేయవలసిందని పీరులకు మొక్కుకోవడమూ కూడా ప్రబలింది. హిందువుల దేవతల లాగనే మహమ్మదీయుల పీరులు కూడా మంచిచెడులకు కారణభూతములైనట్లే ప్రజలు విశ్వసించి అందు కనుగుణముగా వారి నర్చించడం ప్రారంభమైనది. దీనితోపాటు వ్యాజ్యములు గెల్పించమని మొక్కులు, ప్రయాణంలో కార్యసాఫల్యం చేయుమని మొక్కులు తాయత్తులు, శకునములు, దీవనలు మొదలైన హిందూ ఆచారాలన్నీ మహమ్మదీయులలో కూడా ప్రబలమైనవి. ఇలాంటి పీరులను కొలిచే మహమ్మదీయ జనసామాన్యము తోడి హిందువులను చూసి గ్రామదేవతలకు మొక్కుకోవడమూ, గొట్టాలమ్మా, మహమ్మారీ మొదలైన క్షుద్ర దేవతలను కొలిచే బీద హిందువులు మహమ్మదీయ సోదరుల పీరులకు మొక్కుకోవడమూ, ఫకీరుల దీవెనలూ, పైగంబరుల ఆశీర్వాదములు పొందడమూ ఒక వింత సంగతి కాదు.

## పండుగలు - పర్వములు

భారతదేశమున మహమ్మదీయులు తమ మతానికి సంబంధించిన ఉత్సవాలు జరపడంలోకూడా అనేక హిందూ సంప్రదాయాలను అవలంబించారు. అరబ్బీ దేశంలోని ఇస్లాములో ఎట్టి సాకార దేవతార్చనముగానీ, మేళతాళములు, నృత్యగీత వాద్యములుగాని లేక ఆనందరహితమైన మానసికారాధన ప్రార్థనలు మాత్రమే వుండేవి. మనదేశానికి వచ్చిన మహమ్మదీయులు చిరకాలంనుంచి హిందూ సంప్రదాయాలకు అలవాటుపడి తాము జీవించే దేశంలోని ప్రకృతి దృశ్యాలకూ, జంతువులకూ, భూసారముపైన ఆధారపడే పాడిపంటలకూ సంబంధించి, ఇంద్రియములకు మనోభావములకూ రుచించే ఆచార వ్యవహారములు, కర్మకాండలకు అలవాటుపడిన ప్రజలకు ఈ ఆనందరహితమైన వీర మహమ్మదీయ మతాచారధర్మములు రుచించలేదు. అందువల్ల మన మునల్మానులు తమ మనోభావాలకు, వాంఛలకు అనుగుణములైన పండుగలు, పర్వములు, ఉత్సవములు, ఊరేగింపులు, అర్చనలు, ఆరాధనలూ కల్పించుకొన్నారు. హిందువుల గంగాపూజలకు బదులుగా మహమ్మదీయులు భాడ్‌నే (భాద్రపద) మాసమున 'క్వాజాఖిజిర్' పండుగను చేయడం ప్రారంభించారు. పూర్వ కాలంనాటి మహమ్మదీయ మత యుద్ధానికి సంబంధించిన మొహరం పర్వదినములందు మహమ్మదీయులు చేయు ప్రార్థనా దినములూ, ఉత్సవములూ భారతదేశమందు నూతనరూపం దాల్చినవి. దానిని హిందువుల

పండుగలాగ మార్చి, హిందువులు అవలంబించే అనేక ఆచారాలూ, కర్మకాండలూ మన ముసల్మానులు ఈ మొహరంలో అవలంబిస్తున్నారు.

## ప్రాచ్యపాశ్చాత్య గ్రంథకర్తల సాక్ష్యము

ప్యారిస్‌లో ప్రాచ్యదేశ భాషల పండితుడుగా నుండిన మా. గార్సిన్ డీ టాసీ (M Garcin-de Tassy) గారు భారత దేశమునందలి హిందూస్థానీ పాంతీ సాహిత్యమును తరచి హిందూ దేశములో మహమ్మదీయ మతము పొందిన మార్పులను గురించి 1831లో ఒక గొప్ప వ్యాసాన్ని వ్రాసి ప్రకటించారు. కాజీం అలీ జవాన్ సాహెబుగారు హిందూస్థానీలో వ్రాసిన 'బారామాష్' (పన్నెండు నెలలు) అనే గ్రంథంలోనుంచీ షేర్ అలీ అఫ్గన్ సాహెబుగారు రచించిన హిందూస్థాన చరిత్రలోనుంచీ, ఇంకనూ ఇతర ముసల్మాను గ్రంథకర్తల ఉద్గ్రంథాలలోనుంచీ ఈటాసీగారు తాను వ్రాసిన సంగతులన్నీ గ్రహించినందువల్ల ఈ విషయంలో ఇది చాలా ప్రమాణగ్రంథంగా ఉంది. ఇలాగే మా గస్టవ్ లీబాన్ అనే ఇంకొక ఫ్రెంచి గ్రంథకర్తకూడా 'భారతదేశమునందలి నాగరికతలు' అనే గ్రంథంలో హిందూ దేశంలో మహమ్మదీయ మతాచారాలు పొందిన మార్పులను గురించి చక్కగా వివరించియున్నాడు.

విదేశీయులే గాక భారతీయులుకూడా - అందులో సుప్రసిద్ధ విద్వాంసులైన మహమ్మదీయ ప్రముఖులు కూడా ఈ విషయాన్ని గురించే వ్రాసియున్నారు. యూసుఫ్ అలీ ఎం.ఏ., ఎల్.ఎల్.బి., ఐ.సి.ఎస్. గారు 'భారతదేశ ప్రజల జీవనము, వృత్తులు' అనే గ్రంథంలో ఈ విషయాన్ని బాగా చర్చించి, హిందువులు తమ పితృదేవతలకు పిండములు పెట్టుతూవుంటే, హిందూదేశంలోని మహమ్మదీయులు 'షిర్నీ' యనే ఆచారాన్ని అవలంబించియున్నారనిన్నీ, గ్రామాలలోని జులహా తేలీ మహమ్మదీయులు హిందువుల లాగనే మశూచికాలు రాకుండా గ్రామదేవతలకు మొక్కుతున్నారనిన్నీ, హిందువులు కాశీ రామేశ్వరాలకు పోయినట్లే మహమ్మదీయులు ఘాజీమియాన్ గోరీ దగ్గరికి యాత్రకు పోతున్నారనిన్నీ, పాంచన్ పీరులను గురించి పాటలు పాడతారనిన్నీ 1910లో వ్రాసియున్నారు.

దళ్లియు. క్రూక్ (Crooke) అనే ఐ.సి.యస్. ఉద్యోగి The North Western Provinces of India అనే తన గ్రంథములో ఇలాగ వ్రాశాడు.

"ఎట్టి కళంకముగాని, కల్మషముగాని అనాచారములు గాని, మూఢ విశ్వాసములు గాని లేక ఖురాను షరీఫులో సూత్రప్రాయంగా నిర్వచింపబడిన ఇస్లాము సిద్ధాంతాలను అవలంబించే మహమ్మదీయులు ఈ భారతదేశంలో బహుకొద్దిమంది మాత్రమే ఉన్నారు. ఇలాంటి కఠిన నియమాల మతాన్ని అనుష్ఠించేవారిలో వాహబీలు, లేక అహల్-ఏ-హాదీలను వారు మాత్రమే యున్నారు. విగ్రహారాధనకు దగ్గర సంబంధంగల ఆచారాలనూ, ఉత్సవాలనూ, పీరుల గోరీలదగ్గర మొక్కులనూ వీరు అంగీకరింపక అట్టి ఆచారాలను అవలంబించే ముసల్మానులను 'ముష్రకులు' - అనగా భగవంతునితో ఇంకొక వ్యక్తిని కలిపేవారని వ్యవహరిస్తున్నారు. పొగచుట్ట తాగడమును, తావళము తిప్పడమును కూడా వీరు సహించరు."

పూర్వకాలముకంటె తరువాతకాలంనాటి మహమ్మదీయ మతము హిందూ మతాచారాలపట్ల చాలా సహనం చూపిస్తూవచ్చిందని పైన చెప్పిన డబ్లియు క్రూకుగారు పశ్చిమోత్తర పరగణాలను గూర్చి 1897లో ప్రకటించిన గ్రంథంలోనే వ్రాసినాడు.

ముసల్మానులూ, హిందువులూ కలిసి పీరులను ఆరాధించే పద్ధతులూ, వారి గౌరవార్థము చేసే ఉత్సవాలూ, పీరుల గోరీల దగ్గరికి తీర్థయాత్రలు చేసేటప్పుడు అవలంబించే పద్ధతులూ వర్ణించాలంటే ఒక పెద్ద గ్రంథం అవుతుంది.

## ఆంధ్ర ముసల్మానులు

మన తెలుగుదేశంలో మహమ్మదీయుల ఇళ్ళల్లో చేసే జాతకర్మలు, వివాహాది శుభకార్యాలలోను, పండుగలు పబ్బాలలోను అవలంబించే ఆచారాలు మన ఆచారాలకు చాలా సన్నిహితంగా వుండడం అందరికీ తెలుసును. పెళ్ళిళ్ళలో పెళ్ళికూతురుకు పసుపు నలుగు పెట్టడం దగ్గరనుంచీ పెళ్ళికుమారుడిని మల్లెపువ్వుల జాలరుతో గుర్రంమీద కత్తితో ఊరేగించడంవరకూ మన క్షత్రియ కులాచారాలే ముసల్మానులలోకూడా కనబడుతున్నవి. మహమ్మదీయులలో చచ్చిపోయినప్పుడు చేసే విపరకర్మలు కూడా చాలా వరకూ హిందువులు చేసేటటువంటివే వున్నవి. వారి 'ఫాతెహా' మన స్వర్గపాథేయమునకు చాలా సన్నిహితంగా వుంది. ఆఖరికి ఒకవిధమైన తద్దినాలు కూడా వాళ్ళు పెడుతున్నారు. ఇంక మంచిరోజులనీ, వర్జ్యమనీ, వారమనీ వాళ్ళలోకూడా చాలా పట్టింపులు ఉన్నవి. ఎన్ని కబుర్లు చెప్పినా ప్రక్క ఇంటి హిందువు పాటించే శకునాలను ఇరుగుపొరుగు మహమ్మదీయుడు పాటించకుండా వుండలేకపోతున్నాడు. ఇప్పటికీ గ్రామాదులలో హిందువులూ, మహమ్మదీయులూ అన్యోన్యంగా వుంటూ వరసపెట్టి పిలుచుకుంటూ భారతభూమి కడుపున పుట్టిన అన్నదమ్ముల లాగనూ, అక్కచెల్లెళ్ళ లాగనూ జీవిస్తున్నారు. ఇదంతా మనకు అనుభవైక వేద్యమేకదా!



# 8. చెన్నపట్నం గవర్నరు దుర్గతి

ఇంగ్లీషువా రీదేశానికి వర్తకం చేసుకోవడానికి వచ్చేటప్పటికి విజయనగర సామ్రాజ్యం విచ్ఛిన్నం అయినా చెన్నపట్నం సముద్రతీర ప్రాంతాలన్నీ ఆ చక్రవర్తుల వంశీకులైన చంద్రగిరిరాజుల పరిపాలనలోనే వుండేవి. ఆ రాజుగారి క్రింది అధికారిని ఆశ్రయించి ఇంగ్లీషువారు 1639లో పట్టాపొంది చెన్నపట్టణం దగ్గర ఒక కోట కట్టుకుని అక్కడ వర్తకం చేసుకుంటూ వుండగా దేశమంతా గోలకొండ నవాబుల వశమైంది. తరువాత 1687లో మొగలాయి చక్రవర్తియైన ఔరంగజేబు గోలకొండను జయించగా యీ ప్రాంతాలన్నీ ఆయన సుబేదారుడైన కర్నాటక నవాబు పరిపాలన క్రిందికి వచ్చినవి. ఇంగ్లీషువారు ఏయెండకు ఆ గొడుగుపట్టుతూ మొదట చంద్రగిరి రాజులనూ, తరువాత

గోలకొండ నవాబులనూ, అటుతరువాత కర్నాటక నవాబునూ ఆశ్రయిస్తూ కాలక్షేపం చేసేవారు.

## ఆర్కాటు నవాబు

ఇలాగ ఉండగా దేశంలో అంతఃకలహాలు కలిగి ఇంగ్లీషువారు బలవంతులై మనరాజులను, నవాబులను బంతులనాడించినట్లు ఆడించి రాజ్యాధికారాలను చేజిక్కించు కోవడానికి అవకాశాలు కలిగినవి. కర్నాటక నవాబు అన్వరుద్దీను 1749లో చనిపోగా అతని కుమారుడైన మహమ్మదాలీ నవాబు అయినాడు. పూర్వపు నవాబుగారి అన్న కుమారుడి అల్లుడైన చందాసాహేబు ఈ కర్నాటక రాజ్య సింహాసనాన్ని ఆక్రమించాలని సంకల్పించి ఈ విషయంలో తనకు సహాయం చేయవలసినదని అప్పట్లో పుదుచ్చేరీ ప్రాంతాలలో బలవంతులుగానున్న ఫ్రెంచివర్తక కంపెనీ వారిని ఆశ్రయించాడు. అప్పుడు మహమ్మదాలీ సహజంగా, ఫ్రెంచి వారికి పోటీగానున్న ఇంగ్లీషు వర్తక కంపెనీ వారిని ఆశ్రయించాడు. అంతట ఈ కర్నాటక రాజ్యసింహాసనం కోసం యుద్ధాలు ప్రారంభమైనవి. ఆ యుద్ధాలలో ఇంగ్లీషువారు జయించడంలో మహమ్మదాలీ రాజ్యాధికారం స్థిరపడింది. అతడు ఇంగ్లీషువారికి వశుడై వారిచేతులలో కీలుబొమ్మయై వారేలాగ చెప్పితే అలాగ వినవలసి వచ్చినది. కర్నాటక రాజ్యానికి మహమ్మదాలీ పేరునకు నవాబుగా నున్నాడుగాని నిజమైన ప్రభుత్వాధికారాలన్నీ ఇంగ్లీషువారే చలాయించడం ప్రారంభించారు. యుద్ధాలలో సహాయం చేసినందుకు సాలుకు ఏడులక్షల వరహాలు నవాబు కంపెనీవారి కివ్వాలి. అది చెల్లించడానికి సొమ్ములేక నవాబు ఋణాలు చేయవలసి వచ్చింది.

కర్నాటక నవాబు మొదట ఆర్కాటును రాజధానిగా చేసికొని యున్నందువల్ల ఆయనను ఆర్కాటు నవాబు అనికూడా అనేవారు. తరువాత అతడు చెన్నపట్నం చేరి ఒక దివ్యభవనంలో కాపురంవుంటూ వచ్చాడు. అతడు తన భోగవిలాసాలకోసమూ, ఇంగ్లీషు అధికారులను మెప్పించడము కోసమూ దుర్వ్యయం చెయ్యడం ప్రారంభించాడు. కంపెనీ ఉద్యోగులకు బహుమతులూ, లంచాలూ విరివిగా నిచ్చేవాడు. చాలామంది దొరలకు ఉద్యోగాలిచ్చి తనవద్ద వుంచుకొనేవాడు. 1758-1780 మధ్య అతని ఆతిథ్యమును పొందిన దొరలూ, దొరసానులూ అతని దర్బారు వైభవమును, భోగవిలాసాలను, దుబారాఖర్చును చిత్రవిచిత్రాలుగా వర్ణించియున్నారు. ఆర్కాటు నవాబు యొక్క రాజ్యాధికారము కేవలమూ ఇంగ్లీషు వారి దయాధర్మాలపైననే ఆధారపడి వున్నందువల్ల ఏదో నెపంమీద చీటికిమాటికీ కంపెనీ అధికారులు అతనిని సొమ్ము ఇవ్వవలసిందని పీడించేవారు. కొందరు ఉద్యోగులు అతనిని నయాన భయాన సొమ్ము తెమ్మని బలవంత పెట్టేవారు. కొందరు అతనికి సహాయం చేస్తామని మోసగించి సొమ్ము కాజేసేవారు. ఇన్ని విధాలుగా సొమ్ము పిండుతూవుంటే నవాబుకి ఎంత సొమ్మైతే చాలుతుంది గనుక? అందుకోసం అతడు అప్పులపాలు కావలసివచ్చింది.

నవాబు తన అవసరంకొద్దీ ఎక్కువ వడ్డీలకు ఋణ పత్రాలు వ్రాసి యిచ్చేవాడు. కొందరు ప్రబుద్ధులు అతనిని మోసగించి, బలవంతపెట్టి నూటికి 24 మొదలు 48 వంతుల చొప్పున అత్యధికమైన వడ్డీలువేసి ప్రతిఫలశూన్యంగా కూడా కొన్ని ఋణపత్రాలు

వ్రాయించుకున్నారు. ఇలాగ వ్రాయించుకొన్న ఋణపత్రాల తాలూకు సొమ్ము వెంటనే ఇవ్వవలసిందని బలవంతపెట్టి యివ్వకపోతే కంపెనీ అధికారులకు చెప్పి తగిన శాస్తి చేయిస్తామని బెదిరించి అందుక్రింద అతని రాజ్యభాగాలను స్వాధీనతాకట్లు వ్రాయించు కొనిన్నీ, శిస్తుల వసూళ్ళ యిజారా హక్కులను పొందిన్నీ, అతని రాజ్యంలో ప్రవేశించి శిస్తుల వసూళ్ళలో రైతులను బాధించడం ప్రారంభించారు. ఈ పత్రాలను దొరలు బాహాటంగా బజారులోపెట్టి క్రయవిక్రయాలు చెయ్యడం ప్రారంభించారు. ఆ కాలంలో చెన్నపట్నంలో ఇంగ్లీషు వర్తకం కంపెనీవారి కొలువులో పనిచేసే గొప్ప అధికారులైన దొరలలో చాలామంది ఇలాంటి పత్రాలు వ్రాయించుకొని యీ యన్యాయాలలో భాగస్వాములై ఉన్నందువల్ల ఆర్కాటు నవాబు ఋణపత్రాల మార్పిడి ఒక పెద్ద వ్యాపారంగా సాగింది.

చెన్నపట్నం గవర్నరు కార్యాలోచనసభలో వ్యవహారాలన్నీ అధిక సంఖ్యాక సభ్యుల అభిప్రాయాన్ని బట్టి జరగాలనే నియమం ఒకటి యున్నందువల్ల ఈ నవాబుగారి బాకీ దారులు కార్యాలోచన సభ్యులకు లంచాలిచ్చీ భాగాలిచ్చీ వారిని లోబర్చుకొని తమకు కావలసిన అధికారాలను, ఉత్తర్వులనూ సంపాదించేవారు. అందువల్ల కంపెనీ ఉద్యోగులలో ఎవరైనా ఈ అన్యాయానికి అంగీకరించక వాటిని ప్రతిఘటిస్తే తక్కిన వారందరూ వేటకుక్కలలాగ అతని మీదపడి బాధించేవారు. అందువల్ల ఎవ్వరూ ఈ యన్యాయాన్ని అరికట్టలేకపోయేవారు. కొంతమంది గవర్నర్లు కూడా ఈ యన్యాయవు వ్యవహారాలలో భాగస్వాములైనట్లు కంపెనీ రికార్డులవల్ల కనబడుతూ ఉన్నది.

కంపెనీ వారికి సైనిక వ్యయంక్రింద సాలుకి ఏడులక్షల వరహాల చొప్పున చెల్లించ వలసిన సొమ్మును నవాబు చెల్లించలేక బకాయిపెట్టి అందుక్రింద 1763లో జాగీరుజిల్లా అని ప్రసిద్ధిచెందిన చెంగల్పట్టు జిల్లాను కంపెనీ వారికి సమర్పించారు. అయితే మళ్ళీ సాలుకి $3^{1}/2$ లక్షల వరహాలను చెల్లించే పద్ధతిని ఆ జిల్లాను వారివల్ల 1768 మొదలు 1780 వరకూ అతడు కవులుకు పుచ్చుకొంటూ ఆ సొమ్ముకూడా చెల్లించలేక బాకీ పడినాడు. అంతట 1780లో కంపెనీవారు ఆ జిల్లాలో శిస్తులు వసూలు చేయడానికి యిజారాలు పాడించి బాకీక్రింద వసూలు వేసుకొనేవారు. ఆ బాకీ తీరడం అంటూ లేదు.

ఇలాగ నవాబుగారు లోకుల కివ్వవలసిన మొత్తం పాపం పెరిగినట్లు పెరిగి, కొన్ని కోట్ల వరహాలు తేలింది. బాకీదారులు తమ బాకీలనుగురించి గోలచెయ్యడం ప్రారంభించారు. ఈ బాకీలను తీర్మానించే విషయంలో నవాబు ఉపేక్ష వహిస్తున్నాడనీ, చెన్నపట్నం కంపెనీ అధికారులు కొందరిపట్ల పక్షపాతబుద్ధి చూపిస్తున్నారనీ తగాదాలు బైలుదేరినవి. చెన్నపట్నం దొరలలోనే ఈ విషయంలో రెండు పార్టీలు బయలుదేరినవి. ఈ తగాదాలు, కుట్రలు, అక్రమాలూ ఎక్కువయి ఆఖరికి సీమలో కంపెనీ డైరెక్టర్లకు ఫిర్యాదులు పోగా వారు దీనిని గురించి కొంత విచారణ చేశారు. వారిలో కూడా కొందరు ఒక పక్షమూ, మరికొందరు ఇంకొక పక్షమూ అవలంబించి అభిప్రాయభేదాలు కనబర్చగా ఈ విషయం పార్లమెంటులో చర్చకు వచ్చింది. కాని అక్కడ కూడా అభిప్రాయ భేదాలు

వచ్చినవి. దీనికంతా కారణం నవాబుగారిజుట్టు చేతచిక్కించుకున్న దొరలే. ఈ విషయంలో సీమలో కూడా కొంతసొమ్ము ఖర్చుపెట్టి అక్కడివారి నోళ్ళు కట్టకపోతే నవాబుగారి రాజ్యం ఆయనకు దక్కడం దుర్లభమని చెప్పి ఆయనను భయపెట్టి అతని దగ్గరనుంచి వారు మళ్ళీ కొంతసొమ్మును గుంజి, కొందరు డైరెక్టర్లకూ, పార్లమెంటు సభ్యులకూ లంచాలిచ్చిన్నీ, ఈ ఋణపత్రాలలో భాగాలిచ్చిన్నీ నవాబుగారి ఋణాలను సమర్థించే పక్షాన్ని అక్కడ లేవదీశారు. నవాబుగారి బాకీలవిషయమై ఎప్పు వచ్చినప్పుడల్లా ఈ పక్షంవారు రేచులలాగ లేచి ఆ వ్యవహారాలను సమర్థించేవారు.

ఈ విషయాలలో ప్రవేశించి చాలా దుర్మార్గాలు చేసి సొమ్ముకాజేశాడనే కారణంవల్ల చెన్నపట్నంలో కంపెనీ వారి క్రింద ఇంజనీరింగు కట్టడములశాఖలో పనిచేసే పాల్ బెన్ఫీల్డు అనే ఒక చిన్న కంపెనీ ఉద్యోగిని ఇక్కడి అధికారులు 1770 లోనూ, 1778లోనూ రెండుసార్లు పనిలో నుంచి తొలగిస్తే అతడు సీమకు వెళ్ళి అక్కడ తన పలుకుబడి నుపయోగించి మళ్ళీ తన వుద్యోగం తాను తెచ్చుకున్నాడు. తరువాత అతడు పార్లమెంటు సభలో ప్రవేశించి ఈ అన్యాయాలను నిలబెట్టడానికి పాటుపడి కృతకృత్యుడైనాడు.

ఆర్కాటు నవాబుగారి బాకీల వ్యవహారాలవల్ల చెన్నపట్నంలో కంపెనీ ప్రభుత్వం పుచ్చిపోయింది. ఆర్కాటు నవాబు బాకీల విషయంలో జరిగిన అన్యాయాలను గురించి పార్లమెంటుకు తెలియగా ఆ బాకీల నిజానిజములను గురించి విచారించవలసినదని పార్లమెంటువారు 1774లో తీర్మానించారు. ఈ ఋణమును పరిశీలించగా అది మూడు భాగాలుగా కనబడింది. అందులో రెండు భాగాలలో కొంతనిజం ఉన్నట్లు కనబడినా పెద్దభాగం మాత్రం అంగీకరించడానికి వీలులేని దొంగబాకీలతో నిండియున్నట్లు కనబడింది. కంపెనీ డైరెక్టర్లు దీనిని గురించి విచారించడానికి ప్రయత్నిస్తే బోర్డు ఆఫ్ కంట్రోల్ అనే పైతనిఖీ సంఘంవారు దానిని అలాగ విడదీయడానికి వీలులేదని బాకీల మొత్తాన్ని అంగీకరించడమో నిరాకరించడమో జరగాలన్నారు. దీనికి కారణం సీమలోని అధికారులలో కూడా చాలామందికిందులో భాగాలు వుండడమే!

ఇంగ్లాండు పార్లమెంటు సభలో సభ్యుడుగా నున్న ఎడ్మండ్ బర్కు అనే ధర్మాత్ముడొకడు ఈ యన్యాయాలను చూచి సహించలేక దీనిని గురించి అతితీవ్రంగా విమర్శించి ఈ బాకీలకు సంబంధించిన కాగితముల నన్నిందినీ పార్లమెంటువారి ఎదుట పెట్టవలసినదని ఒక తీర్మానాన్ని ప్రతిపాదించాడు. అయితే పైన చెప్పిన పాల్‌బెన్ ఫీల్డున్నూ, అతనిలాగనే భారతదేశంలో చాలా అన్యాయాలు చేసి అమితధన మార్జించి పార్లమెంటు సభ్యుడైన అట్కిన్‌సన్ అనే దొరయున్నూ, మరికొందరున్నూ ఏకమై బర్కుమహాశయుని తీర్మానాన్ని ఓడించివేశారు. అంతట ఆర్కాటు నవాబుగారి ఋణదాతలు అక్రమచర్యలకు హద్దుపద్దులేకుండా పోయింది. ఈ బాకీని 1784 మొదలు 1804 వరకూ సాలు ఒకటింటికి 480000 నవరసుల చొప్పున కిస్తీలుగా చెల్లించేటట్లు ఏర్పాటుచేశారు. ఇంత సొమ్ము చెల్లించిన తరువాత 1805లో ఈ బాకీలను విమర్శించడాని కని ఒక విచారణ సంఘాన్ని ఏర్పర్చగా వారు 1814 వరకూ విచారించి రెండుకోట్ల నవరసుల బాకీ మొత్తంలో ఒకకోటి తొంభై లక్షల నవరసుల బాకీ కేవలమూ అబద్ధమని నిర్ణయించారు!

మిగిలిన బాకీలో ప్రతి మూడుకోట్ల బాకీలోనూ ముప్పై లక్షల బాకీ మొత్తం మాత్రం నిజమని 1830లో నిర్ణయించారు!! ఇలాగ తేల్చిన మొత్తాన్నిబట్టి చూస్తే లోగడ కంపెనీ ఉద్యోగులకు చెల్లించివేయబడిన బాకీయావత్తు అబద్ధమేననిన్నీ, నిష్కారణంగా ఆ మొత్తము చెల్లించబడిన దనిన్నీ కనబడుతూ ఉంది.

ఈ ఋణభారం యొక్క వడ్డీమాత్రమే సాలుకు 623000 నవరసులుగా వుండేది. ఇది తూర్పు ఇండియా వర్తకసంఘం వారికి భారతదేశంవల్ల వచ్చే లాభాల మొత్తానికి రెట్టింపు మొత్తంగా వుండడం చూసి చాలామంది తమగుండెలు బాదుకొన్నారు. దొంగపత్రాలను సృష్టించినందుకు కొందరి మీద ఫోర్జరీ కేసులు దాఖలుకాగా వాటి విచారణ సందర్భంలో ఆ కాలంలో చెన్నపట్నంలో కంపెనీ అధికారులుగాను, స్వతంత్ర వర్తకులుగాను ఉండిన దొరలు చేసిన అనేక అక్రమాలూ, అన్యాయాలూ బయలుపడినవి. ఆంధ్రపత్రిక వృషసంవత్సరాది సంచికలో 'మన చెన్నపట్నము –దీని పూర్వచరిత్ర' అనే వ్యాసంలో దీని వివరములున్నవి. (Rise and fulfilment of British Rule in India- Thompson and Garratt pp. 187-190.)

## తంజావూరు రాజ్యాపహరణం

అప్పులు తీర్చలేక ఖర్చులకు సొమ్ము చాలక బాధపడుతూవున్న ఆర్కాటు నవాబు చుట్టుప్రక్కల నున్న రాజ్యాలలో దేనినైనా చేజిక్కించుకొని తనకు కావలసిన సొమ్ము సంపాదించుకోవాలని ఆలోచిస్తున్నాడు. ఈ విషయంలో తన ఋణదాతలైన కంపెనీ అధికారులూ, దొరలూ కూడా తనకు సహాయముచేస్తారని అతని ఆశ. త్వరలోనే నవాబుకి అలాంటి అవకాశాలు లభించాయి.

ఆర్కాటు నవాబు బాకీల వ్యవహారంలోనుంచి ఒక అధర్మదేవత తలయెత్తి తంజావూరు రాజ్యాన్ని పట్టుకొని పీడించసాగింది. తంజావూరు సకల సంపదలకూ నిలయమైన స్వతంత్ర రాజ్యం. అది పూర్వము చోళరాజుల క్రిందనుండి 14వ శతాబ్దములో విజయనగర సామ్రాజ్యానికి సామంత రాజ్యమై తరువాత రాజప్రతినిధులైన తెలుగు నాయకుల పరిపాలనమున నుంటూ వచ్చింది. మరికొంత కాలానికి తెలుగు నాయకులు స్వతంత్రరాజులై ఆ దేశాన్ని పరిపాలించారు. తంజావూరు, మధుర నాయకుల మధ్య 1673లో జరిగిన యుద్ధంలో మధురనాయకులు తంజావూరును జయించగా ఆంధ్రనాయక రాజవంశం అంతరించింది. ఛత్రపతి శివాజీ మహారాజు సవతి తమ్ముడైన ఏకోజీ అనే 'వెంకోజీ' బీజాపూరు సుల్తానుగారి సేనాధిపతిగా వచ్చి రాజ్యాక్రమణచేసి 1675లో తంజావూరు రాజైనాడు. తరువాత మహారాష్ట్రులైన ఆయన వంశీకులే ఆ రాజ్యాన్ని పరిపాలించారు. ఇలాగ ఇక్కడ రాజులు మారినా దేశ పరిస్థితులు మాత్రం మారలేదు. తంజావూరు ఎప్పటిలాగానే పాడిపంటలతో తులతూగుతూ సుభిక్షంగా నుండి సంగీత సాహిత్యాలకు, లలితకళలకు ప్రసిద్ధి చెంది స్వతంత్రమైన దక్షిణాంధ్రరాజ్యంగా ఉంటూ వచ్చింది. ఈ తంజావూరు రాజ్యవైభవం చూస్తే చుట్టుప్రక్కల వారందరికీ కళ్లు కుట్టినవి.

1742లో తంజావూరు నేలే సాహుజీని ప్రతాప సింహుడు తోసిరాజన్నాడు. అప్పట్లో చెన్నపట్నం సముద్రతీరంలో ఒకకోటకట్టుకొని వర్తకం చేసుకొంటూఉన్న ఇంగ్లీషువారు

ప్రతాపసింహ మహారాజుతో స్నేహంచేసి ఏడు సంవత్సరాలు అయనతో సఖ్యతగా నున్నారు. ఆ కాలంలో ఇంగ్లీషువారికీ, ఫ్రెంచివారికీ జరిగిన యుద్ధాలలో ప్రతాప సింహుడు ఇంగ్లీషువారి పక్షాన్నే ఉన్నాడు. ఇలాంటి స్థితిలో పద భ్రష్టుడైన సాహుజీ మహారాజు తాను మళ్లీ తంజావూరు సింహాసనం ఎక్కడానికి గనక తనకు సహాయంచేస్తే తంజావూరు రాజ్యంలోనున్న దేవికోట జాగీరునున్నూ, కోట నున్నూ ఇస్తాననిన్నీ, యుద్ధపు ఖర్చులన్నీ తానే భరించుకుంటాననిన్నీ ఇంగ్లీషువారితో బేరం పెట్టాడు. అంతట ఇంగ్లీషువారికి నోరూరింది. ఇంతవరకూ తమకు స్నేహితుడుగా నున్న ప్రతాపసింహ మహారాజుపట్ల మిత్రద్రోహం చెయ్యడానికి పూనుకొని వారు అతనిమీదికి దండు పంపించారు. అయితే ఆ యుద్ధంలో వారిసైన్యమే ఓడిపోయింది. అంతటితో సాహుజీకి సహాయంచేసే ప్రయత్నం మానుకొని ఏవిధంగానైనా దేవికోటను మాత్రం ప్రతాపసింహుని దగ్గరనుంచి లాక్కోవాలనే సంకల్పంతో ఇంగ్లీషువారు దేవికోటను ముట్టడించి అది స్వాధీనం కాగానే దేవికోటను తమకు ఉండనిస్తే ఇకముందు సాహురాజుకు సహాయం చేయకుండా వుంటామని ప్రతాపసింహునితోనే బేరంపెట్టారు. ఈ నాటకం యొక్క మొదటి అంకం యిలాగ పూర్తి అయింది. తరువాత కొంతకాలం జరిగింది.

ప్రతాపసింహుడి కింత అన్యాయం జరిగినప్పటికీ కర్నాటక నవాబుల తగాదాల సందర్భములో ఇంగ్లీషువారికీ, ఫ్రెంచివారికీ జరిగిన యుద్ధాలలో ప్రతాపసింహుడు పాపము ఇంగ్లీషు వారిపక్షాన్నే అవలంబించి నమ్మకంగా నున్నాడు. ఆ యుద్ధాలలో ఇంగ్లీషువారు జయించినందువల్ల వారి నాశ్రయించిన మహమ్మదాలీ కర్నాటక నవాబుగా స్థిరపడి వారి చేతులలో కీలుబొమ్మ అయిపోయినాడు. ఒక మూల నుంచి తన రాజ్యాధికారాలూ, రాజ్యమూ కూడా తన చేతులలోనుంచి జారి ఇంగ్లీవారి చేతులలోనికి పోతూవుండగా ఈ నవాబు తనకు పచ్చపచ్చగా కనబడుతూఉన్న తంజావూరు రాజ్యం మీద కన్నువేసి దానిని ఎలాగైనా కబళించాలని విశ్వప్రయత్నాలు చెయ్యడం ప్రారంభించాడు. అతడు ఏదో సాకు కల్పించి తన సైన్యాలను తంజావూరుమీదికి దండు పంపాడు. అంతట తంజావూరు రాజు ఈ అన్యాయాన్ని గురించి తన స్నేహితులైన ఇంగ్లీషు వర్తక కంపెనీవారితో మొరపెట్టుకొన్నాడు. ఇంగ్లీషు కంపెనీ వారు వీరిద్దరి మధ్యను రాజీ కుదర్చడంలో తమకు కొంతలాభం ఉన్నదని గ్రహించి అందుకు తగిన ఏర్పాటులను చేశారు. తంజావూరు రాజు ఆర్కాటు నవాబునకు సామంతుడుగానుండి అయనకు నాలుగు లక్షల వరహాలు కప్పం చెల్లించేటట్లున్నూ, నవాబు తంజావూరు రాజ్యాన్ని ఆక్రమించడానికి ప్రయత్నించకుండా వుండేటట్లున్నూ, 1762లో ఒక రాజీ కుదిర్చారు. ఈ ఏర్పాటు ప్రకారం కొంతకాలం జరిగింది. ఇంతలో ప్రతాప సింహ మహారాజు చనిపోయాడు. అంతట కర్నాటక నవాబు తన బాకీదారులైన ఇంగ్లీషు అధికారుల కుట్రతో మళ్ళీ ఎప్పటి ఆటనే సాగించాడు. ప్రతాపసింహుడి కుమారుడైన తులజాజీ మహారాజు మీదికి నవాబు 1771లో తన సైన్యాలను పంపించి రాజ్యాన్ని కొల్లగొట్టించాడు. తులజాజీ మహారాజు ఏమీ చెయ్యలేక నవాబుకి చాలా సొమ్ము నిచ్చి అతనితో రాజీపడ్డాడు. ఇంగ్లీషువారు చూస్తూ వూరుకున్నారు.

కర్నాట కనవాబు ఆశకు మితిలేదు. తంజావూరు రాజ్యాన్నెలాగునైనా కాజెయ్యాలని సంకల్పించాడు. ఇందులో తనకు సహాయం చేస్తే అమితమైన ధనమిస్తానని ఇంగ్లీషుదొరలందరికీ ఆశపెట్టాడు. చాలామంది అధికారులను లోబర్చుకొన్నాడు. 1773లో మళ్ళీ తంజావూరుమీదికి దండెత్తి దేశాన్ని కొల్లగొట్టి రాజును చెరబట్టి రాజ్యాన్ని తనవశం చేసుకొన్నాడు. అంతట నవాబుచుట్టూ చేరిన ఇంగ్లీషు దళారీల పంట పండింది. ఋణాల తీర్మానంపేరున తంజావూరు రాజ్యభోగాలను నవాబువల్ల తాకట్టుపెట్టించుకొని శిస్తులు వసూలుచేసుకొనే హక్కును పొంది అక్కడ రైతుల పొలాలలో నున్న పంట యావత్తు జప్తుచేసి నానా బీభత్సమూ చెయ్యడం ప్రారంభించారు. ఇలాగ నవాబు తన బాకీదారులను తంజావూరు మీదికి ఉసికొల్పడం చూస్తే నిజంగా వీరందరికి బాకీలు లేవనిన్నీ తంజావూరును దోచుకొని ప్రజలను పీల్చి పిప్పిచేసి సొమ్ము పిండి ఉభయులూ కలిసి పంచుకోవడానికి నవాబున్నూ, ఈ దొరలున్నూ కలిసి కుట్రచేశారనిన్నీ చాలామందికి తోచింది. ఋణదాతలలో చాలామంది కంపెనీ అధికారులుగానే ఉన్నందువల్ల తంజావూరు రైతుల మొరలను ఆలకించి అక్కడ జరుగుతూఉన్న అక్రమాలను విచారించి న్యాయం జరిగించేవారే లేకపోయారు.

## గవర్నరు పిగట్టుగారు

తంజావూరు రాజుకు జరిగిన అన్యాయం సంగతి మెల్లిమెల్లిగా ఇంగ్లాండులో నున్న తూర్పుఇండియా వర్తకసంఘము వారి అధికారులకు తెలిసింది. అంతట కంపెనీ డైరెక్టర్లు నవాబు చేసిన అక్రమానికి చెన్నపట్నంలో కంపెనీ అధికారులు మద్దతు చేయడం బాగాలేదని వారిని కఠినంగా మందలించి అప్పట్లో చెన్నపట్నం గవర్నరుగా నుండిన వించ్ (Wynch) దొరను ఆ పదవిలోనుంచి తొలగించి అతని స్థానే పూర్వం 1755 మొదలుకొని 1763 వరకూ చెన్నపట్నం గవర్నరుగా నుండి ఫ్రెంచివారితో జరిగిన యుద్ధాలలో ధైర్యంగా పనిచేసిన 'జార్జిపిగట్టు' అనే ఆయనను మళ్ళీ చెన్నపట్నానికి గవర్నరుగా నియమించి తంజావూరు రాజ్యాన్ని మళ్ళీ పూర్వపు రాజుగారి వశం చెయ్యవలసిందని అతనికి చెప్పి 1775లో పంపించారు.

ఇది కర్నాటక నవాబుగారికి చాలా కష్టంగా తోచింది. తాను ఇంగ్లీషువారికి నమ్మిన స్నేహితుడనిన్నీ, తంజావూరు రాజు వట్టి పనికిమాలినవాడనిన్నీ, తంజావూరు తన అధీనం తప్పితే తాను దొరల కివ్వవలసిన ఋణాలను తీర్చలేననిన్నీ ఎన్నో విధాలుగా మొరపెట్టుకున్నాడు గాని పిగట్టుగారు వినిపించుకోలేదు. చెన్నపట్నంలోనున్న గొప్పగొప్ప ఉద్యోగులచేత చెప్పించి చూశాడుగాని లాభం లేకపోయింది. ఆఖరికి తాను మళ్ళీ ఇంగ్లాండులో కంపెనీ డైరెక్టర్ల సభవారికి చెప్పుకుంటాననిన్నీ, అందాకా తంజావూరు విషయంలో చర్యతీసుకోవద్దనిన్నీ పిగట్టుగారిని వేడుకున్నాడు గాని అందుకు కూడా ఆయన అంగీకరించలేదు. తన కీ వ్యవహారంలో సహాయం చేస్తే అమితమైన ధనం లంచమిస్తానని కూడా నవాబు కబురంపినా పిగట్టుగారు చలించలేదు. నవాబుకి అమితమైన కోపం వచ్చింది. ఈ పిగట్టుగారిని ఎలాగైనా సాధించాలని ఉపాయాలు ఆలోచించడం ప్రారంభించాడు. ఆయన మనస్సును మార్చాలని జపతపాలు, హోమాలు చేయించాడు. అతనిని తుదముట్టించాలని మారణహోమం కూడా చేయించాడు.

పిగట్టుగారు తన కర్తవ్యాన్ని నెరవేర్చడానికి స్వయంగా తంజావూరికి వెళ్ళి అక్కడ ఆర్కాటు నవాబుగారి పరిపాలన రద్దుచేయబడి మళ్ళీ తంజావూరు రాజుగారి పరిపాలన స్థాపించబడిందని ప్రకటన చేయించాడు.

## బెన్‌ఫీల్డు కథ

ఆ సమయంలో ఒక చిత్రం జరిగింది. 1763 వ సంవత్సరం నుంచి చెన్నపట్నంలో కంపెనీవారి ఇంజనీరింగు కట్టడములశాఖలో ఒక చిన్న ఉద్యోగిగానుంటూ చెన్నపట్నం కోటగోడల నిర్మాణం వగైరా పనులు చేయించిన 'పాల్ బెన్‌ఫీల్డు' అనే దొర ఒకడు గవర్నరుగారి దగ్గరకు వచ్చి ఆర్కాటు నవాబుగారు తనకు 230000 పవరసులు బాకీ ఉన్నడనిన్నీ, అందుక్రింద తంజావూరు రాజ్యంలో కొన్ని భాగాలను తనకు తాకట్టు పెట్టినాడనిన్నీ, తంజావూరు రాజ్యంలో శిస్తులు వసూలు చేసుకునే హక్కు తనకు ఉన్న దనిన్నీ, తంజావూరులో కొందరు ఆసామీలు కూడా తనకు బాకీవుండి భూములమీద పైరును తనకు హామీవుంచినారనిన్నీ, తన బాకీ తీరకుండా తంజావూరును రాజుగారికివ్వడానికి వీలులేదనిన్నీ అభ్యంతరం చెప్పాడు. గవర్నరుగారు అతని మాట వినిపించుకోకుండా తంజావూరును రాజుగారికి స్వాధీన పరిచారు. అంతట బెన్‌ఫీల్డు చెన్నపట్నంలో గవర్నరుగారి కార్యాలోచనసభవారికి పైసంగతులతో అర్జీయిచ్చినాడు. బెన్‌ఫీల్డుమాటలు చాలా ఆశ్చర్యకరంగానూ, అనుమానాస్పదంగానూ కనబడినవి. ఇతరులకు అంత అప్పులిచ్చే తాహతు అతనికి లేదు. ఇతడు స్వతహాగా ధనవంతుడు కాడు. ఇంగ్లాండు నుంచి వచ్చినప్పుడు ఇతడు తెచ్చిన సొమ్ము ఏమీలేదు. పోనీ, ఉద్యోగంలో ఎక్కువగా సొమ్ము ఆర్జించినాడేమో ననుకుందామంటే అతడు చేసిన ఉద్యోగం చాలా చిన్నది. అందులో ఎక్కువగా సొమ్ము ఆర్జించే అవకాశాలు లేవు. ఇతడు తాను సంపాదించినదానినే పొదుపు చేసుకొని కూడబెట్టుకున్నాడేమో ననుకుందామంటే అతడు చాలా దుబారా మనిషి. సొమ్ము నిలువచేసే స్వభావం కలవాడుకాడు. నవాబుగారుగాని, ఇతరులుగాని నీకు బాకీవున్నట్లు నీదగ్గర దాఖలా లేమైనావుంటే చూపించవలసిందని గవర్నరుగారు అడిగితే అతడేమీ చూపలేకపోయాడు. గవర్నరుగారి కార్యాలోచన సభ్యులలో బహుసంఖ్యాకులు కూడా మొదట బెన్‌ఫీల్డు చెప్పిన మాటలను నమ్మలేదు. తరువాత మళ్ళీ అతడేమి మాయోపాయాలు చేశాడోగాని త్వరలోనే కార్యాలోచన సభ్యుల మనస్సులు మారి బహుసంఖ్యాకులు మళ్ళీ తమ అభిప్రాయాన్ని మార్చుకొని యీ వ్యవహారాన్ని తిరుగదోడి తంజావూరు కర్నాటక నవాబు స్వాధీనంలో వుండగా ఆ రాజ్యంలో భూములమీద పండినపంట యావత్తు బెన్‌ఫీల్డుకే హక్కుగల ఆస్తి అని తీర్మానించారు! పైగా బెన్‌ఫీల్డు బాకీలనేవి తంజావూరు రాజ్యాదాయంపైన బద్ధత చేయబడవలసిన పద్ధతి ఋణమనే అభిప్రాయాన్నికూడా వెలిబుచ్చి ఆ రాజ్యములోని భూములమీదనున్న పంటను అతనివశం చెయ్యడానికి చెన్నపట్నం ప్రభుత్వంవారు తగుసహాయం చెయ్యాలని కూడా నిశ్చయించారు.

## గవర్నరుగారికీ, కార్యాలోచనసభ్యులకూ తగాదా

గవర్నరుగారి కిది చాలా అన్యాయమని తోచింది. అంతట పిగట్టుగారు తన కార్యాలోచన సభ్యుల యభిప్రాయాన్ని ప్రతిఘటించాడు. గవర్నరుగారికీ, కార్యాలోచన

సభ్యులకూ ఘర్షణ జరిగింది. అంతట గవర్నరుగారి కార్యాలోచనసభలో బెన్‌ఫీల్డుపక్షం వహించిన సభ్యులు గవర్నరు మీద నిర్ల్యవహించి ఇతర విషయాలలో అతని అధికారాన్ని తృణీకరించటం ప్రారంభించారు.

ఇంతలో తంజావూరు రాజు దర్బారులో ఒక ఇంగ్లీషు ప్రతినిధిని నియమించవలసి వచ్చింది. ఆ సందర్భంలో కూడా గవర్నరుగారికీ, కార్యాలోచన సభలోని అధిక సంఖ్యాక సభ్యులకూ అభిప్రాయభేదం వచ్చింది. గవర్నరుగారీ పదవికి రస్సెల్ అనే అతణ్ణి నియమించాలని అంటే, సభ్యులు బెన్‌ఫీల్డుకి అనుకూలంగా ఉండే స్టూవార్టు అనే అతనిని నియమించాలని అన్నారు. దీనిని గురించి కార్యాలోచన సభయొక్క సమావేశాలలో అతితీవ్రమైన చర్చలు జరిగినవి. చివరకు అధిక సంఖ్యాకసభ్యులు గవర్నరుగారి అభిప్రాయాన్ని త్రోసిపుచ్చారు. అంతట వారు పేర్కొన్న అభ్యర్థిని ఆ పదవికి నియమించినట్లు జారీ చేయవలసిన అధికార పత్రముమీద గవర్నరు సంతకం చెయ్యడానికి నిరాకరించాడు. ఈ తగాదా చాలా తీవ్రరూపం దాల్చింది. గవర్నరును సభలో ప్రతిఘటిస్తూ ఉన్న సభ్యులలో బ్రూకు, స్ట్రాటన్ అనే ఇద్దరు సభ్యులు చాలా దురుసుగా ప్రవర్తించినందువల్ల గవర్నరు వారిపైన కోపించి వారు ప్రభుత్వద్రోహము తలపెట్టినారనే నేరమును మోపినాడు. అలాంటినేరము మోపబడిన సభ్యులు సభలో పాల్గొనడానికి వీలులేదని శాస్త్రవిధి యున్నందువల్ల వారిని సభలోకి రాకుండాచేసి తక్కిన సభ్యుల సహాయంతో వాళ్ళ సభ్యత్వం బర్తరఫు చేసినట్లు గవర్నరు తీర్మానింపజేశాడు. అంతట కార్యాలోచనసభలో పూర్వం అధిక సంఖ్యాకులుగానుండిన సభ్యులందరూ ఏకమై గవర్నరుకు వ్యతిరేకపక్షంగా ఏర్పడి అతనిని గురించి పైయధికారులకు ఒక పితూరీ వ్రాసి గవర్నరుకు కార్యాలోచన సభలో పలుకుబడి లేనందువల్ల అధికసంఖ్యాకులైన తామే ప్రభుత్వాధికారాలను చలాయించుటకు అర్హులమని ప్రకటించారు. అప్పుడు గవర్నరున్నూ, అతని స్నేహితులున్నూ పితూరీదారులైన కార్యాలోచన సభ్యులందరినీ సభ్యత్వంలోనుంచి తొలగించినట్లు ప్రకటించి వారిని పట్టుకొని అరెస్టుచేసి సైనికశాసనం క్రింద శిక్షించవలసిందని చెన్నపట్నంలో సర్వసేనానిగా ఉన్న సర్‌రాబర్టు ఫ్లెచర్ గారిని కోరారు. అయితే ఈ సర్వసేనాని కూడా గవర్నరుకు వ్యతిరేక పక్షంలో చేరివున్నందువల్ల అతడలాగచేయక ఉపేక్షించాడు.

## గవర్నరు గారిని ఖైదు చెయ్యడం

గవర్నరుకు వ్యతిరేక పక్షంగానున్న సభ్యులకు గవర్నరు అలుసైపోయినాడు. అతడు తమర్ని అరెస్టు చేయించదలచినందుకు శాస్తిగా తామే అతనిని పట్టుకుని నిర్బంధించడానికి వారు నిశ్చయించారు. ఆ ప్రకారం వారు 1776వ సంవత్సరం ఆగస్టు 24వ తేదీన పిగట్టుగారిని పట్టుకొని ఖైదుచేయించారు.

అప్పుడు గవర్నరుగారికి కొక ఉపాయం తట్టింది. చెన్నపట్నంలో రేవులోను, కోటలోను కంపెనీ ప్రభుత్వం వారు అధికారం చలాయిస్తూవున్నా సముద్రం మీద వారి కలాంటి అధికారాలులేవు. సముద్రముమీదనున్న ఇంగ్లీషు యుద్ధనౌకల పైన అధికారియైన అడ్మిరల్ ఇంగ్లీషు రాజుగారి ప్రభుత్వోద్యోగి. అతనికి సర్వాధికారాలుంటాయి. అందువల్ల చెన్నపట్నం దగ్గర సముద్రంలోనున్న నౌకల అధికారియైన అడ్మిరల్ సర్ ఎడ్వర్డు హ్యూస్‌గారి

నాశ్రయించి తన నౌక నౌకమీద తీసుకొని వెళ్ళి కాపాడవలసినదని పిగట్టు ప్రార్థించాడు. అంతట పిగట్టుగారిని తనకు వప్పగించవలసినదని అడ్మిరల్ గారు కార్యాలోచన సభవారిని కోరారు. నౌకలమీద ప్రభుత్వాధికారాలన్నీ అడ్మిరల్ గారివేయైనా రేవులో కంపెనీ ప్రభుత్వం వారి వశంలోనున్న కంపెనీ యుద్యోగులను తన నౌకమీదికి తీసుకుని వెళ్ళడానికి అయనకు అధికారం ఉన్నట్లు తగినశాస్త్ర దృష్టాంతం తమకు కనబడనందువల్ల పిగట్టుగారిని అయనకు వప్పగించడానికి వీలులేదని వారు నిరాకరించారు. ఇంగ్లీషు రాజుగారి ప్రభుత్వాధికారిగ తన కర్తవ్యాన్ని నిర్వర్తించగలందులకు తాను చెప్పవలసిన మాట చెప్పినాననిన్ని, వారు తన మాటవిననందువల్ల కలిగే ఫలితాలకు తాను ఉత్తరవాదిని కాననిన్ని చెప్పి అతడు వూరుకున్నాడు.

చెన్నపట్నం గవర్నరు కార్యాలోచన సభవారు పిగట్టుగారి నౌకచోట ఖైదుచేసి వుంచారు.

## గవర్నరు జనరల్ ఉపేక్ష

అప్పట్లో కంపెనీవారి రాజ్యానికంతా గవర్నరు జనరలుగా కలకత్తాలోనున్న వారన్ హేస్టింగ్సు గారికి చెన్నపట్నంలో జరిగిన సంగతులు మెల్లిగా తెలిసినవి. అయితే కార్యాలోచన సభలో అధిక సంఖ్యాకుల అభిప్రాయానికి వ్యతిరేకంగా తానేమీ చేయదలచలేదని చెప్పి దీనిని గురించి ఎలాంటి చర్యయున్నూ తీసుకోకుండా వుపేక్షించాడు. ఇలాంటి విషయంలోనే బొంబాయి గవర్నరు కార్యాలోచనసభలో అభిప్రాయభేదం వచ్చినప్పుడు అతడు చర్యతీసికొనిన్నీ, ఇక్కడి వ్యవహారాలలో ఇలాగ వుపేక్షించడం చాలా ఆశ్చర్యకరమైన సంగతి యని చరిత్రకారుల యభిప్రాయం. తాను ఇలాగ ఊరుకున్నందువల్ల చెన్నపట్నంలో అధికారాన్ని చేజిక్కించుకొన్న కార్యాలోచన సభ్యులు ఇంకా అక్రమాలు చేస్తారనిన్నీ, కర్నాటక నవాబు గారి బాకీదార్లు హాయిగా కాలక్షేపం చేస్తారనిన్నీ కూడా అతడు ఎరిగి వుండిన్నీ అతడు అందుకు కూడా హర్షించినట్లు వారన్‌హేస్టింగ్సు 26-9-1776 వ తేదీన తన స్నేహితుడికి వ్రాసిన ఒక ఉత్తరం వల్లనే కనబడుతూ ఉంది*.

అక్కడ చెన్నపట్నంలో పిగట్టువారు ఖైదులో పడి మగ్గిపోతున్నారు. అతడు మనోవ్యాధితో బాధపడుతూ ఉన్నందువల్ల అతని ఆరోగ్యం పూర్తిగా చెడిపోయింది.

## సీమలో కంపెనీ డైరెక్టర్ల చర్యలు

చెన్నపట్నంలో జరిగిన సంగతులను గురించి ఇంగ్లాండులో కంపెనీ డైరెక్టర్లకు తెలియగా వారికి విషాదాశ్చర్యాలు కలిగినవి. కాని డైరెక్టర్ల కోర్టు అనే కార్యనిర్వాహక సంఘసభలో అభిప్రాయభేదాలు కలిగినందువల్ల దీనిని గురించి వెంటనే తగినచర్య జరపలేదు. 1777వ సంవత్సరం మార్చి 26వ తేదీన డైరెక్టర్ల సాధారణ సంఘసభలో ఈ విషయాన్ని గురించి చర్చ జరిగింది. పిగట్టుగారు మళ్ళీ గవర్నరు పదవిలో నుండే ఏర్పాటును త్వరలో చెయ్యవలసినదనిన్నీ, ఆయనను ఖైదుచేసిన కార్యాలోచనసభ్యుల

* (Memoris of Warren Hastings. Gleig. Vol. 11 pp 106, 113)

చర్యను గురించి విచారణ జరిగించవలసినదన్నీ ఆ సభవారు డైరెక్టర్ల కోర్టువారికి శిఫారసు చేశారు. డైరెక్టర్ల కోర్టువారు మాత్రం పిగట్టుగారిమీద అంతగా అభిమానం చూపలేదు. పిగట్టుగారు మళ్ళీ గవర్నరు పదవిలో నుండేటట్లున్నూ, అయనను ఖైదులోనుంచిన సభ్యుల చర్యలను గర్హిస్తూ కొన్ని తీర్మానాలున్నూ, కార్యాలోచన సభలో అతని పక్షమున నున్న సభ్యులను విమర్శిస్తూ కొన్ని తీర్మానాలున్నూ డైరెక్టర్ల కోర్టువారు చేశారు. అయితే పిగట్టుగారి వ్యవహారాన్ని గురించి వారేమీ పర్యవసానం తేల్చలేదు.

ఈ డైరక్టర్ల కోర్టులో సభ్యులు ప్రతియేటా మారుతూ వుంటారు. అందువల్ల ఒక మాటు పిగట్టుగారికి అనుకూలము గానూ, ఇంకొకమాటు అయనకు వ్యతిరేకముగానూ ఉండే తీర్మానాలు చేయడంకూడా జరిగింది. అంతేగాని ఆ వ్యవహారాన్ని గురించి ఇదమిత్థమని నిర్ణయించి తీర్మానించలేదు. కార్యాలోచన సభలో అధిక సంఖ్యాకుల అభిప్రాయానికి వ్యతిరేకంగా గవర్నరు ప్రవర్తించడం అక్రమమనిన్నీ, తంజావూరు దర్బారులో ఇంగ్లీషుకంపెనీ ప్రభుత్వంవారి ప్రతినిధిగా రస్సెలును నియమించడం అనమంజసమనిన్నీ 21-4-1777వ తేదీన తీర్మానించారు. గవర్నరుగారు తన కార్యాలోచన సభలోనుంచి బ్రూకుస్ట్రాటను గార్లను బర్తరఫు చెయ్యడాన్ని గురించి ఖండిస్తూ తీర్మానించాలని కూడా ప్రయత్నించారు గాని అది సాగలేదు. పిగట్టుగారి పక్ష మవలం బించినవారు అతనిని బలవంతంగా పట్టుకొని ఖైదుచేయడాన్ని గురించిన్నీ, కార్యాలోచన సభలో అతనితరఫున నున్నవారిని సభలోనుంచి తొలగించడాన్ని గురించిన్నీ గర్హిస్తూ ఒక తీర్మానం చేయించగలిగారు గాని అవతలిపక్షంవారు ఆర్కాటు నవాబు పిగట్టువారి కేదో సందర్భంలో ఇచ్చిన చిన్నచిన్న బహుమతుల సంగతిని ఎత్తుకుని వాటిని స్వీకరించడంలో గవర్నరు ప్రవర్తన యేమీ బాగాలేదని తీర్మానించారు. నిజానికి పిగట్టుగారు నవాబువట్ల ఏలాంటి పక్షపాతమూ చూపించలేదు సరికదా, అతని దురాశను ప్రతిఘటించాడు. అతడు చాలా పెద్దమొత్తాలు లంచమిస్తానన్నా ఇతడు లోబడలేదు.

పిగట్టుగారి వ్యవహారం విషయంలో కంపెనీ డైరెక్టర్ల కోర్టువారి తీర్మానాలకు విధివిరామాలుగాని, ఆద్యంతాలుగాని లేకుండా పోయినవి. 1777వ సంవత్సరం మే 7వ తేదీని డైరెక్టర్ల కోర్టువారి సాధారణ సంఘసభలో దీనిని గురించి తీవ్రమైన చర్చ జరిగింది పిగట్టుగారి అధికారాన్ని ధిక్కరించిన సభ్యుల చర్యను ఖండిస్తూ అతనిని గవర్నరుపదవిలో పునఃప్రతిష్ఠ చేసినట్లు తీర్మానిస్తూ అతనియొక్క ప్రవర్తనను గురించి విచారించగలందులకు గాను అతనిని చెన్నపట్నం గవర్నరుపదవి వదలి సీమకు రావలసినదని తీర్మానించారు. చెన్నపట్నం కార్యాలోచన సభలో పిగట్టుగారి పక్షం అవలంబించినవారినీ, అయనకు వ్యతిరేకంగా నున్నవారినీ కూడా సీమకు రమ్మని ఉత్తర్వుచేసేటట్లున్నూ శిఫారసు చేశారు. ఈ తీర్మానాలకు 317 మంది వ్యతిరేకులు గానూ, 414 మంది అనుకూలంగానూ సమ్మతులిచ్చారు.

## పిగట్టుగారి మరణం

అంతట 1777వ సంవత్సరం మే 21వ తేదీన పిగట్టు గారి వ్యవహారం ఇంగ్లాండు దేశపు పరమోన్నత శాసనసభయైన పార్లమెంటులో కామన్సుసభవారియెదుట చర్చకు

వచ్చింది. అప్పుడు కొందరు పిగట్టుగారికి అనుకూలమైన తీర్మానాలను ప్రతిపాదించగా ప్రభుత్వ మంత్రులు వాటిని ప్రతిఘటించారు. అంతట అవి ఓడిపోయినవి. ఇట్టి స్థితిలో డైరెక్టర్ల కోర్టు సాధారణ సంఘ సభవారి తీర్మానాలను అమలులో పెట్టడానికి డైరెక్టర్ల కోర్టువారు 30-7-1777వ తేదీన తీర్మానించారు. అయితే ఈ లోపుగానే 11-5-1777వ తేదీన పిగట్టుగారు దివంగతులైనారు. అందువల్ల పిగట్టుగారి బాధలన్నీ తీరిపోయినవి.

పిగట్టుగారికి పెళ్ళిలేదు. అయనకు ఒక ఉంపుడుకత్తె వుండేది. ఆమెవల్ల అతనికి చాలామంది పిల్లలు కలిగారు. అయనకు శాస్త్రీయమైన వారసులు లేనందువల్ల అయన వంశమూ ప్రభు బిరుదమూ కూడా బేవారసీ అయిపోయి అంతరించినవి.

పిగట్టువారు చచ్చిపోయిన రెండు సంవత్సరాలకు అయనకు జరిగిన అన్యాయాన్ని గురించిన వివరాలు ఇంగ్లాండులో కంపెనీ అధికారులకూ, పార్లమెంటువారికీ బాగా తెలిసినవి. చెన్నపట్నంలో అయన కార్యాలోచనసభలో నుండి అయనను ప్రతిఘటించి తుదకు అయనను ఖైదుచేసిన సభ్యులలో ఒకడైన స్ట్రాటనుగారు ఇంగ్లాండు పార్లమెంటులో కామన్సు సభలో సభ్యుడైనాడు. ఆర్కాటు నవాబుగారి పక్షము నవలంబించిన ఇంకా కొందరు దొరలుకూడా అక్కడ చేరారు. పిగట్టుగారి వ్యవహారాన్ని గురించి కామన్సు సభలో చర్చించబడినప్పుడు వీరందరూ పిగట్టుగారి ప్రత్యర్థుల చర్యలను సమర్థించడానికి తంటాలు పడ్డారుగాని అందులోని నిజమంతా కామన్సు సభవారికి విశదమైంది. అంతట ఈ స్ట్రాటనుగారున్ను, ఇతని తోడివారున్నూ చేసిన అక్రమాన్ని గురించి, నేరాన్ని గురించి విచారించి శిక్షించడానికి వీరిపైన ఒక క్రిమినలు కేసు దాఖలుచేయడానికి ఉత్తర్వు చేయవలసినదని కామన్సు సభవారు ఇంగ్లీషు రాజుగారికి విన్నపంచేశారు. ఆ ప్రకారం స్ట్రాటను మొదలైనవారిమీద కేసు దాఖలై విచారణ జరుగగా వారినేరం బుజువయింది. అయితే వీరు చేసిన ఘోరాన్యాయానికి తగిన శిక్షమాత్రం వీరికి విధించబడలేదు. ఒక్కొక్కరికి వెయ్యి నవరసులు జుల్మానామాత్రం విధించి వదలివేశారు.

(History of British Empire in India - Edward Thornton Vol. 11 pp 199-213).



# 9. కాశీ మశీదులో శివలింగం

క్రీ.శ. 1823-26 మధ్య కలకత్తాలో తూర్పుఇండియా వర్తక కంపెనీవారి పరిపాలనలో ప్రధాన క్రైస్తవమతాధికారిగా నుండి హిందూదేశమంతా తిరిగి చూసిన బిషప్ హెబరుగారు (Bishop Heber) తమ గ్రంథములో ఒక చిత్రమైన చరిత్రాంశాన్ని ఉదాహరించారు.

1659-1707 మధ్య హిందూదేశాన్ని పరిపాలించిన ఔరంగజేబు చక్రవర్తి చాలా హిందూ దేవాలయాలను పడగొట్టించి వాటిపై మశీదులు కట్టించినాడని ప్రతీతి. దేవాలయ

స్తంభాలతోటీ, రాళ్ళతోటీ, దూలాలతోటీ నిర్మించబడిన మశీదులు ఇప్పటికీ కాశీలో కనబడుతున్నాయి.

ఒక శివాలయాన్ని పడగొట్టి మశీదుకట్టడంలో ఆ దేవాలయంలో నుండిన అందమైన గొప్ప శివలింగాన్ని అలాగే అట్టే వుండనిచ్చి మశీదుకట్టారు. ఈ శివలింగం నలభై అడుగుల ఎత్తుగల ఏకాండీశిల. దీనిమీద అందమైన చెక్కడవుపని వుండేది. ఇది పూర్వం రెండు రెట్లు ఎత్తువుండేదనిన్నీ, క్రమక్రమంగా భూమిలోకి దిగబడిపోతూ ఉన్నదనిన్నీ, అది భూమి మట్టానికి రాగానే అన్ని కులాలూ ఒక్కటైపోతాయనిన్నీ ప్రజలు అనుకుంటూ వుండేవారు.

ఈ శివలింగం మశీదులో చిక్కుపడినా హిందువులు దీనిని అతిపవిత్రంగా ఎంచి, మశీదు అధికారులను మంచిచేసుకొని, లోపలికి వెళ్లి దీన్ని పూజిస్తూ ఉండేవారు. భక్తులు ఇచ్చే కానుకలలో సగంవంతు తమకు చెల్లేపద్ధతిని మశీదువారు దీనికి వప్పుకున్నారు.

ఈ శివలింగం చుట్టూవున్న చెక్కడవుపని మహమ్మదీయులకు అసహ్యంగా కనబడినా పై చెప్పిన కారణంవల్ల దానిని ఏమీ చేయకుండా వుంచారు. ఇలాగా ఒక వంద సంవత్సరాలు ఈ శివలింగానికి మశీదులోనే అర్చనలు జరిగాయి.

ఇలా వుండగా ఒకమాటు మొహరం పండుగ ఊరేగింపుల సందర్భంలో హిందువులకూ, మహమ్మదీయులకూ తగాదాలువచ్చి దెబ్బలాటలు జరిగాయి. అది మత కలహంగా పరిణమించింది. ముసల్మానులు కొందరు ఆవేశపరులై హిందువులు అతి పవిత్రంగా పూజించే యీ శివలింగాన్ని పగులుగొట్టారు. అంతట హిందువులు ఉగ్రులై దీనికి ప్రతిక్రియగా ఒక మశీదును తగులబెట్టారు. దానిమీద తురకలు వీరావేశంతో ఒక ఆవును చంపి, దాని రక్తాన్ని విశ్వేశ్వర ఆలయందగ్గర గంగానదీ జలంకన్నా అతిపవిత్రమని ఎంచి యాత్రికులందరూ స్నానపానములుచేసే 'ఇననకూప'మనే ఒక పురాతనమైననూతిలో కలిపారు.

అంతట కత్తిపట్టగల ప్రతి హిందువూ రోషావేశంతో కత్తులూ కఠారులూ పుచ్చుకుని కనబడిన తురక వాడిపైనబడి దౌర్జన్యం చేయసాగారు. కాశీలో హిందువులే బహుసంఖ్యాకులైనందువల్ల తురకలను రూపుమాపుతారేమో నన్నంత భయం కలిగింది.

కుంపినీ అధికారులు శిపాయీలను బయటికి తెచ్చి నిలపకపోతే ఇటు సూర్యుడటు పోయేలోపల ఊళ్ళో మశీదు లన్నిందినీ హిందువులు నేలమట్టం చేసేవారే. అయితే, హిందువుల దౌర్జన్యాన్ని అణచడానికి శిపాయీ లెంతవరకు తోడ్పడతారో అనేదికూడా అనుమానాస్పదమైన విషయంగా అధికారులకు తోచింది. కారణం ఏమిటంటే, అక్కడి శిపాయీలలో చాలామంది హిందువులు, సగంమంది బ్రాహ్మణులే నిజంగా వాళ్ళ మనసులోని సంగతి చెప్పాలంటే ఒక్కొక్కడికి ఈ మహమ్మదీయుల రక్తాన్ని చూరగొనాలనే వుందని చెప్పాలి.

ఈ తురకలపైకి పోతూవున్న జనంలో ముఖ్యులు బ్రాహ్మణులూ, యోగులు, గోసాయీలూ, బైరాగులూ మొదలైన సనాతనధర్మపరులే. వీళ్ళు తమ వంటి నిండా విభూతి పూసికొని మొగాలపైన గోపీచందనం అద్దుకొని చావుకు తెగించినందుకు

తార్కాణంగా తలవెంట్రుకలు విరబోసుకొని, జందెములు చేతపట్టుకొని తమతోడి హిందువులతోనూ, దేవుళ్ళతోనూ యుద్ధం చెయ్యబూనినవారిని శాపనార్థాలు పెడుతూ వీరంతా ముందువరసలోనే వున్నారు. అయినప్పటికి శిపాయీలు చలించలేదు. తాము ఎవరి వుప్పు తింటున్నారో ఆ కుంపినీవారి ఉత్తర్వులను శిరసావహించి తమ రక్తబంధువులు ఎదురైనాసరే తుపాకీ పేల్చడానికి ఒట్టుపెట్టుకొని సైన్యపుకొలువులో చేరిన ఈ శిపాయీలు అవసరమైతే బ్రాహ్మడిపైన కూడా తుపాకీని పేల్చడానికి సంసిద్ధులైనారు.

పైన చెప్పిన శివలింగం వుండే మశీదు ద్వారందగ్గర కావలి కాస్తూవున్న శిపాయీలలో ఒకడు అక్కడ క్రిందపడి ఉన్న శివలింగాన్ని చూసి ఇలాగ అన్నాడు. "అయ్యో! మనమెన్నడూ అనుకోని సంగతిని చూశాము. శివలింగం శిరస్సు నేలపైకి ఒరిగింది. ఇంక కొద్దికాలంలోనే మన మందరమూ ఒకే కులంవాళ్ళ మైపోతాము. అప్పుడు మనమతం ఏమవుతుంది?" అన్నాడు. "బహుశః కిరస్తానీమతం అవుతుందేమో!" అని రెండవవాడన్నాడు.

కంపెనీవారు ఇలాగ బందోబస్తు చేసినందువల్ల అల్లరి సద్దు అణగింది.

ఈ కల్లోలం అణగినతరువాత మళ్లీ ఆ సంగతి తలుచుకునేటప్పటికి కాశీలోని హిందువుల గుండెలు నీరైనవి. వారికి తీవ్రమైన విషాదం కలిగింది. "పవిత్రమైన కాశీక్షేత్రం అపవిత్రమైపోయింది. అతి పవిత్రమైన గంగాజలములో గోవురక్తం కలిసింది. ఈ కాశీమహాత్మ్యం పోయింది. ఇంక ఇక్కడ మోక్షం దొరకదు" అనే ఆలోచనలతో వేలకొద్ది బ్రాహ్మణులు ఉపవాసం చేస్తూ ముఖాలపైన విభూతిరేఖలతో పైమీద బట్టలుకూడా లేకుండా దుఃఖసూచకంగా గంగానదీ తీరాన్ని ఉన్న ముఖ్యఘట్టాలకు నడిచివెళ్ళి అక్కడ చేతులు కట్టుకుని తలలు వంచుకొని కూచుని మళ్ళీ ఇళ్ళకు పోకుండా అక్కడనే పడివుండి ఒక మెతుకైనా తినకుండా ప్రాణాలపై ఆశవిడిచి ప్రాయోపవేశం చెయ్యడానికి నిశ్చయించారు.

ఇలాగ రెండు మూడు రోజులు గడిచినవి. ఇది చూసేటప్పటికి చాలామంది మనస్సులు కరగినవి. వీళ్ళను ఓదార్చి సానుభూతి చూపిస్తే వీళ్ళకు కొంత మనశ్శాంతి కలుగుతుందని కొందరికి తోచింది. ఈ సంగతిని వీరు కాశీలోని మేజిస్ట్రేటుల చెవిన వేశారు. అంతట కుంపినీ వారి ఆంగ్లేయోద్యోగులందరూ గంగానదీతీరానికి వెళ్ళి అక్కడి ఘట్టాలలో ఇలాగ వుపవాసం చేస్తూవున్న బ్రాహ్మణులను చూసి వగచి, తాము నివారించ దానికి ఎంతో కష్టపడి ప్రయత్నించినా లాభంలేక తమవశం తప్పి జరిగినదాని కోసం వారందరూ ఇలాగ నిష్కారణంగా బాధపడడము బాగాలేదనిన్నీ, జరిగిన అక్రమాలకు కొంత ప్రతిక్రియ జరిగించే ఉన్నారుకదా అందుకోసం మళ్ళీ ఇలాగ బాధ అనుభవించడం ఎందుకనిన్నీ చెప్పి, వాళ్ళను బుజ్జగించగా వారందరూ చాలా దుఃఖించి తరువాత కొంత ఊరట చెందారు.

ఇంతటి అకృత్యం జరిగినా గంగ గంగ కాకపోదనిన్నీ, కాశీలోని గృహస్థులందరూ పూనుకొని సంప్రోక్షణమొదలైన ప్రాయశ్చిత్తకర్మలు జరిగిస్తే వైదిక ధర్మానికి కలిగిన కళంకాన్ని తొలగించవచ్చుననిన్నీ న్యాయాధికారులు ఓదార్పుగా వారు చెప్పిన సలహా బాగానే ఉన్నదని ఆఖరికి వారందరూ నిశ్చయించి, ఉపవాసాలు మాని ఇళ్ళకు వెళ్ళారు.

ఆ సమయంలో ఈ రాయబారం నడిపిన దొరలలో ఒకరైన 'బర్డు'గారు ఆ దృశ్యం ఇప్పటికీ తనకు కన్నులకు కట్టినట్లు ఉన్నదని కొన్ని సంవత్సరాల తరువాత 1824లో బిషప్ హెబరుగారికి ఈ సంగతులన్నీ చెప్పాడు.

Bishop Heber's Journal - Vol. 1 pp. 428-32.



# 10. 'వాకిటి కావలి' తిమ్మన

## (కృష్ణదేవరాయలవారి సన్నిహిత భృత్యులు)

"ప్రాకృత సంస్కృత ఘుర్జర, మూకీకృత, కుకవితుంగ ముస్తాతతికిన్, వాకిటి కావలి తిమ్మన, వాకిటి కవికోటి మాధవా కిటికోటే!"

అని ఒక చాటుపద్యమున్నూ, దీనిని గురించిన ఒక గాథయున్నూ మన తెలుగుదేశంలో చిరకాలం నుంచి ప్రచారంలో ఉన్నవి.

శ్రీకృష్ణదేవరాయలవారి అనుగ్రహానికి పాత్రుడైన ఒక భట్టు రాయలవారి ఆస్థానంలోని అష్టదిగ్గజాలనే కవులమీద నీర్ష్యవహించి వారి నెలాగనైనా అవమానించాలని ఒక కుట్ర పన్నాడు. ఒక్కరోజున తాను చెప్పినట్లు చేస్తానని రాయల వారిచేత వాగ్దానం చేయించుకొని, ఆ మరునాడు రాజసభలో అందరూ కూర్చుని వుండగా తాను లేచి కొందరు కవులపేర్లను చదివి "వీరు రాయలవారి సెలవు అయ్యేవరకూ రాజసభలోనికి రాకూడదని రాయలవారి యాజ్ఞయైన"దని ప్రకటించాడు. ఈ విపరీతపు ప్రకటనను విని అక్కడివారందరూ ఒకరి మొగము లొకరు చూచుకొని తెల్లబోయారు. రాయలవారున్నూ ఏమి జరుగుతుందో తమాషాచూద్దామని గంభీరంగా ఉన్నారు.

అలాగ సభలోకి రాకూడదని నిషేధింపబడినవారిలో అల్లసాని పెద్దన మొదలైన హేమా హేమీలంతా వున్నారు. భట్టు ఇలాగ అన్నతరువాత వీరు రాయలవారి వైపునకు చూశారు గాని వారిముఖంలో ప్రసన్నభావం కనిపించనందువల్ల చేయునది యేమీలేక రాయలవారు సభ చాలించిన తరువాత ఖిన్నులై బయటికి వెళ్ళి, భట్టు ఏదో కుట్రపన్ని ఇలాగ తమ్ము పరాభవించినాడని ఊహించి, దీనిని గురించి విచారించి, తరువాత చేయవలసిన కర్తవ్యాన్ని గురించి ఆలోచించుకోవడానికని వీరు 'వాకిటికావాలి' తిమ్మన్న యనే రాయలవారి అంతరంగిక భృత్యుని యింటిముందర చేరి అక్కడ కూర్చుని ఏదో ఆలోచిస్తూ ఉన్నారు. ఆ సమయానికే వీరిని అవమానించిన భట్టు అందలం యెక్కి ఆ దారిన వస్తూ వీరిని చూచి "ఈ తిమ్మన్నవాకిట గుమిగూడిన వీరొక వందుల సమూహములాగ నున్నారు చూశావా" అని తన సేవకుడైన మాధవుని సంబోధిస్తూ పైన చెప్పిన చాటు పద్యములోని ఉత్తరభాగమును చదివాడు.

ఈ యద్దేవమాట వినేటప్పటికి అక్కడనున్న వారికి పట్టలేనంత రోషం వచ్చింది. ఈ నీచుడికి తగినట్టుగా బుద్ధి చెప్పాలని పెద్దన్నగారా పద్యంయొక్క పూర్వభాగాన్ని పైన చెప్పినలాగ భావగర్భితంగా పూరించి జవాబు చెప్పారు.

విద్వత్కవుల సంస్కృత ప్రాకృతములను అర్థము చేసికొనలేక మిడుకు ఈ భట్టువంటి కుకవులు పందుల కాహారముగా నుండే తుంగగడ్డలవంటివా రనిన్నీ, అలాంటి వారి కీ కవిబృందము పందులగుంపుగా కనబడడంలో ఆశ్చర్యం లేదనిన్నీ దాని భావం. మేము నీవంటి అల్పులను మ్రింగగల వరాహములము సుమీ యని ధ్వని. భట్టు ఇదివిని తలవంచుకొని వెళ్లిపోయి, మర్నాడు రాయలవారితో జరిగిన సంగతి చెప్పగా "నీవు జరిగించిన అపచారానికి తగిన పరాభవం జరిగిం"దని అతనిని మందలించి పెద్దనాది కవులను మళ్ళీ రాయలవారు సభకు రావించి గౌరవించారట.

ఈ గాథను పెద్దనకవి జీవితచరిత్రలో వుదాహరిస్తూ శ్రీగురజాడ శ్రీరామమూర్తిగారు ఆ పద్యంలో 'వాకిటి కావలి' తిమ్మన యని పేర్కొనబడినయతడు ముక్కుతిమ్మన యని పొరబాటుగా వ్రాశారు. అయితే వారే తెనాలి రామకృష్ణకవి జీవితంలో ఈ తిమ్మన్నను గురించిన ఒంకొక చాటుపద్యాన్ని ఉదాహరించి దాని గాథను వ్రాస్తూ అతడు కృష్ణదేవరాయలవారి వాకిటికావలిగా నుండిన తిమ్మన్నయనే దండ నాయకుడని సరిగానే వ్రాశారు. ఆ రెండవ గాథ యిది. ఒక మాటు కృష్ణరాయలవారు తమ వాకిటి కావలిగా నుండే తిమ్మనయనే దండనాథుడి శౌర్యవిశేషానికి సంతోషించి అతని కొక అమూల్యమైన పచ్చడము (సేలువు)ను బహుమతిచ్చారట. అతడా పచ్చడము బుజాన వేసుకొని తన యింటికివచ్చి అరుగుమీద కూర్చునివుండగా అల్లసాని పెద్దన, ముక్కుతిమ్మన, భట్టుమూర్తి, తెనాలి రామలింగకవి ఆ దారినపోతూ తిమ్మన్నగారిని చూసి ఆయనను అభినందిస్తూ నలుగురూ కలిసి ఒక కందపద్యంలో నాలుగు పాదాలు వరసగా ఇలాగ పూర్తిచేశారట:

"వాకిటి కావలి తిమ్మా (అల్లసాని పెద్దన)
ప్రాకటముగ సుకవివరుల పాలిటి సొమ్మా (ముక్కుతిమ్మన)
నీ కీ పద్దెమె కొమ్మా (భట్టుమూర్తి)
నా కా పచ్చడమె చాలు నయముగ నిమ్మా" - (తెనాలి రామలింగ కవి)

అంతట పద్యం చివర భావ ప్రకటనను చేసిన రామలింగ కవికి తిమ్మన్నగారు తన పచ్చడం యిచ్చివేసి తక్కినవారికి ఇతర బహుమానము లిచ్చి పంపించినాడట.

## తిమ్మన్న చరిత్రకు ఆధారాలు

ఈ రెండు గాథలూ సమన్వయం చేసి చూస్తే ఈ పద్యాలలో చెప్పబడిన వాకిటికావలి తిమ్మన్నయనే యతడు సామాన్యుడైన కాపలావాడివంటి ద్వారపాలకుడు కాడనిన్నీ, రాయలవారిదగ్గర గొప్ప అధికారమూ, పలుకుబడీ కలిగిన వుద్యోగి యనిన్నీ, విద్యావంతుడు, రసికుడు అనిన్నీ ఊహించడానికి సావకాశం కనపడుతూ వుంది. ఈ తిమ్మనను గూర్చిన విశేషాలను తెలుపగల చరిత్రాధారాలేమైనా ఉన్నవేమో చూద్దాము.

తిరుపతి దేవస్థానం విచారణకర్తలైన శ్రీమహంతు ప్రయాగ దాసువారు తిరుపతి క్షేత్రంలో రాజాధిరాజులూ, శ్రీమంతులూ చెక్కించిన శిలాశాసనాలయొక్క విలువను

గ్రహించి వాటిని ప్రకటించడానికి నిశ్చయించి వాటిని గురించి ఒక నివేదికను తయారు చేయడానికి బ్రహ్మశ్రీ సాధు సుబ్రహ్మణ్యం బి.ఏ. గారిని నియోగించారు. శాసన సంపుటాలతో పాటు వారి నివేదికను కూడా ఒక పెద్ద గ్రంథముగా 1930లో అచ్చు వేయించారు. దీనివల్ల పల్లవులు, చోళులు మొదలైన రాజుల కాలంనాటి నుంచి విజయనగర సామ్రాజ్యము నేలిన చక్రవర్తులవరకూ గల చరిత్రాంశాలు, విశేషాలు తెలుస్తున్నవి. అందులో తిమ్మన్న చరిత్ర కూడా ఉన్నది.

## 'అవసరం' తిమ్మయ్య

తిరుపతి దేవస్థానంలో ఉన్న శాసనాలవల్ల కృష్ణదేవరాయలవారి కొలువులో 'అవసరం తిమ్మయ్య' యనే దండ నాయకుడొకడు రాయలవారి 'వాకిటికావలి' అనగా ద్వారపాలకుల పై యధికారియై యున్నట్లున్నూ, అతడు వేయిమంది సైనికుల కధికారి యనిన్నీ, ఒక చిన్న సంస్థానము నేలే సామంత మండలేశ్వరుడనిన్నీ, అతనిని 'అమరం' తిమ్మరనయ్య, తిమ్మప్ప నాయకుడు అనికూడా పిలిచేవారనిన్నీ, ఆయనకు రాయలవారిదగ్గర చాలా చనవు ఉన్నట్లున్నూ, చాలామందికి ఆయన రాయలవారి దర్శనం చేయించి అనేక సందర్భాలలో చాలా ఉపకారాలు చేసినట్లున్నూ తెలుస్తున్నది.

తిరుపతిలో ఉన్న దానశాసనాలలో 'అవసరం' నరసయ్య, తిమ్మయ్య, నరసయ్యలనే ముగ్గురు అన్నదమ్ముల పేర్లున్నూ, వారి తల్లి బసవమ్మగారి పేరున్నూ కూడా కనబడుతూ ఉన్నవి. శా.శ. 1434కు సరియైన అంగీరస నామ సంవత్సరం (క్రీ.శ. 7-8-1512) నాటి శాసనంలో ఈ కుటుంబంవారికి తిరువెంగళనాథుడు ఇలువేల్పు అయినట్లున్నూ, అవసరం నరసయ్య తిమ్మయ్యగార్లు "రాయరబాగిల అవసరద" - అనగా కృష్ణదేవరాయల వారి తలుపుల దగ్గరవుండే ద్వారపాలకులైనట్లున్నూ కన్నడంలో వివరింపబడింది. ఈ అన్నదమ్ములలో తిమ్మయ్యయే మన 'వాకిటి కావలి' తిమ్మన యని నిస్సందేహంగా చెప్పవచ్చును.

ద్వారపాలకు డంటే మన 'గేటుకీపరు' వంటి జవాను అనుకోకూడదు. అతడు రాయలవారి సన్నిధిలో నుండే ఒక గొప్ప యుద్యోగి. రాయలవారి దర్శనం నిమిత్తం పోదలచిన వారందరూ ఆయన అనుజ్ఞను పొందాలి. అతడు రాయలవారికి మనవిచేసి దర్శన మిప్పిస్తాడు. అందువల్ల ఆయనకు దివాణంలో గొప్ప అధికారము, పలుకుబడీ వుండేవి.

శా.శ. 1441 ప్రమాదినామ సంవత్సరం అనగా క్రీ.శ. 1519-20 నాటి శాసనంలో పేర్కొనబడిన కృష్ణదేవరాయలవారి ద్వారపాలకుడైన 'తిమ్మభూపతి' యీ వాకిటి కావలి తిమ్మన్నగారే. ఈ శాసనంలో 'భూప' అనే పదము వాడినందువల్ల ఇతడు కొంత రాజ్యభాగమును పరిపాలించే సామంత మండలేశ్వరుడని తేలుచున్నది. ఈ శాసనంలో మధుర జిల్లాలో అన్నామల పేర్కొనబడినందువల్ల అతని రాజ్యభాగం ఆ ప్రాంతాలలో వుండివుండాలి.

ఇలాగే చక్రవర్తి గారికి ఇతరవిధాలైన సేవలు చేసే వారిలో గొప్ప ప్రభువులు, దండనాయకులు అనేకులుండినట్లు శాసనాలవల్ల కనబడుతూవుంది. రాయలవారి సన్నిహిత

భృత్యులలో కొందరు గొప్పవంశాలలో జన్మించిన వారున్ను, కొందరు రాజబంధువులున్ను వుండేవారు. వారిలో కొందరు దుర్గాధ్యక్షులున్ను, సామంత మండలేశ్వరులున్నూ కూడా ఉన్నారు.

## లార్డు చేంబర్లేన్ వంటి రాజసేవకుడు

మనదేశాన్ని పూర్వం ఏలిన చక్రవర్తుల దగ్గరనుండే రాజసేవకుల లాగనే ఇంగ్లీషు రాజుగారి దగ్గరనుండే సన్నిహిత భృత్యులుకూడా సత్కులసంజాతులైన ప్రభువులుగానే వుంటూవున్న సంగతి ఇంగ్లీషు రాజ్యాంగ చరిత్రను చదివిన వారందరికీ తెలుసును. ఇలాంటి రాజసేవకులలో 'లార్డు చేంబర్లేన్' అనే హోదాగల ఉద్యోగి అధికారమును బట్టీ, గౌరవమునుబట్టీ, పలుకుబడిని బట్టీ చాలా గొప్పవాడు, ఇతడు ఒక ముఖ్యమైన ప్రభువుగా వుంటాడు. ప్రీవీ కవున్సిల్ అనే రాజుగారి ఆంతరంగిక కార్యాలోచన సభలో సభ్యుడుగా వుంటాడు. రాజుగారి కుటుంబములో తటస్థించే శుభాశుభాల కన్నింటికీ ఇతడు తగిన ఏర్పాట్లు చేస్తాడు. రాజుగారి దర్శనము చేయదలంచిన వారందరూ ఇతనిని ఆశ్రయించాలి. రాజుగారి దర్శనము చేయతగినవారని తనకు తోచినవారి కతడు ఆహ్వానాలు పంపి దర్శనం చేయిస్తాడు. అతడు ఎల్లప్పుడూ రాజుగారి ప్రక్కనే నిలిచియుంటాడు. రాజుగారు రాజభవనంలో నుంచి బయటికి వెళ్ళునప్పుడు బండిదగ్గర దాకా సాగనంపుతాడు. మళ్ళీ వచ్చినప్పుడు బండిదగ్గరనుంచి లోవలదాకా మార్గం చూపుతూ తీసుకొనివస్తాడు. రాజదర్శనం కోసం వచ్చినవారిని రాజుగారికి ఎఱుకపరుస్తాడు. రాజుగారి ఆలోచన మందిరము, శయనమందిరము ఈ చేంబర్లేన్ అనే సహాయోద్యోగి యొకడు వుంటాడు. ఇతనిక్రింద మాస్టర్ మార్షల్ ఆఫ్, సెరిమొనీస్ మొదలైన ఇతర రాజసేవకులు పనిచేస్తారు. రాజుగారికి సాలు పొడుగునా సేవచేయడానికి 'Lords and grooms in waiting' అనే హోదాగల ఆరుగురు ప్రభువులను నియమిస్తారు. వారొక్కొక్కరు పదిహేను రోజులుగాని, 21 రోజులుగాని వంతుల చొప్పున రాజసేవ చేస్తారు. ఇంకా ఇలాంటి సన్నిహిత భృత్యులు, గౌరవ హోదాలవారు చాలామంది ఉన్నారు.

ఇంగ్లీషు రాణీగారి అంతఃపురముకూడా లార్డు చేంబర్లేన్ గారి అధికారం క్రిందనే వుంటుంది. రాణీగారి సేవకోసం ఇంగ్లాండు దేశంలో చాలా గొప్పవంశాలలో జన్మించిన ప్రభువుల భార్యలు, వారి కుమార్తెలు, కోడళ్ళు, మనుమరాండ్రు 'Ladies of the bed chamber, Women of the bed chamber, Maids of honour' అనే హోదాలతో నియమింపబడతారు. వీరు పూర్వము మన దేశములో రాణులకు చెలికత్తెలు, పరిచారికలు మొదలైనవారు చేసే సేవలే చేస్తారు. అందువల్ల మన వాకిటికావలి తిమ్మనగారు లార్డు చేంబర్లేన్ వంటి గొప్ప రాజోద్యోగి అనడానికి సందేహంలేదు.

## 'అమరం' తిమ్మరసయ్య

సేలంజిల్లా అరగలూరు గ్రామ దేవాలయం యొక్క దేవాదాయాన్ని వసూలుచేసి గుడిపనులు జరిగించే స్థానికులనే గుడిపారుపత్తెగాళ్లు ముగ్గురికి కొన్ని యిబ్బందులు కలిగి వాటిని గురించి కృష్ణదేవరాయలవారికి స్వయంగా చెప్పుకొందామని వారు రాజధానీ

నగరమైన విద్యానగరానికి వెళ్ళారు. అక్కడ రాయటవారి ద్వారమువద్ద నుండే ప్రధానోద్యోగియైన 'అమరం' తిమ్మరసయ్యగారు వీరివి రాయలవారి దగ్గరికి తీసికొని వెళ్ళి దర్శనం చేయించి వారి యిబ్బందులను తొలగింపజేయడమేగాక వారికొక హారము, తలపాగ, గుఱ్ఱము, గొడుగున్నూ బహుమతి చేయించాడట. ఈ సంగతి శా.శ. వర్షములు 1441కు సరియైన ప్రమాది సంవత్సరము (క్రీ.శ. 10-6-1519) నాటి శాసనంలో ఉదాహరింపబడి ఉన్నది.

ఈ 'అమరం' తిమ్మరసయ్యగారు మన వాకిటి కావలి తిమ్మన్నగారే యనడానికి సందేహం లేదు. 'అమర' మనగా పాళెపట్టుదొరల కియ్యబడు కొలదిసీమ యని శబ్దరత్నాకరకారులు అర్థంచెప్పి కుమారధూర్జటి విరచితమైన కృష్ణరాజ విజయంలోని ఈ క్రింది పద్యాన్ని వుదాహరించారు.

*గీ.* *"భటులు వేయింటి కెన్న నిర్వదియునాళ్ల*
*వేలుగా లక్ష యిర్వదివేల ప్రజకుఁ*
*జెల్లు నల్వదిలక్షలు జీత మనఘ*
*యమర మేలెడు దొరల కీక్రమమె సుమ్మి."*

ఈ పద్యం వల్ల 'అమరం' అనేది కొంత జీతము, బత్తెము, సైనిక బలము, జమీను గల ఒక గొప్పహోదా అని రూఢి అవుతూ ఉంది.

'అమరం' అనే పదము 'అమర నాయంకర' మనేదాని రూపాంతరము. విజయనగర సామ్రాజ్యంలోని వివిధ ప్రాంతాలలో గల కోటలకు అధ్యక్షులై దేశాన్ని పరిపాలించే ప్రభువులను అమరనాయకులనేవారు. వీరు రాజోద్యోగులై, దండనాయకులై దేశపరిపాలకులైన నాయకులు. రాజకీయోద్యోగులలో దొరలు, పారుపత్యగార్లు, రాయసంవారు, అవసరంవారు. రాచకరణాలు అనే వివిధ హోదాలవారు కనపడుతున్నారు. వీరు చేసే ఉద్యోగాలయొక్క వివరాలు స్పష్టంగా తెలియకపోయినా వీరు ప్రభుత్వోద్యోగం చేసే రాజసేవకులనిన్నీ, వారికి జీతబత్తెములు, రాజమర్యాదలు, గ్రామాలు, జమీనులు వుండేవనీ తెలుస్తూంది. రాయలవారు యుద్ధానికి తర్లి వెడుతూఉన్నప్పుడు వీరుకూడా హాజరుగా వుండేవారనిన్నీ తెలుస్తూంది. వీరినిగురించి కొన్ని విశేషాలు రాయవాచకములో వివరింపబడి యున్నవి.

విజయనగర సామ్రాజ్యకాలంనాటి దేశచరిత్రను, రాజకీయ ఆర్థిక సాంఘిక మతపరిస్థితులను గురించి పరిశోధించి, శాసనములను, స్థానిక చరిత్రలను, కవిలెలను, విదేశయాత్రికుల సాక్ష్యములను పరిశీలించి ఆ కాలంలో మన కవులు రచించిన ప్రబంధములలోని వర్ణనలయందు, చరిత్రాంశములయందు గల నిజమును బయటికితీసి "Studies in the History of the Third Dynasty of Vijayanagara" అనే గొప్ప చరిత్ర గ్రంథమును రచించిన డాక్టరు నేలటూరి వెంకటరమణయ్యగారీ సంగతుల నన్నింటినీ చక్కగా చర్చించియున్నారు. *

* చూ: 4వ ప్రకరణము, పుటలు 151 - 157; 5 వ ప్రకరణము, పుటలు 170 - 1, 179 - 181.

## తిమ్మప్ప నాయకుడు

గోరంట్ల గ్రామంలోని దేవాలయ సేవకులకు గల కొన్ని బాధలను సూరపరాజు అనే అయన తీర్చినాడనిన్నీ, అయన వాకిటి అదెప్పనాయనింవారి కార్యకర్త (ఏజెంటు) అనిన్నీ, ఈ అదెప్పనాయనింవారి తండ్రిపేరు తిమ్మప్పనాయకుడనిన్నీ 1912వ సంవత్సరపు మద్రాసు ఎపిగ్రాఫికల్ రిపోర్టు 55వ పేరాలోను, 1912వ సంవత్సరం 11వ సంఖ్య శాసనంలోను ఉదాహరింపబడినది.

అవసరం తిమ్మయ్య యనీ, అమరం తిమ్మయ్య యనీ, వాకిటి తిమ్మయ్య యనిన్నీ పైన చెప్పిన శాసనాలలో పేర్కొనబడిన తిమ్మన్నగారే ఈ తిమ్మప్పయని చెప్పడానికి సందేహంలేదు.

## ఇతర రాజసేవకులు

కృష్ణదేవరాయలవారి కొలువులో వుండి అయనకు సేవ చేసే సద్వంశ సంజాతులైన ఇతర నాయకులనేకుల పేర్లు తిరుపతి శాసనాలలో కనబడుతున్నవి.

## 'ఊడియం' ఎల్లప్పనాయకుడు

ఊడియం ఎల్లప్పనాయకుడనే రాజోద్యోగి కృష్ణదేవరాయల వారికీ, అయన తరువాత రాజ్యంచేసిన అచ్యుత దేవరాయలవారికీ సన్నిహిత భృత్యుడుగా వుండేవాడు. ఊడియ మనే పదము ఊడిగ మనే మాటకు రూపాంతరము. ఇతడు 'కల్‌తేరు' అనగా రాతిరథం దగ్గర సత్రం నిర్మించి నట్లున్నూ, తిరుపతిలో గోవిందరాజస్వామివారికి దానం చేసినట్లున్నూ క్రీ.శ. 1527 నాటి ఒక శాసనంవల్ల కనబడుతూవుంది.

## 'అడపం' బయ్యప్పనాయకుడు

అడవ మంటే వక్కలు, ఆకులు మొదలైన తాంబూలపు ద్రవ్యములుంచే సంచి. దీనిని సంబెళమనికూడా అంటారు. ఆ కాలంలో సామాన్యులుకూడా ఎక్కడికి వెళ్ళినా ఒక అడపను పట్టుకొని వెళ్ళేవారు. కృష్ణదేవరాయలవారు రచించిన ఆముక్తమాల్యద 7వ అశ్వాసంలో 7వ పద్యంలో దీని వర్ణన కనబడుతూ ఉంది. ఇది శ్రీమంతు లనుభవించే భోగాలలో ఒకటి. అందువల్ల రాజాధిరాజులైన విజయనగర చక్రవర్తులకు తాంబూలద్రవ్యముల యుద్యోగి యొక దుండడంలో ఆశ్చర్యమేమున్నది? కాశ్యపగోత్రుడైన తిమ్మప్ప నాయకుడి కుమారుడైన ఈ బయ్యప్ప, కృష్ణ దేవరాయలవారి కాలంలోను, అచ్యుత దేవరాయలవారికాలంలోనూ కూడా ఈ యుద్యోగం చేసినట్లు అతడు తిరుపతి వెంకటేశ్వరస్వామికి 55,320 నార్పణములు సమర్పించినట్లు క్రీ.శ. 6-9-1538 సం.లో చెక్కించిన శాసనంవల్ల తెలుస్తూంది. ఇతడింకా కొన్ని గ్రామాల ఆదాయంవల్ల వచ్చే సొమ్మును కూడా దేవుడికి సమర్పించాడు. అందువల్ల ఇతడొక శ్రీమంతుడై యుంటాడనడానికి సందేహం లేదు.

## 'కట్టిక' తిమ్మన

జిల్లేళ్ళ బసవనాయకరు కుమారుడైన తమ్మునాయకరు అనే యతడు కృష్ణ దేవరాయలవారి 'కట్టిక' అనగా వెండిబెత్తమును పట్టుకునివుండే వేత్రధరుడు. ఇదియొక రాజలాంఛనము. అతడొక దళవాయి అనిన్నీ, ఈయనకు 'దాడినేని' అనే బిరుదు కూడా ఉండేదనిన్నీ, అతడు తిరుపతి వెంకటేశ్వరస్వామివారికి నిత్యనైవేద్యము నిమిత్తము 1200 నార్పణములు సమర్పించినపుడు క్రీ.శ. 1513వ సంవత్సరములో చెక్కించిన శాసనములో వ్రాయబడి ఉన్నది. ఈ శాసనమే తెలుగులో కూడా క్లుప్తంగా వ్రాయబడింది. అందులో ఈ కట్టిక తిమ్మన్న అనుసంధానం రామానుజయ్యగారి శిష్యుడనిన్నీ, అతని పేరు కట్టిక దాడినేని దళవాయి తిమ్మయ్యయనిన్నీ ఉదాహరింపబడి ఉన్నది. శత్రువుల మీదికి దాడివెడలి జయించినందువల్లనే 'దాడినేని' అనే బిరుదు ఇతనికి వచ్చివుంటుంది.

## 'విద్వత్సభారాయరంజక' శ్రీరంగరాజు

కృష్ణదేవరాయలవారి పూర్వులకాలంనుంచీ విజయనగర రాజభవనంలో ఒక నాటకశాల వుండేది. కృష్ణదేవరాయల వారికాలంలో ఒక నాట్యశాల, ఒక నృత్యశాలకూడ వుండేవి. రాయలవారు తమ ఆస్థానంలో సంగీత సాహిత్య విద్వాంసులను పోషిస్తూ, సదా విద్యాగోష్ఠిలో కాలక్షేపం చేస్తూ 'విద్వత్ సభారాయ'లనే బిరుదు వహించారు. నృత్యముచేసి, సంగీతముపాడి ఆయనను రంజించే ఆటపాటకుల మేళమొకటి యుండేది. ఈ మేళానికి నాయకుడు తిరుమలనాథుని కుమారుడైన శ్రీరంగరాజు. అతనికి 'విద్వత్ సభారాయరంజక' అనే బిరుదు వుండేది. రాయలవారాయనకు గొప్పజాగీరు లిచ్చారు. అందులో ఎర్లంపూడి అనే గ్రామాన్ని ఈ శ్రీరంగరాజు క్రీ.శ. 1514లో శ్రీ వేంకటేశ్వరుల వారికి సమర్పించాడు.

ఈ శ్రీరంగరాజు కుమార్తెయైన రంజకం కుప్పాయి అనే కుప్పసాని క్రీ.శ. 1512లో చేసిన దానం ఒకటి కనబడుతూవుంది. ఈ కుప్పాయికి తిరుమలమ్మ, ముద్దు కుప్పాయి అనే ఇద్దరు కుమార్తెలుండేవారు. తిరుమలమ్మ స్వామివారికి శా.శ. 1439 ఈశ్వర సం. (క్రీ.శ. 1517)లో 3000 నార్పణములు సమర్పించినట్లు వ్రాయబడిన శాసనం తెలుగు ప్రతిలో ఆవిడ శ్రీరంగరాజు మనుమరాలననిన్నీ, కుప్పమ్మ కుమార్తెననిన్నీ వ్రాయించింది.

కుప్పాయి రెండవ కుమార్తె ముద్దుకుప్పాయి మొదట విజయనగర చక్రవర్తియైన అచ్యుతదేవరాయల అంతఃపుర పరిచారికగా వుంటూ వుండి ఆయన ఆజ్ఞ ప్రకారము తిరుపతి వేంకటేశ్వరస్వామివారి సేవ చేయడానికి వచ్చినట్లున్నూ, గోవిందరాజస్వామివారి ఆలయం నుంచి ప్రతిరోజూ ఆవిడకు తినడానికి ప్రసాదం యిస్తూవున్నట్లున్నూ శా.శ. 1453 ఖర సంవత్సరం (క్రీ.శ. 6-6-1531) శాసనంలో వివరింపబడిఉన్నది. ఈ శాసనంలో శ్రీరంగరాజు కొమార్తెయున్నూ, ముద్దు కుప్పాయితల్లిన్నీ అయిన కుప్పసానికి కూడా "విద్వత్సభారాయరంజకం" అనే బిరుదు వుండినట్లు చెప్పబడి ఉన్నది.

ఇలాగ విజయనగర చక్రవర్తుల సేవనుచేసే స్త్రీ పురుషులలో గొప్పవంశాలవారూ, శ్రీమంతులూ అనేకులుండేవారని తిరుపతి దేవస్థానములో నున్న శాసనాలవల్ల తెలుస్తూ ఉన్నది*.

## తిమ్మ శబ్దవిచారము

మన తెలుగుదేశంలో తిమ్మ, తిమ్మడు, తిమ్మన్న, తిమ్మప్ప, తిమ్మకవి, తిమ్మనృపతి, తిమ్మమంత్రి, తిమ్మయ్య, తిమ్మరాజు, తిమ్మాజి, తిమ్మశౌరి, తిమ్మశెట్టి, తిమ్మక్క తిమ్మాయమ్మ, తిమ్మమ్మ, తిమ్మాంబ, తిమ్మాజమ్మ అనే స్త్రీ పురుషుల పేర్లేగాక తిమ్మాపురం, తిమ్మసముద్రము మొదలైన స్థలవాచకములున్నూ, తిమ్మిని బ్రహ్మిని చేయడము, రమ్మన్నారు. తిమ్మన్న బంతికి, తిండికి తిమ్మరాజు - పనికి పోతరాజు మొదలైన జాతీయాలున్నూ చిరకాలంనుంచి వాడుకలో నున్నవి. ఆంధ్రసామ్రాజ్యానికి కన్నడ దేశమధ్యనున్న విద్యానగరం రాజధాని యైనప్పటినుంచీ ఈ తిమ్మశబ్దానికి కన్నడ ప్రత్యయాలు చేర్చిన పదాలుకూడా వాడుకలోనికి వచ్చినవి. తిమ్మరాజునే కన్నడములో తిమ్మరుసు అని వ్యవహరించారు. రాజు అనే శబ్దంలోనుండి 'అరసు' అనే కన్నడరూపం పుట్టింది. తిమ్మశబ్దము వైకృతదేశ్య మిశ్రమమైన తిరుమల శబ్దములోనుంచి పుట్టిన దేశీయమైన తెలుగు పదము. దీని వ్యుత్పత్తిని గురించి శబ్దరత్నాకరములో కొన్ని వివరాలున్నవి.

తిరుమల + డు = తిమ్మడు అయింది (చూ : శబ్దరత్నాకరం), ఇలాగే తిరుమల + అప్పుడు = తిమ్మప్పుడు అయింది. ఈ తిమ్మప్పుడు అనేది సింహాద్రి అప్పడులాంటి పదమే. కాకమాని మూర్తికవి తన రాజవాహన విజయములో "కొండ మీది తిమ్మప్పునివంటి కావ్యపతి యబ్బుట యబ్బుర"మని వ్రాసిన పద్యం శబ్దరత్నాకరములో ఉదాహరింపబడి ఉన్నది. తిరుమల అనేపదము వేంకటాచలమనేదానికి పర్యాయపదంగా చిరకాలంనుంచి వాడుకలోవుంది. అళియ రాయరాయల మేనల్లుడున్నూ, కొండవీడు పరిపాలకుడున్నూ అయిన సిద్ధి రాజు తిమ్మభూపాలుడు తన పరమయోగి విలాసములో 2వ ఆశ్వాసంలో,

క. *"ధరగల తిరుపతు లొకకడ,*
*వరుసకొని ముకుందమూర్తి వర్గము నత ద*
*త్పరువుగ నుతించె నెడనెడ*
*దిరుమల దేవరను దిరిగి తిరిగి పొగడుచున్."*

అని వ్రాసినాడు. తిరుపతి యనేది విష్ణుక్షేత్రానికి పర్యాయపదము.

గీ. *"వినుము తల్లి నూట యెనిమిది తిరుపతు*
*లందు నెన్న వేంకటాచలంబు*
*రంగధామమును గరంబు సన్నుతి గాంచు*
*గ్రహములందు శశియు రవియు బోలె."*

అని 4వ ఆశ్వాసంలో వ్రాసినాడు. (చూ : శబ్దరత్నాకరము.)

---

* Tirupati Devasthanam Epigraphical Report by Sadhu Subrahmanyam. pp. 199. 207.

తెలుగులో తిరుపతి, తిరుమల అనే పదాలు పర్యాయపదాలుగా చిరకాలంనుంచి వాడుకలో నున్నవి. తెలుగు దేశానికీ, అరవదేశానికీ తిరుపతికొండ సరిహద్దని అంటారు. తిరుపతిలోని ప్రజలందరికీ తెలుగే మాతృభాషగా వుండి తిరుమలలోనుంచి తిమ్మశబ్దం పుట్టడంతోపాటు తిరుపతి కొండమీది కోతులకు తిమ్మడనే పేరు రూఢమైంది. ఈ తిరుపతి వెంకటేశ్వరుడు తెలుగువారికి ఇలవేల్పుగా వుంటున్నాడు. అయితే ఇటీవల ద్రావిడాభిమానుల యుద్యమ మొకటి బయలుదేరి తిరుపతి వెంకటేశ్వరుని పేరులోని వేంకటశబ్దము వేంగడ మనే అరవ శబ్దంలోనుంచి పుట్టినదని, దానితోపాటు తిరుమల తిరుపతులు కూడా అరవవారి స్వార్జితవు సొత్తులనీ ఒక ప్రచారము జరుగుతూఉన్నది.

**"జనని సంస్కృతంబు సకలభాషలకును,**

**దేశభాషలందు తెలుగు లెస్స"**

మన దక్షిణ భారతదేశములో పూర్వంనుంచీ ఏ రాజవంశాలు ఏలుతూ వస్తూవున్నా, వారు పల్లవులైనా, చోళులైనా, చాళుక్యులైనా, లేక కాకతీయులైనా, విజయనగర చక్రవర్తులైనా ఇక్కడి తెలుగువారినీ, అరవవారినీ, కన్నడులనూ కూడగట్టుకుని దేశప్రజల నాగరికతను, మత ధర్మాలను కాపాడుతూ ప్రజానురంజకంగా పరిపాలించారే గాని వేరు వేరు భాషలు మాట్లాడేవారిని చీలదీసి 'పాకిస్థానాల'ను ఏర్పరచలేదు. అందువల్లనే ఆసేతుహిమాచల పర్యంతముగల పుణ్యక్షేత్రాలను, పుణ్యనదులను దేశ ప్రజలందరూ ఇప్పటికీ సమానభక్తితోనే పూజిస్తూవుండటం తటస్థించింది. ఏ క్షేత్ర మాహాత్మ్యం చదివినా, ఏ పురాణం చదివినా ఆ స్థల జల పవిత్రతను గురించీ, ప్రాశస్త్యాన్ని గురించీ వర్ణించడం కనబడుతుందేగాని ఇది అరవలది, ఇది తెలుగువారిది, ఇది కన్నడులది, అది మహారాష్ట్రులది అనే భేదాన్ని పొరపాటునైనా చెప్పవు. కావేటిరంగని పదాలుగాని, పాండురంగ విఠలుని కీర్తనలుగాని, తుకారాము అభంగములుగాని, కబీరుదాసు కీర్తనలుగాని, తులసీదాసు తోహరాలుగాని, గీతగోవిందముగాని, తరంగములుగాని, తత్వాలుగాని ఎక్కడనైనా ఎవరైనా పాడుతూ వుంటే అది ఏభాష అనే విచక్షణ లేకుండా దేశ ప్రజలందరూ - స్త్రీలూ, పురుషులూ భక్తి పారవశ్యంతో తన్మయులవుతారు. ఏ క్షేత్రానికి పోయినా ఆప్రాంతపు భాషతో నిమిత్తం లేకుండా అక్కడి ప్రజలతో పాటు దేవుణ్ణి సేవించగల్గుతున్నారు.

అరవలైన పల్లవులూ, చోళులూ తెలుగుదేశాన్ని ఏలినప్పుడుగాని, చాళుక్యులు తెలుగు కర్ణాటకాలను ఏలినప్పుడుగాని, కర్ణాటక రాజ్యమధ్యలో తెలుగు ప్రభుత్వము స్థాపించిన విజయనగర చక్రవర్తులు ద్రావిడ కర్ణాటకాలను పరిపాలించినప్పుడుగాని ఒకజాతిని, ఒకభాషను అధికముగా జేసి తక్కినవారిని అణగద్రొక్కలేదు. అన్ని భాషలనూ ఆదరించారు. "జనని సంస్కృతంబు సకల భాషలకును, దేశ భాషలందు తెలుగులెస్స" యనే భావము ఒక్క తెలుగు వారిలోనేకాదు అరవలలోనూ, కన్నడులలోనూ కూడా వ్యాపించి యున్నది. ఆయా దేశాలలో ఇప్పటికీ ప్రజల నోట వినబడే తెలుగుపదాలు, పద్యాలు, కీర్తనలు, కథలు, గాథలూ ఇందుకు ప్రబలమైన నిదర్శనాలుగా ఉన్నాయి.

కృష్ణదేవరాయలంతటివాడు "దేశభాషలందు తెలుగులెస్స" యని యుద్ఘోషించాడు. అంతమాత్రంచేత జాత్యహంకారము గాని, జాతివైరముగాని ప్రబలలేదు.

## ద్రావిడ ఉద్యమము

అరవదేశంలో ఇటీవల కొందరు ప్రబుద్ధులు బయలుదేరి ఒక ద్రావిడాభిమానమును ప్రచారంచేస్తూ తమ దేశములో నుంచీ, భాషలోనుంచీ, సంగీత సాహిత్యములలో నుంచీ సంస్కృతాన్ని పారదోలడానికి ప్రయత్నిస్తున్నారు! అరవంలో పాడకుండా తెలుగులో పాడినాడనే కారణంతో త్యాగరాజుయొక్క దివ్యవాణిని తమ సంగీతసభలలోనుంచి వెలిపెట్టడానికి ప్రయత్నిస్తున్నారు!! దేశంలోని తెలుగుభాగాలు కూడా తమవే నంటున్నారు. ఇంక ఉమ్మడిప్రదేశాలన్నీ తమ వనడంలో ఆశ్చర్యమేమున్నది! ఈ సందర్భములో దేశచరిత్రనుకూడా తమ కింపుగా ఉండేటట్లు మార్చివ్రాయడానికి ప్రయత్నిస్తున్నారు. కేవలము ద్రావిడ దురభిమానావేశముగలవారు మాత్రమే ఇలాంటి పిచ్చిపనులు చేస్తే చింతలేదు. డాక్టర్ ఎస్. కృష్ణస్వామి అయ్యంగారి వంటి ప్రాజ్ఞులైన చరిత్రకారులు కూడా తమ రచనలలో అరవ అభిమానం చూపిస్తూ సత్యాన్ని మరుగు పరచడము, చరిత్రాంశాలకు అపార్థం కల్పించడం చాలా దుఃఖకరమైన సంగతి. తిరుపతి చరిత్రలో వారు తెలుగు భాషకు, తెలుగువారికి చేసిన అన్యాయము మరీ ఎక్కువగా నున్నదీ. వెంకటశబ్దముతోపాటు తిరుమలను, తిరుపతిని అరవవారి స్వంతహక్కుగల సొత్తుగా నిరూపించాలని కృష్ణస్వామయ్యంగారు చాలా తంటాలు పడ్డారు. తిరుపతి దేవస్థానపు శాసనాలను పరిశోధించి నివేదికను తయారుచేసిన సాధు సుబ్రహ్మణ్యంగారి నివేదికను, ఈ తిరుపతి చరిత్రను పోల్చిచూస్తే కృష్ణస్వామయ్యంగారి పక్షపాతపు వ్రాతలు కొంతవరకూ తెలుసుకోవచ్చును.

మన తెలుగు చరిత్రకారులు, పరిశోధకులు, విశ్వకళాపరిషత్తువారు, తెలుగుప్రజలూ చరిత్ర రచనలలో మనకు జరుగుతూవున్న ఈ అన్యాయాన్ని గురించి ఎందుకు ఆలోచించరో తెలియడంలేదు. బ్రతికిచెడినజాతి ఈ యాంధ్రజాతి అనియైనా స్మరించుకుంటే కృతార్థుల మవుతాము.



# 11. కందనూరు నవాబు రాజరికం

*(ఇది కల్పితకథ కాదు. నిజంగా జరిగిన సంగతి. 1839వ సంవత్సరం వరకూ కర్నూలు జిల్లాలో నాలుగు తాలూకాలు కర్నూలు నవాబు రాజ్యంలో చేరివుండేవి. శ్రీశైలము, అహోబిలము, నివృత్తిసంగమము మొదలైన పుణ్యక్షేత్రాలకు పోయే యాత్రికులదగ్గర ఆ నవాబుగారు 'హోళీలు' (పన్ను) వసూలు చేసేవాడు. శ్రీశైల దేవస్థానము చాలా దుస్థితిలో వుండేది. ఇలా వుండగా ఈ నవాబుగారు ఇంగ్లీషు కంపెనీ ప్రభుత్వాన్ని తిరగదోడడానికి*

కర్నూలు నవాబురాజ్యములోనే యున్నాయి. ఈ సందర్భంలో కర్నూలునవాబు సాలుకు ఒక లక్షరూపాయిలు కప్పం చెల్లించే పద్ధతిమీద అతని రాజ్యం అతనికే వుండనిచ్చారు.

పైన చెప్పినట్లు నిజాముగారివల్ల ఇంగ్లీషువారికి వచ్చిన దత్తమండలాలనే బళ్ళారి, కడప, కర్నూలు జిల్లాల భాగాలను పరిపాలించడానికి థామస్ మన్రోగారిని నియమించారు. ఆ జిల్లాలలో పాళెగాళ్ళు కొందరు దేశంలో అల్లరి సాగించగా క్యాంబెల్ అనే సేనాధిపతి వారిని అణచివేశాడు. అయితే మళ్ళీ కొద్దిరోజులలోనే దివాకర నాయకుడనే యతడు పుల్లల చెరువు గ్రామాన్ని తగలబెట్టి మార్కాపురం కచ్చేరీలో నున్న ఖజానాను దోచుకున్నాడు. అప్పుడు అక్కడ సబ్‌కలెక్టరుగానున్న గ్రీముదొరగారున్నూ, తాశిల్దారుగానున్న నరహరిరావుగారున్నూ అతనిని పట్టుకోడానికి చాలా ప్రయత్నాలు చేశారు గాని లాభం లేకపోయింది.

1803లో చెన్నపట్నానికి మింటోగారు గవర్నరుగా నుండగా ఇంగ్లీషువారికి మహారాష్ట్రులతో యుద్ధం వచ్చింది. అప్పుడు కర్నూలు నవాబు అలూఫ్‌ఖాను తన తమ్ముడికి కొంత సైన్యమిచ్చి ఇంగ్లీషువారికి సహాయంగా పంపించాడు. అలూఫ్‌ఖానుగారికి ఆరుగురు కుమారులు. అందులో కడసారి కుమారుడైన గులాం రసూలుఖాను మీద అయనకు చాలాప్రేమ. అందువల్ల తనస్థానే అతణ్ణి నవాబుగా అంగీకరించవలసినదని మింటోగారిని ప్రార్థించి ఆ ప్రకారము ఉత్తర్వులు పొందినాడు. అంతట గులాం రసూలుఖాను కర్నూలు నవాబు అయినాడు. అయితే మళ్ళీ ఏకారణం వల్లనో అతనికి బదులుగా కొంతకాలం మునవరుఖానున్నూ, తరువాత ముజఫర్ ఖానున్నూ నవాబులుగా నున్నారు. ఇంతలో అలూఫ్‌ఖాను 1815లో చనిపోగా ఇంగ్లీషు ప్రభుత్వంవారు ముజఫర్‌ఖానును తొలగించి మళ్ళీ మునువరుఖానునే నవాబుగా చేశారు.

## గులాం రసూలుఖాను పరిపాలన

మునవరుఖాను నవాబుగా వుండగా 1816లో పిండారీదండు కర్నూలుజిల్లామీదికి వచ్చిపడి ప్రజలను దోచి హింసించింది. మునవరుఖాను తరువాత 1823లో గులాం రసూలుఖాను కర్నూలునవాబు అయినాడు. ఇతడు 1839వ సంవత్సరం వరకూ ఆ రాజ్యాన్ని ఏలినాడు. ఇతనికాలంలో పరిపాలన చాలా నిరంకుశంగా ఉండేది. ఈయన రాజ్యంలో ఉన్న అహోబళం, శ్రీశైలం మొదలైన పుణ్యక్షేత్రాలకు యాత్రవచ్చే హిందువులవల్ల చాలా ఎక్కువ హాశ్శీలు వసూలు చేస్తూవుండేవాడు గాని ఆ దేవస్థానాల పరిపాలన సరిగా జరిగించేవాడు కాదు.

గులాం రసూలుఖానుగారికి పూర్వం కర్నూలును పరిపాలించిన నవాబులలో కొందరు చాలా శాంతముగాను, న్యాయంగాను దేశాన్ని పరిపాలించారు. దేశం సుభిక్షంగా నుండేది. వారు మతపక్షపాతం చూపించకపోవడమేగాక హిందువుల దేవాలయాలకు కూడా ఇనాములిచ్చి పోషించారు. కర్నూలు నవాబులు నిజాముగారి కివ్వవలసిన పేష్కషు గాకుండా వారు నిజాముగారికీ, ఇంగ్లీషు కంపెనీవారికీ చాలా సొమ్మును, సైన్యమును ఇచ్చి యుద్ధాలలో సహాయం చేయవలసి వచ్చేది. ఒక వంక హైదరాలీ సైన్యాలూ, ఇంకొకవంక శివాజీసైన్యాలూ వచ్చిపడి దేశాన్ని కొల్లగొట్టి నవాబును బాధిస్తూ వున్నందువల్ల

నవాబుకు అమితమైన ధనవ్యయం కలిగి చాలా సొమ్ము కావలసివచ్చేది. అందువల్ల వారు ప్రజలను పీడించి అనేక విధాలుగా సొమ్ము రాబట్టేవారు. పన్నుల వసూలులో క్రమపద్ధతిపోయి గ్రామాధికారులే పన్నులు నిర్ణయించి వసూలుచేసేపద్ధతి ప్రారంభమైనది.

గులాం రసూలుఖానుగారి కాలంలో గ్రామాలను గుత్తకిచ్చే ఆచారం వచ్చింది. శిస్తు వసూలుకు గ్రామాధికారులే నవాబుగారికి జవాబుదారులైనందువల్ల వారు నిరంకుశులై అక్రమాలు జరిగించడం మొదలుపెట్టారు. పంటలు పండినా పండకపోయినా పన్నులు పూర్తిగా వసూలు చేసేవారు. పంటలు బాగా పండినప్పుడు నవాబుగారి సైన్యాలు వచ్చిపడి ఆ ధాన్యాన్ని బలవంతంగా యెత్తుకొని పోయేవి. ఈబాధలు పడలేక నంద్యాల ప్రాంతపు జనులు రెండు మూడు సంవత్సరాలు వ్యవసాయము చెయ్యడమే మానుకున్నారు.

నవాబుగారి అధికారుల జులుముకు హద్దుపద్దులు లేకుండా పోయినవి. నర్నూరు గ్రామంలో నవాబుగారి గుఱ్ఱం చచ్చిపోతే నవాబుగారి ఉద్యోగులు ఆ గ్రామస్థులవల్ల ఐదువేల రూపాయలు అపరాధంగా వసూలు చేశారు.

కర్నూలు నవాబైన గులాం రసూలుఖానుకు మొదటి నుంచీ కొన్ని కొన్ని పిచ్చికళలు ఉండేవి. అతనికి నిజంగా కొంత చిత్తచాంచల్యముకూడా ఉండేదని అనుకునేవారు. అతనికి ఎంత తోస్తే అంతచేసేవాడేగాని ఒకరు చెబితే వినేవాడుకాడు. అతడు తన సైన్యాన్ని సముద్రయాత్రకు పంపించి వారికి జీతబత్తెములకు బదులుగా బట్టలు, గడ్డి యిచ్చేటట్లు నిశ్చయించాడు. తన పెంపుడు కోడిపుంజుల మెడలలో వజ్రాలను కట్టించాడు. ఒకసారి తానే మహమ్మదు ప్రవక్త నని ప్రకటించాడు. ఈ నవాబుకాలంలో తక్కిన వ్యవహారాలెలాగనున్నా పోలీసురక్షక శాఖమాత్రం చాలా సమర్థతతో పనిచేసేది. అతడు విధించే క్రూరశిక్షలవల్ల అతనిరాజ్యంలో దొంగతనాలు అణగిపోయినవి. చోరీ జరిగిన గ్రామంలో చోరీ ఆస్తిని పట్టి యివ్వలేకపోతే ఆ గ్రామస్థులే ఆ సొమ్ము యిచ్చుకోవాలని శాసించాడు. అందువల్ల దొంగతనాలు చాలా అరుదుగా జరిగేవి. కర్నూలునుంచి హైదరాబాదుకు పంపించే ఖజానాకు సైనిక సిబ్బందిగాని, ఇనుపపెట్టెలు బందోబస్తుగాని లేకుండా గంపలలోనే పంపించేవారు.

ఇంగ్లీషు కుంపినీవారి రాజ్యాన్ని కూలద్రోయాలని ఇతడు కుట్రచేస్తూఉన్నట్లు అనుమానించి 1839 లో కుంపినీ వారు ఇతని రాజ్యం లాక్కొని - ఇతణ్ణి తిరుచునాపల్లికి రాజకీయ ఖైదీగా పంపారు. అక్కడ ఇతడు క్రైస్తవమతాభిమానం చూపుతున్నాడని ఒక మహమ్మదీయుడికి కోపం వచ్చి ఇతనిని 1840లో పొడిచి చంపాడు.

కర్నూలు నవాబు రాజ్యాన్ని లాక్కునేటప్పుడు అతడు అదివరకు తన సరదారులకూ బంధువులకూ యిచ్చిన జాగీరులుకూడా కుంపినీవారు తీసికొని ఆయన కుటుంబంవారికి రెండు లక్షల రూపాయలకు పైగా పింఛను యేర్పాటు చేశారు. అసలు పింఛనుదారులు చనిపోయినమీదట ఆ పింఛనులను రద్దుచేశారు.

ఈ రాజ్యాన్ని లాక్కున్నతరువాత దానికి ఒక బ్రిటిషు కమీషనరును ఏజెంటు అనే పేరుతో నియమించి భూమిని రైతువారీ బందోబస్తు చేశారు. 1858లో తక్కిన నాలుగు తాలూకాలూ కలిపి ఒక కలెక్టరు క్రింద ప్రస్తుతమున్న కర్నూలు జిల్లాను నిర్మించారు. శ్రీశైలాన్ని కొన్నాళ్ళు కుంపినీవారే పరిపాలించి 1840లో ఆ దేవస్థానానికి పుష్పగిరి పీఠాధిపతులను ధర్మకర్తలుగా నియమించారు (Imperial Gazeteer - provincial Series, Madras Vol. I Pp. 406-7).

## ఏనుగుల వీరాస్వామయ్యగారి వర్ణన

ఏనుగుల వీరాస్వామయ్యగారు 1830-1831 మధ్య కాశీయాత్ర చెయ్యడంలో ఈ కర్నూలు నవాబురాజ్యంలో చేరిన పుణ్యక్షేత్రాలను దర్శించారు. అక్కడి రాజకీయ సాంఘిక స్థితిగతులను వర్ణించారు. వీరాస్వామయ్యగారు కడప నుండి శ్రీశైలానికి ప్రయాణంచేసే దారిలో దువ్వూరువరకూ కడపజిల్లాలో చేరిన భూమి అనిన్నీ, తరువాత వంగలి అనే వూరు 'కందనూరి నవాబు' దనిన్నీ వ్రాస్తూ రూపసింగు అనే సర్దారుకు కొలువుకుగాను ఈ గ్రామం వగైరా కొన్ని వూళ్లు జాగీరుగా ఇవ్వబడినవని ఇలా వ్రాశారు. "ఎగువ అహోబిళములో ఉత్సవకాలమందు 400 వరహాలు హాశ్శీలు వసూలు అవుతున్నవి. వాటినంతా కందనూరి నవాబు పుచ్చుకొని వెనక గుళ్ళసంగతినే విచారించడు." (కాశీయాత్ర చరిత్ర - పుట 10)

వీరాస్వామయ్య గారు అహోబిళం నుంచి మహానందికి వెళ్లారు. తరువాత కందనూరి నవాబు రాజ్యంలో చేరిన బండాత్మూరు మీదుగా వెలపనూరు చేరారు. ఇక్కడ నవాబుతరపు ఉద్యోగస్థులు కొందరు ఉన్నారు. అటుతరువాత ఆయన ఆత్మకూరు చేరారు. ఇది ఆ నవాబుతాలూకు ఉద్యోగస్థులు ఉండే కసుబాబస్తీ. శ్రీశైలయాత్ర చేయవచ్చిన వారిదగ్గర హాశ్శీలు పుచ్చుకునే నవాబు ముసద్దీలు ఆత్మకూరులో ఉన్నారు. నవాబు పరిపాలనను వీరాస్వామయ్య గారు ఇలాగ వర్ణించారు. "తాలూకా నాలుగు మేదీలుగా పంచి ఒక్కొక్క మేదికి ఒక్కొక్క అములుదారుని ఏర్పరిచాడు. ఈ అములుదారులందరిపైన అక్బురు నవీసు అనే అధికారిని నియమించాడు. నవుకర్లకు జీతానికి జాగీరులిచ్చాడు. కుంపినీ వారికి సాలుకు లక్షరూపాయలు కప్పం కడతాడు. అతని రాజ్యము బళ్ళారిజిల్లా కలెక్టరు ఆజ్ఞకు లోబడినది. కలెక్టరు తరఫున ఒక వకీలు కందనూరులో కాపురమున్నాడు. నవాబు కాజీకోర్టుపెట్టి న్యాయవిచారణ చేస్తాడు. కుంపినీ కోర్టులకు నిమిత్తం లేదు. నవుకర్లకు జీతాలు స్వల్పము - సరిగా ఇవ్వడం లేదని వాడుక" (పుట. 12).

## శ్రీశైలం దేవస్థానము

శ్రీశైలయాత్రకు తీసే హాశ్శీలు కందనూరి నవాబుకు చేరుతున్నవనిన్నీ, ఉత్సవానికయ్యే ఖర్చుగాక హాశ్శీలుకూడా పుచ్చుకుంటారనిన్నీ, చెప్పి వాటి వివరాలను వీరాస్వామయ్యగారు ఇలాగు వ్రాశారు.

"సిద్ధాపురంలో చెంచువాండ్లకు గాను నవాబు మనుష్యులు మనిషి ఒకటికి 3 డబ్బులు హాశ్శీలు పుచ్చుకొంటున్నారు. వరషవారి (యాత్రికుల) వద్ద నవాబు సరకారు ఆజ్ఞప్రకారం మనిషి 1కి 3 డబ్బులు హాశ్శీలు పుచ్చుకున్నా కిరాతకుల నాయకుడు ధర్మాత్ముడుగానే ఉన్నాడు. కందనూరి నవాబు వగైరాలు పల్లకీలమీదనే శ్రీశైలమునకు వెళ్ళి యున్నారు."

"శ్రీశైలంగుడి హాశ్శీలు మూలముగా సంవత్సరం ఒకటికి 18000 కందనూరి నవాబుకు వచ్చినా, గుడి యేగతిని పొందేదిన్నీ విచారించడు. ఎవరైనా మరమ్మతు చేసినట్లయితే సెలవంత హాశ్శీలు తీసుకొనుచున్నాడు. రాజా చందూలాలా యీ

నిర్బంధముచేత కొంత మరమ్మతుచేసి విడిచినాడు. మైసూరునుంచి వచ్చేవాళ్ళకు హోళ్ళీలులేదు; గుడిలో ఏప్రక్క చూచినా అడవి పెరిగి ఉన్నది. వ్యాఘ్రభూయిష్ఠము. అడవి కొట్టి చక్కచేసే దిక్కులేదు. స్వామికిన్నీ, దేవికిన్నీ ఎవరైనా ఆభరణాలూ, వస్త్రాలు సమర్పిస్తే వాటి మదింపంత రూకలు హోళ్ళీలు పుచ్చుకోవడమే గాకుండ కొన్ని దినాలు పోనిచ్చి ఆ వస్తువులనే ఆ కందనూరు నవాబు అపహరిస్తున్నాడు." (పుటలు 1516)

వీరాస్వామయ్యగారు నివృత్తిసంగమానికి వెళ్ళారు. ఇది కొండ క్రింద నున్నది. కృష్ణ ఉత్తరవాహినిగా ప్రవహిస్తూ ఉన్నది. ఆ యూరున్నూ కందనూరు నవాబుదే. కృష్ణకు యీవలి ప్రక్కవరకూ కందనూరివారి రాజ్యం; అవలిప్రక్క హైదరాబాదువారి రాజ్యము. అందువల్ల కృష్ణదాటడానికి మనిషికింత అని కందనూరువారు ఇవతలప్రక్కా, హైదరాబాదువారు అవతలప్రక్కా హోళ్ళీలు పుచ్చుకుంటున్నారు.(ఇంకా వివరాలకు వీరాస్వామయ్యగారి కాశీయాత్ర చరిత్రచూడండి.)

## దక్షిణదేశ రాజకీయాలు

మొగలాయి చక్రవర్తుల క్రింద దక్షిణదేశానికి పరిపాలకుడుగానుండిన హైదరాబాదు సుభాదారుడే ఇంగ్లీషు ప్రభుత్వం వారికి నమ్మిన స్నేహితుడై ఘనత వహించిన నిజాము ప్రభువు అయినాడు. మొగలు సామ్రాజ్యం అస్తమించిన తరువాత ఇంగ్లీషు పరిపాలనలో దక్షిణ హిందూదేశంలో ఉన్న మహమ్మదీయ రాజ్యాలపైన నిజాముగారి అధికారము పోయినా చాలాకాలంవరకూ అయనకు మంచి పలుకుబడి వుంటూ వుండేది.

1829 మొదలు హైదరాబాదు రాజ్యానికి నిజాము ప్రభువైన నాజర్ ఉద్దౌలా అనే అయన ఇంగ్లీషు వారివల్ల స్నేహభావంతోనే వుండేవాడు. అయనమంత్రి రాజ్యతంత్రనిపుణుడైన రాజా చందులాలా అనే బ్రాహ్మణుడు. ఇంగ్లీషు కుంపినీవారికి మిత్రుడుగా వుండేవాడు. అయితే నిజాం ప్రభువుగారి సోదరుడికి మాత్రం ఇంగ్లీషువారంటే అసహ్యం. అయన కుంపినీవారికి వ్యతిరేకంగా కుట్రలు చేస్తూవున్నట్లు ఇంగ్లీషువారికి తెలిసినందువల్ల అయనను హైదరాబాదులో నుంచి దూరప్రదేశానికి ప్రవాసం పంపించారు.

ఈ దేశపు మహమ్మదీయులలో స్వమతాభిమానం చాలా ఎక్కువ. పరమత సహిష్ణుత చాలా తక్కువ. తమకు యిష్టంలేని రాజ్యాంగవ్యవస్థపట్ల తమవారిలో విరోధభావం వ్యాపింప చెయ్యడానికి అవకాశం కోసం చూస్తూవుండడం మొదటనుంచీ వుంటూనే యున్నది. దేశీయులలో ఒకరితో ఒకరు రహస్యంగా ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపుకోవడానికి ఈ దేశంలో చాలా అవకాశాలు వుంటూఉన్నందువల్ల రహస్యాలోచనలకూ, కుట్రలకూ చాలా వీలుగా వుంటూవుండేది. రహస్యపు ఉత్తర ప్రత్యుత్తరాల మార్గంగానూ, బజారు పుకారుల మూలంగానూ అనేకవార్తలు ఈ దేశంలో అనోటా అనోటావడి చాలా త్వరగా వ్యాపిస్తూవుండేవి.

## తురకల రక్షరేకులు, తాయత్తులు

ప్రపంచమంతటా మహమ్మదీయులకు తావేదులన్నా, రక్షరేకులన్నా చాలా ప్రీతి. ఈ తాయత్తులలో కాగితాల పైనా, రక్షరేకులపైనా భగంతుడిపేరో, లేకపోతే ఖురానులో

నుంచి ఒక వాక్యమో వ్రాసి ఉంటుంది. అయితే అందులోని అక్షరాలూ, మాటలూ, వాక్యాలూ పైకి కనబడే అర్థాన్నేకాక వేరే ఇంకొక అంతరార్థాన్ని కూడా స్ఫురింపచేస్తూ వుండేటట్లు వ్రాయడానికి వీలున్నందువల్ల హిందువుల పైననూ, వారిలాగానే కాఫరులైన ఫరంగీల పైననూ ద్వేషాన్ని పురికొల్పే 'జిహాద్' అనే మతయుద్ధాన్ని ప్రకటించడానికి ఉపయోగించేవారు.

## 'జిహాద్' అనే మతయుద్ధం

1838లో ఇంగ్లీషువారు అఫ్ఘనిస్థానం మీదికి దండయాత్ర చెయ్యడానికి సైన్యాలు పంపినప్పుడు ఇలాంటి అర్థాలు స్ఫురించే తాయత్తులూ, రక్షరేకులూ దేశంలో చాలాచోట్ల కనబడ్డాయి. ఆ సమయములలో హిందూదేశ మంతటావున్న మహమ్మదీయ ప్రజలలో రహస్యమైన ఉద్రేకం కలిగినట్లు కనబడింది. అయోధ్య రాష్ట్రంలోనుంచి అరబ్బీదూతలు బయలుదేరి దేశంలో నలుమూలలా తిరుగుబాటు చేయడానికి ప్రచారం చేశారు. ఆ సమయంలో భగవంతుడి సహాయం ఇంగ్లీషు వారికి వుండబట్టిగాని లేకపోతే హిందూ దేశంలో వారిరాజ్యం భగ్నం అయ్యేదే. ఆఖరికి జాతివాళ్లు చాలామంది ఆహుతి అయ్యేవారే. ఈ కుట్రాలోచనలు జరిగినట్లు చాలా దాఖలాలున్నాయి.

ఇలాంటి అరబ్బీదూతలు కొంతమంది చెన్నపట్నం దగ్గరనే పట్టుబడ్డారు. ఆ సమయంలో వారిదగ్గర దొరకిన రక్షరేకులలో పైకి కేవలమూ మహమ్మదీయ మతానికి సంబంధించిన ఖురానులోని సామాన్యపదాలుగా కనబడే మాటలే చిత్రంగా కూర్చబడి, వాటిని కొంచెం జాగ్రత్తగా పరిశీలిస్తే కాఫరులపైన జిహాద్ అనే మతయుద్ధానికి తురకలను పురికొలిపే అర్థం స్ఫురిస్తుంది. ఈ మాటలను తురకంలోలాగనే కుడినుంచి యెడమకు చదవాలి. ముఖ్యంగా ఈ క్రిందిపట్టిక లోని గళ్ళలో నాలుగైదు పంక్తులను అలాగ చదివి చూడండి :

| 6 | 5 | 4 | 3 | 2 | 1 |
|---|---|---|---|---|---|
| తొలగించు | పీడను | మా ప్రజలకూ | మాకూ | కరుణా మయుడా | ఓదేవా (1) |
| నాశనం చెయ్యడు | మరెవ్వరిని | గట్టి కోట గోడల మధ్య ఉన్న వారిని తప్ప | రక్షిస్తాడు | సద్ధర్ములను | భగవంతుడు (2) |
| రక్షించు | మమ్ములను | నీసేవకులైన | పంపి | నీ ప్రవక్తను | ఓ భగవంతుడా (3) |
| వెయ్యి | తరిమి | దుష్మరి పాలకుల్ని | ఈ క్రూర నిరంకుశ | ఈ మహా నగరాల నుండి | ఓ ప్రవక్తా (4) |
| నాశనం చెయ్యి | వారిని | ఓ భగవంతుడా | యుద్ధం చెయ్యండి | నాస్తికుల పైన | కాఫరుల పైన (5) |

## కర్నూలు నవాబు కుట్ర

ఆఫ్ఘనిస్థానములో ఇంగ్లీషుసైన్యాలకు జయం కలుగుతుందో, అపజయమే కలుగుతుందో అనే సందిగ్ధావస్థలోనున్న సమయంలో, అనగా 1839వ సంవత్సరం వేసంగిలో ఒక బీద తురక స్త్రీ హైదరాబాదునగరంలో ఒక సత్రంలో కలరా తగిలి చావడానికి సిద్ధంగా ఉండి, ఆ సత్రంలోనే బసచేసిన ఒక పెద్దమనిషిని దగ్గరికి పిలిచి తానొక రహస్యం చెప్పుకోదలచినాననిన్నీ, తనకోరిక చెల్లించవలసిందనిన్నీ ప్రతిమాలింది. పాపం, ముసలమ్మ అవసానసమయంలో అడుగుతూవుందికదా అని అతడు సరేనన్నాడు. అంతట ఆమె తన మెడలోనుంచి ఒక రక్షరేకును తీసి అతనిచేతిలో పెట్టి తాను చచ్చిపోగానే ఆ రక్షరేకును తీసుకువెళ్ళి మూసీనదిలో పారవెయ్యవలసిందని ప్రార్థించింది. పాపం, ఆ పెద్దమనిషి మొదట ఆవిడకోరికను చెల్లిద్దామనే అనుకున్నాడుగాని ఈవింతకోరికను గురించీ, ఆవిడ చూపిన అదుర్దాను గురించీ అతనికి మనస్సులో కొంచెం అనుమానంతగిలి ఇందులో ఏదో విశేషం ఉన్నదని తలచి ఆ రక్షరేకును హైదరాబాదులో అధికారుల కిచ్చాడు. దానిని వారు పరిశీలించగా అది నిజాం ప్రభువుగారి సోదరుడు కర్నూలు నవాబుగారికి వ్రాసిన రహస్యపు ఉత్తరం అని తేలింది.

## జనానాలో ఆయుధాగారం

దీనిని గురించి దర్యాప్తులు చేయగా ఇంగ్లీషువారి పట్ల ఒక పెద్ద కుట్ర జరుగుతూవున్నట్లు బయలుపడింది. అంతేకాదు కర్నూలు కోటలో కొంత ఆయుధ సామగ్రిన్నీ, మందుగుండు సామానున్నూ చేర్చివున్నట్లున్ను తెలిసింది. అంతట వెంటనే ఒక ఇంగ్లీషు సైనికదళాన్ని కర్నూలుకు పంపి కోటను సోదాచేస్తామని నవాబును అడిగారు. సరే చేసుకోండి అని అతడు ధైర్యంగా జవాబుచెప్పి తన సైనికులతోటీ, పరివారంతోటీ కోట వెలుపల మైదానంలోనికి వెళ్ళాడు. కర్నూలు నవాబుగారి కోటను తనిఖీ చెయ్యడానికి కమిషనర్లు వెళ్ళినప్పుడు గులాం రసూలుఖానుగారు వారిని చాలా మర్యాదచేశారు. దానిని గురించి వారే ఇలాగా వ్రాశారు. "కర్నూలుపట్నంనుంచి కోటద్వారము దాకా వీధులకు రెండుప్రక్కలా సైనికులు బారులు తీర్చి మాకు జోహారుచేసి గౌరవం చూపారు. మేము దివానుఖానాను సమీపించగానే నవాబుగారు కొంచెము దూరము మా కెదురుగావచ్చి మాచేతులు పట్టుకొని ఉచితాసన మిచ్చి గౌరవించాడు. అటుతరువాత ఖరితా ఇవ్వగా నవాబు చాలా వినయంతోనూ, గౌరవంతోనూ స్వీకరించాడు."

కోటను సోదాచూడాలని కమిషనర్లు ఆయనతో చెప్పగా ఆయన మారుమాటాడక, కోటను వారికి స్వాధీనంచేసి తాను, తన పరివారజనమూ హంద్రినదియొడ్డున నున్న జోహారాపురమునకుపోయి అక్కడ వేచియున్నాడు. ఈ అవమానం సహించలేక అతని మామగారైన నాందిరీఖానుగారు తిరుగుబాటు చేశాడట.

అంతట ఆ కోటను సోదాచెయ్యడానికి నియమింపబడిన కమిషనర్లు కోటను, నవాబుగారి అంతఃపురాన్ని జాగ్రత్తగా సోదాచేశారుగాని ఏమీ దొరకలేదు. కోటలో మందుగుండు సామాను యేమీ కనబడలేదు. నవాబుగారు దోషి యనడానికి తగిన నిదర్శనాలేమీ కనబడలేదు.

నవాబుగారి జనానాకు అంటివున్న ఉద్యానవనం పెద్ద గోడలమధ్య గదులు గదులుగా కేటాయింపు చేయబడి ఉన్నది. ఏమైనా వుంటే అక్కడే దొరుకుతుందని అనుకున్నారుగాని అక్కడకూడా ఎంత వెదకినా అనుమానం కలిగేది ఏమీ కనబడలేదు. అయితే ఇదివరకు వచ్చిన అచూకీ సులభంగా తీసిపారవేయడానికి వీలైనదికాదు. కనుక ఈ జనానా వుద్యానవనాన్ని మళ్ళీ ఇంకొకమాటు ఇంకా జాగ్రత్తగా పరిశోధించడానికి నిశ్చయించారు. ఆ ప్రకారం నలుమూలలా శోధిస్తూ వుంటే అందరికీ ఆశ్చర్యం కలిగేటట్లుగా ఈ జనానా ఉద్యానవనంలో ఒక రహస్యపు ఆయుధాగారం బయటపడింది. ఈ ఉద్యానవనం యొక్క ఆవరణపుగోడలన్నీ మధ్య ఖాళీలతో రెండు వరుసలుగా కట్టి, పైన సామాన్యమైన కోటగోడలలాగ కనబడుతూ లోపల బోలుగా కట్టినవే. వాటిలోపలి ఖాళీలలోనూ, నేలసొరంగాలలోనూ ఆరు యేడు వందల ఫిరంగులూ, ఫిరంగిబళ్ళూ, ఫిరంగిగుళ్ళూ, తూటాలూ, తుపాకులూ, మందుగుండుసామానూ, ఫిరంగులు పోత పోయడానికి కావలసిన కొలుములూ భద్రపరచి వున్నాయి. ఇందులో చాలా ఫిరంగులు క్రొత్తగా తయారుచేసినవి. కొలుములుకూడా అప్పటికి కొద్ది కాలం క్రిందటనే వుపయోగించినట్లు కనబడ్డాయి.

## కర్నూలు నవాబు పదచ్యుతి

అఫ్ఘనిస్థానం యుద్ధంలో ఇంగ్లీషువాళ్లు ఓడిపోతారని అనుకుని దేశంలోఉన్న మహమ్మదీయులందరూ ఏకమై తిరుగుబాటు చేయడానికి కుట్ర చేసినట్లూ, దానికి కర్నూలు ఒక కేంద్రస్థానమైనట్లూ తేలింది. "మన కళ్ళ యెదుటనే ఇలాంటి గొప్పకుట్ర సాగుతూ వుండడమూ, దానికి కావలసిన సొమ్ము చేకూరడమూ ఎంత ఆశ్చర్యము!" అని దీనిని గురించి ఇంగ్లాండుకు వ్రాసిన ఆయన అన్నాడు.

కర్నూలునవాబు గులాం రసూలుఖానును పద భ్రష్టుణ్ణి చేసి తిరుచినాపల్లికి రాజఖైదీగా పంపారు. అక్కడ అతడు క్రైస్తవమతంలో ఆసక్తిచూపుతూ క్రైస్తవదేవాలయానికి వెళ్ళగా ఒక తురకఫకీరు ఆయనను 1840వ సంవత్సరం జూలై 12వ తేదీన కత్తితో పొడిచి చంపాడు.

(South Indian Sketches. A short account of some missionary stations of Church Mission Society. By S. Tucker; James Nisbet & Co; 1842 pp. 17-23)



# 12. మంగలి కొండోజీ

క. *"వెంగలిముచ్చు గులాములు*
*సంగతిగాఁ గులము వెలువఁ జనుదెంచి రయా*
*యింగిత మెరిగిన ఘనుఁడ వీ*
*మంగలికొండోజి మేలు మంత్రులకన్నన్."*

అని కంసాలి రుద్రయ యని ప్రసిద్ధిజెందిన కందుకూరి రుద్రకవి చెప్పిన చాటువద్య మొకటి చిరకాలంనుంచి ప్రచారంలో ఉన్నది.

ఈ రుద్రకవి విద్యానగర సామ్రాజ్యాన్ని పరిపాలించిన శ్రీకృష్ణదేవరాయల కాలంనాటి వాడన్నీ, ఇతడు రాయలవారి దర్శనంకోసం చాలాకాలం వేచియుండి మంత్రులనూ, రాజోద్యోగులనూ ఎన్నాళ్ళు ఆశ్రయించినా వారు దర్శన మిప్పించలేదనిన్నీ, ఇలావుండగా రాయలవారికి క్షౌరంచేసే మంగలి కొండోజీ ఈ కవి ఇలాగ మంత్రుల యిళ్ళ దగ్గరా, ఉద్యోగుల యిళ్ళదగ్గరా పడికావులుకాస్తు పడివుండడం చూసి దయతలచి ఈ సంగతి రాయలవారితో మనవి చేశాడనిన్నీ, అంతట రాయలవారు కవికి దర్శన మిచ్చారనిన్నీ, అప్పుడు రుద్రకవి యీపద్యం చెప్పాడనిన్నీ ప్రతీతి.

రాజగురువైన తాతాచార్యులవారు రుద్రకవిని ఊరు, పేరు, కుల గోత్రాలు అడిగితే కవి చమత్కారంగా పద్యంలోనే జవాబు చెప్పాడట. తరువాత రాజసభలో అనేక దుస్సమస్య లియ్యగా అవన్నీ చక్కగా పూరించాడట. అంతట రాయలవారాయనను తగినవిధంగా సత్కరించి తమ ఆస్థానంలో అష్టదిగ్గజాలనే కవులలో ఒక్కనిగా చేశారట. రుద్రకవి రాజగురువైన తాతాచార్యులవారితోనూ, అష్టదిగ్గజాలలో* చేరిన అల్లసాని పెద్దన, ముక్కు తిమ్మన, పుత్తేటి రామభద్రయ్య, పింగళిసూరన, కవిరాట్టు, తెనాలి రామలింగకవి, భట్టుమూర్తి మొదలయిన కవులతోనూ వాగ్వాదాలు చేసేవాడినిన్నీ ప్రతీతి.

ఈ రుద్రకవికి 1550–1580 మధ్య గోలకొండ నేలుతూ కవులను ఆదరించి 'మల్కిభరాం' అని పేరుపొందిన మలిక్ ఇబ్రహీం కుతుబ్‌షా పాదుషాగారు రెంటచింతల (చింతల పాలెం) అనే గ్రామాన్ని యిచ్చి సత్కరించారు. ఆ గ్రామాన్ని రుద్రకవి వంశీకులు అనుభవిస్తున్నారు.

రుద్రకవి రచించిన నిరంకుశోపాఖ్యానం అనే ప్రబంధంలో

*"వేరి కన్నడభూమి వెలివట్టు సామ్రాజ్య*
*నృపతిపై నొక్కింత కృప తలిర్చు"*

అను సీసపద్య పాదమొకటి విద్యానగర వినాశనమును సూచిస్తూ ఉన్నందువల్ల 1565లో జరిగిన తాళికోటయుద్ధమనే 'రాక్షసతగ్గి' యుద్ధములో అళియరామరాయలు దివంగతుడై విద్యానగరాన్ని మహమ్మదీయులు కొల్లగొని నాశనంచేసిన తరువాతనే ఈ ప్రబంధము రచింపబడియున్నట్లు కనబడుతూ ఉన్నది. ఈ రెండు కారణాలవల్లనూ రుద్రకవి కృష్ణదేవరాయల కాలములో ఉన్నాడో లేడో అనే సంశయం కలిగి కృష్ణదేవరాయల కాలంలో ఒక రుద్రకవి ఉన్నట్లయితే అతడే నిరంకుశోపాఖ్యాన గ్రంథకర్త తాతయై ఉండవలె ననిన్నీ, లేదా ఇతడప్పటికి బాలుడుగానైనా ఉండవలెననిన్నీ బ్రహ్మశ్రీ వేటూరు ప్రభాకర శాస్త్రులవారు తమ చాటుపద్యమణిమంజరి రెండవ భాగంలో వ్రాసియున్నారు.

---

* కృష్ణదేవరాయలవారు తమ ఆస్థానంలోని అష్టదిగ్గజములనే కవులకు తిప్పలూరును అగ్రహారంగా యిచ్చినట్లు 2వ నెం. స్థానిక చరిత్ర 357–వ పుట (క్రీ.శ.1528)లో నుదహరింపబడియున్నదని డాక్టరు నేలటూరి వెంకట రమణయ్యగారు తమ విజయనగర 3వ రాజవంశ చరిత్రలో వ్రాసినారు. చూడు పుట. 421.

మంగలి కొండోజీని గురించి రుద్రకవి చెప్పిన చాటు పద్యమువల్ల కూడా ఈ కవి కృష్ణదేవరాయల తరువాతి కాలంనాటి వాడేనని స్పష్టంగా ఋజువు అవుతున్నది.

మంగలి కొండోజీ కథలో యెంత సత్యమున్నదో తెలియదుగాని కొండోజీమాత్రం కల్పిత పురుషుడు కాడు. కొండోజీయనే మంగలి యొకడు 1542 మొదలు 1569 వరకూ రాజ్యం చేసిన సదాశివరాయలవారికాలంలో విశేషమైన రాజసన్మానం పొందినట్లు శాసనాలవల్ల కనబడుతున్నది.

కృష్ణదేవరాయలవారు 1509 మొదలు 1529 వరకూ రాజ్యంచేసి స్వర్గస్థులుకాగా ఆయన తరువాత 1542 వరకూ అచ్యుత దేవరాయలవారున్నూ, 1569 వరకూ సదాశివ రాయలవారున్నూ, విద్యానగర సామ్రాజ్యాన్ని పరిపాలించారు. సదాశివ రాయలవారి కాలములో పేరునకే ఆయన చక్రవర్తిగాని సాక్షాత్తుగా పరిపాలించే ప్రభువు కృష్ణ దేవరాయలవారి అల్లుడైన అరవీటి రామరాజుగారే. ఆయనే అళియ రామరాయలని చరిత్రలో ప్రసిద్ధి చెందియున్నారు.

ఈ రామరాయలవారు మహమ్మదీయులతో చాలా యుద్ధాలు చేసి జయించిన మహావీరుడు. సంగీతసాహిత్యాలను, చిత్రకళలను పోషించిన రసజ్ఞుడు. ఆయన చాలామంది సంస్కృతాంధ్ర విద్వాంసులను, కవులను ఆదరించి బహు గ్రంథ రచనను చేయించి భోజుడని ప్రఖ్యాతి జెందినట్లు సదాశివరాయలవారి శాసనాలలోనే వుదాహరింపబడి ఉన్నది. తరువాత వసుచరిత్రను రామరాయలవారి తమ్ముడైన తిరుమల రాయల కంకిత మిచ్చిన భట్టుమూర్తి రామరాయల వారి అస్థానకవిగా నుండి సన్మానింపబడి 'రామరాజభూషణు' డనే బిరుదును పొందినాడు.

రామరాయలవారి కాలంలో రాజగురువు పేరు తాతాచార్యులే. ఆయన పంచమత భంజన మనే గ్రంథాన్ని వ్రాసి 'పంచమతభంజనం' తాతాచార్యులవారనే బిరుదును వహించాడు. కృష్ణదేవరాయలవారి కాలంనాటి కవులు, గాయకులు, విద్వాంసులు, సామంతులు, సరదారులు అనేకులు రామరాయలవారి కాలంనాటికి కూడా బ్రతికివుండి, రాజసభలో ఉన్నట్లు తెలుస్తున్నది.

రామరాయలచేతులలో ఓడిపోయిన మహమ్మదీయ రాజులందరూ ఏకమై 1565లో విద్యానగరంమీదికి దండెత్తి రాగా తాలికోట యనే 'రాక్షసతగ్డి' యుద్ధం జరిగింది. అందులో రామరాయలవారు స్వర్గస్థులైనారు. అంతట ఆయన తమ్ముడైన తిరుమల రాయలవారు ధనకనకవస్తు వాహనాలను తీసుకుని సదాశివరాయలవారితో విద్యానగరం వదిలిపెట్టి పెనుగొండను రాజధానిగా చేసుకొని రాజ్యపరిపాలన మారంభించారు. విద్యానగరాన్ని మహమ్మదీయులు నాశనం చేశారు. 1569లో సదాశివరాయలవారు చనిపోగా అరవీటి తిరుమల రాయలవారే చక్రవర్తియై 1572 వరకూ పరిపాలించారు. వారి తరువాత ఆయన కొమాళ్ళలో శ్రీరంగరాయలవారు 1585 వరకున్నూ, వేంకటపతి దేవరాయ మహారాయలవారు 1614 వరకున్నూ, చంద్రగిరి రాజధానిగా చేసుకుని విద్యానగర

సామ్రాజ్యాన్ని పరిపాలించారు. వేంకటపతి దేవరాయలవారి తరువాత కుటుంబంలోనే కొన్ని తగాదాలు వచ్చినవి. తరువాత ముప్పయి నలభై సంవత్సరాలలో ఈ రాజ్యభాగం మహమ్మదీయులకు వశమై అరవీటి రాజవంశ పరిపాలన అంతరించింది.

భట్టుమూర్తి రామరాజభూషణుడనే బిరుదును పొందిన తరువాత రచించిన 'వసుచరిత్ర' మనే ఆంధ్ర ప్రబంధాన్ని రామరాయల తరువాత రాజ్యంచేసిన తిరుమల రాయలవారికి అంకితం యిచ్చాడు. 'నరసభూపాలీయ' మనే అలంకార గ్రంథాన్ని రాయలవారి మేనల్లుడైన పోచిరాజు నరసరాజుగారికి కృతియిచ్చాడు.

తెనాలి రామలింగకవి కృష్ణదేవరాయల ఆస్థానంలో వుండి కవిత్వం చెప్పినట్లుగాని, గ్రంథాలు రచించినట్లుగాని నిదర్శనాలు కనబడడంలేదు. రాయలవారిని గురించి, తాతాచార్యులవారిని గురించి, సమకాలీకులైన కవులను గురించీ అతడు చెప్పినట్లు ప్రచారంలో ఉన్న చాటుపద్యాలు కృష్ణ దేవరాయల తరువాత రాజ్యంచేసిన రాయలవార్లకు కూడా అన్వయిస్తున్నవి. కృష్ణదేవరాయలకాలం తరువాతనే అతడు గొప్ప గ్రంథాలను రచించి రాజసమ్మానం పొందినట్లున్నూ, వేంకటపతి దేవరాయ మహారాయల కాలంవరకూ జీవించి యున్నట్లున్నూ, రాయలవారి మెప్పుకోసం వైష్ణవుడై తన పేరుకూడా రామకృష్ణకవి యనిమార్చుకున్నట్లున్నూ కనబడుతున్నది.

కృష్ణదేవరాయలవారి తరువాత రాజ్యంచేసిన రాయల వార్లందరూ గూడా సంగీత సాహిత్యాలను, లలిత కళలను పోషించి విద్యావ్యాసంగము చేస్తూ రసజ్ఞులై సంస్కృతాంధ్ర కవులను ఆదరించి ఆంధ్రభోజు లనిపించుకున్నవారే. ఈ రాయలవార్ల రాజగురువుల పేర్లు కూడా తాతాచార్యులవార్లే. అనంతాచార్యుడు వ్రాసిన ప్రసన్నామృతంలో ఈ గురువుల వంశావళి కనబడుతున్నది. ఈ తాతాచార్యులవార్లకు అయ్యావయ్యంగా రనీ, ఎట్టూరు తాతాచార్యులుగారనీ, పంచమతభంజనంతాతాచార్య లనిన్నీ, కోటికన్యాదానం తాతాచార్యులనిన్నీ, కుమార తాతాచార్యులనీ, లక్ష్మీకుమార తాతాచార్యులనీ ఉపనామాలు కనబడుతున్నవి.

రాయలవార్లందరూ తెలుగువల్లభులై తెలుగుభాష నభిమానించినందువల్ల వారి మంత్రులు, సామంతులు, సరదారులూ కూడా తెలుగుకవుల నాదరిస్తూ తాముకూడా తెలుగులో కవిత్వంచెపుతూ భాషాసేవచేసేవారు. విజయనగర సామ్రాజ్యంలో చేరిన సామంతరాజులైన తంజావూరు ఆంధ్రనాయక రాజుల ఆస్థానంలో గొప్ప తెలుగుకవులు, గాయకులు అనేకులుండేవారు. ఆ రాజులు, వారి ఆశ్రితులైన పురుషులు, స్త్రీలుకూడా కవిత్వం చెప్పేవారు. దానిని గురించి వ్రాయాలంటే ఒక గ్రంథము నిండుతుంది.

కృష్ణదేవరాయల ఆస్థానంలో అష్టదిగ్గజాలలో ఒకడని చెప్పబడే పింగళి సూరన చిన్ననంస్థానమైన గండికోటకు పరిపాలకుడైన నంద్యాల కృష్ణరాజునకు తన కళాపూర్ణోదయాన్ని అంకిత మిచ్చాడు. ఈ కృష్ణరాజు తరువాత రాజైన తిమ్మయ 1544లో వేయించిన శిలాశాసనంవల్ల అతడు తెలుగుకవుల నాదరించినట్లు కనబడుతున్నది.

విద్యానగర చక్రవర్తులందరూ మహావీరులేయైనా, అందరూ ఆంధ్రభోజు లనిపించుకున్నా, అందరూ ప్రజానురంజకంగానే పరిపాలించినా, వారందరిలోనూ

ఆంధ్రుల అమరాగానికి ఎక్కువగా పాత్రులైనవారు శ్రీకృష్ణదేవరాయల వారే. ఆయన స్వర్గస్థులై ఇప్పటికి కొన్ని వందల సంవత్సరాలైనా వాఙ్మయంలోనూ, తెలుగువారి నోళ్ళలోనూ యశః కాయంతో చిరంజీవియై యున్నాడు. రాయలవారనగానే కృష్ణ దేవరాయలవారే అందరికీ జ్ఞాపకం వస్తారు. ఏ రాయలవారికాలంలో జరిగిన గొప్ప సంగతి చెప్పవలసి వచ్చినా, అది కృష్ణదేవరాయల కాలంలోనే జరిగిందని చెప్పడం పరిపాటి అయిపోయింది. అందుకు తగినట్లు కృష్ణదేవరాయల తరువాత రాజ్యంచేసిన రాయలవార్లకూ, ఆయనకూ చాలా సాదృశ్యాలుండడంకూడా తటస్థించింది. అందువల్లనే తరువాతి కవులను కూడా కృష్ణరాయలవారి అష్టదిగ్గజాలలో చేర్చి అనేక కథలు చెప్పుకుంటున్నారు. మన రుద్రకవి కథకూడా ఇలాంటిదే.

## 'మంగలి కొండోజీ' పొందిన రాజ సన్మానం

రుద్రకవి పేర్కొన్న మంగలి కొండోజీ 1542 మొదలు 1565 వరకూ సదాశివరాయలవారి కాలంలో విద్యానగరాన్ని పరిపాలించిన అళియరామరాయలవారి సన్నిహిత భృత్యుడు. ఇతడు తనకు బహు పసందుగా ముఖక్షౌరం చేస్తాడని రామరాయల వారు సదాశివరాయలవారికి చెప్పగా సదాశివరాయల వారుకూడా కొండోజీని ఆదరించి అతనిమీద అనుగ్రహం కలిగి అతణ్ణి బహూకరించారు. ఈ కొండోజీపేరు "బాడవిపట్టణ కాపురస్థులైన మంగలి తిమ్మోజు కొండోజు* గారు" అనిన్నీ, 'కొండోజా' అనిన్నీ సదాశివరాయలవారి దాన శాసనాలలో కనబడుతున్నది. 1545 నాటికే రామరాయల వారికి కొండోజీపైన అనుగ్రహం కలిగి మంగళ్ళు మామూలుగా చెల్లించవలసిన వృత్తిపన్నును, సుంకములును, ఇతర పన్నులున్నూ అతడిచ్చుకోనక్కర లేకుండా ఒక తాకీదు జారీచేశారు. రాజ్యపరిపాలకుడిచర్యను చూసి మైసూరు రాజప్రతినిధి రాజ్యంలో చేరిన శివమొగ్గజిల్లాలో సదాశివ రాయలవారి యుద్యోగి (ఏజెంటు) ఈ కొండోజాకు చన్నగిరి మంగలి పన్నును ఇనాముగా నిచ్చాడు.

కొండోజీ రామరాయలవారికి సేవచేస్తూవుండి రాయలవారిని ఆశ్రయించి నందువల్ల మంగలికులస్థులెవ్వరూ పన్ను లిచ్చుకో నక్కరలేకుండా సదాశివరాయలవారు 1554 లో శాసించారు. ఆ మరుసటి సంవత్సరం వెట్టిచాకిరీ, బిరద, నిర్ణీతపు శిస్తులున్నూ, ఇతర పన్నులున్నూ కూడా విజయనగర సామ్రాజ్యపు సరిహద్దులోపల తానుగాని, తన కుటుంబమువారుగాని చెల్లించనక్కరలేకుండా కొండోజీ ఒక ఫర్మానా పొందాడు.

సదాశివరాయలవారి ఆజ్ఞ ప్రకారం రామరాయలవారు ఈ అదృష్టశాలికి యింకొక దానశాసనంకూడా వ్రాయించి యిచ్చారు. కాని అందులోని సంగతులు సరిగ్గా తెలియడం లేదు. ఆ కాలంలోనే గూడూరులోఉన్న సదాశివరాయలవారి యుద్యోగి ఈ కొండోజీకి ఆచంద్రతారార్కంగా అనుభవించగలందులకు ఒక దానశాసనం వ్రాయించి యిచ్చి దానికి అటంకం కలిగించేవారికి బ్రహ్మహత్యాపాతకం కలుగుతుందని అందులో వ్రాయించాడు.

---

* 'ఓజు' అనేది ఒజ్జ శబ్దానికి రూపాంతరము. దీనిని సాధారణంగా కంసాలులూ, మంగళ్ళూ ఉపయోగిస్తారు. ఉత్తర హిందూస్థానంలో ఓఝా అనే రూపం వున్నది. 'అన్నింటికీ ఉపాధ్యాయుడనే అర్థం' అని శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు నాకు చెప్పారు.

హిరేకెరూరులో ఒక కవిల వల్ల రామరాయలవారు 'తిమ్మోజా, హొమ్మోజా, బారోజా"లనే ముగ్గురు మంగళ్ళ పైన పన్నులు తీసివేసినట్లు కనబడుతూ ఉన్నది. బాదామిలో నున్న ఒక శాసనంవల్ల 'తిమ్మోజా, కొండోజా, భద్ర'లనే ముగ్గురు మంగళ్ళకు పన్నులు తీసివేసినట్లున్నూ కనబడుతున్నది.

సదాశివరాయలవారికిన్నీ, రామరాయలవారికిన్నీ కొండోజా యందున్నూ పైని చెప్పిన ముగ్గురు మంగళ్ల యందున్నూ కలిగిన అనుగ్రహంవల్ల మంగలికులం వారి కందరికీ చాలా ఉపకారాలు జరిగినవి. రామరాయలవారికి కొండోజా యందు కలిగిన అభిమానంవల్ల తుముకూరుజిల్లాలో నున్న మంగలి కులస్థులందరికీ కూడా పన్నులు లేకుండా తీసివేసినట్లు 1545 లోని ఒక శాసనంవల్ల తెలుస్తూవుంది. తరువాత విజయ నగరరాజ్యం సరిహద్దులోపలగల మంగళ్ళందరూ కూడా పన్ను లిచ్చుకోనక్కరలేదని వుత్తర్వువేశారు. పైన చెప్పిన కారణంవల్లనే సదాశివరాయలవారు ఉలబి గ్రామంలోని మంగళ్లకు వృత్తిపన్నును ఇనాముగా వదలివేసినట్లు చెప్పబడినది.

దరిమిలాను సామ్రాజ్యంలోనున్న మంగళ్ళందరికీ కూడా అనేక సౌకర్యాలు కలిగించారు. మంగళ్లు ఇచ్చుకోవలసిన పన్నులు, నిర్ణీతపు శిస్తులు, వారుచెయ్యవలసిన వెట్టి చాకిరీ, బిరద, సుంకములు, కావలిపన్నులు యావత్తు సదాశివరాయలవారున్నూ, రామరాయులవారున్నూ తీసివేసినట్లు కూడా చిట్టాలదుర్గము జిల్లాలో 1546లోని ఒక శాసనం వల్ల కనబడుతున్నది.

సదాశివరాయల వారు స్వయంగా ఊటుకూరులోని మంగళ్ళపైని పన్నులు తీసివేశారు. రామరాయలవారున్నూ కర్ణాటకరాజ్యంలోని కొన్ని మండలాలలోనూ, కడపజిల్లా లోని కొన్ని సీమలలోనూ, మంగళ్ళపైని పన్నులు తొలగించారు.

రాయబారిని చూసి వారి మంత్రులూ, సామంతులూ కూడా అనేక గ్రామాలలో మంగళ్ళపైని గల పన్నులను తీసివేశారు.

(The Aravidu Dynasty - Heras pp. 48-49).



# 13. "నూజివీటి వ్యవహారం"

1771లో నూజివీటి జమీందారుడైన నరసింహ అప్పారావుగారు చాలా ఖర్చుమనిషి, చెన్నపట్నం ఇంగ్లీషు కంపెనీ ప్రభుత్వానికి చెల్లించవలసిన కప్పం (పేష్కసు) సరిగా చెల్లించలేకపోయేవాడు. అందువల్ల చిక్కులలో పడ్డాడు.

జమీందారీని వశపర్చుకోవడానికి కుంపెనీసర్కారు వారు 1773లో ఒక సైనిక దళం పంపారు. అప్పుడు ఆయన అత్యధికమైన వడ్డీరేటుతో బందరులోనున్న కుంపెనీదొరల దగ్గరనే కొంతసొమ్ము బదులుచేసి బకాయి చెల్లించాడు.

1775లో బందరులో కంపెనీవారి పరిపాలక సంఘానికి అధ్యక్షుడుగా నుండిన వైటుహిల్లుకు, హాడ్జెసుకు, ఇంకా బందరులో కంపెనీ ఉద్యోగం చేస్తూవున్న మరికొందరు దొరలకు నరసింహ అప్పారావుగారు బాకీవున్నాడని వాళ్ళు 1775లో తగాదా ప్రారంభించారు. మూడు సంవత్సరాలు గడచినవిగాని వ్యవహారం తెగలేదు. అంతట అప్పారావుగారు చెన్నపట్నానికి ప్రయాణం కట్టారు.

అప్పుడు చెన్నపట్నంలో సర్ థామస్ రంబోల్డు అనే అయన గవర్నరు. అయన కార్యాలోచనసంఘంలో వైటుహిల్లుగారు వృద్ధసచివుడు (సీనియరు సభ్యుడు). అప్పారావు గారి మాట ఎవరూ వినిపించుకోలేదు. అయన నూజివీడుకు తిరిగివచ్చాడు. కంపెనీవారి న్యాయంలో విశ్వాసం గోల్పోయి తిరుగుబాటు చేసే సూచనలు కనబరిచాడు.

కంపెనీ అధికారులు మేజర్ కాసా మేజరును నూజివీడు పంపి జమీందారును బందరుకు రప్పించి ఖైదుచేశారు. అయనను నిర్బంధంలో వుంచిన కారాగారాధికార హాడ్జెసు. పైన చెప్పిన దొరలందరికీ అప్పారావుగా రివ్వవలసినట్లు చెప్పే బాకీ మొత్తానికి అప్పారావుగారిచేత హాడ్జెసు ఒక పత్రం వ్రాయించుకున్నాడు.

ఈ వైట్‌హిల్లు సంగతి చెప్పాలంటే చాలాగాథ వుంది. ఈ వైటుహిల్లూ, ఇతనికి ముందుపని చేసిన ఫ్లాయిర్ (Floyer), క్రాఫర్డుదొరలు స్వలాభాపేక్షతో చాలా అక్రమాలు జరిగించి ప్రజలను పీడించారనిన్నీ చెన్నపట్నంలో కొన్నాళ్లు గవర్నరుగా పనిచేసిన రంబోల్డుగారు వీరికి మద్దతుచేశారనిన్నీ, వీరందరూ కలిసి కంపెనీవారి సొమ్ము హరించారనిన్నీ 1775లో కోరింగ దగ్గర ఇంజరంలో కంపెనీవారి ఏజంటుగా వుండిన శాడ్లియర్‌గారు ఫిర్యాదు చేశాడు. కొన్నాళ్ళ దాకా ఏమీ జరగలేదు. ఈ లోపుగా వైటుహిల్లు, రంబోల్డు దొరల లంచగొండితనము, దుష్ప్రవర్తనము మితిమీరినందువల్ల గవర్నరు జనరలు వీరిని 1781లో పనిలోనుండి సస్పెండు చేశాడు.

అప్పుడు చెన్నపట్టణంలో పరిపాలక సంఘానికి శాడ్లియరు తాత్కాలికంగా ముఖ్యాధికారి అయినాడు. అప్పారావుగారు తనకు జరిగిన అన్యాయాన్ని గురించి యిచ్చుకున్న అర్జీని శాడ్లియరు పార్లమెంటుకు పంపించాడు. అప్పుడు కంపెనీ డైరెక్టర్ల కోర్టు వారు దీనిని గురించి జాగ్రత్తగా విచారణ జరిగించవలసినదని వుత్తర్వుచేశారు.

చెన్నపట్టణానికి మెకార్ట్నీ ప్రభువు గవర్నరైనాడు. ఇతడు సద్ధర్ముడు. నూజివీడు జమీందారుడి విషయములో హాడ్జెసు జరిపిన వ్యవహారం విషయంలో అయనకు చాలా అనుమానం కలిగింది. కాని ఈ లోపుగా తన అర్జీలు కంపెనీవారు చిత్తగించి న్యాయం చేస్తారనే ఆశపోయి నరసింహ అప్పారావుగారికి మనసు విరిగిపోయింది. అందువల్ల 1783లో కొంతసైన్యం సమకూర్చుకొని కోటలో కూర్చొని తిరుగుబాటు చేశాడు. అంతట కంపెనీవారు అయనపైకి సైన్యాన్ని పంపారు. అయన నిజాము సరిహద్దుదాటి పారిపోయి సైన్యాలు కూర్చుకుని నూజివీడుమీదికి దండయాత్రలు చేయడం ప్రారంభించాడు.

అయనను పట్టుకోవడానికి కంపెనీవారు నిజాం ప్రభుత్వముతో ఉత్తరప్రత్యుత్తరాలు జరుపుతూ వుండగా అప్పారావు గారు తన తిరుగుబాటును క్షమిస్తే బకాయి చెల్లిస్తానని కంపెనీ అధికారితో రాజీచేసుకొని మొదటికిస్తీ చెల్లించగా జమీందారీని అయన వశం

చేశారు. రెండవకిస్తీ చెల్లించలేకపోయి మళ్ళీ తిరుగుబాటుచేసి మారువేషంతో పారిపోయాడు. కంపెనీవారు కోటబురుజులను భూమిమట్టం చేశారు. ఈ నరసింహ అప్పారావుగారికి జమీందారీహక్కు తీసివేశామనిన్నీ, ఆయన కుమారుడు వెంకటనరసింహ అప్పారావుగారిని జమీందారుగా స్థిరపరచామనిన్నీ కంపెనీవారు 1784లో ప్రకటించారు.

నరసింహ అప్పారావుగారు భద్రాచలం అడవులలో తిష్టవేసుకొని సైన్యంతో వచ్చిపడి గ్రామాలు కొల్లబెడుతూ, ఇళ్ళు తగలపెడుతూ, ఖజానా దోచుకుంటూ అడ్డువచ్చిన వారిని నరికి దౌర్జన్యాలు చేయడం ప్రారంభించాడు. కంపెనీ అధికారులు ఈ పోరు పడలేక చివరికి విసిగివేశారి ఏమీచేయలేక నరసింహ అప్పారావుగారు కుమారుని దగ్గర నూజివీడులోనే ఉండడానికి రాజీగా అంగీకరించారు. కుమారుడు సమర్థుడు కానందువల్ల తండ్రి పలుకుబడి హెచ్చుగా ఉండేది. ఆఖరికి నరసింహ అప్పారావుగారిని బందరుకు రప్పించి అక్కడ ఖైదు చేశారు. ఆయనతో వచ్చిన పరివారము నూజివీడుకు పోయి చిన్న జమీందారుగారికి లొంగక, దౌర్జన్యాలు చేస్తూ చిన్ని రాజుగారి కుమారుడికి మద్దతుచేయడం ప్రారంభించారు.

బందరులో కొన్నాళ్ళు అధికారిగా ఉండిన ఫ్లాయరు లంచము తీసుకొన్న విషయాన్ని గురించి విచారణచేస్తూ చెన్నపట్నం కార్యాలోచన సంఘమువారు వృద్ధ జమీందారుగారిని సాక్ష్యము యివ్వడానికి 1789లో చెన్నపట్నానికి పిలిపించారు. ఆయన అక్కడ కొద్దిరోజులలోనే మరణించాడు.

అప్పారావుగారి బాకీవ్యవహారం యింకొక మాటు తలయెత్తి వూరుకుంది.

తూర్పు ఇండియా కంపెనీవారి డైరెక్టర్ల సభలో ముఖ్యుడున్నూ, పార్లమెంటువారు హిందూదేశ వ్యవహారాలను తనిఖీ చేయడానికి ఏర్పరచిన బోర్డులో సభ్యుడున్నూ అయిన రైట్ ఆనరబుల్ జాన్ సల్లివన్ అనే ఆయనకున్నూ, కొంతకాలం మచిలీబందరులో కంపెనీ అధికారిగా వుండి తరువాత కొద్దిరోజులు చెన్నపట్నం గవర్నరుగాకూడా పనిచేసిన వైట్ హిల్ అనే ఆయనకున్నూ, ఇంకా మచిలీబందరులో పనిచేసిన మరికొందరు దొరలకున్నూ, తనకున్నూ కలిసి అప్పటి నూజివీటి జమీందారుడైన నరసింహ అప్పారావుగారు కొన్ని లక్షల రూపాయలు బాకీ వున్నారనిన్నీ, ఆ బాకీని తాను రాబట్టుకోవడానికి ట్రాన్సుఫరు పొందివున్నట్లున్నూ, తనకు స్వయంగా కూడా ఒక పత్రంపైన ఆ జమీందారు బాకీ వున్నట్లున్నూ బనాయిస్తూ హాడ్జెస్ తగాదాచేశాడు.

అప్పారావుగారు తనకు పత్రం వ్రాసినట్లు చెప్పే తేదీన అప్పారావుగారు నిర్బంధంలో ఉన్నందువల్లను, కారాగారాధికారి హాడ్జెస్ గారే గనుకను, ఈ హాడ్జెస్ తనను బలవంతంచేసి ఒక పత్రం వ్రాయించుకొన్నాడని యింకొక జమీందారు గారు 1785 లో ఫిర్యాదుచేసిన సందర్భమున్నూ చూస్తే ఈ హాడ్జెస్ ఎంతటివాడో, ఈ బాకీ ఎంతవరకూ నమ్మతగినదో తెలుస్తుంది.

ఈ హాడ్జెస్ 1794లో చనిపోయాడు. 1801 సంవత్సరం దాకా అతని భార్య అతనికి రావలసిన అప్పుమాట తలపెట్టనే లేదు. అప్పుడు ఆ బాకీ తనకు యిప్పించ వలసినదని కంపెనీ డైరెక్టర్ల కోర్టువారికి అర్జీయిచ్చుకుంది. ఈ అర్జీని కంపెనీ డైరెక్టర్లు నమ్మక త్రోసివేశారు.

కంపెనీవారు భూస్వామిత్వపు హక్కులను నిర్ణయించి శాశ్వతమైనలా (పర్మనెంటు సెటిల్మెంటు) చేసే సందర్భంలో నూజివీడు జమీందారినీ గురించి నరసింహ అప్పారావుగారి పెద్దభార్యా కుమారునికీ, చిన్నభార్యా కుమారులకూ గల తగాదాలు పరిష్కరించడం కోసం వెంకట నరసింహారావుగారికి నిడదవోలు పరగణాలు, రామచంద్ర అప్పారావుగారికి వుయ్యూరు పరగణాలు యిచ్చి పేష్కషు బకాయి వదులుకొని సన్నదులిచ్చి జమీందారీని 1803లో వారికి వశపరిచారు. పై సందర్భములో హాడ్జెసుగారి బాకీని చెల్లించవలసినట్లు కంపెనీ అధికార్లు నిర్ణయించలేదు. వారికి చెప్పనూ లేదు.

ఇలాగ నూజివీడు జమీందార్లకు క్రొత్త పట్టా యిచ్చిన తరువాత మళ్ళీ ముప్పై సంవత్సరాలు జరిగిపోయినవి. అప్పుడు అందరికీ ఆశ్చర్యం కలిగేటట్లుగా హాడ్జెసుగారి ఋణశేషం తగాదా మళ్ళీ త్రాచుపాములాగ తలయెత్తింది. సంగతి యేమిటా అని ఆలోచిస్తే అప్పట్లో సీమలో పలుకుబడిగల దొరలు కొందరు యేకమై ఈ బాకీని రాబట్టి పంచుకొని అక్రమలాభం పొందాలనే దురుద్దేశ్యంతో దీనిని బయటికి తీసినట్లు తేలింది.

ఈ బాకీ అనేది సర్వాబద్ధమనిన్నీ, చెల్లదనిన్నీ, ఇవ్వనక్కరలేదనిన్నీ కంపెనీవారు గట్టిగా వాదించారు గాని, బాకీని రాబట్టడానికి నడుముగట్టిన దొరలు చాలా బలవంతులైనందువల్ల ఈ వ్యవహారం ఇంగ్లాండు పార్లమెంటులోకి యెక్కింది. ఇది ప్రభువుల సభలో చర్చకు వచ్చింది.

సంగతి సందర్భాలు చూసేవారికి ఈ బాకీ అనేది అబద్ధమనిన్నీ, అక్రమమైనదనిన్నీ తోచినా బలవంతులైన తెల్లదొరల పలుకుబడివల్లను మొహమాటం వల్లను ఈ బాకీ యిచ్చుకోవలసినదే నని ప్రభువుల సభవారు 1832లో తీర్మానించారు*.

* Manual of the Kishna District pp. 110-112; 298-301; the History of the British Empire in India-Edward Thornton (1842) Vol. 11 pp. 243-246.

# 1. కోహినూరు వజ్రము నెమలి సింహాసనము

బాబరు చక్రవర్తి మొదలు ఔరంగజేబు చక్రవర్తి వరకూ క్రీ.శ. 1526 నుంచి 1707 దాకా భారతదేశాన్ని ఏకచ్ఛత్రంగా ఏలిన మొగలాయి రాజవంశమువా రందరూ గొప్పవీరులు; వీరెంత గొప్పవీరులో అంత గొప్పరసజ్ఞులు; కళాప్రియులు; సౌందర్యోపాసకులు. వారి కాలంలో వ్యవసాయ పరిశ్రమలు అభివృద్ధిచెంది దేశం సుభిక్షంగా ఉండడమేగాక సంగీత సాహిత్యాలు, శిల్పము, లలితకళలు రాజాదరణము పొందినందున అవి ప్రజలవృత్తులలోనికి, జీవితవిధానములోనికి కూడా వ్యాపించి దేశాభివృద్ధికి తోడ్పడినవి.

మొగలాయి చక్రవర్తులందరికీ నవరత్నఖచితములైన బంగారు నగలన్నా, అపూర్వమైన వస్తువాహనములన్నా, అమూల్యాంబరాలన్నా చాలా ప్రీతి. అందువల్ల వారు మేలైన జాతిరత్నాలను ఎక్కడెక్కడనుంచో తెప్పించేవారు. ఎన్నెన్ని దేశాలనుంచో బంగారుపనివాళ్లను, సాలీలను, శిల్పులను పిలిపించి పనిచేయించేవారు. వీరిని చూచి వీరి దర్బారులో నున్న ఉమ్రావులనే గొప్ప ప్రభువులు, పెద్ద ఉద్యోగులుకూడా అలాంటి వస్తుజాలమును కొని ఆ పరిశ్రమలను, వృత్తికళలను పోషించేవారు. అందువల్లనే ఆ కాలంనాటి భారతదేశం భాగ్యభోగ్యాలతో తులతూగుతూ, ప్రపంచంలో నలుమూలల నుంచీ వర్తకులను ఆకర్షించింది. ప్రాచ్యపాశ్చాత్య దేశీయుల కన్ను కుట్టినది. మొగలాయి సామ్రాజ్యవైభవము పెరిగి పెరిగి చివరకు విరగడానికి కారణమైంది.

## "కోహినూరు"

'కోహినూరు' అనగా 'తేజఃపర్వత'మని అర్థము. ఒక మహాపర్వతమంత కాంతిని ప్రసరింపచేయగల దివ్యరత్నమిది. ఈ వజ్రముయొక్క వింతచరిత్ర భారతదేశములోని వివిధ సామ్రాజ్యముల ఉదయాస్తమయముల చరిత్రకు తార్కాణంగా నున్నది.

కోహినూరు వజ్రం మన తెలుగుదేశంలో గుంటూరు సీమలో సత్తెనపల్లి తాలూకాలో కొల్లూరు అనే గ్రామంలో ఒక వజ్రపుగనిలో దొరికింది. దీనిని గురించి ఎన్నోకథలు ప్రచారంలో నున్నవి. అబ్దుల్ అజీజ్‌గారు "Journal of Indian History" అనే చారిత్రక విషయిక పత్రికలో వ్రాసిన వ్యాసము కలకత్తాలో మోడరన్ రివ్యూలో ప్రకటించబడింది. దానిని శ్రీముఖ సం॥ భాద్రపదమాసం భారతిలో అనువదించి యున్నారు (చూడు 10వ సంపుటము 1933 పుట 474).

పూర్వము భారతదేశము నేకచ్ఛత్రముగా నేలిన మాళవరాజ వశమున క్రీ.శ. 1300 ఆ ప్రాంతములో ఈ కోహినూరు వజ్రం ఉన్నట్లు చరిత్ర దృష్టాంతాలు కనబడినవి.

ఈ రాజవంశమువారొక వెయ్యి సంవత్సరముల కాలము మహమ్మదీయులను ప్రతిఘటించి వింధ్య పర్వతానికిని, నర్మదానదికిని గల మధ్యభాగాన్ని ఏలినారు. తుదకు అల్లాయుద్దీను 1305లో ఈ రాజ్యాన్ని జయించి అక్కడి ధనరాసుల నన్నింటిని వశం చేసుకున్నాడు. అప్పుడే కోహినూరు వజ్రంకూడా ఢిల్లీసుల్తాను వశమైంది. 1517 మొదలు 1526 వరకూ ఢిల్లీసుల్తానుగానున్న ఇబ్రహీంలోడీని పానిపట్టు దగ్గర జరిగిన యుద్ధంలో ఓడించి బాబరు మొగలాయి సామ్రాజ్యపరిపాలన స్థాపించినప్పుడు కోహినూరు వజ్రం అయన వశమైంది. దానిని బాబరు చక్రవర్తి తన ప్రియపుత్రుడైన హుమాయూను కిచ్చాడు. హుమాయూనునకు జబ్బుచేసి ప్రాణముమీదికి వచ్చినప్పుడు తమ కత్యంత ప్రియమైన అమూల్య వస్తువులేవైనా దానము చేసినయెడల ఆ రోగపీడ పరిహారమవుతుందని అస్థానంలోని వారు చెప్పి ఈ వజ్రాన్ని దానం చెయ్యవలసిందని సలహా యిచ్చినట్లున్నూ, బాబరు దాని కంగీకరించక తన ప్రాణమునే ఈశ్వరార్పణము చేస్తూ ప్రార్థించినట్లున్నూ 'అక్బరునామా' అను గ్రంథంలో నుదహరింపబడి యున్నది. కాబట్టి 1530 నాటికే కోహినూరు వజ్రం బాబరు చక్రవర్తి వశంలో నున్నట్లు కనబడుతున్నది.

బాబరు చక్రవర్తి 1530లో మరణించగా హుమాయూను చక్రవర్తి యైనాడు. కాని అతనికి త్వరలోనే చాలా చిక్కులు కలిగినవి. భారతదేశ సింహాసనమును నిలుపుకోవడం కష్టమైంది. అయన సోదరుడు కొంత రాజ్యమును కాజేసినాడు. ఘూర్జరదేశ రాజులతో యుద్ధం తటస్థించినది. ఇంతలో బీహారురాజ్య పరిపాలకుడైన షేర్‌షా చక్రవర్తి అధికారాన్ని ధిక్కరించినందువల్ల అతనితో యుద్ధం చెయ్యవలసివచ్చింది. హుమాయూను 1539-1540 నవంబరులో రెండుమార్లు షేర్‌షాతో యుద్ధంచేసి ఓడిపోయాడు. ఆ సందర్భంలో హుమాయూను కొన్నాళ్ళు రాజపుత్రస్థానంలో కాలక్షేపం చేశాడు. హుమాయూను మార్వారు రాజగు రాజా మాల్దేవు రాజ్యపరిసరములలో నుండగా మాల్దేవు మహారాజు కోహినూరు వజ్రాన్ని ఎలాగైనా సంపాదించదలచి తన యనుచరులలో నొకడికి వర్తకవేషం వేసి ఆ వజ్రాన్ని అమ్మవలసినదని అడిగించాడట; కాని హుమాయూను దానిని అమ్మడానికి అంగీకరించలేదు. ఈ సంగతి అబుల్ ఫజల్ వ్రాసిన చరిత్రలోనున్నది.

తరువాత హుమాయూను 1544 లో పారశీక దేశానికి పోయి అక్కడి రాజైన 'షా తహమస్పు' నాశ్రయించి అతని ఆతిథ్యమును, సహాయమును పొంది మళ్ళీ భారతదేశ సింహాసనమును సంపాదించుకోగలిగాడు. అప్పట్లో ఆ రాజు తనకుచేసిన సహాయానికి కృతజ్ఞుడై హుమాయూను తనవద్దనున్న 250 వజ్రములతోపాటు కోహినూరు వజ్రాన్నికూడా అతనికి 1554లో కానుకగా సమర్పించాడు. ఈ కోహినూరు వజ్రముయొక్క తూనిక అప్పుడు 6 1/4 మిస్కా లుండేదట. అప్పట్లో దక్షిణ హిందూదేశాన్ని పరిపాలిస్తూయున్న అహమ్మదు నగరం నవాబు అయిన నిజాంషాగారు పారశీక రాజుగారికి స్నేహితుడైనందువల్ల షాతహమస్పు ఈ అమూల్యవజ్రంయొక్క ప్రాశస్త్యాన్ని గుర్తించలేక దానిని తన స్నేహితుడైన నిజాంషాగారికి 1547లో కానుకగా పంపించాడని ఫెరిష్టా అనే చరిత్రకారుడు వ్రాశాడు. ఇలాగ ఈ కోహినూరు మళ్ళీ మనదేశం చేరింది.

కాలం గడిచింది. హుమాయూను చక్రవర్తి 1556లో చనిపోగా అతని తరువాత ఆయన పుత్రపౌత్ర ప్రపౌత్రులైన అక్బరు, జహంగీరు, షాజహాను, ఔరంగజేబు చక్రవర్తులు ఒకరి తరువాత ఒకరు భారతదేశాన్ని అఖండ వైభవముతో ఏకచ్ఛత్రంగా పరిపాలించారు. షాజహాను వార్ధక్యంలోనే ఔరంగజేబు చక్రవర్తియై 1707 వరకూ పరిపాలించాడు. షాజహాను కాలంలో యువరాజైన ఔరంగజేబు దక్షిణ హిందూదేశాన్ని జయించిన సందర్భంలో మొదట అహమ్మదు నగరం, గోలకొండ నవాబుల మంత్రిగానుండి స్వతంత్ర ప్రభువైన మిర్‌జుమ్లా అనే పారశీక దేశీయుడొకడు అతనికి స్నేహితుడైనాడు. ఈ మిర్‌జుమ్లా ఆహ్వానం మీదనే మొగలాయి చక్రవర్తి దక్షిణదిగ్విజయయాత్రను తలపెట్టి కృతకృత్యుడైనాడు. మిర్‌జుమ్లా ఔరంగజేబు చక్రవర్తికి నమ్మినబంటై, సేనాధిపతియై, రాజ ప్రతినిధియై చరిత్ర ప్రసిద్ధుడైనాడు. అహమ్మదునగరం నవాబుగారి దగ్గరనున్న కోహినూరు వజ్రం మన మిర్‌జుమ్లా స్వాధీనంలోకి వచ్చింది. దాని నత డిప్పుడు తన యేలికయైన ఔరంగజేబు చక్రవర్తికి నజరుగా సమర్పించాడు.

క్రీ.శ. 1636 – 1662 మధ్య ఆరుసార్లు తూర్పు దేశాలలో సంచారము చేసిన టెవర్నియర్ అనే ఫ్రెంచి వర్తకుడు భారతదేశానికికూడా వచ్చి ఆ కాలమునాటి స్థితి గతులను గురించి, భారతదేశములో రవ్వలు దొరికే ప్రదేశములను గురించి, గొప్ప వజ్రములను గురించి తన గ్రంథములో వర్ణించాడు. సానపట్టని స్థితిలో 900 రతులు లేక 787 క్యారట్లు తూనికగల ఒక గొప్పవజ్రము కొల్లూరులో దొరికినదనిన్నీ, దానిని మిర్‌జుమ్లా షాజహాను చక్రవర్తికి 1656–57 మధ్య సమర్పించినాడనిన్నీ టెవర్నియరు వ్రాసినాడు. ఈ మహావజ్రమునకు చరిత్రకారులు గ్రేట్ మొగల్ అని పేరు పెట్టినారు. ఇదే కోహినూరు అని కొందరి యూహ. ఇలాగ ఒక వంద సంవత్సరాలు దాటిన తరువాత ఈ దివ్యరత్నము మళ్ళీ హుమాయూను వంశీకుడైన మొగలు చక్రవర్తి వశమైంది.

## నాదిర్షా దండయాత్ర

1707లో ఔరంగజేబు చక్రవర్తి చనిపోయేనాటికి మొగలాయీ సామ్రాజ్యము మహోన్నత స్థితిలో ఉన్నది. యావద్భారతదేశము మొగలాయి సామ్రాజ్యంలో చేరి యున్నది. చక్రవర్తి ఖజానాలోనున్న ధన కనక వస్తు వాహనాల విలువ ఇంతింత అని చెప్పడానికి వీలులేదు. కోహినూరుతోపాటు ఇంకా అనేక అమూల్యరత్నాలున్నవి. షాజహాను చేయించిన అమూల్యమైన నెమలి సింహాసనంతోపాటు ఇంకా తొమ్మిది విలువైన సింహాసనాలున్నవి.

ఔరంగజేబు చక్రవర్తి తదనంతరం ఢిల్లీ సింహాసనాన్ని అధిష్ఠించిన చక్రవర్తులు సుఖలోలురై తమ తాతముత్తాతలు చేర్చి పెట్టిన ధనాన్ని విచ్చలవిడిగా ఖర్చుపెట్టడం ప్రారంభించారు. ఎంత సొమ్ము ఖర్చుపెట్టినా ఆ ధనసంచయములు తరగడంలేదు. చక్రవర్తులు బలహీనులైనందువల్ల సామ్రాజ్యం కూడా బలహీనమై పోయింది. ఈ భాగ్య భోగ్యాలను చేజిక్కించుకోవాలని విదేశీయులకు, చుట్టుపట్ల నున్న రాజులకు దురాశ కలిగింది. 1736లో పారశీక దేశానికి రాజైన నాదిర్షా ఏదో ఒక నెపంమీద 1739లో భారతదేశంమీదికి దండెత్తి వచ్చాడు. అప్పుడు జరిగిన యుద్ధంలో సామ్రాజ్య సైన్యాలు చెల్లాచెదరైనవి. అతడు సరాసరి ఢిల్లీకోటలో చొరబడి అక్కడనున్న ధన కనక వస్తు

వాహనాల నన్నింటినీ తనవశం చేసుకున్నాడు. తొమ్మిదిగంటలు అతని సైనికులు ఢిల్లీ నగరంమీద పడి దోచుకున్నారు. అతడు ఢిల్లీలో 58 రోజులు మకాముచేసి ప్రజలందరిని నిర్బంధించి అమితమైన సొమ్మును లాగుకొన్నాడు. ఢిల్లీ చక్రవర్తిని నిర్బంధించి కొంత రాజ్యభాగమును లాక్కున్నాడు.

నాదిర్షా దోచుకొనిపోయిన ధనకనకవస్తు వాహనాల విలువ ఇంతింతయని చెప్పడానికి వీలులేదు. దీనిని గురించి అనేకులు అనేకవిధాలుగా అంచనాలు వేసినారు. ఇది 70 కోట్ల నవరసులు ఉంటుందని ఫ్రేజర్ అనే అతడు వ్రాశాడు. ఇందులో కేవలము నగలే 25 కోట్ల విలువగలవి. నవరత్నాలతో నిర్మించిన బంగారు నెమలి సింహాసనము, ఇంకా తొమ్మిది సింహాసనాలు, వెండి బంగారులతోను నవరత్నాలతోను అలంకరించిన ఆయుధాలు, ఇతర వస్తువులు కలిపి తొమ్మిదికోట్ల ఖరీదు గలవట. నాదిర్షా 60 లక్షల వెండి నాణెములు, అనేక వేల బంగారునాణెములు. కోటివిలువగల బంగారు సామానులు, 50 కోట్ల విలువగల నగలు పట్టుకుని పోయినట్లు అతని కొలువులో వజీరుగా చేరిన ఒక భారతీయుడి క్రింది యుద్యోగియైన ఆనందరాము వ్రాసినాడు. నాదిర్షా ఒక కోటి తొంభైలక్షల నవరసుల ఖరీదుగల నాణెములను పట్టుకునిపోయినట్లు నాదిర్షాయొక్క చరిత్రకారుడి లెక్క. అతడు తర్లించుకొని పోయిన రొక్కము, వస్తువులు కలిసి 11 కోట్ల 90 లక్షల నవరసులు ఖరీదు ఉంటుందని స్కాట్లాండు దేశపు గ్రంథకర్త యొకడు వ్రాసినాడు. మొగలు చక్రవర్తులు మూడువందల సంవత్సరాలనుంచి కూడబెట్టిన సంపదనంతా అతడు పట్టుకొనిపోయినాడు.

కోహినూరు వజ్రం నాదిర్షా చేతులలోనుంచి మళ్ళీ ప్రయాణం సాగించింది. క్రీ.శ. 1813 నాటికది లాహోరు నగరంలో సిక్కులరాజైన రంజితసింగు మహారాజు దగ్గరికి చేరింది. అప్పటి భారతదేశంలో చాలాభాగం ఇంగ్లీషువర్తక సంఘంవారి వశమైంది. స్వతంత్రరాజు అనతగినవాడు రంజితసింహ మహారాజొక్కడే. కాశ్మీర ఖండమున్నూ, లాహోరునగరమున్నూ ఆయన రాజ్యభాగాలు. అతడు చాలా సమర్థుడు; బలవంతుడు అందువల్ల ఇంగ్లీషువారతనిని కదల్చలేకపోయారు.

రంజితసింగు మహారాజు 1839లో చనిపోయాడు. అతని తరువాత రాజ్యానికి వచ్చినవారంత సమర్థులు కారు. సిక్కుల రాజ్యాన్ని కాజెయ్యడానికి ఇంగ్లీషువర్తక కంపెనీ వారు సామదాన భేద దండోపాయాలు ప్రయోగించారు. గవర్నరు జనరలైన డల్‌హౌసీ రాజ్యతంత్రము ఫలించింది. సిక్కుల మహారాజు 1848లో ఇంగ్లీషువారికి లోబడి తన దగ్గరనున్న కోహినూరు వజ్రాన్ని ఇంగ్లీషు రాణియైన విక్టోరియాకు సమర్పించడానికి అంగీకరించి దానిని గవర్నరు జనరలు వశం చేశాడు. పంజాబులో ప్రతి యంగుళమున్నూ బ్రిటిషు పరగణాగా ప్రకటించబడింది. ఇలాగ మొగలు సామ్రాజ్య దివ్యరత్నాన్ని ఇంగ్లీషు రాజమకుటానికి సమర్పించగలిగినందుకు తాను గర్వపడుతున్నానని డల్‌హౌసీ ప్రభువు 1849 సం॥ మార్చి 30వ తేదీన ఒక ఉత్తరంలో వ్రాశాడు (బ్రిటిషు ఇండియా చరిత్ర- దిగవల్లి శివరావు, పుట 211).

ఈ కోహినూరు వజ్రం కొయ్యక పూర్వం 900 క్యారట్లు తూకం ఉండేదనిన్నీ, తెలివి తక్కువగా కోసినందువల్ల దాని తూనిక చాలా తగ్గిపోయిందనిన్నీ చరిత్రకారులు వ్రాశారు. అది ఇంగ్లీషు వర్తక కంపెనీవారి చేతికి వచ్చేటప్పటికి $186^1/_{16}$ క్యారట్లు మాత్రం ఉన్నది. దానిని లండనులో కోసి సానపట్టించడంలో జరిగిన పొరపాటువల్ల అది 106 $^1$16 క్యారట్లకు తగ్గిపోయింది.

## అక్బరు చక్రవర్తి

క్రీ.శ. 1605వ సంవత్సరములో అక్బరు చక్రవర్తి చనిపోయేనాటికి ఆయన ఖజానాలో నాలుగుకోట్ల బంగారు కాసులు నిల్వయున్నవట. క్రిందటి ఐరోపా సంగ్రామానికి పూర్వపు ధరల ప్రకారం వాటివిలువ 20 కోట్ల బంగారు నవరసులుంటుందని ఒక ఇంగ్లీషు చరిత్రకారుడన్నాడు. ఇప్పటి ధరలప్రకారం (ఈ గ్రంథం రాసిన కాలం నాటికి) చూస్తే వాటివిలువ ఒక వెయ్యికోట్ల రూపాయి లుంటుంది. ఈ రొక్కముగాక అక్బరు చక్రవర్తి ఎంతో ముచ్చటపడి సేకరించిన అమూల్యాభరణాలు లెక్కలేనన్నివి యున్నవట. అందులో ముఖ్యంగా చెప్పవలసినవి గొప్ప ఉరువైన మంచి జాతికెంపుల హారాలు రెండు. ఇవి ఒక్కొక్కటి పదిలక్షల రూపాయిలు విలువగలవి. దీనిని బట్టి తక్కిన నగల విలువ ఎంత యుంటుందో ఊహించుకొనవచ్చును. 1608 మధ్య జహాంగీరు చక్రవర్తి దర్బారులో నుండిన విలియం హాకిన్సు అనే ఇంగ్లీషు దొర జహాంగీరు చక్రవర్తి జవాహిరీ అని పేర్కొన్న అమూల్యములైన ఆభరణాలలోని గొప్ప వజ్రాలున్నూ, తరువాత నెమలి సింహాసనాన్ని చేయించడములో షాజహాను చక్రవర్తి యుపయోగించిన అమూల్య రత్నాలలో కొన్ని రత్నాలున్నూ కూడ అక్బరు చక్రవర్తి సేకరించి యుంచినవే.

## జహాంగీరు, షాజహానుల ఆభరణాలు

జహాంగీరు చక్రవర్తి జవాహిరీలో ఏ నగలలోనూ పొదగకుండా యున్న విడివజ్రాలు ఒకటిన్నర మణుగులున్నూ, కెంపులు రెండుమణుగులున్నూ, పచ్చలు అయిదు మణుగులున్నూ, జేడ్ (Jade) అనే అమూల్య చిత్రశిలలు రకరకాలవి ఒకమణుగున్ను యున్నవట. ఇవిగాక ఇంకా బంగారులో రత్నాలుతాపిన ఖడ్గాలపిడులు, కృపాణికములు (Poniards), మృదంగములు, ఉరోమణి వక్షోభూషణములు (Brooches) కలికితురాయిలు (Aigrettes), జీనులు, బల్లెములు (Lances), సింహాసనములు (Chairs of state), కూజాలు, పానపాత్రలు (Flagons and wine cups), తాయత్తులు, ఉంగరములు మొదలైన వస్తువులెన్నో యున్నవి (Foster-Early travels pp.102-103).

ఆభరణాలంటే షాజహాను చక్రవర్తికి వెఱ్ఱిప్రేమ. ఆయన స్వంతనగల ఖరీదే ఐదుకోట్ల రూపాయిలుండేది. రాజకుమారులకిచ్చిన వాటి ఖరీదు రెండుకోట్లు, షాజహాను చక్రవర్తి అనుదినమూ ధరించే నగల ఖరీదు రెండుకోట్ల రూపాయిలుండేది. ఈ నగలు ఎల్లప్పుడూ లోపలి గదులలో అంతఃపుర పరిచారికల వశంలోనే చక్రవర్తిగారు ధరించ గలందులకు సిద్ధంగా నుండేవి. తక్కిన మూడుకోట్ల విలువగల నగలూ కావలసినప్పుడు ధరించడానికి వీలుగా అవతలి గదులలో బానిసలవశంలో ఉంటూయుండేవి. షాజహాను

చక్రవర్తి ధరించే తలపాగాకు చుట్టుకునే బంగారు సరిగపట్టకు గుచ్చే 'సర్పేసు' (Sarpech) అనే కెంపుల కలికితురాయి పన్నెండు లక్షల రూపాయల వెలగలది (Studies in Moghul India - J.N.Sarkar pp. 17-18).

## నెమలి సింహాసనం

షాజహాను 1628లో సింహాసనం అధిష్ఠించగానే ఆయన కొక ఊహ కలిగింది. ఆయన కాలంలో మొగలుచక్రవర్తి ఖజానాలో లెక్కలేనంత ధనము, అమూల్య వజ్రాలు మూలుగుతూ యుండేవి. ఆ వజ్రాలలో ప్రతిదీకూడా దేవతాస్త్రీల ఆభరణాలలో నుండతగిన దేవజాతి రత్నాలే. అనేక గనులలో నుంచి, సముద్రములలోనుంచి సేకరించబడిన ఇలాంటి దివ్యరత్నాలు కేవలమూ చక్రవర్తి అంతఃపురంలోనే యుండేదాని కంటె సామ్రాజ్యంలోని నానా మూలలనుంచి వచ్చేవారందరికి కనపడేటట్లుగా ప్రదర్శించేయెడల తన దర్బారుకు శోభ కలుగుతుందని షాజహాను చక్రవర్తికి తోచింది. అంతట తాను ధరించే జవాహిరీగాక తన రాజనగరులోనూ, సామ్రాజ్యంలో వివిధ భాగముల రాజధానులలోనూ ఉన్న వజ్రాలను, కెంపులను, పచ్చలను, ముత్యాలను తన సమక్షంలోకి తెప్పించాడు. అందులో యాభైవేల 'మిశ్కల్' (ఒక్కొక్క మిశ్కల్ 13/7 డ్రాముల యొత్తుసరి గలది) తూనికయున్నూ, 86 లక్షల రూపాయిల విలువయున్నూ గల గొప్ప రత్నాలనన్నింటినీ ఏరి 14 లక్షల రూపాయల వెలగల ఒక లక్ష తులముల మేలిమి బంగారము కడ్డీరేకులతో నొక సింహాసనమును చేసి అందులో ఈ రత్నాలనన్నింటినీ పొదగవలసినదని బంగారు పనివాళ్ళపైన అధికారియైన బెబదల్ ఖానుగారిని చక్రవర్తిగారు ఆజ్ఞాపించారు.

ఈ బంగారు సింహాసనము 5 గజముల ఎత్తు, $3^{1}/4$ గజముల పొడుగు, $2^{1}/2$ గజముల వెడల్పు ఉండేటట్లు నిర్ణయించారు. అది ఎలా యుండవలసినదీ పురమాయించారు. ఈ సింహాసనము యొక్క పైకప్పు లోపలిభాగాన్ని మొలాము చెయ్యమన్నారు. పైకి కనబడే అన్ని వైపులనూ వజ్రాలు మొదలైన నవరత్నాలు తాపటము చెయ్యమన్నారు. ఈ సింహాసనపు పైకప్పుకి ఊతగా పన్నెండు స్తంభాలను పచ్చలతో నిర్మించమన్నారు. ఈకప్పు మీద కన్నులు మిరిమిట్లు గొలిపే నవరత్నాలను పొదిగిన రెండు బంగారు నెమళ్ళ బొమ్మలను పెట్టమన్నారు. ఈ రెండు నెమళ్ళ మధ్యను వజ్రాలు, కెంపులు, పచ్చలు, ముత్యాలు తాపిన ఒక బంగారు చెట్టును నిలబెట్టమనిన్నీ యుత్తర్వుచేశారు. ఈ సింహాసనాన్ని ఎక్కగలందుకు మూడు బంగారుమెట్లు నిర్మించి అందులోకూడా రత్నాలు తాపడము చెయ్యమన్నారు. ఆ కాలంలోనున్న కంసాలులలోను, శిల్పులలోను నేర్పరులైన పనివాళ్ళు ఏడు సంవత్సరాలు కష్టపడి పనిచేసి 1535 నాటికి షాజహాను చక్రవర్తిగారు పురమాయించిన అపూర్వ సింహాసనాన్ని తయారుచేశారు. ఇది నిర్మించినందుకు మజూరీ క్రింద ఒక కోటిరూపాయిలు ఖర్చు అయింది.

చక్రవర్తిగారి సింహాసనంలో కూర్చున్నప్పుడు అనుకోగలందులకు దాని లోపల ప్రక్కలందు పదకొండు బంగారు ఆనుడు పీటలను నిర్మించారు. ఈ బంగారు పీటలకు కూడా నవరత్నాలు తాపడము చేశారు. ఆ పీట చెక్కలలో మధ్యనున్న దానికి చక్రవర్తి

దివ్యశరీరము అనుకుని యుంటుంది గనుక ఆ బంగారము అనుడు పీట ఒక్కదానికే పదిలక్షల రూపాయలు ఖర్చుపెట్టారు. అందులో తాపడము చేసిన దివ్యరత్నాలలో పారశీకరాజు షా అబ్బాస్ గారు యశఃకాయులైన జహంగీరు చక్రవర్తికి సమర్పించిన ఒక మహామణి యున్నది. దక్షిణ దేశాన్ని జయించినందుకు బహుమతిగా జహంగీరు చక్రవర్తి ఆ మణిని తన కుమారుడైన షాజహానుకు బహుమతిగా నిచ్చినాడు. ఈ సంగతులు బాదుషానామాలో వ్రాయబడియున్నవి (A guide to the Delhi Fort Government of India pp. 46-50).

## ఔరంగజేబు చక్రవర్తి

డాబుదర్పములంటే ఎంతమాత్రమూ గిట్టని ఔరంగజేబు చక్రవర్తి ఈ అపూర్వమైన నెమలి సింహాసనాన్ని అధిష్ఠించియున్న దృశ్యాన్ని బెర్నియర్ అనే చరిత్రకారుడు 1663లో స్వయంగా చూచి ఇలాగ వర్ణించాడు. "...ఒక గొప్ప సభాంతరాళములో చివరి భాగమున నున్న దివ్యసింహాసనముమీద చక్రవర్తి ఆసీనుడైయున్నాడు. అతడు అమూల్యాంబరాలను ధరించియున్నాడు. అతి సన్నముగాను, అందముగాను ఉండి, పట్టుజరీ, బుటేదారీ పనితనము, పువ్వులు గల తెల్లని నాజూకు చీనాంశుకము (stain) అంగీని ధరించి యున్నాడు. ఆయన తలపాగ ప్రశస్తమైన బంగారు జలతారుతో నేసినది. అడుగున బంగారు కుదురులో ఉరువైన అమూల్య రత్నములున్నూ, ఒక గొప్ప పుష్యరాగమున్నూ పొదిగియున్న కలికితురాయి ఆ తలపాగకు చుట్టిన జరీపట్టకు తగిలించియున్నది. అది ధగధగలాడుతూ సూర్య కాంతిలాంటి కాంతిని వెదజల్లుతూ యున్నది. చక్రవర్తి మెడలోనుంచి బొడ్డుదాకా వ్రేలాడే ఒకమంచి పెద్ద ముత్యాల హారమున్నది. ఆయన కూర్చున్న సింహాసనానికి అరు గట్టి బంగారు కోళ్లున్నవి. వాటికి నవరత్నాలు తాపటము చేసియున్నవి" (Moghul Rule in India Edwards and arrett pp. 338-340).

## మొగల్ చిత్రపటములు

పూర్వకాలంనాటి మొగలాయిచిత్తరువులలో మన భారతదేశాన్ని ఏలిన మొగలాయి చక్రవర్తుల దివ్యమంగళ విగ్రహములు కనబడుతున్నవి. అందులో చక్రవర్తులు తెల్లని అమూల్యాంబరాలను ధరించి వెలలేని భూషణములను దాల్చి యుండి తమ కుడిచేతి మునివ్రేళ్ళతో ఒక సుగంధ పుష్పాన్ని అఘ్రూణిస్తూ యున్నట్లు చిత్రింపబడి యుంటుంది. చక్రవర్తి ధరించిన జరీ తలపాగలో గ్రుచ్చియున్న నవరత్నఖచితమైన కలికితురాయికూడా కన్నులకు నజరుగా కనబడుతూ యుంటుండి. చక్రవర్తి ముఖబింబముచుట్టూ చంద్రబింబము చుట్టూ గుడికట్టియున్న పరివేషమురీతిగా ఒకవిధమైన కాంతి మండలము కనబడుతూ యుంటుంది. బహుశా చక్రవర్తి ధరించిన మణులలోనుంచి వెలువడిన దివ్యకాంతినో, లేదా సార్వభౌముల చక్రవర్తిత్వమునో చిత్రకారులు సూచించినట్లు కనబడుతుంది.

**అమూల్య చిత్రశిలానిర్మితమైన వస్తువులు**

జహంగీరు, షాజహాను చక్రవర్తులకు జేడ్ (Jade) అనే అమూల్య చిత్ర శిలా నిర్మితములైన పాత్రలన్నా, వస్తువులన్నా చాలా ప్రీతి. ఇలాంటి సామానులను రకరకాలవాటిని వారు సేకరించి యుంచేవారు.

ఔరంగజేబు చక్రవర్తి తన దర్బారులో నెమలి సింహాసనము మీద కూర్చుండి యున్నప్పుడు నవరత్న ఖచితమైన ఒక బంగారుపళ్ళెరములో ఒక మహాస్ఫటికముతో చేసిన అందమైన పాత్ర నొకదానిని తెప్పించి వాడుతూ యుండేవాడు.

ఇంగ్లీషువారు 1857లో బహదూరుషా చక్రవర్తిని ఖైదుచేసి ఢిల్లీకోటను పట్టుకున్నప్పుడు అక్కడ కనబడిన అమూల్య వస్తుజాలములో చిత్రవిచిత్రములైన సామానులు కనబడినవి. అందులో అపూర్వ శిలానిర్మితములైన పాత్రలు పూర్వకాలంనాటి వెన్నో ఉన్నవి.



# 2. వజ్రాల పిట్టు

'పిట్టు' వజ్రము అనిన్నీ, 'రీజెంటు' వజ్ర మనిన్నీ ప్రసిద్ధిచెందిన అపూర్వమైన వజ్రము ప్రస్తుతం కృష్ణాజిల్లాలో బెజవాడ నుంచి 12 మైళ్ళలో నందిగామకు వెళ్ళే రోడ్డుమీద నున్న పరిటాల అనే గ్రామంలో మొగలాయి చక్రవర్తిగారికి చెందిన వజ్రపుగనిలో పనిచేస్తూయుండిన ఒక బానిసవాడికి 1701 ఆ ప్రాంతములో దొరికింది. ఈ గనులు అప్పట్లో మొగలు చక్రవర్తియొక్క దక్షిణదేశ రాజ ప్రతినిధియైన హైదరాబాదు సుబేదారుడి పరిపాలన క్రిందనున్న కొండపల్లి సర్కారులో చేరినవి. కొండపల్లి సర్కారును తరువాత నిజాముగారు ఇంగ్లీషువారి కిచ్చినప్పుడుకూడా ఈ గనులను, గొల్లపల్లి దగ్గర నున్న గనులను తమ క్రిందనే ఉంచుకొన్నారు. ఈ వజ్రం దొరికిన బానిసవాడు దానిని సంగ్రహించి కావలావారి కన్నుగప్పి బైటికి తీసుకువెళ్ళడానికి మార్గం లేక, తనపిక్కలో పెద్దగాయం చేసుకొని కట్టుకట్టి అందులో ఆ వజ్రాన్ని దాచి బయటకు తీసుకొని వెళ్ళాడని ప్రతీతి.

1698 మొదలు 1709 వరకు చెన్నపట్నము కోట క్రింద నున్న ఇంగ్లీషు వర్తక స్థానాలకు గవర్నరుగా నుండిన తామస్ పిట్టుగారు ఈ వజ్రాన్ని ఎలాగో సంపాదించాడు. ఈ వ్యవహారం అతిరహస్యంగా జరిగినందువల్ల అనేకులు అనేకవిధాలుగా చెప్పుకున్నారు. ఈ పిట్టుగారు ఇది దొంగసొమ్ము అని ఎరిగివుండి ఎలాగో మోసముచేసి అక్రమంగా సంపాదించాడని కొందరు అభిప్రాయపడ్డారు. దీనికి తగ్గట్టుగా కొన్ని అనుమానాస్పదాలైన కారణాలు కూడా కనపడినవి. ఈ విధంగా ఇతని చరిత్ర ప్రసిద్ధికెక్కింది. పిట్టుగారు ఈ వజ్రాన్ని ఇంగ్లాండుకు పంపించి కోయించి అమ్మజూపగా ఫ్రెంచిదేశాన్ని పరిపాలించే

రీజెంటు అనే అర్లియన్సు రాజకుమారుడు దీనిని 125000 నవరసులకు కొన్నాడు. అందువల్ల ఈ వజ్రానికి 'పిట్టు' వజ్రమునిన్నీ, 'రీజెంటు' వజ్రమనిన్నీ పేర్లువచ్చినవి.

ఈ వజ్రం కోసిన తరువాత $136^3/_4$ క్యారట్టులున్నది. ఇంగ్లీషురాణి కిరీటంలో నున్న కోహినూరు వజ్రంకూడా చాలా అపూర్వమైన వజ్రమే. అదికూడా మన ఆంధ్రదేశములో గుంటూరుజిల్లాలో కొల్లూరుదగ్గర దొరికింది. అదికూడా చాలాగొప్పదే అయినా కోసినతరువాత $106^1/_{16}$ క్యారట్టులు మాత్రమే యున్నది. అందువల్ల దానికంటె పిట్టు వజ్రమే ఎక్కువ విలువైనది.

## దళారీవర్తకుడు

ఈ థామసుపిట్టు ఇంగ్లాండులో డార్సెటుషైరులో బ్లాండ్‌ఫర్డు అనేచోట ఒక చిన్న క్రైస్తవ మతాధికారిగా ఉండిన పిట్టుగారి కుమారుడు. ఇతడు 1653లో జన్మించాడు. ఇతడు చిన్నప్పటినుంచీ చాలా చొరవగలవాడు. వేట అంటే ప్రీతి. సైన్యంలో చేరి కెప్టెన్ హోదానుకూడా పొందాడు.

ఆ కాలములో చాలామంది పాశ్చాత్యులు దేశాంతరాలకు పోయి ధనార్జనచేస్తూ ఉండేవారు. ముఖ్యంగా సకల సంపదలతోను తులతూగుతూ ఉన్న హిందూదేశానికి వచ్చి ఏదోవిధంగా భాగ్యవంతులవుతూ ఉండేవారు. పోర్చుగీసువారు, హాలండువారు, ఫ్రెంచివారు మొదలయిన ఐరోపా దేశాలవారు కొంతమంది హిందూదేశంతో వ్యాపారం చెయ్యడానికి వర్తక సంఘాలుగా ఏర్పడి, ఇతరులు వచ్చి తమతో వ్యాపారంలో పోటీ చేయకుండా తమతమ రాజులవల్ల సర్వ మక్తాకవుళ్ళలాంటి పట్టాలనుపొంది మొగలాయి చక్రవర్తిని ఆశ్రయించి వర్తకం చేసుకోడానికి ఫర్మానాలు పొంది అమిత భాగ్యవంతులు కావడం చూచి ఇంగ్లీషు వర్తకులు కూడా ఒక తూర్పు ఇండియా సంఘాన్ని స్థాపించి ఇంగ్లాండులో నుంచి ఇతరు లెవ్వరూ హిందూ దేశానికివచ్చి తమతో పోటీ వ్యాపారం చెయ్యకుండా తమ కొక్కరికే ఆ హక్కు ఉండేటట్లు సీమరాణియైన ఎలిజబెత్తువల్ల 1600 సంవత్సరంలో పట్టాపొందినారు. మొగలాయి చక్రవర్తిని, ఆయన క్రింది అధికారులను ఆశ్రయించి వర్తకస్థానాలు స్థాపించుకోవడానికి ఫర్మానాలు సంపాదించి వ్యాపారం చేసుకోవడం ప్రారంభించారు.

ఈ రోజులలో వీళ్ళు మన రాజులపట్ల చాలా భయభక్తులతో ఉండేవారు. హిందూ దేశీయులను చాలా గౌరవంగా చూసేవారు. వీరు వ్యాపారంలో అమితలాభాలు సంపాదించి క్రమక్రమంగా రాజ్యాక్రమణ చేశారు. ఆసందర్భంలో తమ యిజారా భూములలోకి సామాన్యవర్తకు లెవ్వరూ రాకుండా నిషేధాలు కల్పించి సీమనుంచి అలాంటి వర్తకులెవరైనా వస్తే వాళ్ళను పట్టుకొని కొట్టి హింసించి అనేక విధాలుగా బాధించేవారు. వారిమీద ఏవో నేరాలు కల్పించి ఒకొక్కప్పుడు వారిని ఉరితీసేవారు. అయినా ఈ కంపెనీ అధికారుల కన్నులుగప్పి కొందరు ఇంగ్లీషువారు హిందూ దేశములోకివచ్చి రహస్య వ్యాపారం చేస్తూ ఉండేవారు. వీరిని 'ఇంటర్లోపర్లు' లేక దళారీలనేవారు. అలాంటి దళారీలలో మన థామస్‌పిట్టు ఒకడై తన ఇరవైఒకటో యేట 1674 లో ఓఢ్రదేశ సముద్ర తీరంలో ఉండే బాలసోరు (బాలేశ్వరం) చేరి వ్యాపారం ప్రారంభించాడు. ఇతని జాడలుతీసి కంపెనీ

ఉద్యోగులు ఇతడిని పట్టుకొని చెన్నపట్నం సెంట్ జార్జికోట కౌన్సిలు (పరిపాలక సంఘం) ఎదుటపెట్టారు కౌన్సిలువారు ఇలాంటిపని మళ్ళీ యెప్పుడూ చెయ్యవద్దని అతనిని కఠినంగా మందలించి వదలిపెట్టారు. అంతటితో అతడు భయపడి పారశీక దేశానికి పోయాడు. పోవడం మంచిపని అయింది. ఇతనిసంగతి సీమలో కంపెనీ అధికారులకు కూడా తెలిసి "ఈ పిట్టు ప్రాణాలకు తెగించిన దుండగీడనిన్నీ, తనకు చేతనైన దుర్మార్గము చేయడానికి వెనకదీసేవాడు కాడనిన్నీ" వ్రాసి ఇతనిని పట్టుకోవలసినదని వారు హిందూదేశానికి తాకీదు పంపారు.

ఇంతపని జరిగినా పిట్టు ఏమాత్రమూ జంకక హిందూ దేశానికి మళ్ళీవచ్చి హుంగ్లీలో ఒక ఫ్యాక్టరీ అనే వర్తకశాలను కూడా కట్టించి వ్యాపారం చెయ్యడం ప్రారంభించాడు. 1681లో కంపెనీ డైరెక్టరుల కమిటీల కోర్టువారు తమలో ఒకడైన విలియం హెడ్జెస్ అనే అతనిని వంగ రాష్ట్రానికి ఏజెంటుగా పంపగా అతడు 1682 జూలైలో వచ్చాడు. అతని డైరీవల్ల అప్పటి పరిస్థితులు తెలుస్తున్నవి. ఆ కాలంలో ఇంగ్లీషు దళారీ వర్తకులకూ, చాలామంది కంపెనీ ఉద్యోగులకూ లాలూచీ సంబంధములు ఉన్నాయనిన్నీ, అందువల్ల ఈ దళారీలు అతిధైర్యంతో విజృంభించి బహిరంగంగానే వ్యాపారంచేస్తూ యెవరినీ లక్ష్యపెట్టక తృణీకరిస్తున్నారనిన్నీ హెడ్జెసు వ్రాసి, "పిట్టు అనే వాడొకడున్నాడు; వీడు ఒక సముద్రపు దొంగకన్నాకూడా అన్యాయపుమనిషి. వీడు చాలా పొగరుబోతు. కోపిష్ఠి, తెగింపుగలవాడు" అని పిట్టునుగురించి వ్రాశాడు. 30 మంది ఇంగ్లీషు నావికులతోనూ, నాలుగు ఫిరంగులతోనూ నడిచే ఒక చిన్న ఓడపైన ఈ పిట్టున్నూ, ఇతనికి సహాయుడైన కెప్టెన్ డొవుసేల్ అనే అతడున్నూ కలిసి కంపెనీవారి ఏజెంటు ప్రక్కనుంచే జోరుగా పోయారు. ఈ దుండగాన్ని సహించలేక ఈ యేజెంటుగారు పిట్టును పట్టుకొని అతనిమీద కేసుపెట్టి జుల్మానా వేయించి దేశంలోనుంచి వెళ్ళగొట్టించాడు.

పిట్టు చేయునదిలేక డార్సెటు షైరులో స్వగ్రామం చేరుకున్నాడు. ఇంతపరాభవం జరిగినా ఇతడు అధైర్యం చెందలేదు*.

## పార్లమెంటు సభ్యుడు

ఆ రోజులలో ఇంగ్లాండుదేశపు రాజకీయాలు చాలా చిత్రంగా ఉండేవి. పార్లమెంటులో సభ్యుడు కావాలంటే డబ్బు చేతులో ఉంటే చాలు. మనుష్యులు ఎవ్వరూ కాపురం లేని బేచిరాకు గ్రామాలకుకూడా పార్లమెంటు ప్రతినిధులను పంపడానికి వీలుండేది. కొంతసొమ్ము ఖర్చుపెట్టి అలాంటి గ్రామాల తరఫున చాలామంది పార్లమెంటు సభలో సభ్యులయ్యేవారు. పిట్టుకీ సంగతి తెలుసును. తాను గనుక పార్లమెంటులో సభ్యుడైతే దానివల్ల కొంత పలుకుబడిని సంపాదించవచ్చునని గ్రహించి అందుకోసం ప్రయత్నించాడు. ఓల్డుసారం అనే బేచిరాకు గ్రామానికి గల స్థానానికి తాను నిలబడి పార్లమెంటు ఎన్నికలలో పోటీచేసి సొమ్ము ఖర్చుపెట్టి వోట్లు సంపాదించి 1689లో పార్లమెంటు సభ్యుడైనాడు. ఆ సమయంలో ఇంగ్లీషు రాజ్యానికి డచ్చి దేశాన్నుంచి విలియం

* (Rise and fulfilment of British Rule in India. Thompson and Garratt P. 44)

ఎలాగ వచ్చి రాజైనాడో అలాగే ఆ రాజు పార్లమెంటు సభలో దళారీగా వచ్చిన ఈ పిట్టు ఒక సభ్యుడైనాడు. పార్లమెంటు సభ్యుడైనందువల్ల ఇతనికి కొంత అధికారమూ, పలుకుబడీ కలిగినవి. పార్లమెంటు సభ్యుడుగా యుంటూనే ఇతడు 1693లో మళ్ళీ వ్యాపారం చెయ్యడానికి హిందూ దేశానికి బయలుదేరి బాలసూరు చేరుకున్నాడు.

ఆ కాలంలో హిందూదేశంలో కంపెనీవారి ఉద్యోగులందరూ లోపాయికారీగా సొంత వ్యాపారంచేస్తూ లాభం సంపాదించేవాళ్ళు. ఆ సందర్భంలో దళారీ వర్తకులతో భాగాలు ఏర్పరచుకొని వాళ్ళతో లాలూచీగా యుండేవారు. రాజధానులలో ఉండే కౌన్సిళ్ళనే ఆలోచన సభలలోని సభ్యులుకూడా ఇలాంటిపనులు చేస్తూయున్నట్లు కంపెనీ వారి కమిటీల కోర్టువారికి తెలియవచ్చి కొందరు కౌన్సిలు సభ్యులను తొలగించారు. ఈమారు పిట్టు హిందూదేశంలో 18 నెలలున్నాడు. వంగరాష్ట్రంలో కంపెనీ ఉద్యోగులు ఇతణ్ణి యేమీ చెయ్యలేకపోయారు. "ఈ కెప్టెన్ పిట్టు వచ్చినది మొదలుకొని చివరదాకా అతి ధైర్యంగా విజృంభించాడు. అతిగర్వంతో ప్రవర్తించాడు. తమర్నిగురించి చాలా అమర్యాదకరములైన దుర్భాషలు ఆడడానికి సందేహించలేదు." అని ఇక్కడి ఉద్యోగులు సీమలోని అధికారులకు వ్రాశారు (Thompson and Garratt P.51). ఆఖరికి ఇతణ్ణి పట్టుకుని మళ్ళీ సీమకు పంపివేశారు.

## చెన్నపట్టణం గవర్నరు

పిట్టు 1689లో న్యూసారం అనే బేచిరాకుగ్రామానికి, 1691లో ఓల్డుసారం అనే బేచిరాకుగ్రామానికి ప్రతినిధిగా పార్లమెంటుసభలో ప్రవేశించినందువల్ల మళ్ళీ ఇతడు దేశానికి వెళ్లిన తరువాత కూడా పార్లమెంటులో అతనిస్థానం అతనికే ఖాయంగా ఉంది. ఇతడు పార్లమెంటు సభ్యుడైనందువల్ల ఇతడు చేసిన దుండగాలకు ఇతణ్ణి ఎవరూ ఏమీ అనలేక పోయారు. ఇతడు బలవంతుడనిన్నీ, బాధ్యతలేకుండా ప్రవర్తిస్తున్నాడనిన్నీ, ఇతనితో తగవులు పెట్టుకున్నందువల్ల లాభం లేదనిన్నీ, ఈ దుండగీడుతో ఏదోవిధంగా రాజీ చేసుకొని ఇతణ్ణి ఉపయోగించుకుంటే కంపెనీవారికి లాభకరంగా ఉంటుందనిన్నీ కంపెనీ డైరెక్టర్లకు తోచింది. కంపెనీ వారితో సఖ్యతగాఉండి లాభం పొందడానికి పిట్టుకుకూడా అభ్యంతరం లేదు. ఇతనికి ఏమిపని యిద్దామా అని ఆలోచిస్తూ ఉంటే చెన్నపట్నంలో కంపెనీవారి వర్తక స్థానమైన సెంట్ జార్జికోట ఆలోచనసభకు అధ్యక్షుడు అనే గవర్నరు పదవిలో త్వరలో ఖాళీ వస్తుందనేమాట వారికి జ్ఞాపకం వచ్చింది. ఆ యుద్యోగం అతని కిస్తామన్నారు.

"సెంట్‌జార్జ్ కోటనున్నూ, దాని క్రింది ఫ్యాక్టరీల నున్నూ పరిపాలించడానికి తగిన యోగ్యత కెప్టెన్ తామస్ పిట్టుగారికి ఉన్న"దని తూర్పు ఇండియా వర్తకకంపెనీ డైరెక్టర్ల కోర్టువారు 1697వ సంవత్సరం నవంబరు 25వ తేదీన తీర్మానించినట్లు వారి కవిలెలలో నమోదు అయియున్నది. తరువాత డైరెక్టర్ల కోర్టు సభలో అంతవరకు చెన్నపట్నం గవర్నరుగా పనిచేస్తూయున్న నెథేనియల్ హిగ్గిన్సు అనే అయన కోరికమీద ఆ బాధ్యతనుంచి అయన్ని విముక్తిచేసి అయనస్థానే పిట్టుగారిని గవర్నరుగా ఎన్నుకొన్నారు. రెండురోజుల తరువాత కెప్టెన్ పిట్టుగారు డైరెక్టర్ల కోర్టు సభకు వచ్చినప్పుడు ఆ సంగతి అయనకు

తెలియజేశాడు. అంతట పార్లమెంటువారి శాసనంలో చెప్పియున్న ప్రకారం గవర్నరు చేయవలసిన ప్రమాణాన్ని పిట్టుగారు చేశారు. ఇకముందు తన శక్తి సామర్థ్యాలన్నీ కంపెనీ వారి సేవలో వినియోగించేటట్టు పిట్టుగారు ప్రమాణం చేశాడని కూడా డైరెక్టర్ల రికార్డులో నమోదు చేయబడియున్నది.

డైరెక్టర్లు ఈ పిట్టుగారికి యుద్యోగం ఇచ్చారని తెలియగానే తూర్పు ఇండియా వర్తక సంఘముయొక్క సామాన్య వాటాదారులలో కొందరికి చాలా ఆశ్చర్యం కలిగింది. కొంతమంది కిది ఎంతమాత్రమూ ఇష్టంలేదు. ఆ కంపెనీ డైరక్టర్ల కోర్టుకు చాలాకాలం అధ్యక్షుడుగా ఉండి 1686 నుంచి కొన్నాళ్ళుమాత్రం విశ్రాంతి తీసుకుంటూయున్న సర్ జోసయా చైల్డుగారికి కూడా ఇది ఇష్టంలేదు. "ఈ పిట్టు చాలా మొరటు మనిషి అనిన్నీ, అవినీతి పరుడనిన్నీ, ఆ పనికి తగ" దనిన్నీ చైల్డుగారన్నారు.

ఈ యుద్యోగం తనకిచ్చినందుకు పిట్టుగారికిమాత్రం సంతోషంగానే ఉంది. తాను హిందూదేశం బాగా ఎరిగిన వాడు. అక్కడ దళారీ వర్తకుడుగానే చాలా డబ్బు సంపాదించ గలిగాడు. ఇప్పుడు అధికారమూ, గౌరవమూ, పలుకుబడి ఉపయోగించి ఇంకా చాలా డబ్బు సంపాదించి భాగ్యవంతుడు కావచ్చునని అతడు చాలా సంతోషించాడు.

చెన్నపట్నం సెంట్‌జార్జి కోటలో కంపెనీవారి కౌన్సిలు అధ్యక్షులుగా ఉండే ఫ్యాక్టరీ గవర్నర్లకు ఇదివరకు సాలుకు రెండువందల పైనుల (నవరసుల) చొప్పున జీతమున్నూ, సాలుకు నూరు నవరసుల చొప్పున యినామున్నూ ఇస్తూ యున్నందువల్ల పిట్టుగారికి కూడా అలాగే యిచ్చేటట్లున్నూ, అతడు అయిదేళ్ళవరకూ గవర్నరుగా ఉండేటట్లున్నూ కంపెనీ వారు నిర్ణయించారు. ప్రయాణంలో సంభారాలకోసమని అతనికి నూరు నవరసులు మంజూరు చేశారు. పిట్టుగారు హిందూదేశానికి రావడానికి వెంటనే ప్రయాణం కట్టారు. తన పెద్దకుమారుడైన రాబర్టు పిట్టు అనే అతనిని గూడా తనతో చెన్నపట్నంవచ్చి అక్కడ ఒక స్వతంత్ర వర్తకుడుగా ఉండడానికి అనుజ్ఞ యివ్వవలసినదని ఇతడు డైరెక్టర్లను కోరగా వారు అంగీకరించారు. పిట్టుగారు 1698వ సంవత్సరం జూలై నెల 6వ తేదీన చెన్నపట్నం చేరారు.

పిట్టుగారు చెన్నపట్నానికి గవర్నరుగా వచ్చేటప్పటికి దానికి 'రాజధాని' అనేపేరు ఉన్నప్పటికీ కంపెనీవారికి ఏలడానికి రాజ్యాలులేవు. చెన్నపట్నం కోటలోను, తూర్పు సముద్ర తీరాన్ని వర్తక స్థానాలుండేవి. మొగలాయి చక్రవర్తినీ, నవాబులనూ ఆశ్రయించి పట్టాపొందిన గ్రామాలు కొన్ని యుండేవి. చెన్నపట్నంలో కోటను ఆనుకుని ప్రస్తుతం జార్జి టవును ఉన్నచోట నల్లవారి బస్తీ అనేపేట యుండేది. 1693లో తండయారుపేట, పొరశవాకము, ఎగ్మూరు, తిరువళిక్కేణి అనేగ్రామాలు సంపాదించారు. తూర్పు సముద్ర తీరాన మచిలీ బందరు, విశాఖపట్నము, వీరవాసరం, పులికాటు, అర్మగాను, కడలూరు మొదలైనచోట్ల వర్తకస్థానాలుండేవి.

దేశమంతా మొగలు చక్రవర్తియైన ఔరంగజేబు సామ్రాజ్యంలో చేరింది. చెన్నపట్నం పరిసర ప్రాంతాలన్నీ ఔరంగజేబు చక్రవర్తికి దక్షిణ హిందూదేశములో రాజప్రతినిధియైన హైదరాబాదు సుబేదారుడు (తరువాత నిజాము) అధికారానికి లోబడి ఔరంగజేబు చక్రవర్తి

సేనానాయకుడైన జుల్ఫికరుఖానుడు పరిపాలించేవాడు. 1692లో ఔరంగజేబు చక్రవర్తి ఇతనికి 'కర్నాటక నవాబు' అను బిరుదు నిచ్చాడు. కర్నాటక మనగా ఉత్తరాన్ని కృష్ణానది మొదలు దక్షిణాన్ని కావేరివరకూ, తూర్పున సముద్రం మొదలు పడమర కడప, సేలము, దిండిగల్లు వరకూ ఉండే రాజ్యము. జుల్ఫికరుఖాను నాశ్రయించి పైన చెప్పిన నాలుగు ఊళ్ళకూ ఇంగ్లీషువారు పట్టాపొందారు. జుల్ఫికరుఖాను క్రింద దావూదుఖానుడు సేనానాయకుడుగా ఉండి, కొన్నాళ్ళు నవాబు ప్రతినిధిగానుండి, తరువాత 1700లో కర్నాటక నవాబు అయినాడు.

దావూదుఖాను నవాబుహోదా వహించగానే చెన్నపట్నంలో తూర్పు ఇండియా వర్తక సంఘమువారి గవర్నరైన పిట్టుగారు ఆయనకు మెహర్బానీగా పెద్దతుపాకులు, చిన్న తుపాకులు, ముఖం చూచుకునే అద్దాలు, విదేశ సారాయి, ఇతర వస్తువులు నజరుగా పంపారు. కాని, అవి అతనికి తృప్తిగాలేవు. వాటిని తెచ్చిన రాయబారిని అతడు అగౌరవపరచి బెదరకొట్టాడు.

1701వ సంవత్సరం జూలై నెలలో దావుదుఖాను 10వేల గుఱ్ఱాలతోను, కాల్బలముతోను వచ్చి చెన్నపట్నానికి దగ్గరగా శిబిరము వేశాడు. కంపెనీ గవర్నరుగారు అతనికి మళ్ళీ బహుమతులు పంపించారుగాని నవాబుగారు స్వీకరించలేదు. అతడు మీదపడతాడేమోనని భయపడి పిట్టుగారు రేవులోనున్న ఓడలలోనుంచి నావికా దళాన్ని దింపించారు. తెల్లసైనిక దళాన్నికూడా సిద్ధంగా ఉంచారు. ఈ బందోబస్తువల్ల నవాబుగారు బహుపరాకు చిత్తగించడం కాస్తతగ్గించి గవర్నరుగారు పంపిన బహుమతులను స్వీకరించి ఆయనతో విందారగించడానికి అంగీకరించారు. గవర్నరుగారు ఒక పారశీక వంటవాడిని తెప్పించి నవాబుగారి కోసం 600 రకాల వంటకాలు చేయించి పళ్ళెములలో వడ్డింపించారు. నవాబుగారూ, ఆయన దివానూ, ఆయన బక్షీగారూ, వారితో వచ్చిన పరివార జనమూ తృప్తిగా భుజించారు. వారికి ఆహ్లాదం కలిగించడానికి పిట్టుగారు ఒక భోగం మేళం మేజువాణీకూడా ఏర్పాటుచేశారు. ఈ ఝల్సాలో మునిగి వాళ్ళందరూ తెగ త్రాగినందువల్ల నవాబుగారికి చాలా నిషాగా ఉండి మత్తువల్ల ఆ మర్నాడు చూద్దామనుకున్న ఇంగ్లీషు ఓడను చూడలేకపోయారు. క్రిందటి రాత్రి జరిగిన ఝల్సాయొక్క నిషా తగ్గిపోయిన తరువాత ఆ మర్నాడు తాను తనయేనుగులతోనూ, సైనికదళంతోనూ చెన్నపట్నం వీధులలో ఊరేగదలచినానని నవాబుగారు పిట్టుగారికి కబురంపారు. ఇదేమి కర్మమురా యని పిట్టు భయపడి మళ్ళీ తన నావికులను, తెల్లసైనికులను సిద్ధంగా ఉంచాడు. అయితే నవాబుగారు అన్న ప్రకారం ఊరేగేలోపుగానే అదృష్టవశాత్తు మళ్ళీ మద్యపానంవల్లను మత్తెక్కి పడిపోగా ఒక పోర్చుగీసు క్రైస్తవ దేవాలయ మందిరంలో పడుకోపెట్టారు. ఆయన ఆ మత్తుతో సాయంత్రం నాలుగు గంటలదాకా నిద్రపోయి లేచి తాను అనుకున్న సంగతి మరచిపోయి సెంట్‌తోమ్ చిన్నకొండదగ్గిర తాను వేసిన శిబిరం దగ్గరకు పొమ్మని సైనికులకు ఆజ్ఞాపించి తాను అనుకున్న ప్రకారం గవర్నరుగారి తోటకు రాలేనందుకు చింతిస్తూన్నాననిన్నీ, ఒక డజను సీసాలు 'కార్డియల్ వాటర్సు' అనే పానీయాన్ని పంపించవలసినదనిన్నీ గవర్నరుకు కబురంపాడు. బ్రతుకుజీవుడా అని

గవర్నరుగారు నవాబుగారికి ఆ సీసాలు పంపించారు. నవాబుగారు ఆ మరుసటి సంవత్సరం మళ్ళీ వచ్చి చెన్నపట్నం లోపలనుంచి పైకీ, పైనుంచి లోపలికీ ఏ మనిషీ, ఏ సరుకూ పోకుండా బందుచేశాడు. అతని యుద్దేశ్యం కేవలమూ సొమ్ము దోచుకోవడమేనని గ్రహించి పిట్టుగారు అయనకు 25 వేల రూపాయలు లంచమిచ్చి తృప్తిపరచి పంపించారు.

## మొగలాయిచక్రవర్తికి నజరులు

పిట్టు చాలా ఉపాయశాలి. చెన్నపట్టణం ప్రాంతాల పరిపాలకులైన కర్నాటక నవాబును ఆశ్రయించడంకంటె ఆయనపైన రాజాధిరాజుగానున్న ఢిల్లీ చక్రవర్తి దర్బారులో నున్న అధికారులనే ఆశ్రయిస్తే కంపెనీవారికి చాలా లాభము కలుగుతుందని గ్రహించాడు. చెన్నపట్నము దగ్గర ఉన్న తిరువత్తియ్యూరు, కత్తివాకము, నుంగంబాకము, వ్యాసార్పాడి, సత్తెనగాడు లనే అయిదు గ్రామాలకు పట్టా యిప్పించవలసినదని కంపెనీవారు పెట్టుకున్న దరఖాస్తు ఇంతవరకూ మంజూరు కాలేదు. పిట్టుగారు 1708వ సంవత్సరంలో దీనిని గురించి ఢిల్లీదర్బారుతో ఉత్తరప్రత్యుత్తరాలు ప్రారంభించాడు. ఔరంగజేబు చక్రవర్తి 1707లో చనిపోగా ఆయన కుమారుడు షాఅలం చక్రవర్తి అయినాడు. ఆయన సుఖలోలుడైనందువల్ల ఆయన వజీరులే వ్యవహారాలన్నీ చూడడం ప్రారంభమయింది. పిట్టుగారి పథకం పారింది. షాఅలం చక్రవర్తిగారి రాజనగరువ్యవహారాలను చూసే (Lord High steward of the house-hold) అంతరంగిక మంత్రియైన జూడీఖానుగారికి పిట్టుగారు అతినమ్రతతోను, భయభక్తులతోను 1708వ సంవత్సరం జనవరి 5వ తేదీన ఒక ఉత్తరం వ్రాసుకున్నారు. అందులో మొగలాయి ప్రభువుల గొప్ప ధనాన్ని ఆకాశాన్నంటేటట్లు పొగడి ఇంగ్లీషు వర్తక కంపెనీ వారి దైన్యస్థితిని గురించి విన్నవించుకుని తమ కిప్పించవలసినదని దరఖాస్తు పెట్టుకున్న గ్రామాలకు పట్టాయిప్పిస్తేనే గాని తాము బ్రతుకలేమని మనవి చేసుకొన్నాడు.

పైసంగతులు వ్రాసుకున్నతరువాత జూడీఖాను గారిని ఉబ్బించడానికి పిట్టుగా రీ క్రింది విధంగా వ్రాశాడు. "ఏలినవారు గోలకొండకు దయచేసినప్పుడు తమ రూప పటాన్ని నాకు పంపించవలసినదని నేను తమర్ని మరిమరీ వేడుకొనుచున్నాను. దానిని నేను సీమకు పంపించి ప్రపంచంలోకెల్లా అతిచతురుడైన గొప్ప చిత్రకారుడిచేత వ్రాయించి తెప్పించుకుంటాను. ఇంతేగాక తమ విగ్రహాన్ని చలువరాతితో తయారుచేయించి ఈ ప్రాంతాలలో ప్రజలందరూ సుఖముగా జీవించడానికి కారణభూతులుగా ఉన్న తమయొక్క ఖ్యాతిని ప్రపంచానికంతా తెలిసేటట్లు తమ చరిత్రను దానిక్రింద చెక్కిస్తాను."

పిట్టుగారి ఒడుపువల్ల పైనచెప్పిన అయిదు గ్రామాలూ కంపెనీవారికి కౌలు కివ్వడానికి అంగీకరిస్తూ 1708లో వజీరుగారే స్వయంగా ఉత్తరం వ్రాశారు. మొగలాయి చక్రవర్తిగారి దర్బారువారికి కంపెనీ వారింకా 'నజరులు' చెల్లించలేదనే సంగతిని వజీరుగారు పిట్టుగారికి జ్ఞాపకం చేశారు. తమ కిష్టమైన బహుమతులు జాబితాను కూడా ఆ ఉత్తరంలో జతపరిచారు.

1. (Manila) మనీలా చిలకలు, మైనాలు (Newries cocat-ores) మొదలైన మంచి రంగూ, రూపములుగల మాట్లాడే పక్షులు, తలమీది కిరీటాలు, తురాయీలు గల అందమైన పక్షులు.

2. (Lacker Vessels) బహుశా (Lacquered) అనగా చిత్రమైన జపాను వార్నీషు వేసిన గిన్నెలు, పింగాణీలు Scru-tores (?) Targetts కలందానులు మొదలైనవి. ముఖ్యంగా ముత్యాల చిప్పలతో పనిచేసిన Lackerd Scrutores (?) వస్తువులు.

3. అపూర్వమైన చీనాసామానులు ఎంత పురాతన వస్తువులైతే అంత మంచిది. విషం తగలగానే బ్రద్దలు అయిపోయే స్వభావంగల 'ఘూరీ'లనే పళ్ళెములు – అలాంటివి కొన్నిటినైనా తప్పక పంపాలి అని షరా.

4. గడియారపు మరలుగల పెట్టెలు, రంగుబొమ్మలు వేసిన చీనా తెరలు, గడియారపు మరలు కలిగి వింత వింత అభినయాలూ, ధ్వనులూ చేసే విగ్రహాలు 'Junks' (?) ఇలాంటి కీలుబొమ్మలూ, మరబొమ్మలూ, రకరకాల అపూర్వ వస్తువులైతే బాగుంటాయి అని ఒక షరా.

5. బంగారు వెండి సామానులు, ఫిలిగ్రీన్ Philigreen (?) బహుశా Filigree అనే తీగలతోను, పూసలతోను అల్లిన నాజూకు వస్తువులు కాబోలు, వెండిగిన్నెలు, బంగారు మలాము సామానులు – ఇలాంటివి ముఖ్యంగా ఐరోపాదేశపు వస్తువులయితే శ్రేష్ఠము అని దీనికి ఒక షరా.

6. ఐరోపా దేశపు ఫిరంగివత్తులు (Fuses), ఒకటి రెండు చిన్న ఫిరంగులు, తుపాకులు కూడా పంపవచ్చును.

7. ఒక మంచి ఏనుగు, ఒక శ్రేష్ఠమైన గుఱ్ఱము, మంచి అరబ్బీ గుఱ్ఱాలు, బంగాళీ గుఱ్ఱాలుకూడా పంపవచ్చును.

8. మంచి అంబరు (Amber grease).

9. పెద్ద గడియారాలూ, గంటలుకొట్టే జేబు గడియారాలూ తప్పకుండా పంపించాలి.

10. ఐరోపాదేశపు నల్ల పెన్సిళ్ళు, ఎఱ్ఱపెన్సిళ్ళూ – ఇవీ జాబితాలో ఉన్న వస్తువులు.

ఇంత దయతో వ్రాసిన యుత్తరానికి జవాబు పంపించకపోతే ఎంత అపచారముగా ఉంటుంది? అందువల్ల గవర్నరు (పిట్టు) గారు మొగలాయి దర్బారు ప్రధాన సూత్రధారుడికి జవాబు వ్రాస్తూ వారి యుత్తరాన్ని తరుజమా చేయించుకొని చదివించుకున్నామనిన్నీ, అందులోని సంగతులు చాలా సంతోషం కలిగించాయనిన్నీ, అయితే దానికి సరియైన ప్రత్యుత్తరము ఇవ్వడంలో చాలా చిక్కులున్నాయనిన్నీ వ్రాయిస్తూ, "దర్బారులో రాజకుమారు లందరికిన్నీ, ఇంకా గొప్ప ఉమ్రావులకున్నూ కూడా బహుమతులు పంపించాలని ప్రభువుల వారు వ్రాయించారు. వారి వారి పుట్టుకనుబట్టిన్నీ, గొప్పదనాన్ని బట్టిన్నీ పంపాలంటే మా కంపెనీవారి ఆస్తిఅంతా అమ్ముకున్నాకూడా అది సాధ్యంకాదు. మా కంపెనీవారు సామాన్య వర్తకులనిన్నీ, ఏదో కాస్తలాభంకోసం చాలా తెగింపుచేస్తూ అందువల్ల లాభాలు రాకపోగా నష్టాలుకూడా పొందుతూ యుంటారనీన్ని తమరు ఎరగని విషయం గాదు. కాబట్టి మేము తమకు సమర్పించుకోదలచిన బహుమతులు మా తాహతునుబట్టి యిచ్చు కుంటున్నామని చక్రవర్తిగారి దివ్యచిత్తానికి తేవలెను. చక్రవర్తిగారున్నూ, రాజకుమారులున్నూ మాయందు దయయుంచి వాటిని ఆ దృష్టితోనే స్వీకరిస్తారని నమ్ము

తున్నాము" అని చాలా వినయంతో ఈ క్రింది కథ వ్రాశాడు. "ఒక రాజుగారికి గొప్పవారు చాలా మంది బహుమతులు సమర్పించుకుంటూ యుంటే ఒక బీదవాడు ఉడతాభక్తితో ఒక్క నీటిచుక్కను తీసుకొని వచ్చాడట. వాడిశక్తినిబట్టి తెచ్చిన ఆ నీటిచుక్కను రాజుగారు సంతోష పూర్వకంగా పరిగ్రహించారట. ఈ ఇతిహాసం నాకు ఈ సందర్భంలో జ్ఞాపకం వస్తూఉన్నది" అని పిట్టుగారు వ్రాస్తూ ఆ యితిహాసంలోని నీటిచుక్కలో తాము ఆరు ఏనుగులను కూడా చేర్చి ఆ బహుమతులను ఢిల్లీకి పంపించారు.

ఈయుత్తరం వ్రాసిన నెలలోనే కర్నాటక నవాబుగారు మద్యపానమత్తతతో కంపెనీవారు చాలా తక్కువనజరులిచ్చారని గొణుగుతూ మళ్ళీ చెన్నపట్నం ప్రక్కనుంచే తరలి వెళ్ళారు. నవాబుగారు పిట్టుగారికి వ్రాసిన చివరియుత్తరం చాలాఘాటైన సారాయములకు సంబంధించి యుండడములో ఆశ్చర్యంలేదు. 1709వ సంవత్సరం ఫిబ్రవరి నెలలో గవర్నరుగారి కౌన్సిలు వారి సభలో చర్చించబడిన అంశములను గూర్చి వ్రాయబడిన Consultation అనే వివరణలో ఇలాగ వ్రాయబడియున్నది. "రాజుగారి దర్బారు నుండి తాకీదు వచ్చినట్లుగా దావూదు ఖానుగారు వెయ్యిసీసాల సారాయమును పంపించవలసినదని గవర్నరైన పిట్టుగారికి వ్రాశాడు. ప్రస్తుతం ఆయనకు మనము 250 సీసాలు పంపడానికి నిశ్చయించడమైనది. ఐరోపా నుంచి వచ్చిన ఓడలోనుంచి రెండు పెద్దకుక్కలనుకూడా గవర్నరు గారు దింపించి నవాబుగారికి పంపుతున్నారు." కంపెనీవారు చక్రవర్తికీ, నవాబులకూ ఇలాగ కుక్కలు వగైరాలను బహుమతిగా పంపడం జహంగీరు కాలంనుంచీ కూడా జరుగుతూనే వచ్చింది. నవాబు దావూదుఖానుగారు దరిమిలాను వ్రాసిన ఉత్తరమునుబట్టి 'మాస్టీ'లనే మాటకు సీమకుక్కలని గవర్నరు గారు సరిగ్గానే అర్థంచేసుకున్నట్లు విదితమైనది Rise and fulfilment of British Rule in India Thompson and Garratt (p. 52-54).

## పిట్టుగారి పరిపాలన

ఆ కాలంలో తూర్పు ఇండియావర్తక కంపెనీవారి కొలువులో ఇలాగ దేశీయ రాజులకు నజరులిచ్చి వారిదయ సంపాదించగల ఈ పిట్టు ఉండడం వారికి ఒకవిధంగా లాభకారి అయింది. అతడు వచ్చేటప్పటికి పాత కంపెనీ వారికి పోటీగా ఒక క్రొత్త కంపెనీ వచ్చింది. ఈ క్రొత్త కంపెనీవారు ఇంగ్లాండు రాజుకు చాలాసొమ్ము పెట్టుబడి పెట్టారు. పాత కంపెనీవారు తీసివేసిన ఉద్యోగులను తాము పెట్టుకునేవారు. అలాంటి వారిలో మన తామస్ పిట్టుగారి తాతా సహోదరుని మనుమడైన జాన్ పిట్టు ఒకడు. ఈ మనుష్యులు చాలా అసమర్థులుగా ఉండేవారు. పూర్వం సర్. తామస్‌రో గారిని మొగలు చక్రవర్తి దగ్గరికి ఒక రాయబారిగా పంపినట్లే ఈ క్రొత్త కంపెనీవారు సర్. విలియం నోరిస్ అనే ఆయనను పంపించారు. అతడు అనుభవజ్ఞుడుకాడు. అతడు ఔరంగజేబు చక్రవర్తి దగ్గరకు వెళ్ళగా ఇంగ్లీషువారు ముందుగా సముద్రాలను కాపలాకాసి ఓడ దొంగలను లేకుండా చేస్తే తాను వారి మనవి చిత్తగిస్తానన్నాడు. నోరిస్‌గారు విఫలుడై తిరిగివస్తూ 1702లో చనిపోయాడు. తరువాత క్రొత్తకంపెనీవారు పాతకంపెనీ వారితో రాజీపడగా రెండు కంపెనీలూ కొంతకాలానికి ఏకమైనవి.

పిట్టుగారికి ఉద్యోగం ఇచ్చినప్పుడు మొదట 5 సంవత్సరాలు మాత్రమే అతడు చెన్నపట్నం గవర్నరుగా ఉండేటట్లు డైరెక్టర్లు అతన్ని నియమించినా అతడు 12 సంవత్సరాలు ఆ యుద్యోగంలో ఉన్నాడు. అతని ఆలోచనసభవారిలో కొంతమందితో విరోధాలవల్ల అతనిపైన పితూరీలు వెడుతూనే యుండేవి. కాని అతడిని పనిలోనుంచి తొలగించడానికి ఎప్పటికప్పుడు ఏదో ఆటంకం కలుగుతూనే యుండేది. పిట్టుగారు చెన్నపట్నంలో గవర్నరుగా ఉండినకాలంలో రాజకీయంగా గొప్ప సంగతులేమీ జరుగలేదు. ఈ వజ్రంకథే లేకపోతే పిట్టుగారి సంగతి చరిత్రలో ప్రసిద్ధికెక్కకపోయేదే.

1707లో పిట్టుగారు గవర్నరుగా నుండగా అక్కడి ప్రజలలో ద్విజేతరకులాలలో ఉండే కుడిచెయ్యి పక్షమువారికి, ఎడమచెయ్యిపక్షమువారికి వివాహపు ఊరేగింపుల విషయంలో తగాదాలు వచ్చాయి. ఈ సంగతి గవర్నరుగారి కౌన్సిలు సభవారు చర్చించినట్లు వారి రికార్డులో నమోదు చేయబడి యున్నది. ఆ సందర్భంలో కౌన్సిలు సభ్యులైన ఫ్రేజరు గారున్నూ, ఫ్రెడరిక్కుగారున్నూ పిట్టుగారి అభిప్రాయానికి వ్యతిరేకంగా కుడిచెయ్యి కులాలవారిపక్షం అవలంబించారు. పిట్టుగారు ఈ రెండు కులాల నాయకులనూ ఒకగదిలో నిర్బంధించి రాజీకి ఒప్పుకునేటట్లు చేశారు. ఆ రెండు కులాలవారికి వీధులు ప్రత్యేకపరచి రాళ్ళు పాతించారు. ఆంధ్రపత్రిక వృష సంవత్సరాది సంచికలో "మన చెన్నపట్నము, దాని పూర్వచరిత్ర" అనే వ్యాసంలో దీని వివరాలు ఉన్నవి.

## "పిట్టువజ్రం" కథాప్రారంభం

పిట్టుగారితో పాటు ఆయన కుమారుడుకూడా 1698లో చెన్నపట్నం వచ్చాడు. కొద్దిరోజులున్న తరువాత అప్పట్లో చీనాదేశంతో వ్యాపారం చెయ్యడానికి పోయే ఓడమీద అతడు చీనాకు వెళ్ళాడు. పిట్టుగారి పలుకుబడివల్ల అతనికి మంచి ఉద్యోగమూ, విశేషమైన లాభమూకూడా లభించినవి. చీనాకు మళ్ళీ వెళ్ళివచ్చాడు. వచ్చిన వెంటనే సీమకు బైలుదేరాలనుకున్నాడు. కాని తండ్రికోరికపైన కొద్దిరోజులు చెన్నపట్నములో ఉన్నాడు. 1702వ సంవత్సరం అక్టోబరులో అతడు సీమకుపోవడానికి నిశ్చయమైంది. వెళ్లేటప్పుడు తండ్రి అతని చేతికి అపూర్వమైన ఒక గొప్ప వజ్రాన్ని యిచ్చి దానిని జాగ్రత్తగా సీమకు తీసుకునివెళ్లి దానివిషయంలో జరుపవలసిన వ్యవహారాలన్నీ చెప్పి వాటిని లిఖిత మూలకంగా కూడా వ్రాసియిచ్చాడు.

ఈ వజ్రం చాలా గొప్పది. అపూర్వమైనది. ఇది 'పిట్టువజ్రం' అని ప్రసిద్ధిచెందింది. దీనిని ఈపిట్టుగారు ఎలాగ సంపాదించాడో కుమారుడికి కూడా చెప్పలేదు. ఇంతటినుంచి తండ్రి కుమారుల జీవితాలలో ఈ వజ్రంయొక్క క్షేమలాభాలే ప్రధానస్థానం వహించినవి. ఈ వజ్రాన్ని ఎలా తీసుకొని వెళ్ళవలసినది, ఏమిచేయవలసినది తెల్పుతూ పిట్టుగారు 1702వ సం. అక్టోబరు 3వ తేదీన ఒక వివరణ పత్రాన్ని వ్రాసి కుమారుడికి ఇచ్చారు. లండను నగరంలో ఉన్న సర్ స్టీఫెన్ ఈ వాన్సుగారిని, తన కుమారుడు రాబర్టునీ పిట్టుగారు తన ముక్త్యారు యేజెంట్లుగా నియమించాడు. తనకు తన భార్యాపైన అనేక కోపకారణాలున్నాయనిన్నీ, అందువల్ల ఆమెయందు తనకు విశ్వాసంలేదనిన్నీ, ఇకముందు

తన వ్యవహారాల విషయంలో ఆవిడను ఎట్టి జోక్యమూ కలిగించుకోనివ్వవద్దనిన్నీ శాసించాడు.

"చాలా అమూల్యమైనవస్తువును నీపరంగా యిచ్చినాను గనుక నీ బుద్ధినీ, నీ యావచ్ఛక్తినీ ఉపయోగించి నీకే అపాయం కలిగినా కూడా దానినిమాత్రం కాపాడాలి. ఒకవేళ దురదృష్టంవల్ల నీవు శత్రువుల చేతులలో పడినట్లయితే నీ దగ్గరనున్న కాగితాలన్నీ సముద్రంలో పారవేసి ఆ వస్తువును మాత్రం ఏదోవిధంగా కాపాడి రహస్యం బయటపడకుండా ఉంచాలి. నీవు క్షేమంగా ఇంగ్లాండుచేరితే నీవు చేరే మొదటి రేవుపట్నం నుంచి సర్ స్టీఫెన్ ఈ వాన్సు గారికిన్నీ, అల్వరెజ్ గారికిన్నీ చాలా ముఖ్యమైన వ్యవహారం ఉన్నదనిన్నీ, ఓడదగ్గరకు రావలసినదనిన్నీ ముందుగా వారికి ఉత్తరాలు వ్రాసి వాళ్ళు వచ్చేవరకూ నీవు ఓడదిగకుండా ఉండాలి" అని పిట్టు శాసించాడు. రాబర్టు తమ్ములైన విలియమును, థామస్‌ను మంచిబడిలో వేసి చదివించమనిన్నీ, కుమార్తెలకు జాగ్రత్తగా చదువు చెప్పించమని తల్లికి చెప్పవలసిందనిన్నీ, ఇంగ్లాండులో తన భూములను, తోటలను, దొడ్లను జాగ్రత్తగా వ్యవహరించవలసిన దనిన్నీ, తన బంధువులు, స్నేహితులు మాట్లాడే మాటల నన్నింటిని పూసగ్రుచ్చినట్లుగా తనకు తెలియచేయవలసినదనిన్నీ ఆ పత్రంలో వ్రాసి కుమారుడికివ్వగా అతడు ఆ గొప్పవజ్రాన్ని పట్టుకొని సీమకు బయలుదేరాడు.

## ఆదుర్దా

రాబర్టు ఓడమీదకెక్కి వెళ్ళిన ఆరురోజులలోనే పిట్టుగారికి మనస్సు నిలవక కుమారుడికి మళ్ళీ యింకొక ఉత్తరం వ్రాశాడు. ఓడ ఎక్కినవెంటనే తనకు ఉత్తరం వ్రాయలేదనిన్నీ, వీలైనప్పుడల్లా ఉత్తరం వ్రాస్తూ ఉండవలసిన దనిన్నీ, తన పరపతి క్షేమ లాభాలుకూడా అతడు జాగ్రత్తగా ప్రవర్తించేదానిమీదనే ఆధారపడి యుంటాయనిన్నీ, ఎవరైనా - అనగా స్టీఫెన్‌గారుగాని, అల్వరెజ్‌గారు గాని ఈ వజ్రం ఖరీదు ఎంతో తెలుసుకోవాలని కుతూహలపడి అడిగినట్లయితే దానిఖరీదు షుమారు రు. 1,30,000 వరహాలని చెప్పవలసిందనిన్నీ, ఈ విషయం రహస్యంగానుంచి జాగ్రత్తగా వ్యవహరిస్తే దీనివల్ల లెక్కలేనంతలాభం వస్తుందనిన్నీ నష్టమును కలిగించేటట్టిన్నీ అమర్యాదకరమైనట్టిన్నీ పెళ్ళి సంబంధం చేసుకోవద్దనిన్నీ కూడా కొడుకుకి గట్టిగా సలహా యిచ్చాడు.

1703వ సంవత్సరం జనవరి నుంచి పిట్టగారు తన కుమారుడికిన్నీ, సర్ స్టీఫెన్ ఈవాన్సుగారికిన్నీ ఈ వజ్రాన్ని గురించిన్నీ, దానిని సానపెట్టించడం విషయంలోనూ, దాచడం విషయంలోనూ పుచ్చుకొనవలసిన జాగ్రత్తను గురించిన్నీ ఎన్నెన్నో హెచ్చరికలు చేస్తూ ఉత్తరాలు వ్రాయడం ప్రారంభించాడు. వాళ్ళదగ్గరనుంచి ఉత్తరాలు ఆలస్యంగా వస్తే విసుక్కునేవాడు. వజ్రం సానపెట్టటానికి సొమ్ము ఎక్కువ ఖర్చైనదని కోపించేవాడు. వజ్రాన్ని కోస్తే 280 క్యారట్లే అవుతాయని వ్రాసియుండి మళ్ళీ 140 క్యారట్లే అవుతాయని వ్రాస్తున్నారేమని అనుమానంతో గోలపెట్టాడు. కోసినముక్కలను కొడుకు ఖర్చులక్రింద అమ్మినాడని వగచినాడు. ఈ లోపుగా తన కొడుకు ఒక ముసలి ప్రభువు మనుమరాలిని పెళ్ళాడినాడని తెలియగా చాలా తెలివి తక్కువపని చేసినాడని కోపించాడు. భార్యను

తిట్టాడు. ఏమైనాసరే ఈ వజ్రాన్ని క్యారెట్టు 1కి 1500 నవరసుల చొప్పున అయ్యే మొత్తముకన్న తక్కువకు అమ్మకూడదని శాసించాడు.

ఈ వజ్రానికి ఎంతమంచి ధరవచ్చినా తాను అన్నదానికి తక్కువ అయితే యివ్వననే వాడు. చివరకు మంచిలాభమే వచ్చినా ఈ వజ్రంవల్ల పిట్టుగారికి చెన్నపట్నంలో ఉన్నంత కాలమున్ను, తరువాత సీమకువచ్చినతరువాతనూ కూడా అది అమ్మివేసేవరకూ అతనికి మనశ్శాంతి లేకుండా పోయింది. ఆ వజ్రాన్ని ఎలా సంపాదించాడో దానికథ అలా యుండనిచ్చి దానిని సీమకు పంపడానికి కొడుకుకు వశంచేసినప్పుడు ఆ ఓడ మునిగి పోతుందేమోననిన్నీ, అది శత్రువుల చేతులలోనో, దొంగల చేతులలోనో పడుతుందేమో ననిన్నీ కొన్నాళ్ళు అదుర్దా పడినాడు. అదృష్టవశాత్తు ఓడ సీమ చేరిందనీ తన కొడుకు ఆ వజ్రాన్ని జాగ్రత్తగా నమ్మకమైనవారి వశంలో ఉంచాడనీ తెలిసిన తరువాత అదుర్దా తగ్గిందికాని క్రొత్త బాధలు పట్టుకున్నాయి. ఆ వజ్రాన్ని త్వరలో సానపెట్టించకుండా అలస్యం చేస్తున్నాడనీ, పొదుపుగా ఖర్చుచెయ్యటం లేదనీ తన కుమారుడు తన వ్యవహారాలను - ముఖ్యంగా తన గొప్పవజ్రం యొక్క వ్యవహారాన్ని జాగ్రత్తగా చూస్తూ తాను దఫాలవారీగా చెన్నపట్నంనుంచి పంపుతూయున్న వజ్రాల అమ్మకం విషయంలో తగినశ్రద్ధ వహించడానికి బదులుగా తనకొడుకు కాముక వ్యాపారంలో పడినాడని బాధపడ్డాడు. తన ముక్త్యారు సర్. స్టీఫెన్ ఈవాన్సు కూడా అతడు నిర్వహించవలసిన పనులను మంచి వ్యవహర్త చేయవలసినట్లు చేయడం లేదనిన్నీ, తనపనులు చూడడానికి అతనికి తగిన శరీరారోగ్యం లేదనిన్నీ పిట్టుగారికి తోచింది.

ఇలాగ పిట్టుగారికి క్రమక్రమంగా తీవ్రమైన మనోవ్యథ కలిగింది. తనకొడుకుకి వ్రాసే ఉత్తరాలలో అతని అసంతృప్తి, మనోవ్యథ పూర్తిగా కనపడేవి. ఇలాంటి స్థితిలో అతడు చెన్నపట్నంలో తన ఆలోచనసభ (కౌన్సిలు) లో శాంతంగా ఎలా పనిచేయ గలుగుతాడు? అతడు ఎప్పుడూ తనతోడివారి మనస్సులకు నొప్పి కలిగిస్తూ యుండేవాడు. వారుకూడా అతనిపట్ల విరోధించి కంపెనీ డైరెక్టర్ల కోర్టు వారికి అతనిని గురించి అనేకసంగతులను వ్రాసేవారు.

## ఇంకా కొన్ని వజ్రాలు

పిట్టు తన కుమారుడికి 1706వ సంవత్సరం జనవరి 16వ తేదీన వ్రాసిన ఉత్తరంలో తాను సెప్టెంబరులో ఇంగ్లాండుకు రావాలనుకుంటున్నాననిన్నీ, అయితే చెన్నపట్టణం ప్రభుత్వాన్ని ఫ్రేజరు మొదలైనవారి చేతులలో వదలిపెట్టటం తన కిష్టం లేనట్టున్నూ వ్రాశాడు. 2370 వరహాలు పెట్టి తాను కొన్ని వజ్రాలను కొన్నాననిన్నీ, వాటిని పంపించినాననిన్నీ, వాటిలో పెద్దరాయిలో ఒకప్రక్క పసుపురంగు ఉన్నదని భయపడి ఒకకంత కొట్టించినాననిన్నీ, దానిలో నీరు సరిగా ఉంటే దానికి సానపెట్టిస్తే 2500 లేక 3000 నవరసులు ఖరీదు చేస్తుందనిన్నీ, అది పసుపువన్నెగా ఉంటే రెండు రోజులుగా తయారుచేయించి లాభానికి అమ్మి సొమ్మును పార్లమెంటు ఫండులో వడ్డీకి వేయవలసిందనిన్నీ వ్రాశాడు. తన గొప్ప వజ్రంయొక్క వ్యవహారం చాలా రహస్యంగా జరిగించాలని వ్రాశాడు. మళ్ళీ పదిహేను రోజులలో వ్రాస్తూ 2100 వరహాలకు 8

మెంగెల్లీనుల (Mangaleens) వజ్రం ఒకటి కొన్నాననిన్నీ, లోపం ఏమీలేదనిన్నీ, దానిని రెండువేల నవరసుల కమ్మవలసినదనిన్నీ వ్రాశాడు. ఇదిగాక సోమర్సు అనే ఓడమీద వచ్చే వజ్రం తాను హిందూదేశంలో చూచిన వజ్రాలన్నింటి లోనూ స్వచ్ఛమైనదనిన్నీ, గడబిడ చెయ్యకుండా యీ వ్యవహారం నిర్వహించవలసిందనిన్నీ, ఇలాంటి వజ్రం ఇదివరకు నాలుగువేల నవరసులకు అమ్ముడు పోయినదనిన్నీ, అది క్షేమంగా నీకు చేరి, మంచిలాభం వస్తుందని భగవంతుణ్ణి ప్రార్థిస్తూ ఉన్నాననిన్ని వ్రాశాడు.

1706వ సం॥ సెప్టెంబరు 22వ తేదీన పిట్టు వ్రాసిన ఉత్తరంవల్ల అయన మనస్సులో ఎంతబాధగా నున్నదో కనబడింది. తనకొడుకు అనవసరంగా చాలాసొమ్ము ఖర్చుపెడుతున్నాడని విని తిట్టిపోశాడు. ఓల్డుసారం స్థానంలో పార్లమెంటులో ప్రవేశించడానికి అతను సొమ్ము ఎందుకు ఖర్చుపెట్టాలని అయనకు కోపం వచ్చింది. తమ పద్ధతులు మార్చుకోకపోతే తన పిల్లలకు తనసొమ్ము ఒక దమ్మిడీయైనా యివ్వనని ఖచ్చితంగా వ్రాశాడు. మీరు 'మనుష్యులా? పశువులా?' అని నిందించాడు. ఇంకొక ఉత్తరంలో తన కుటుంబంలో అందరూ పోట్లాడుకుని చస్తూవున్నట్లు తనకు తెలుస్తూవున్న దనిన్నీ, తాను ఇలాగ దేశాంతరంలో మగ్గిపోతూవుంటే వాళ్ళందరూ ఇంట్లో సుఖ మనుభవిస్తూ వున్నారనిన్నీ, తాను ఇన్ని కష్టాలు పడినది తన పిల్లలకు కొంత ఆస్తిని సంపాదిద్దామనే ననిన్నీ, ఎన్నడూ అనుకోని అవకాశం కాస్త కలిగిందని సంతోషిస్తూ వుంటే దరిద్రులైన భార్యవల్లను, ఈ బిడ్డలవల్లను అది నాశనం అయ్యేటట్టు కనపడుతూ వున్నదనిన్నీ, వారి ఉత్తరాలనుబట్టి ఇంటిని ఒక నరకకూపం క్రింద చేసినట్టు కనబడుతూ ఉన్నదనిన్నీ వ్రాశాడు. అయినా చివరమాత్రం ప్రతి ఉత్తరంలో వ్రాసేటట్లే మళ్ళీ తన ఆస్తిని గురించి చేయవలసిన పనులను ఉదాహరించాడు. తన భూములలో పాతదానికి వీలైనన్ని చెట్లను పాతించమన్నాడు.

ఈ పిట్టు వజ్రం చూసినవారూ, దానిసంగతి విన్నవారూ చాలా ఆశ్చర్య పడుతున్నారని కొడుకు వ్రాసిన మాటల వల్ల పిట్టుగారికి భయమూ, అనుమానమూ ఎక్కువ అయినవి. దీనిసంగతి ఇంతమందికి ఎందుకు తెలియాలని ఆయనకు కోపం వచ్చింది. ఏమైనాసరే తా నిదివరకు అన్నదానికన్న తక్కువకు అమ్మదలచ లేదనిన్నీ, వెంటనే దానిని ఇనుప పెట్టెలోపెట్టి తాళం వెయ్యవలసిందనిన్నీ, ఒకతాళం తనవద్ద ఉంచుకోవలసిందనిన్నీ, తాను వచ్చేవరకూ ఎవరికీ చూపించవద్దనిన్నీ గట్టిగా వ్రాశాడు.

ఆ వజ్రం లోకులకు ఆశ్చర్యం కలిగిస్తూవుంటే తన కుటుంబంలో కలిగిన కల్లోలంకూడా లోకులకు ఆశ్చర్యం కలిగిస్తూ వున్నదని కుమారుడికి వ్రాశాడు. తన కుమారుడు వ్రాసినట్టుగా ఆ వజ్రాన్ని గురించి ప్రతివాళ్ళు మాట్లాడేటంత అజాగ్రత్త వహించినందుకు పిట్టుగారు కోపించారు. దానిని కొయ్యడానికి ఖర్చుఎక్కువ అయిందనీ, ఎత్తు తగ్గిందనీ గోలపెట్టారు. ఆ వజ్రాన్ని గురించిన తాను ఎక్కడా ప్రచారం చెయ్యడం లేదనిన్నీ, చెన్నపట్నంనుంచే దానిని గురించి వర్తమానాలు అందరికీ తెలుస్తున్నాయనిన్నీ, ఒక వందమంది దానిని గురించి తనను ప్రశ్నించి ఉన్నారనిన్నీ రాబర్టు తన తండ్రికి వ్రాశాడు.

1707 సంవత్సరం ఫిబ్రవరి నెలలో పిట్టుగారు మళ్ళీ తన కుమారుడికి కొన్ని వజ్రాలను పంపించాడు. ఆ వజ్రాలన్నీ చాలామంచివనిన్నీ, అందులో ప్రతీదీ కాంతిమంత మైనదనిన్నీ, కాలాన్ని బట్టి ఆలోచిస్తే వాటిఖరీదుకూడా ఎక్కువకాదనిన్నీ ప్లూమర్ (Plumer) అనే దుర్మార్గుడు ఈ వజ్రాలకు ఇంగ్లాండులో నున్న గొప్పధరలను ఇక్కడివారికి చెప్పి వృథాగా ధరలు పెంచినాడనిన్నీ వ్రాశాడు. ఈ వజ్రాల బంగీలు విప్పేటప్పుడు జాగ్రత్తగా కనిపెట్టి ఉండవలసినదనిన్నీ, కొందరు దుర్మార్గులు రాళ్ళను మార్చివేస్తారనిన్నీ కుమారుడిని హెచ్చరించాడు.

కంపెనీ డైరెక్టర్లు మొదట నిర్ణయించిన ఉద్యోగకాలం అయిదేళ్ళూ పూర్తి అయిపోయినా ఏదో కారణంవల్ల పిట్టు ఇంకా గవర్నరు ఉద్యోగం చూస్తూనే ఉన్నాడు. వీలైనప్పుడల్లా లాభసాటిగా వజ్రాలను ఖరీదుచేస్తూ ఇంటికి పంపిస్తూనే వచ్చాడు. 1707 ఫిబ్రవరి నెలలోనే సర్. స్టీఫెన్ ఈవాన్సు గారికి, తన కుమారుడికీ కూడా కొన్ని వజ్రాలను పంపించాడు. వాటిలో 61 మెంగిళ్లీనుల ఎత్తుగల గొప్పవజ్రం ఉండియున్నది. అది పదివేల నవరసుల ఖరీదు చేస్తుందని పిట్టుగారే వ్రాశారు. తన పెద్దవజ్రాన్ని కొనే రాజులు ఐరోపా దేశంలో ఎవరెవరున్నారో అని పిట్టుగారు ఎల్లప్పుడు ఆలోచిస్తూనే ఉన్నాడు. దాని ధరమాత్రం తగ్గించనన్నాడు.

1708 సంవత్సరం సెప్టెంబరు నెలలో 680 వరహాలకు మళ్ళీ కొన్ని వజ్రాలను కొని పంపించాడు. తన పెద్ద వజ్రాన్ని ఇంగ్లాండు బ్యాంకువారి ఇనుపపెట్టెలో పెట్టించి వుంచవలసినదనిన్నీ, అత్యవసరమైతేగాని దానిని ఎవరికి చూపించవద్దనిన్నీ, మోసములు జరుగుతాయనిన్నీ మరీమరీ హెచ్చరించాడు.

1707 మొదలు 1708 వరకూ పిట్టుగారు ఇలాగున వ్రాస్తూనే ఉన్నారు. ఆఖరికి 1709 సెప్టెంబరు 17వ తేదీన ఉద్యోగాన్ని గవర్నరు కౌన్సిలు సభ్యుడైన అడిసనుగారికి ఒప్పగించ వలసినదని పిట్టుగారికి తాకీదు వచ్చింది. పిట్టుగారు 21 తేదీన తన ఉద్యోగాన్ని వదలి అడిసనుగారికి వప్పగించాడు గాని లెక్కలున్నూ, నగదున్ను వప్పగించక పూర్వమే అడిసనుకు జబ్బుచేసింది. జబ్బుతోనే అవి వశం చేసుకొన్నాడు. పిట్టు అక్టోబరు 17వ తేదీన బైలుదేరబోతూవుంటే అడిసను చనిపోయాడు. అందువల్ల పిట్టు ఆ రోజున ఆగి 21వ తేదీన బయలుదేరాడు. అడిసను తరువాత చెన్నపట్న పరిపాలన తన విరోధియైన ఫ్రేజరు చేతుల్లోకి తాత్కాలికంగానైనా రావడం పిట్టుకు ఇష్టంలేదు.

అడిసను గవర్నరుగాఉన్న 29 రోజులలోనే గవర్నరుగారి కౌన్సిలుకు పిట్టుపైన ఒక ఫిర్యాదు వచ్చింది. కౌన్సిలు సభ్యులైన విలియం ఫ్రేజరున్నూ, తామస్ ఫ్రెడరిక్కున్నూ, సూరప్ప అనే ఒక దేశీయ వర్తకుడున్నూ కలిసి ఈ పిట్టుగారు చాలా అన్యాయంచేసి ఒక మహావజ్రాన్ని సంపాదించాడని కౌన్సిలులో ఒక మహజరు దాఖలుచేశారు. ఈ మహజరును గురించి తరువాత పిట్టుగారు తన మరణశాసనంలో ఉదహరించినందువల్ల ఇలాంటిది వచ్చినట్లు బయటపడింది. కాని లేకపోతే ఇది వున్నట్లే బయటపడేదికాదు. ఇప్పటికికూడా ఈ అర్జీ యేమైనదీ తెలియదు. పిట్టుగారే దానిని నశింపు చేయించాడేమో నని కొందరి అభిప్రాయం. ఇందుకోసమే కొన్నాళ్ళు ఆగినాడని అంటారు.

పిట్టుగారు 1710వ సంవత్సరములో శరత్కాలంలో ఇంగ్లాండు చేరాడు. తనదేశం వదలిపెట్టి పదమూడేండ్లైనది. ఈ మధ్యలో అతడు చాలా భాగ్యవంతుడైనాడు. అతడు లండను నగరము చేరగానే తూర్పు ఇండియా కంపెనీవారి డైరెక్టరుల కోర్టువారి కోరికపైన వారిసభకు హాజరైనాడు. మొగలు చక్రవర్తిగారికి చెందవలసిన అపూర్వమైన ఒక గొప్ప వజ్రం పిట్టుగారి దగ్గర నున్నదనిన్నీ, దానిని వెంటనే మొగలు చక్రవర్తి గారికి పంపించ వలసినదనిన్నీ, కర్నాటక నవాబు దివాన్ సాదతుల్లాఖానుగారు వ్రాసిన ఒక జాబునకు తర్జుమా ఒకటి జతపరుస్తూ చెన్నపట్నం సెంట్‌జార్జి కోటలోని కంపెనీ వారి కౌన్సిలు అధ్యక్షుని దగ్గరనుంచి తమకు ఒక ఉత్తరం వచ్చినదనిన్నీ, సాదతుల్లాఖాను గారి ఉత్తరంలోని సంగతులు తనకు అర్థంకానంత తికమకగా ఉన్నవనిన్నీ, అయితే ఆ వజ్రాన్ని వెంటనే మొగలు చక్రవర్తికి పంపించవలెనని అతడు కోరుతున్నాడనే సంగతిమాత్రం తమకు స్పష్టపడినదనిన్నీ కోర్టువారు చెప్పి అతనిని సంజాయిషీ అడిగారు.

అంతట పిట్టుగారు ఇదంతా చెన్నపట్నంలో తన విరోధులు కుట్రచేసి వ్రాయించి నారనిన్నీ, అందులో కెప్టెన్ సీటన్ ఒకడనిన్నీ, తాను గొప్పగొప్ప వజ్రాలను కొన్నట్లుగా తక్కిన దేశీయులకు కొండెములు చెప్పినట్లు తనకు ఇదివరకూ తెలిసినదనిన్నీ కంపెనీ డైరక్టర్ల కోర్టువారికి మనవి చేశాడు.

## పిట్టుగారి సంజాయిషీపత్రం

పిట్టుగారు సీమకు తిరిగిరావాలని బయలుదేరిన ఓడ దక్షిణాఫ్రికా తీరాన ఉన్న గుడ్‌హోప్ అగ్రానికి వచ్చేటప్పటికే చాలా ఆలస్యం అయి ప్రయాణం ఇంకా ఆలస్యం అయ్యేటట్లు తోచినందువల్ల పిట్టుగారు తిన్నగా లండనుకు పోకుండగా నార్వేదేశంలో బెర్గనుకు పోయే ఓడమీద ఎక్కివచ్చి 1710 మే 30వ తేదీన బెర్గెను చేరాడు. పిట్టుగారు అక్కడనున్న కాలంలో ఒకవేళ తాను ఆకస్మికమరణం పొందేయెడల తన కుమారుడి కివ్వగలందులకని పిట్టు వజ్రమును తాను సంపాదించిన కథనుగురించి ఒక సంజాయిషీ వ్రాసియుంచడం మంచిదని కాబోలు అందులో ఇలాగ వ్రాశాడట :

"నే నీ బెర్గను అనే ప్రదేశానికి వచ్చినప్పటినుంచీ నా మనస్సులో చాలా బాధగా ఉంది. విలియం ఫ్రేజరున్నూ, థామస్ ఫ్రెడరిక్కున్నూ, నల్లవర్తకుడైన సూరప్పయున్నూ చెన్నపట్నంలో కౌన్సిలు సభాయుతుడైన గవర్నరు అడిసను ఎదుట నామీద ఒక ఫిర్యాదును దాఖలుచేశారు. నేను ఒక అపూర్వమైన వజ్రాన్ని అన్యాయంచేసి సంపాదించానని అందులో వ్రాశారు. దీనివల్ల నాకు చాలా పరువునష్టము కలిగింది. నా ఆస్తికి, పరపతికికూడా భంగం కలిగేటట్టు తోచింది. అందువల్ల ఆ వజ్రాన్ని నేను ఎలాగ సంపాదించినదీ వ్రాసి నాదగ్గర వుంచుకోవడం మంచిదని తోచింది. ఒకవేళ నేను ఆకస్మికంగా చచ్చిపోతే నా పిల్లలూ, స్నేహితులూ యథార్థము తెలుసుకుని దుర్మార్గుల నోళ్ళు మూయించడానికి వీలవుతుందని కూడా ఇది వ్రాశాను" అని ప్రారంభించి తాను వ్రాసినదంతా యథార్థ మని ఏసుక్రీస్తు మీద ప్రమాణంచేశాడు.

పిట్టుగారు చెన్నపట్నం చేరిన రెండు మూడేళ్ళలో ఆ దేశంలో చాలా పెద్ద వజ్రాలున్నాయని తాను విన్నాననిన్నీ, తాను కొంటానని తనవద్దకు తెమ్మని వర్తకులను

ప్రోత్సహించినాననిన్నీ, అంతట జామ్‌చందున్నూ, ఇంకా యితర వజ్రాల వర్తకులన్నూ 1701 డిశంబరు ఆ ప్రాంతంలో తన వద్దకు 305 మెంగిలీనుల ఎత్తుగల ఒక పెద్దరాయినిన్నీ, మరి కొన్ని చిన్న రాళ్ళున్నూ పట్టుకొని వచ్చారనిన్నీ, మొదట అంత పెద్ద ఖరీదుగల రాయి తాను పుచ్చుకోదలచలేదు గాని ఆ వర్తకులు చాలాసార్లు వచ్చారనిన్నీ, రెండులక్షల వరహాలకు తక్కువ అయితే యివ్వమని వాళ్ళున్నూ, ముప్పైవేలకన్నా ఎక్కువ యివ్వనని తానున్నూ ఊగులాడినా మనిన్నీ, జామ్‌చందు తనతో కలిసి వచ్చే వెంకటసెట్టి అనే వర్తకుడితో కలిసి 1702 ఫిబ్రవరిలో మళ్ళీ తన దగ్గరకువచ్చి తాను త్వరలో తన దేశానికి పోదలచినాననిన్నీ, ఆ రాతిని ఒక లక్షవరహాల కిచ్చివేస్తానని చెప్పినాడనిన్నీ, అతడిని కొన్నాళ్లైన తరువాత రమ్మని తాను చెప్పి, క్రిందపెట్టి మీద పెట్టి బేరం చేయగా ఆఖరికి 55వేల వరహాల కిస్తానన్నాడనిన్నీ, తాను 45 వేలకు మొగ్గినాననిన్నీ, అంతకంటె తాను ఎక్కువ యివ్వదలచక తనదగ్గరవుంచిన ఆ వజ్రాన్ని వాళ్ళకు ఇచ్చి వేయబోతూవుంటే మళ్ళీ బేరము పొసిగినందువల్ల ఆఖరికి తాను 48 వేల వరహాలిచ్చి ఆ వజ్రాన్ని కొన్నాననిన్నీ పిట్టువ్రాశాడు.

"ఈ జామ్‌చందుతో నేను చాలా బేరాలు చేశాను. నేను వచ్చేటప్పుడు అతని దగ్గర రెండువేల వరహాలు అట్టేవుంచాను. నేను ఏదైనా అన్యాయం చేసివుంటే నాసొమ్ము అతనిదగ్గర ఉన్నప్పుడు అతడు బిగపట్టకుండా వుంటాడా? తరువాత నేను అతడిని నమ్మేవాడినా?" అనికూడా పిట్టు 1710 జూలై 29వ తేదీన వ్రాసిన ఆ వింత మరణశాసనంలో ఉదహరించాడు. అంతేగాని, తన ఆస్తిని గురించి జరగవలసిన ఏర్పాటులేవీ ఆ కాగితంలో లేవు! అందువల్ల ఇది కేవలమూ వజ్రాన్ని గురించి వ్రాసిన సంజాయిషీ పత్రమే!! ఈ సంగతులన్నీ డైరక్టర్ల కోర్టువారికి తప్పకుండా పిట్టు చెప్పివుంటాడు. వారు అతని మాటలు విశ్వసించి తమవద్దకు వచ్చిన ఉత్తరాన్ని ఉత్తర ప్రత్యుత్తరాల ఉపసంఘము (కమిటీ ఆఫ్ కరస్పాండెన్సు) వారికి పంపించారు. సాదతుల్లా ఖానుగారు వ్రాసిన ఉత్తరంయొక్క అంతరార్థం డైరక్టర్లలో కొంతమందికి అర్థంకావడం లేదనిన్నీ, చెన్నపట్నం కౌన్సిలులో ఉండే వారిలో కెప్టెన్ సీటనుగారికి మద్దతుచేసే వారికేమైనా తెలియవచ్చుననిన్నీ ఆ కమిటీవారు జవాబు వ్రాసిపంపారు. అంతటితో ఈ వ్యవహారం బుట్టదాఖలైంది. పైన వ్రాసిన సంగతులను బట్టి పిట్టుగారు చెప్పిన సంజాయిషీలో ఈ సీటన్‌కు సంబంధించిన సంగతి ఏదో ఉన్నదని స్పష్టం అవుతూ ఉందికదా!

## సీటనుగారు మోపిన నిందలు

ఈ కెప్టెన్ సీటన్ పిట్టుగారిమీద చాలా నేరాలు చెప్పినట్లు చెన్నపట్నం గవర్నరు కౌన్సిలు రికార్డులలోనే ఉన్నది. ఇతడు 1685లో హిందూదేశానికి వచ్చాడు. ఇతడు కయాలీ మనిషి, పైగా కొంచెము త్రాగుబోతు కూడాను. అందువల్ల కొంతమందితో పోట్లాడి చిక్కులు తెచ్చుకున్నాడు. చెన్నపట్నంలో పిట్టు గవర్నరుగా ఉన్నప్పుడు అతని ఆలోచన సభలో సభ్యుడుగా ఉండిన తామస్ ఫ్రెడరిక్కు ఇతని అల్లుడు. పిట్టుగారు పెద్దవజ్రాలను కొన్నాడని దేశీయుల కందరికి సీటను చెప్పినట్లు పిట్టుకు తెలిసింది. ఈ సీటను తనను గురించి చాలా అన్యాయపు సంగతులు కలిపించి చెప్పుతున్నాడనిన్నీ,

క్రిందటి రోజున తాను పిలిపించి అడిగితే అతడు ఘోరమైన అబద్ధాలు ఆడినాడనిన్నీ 1709లో పిట్టుగారు తన కౌన్సిలు వారికి తెలియపరిచి తనకూ ఈ సీటనుకూ జరిగిన సంభాషణను గురించి ఈ క్రింది వివరణపత్రాన్ని దాఖలుచేశాడు.

"ఈరోజు ఆగష్టు 2వ తేది సాయంత్రం 5గం. వేళ నేను నా ఆలోచన మందిరంలో కెప్టెన్ సీటనుతో మాట్లాడాను. పాపయ్యను ప్రధాన దుబాషీగా చెయ్యడానికి నేను 500 వరహాలు లంచం పుచ్చుకున్నానని నీవు అన్నావట. ఎందుకు అన్నావని నేను అడిగాను. తాను అలా అన్నమాట నిజమే ననిన్నీ, మీరు ఏమిచేసినా ఏమి మాట్లాడినా మీ నౌకరులు బయట పెడుతూవుంటారనిన్నీ మీకు యెవ్వడూ స్నేహితుడు లేడనిన్నీ అతడు నాతో అన్నాడు. నేను ఏమి కొంటున్నానో, ఏమి అమ్ముతున్నానో నీకెందుకు? నీకు ఎలా తెలుసు? అని అడిగితే దానిని గురించిన సమాచారాలన్నీ తనకు ఎప్పటికప్పుడు తెలుస్తూ వుంటాయని చెప్పి కావలిస్తే కొన్ని ప్రశ్నలడుగుతాను జవాబు చెప్పండి" అని నన్నీ ప్రశ్నలడిగాడు.

ప్రశ్న: మీరు కొన్న ఒక పెద్ద వజ్రంలో తనకు భాగం ఇవ్వమని రాబర్ట్సు మీకు వ్రాశాడా లేదా?

జవాబు: అబద్ధం

ప్రశ్న: ఆ వజ్రం యాభైవేల డాలర్లకు విక్రయించి నందుకు ఒకాయనవచ్చి మిమ్ములను అభినందించాడా లేదా?

జవాబు: అబద్ధం.

ప్రశ్న: ఒక పెద్ద వజ్రాన్ని ఇచ్చివేయ వలసిందని అడగడానికి మీ దగ్గరికి దక్షిణపథాన్నుంచి ఇద్దరు ఆసామీలు వస్తే మీరు ఒకడికి 15 రూపాయీలు, ఇంకొకడికి 150 రూపాయిలు ఇచ్చి పంపారా లేదా?

జవాబు: అంతా అబద్ధం. ఒక్క మనిషే వచ్చాడు. అలాగ వచ్చిన దుర్మార్గుడిని నేను బాగా తిట్టివంపాను.

ఈ సంభాషణ జరిగిన తరువాత ఈ సీటను నన్ను మోసగించడానికి ప్రయత్నించినట్లే గవర్నమెంటును కూడా ఇతడు మోసగింపగలడని తోచి గార్డుల కెప్టెనును పిలిపించి సీటనును ఎన్‌సైన్ గదిలో పెట్టి వుంచవలసినదనిన్నీ, కౌన్సిలు వారిని తప్ప ఇంకెవ్వరినీ అక్కడకు రానివ్వద్దనిన్నీ ఉత్తర్వు చేశాను. పిట్టుచేసిన ఫిర్యాదును గురించి విచారించడానికి కౌన్సిలువారు సీటనును పిలిపించారు. వారు ఏమీ అడగకుండానే ఈ కంపెనీవారికి నష్టకరంగా ఈ పిట్టు ఒక గొప్ప వజ్రాన్ని కొన్నాడనే నేరం మోపడానికి తాను వచ్చాను అనిన్నీ, ఈ వ్యవహారం తప్పొప్పులన్నీ తనకు పూర్తిగా తెలుసుననిన్నీ, మళ్ళీ వచ్చేనెలలోనే పిట్టుగారు గవర్నరు పదవి మానుకొని క్రొత్తగవర్నరు వస్తాడు గనుక ఈ పిట్టుగారు తనను గురించి ఏమన్నా, తనతో ఏమి అన్నా తనకు లెక్కలేదనిన్నీ సీటను అన్నాడు. పిట్టును గురించి ఇంకా కొన్ని నేరాలు చెప్పాడు. అవన్నీ అబద్ధమని పిట్టుగారు అన్నారు. అంతట సీటనును రిమాండుచేసి ఖయిదులో ఉంచారు.

మరునటివారంలో అతనిని మళ్ళీ కౌన్సిలువారి ఎదుటకు పిలిపించారు. అప్పుడు ఆ సభకు పిట్టుగారే అధ్యక్షుడు. ఇంకా అక్కడ అరుగురు సభ్యులున్నారు. ఆ సభవారి 'కన్సల్టేషను' అనే సభ కార్యక్రమ వివరణను గవర్నరే వ్రాసినట్లు కనబడుతుంది. అందులో ఇలాగ ఉంది :

"2వ తేదీన గవర్నరుతో అతడు అన్న సంగతులను ఆ మర్నాడు గవర్నరు యెదుటను, కౌన్సిలుయెదుటకు అతడు అన్నమాటలున్నూ అతనికి చదివి వినిపించి ఆ నేరాలు రుజువు చెయ్యవలసిందని అడిగితే తాను గవర్నరుతోనూ, కౌన్సిలుతోనూ ఏమీ అనలేదని అబద్ధం ఆడాడు. ఇంకెవ్వరైనా ఇలాగ ప్రవర్తిస్తే మాకు ఆశ్చర్యంగా ఉండేదిగాని ఇతన్ని బాగా ఎరిగి ఉన్నందువల్ల ఇతడు ఎంత దుర్మార్గానికైనా తగినవాడని మాకు ధ్రువమైంది. ఈ ఖయిదీ చేసిన ఇంకా కొన్ని నేరాలను నిరూపిస్తూ గవర్నరు రెండు ఉత్తరాలను చూపించాడు. ఇంకా ఏమైనా చెప్పుకుంటావా అని అతణ్ణి మేము అడిగాము. చెప్పుకునేది ఏమీ లేదని అతడన్నాడు. అతడు వెళ్ళుతూ తనపైన మోపిన నేరాలేమీ తాను చెయ్యలేదన్నాడు. ఇతడు చెయ్యని దుర్మార్గం లేదు. ఈ పట్నానికి చాలాకాలంనుంచి ఇతడొక మహామ్మారిలాగ ఉన్నాడు. ఇతనివల్ల చాలామందికి అన్యాయం కలిగింది. శాంతికి భంగం కలిగింది. అంతటితో తృప్తిచెందక గవర్నరుకూ, ఈ బస్తీ వ్యాపారానికి కూడా నష్టం కలిగించడానికి ప్రయత్నిస్తున్నాడు" అని వ్రాసి అతనిని ఖైదులోనే వుంచి ఇంగ్లాండుకు పోయే మొదటి ఓడలో పంపివేయడానికి ఏకగ్రీవంగా తీర్మానించారు.

కొద్దిరోజులలోనే పిట్టుగారిని ఉద్యోగం వదలి సీమకు రమ్మనే ఉత్తర్వులతో హీత్కోటు అనే ఓడ వచ్చింది. ఆ ఓడలో సీటనునుకూడా నిర్బంధంలో ఉంచి సీమకు పంపివేయడానికి కౌన్సిలువారు నిశ్చయించారు. సీటను తనంతటతాను ఇంట్లోనుంచి రానన్నాడు. అంతట కొందరు సైనికుల సహాయంతో బలవంతంగా ఒక పడవమీద ఎక్కించి ఓడదగ్గరకు పంపించారు. సీటను ఓడనెక్కనని నిరాకరించాడు. ఓడలోకి ఎక్కించడానికి సహాయం చెయ్యవలసిందని ఓడ క్యాప్టనును కోరగా ఓడ నెక్కడానికి ఇష్టపడని వాళ్ళను తాను బలవంతం చేసి ఎక్కించుకోనని నిరాకరించాడు. సముద్రం మీదనున్న ఓడలో క్యాప్టనే సర్వాధికారి గనక చేసేదిలేక సీటను ఎక్కిన పడవ మళ్ళీ వెనక్కి వచ్చింది. ఈ రాజధానిలో నుంచి బయటికి పోవడానికి నీవే తగిన యేర్పాట్లు చేసుకోమని కౌన్సిలువారు సీటనుకు సెలవిచ్చారు.

## పిట్టుగారి అంత్యదశ

పిట్టుగారు ఇంగ్లాండుకు వచ్చినతరువాత మొదటిజార్జి రాజుగారినీ, ఆయన కుమారుణ్ణి దర్శించి వారికి తన వజ్రం చూపించారు. వాళ్ళు ఆనందించారు గాని కొనడానికి సొమ్ము లేదన్నారు. పిట్టుగారు మళ్ళీ పార్లమెంటు సభ్యుడైనాడు. అమెరికా దగ్గరున్న జమైకాకు గవర్నరుగా వెడతావా అని ప్రభుత్వం వారు ఆయన్ని అడిగారు. ఆయన ఆ వుద్యోగం నాకక్కరలేదన్నాడు. ఆయన అనేక జమీందారీలను చాలా జిల్లాలలో కొని వాటిని అభివృద్ధిచేశాడు. గొప్పగొప్ప ప్రభువులతో సంబంధాలు చేశాడు. తన గొప్పవజ్రం అమ్ముడుకాకపోయినా పరవాలేదు గాని అమ్ముడుపోలేదే అనే దుగ్ధ అతన్ని

బాధిస్తూనే ఉంది. ఎంతడబ్బుఉన్నా అతని ఆశకు మితిలేదు. బ్రతుకుమీదకూడా విసుగు పుట్టింది. తనకు అరవైనాలుగేళ్లు వచ్చినవి గాని తానెంతో కష్టపడి సంపాదించి ఎంతో ఆదుర్దాపడుతూఉన్న ఈ వజ్రం అమ్ముడుపోలేదు. ఇలా వుండగా 1717వ సంవత్సరంలో ఫ్రెంచి రాజ్యాన్ని రీజెంటు అనే బిరుదుతో పరిపాలించే ఆర్లియన్సు ప్రభువు ఆ వజ్రాన్ని 2000000 లివర్సు (125000 నవరసులు) అనగా రమారమి 1875000 రూపాయలకు కొన్నాడు. ఆ మొత్తంమీద నూటికి అయిదు చొప్పున తనకు కమిషను రావాలని ఈ వ్యవహారంలో చాలా కాలంనుంచి పిట్టుగారి ప్రతినిధులుగా పనిచేసిన సర్ స్టీఫెన్ ఈవాన్సుగారు కోరారు. ఆ కమిషను ఇవ్వనందువల్ల పిట్టుగారి మీద వ్యాజ్యం దాఖలైంది.

పిట్టుగారు తన 73వ ఏట 1726వ సం. ఏప్రిలు 28వ తేదీన మరణించాడు. తరువాత పదోనెలలో ఆయన భార్యాయున్నూ, 13వ నెలలో పెద్దకుమారుడున్నూ, మూడు సంవత్సరాలలో రెండవ కుమారుడున్నూ మరణించారు. పెద్ద కుమారుడి కొడుకే ఇంగ్లాండుకు ప్రధానమంత్రి అయిన విలియం పిట్టు. పిట్టుగారి మూడవ కొడుకూ, ఆయన కుమార్తెలు మనుమలను ఎత్తి ఆయన ఐశ్వర్యం అనుభవించారు.

## పిట్టు వజ్రం అసలు కథ

సర్ ఎడ్విన్ స్ట్రీటర్ అనే అతను "ప్రపంచంలోని గొప్పవజ్రాలు" అనే గ్రంథంలో పిట్టువజ్రం యొక్క చరిత్రను గురించి ఈ క్రింది సంగతులను వ్రాసి ఇవి యథార్థ మనడానికేమీ సందేహంలేదని అన్నాడు. 1701వ సంవత్సరంలో కృష్ణాజిల్లాలో పరిటాలగనులలో పనిచేసే ఒక బానిసకు ఈ వజ్రం దొరికింది. ఈ వజ్రాన్ని గనులలో నుండి బయటికి తీసుకు వెళ్ళడానికోసం వాడు తన పిక్కలో ఒక పెద్దగాయం చేసుకుని ఆ గాయంలోనే దానిని దాచి తీసుకుని వెళ్ళాడని ఒక వదంతిన్నీ, ఆ గాయం కట్టులో దాచాడని ఒక వదంతిన్నీ వున్నవి. ఈ వజ్రంకోసి సానపట్టక పూర్వం 410 క్యారట్‌ల ఎత్తు వుండేది. అందువల్ల ఇంత పెద్దరాయిని గాయంలో దాచినాడనడంకంటె కట్టుగుడ్డలలో దాచినాడనడమే సమంజసముగా వుంటుంది.

అమూల్యమైన ఆ వజ్రంతో ఆ బానిస పరారీ అయి సముద్రతీరం చేరుకున్నాడు. అతని దురదృష్టవశంచేతను వాడికొక ఇంగ్లీషు ఓడ క్యాప్టెన్ కనపడగా వాడు తన రహస్యం వాడికి చెప్పి తన నేదైనా దేశానికి తీసుకొనిపోయి వదలిపెట్టవలసినదనిన్నీ, తాను స్వేచ్ఛగా బ్రతుకుతాననిన్నీ, అందుకు ప్రతిఫలంగా ఆ వజ్రాన్ని అతనికి యిచ్చివేస్తాననిన్నీ ఆ క్యాప్టెన్‌ను బ్రతిమాలుకున్నాడట. అంత వెలగల గొప్పవజ్రాన్ని యిచ్చినందుకు తనకేదైనా కాస్త డబ్బుకూడా ఇవ్వవలసిందని ఈ బానిసవాడు ఆ ఇంగ్లీషు వాడిని కోరివుంటాడనడానికి సందేహము లేదు. ఆ క్యాప్టెన్ మొదట సరేనని అన్ని షరతులకూ ఒప్పుకొని బానిసను తన ఓడమీది కెక్కించుకొన్నాడు. వజ్రాన్ని చేజిక్కించుకొన్న తరువాత వాడికి దురుద్దేశ్యం కలిగి ఈ బానిసను సముద్రంలోకి తోసివేసి యెలాంటి చిక్కూ లేకుండా ఆ వజ్రం తనకు దక్కిందని సంతోషించాడు. తరువాత ఈ కెప్టెను

చెన్నపట్నం రేవులో సెంట్‌జార్జికోట గవర్నరైన థామస్ పిట్టుకు ఈ వజ్రాన్ని వెయ్యి నవరసులకు విక్రయించి ఆ సొమ్మును తన చిత్తం వచ్చినట్లల్లా ఖర్చుపెట్టేశాడు. తానా బానిసను ద్రోహంచేసి వాడిని చంపిన పాపం వాడి మనస్సును బాధిస్తూనే ఉంది. ఆ బానిసవాడు దయ్యమై తన్ను వెంబడిస్తూ వున్నట్లుగా భావిస్తూ దానిని మరచిపోవడానికి తెగత్రాగి చివరకు మతిచెడి ఉరిపెట్టుకొని చచ్చిపోయాడు.

అపూర్వమైన ఈ వజ్రంయొక్క పుట్టుక పూర్వోత్తరాలను గురించిన కథ పై విధంగా ప్రచారంలో వున్నదని స్ట్రీటరుగారు తమ గ్రంథంలో వ్రాస్తూ బహుశా ఆ ఓడ క్యాప్టెన్‌ను ఆ వజ్రాన్ని తిన్నగా పిట్టుగారికే విక్రయించి వుండడనిన్నీ, అప్పట్లో యీ దేశంలో చాలా ప్రఖ్యాతి చెందిన వజ్రాలవర్తకుడైన జామ్‌చందుకే వెయ్యినవరసులకు విక్రయించి వుంటాడనిన్నీ, ఆ జాముచందు దానిని పిట్టుగారికి ఇరవైవేల నవరసులకు విక్రయించి వుండవచ్చుననిన్నీ స్ట్రీటరు గారు తమ అభిప్రాయాన్ని ఆ పుస్తకములో వ్రాశాడు. స్ట్రీటరు గారి యీ గ్రంథము 1896లో ప్రకటించబడింది. ఈ వజ్రాన్ని తాను సంపాదించిన కథను గురించి పిట్టుగారు 1710 సంవత్సరములో వ్రాసివుంచిన సంజాయిషీ పత్రంలోని సంగతులు పిట్టుగారు, అతని కొడుకూ కూడా చనిపోయిన చాలాకాలానికి 1743లో లండను 'డెయిలీ పోస్టు' అనే పత్రికలో ప్రకటించబడినవి. ఆ సంజాయిషీపత్రం మళ్ళీ 1776లో జెంటిల్మెన్సు మాగజీనులోనూ, 1793లో యూరోపియను మాగజీనులోనూ ప్రకటించబడింది. స్ట్రీటరు గారు దానిని చదివి పై విధంగా ఆ కథలను సమన్వయం చేసి వుంటారుగాని ఈ పిట్టుగారి చరిత్రలోని సంగతి సందర్భాలన్నీ ఆయన చదివివుంటే ఎలా అభిప్రాయపడేవారో!

## పిట్టువజ్రం ఏమైంది?

ఈ రీజెంటు వజ్రం యొక్క తరువాత చరిత్రకూడా చిత్రమైనదే. 1722వ సంవత్సరములో ఫ్రెంచిరాజైన 15వ లూయీ పట్టాభిషేక సమయంలో ఆయన ధరించిన కిరీటంలో ఈ వజ్రాన్ని పొదిగారు. తరువాత ఫ్రెంచిదేశంలో ప్రజావిప్లవం జరిగినప్పుడు 1791లో జాతీయ మహాసభవారి ఉత్తర్వుప్రకారం తయారుచేయబడిన ఫ్రెంచిదేశ రాజకుటుంబము యొక్క ఆభరణాల జాబితాలో ఈవజ్రం కనబడుతూవుంది. తగిన ధరవస్తే దీనిని విక్రయిద్దామని జాతీయ మహాసభవారు నిశ్చయించారుగాని కొనేవారు కనబడలేదు. ఇంతలో తక్కిన ఆభరణాలతోపాటు దీనిని కూడా దొంగలు ఎత్తుకొనిపోయి ఒక చిన్నయింటి సరంబీలో దాచారు. కొంత కాలానికి ఫ్రెంచి ప్రజాస్వామికం అధికారులకు ఇది కనపడగా జాతీయ ధనాగారంలో వుంచారు. 1804లో మహావీరుడైన నెపోలియన్ చక్రవర్తి తనకు పట్టాభిషేకమైనప్పుడు దానిని తన ఖడ్గములో తాపించాడు.

నెపోలియన్ పదభ్రష్టుడైనప్పుడు ఆయన భార్య మేరీ లూయీ తక్కిన అమూల్యవస్తువులతోపాటు దీనిని తీసుకొని పోయింది. ఈ లోపుగా 18వ లూయీ ఫ్రెంచిరాజు కాగా ఆవిడతండ్రి ఆ వజ్రాన్ని ఆయనకు పంపించివేశాడు. నెపోలియన్ ఎల్‌బాదీవినుండి తప్పించుకొని మళ్ళీ చక్రవర్తి కాగా లూయీరాజు ఆ వజ్రంతో పరారి

అయి నెపోలియను వాటర్లూ యుద్ధంతో ఓడిపోయిన తరువాత దానితో ప్యారిసుకు వచ్చాడు. 1830లో 10వ చార్లెసు పట్టాభిషేకంలో ఆ వజ్రాన్ని అలంకరించుకొన్నాడు. మళ్ళీ ప్రజాస్వామికం స్థాపించిన తరువాత అది కొనేవారులేక ఫ్రెంచివారి ఖజానాలోనే పడివుంది. Memories of Madras by Sir Charles Lawson pp. 12-53 and 300.



# 3. దుబాషీ 'లంగరు' పాపయ్యగారు

ఇంగ్లీషువా రీ దేశానికి వర్తకంచేసుకోవడానికి వచ్చేటప్పటికి ఈ దేశము మొగలాయి చక్రవర్తి పరిపాలనలోనుంటూ ఉన్నందువల్ల ఇక్కడ పారశీభాష రాజభాషగా నుండేది. దేశభాషలలో హిందూస్థానీయే ఎక్కువ వ్యాప్తిలో నుండేది. విద్యాధికులైన హిందువులకు సంస్కృతము, పారశీభాషయున్నూ వచ్చి యుండేవి. మహమ్మదీయులకు పారశీ, అరబ్బీ భాషలు వచ్చియుండేవి. ఇంగ్లీషు వర్తకులకు దేశ భాషలు రానందువల్ల చాలా చిక్కుగా నుండేది. వారు వచ్చీరాని హిందూస్థానీ, పారశీ మాటలతో తమ వ్యవహారాలు జరుపుకునేవారు. తరువాత క్రమక్రమంగా కాస్త ఇంగ్లీషు నేర్చుకున్న దేశీయులను చేరదీసి వారిద్వారా తమ పనులు జరిగించుకునేవారు.

ఇంగ్లీషువారు మనదేశ రాజులను, నవాబులను ఆశ్రయించి వర్తక వ్యాపారాలు జరుపుకొంటూ, మెల్లగా వారి అంతఃకలహాలలో ప్రవేశించి రాజ్యతంత్రం జరిపి రాజ్యాక్రమణ చేయసాగినారు. క్రమక్రమంగా దేశంలో తమ ప్రభుత్వాన్ని స్థాపించ గలిగినారు. అయినప్పటికీ చాలా కాలం దాకా తాము బహిరంగముగా ప్రభువులమని ప్రకటించలేదు. మొగలాయి చక్రవర్తి దివానులుగా వ్యవహరించేవారు. తమ ఇంగ్లీషు భాషనుగాని, విద్యనుగాని వ్యాపింప చెయ్యడానికిన్నీ వారు ప్రయత్నించలేదు.

భారతదేశ ప్రజలలో విజ్ఞానాభివృద్ధి కలిగించడము కూడా కంపెనీ ప్రభుత్వమువారి విధాయకమని ఇంగ్లాండులోని పార్లమెంటు సభవారు 1813లో తీర్మానించి సాలుకు లక్ష రూపాయలు ఖర్చుచేయమని శాసించారు. అయినప్పటికీ కంపెనీవా రీ దేశంలో వెంటనే ఇంగ్లీషు విద్యావిధానాన్ని ప్రవేశపెట్టలేదు. ఈ దేశీయులలో సంస్కృతవిజ్ఞాన సాహిత్యములను వ్యాపింప చెయ్యవలెనా? పాశ్చాత్య శాస్త్రవిజ్ఞాన సాహిత్యములను వ్యాపింప చెయ్యవలెనా? అనే శుష్కవాదములతో చాలాకాలము జరిగింది. ఆఖరికి 1835లో విలియం బెంటింకుగా రీ దేశానికి గవర్నరు జనరలుగానున్న కాలములో మెకాలే మహాశయుని ధర్మమాయని ఈ దేశములో పాశ్చాత్య శాస్త్రవిజ్ఞానము, సాహిత్యము, ఇంగ్లీషు విద్యావిధానము స్థాపించుటకు నిశ్చయించారు. అయినప్పటికీ కంపెనీ సర్కారు తరువాత కొంత కాలమునకు గాని ఇంగ్లీషు నేర్పే పాఠశాలలను స్థాపించలేదు. ఈలోపుగా ఇంగ్లీషు నేర్చుకొన్నందువల్ల కంపెనీవారి కొలువులో ఉద్యోగములు దొరకుతాయనే ఆశతో దేశీయులు ఇంగ్లీషు విద్యకోసం పరితపించారు. కొందరు స్వయంకృషివల్ల కొద్దిపాటి

ఇంగ్లీషు నేర్చుకొని దొరల నాశ్రయించి ఉద్యోగాలు సంపాదించారు. ఇంగ్లీషు భాష ద్వారాను, విద్యాబోధనము ద్వారాను క్రైస్తవమత ప్రచారము చెయ్యడానికని మిషనరీలు కొందరు కొన్ని పాఠశాలలు స్థాపించినారు. అయినా చాలాకాలం వరకూ ఈ దేశ ప్రజలలో ఇంగ్లీషువిద్య వ్యాపించలేదు.

## దుబాషీలు - దివానులు

ఈ దేశములో కంపెనీ ప్రభుత్వము అమలుజరుగుతూ ఉన్న ప్రాంతాలలో కూడా 1834 వరకూ అన్ని వ్యవహారములూ పారశీకభాషలోనే జరిగేవి. కంపెనీవారు దేశీయ రాజులతోను, నవాబులతోనూ జరిపే ఉత్తరప్రత్యుత్తరములు, రాయబారములు, రాజ్య తంత్రములు పారశీభాషలోనే జరిగేవి. కంపెనీవారి రాజకీయ శాఖలోను, కచ్చేరీలలోను అన్ని వ్యవహారములు పారశీభాషలో జరుపవలసి వచ్చినందువల్ల వారికి సహాయం చెయ్యడానికి పారశీభాషలో మంచి ప్రావీణ్యము కలిగి, కొంచెము ఇంగ్లీషు కూడా తెలిసిన దేశీయులు కావలసి వచ్చేవారు. అందువల్ల కంపెనీవారు తమ వర్తక వ్యాపారాలలో దేశీయులను (ఏజెంట్లు) ప్రతినిధులుగా నియమించినట్లే తమ రాజకీయ వ్యవహారాలలో కూడా నెలజీతాలిచ్చి దేశీయమున్షీలను, గుమాస్తాలను, దుబాషులను, దివానులను నియమిస్తూ వచ్చారు.

1834లో విలియం బెంటింక్‌గారు ముందుగా కంపెనీ ప్రభుత్వంవారి రాజకీయ శాఖలోను, తరువాత తక్కిన శాఖలలోను, కచ్చేరీలలోను పారశీభాషను తీసివేసి ఇంగ్లీషునే రాజభాషగా చేశారు. అయినప్పటికి ఒక్కసారిగా పాతపద్ధతులు పారిపోలేదు. అప్పుడు కూడా పాఠశాలలో చదివి పరీక్షలలో తేరినవారికే ఉద్యోగాలిచ్చే పద్ధతి రాలేదు. ఆ మార్పు 1844లో జరిగినది.

దుబాషీయనేది రెండు భాషలు నేర్చిన వాడనే అర్థముగల 'ద్విభాషీ' యనే మాటకు రూపాంతరము. ఈ దుబాషీలు నేటి 'ప్రైవేటు సెక్రటరీ'ల వంటివారు. వీరు కంపెనీయుద్యోగులైన దొరలకు అంతరంగికులై, కార్యదర్శకులై వారు జరిగించే అన్ని రాజకీయ వ్యవహారాలలోను ప్రతినిధులుగా నుండి పనిచేసేవారు. తెలివితేటలు, శక్తి సామర్థ్యములు గల దుబాషీలకు చాలా పలుకుబడి, ఆదాయము కూడా ఉండేవి. సాధారణముగా వారికి నెలకు రు. 60-0-0లు మాత్రమే జీతము వుండినా ఆ కాలంలో కంపెనీ దొరలకు బహుమతులు, లంచములు, మామూళ్లు ఉండినట్లే వీరికి కూడా ధన సంపాదనకు చాలా మార్గములుండేవి. ఈ దుబాషీల యధికార గౌరవములు, ధనసంపాద నావకాశములు వారి యేలికయైన దొరల హోదానుబట్టి యుంటూ ఉండేవి.

## క్లైవుదొర దుబాషీ

భారతదేశములో ఆంగ్లరాజ్యస్థాపనకు దారితీసిన వాడని ప్రఖ్యాతిచెందిన రాబర్టు క్లైవు దగ్గర రామ్‌చంద్ అనే దుబాషీ ఒకడు ఉండేవాడు. ఈయనను దివాన్ రామ్‌చంద్ అనేవారు. ఇతడు క్లైవుదొరకు అంతరంగికుడై అతడు జరిగించిన రాజ్యతంత్ర వ్యవహారాలన్నింటిలోను పాల్గొని గొప్ప వ్యవహారవేత్తయని పేరు పొందినాడు.

ఆ కాలంలో కలకత్తాలోని కంపెనీ ప్రభుత్వం వారు మూర్షిదాబాదును రాజధానిగా బీహారు, ఒరిస్సా, వంగరాష్ట్రాలను పరిపాలించే నవాబుగారి అధికారానికి లోబడి కాలక్షేపం చేసేవారు. ఈ నవాబుగారు పేరునకు మొగలాయి చక్రవర్తి సుబేదారుడు అనగా రాజప్రతినిధి. కాని నిజానికి ఆయన సర్వాధికారములుగల స్వతంత్ర ప్రభువుగా నుండేవాడు. సుబేదారుడైన అలీవర్దీఖాను చనిపోగా ఆయన పెంపుడు కుమారుడైన సురాజ్ ఉద్దౌలా అనే యువకుడు 1756లో నవాబు అయినాడు. క్రొత్తనవాబుగారి అనుజ్ఞలేకుండా కంపెనీవారు కలకత్తాలో కోటను కట్టినందువల్లను, వారు ఆయన విరోధులతో కుట్రలు చేస్తూ కొందరికి ఆశ్రయంకూడా ఇచ్చినందువల్లను ఆయనకు కోపమువచ్చి వారిని దండించడానికి పూనుకొన్నాడు. కాశింబజారును, కలకత్తాకోటను నవాబుగారు పట్టుకునేటప్పటికి కంపెనీవారు దీనులై కాళ్లబేరానికి వచ్చారు. అప్పుడు కలకత్తాకు సేనాధిపతిగా వచ్చిన క్లైవు నవాబుగారితో రాజీ రాయబారాలు నడిపిస్తూ లోలోపల కుట్రలుచేయడం సాగించాడు. కలకత్తాలోని వర్తకుడైన ఉమచంద్‌కు అమితమైన ధనాశకల్పించి మూర్షిదాబాదులో నవాబుగారికి అంతరంగికుడుగా నున్న జగత్సేటు అనే కోటీశ్వరుడితో కుట్రచేసి నవాబుగారి మంత్రులకు, సేనాధిపతులకు మనస్సులు విరిచి తిరుగదీశాడు. నవాబుగారి బంధువుడున్ను, ముఖ్యసేనాధిపతిన్నీ అయిన మీర్జాఫరుకు మూర్షిదాబాదు సింహాసనం మీదనే అపేక్ష కల్పించాడు. క్లైవు పన్నిన కుటిల రాజ్యతంత్రం ఫలించినది. అంతట 1757లో జరిగిన ప్లాసీ యుద్ధములో మీర్జాఫరు స్వామిద్రోహము చెయ్యగా నవాబు ఓడిపోయాడు. మీర్జాఫరే నవాబుగారిని రహస్యంగా వధించినాడు.

అంతట మీర్జాఫరు నవాబు అయి కంపెనీవారి చేతులలో కీలుబొమ్మ అయినాడు. ఇందువల్ల కంపెనీ వారికి వంగరాష్ట్రములో చాలా పలుకుబడి కలిగి అమితమైన లాభములు పొందడానికి వీలైనది. ఈ సందర్భములో క్లైవు మీర్జాఫరు వల్ల లెక్కలేనంత సొమ్ము పుచ్చుకుని కోటీశ్వరుడైనాడు. కంపెనీలోని ఇతర దొరలు కూడా చాలా లాభములు పొందారు. పైనచెప్పిన కుట్రవల్ల తనమనోరథము సిద్ధించినా క్లైవు లిఖితమూలకముగా ఉమచంద్‌కు చేసిన వాగ్దానములు చెల్లించలేదు. పైగా అతనిపేర తాను వ్రాసియిచ్చిన పత్రము నిజమైనది కాదనిన్నీ, అతనికేమీ ఇవ్వనక్కర లేదనిన్నీ అన్నాడు. క్లైవు కపట నాటకమాడి తనను మోసగించినందుకు ఉమచంద్ గుండెపగిలి అతనికి మతిపోయింది క్లైవు చేసిన అన్యాయములను గురించి తరువాత పార్లమెంటువారు విచారించారుగాని ఏమీ చేయలేదు. ఇలాగ అన్యాయాలు చేసి అమితధనం సంపాదించడం ఆ కాలంలో పరిపాటిగా నుండేది*.

ఈ మూర్షిదాబాదు కుట్ర వ్యవహారాలలో క్లైవు దుబాషియైన దివాన్ రామచందున్నూ, కంపెనీవారి మున్షీయైన నవకృష్ణ దేవున్నూ క్లైవుకు చాలా బాగా తోడ్పడ్డారు.

ఈ సందర్భములో సురాజ్ ఉద్దౌలా అంతఃపురములోని ఖజానాలో నుండిన అరుకోట్ల రూపాయలను క్లైవుకు కనబర్చకుండా దివాన్ రామచందున్నూ, మున్షీ నవకృష్ణ

* చూడు బ్రిటిష్ ఇండియా చరిత్ర : దిగవల్లి శివరావు (పుటలు 149-165).

దేవున్నూ, మీర్జాఫరున్నూ కలిసి హరించినట్లు ప్రతీతి యున్నదని కొందరు ఇంగ్లీషు చరిత్రకారులు వ్రాసినారు. ఇది నిజమైనా కాకపోయినా కంపెనీవారి తరఫున పనిచేసిన సందర్భములో వీరు కొంతధనము సంపాదించుకొని భాగ్యవంతులైనమాట మాత్రము నిజము. రామచంద్‌కు అప్పట్లో నెలకి 60 రూపాయిల జీతం ఇచ్చేవారు. నవకృష్ణదేవు గారికి కూడా నెలకు 60 రూపాయిల లోపుగానే జీతం ఇచ్చేవారు. ప్లాసీయుద్ధం అయిన పదేళ్లకు రామచంద్ చనిపోయేనాటికి ఆయన దగ్గర ఒక కోటిరూపాయ లుండినట్లు తెలినది. నవకృష్ణ దేవుగారు తన తల్లి శ్రాద్ధకర్మ కొక్కదానికే తొమ్మిది లక్షల రూపాయలు ఖర్చు పెట్టగలిగినంత ఎక్కువ ధనము ఆర్జించినట్లున్నూ తెలినది.

## మున్షీ నవకృష్ణదేవు

నవకృష్ణదేవుగారు మౌలిక కాయస్త దేవశాఖ బ్రాహ్మణుఁడు. ఆయన తండ్రిగారి పేరు రామచరణదేవుగారు. వీరి అసలు కాపురస్థలం మూర్షిదాబాదు. రామచరణదేవుగారు పూర్వం మొగలాయీ ప్రభుత్వంలో మహబతుజంగు దగ్గర ఉద్యోగంచేసి, తరువాత కటకములో దివానుపని చేశాడు. వీరు కలకత్తా ఫోర్టు విలియం కోటదగ్గర గోవింద పురములో నుండేవారు. నవకృష్ణదేవుగారు పారశీభాషలో మంచిపాండిత్యము సంపాదించి కొద్దిగా ఇంగ్లీషుకూడా నేర్చుకున్నందువల్ల 1750లో కలకత్తాలో నౌక కంపెనీ యుద్యోగిగానున్న వారన్ హేస్టింగ్సు ఈయనను తనకు మున్షీగా ఏర్పాటు చేసుకున్నాడు. తరువాత ఆరు సంవత్సరములలో ఆయన తెలివి తేటలవల్ల కంపెనీవారికే మున్షీయై వారి వ్యవహారములను చాలా సమర్థతతో నిర్వహిస్తూ వున్నందువల్ల సురాజ్ ఉద్దౌలాతో క్లైవు జరిపిన రాయబారాలలోను, ఆయనను పదభ్రష్టుని చెయ్యడంలో జరిగించిన కుట్రలలోను క్లైవు నవకృష్ణదేవుగారిని ఉపయోగించుకున్నాడు. ఇతడును తనకర్తవ్యములను అతి సమర్థతతో నిర్వహించి కంపెనీవారి కృతజ్ఞతకు పాత్రుడైనాడు.

1765లో కలకత్తా గవర్నరైన క్లైవు దొరగారు మొగలాయి సామ్రాజ్యాధీశుడైన షా ఆలం చక్రవర్తిని అలహాబాదులో దర్శించి ఆయనవల్ల 1765లో కంపెనీవారికి బీహారు, ఒరిస్సా, వంగరాష్ట్రాలకు దివానిగిరీని సంపాదించిన సందర్భములో క్లైవుతో మున్షీగా వెళ్ళిన నవకృష్ణదేవుగారు చాలా చాకచక్యంతో పనిచేశాడు. చక్రవర్తిగారు క్లైవు వలలో పడినందువల్ల వంగరాష్ట్రము, బీహారు, ఒరిస్సా రాష్ట్రాలలో శిస్తులు వసూలుచేసి అమితమైన లాభం పొందే అధికారం కంపెనీవారికి లభించింది. నవకృష్ణ దేవుగారి తెలివి తేటలకు సంతోషించి క్లైవు ఆయనకు 1766లో చక్రవర్తి గారిచేత 'మహారాజా' అనే బిరుదున్నూ, రాజలాంఛనాలున్నూ ఇప్పించాడు.

1772లో వారన్ హేస్టింగ్సు కలకత్తా గవర్నరైన తరువాత నవకృష్ణదేవుగారి కింకా గొప్ప హోదాలు లభించినవి. ఇతడు కంపెనీవారి కొలువులో మున్షీదఫ్తార్ అనగా పారశీక కార్యదర్శి, అర్జీబేగీ దఫ్తార్ అనగా అర్జీలు చిత్తగించే కచ్చేరీ, కులవివాదములు పరిష్కరించే న్యాయస్థానము, కంపెనీవారి ఖజానా కొట్టు అధికారము, మాల్ అదాలత్ (24 పరిగణాల శిస్తువసూళ్ళ కలెక్టరు), తాశీల్ దఫ్తార్ మొదలైన గొప్ప ఉద్యోగాలుచేసి చాలా ధనం సంపాదించాడు.

ఈయన కంపెనీవారికి చేసిన సేవకు బహుమానముగా వారన్ హేస్టింగ్సు ఈయనకు 1778 లో కలకత్తాదగ్గర చుట్టానాట్టి తాలూకాదారీ గ్రామాన్ని జాగీరుగా ఇచ్చాడు. నవకృష్ణదేవుగారు కలకత్తాలో ప్రసిద్ధివహించిన సభాబజారు జమీందారీ వంశానికి మూలపురుషుడై మహాధనవంతుడని, గొప్పదాతయని, పండిత పోషకుడని ప్రఖ్యాతిజెంది 1797లో స్వర్గస్థుడైనాడు*.

## 'లంగరు' పాపయ్యగారు

అవధానం పాపయ్యగారు చెన్నపట్నంలో ప్రఖ్యాతి పొందిన ఒక దుబాషీ. క్రీ.శ. 1789 మొదలు 1890 వరకూ ఈయనపేరు మారుమ్రోగింది. పాపయ్యగారిది నెల్లూరు జిల్లా. వీరు ఆంధ్రవైదిక బ్రాహ్మణులు. ఈయన వీధిబడిలో చదివి తెలుగు వ్రాయడము, చదవడము, లెక్కలు నేర్చుకొని, కొద్దిగా సంస్కృతజ్ఞానము సంపాదించి ఆ కాలంలో స్వశక్తివల్ల పైకివచ్చిన దేశీయులందరి లాగనే పారశీ, హిందూస్థానీ భాషలున్నూ, కొంచెము ఇంగ్లీషున్నూ నేర్చుకొని చిన్నతనంలోనే జీవనం నిమిత్తము చెన్నపట్టణం చేరినాడు. అక్కడ తూర్పు ఇండియా వర్తక కంపెనీవారి కొలువులో పనిచేసే ఉద్యోగులనాశ్రయించి ఉమేదువారీచేసి మెల్లిగా ఒక చిన్న గుమాస్తాపని సంపాదించి తన తెలివితేటలవల్లను, శక్తిసామర్థ్యాలవల్లను 'కంపెనీ' దొరలను మెప్పించి పైకివచ్చి పెద్దహోదాను పొంది విశేషమైన ధనమును, పరువు ప్రతిష్ఠలను సంపాదించి పేరుపొందినాడు.

అవధానం పాపయ్యగారు చాలాకాలము చెన్నపట్టణంలోని కస్టమ్స్ ఆఫీసర్ అనగా సముద్ర సుంకముల యధికారి క్రింద రేవులోనికి వచ్చి లంగరువేసే ఓడల లెక్కలను వ్రాయు అంకరేజి అకౌంటెంటు ఉద్యోగము చేసినందువల్ల అయనను 'లంగరు' పాపయ్యగారని అనేవారు.

కంపెనీవారికొలువులో పెద్ద యుద్యోగులుగా నుండి అనేక రాజకార్యాలను చక్కబెట్టి చెన్నపట్టణం గవర్నరు 'కౌన్సిల్' అనే కార్యాలోచన సంఘములో సభ్యులుగా నుండి జాన్ హాలండ్, ఎడ్వర్డు హాలండ్ అనే ఇద్దరు అన్నదమ్ముల దగ్గర పాపయ్యగారు దుబాషీయైనాడు. ఈ దొరలు చాలా బలవంతులై 1789-90 మధ్య చెన్నపట్టణం రాజధానికి గవర్నరులుగా కూడా పనిచేశారు. పాపయ్యగారు వీరికి నమ్మినబంటుగా నుండి వీరికి అంతరంగికుడై నందువల్ల కొన్నాళ్ళు అయన ఆడినది ఆటగాను, పాడినది పాటగాను సాగినది. హాలండ్ సోదరులవల్ల ఎవరికేపని కావలసి వచ్చినా ముందుగా పాపయ్యగారిని ఆశ్రయించవలసి వచ్చేది. అయనకు ఇష్టం లేకపోతే ఆ దొరల దర్శనముకూడా దొరికేది కాదు.

పాపయ్యగారు చాలా గొప్ప వ్యవహారత, రాజ్యతంత్రజ్ఞుడు. కార్యసాధనలో అంతటివాడు లేడని పేరుపొందినాడు. చెన్నపట్టణంలో నుండిన దొరలందరికీ అతడు తలలో నాలుకలాగ ఉండి చాలా పలుకుబడి సంపాదించాడు. చెన్నపట్టణంలోని కంపెనీ ప్రభుత్వము వారు ఒక వంక కర్నాటక నవాబుతోను, హైదరాబాదు నవాబుతోను స్నేహం చేస్తూ ఇంకొకవంక ఫ్రెంచివారితోను, మైసూరు ప్రభువులైన హైదరాలీ టిప్పు

* The Modern History of Indian Chiefs, Rajahs, Zamindars etc. By Lokenath Ghose (1881) Calcutta. (P. P. 26-27; 90-94.)

సుల్తానులతోను యుద్ధముచేస్తూ రాజ్యమును, ధనమును సంపాదించడానికి రాజ్య తంత్రమును ప్రయోగిస్తూ ఉన్నరోజులవి. అందువల్ల ఆ కాలంలో కంపెనీవారి కొలువులో నున్న దొరలందరికీ బహిరంగముగాను, రహస్యముగాను కూడా చాలా అవకాశములు ఉండేవి. హాలండ్ సోదరులు చేసిన యుద్యోగము లన్నింటిలోను తమకు కలిగిన అవకాశములను వృథాపోనివ్వకుండా పూర్తిగా ఉపయోగించుకొని అనేక విధాలుగా విశేష ధనమును సంపాదించుకున్నారు. ఈలాంటి పరిస్థితులలో హాలండ్ సోదరులకు గుండెకాయగా నుండిన అవధానం పాపయ్యగారుకూడా ఆ కాలంనాటి దేశీయు లందరిలోను బలవంతుడై చాలా ధనమును సంపాదించి పేరు పొందడంలో ఆశ్చర్యం ఏమున్నది?

అవధానం పాపయ్యగారి పేరిట ఇప్పటికీ చెన్నపట్టణంలోని 'వెపేరీ' అనే పేటలో ఒకవీధి యున్నది. అయితే చెన్నపట్టణం చరిత్రలోని చాలామంది తెలుగు అయ్యలను అయ్యరులని వ్యవహరించినట్లే పాపయ్యగారిని కూడా పాపయ్యరు అని, ఆ వీధిని అవధానం పాపయ్యరు వీధియని అంటున్నారు.

## హాలండ్ సోదరుల కథ

1786 నుండి చెన్నపట్టణంలో గవర్నరుగా నుండిన సర్ ఆర్చిబాల్డు క్యాంబెల్‌గారికి 1788 చివరిభాగంలో జబ్బు చేసినందువల్ల ఆయన 1789, ఫిబ్రవరి 7వ తేదీన తన పదవికి రాజీనామానిచ్చి సీమకు వెళ్ళిపోవలసి వచ్చినది. అంతట గవర్నరు కౌన్సిలు కార్యాలోచనసభలో ఒకసభ్యుడైన జాన్ హాలండ్‌గారు తాత్కాలికంగా గవర్నరైనాడు. అయితే అతడు ఆరురోజులు మాత్రమే ఆ పదవిలో నుండి తరువాత తాను తొలగి ఆ ఉద్యోగాన్ని గవర్నరు కౌన్సిలులో నింకొక సభ్యుడును, తన సోదరుడు నైన ఎడ్వర్డు జే హాలండ్ గారి కిచ్చాడు. ఈ హాలండ్‌గారు 1789, ఫిబ్రవరి 13వ తేదీ మొదలు ఒక సంవత్సరంపాటు చెన్నపట్టణానికి గవర్నరుగా నున్నాడు.

హాలండ్ సోదరులిద్దరూ కూడా ఆ కాలములో కంపెనీ కొలువులో నుండిన చాలామంది దొరలలాగానే చాలా లంచగొండులుగా నుండి స్వలాభంకోసం చాలా అక్రమాలను చేసేవారు. వీరు అవినీతిపరులే గాక అసమర్థులు కూడాను. అందువల్ల వీరి హయాములో చెన్నపట్టణం ప్రభుత్వం చాలా అధ్వాన్నంగా నుండేది. కంపెనీ యుద్యోగులందరూ చెలరేగి లంచాలు పుచ్చుకుంటూ అనేక దుర్మార్గాలు చెయ్యడం ప్రారంభించారు.

హిందూదేశంలో దుష్టపరిపాలన చేసినందుకు పార్లమెంటులో విచారింపబడిన వారన్ హేస్టింగ్స్ తరువాత మన దేశానికి గవర్నరుజనరలుగా వచ్చిన కారన్‌వాలీసు ప్రభువు ఇక్కడి కంపెనీ ప్రభుత్వములోని అక్రమాలను, అన్యాయాలను నివారించి పరిపాలనా విధానాన్ని సంస్కరించడానికి నిశ్చయించాడు. అయితే చెన్నపట్టణం ప్రభుత్వం విషయములో వెంటనే చర్యతీసుకోవడానికి వీలులేకపోయింది. అందువల్ల 1802వ సంవత్సరము వరకూ కూడా ఇక్కడి ప్రభుత్వము దురాశకూ, దుష్పరిపాలనమునకూ పుట్టినిల్లుగానుంటూ అసమర్థమైనదిగాను కూడా వుంటూ వచ్చినది.

సీమలోనున్న కంపెనీ యజమానులైన డైరెక్టర్లు మొదటినుంచీ ఇక్కడ యుద్యోగులకు చాలా తక్కువ జీతాలు ఇస్తూ, వారు స్వంత వ్యాపారం చేసుకోవడానికి, మామూళ్లు వసూలు చేసుకోవడానికి అవకాశం యిస్తూ వచ్చారు. అందువల్ల చాలా అక్రమాలు జరుగుతూ వచ్చినవి. చెన్నపట్టణం ప్రభుత్వమంతా ఈ పద్ధతిమీదనే జరుగుతూ ఉన్నది. ఈ పద్ధతివల్ల కేవలమూ కంపెనీ డైరెక్టర్లకు మాత్రమే నష్టము కలిగినట్లైతే పరవాలేదు. దీనివల్ల ఇంగ్లీషుజాతికంతకూ కూడా నష్టముకలిగినది అని కారన్ వాలీసు 1790, డిశంబరు 31వ తేదీన ఇంగ్లాండుకు వ్రాశాడు. చెన్నపట్టణంలో హోలండ్ సోదరుల హయాము స్వార్థలాభంకోసం మంచి నేర్పరితనముతోను, అనుభవముతోను పన్నబడిన ఒక పెద్దవ్యూహముగా నుంటున్నదని కూ కారన్ వాలీసు 1789, ఆగష్టు 8వ తేదీన వ్రాసినాడు. (Rise and Fulfilment of British Rule - Thompson and Garratt, pp. 174, 176).

హోలండ్‌గారి కాలంలో మైసూరు ప్రభువైన టిప్పు సుల్తాను ఇంగ్లీషువారి ఆశ్రితుడైన తిరువాంకూరు రాజుమీదికి దండెత్తిరాగా హోలండ్ గారేమీ చేయక చూస్తూ ఊరుకున్నారు. కారన్ వాలీసు ప్రభువు టిప్పుసుల్తాను నెలాగైనా అణచివేయాలని నిశ్చయించుకొని యుద్ధానికి నెపంకోసం చూస్తూ వున్నాడు. టిప్పు తిరువాంకూరు మీదికి రాగానే అతనితో యుద్ధం ఆరంభమైనట్లు ఎంచకపోవడం తప్పు అనిన్నీ, తాను లోగడనే స్పష్టముగా సూచించిన ఉత్తరువులను ఉల్లంఘించడంలో చెన్నపట్టణం ప్రభుత్వం వారు చాలా తప్పు చేసినారనిన్నీ కారన్ వాలీసు కఠినంగా మందలించాడు. కంపెనీ వారితో తగాదా పెట్టుకోవాలనే ఉద్దేశ్యం టిప్పుసుల్తాను కెంతమాత్రమూ లేదనిన్నీ, ఏవైనా వివాదాలు ఉన్నట్లైతే సామరస్యంగా సర్దుబాటు చేసుకోవడానికి సిద్ధంగా ఉన్నాడనిన్నీ హోలండ్‌గారు కారన్ వాలీసుకు వ్రాశారు. టిప్పుసుల్తానుతో యుద్ధం చెయ్యడం చెన్నపట్టణంలోని గవర్నరు కార్యాలోచనసభకు ఇష్టంలేదు. కారన్ వాలీసుకు చాలా కోపం వచ్చింది. అంతట 1790, ఫిబ్రవరి 20వ తేదీన చెన్నపట్టణానికి సర్వసేనానిగా నియమింపబడిన సర్ విలియం మెడోస్‌గారిని టిప్పు సుల్తానుతో యుద్ధం చెయ్యవలసినదని ఉత్తర్వుచేస్తూ గవర్నరు జనరలుగారు హోలండ్ గారిని పనిలోనుంచి తొలగించి ఆయనస్థానే మెడోస్‌గారినే గవర్నరుగా పనిచేయమన్నారు. అంతేకాదు. ఈ హోలండ్ సోదరులు అక్రమాలు చేసినట్లు వీరిపైన వచ్చిన ఫిర్యాదుల నన్నిటినీ మెడోస్‌గారినే విచారింపమన్నారు.

ఆర్కాటునవాబు అని వ్యవహరింపబడే కర్ణాటక నవాబుగారికిని, కంపెనీవారికిని 1787లో జరిగిన సంధి ప్రకారము నవాబుగారు దేశరక్షణకోసము, శాంతిభద్రతల నిమిత్తము సాలుకు 9 లక్షల వరహాలున్నూ, తన ఋణముల తీర్మానం నిమిత్తం 12 లక్షల వరహాలున్నూ కంపెనీవారికి చెల్లిస్తూ యుద్ధసమయంలో తన ఆదాయంలో $^4/_6$ వంతున్నూ చెల్లించవలసి యున్నది. ఆ ప్రకారం తాను చాలా మొత్తములను హోలండ్‌గారి కిచ్చినాననిన్నీ, ఆయన తనకు రసీదు లివ్వలేదనిన్నీ, హోలండ్ గారికి తాను దఫాలవారీగా 5 లక్షల వరహాల నిచ్చినాననిన్నీ నవాబుగారు గోలపెట్టారు. హోలండ్‌గారు కంపెనీ సర్కారు తాలూకు సొమ్ము హరించడమేగాక యింకా చాలా లంచాలను పుచ్చుకొని ఎన్నో అక్రమాలను జరిగించినట్లు కూడా ఫిర్యాదులు వచ్చినవి.

ఈ హాలండ్ సోదరుల దగ్గర దుబాషీగానున్న అవధానం పాపయ్యగారు అన్ని విషయాలలోను వారికి సలహాదారుడుగాను, మద్దతుదారుడుగాను ఉన్నట్లు అయనపై కూడా ఫిర్యాదులు వచ్చినవి.

## హోలిబర్టన్ కథ

హాలండ్ సోదరులుచేసిన అక్రమాలను గురించి జరిగిన విచారణలో అవధానం పాపయ్యగారున్నూ, అతని సోదరుడైన అవధానం రామస్వామిన్నీ, శంకరపురం వెంకటాచలం సెట్టిన్నీ, ఒప్పెయ్యంగారున్నూ కలిసి చెన్నపట్టణంలో కంపెనీ వారి కొలువులో సీనియర్ మర్చంటు అనే హోదా ఉద్యోగం చేస్తూవుండి హాలండ్ సోదరులకు విరోధిగానున్న డేవిడ్ హోలిబర్టన్ దొరను నాశనం చెయ్యడానికి కుట్ర చేసినట్లును సాక్ష్యం వచ్చింది. ఈ హోలిబర్టన్ దొర ఆ కాలంలో చెన్నపట్టణం రెవిన్యూబోర్డు సభ్యుడుగా నుండేవాడు. ఇతడు చాలా మంచివాడు. హాలండ్ సోదరులు లంచగొండులై చేస్తూవున్న అక్రమాలకు హోలిబర్టన్‌గారు సహించలేక అనేక విషయాలలో వారు తలపెట్టిన చర్యలకు అడ్డుతగలడం ప్రారంభించాడు. అంతట వా రితనిమీద క్రోధం వహించి ఇతనిని ఎలాగైనా నాశనం చెయ్యాలని సంకల్పించి అవధానం పాపయ్యగారి సహాయంతో హోలిబర్టన్ గారిమీద అనేక అపనిందలు మోపి అందు కనుగుణములైన సాక్ష్యములను బనాయించి అతడు నేరస్థుడేయని తీర్మానించి అతనిని రెవిన్యూబోర్డు పనిలోనుంచి తొలగించి దూరంగానున్న అనారోగ్యకరమైన ఒక మారుమూల మన్యం ప్రదేశానికి బదిలీచేసి అనేక విధాలుగా బాధలుపెట్టారు.

పైన చెప్పిన సంగతులన్నీ హాలండు సోదరులు అక్రమాలను గురించి మెడోస్‌గారు చేసిన విచారణలో బయటపడిన మీదట అవధానం పాపయ్యగారిపైనను, తక్కినవారిపైనను ఈ కుట్రనేరము మోపబడినది. అంతట గవర్నరైన మెడోస్ గారి అధ్యక్షత క్రింద 1792లో 'క్వార్టర్ సెషన్సు' అనబడు న్యాయవిచారణ సభ సమావేశమై వీరి నేరముల విచారణ జరిగించినారు. అవధానం పాపయ్యగారు దోషియని న్యాయసభవారు నిర్ణయించి అయనకు మూడు సంవత్సరములు ఖైదున్నూ, పెద్దమొత్తము జుల్మానాయున్నూ విధించారు. ఇదిగాక ఆ కాలంలో ఇలాంటి నేరస్థులు ప్రజలు వస్తూపోతూ వుండే బహిరంగస్థలములలో 'పిల్లోరీ' అనబడే బోనులలో నొక గంటసేపు నిలిచి అవమానం భరించవలసి యుండేది. పాపయ్యగారి యందుగల గౌరవమునుబట్టి ఆ న్యాయస్థానంలో న్యాయాధికారికి సలహాదారులుగానుండే జూరీసభ్యులు దయ తలచి ఈ అవమానమును మాత్రం పాపయ్యగారు అనుభవించనక్కరలేకుండా మన్నించారు.

## ఆర్కాటు నవాబు బాకీ

పాపయ్యగారు ఖైదులోనుంచి విడుదలయై వచ్చిన తరువాత కూడా అయన రోజులు బాగాలేవు. ఆర్కాటు నవాబు గారి బాకీలను గురించి విచారణ జరిగి ఆ బాకీల సందర్భములో చెన్నపట్టణంలో నున్న గొప్ప గొప్ప దొరలంతాకలిసి చేసిన అన్యాయము లనేకములు బయటపడినవి. ఆ సందర్భంలో పాపయ్యగారిని, అయనవంటివారిని

మరికొందరినికూడా ఈ దొరలు తమ స్వప్రయోజనముకొరకు ఉపయోగించుకున్నట్లు, కొన్ని దుర్మార్గపు పనులు చేసినట్లున్నూ కూడా బయట పడినది.

1752-1795 మధ్య అర్కాటు నవాబుగా నుండిన మహమ్మదాలీ కుంపినీవారి స్నేహంచేసి చెడిపోయినవారిలో ఒకడు. ఇతడు రాజ్యకాంక్షచేత ఆంగ్లేయుల అండజేరి వారిని మెప్పించడానికని లంచములివ్వడానికిన్ని, భోగ విలాసాలకోసమున్నూ అమితధనము ఖర్చుపెడుతూవుండేవాడు. తన కొలువులో దొరలను నియమిస్తే కంపెనీవారికి ఎక్కువ గౌరవం కలుగుతుందని చాలామంది దొరలకు పెద్దపెద్ద జీతాలిచ్చి ఇంజనీర్లుగానూ, సైనికోద్యోగులుగానూ నియమించాడు. వారు చేసేపని యేమీలేకపోయినా వారెల్లప్పుడూ ఏవో కుట్రలు చేస్తూ నవాబులవల్ల సొమ్ములాగుతూ వుండేవారు.

కంపెనీవారివల్ల సైనికసహాయము కోరి అందుకోసమున్నూ, ఇంకా ఇతర ఖర్చుల కోసమున్నూ కంపెనీవారిదగ్గరను, కంపెనీ వుద్యోగులైన దొరలదగ్గరను, దేశీయుల దగ్గరను కూడా నవాబుగారు అత్యధిక వడ్డీలకు అప్పు పుచ్చుకునేవాడు. అధికారములోను దొరలు కొందరు శిఫారసులు చేస్తామని ఆశలు పెట్టిన్నీ, బెదిరించిన్నీ సాలుకు నూటికి 40 మొదలు 50 వంతుల చొప్పున వడ్డీలతో ప్రతిఫల శూన్యములైన ఋణపత్రములు కూడ అతనివల్ల వ్రాయించుకొన్నారు. బాకీల మొత్తం అమితంగా పెరిగిపోయింది. కొందరు దొరలు ఈ ఋణపత్రాల తీర్మానము నిమిత్తము ఆయన రాజ్యంలో కొన్ని భాగాలను తాకట్టు వ్రాయించుకొని ఆ రాజ్యభాగాలలో శిస్తులు వసూలుచేసే హక్కును తామే యిజారాలు పొంది రైతులవల్ల హెచ్చు శిస్తులు వసూలుచేస్తూ ప్రజలను పీడించేవారు. అలాంటి వారిలో 'బెన్‌ఫీల్డు' అనేదొర ఒకడు. అతడు తనకు నవాబు గారివల్ల 2,30,000 నవరసులు రావలసి ఉన్నదన్నాడు! ఇలాంటివారిని గవర్నర్లుకూడా సాధించలేకపోయారు. పైగా ఇందుకు అడ్డు తగిలినందుకు పిగట్టు అనే గవర్నరును చెన్నపట్టణంకంపెనీ ప్రభుత్వంవారి కార్యాలోచనసభ్యులే 1776లో పట్టుకొని ఖైదుచేశారు. అతడు ఖయిదులోనే మరణించాడు. పిగట్టు తరువాత గవర్నరైన రంబోల్డున్నూ, అతని తరువాత వచ్చిన వైట్ హిల్లున్నూ లంచగొండులై చాలామంది జమీందారులను అన్యాయం చేశారు. పాపం బ్రద్దలై 1781లో వీరిని పనిలోనుంచి తొలగించారు. ఆ కాలంలో చెన్నపట్టణం ప్రభుత్వం ఇలాంటి అన్యాయాలతో పుచ్చిపోయి వుండేది *(చూడు. కథలు - గాథలు మొదటి భాగం, చెన్నపట్టణం గవర్నరు దుర్గతి; నూటివీడు వ్యవహారం)*

1784 మొదలు 1804 వరకూ సాలు 1కి 4,80,000 నవరసులు చొప్పున బాకీలను తీర్మానంచేస్తూ వచ్చినా ఆర్కాటు నవాబుగారి బాకీలు తీరలేదు. నవాబుగారు వ్రాసిన ఋణపత్రాలమీద చెల్లించవలసిన వడ్డీలే సాలుకు 60 లక్షల 23వేల నవరసులుగా నుండి కంపెనీవారికి వచ్చేలాభానికి రెట్టింపు ఉన్నట్లు అంచనా తేలింది. చెన్నపట్టణంలో నున్న ఆంగ్లేయోద్యోగుల ఒత్తిడివల్లను, తమపూర్వీకుడు ఒకరి ఋణమున పడి చచ్చిపోయినాడని అపవాదు లేకుండా ఉండవలెనన్ని ఆర్కాటునవాబు మహమ్మదాలీ తదనంతరము నవాబులైన అయన పుత్ర పౌత్రులు ఆ ఋణపత్రములను తిరుగవ్రాస్తూ వచ్చారు. ఈ ఋణము మితిమీరిపోయినందువల్ల ఓమ్ దత్ ఉల్ ఉమ్రా నవాబుగారు

చనిపోయిన తరువాత 1801లో అయన రాజ్యాన్ని కంపెనీవారు వశంచేసుకొని ఆ బాకీలను సాలుకు 12 లక్షల వరహాలచొప్పున వాయిదాలమీద తీర్మానించడానికి నిశ్చయించారు. బాకీలు తీరుస్తారని తెలియగానే దొంగపత్రాలు బైలుదేరినవి. బజారులో ఇలాంటి ఋణపత్రాల క్రయవిక్రయాల వ్యాపారం సాగింది. ఆంగ్లేయులలో కంపెనీ ఉద్యోగాలు చేసేవారిలోను, సీమలోని డైరెక్టర్లలోను, చెన్నపట్నంలో వర్తకం చేసేవారిలోను అనేకులకీ వ్యవహారంలో సంబంధమున్నది.

ఆర్కాటు నవాబుగారి తాలూకు స్వంతబాకీలను పరిష్కరించే ముందు వాటి నిజానిజాలను పరిశీలించడానికని కుంపినీవారు 1805లో కమీషనర్లనే ఒక విచారణ సంఘమును నియమించి నవాబుగారివల్ల తమకు సొమ్మురావలసి వున్నదనే బాకీదారు లందరూ ఈ కమీషనరుల ఎదుట హాజరై తమ తమ ఋణపత్రాలను రుజువు చేసుకొనవలెనని నిర్ణయించారు. ఈ విచారణ సంఘములో లండనులోనుంచి మతి ముగ్గురు విచారణకర్తలను, వంగరాష్ట్రంలోనుంచి మతిముగ్గురు విచారణ కర్తలను నియమించి ఇక్కడివారిని సాక్ష్యసాధనములను విచారించి లండన్ కమీషనర్లకు రిపోర్టు పంపవలసినదని ఉత్తర్వు చేశారు. అంతట చెన్నపట్టణంలో సుప్రీముకోర్టు అడ్వకేటు జనరలుగారి అధ్యక్షత క్రింద నొక విచారణసంఘమేర్పడి ఈ విచారణ చేయడం ప్రారంభించినది. అనేక ఋణపత్రములను, సాక్ష్యసాధనములను వీరు పరిశీలించారు. చాలామంది సాక్షులను విచారించారు. నవాబుగారి బాకీలలో చాలాభాగము అబద్ధపు బాకీలని తేలినవి*. లేని బాకీలను ఉన్నట్లుగా చూపడానికి దొంగపత్రములు సృష్టింప బడడమే గాక వానిని రుజువుచేయడానికి కర్నాటక నవాబుగారి లెక్కపుస్తకములలో దొంగపద్దులును వ్రాయబడినట్లుకూడా ఈ విచారణవల్ల బయటపడింది.

## రాయరెడ్డిరావుగారు

రాయరెడ్డిరావుగారనే అయన కర్నాటక నవాబుగారి దగ్గర శిరస్తాదారుడుగా నుండేవాడు. అయన చాలా తెలివితేటలుగలవాడు. చాలాకాలమువరకూ నవాబు గారీయన చేతులలో నొక కీలుబొమ్మగా నుండేవాడు. రెడ్డిరావుగారికి చాలా పలుకుబడి, అధికారమూ ఉన్నందువల్ల నవాబుగారివల్ల లాభము పొందదలచిన వారందరూ గొప్ప దొరలు, ఆంగ్లేయోద్యోగులు కూడా అయన నాశ్రయిస్తూ వుండేవారు. ఈ రెడ్డిరావుగారి కాలంలో 'రాయజీ' గారనేవారు. అయన చాలా ధనం ఆర్జించాడు. ఈ రాయరెడ్డిరావుగారు దురుద్దేశ్యముతో బుద్ధిపూర్వకముగా దొంగ లెక్కలను తయారుచేయించినట్లు కొంద రాయనపైన కమీషనర్ల దగ్గర ఫిర్యాదుచేశారు. తా నేపాపము ఎరుగనిన్నీ, తానున్నట్లైతే దొంగపత్రాలు చలామణీ చేసేవారి దుర్మార్గం బయటపడుతుందని, తన నా పనిలోనుంచి తొలగించడానికే ఇలాంటి అబద్ధములను కల్పించారనిన్ని అయన పక్షమున వాదించారు.

రాయరెడ్డిరావుగారిమీద నేరాలు మోపినవారిలో ఈ బాకీల వ్యవహారంలో సంబంధమున్న దొరలకు అంతరంగికుడున్నూ, సలహాదారుడున్నూ అయిన అవధానం

* 1814 నాటికి రెండు కోట్ల నవరసుల బాకీలో ఒకకోటి తొంభై లక్షలు కేవలము అబద్ధమని తేలినది. మిగతా దానిలో ప్రతి మూడు కోట్లలో 30 లక్షలు మాత్రం నిజమనిన్నీ, తక్కినదంతా అబద్ధమనిన్నీ 1830లో తేలినది.

పాపయ్యగారొకడు. ఆర్కాటు నవాబుగారివల్ల ఈ పాపయ్య గారికి 46 వేల వరహాలు రావలసి యున్నదనిన్ని, ఆ బాకీ ప్రస్తుతం చెన్నపట్నంలో వర్తకం చేస్తూవున్న థామస్ ప్యారీ దొరకు సంక్రమించియున్నదనిన్నీ కమీషనర్ల యెదుట వాదన జరిగినది. ఆ బాకీకి నిదర్శనంగా చూపబడిన ఋణపత్రము నిజమైనది కాదనిన్ని, దానిని సృష్టించడంలో పాపయ్యగారికి సంబంధం ఉన్నదనిన్ని కమీషనర్లు నిర్ణయించారు.

అంతట పాపయ్యగారిని కూటసృష్టి (ఫోర్జరీ) నేరమునకు ప్రాసిక్యూటు చేయగలందులకు చెన్నపట్టణంలోని కంపెనీ ప్రభుత్వం వారు ఉత్తరువు చేశారు. కమీషనర్ల దగ్గర రాయరెడ్డిరావుగారు దాఖలుచేసిన ఋణపత్రమును గురించి విచారిస్తూ వుండగా అది కూటసృష్టియని పాపయ్యగారు వాదించారు. కాని ఆ సంగతిని రుజువు చెయ్యలేక పోయారు. అంతట పాపయ్యగారిని కుట్రచేసిన నేరమునకును, ఆయన సాక్షులను అబద్ధపు సాక్ష్యము లిచ్చిన నేరమునకును విచారించవలసినదని కమీషనర్లు 1808లో శిఫారసు చేశారు. పాపయ్యగారు ఆ కాలంలో చెన్నపట్నంలో ఉద్యోగ వ్యాపారాలు చేసే పెద్దపెద్ద ఆంగ్లేయ దొరల స్నేహమునకును, అనుగ్రహమునకును పాత్రుడుగా నుండినందువల్లను, వారందఱికిని ఆర్కాటు నవాబుగారి బాకీలలో భాగాలున్నందువల్లను వారందరూ ఇతని కీ కేసులో సహాయము చేయసాగారు. వారిలో అబ్బట్ (Abbot) దొరయొకడు. చెన్నపట్టణంలో స్వతంత్ర వర్తకుడుగా వ్యాపారం చేస్తూవున్న థామస్ ప్యారీ (Parry) దొర ఇంకొకడు. ఈ ప్యారీదొర కర్నాటక నవాబుక్రింద కొన్నాళ్లు సైనికాధికారి అనే పేరుతో నొక కందారాయడుగా నుండేవాడు. ఇతని దుర్మార్గపు చర్యలు చూసి కంపెనీ డైరెక్టర్లు ఇతనిని ఇంగ్లాండుకు పంపివేయవలసినదని చెన్నపట్నంలోని అధికారులకు తాకీదు లంపారుగాని ఇతడు బలవంతుడైనందువల్ల తప్పించుకొని తిరిగాడు.

## కూటసృష్టి - అబద్ధపు సాక్ష్యము

అవధానం పాపయ్యగారున్నూ, ఆయన స్నేహితులున్నూ కమీషనర్ల ఎదుట రాయరెడ్డిరావుగారు దాఖలు చేసిన ఋణపత్రము నిజమైనది కాదనిన్నీ, దొంగపత్రమనిన్నీ వాదించినా లాభంలేక వీరందరూ ఆ రెడ్డిరావుగారిని ఎలాగైనా సాధించవలెనని, నవాబు కార్యదర్శిగా నుండిన బాట్లీగారున్నూ (Battley) రెడ్డిరావుగారున్నూ కలిసి ఆ పత్రమును ఫోర్జరీ చేశారనే నేరమును మోపి వారిమీద ఒక ప్రయివేటు ఫిర్యాదును దాఖలుచేశారు. ఆ కాలంలో చెన్నపట్టణములో 'జస్టిస్ ఆఫ్ ది పీస్' అనే హోదాగల (మేజిస్ట్రేటు) న్యాయాధికారిగా నుండిన మెయిట్లాండ్ అనే దొర పాపయ్య గారి పార్టీవారికి స్నేహితుడు. ఆయన తన అధికారమును పురస్కరించుకొని రెడ్డిరావుగారిని, బాట్లీగారిని ఆ నేరములకు చెన్నపట్టణములో ఆ కాలములో నుండిన పరమోన్నత న్యాయస్థానమైన సుప్రీంకోర్టువారు సెషన్సులో విచారించేటట్లు ఉత్తర్వు చేశాడు.

నేటి హైకోర్టు సెషన్సు విచారణలో లాగనే ఆ కాలంనాటి సుప్రీముకోర్టు సెషన్సు విచారణలో కూడా నేరములు విచారించే న్యాయమూర్తికి తోడ్పడి దోష నిర్ణయము చేయగలందులకు జూరీ సభ్యులనే ప్రమాణ పురుషులు నియమించబడేవారు. రాయరెడ్డిరావుగారి దురదృష్టవశంవల్ల ఆయన కేసులో నియమింపబడిన జూరీ సభ్యులు

పాపయ్యగారికిని, అయన ఆంగ్లేయ మిత్రులకును వశవర్తులైనవారే అయినారు. ఇంక రెడ్డిరావుగారు తరవున ఆ కాలంలోనున్న సమర్థులైన ప్రభుత్వ న్యాయవాదులను పెట్టుకోదలచగా పాపయ్యగారున్నూ, అయన పక్షీయులైన నాబ్బట్, రోబక్, ప్యారీ దొరలున్నూ ప్రభుత్వమునకు సంబంధించిన వారెవ్వరూ అలాగ పనిచేయకూడదని ప్రభుత్వము వారికి తెలియపరిచారు. అంతట చెన్నపట్నం సుప్రీంకోర్టులో ప్రధాన న్యాయమూర్తి యెదట నీ కేసు విచారణ జరిగినది. మొదటి నుండిన్నీ పక్షపాతబుద్ధితోనున్న జూరీ సభ్యులు రెడ్డిరావుగారిని దోషియని తీర్మానించారు. అయితే ప్రధాన న్యాయమూర్తికిది అన్యాయపు తీర్పు అని తోచింది. అంతట రాయరెడ్డిరావు నిర్దోషియని తాను నమ్ముతున్నానని చెప్పి అతనిని శిక్షించడానికి నిరాకరించాడు.

ఈ సుప్రీముకోర్టులోనే కూటసృష్టిచేసిన నేరమునకు అబద్ధపు సాక్ష్యము చెప్పిన నేరమునకు అవధానం పాపయ్యగారిని, ఆయన సాక్షులను విచారించవలసినదని కమీషనర్లు శిఫారసు చేసిన రెండవ కేసులో పాపయ్యగారిని, సాక్షులను నిర్దోషులని జూరీ సభ్యులు తీర్మానించారు. పాపయ్యగారు రెడ్డిరావుగారి పైనను, నవాబుగారి కార్యదర్శిగా నుండిన బాట్లీ (Battley) గారి పైనను దాఖలుచేసిన కేసులో వారిని దోషులుగా నిర్ణయించినది ఈ జూరీసభ్యులే. పాపయ్యగారును, ఆయన పక్షీయులైన దొరలును ఎంత బలవంతులుగా నున్నారో దీనినిబట్టి మనం ఊహించవచ్చును. అంతట ఈ పార్టీవారు విజృంభించి తమ చర్యలను సమర్థించుకొంటూ నవాబు బాకీల నిజానిజములను విమర్శిస్తూ ఉన్న కమీషనర్లు పక్షపాతబుద్ధితో నున్నారనిన్నీ ఆ విచారణను వారు చేయరాదనిన్నీ గవర్నరు జనరలుకు తమ అసమ్మతిని తెల్పుతూ ఒక మహజరును పంపించారు. అయితే ఇంతలో పాపయ్యగారి పార్టీవారికి క్రొత్త చిక్కులు వచ్చినవి. పాపయ్యగారికి కొందరాంగ్లేయులు సహాయము చేసినట్లే దొంగపత్రాల నన్నింటినీ బైటికి తీయాలని ప్రయత్నిస్తూ ఉన్న దొరలపార్టీ కూడా ఒకటి బైలుదేరి గట్టిగా పాటుపడడం ప్రారంభించినది. ఈ పక్షీయులలో తరువాత అర్బుతునాటు కంపెనీ అని ప్రసిద్ధిజెందిన లాటర్‌కంపెనీ (Lotour & co) వారున్నూ బిన్నిజెనిసన్ కంపెనీవారున్నూ, హారింగ్టన్‌టల్లాక్ కంపెనీ వారున్నూ ఎస్. హెచ్. గ్రిగ్గు డిప్రైసు కంపెనీవారున్నూ ఉండి గట్టిగా పనిచేశారు.

## ఉపసంహారము

అబ్బట్ గారును ప్యారీగారును కొంత తొందరపడి కమిషనర్లను భయపెట్టదలచి నావలమీద సుప్రీముకోర్టులో క్రిమినలు కేసు దాఖలుచేస్తామని బెదిరించారు. అంతట గవర్నరైన బార్లోగారు వీరి యక్రమచర్యలనుగురించి కొంత చర్యతీసికొనవలసి వచ్చినది. రోబక్‌దొరను చెన్నపట్టణంలో నున్న ఉద్యోగంలోనుంచి తీసివేసి విశాఖపట్టణానికి బదలాయింపు చేశారు. మెయిట్లాండ్ దొరను జస్టిస్ ఆఫ్ ది పీస్ ఉద్యోగంలోనుంచి తొలగించారు. థామస్ ప్యారీదొరను ఇంగ్లాండుకు పోవడానికి సిద్ధముగా నుండవలసినదని గట్టిగా ఉత్తరువు చేశారు. కాని అతడు చాలా పలుకుబడికలవా డైనందువల్ల మళ్లీ తప్పించుకోగలిగాడు. అవధానం పాపయ్యగారివల్ల తనకు సంక్రమించినట్లు ప్యారీగారు వాదించిన ఋణపత్రము బాకీమాత్రము త్రోసివేయబడినది. పాపయ్యగారి మీది కేసు

మళ్ళీ విచారణ జరగడానికి సిద్ధంగానుండగా 1809వ సంవత్సరం ప్రారంభంలో పాపయ్యగారు చనిపోయారు.

ఆర్కాటు నవాబుగారి బాకీలనుగురించి చేస్తూఉన్న విచారణను పూర్తిచెయ్యాలని కమీషనర్లు అనుకుంటూ వుండగా రాయరెడ్డిరావుగారిమీద అదివర కారోపింపబడిన నేరాల నతడు చెయ్యకపోయినా అతడుకూడా ఆ బాకీల విషయంలో కొన్ని అక్రమాలను చేసినట్లు బయల్పడినది. అంతట తనకు పరాభవము జరుగుతుందని భయపడి ఆత్మహత్య చేసుకొని చనిపోయాడు.

ఈ రెడ్డిరావుగారున్నూ, పాపయ్యగారున్నూ కొన్ని దొంగపత్రాలను చలామణిలో పెట్టినందుకు సందేహములేదు గాని నిజానికి ఆ కాలంలో పేరుపొందిన పెద్దపెద్ద ఆంగ్లేయ కంపెనీల దొరలలో చాలామందికీ వ్యాపారములో భాగాలున్నవని స్పష్టముగా కనబడినది. కమీషనర్లు ఈ బాకీల విచారణ పూర్తిచేసేసరికి వారు పరిశీలించిన నవాబుగారి బాకీలమొత్తం రెండుకోట్ల నవరసులలో కోటి తొంబై లక్షల బాకీ అబద్ధమని తేలినది. తరువాత మళ్ళీ జరిగిన విచారణలో ప్రతిమూడు కోట్ల బాకీకి 30 లక్షలు మాత్రం నిజమైన వనిన్నీ, మిగతా బాకీలన్నీ అబద్ధపు బాకీలనిన్నీ తేలినది.

## పాపయ్యగారి కీర్తి - అపకీర్తులు

పాపయ్యగారిని గురించి అనేక కథలు బయలుదేరినవి. సుప్రసిద్ధ ఆంగ్లేయ నవలాకారుడైన సర్ వాల్టర్‌స్కాటు రచించిన 'సర్జన్సు డాటర్' అనే నవలలో పాపయ్యయనే దుబాషీ పాత్రను ఒకదానిని చిత్రించి అవధానం పాపయ్యగారి పేరును చిరస్థాయిగా చేశాడు. స్కాటుతండ్రి తల్లికి చెన్నపట్నంలో పనిచేసి పాపయ్యగారి కుట్రవల్ల దెబ్బతినిన హాలిబర్టన్ దొర బంధువుడు. ఈ సందర్భములో పాపయ్యగారిమీద వచ్చిన కేసును గురించి ఇంగ్లీషులో నొక కరపత్రము ప్రకటించబడి యుండెను. దానిని స్కాటుగారు చదివి యుంటాడనడానికి సందేహంలేదు. స్కాటుగారి నవల 1827లో ప్రకటించబడినది.

ఈ పాపయ్య ఒక దుబాషీయనిన్నీ కార్యాలోచనసభ (కౌన్సిలు) అధ్యక్షుడు ఇతనిద్వారా దేశీయ రాజులతో రాయబారాలు జరుపుతూ వుండేవాడనిన్నీ, ఈ పాపయ్య చాలా జిత్తులమారియైన హిందువుడనిన్నీ, ఘోరమైన వన్నాగాలను వన్నడంలో మొనగాడనిన్నీ, స్వలాభం కోసమో రాజకార్యాలను సాధించడం కోసమో బీదలజీవనమును పడగొట్టడానికిగాని, ధనికుల సౌఖ్యమును భంగపరచడానికిగాని, స్త్రీల మానమును చెడగొట్టడానికిగాని వెనుదీయడనిన్నీ ఇలాంటి పాతకములు చేయుటవలన మొగముమీద నేర్పడిన ముడతలుగల కుటిల రాజనీతిజ్ఞుడనిన్నీ, పగదీర్చుకొనుటలో త్రాచుపామువంటి వాడనిన్నీ స్కాటు వర్ణించాడు.

ఆర్కాటు నవాబుగారి బాకీల విచారణ సందర్భంలోను, పాపయ్యగారి కేసులోను, రెడ్డిరావుగారి కేసులోను విచారింపబడిన సాక్షుల వాఙ్మూలములవల్లను పాపయ్యగారు కొన్ని అక్రమాలను చేసినట్లు కనబడినప్పటికీ అతడు స్కాటు మహాశయుడు చిత్రించినంతటి ఘోరపాతకములు చేసిన దుర్మార్గుడు కాడు. అతడు జరిగించిన చర్యలలో చాలా భాగము తన స్వలాభముకోసం బుద్ధిపూర్వకంగాచేసిన అక్రమాలుగాక తన

యేలికలైన దొరల యిష్టప్రకారంగా వారి లాభంకోసం చేసినవే. పావయ్యగారి యజమానులైన హాలండ్ సోదరులేగాకా ఆ కాలంలో చెన్నపట్టణంలోని కంపెనీసర్కారు కొలువులోనుండిన దొరలలో చిన్న ఉద్యోగులు మొదలుకొని పెద్దవారివరకూ అందరూ ధనాశావరులే. అందరూ లంచగొండులే. అప్పట్లో కంపెనీవారి కొలువులోనుండిన దొరలేగాక స్వంతంగా వర్తకం చేస్తూవున్న దొరలు, నవాబుగారి కొలువులోచేరిన దొరలుకూడా అలాంటివారే. ధనార్జనకోసం వీరెన్ని అక్రమాలనైననూ, ఎన్ని దుర్మార్గములనైననూ చేయడానికి వెనుదీయని వారనే సంగతి ఆర్కాటు నవాబుగారి బాకీల విచారణవల్లను, తరువాత నూజివీడు జమీందారుల బాకీల విషయంలో జరిగిన విచారణవల్లను బయటపడినది. ఈ దొరలు చేసిన అన్యాయాల సంగతి పార్లమెంటుదాకా పోయింది. వారుచేసిన దుర్మార్గాలలోను, కుట్రలలోను వారి యడుగులకు మడుగులొత్త వలసిన తాబేదారుడైన పావయ్యగారుకూడా పాల్గొని కొంతపాపం పంచుకొనడంలో ఆశ్చర్యం ఏమున్నది.

ఈ దొరల దుర్మార్గాలు బయటపడేటప్పటికి వీరు తమ బాధ్యతను తప్పించు కునేటందుకు ఆ అన్యాయాలన్నింటినీ పావయ్యగారి నెత్తిపైన రుద్దారు. పావయ్యగారు పాపాలన్నింటికీ భైరవుడైనాడు. సహజంగా ఈ యక్రమాలను గురించి విచారించిన దొరలున్ను, వీటిని గురించి వ్రాసిన ఆంగ్లేయ చరిత్రకారులును తమ తోడిదొరలు చేసిన దుర్మార్గములను సాధ్యమైనంతవరకు తగ్గించి చెప్పి ఈ దుబాషీ పావయ్యగారును ఆయనలాంటి నల్లవారును ఆ దుర్మార్గములకు కారణభూతులైనట్లు వ్రాయసాగినారు. అందువల్లనే స్కాటుగారు తన నవలలో పావయ్యగారిని మనుష్యరూపంలోనున్న ఒక రాక్షసునిగా చిత్రించినారు. ఈ విషయంలో పావయ్యగారికి చాలా అన్యాయం జరిగినదని అంగీకరించక తప్పదు.

అవధానం పావయ్యగారు పైకి ఎంత లౌకికుడుగా కనబడినా నిజానికి అతడు నియమము, నిష్ఠగల వైదికబ్రాహ్మణుడే. అతడు పాపభీతిలేని పాషండుడుకాడు. ఆయన ఆహార విహారములందు, ఆచార వ్యవహారములందు కేవలము పూర్వాచారపరుడుగా నుండేవాడు. అతడు సంస్కృతవిద్యను, విద్వాంసులను గౌరవించేవాడు. అతడనేక అపూర్వ సంస్కృత గ్రంథములను ప్రోగుచేసి ఆ కాలంలో అచ్చులేనందువల్ల వాటికి ప్రతులను వ్రాయించి, కొన్నింటిని తెలుగులో అనువదింపజేశాడు.

ఆయన గ్రంథ సముదాయములలో* స్కాందమనే అపూర్వగ్రంథమున్నట్లున్నూ, అందులోని ఆరు సంహితలలో నొకటైన శంకర సంహితను పావయ్యగారు చక్కని నిర్దుష్టమైన తెనుగు పద్యములలోని కనువదింపజేసినట్లున్నూ, తరువాత కొంతకాలానికి చెన్నపట్టణం సుప్రీంకోర్టు ఇంటర్ ప్రిటరైన ఏనుగుల వీరాస్వామయ్యగారు సుప్రసిద్ధాంధ్ర భాషా సేవకుడైన సి.పి. బ్రౌనుగారికి వ్రాసిన 15-12-1831వ తేదీగల ఉత్తరమువల్ల తెలుస్తున్నది. *(చూడు. ఏనుగుల వీరాస్వామయ్యగారి కాశీయాత్ర చరిత్ర పుట. 10)*

---

* Trial of Avadhanam Papaiah (1825) History of Madras - By Prof. C.S.Srinivasachari. pp. 197-198, 210-212.

ఈ స్కాందము యొక్క వివరములను తాము 'లంగరు' పాపయ్యగారి భార్యను, కొమాళ్ళను అడిగి తెలుసుకున్నట్లున్నూ, అందులో సనత్కుమార సూర్య, బ్రహ్మ, వైష్ణవ, శంకర, సౌర, సగుంహితలనే ఆరు సగుంహితలు 50 కాండలు ఒక లక్ష గ్రంథమున్నట్లును, వాటిని తాము తెచ్చినట్లున్నూ కూడా వీరాస్వామయ్యగారు వ్రాసినారు. దీనినిబట్టి పాపయ్యగారు సంస్కృతాంధ్ర భాషలలో మంచి పాండిత్యము గలవాడనిన్నీ, వైదిక మతాభిమానము కలవాడనిన్నీ, భాషాపోషకుడనిన్నీ తెలుస్తున్నది.



# 4. పన్నాబాయి - లక్ష్మీ సోదెమ్మ

## మేవాడు రాజవంశాన్ని కాపాడిన పన్నాబాయి

విక్రమశకం 1591 అనగా క్రీస్తు శకం 1535లో రాజపుత్రస్థానంలో చిత్తూరును రాజధానిగా చేసుకొని మేవాడు రాజ్యాన్ని పరిపాలించిన విక్రమజిత్తు రాణాసంగుని కుమారుడు. రాణాసంగు డెంత ప్రజానురంజకుడో విక్రమజిత్తు డంత ప్రజాకంటకుడై పరిపాలించాడు. రాజాస్థానంలోనున్న రాజపుత్రులందరూ అతనిని ద్వేషించి అతనిని పదభ్రష్టుణ్ణి చెయ్యాలని సంకల్పించి వనవీరుడనే రాజపుత్రుణ్ణి చిత్తూరు రాజ్య సంరక్షకుడుగా నియమించారు. అంతట వనవీరుడు విక్రమజిత్తును వధించి తానే రాజ్యాన్ని ఆక్రమించాడు.

విక్రమజిత్తు చనిపోయేనాటికి అతని సవతితమ్ముడైన ఉదయసింగు ఆరేళ్ళ పసిబాలుడు. తల్లిలేని పిల్లవాడైనందున తనను ప్రేమతో పెంచుతూఉన్న పన్న* యనే దాదినే తన తల్లియనిన్నీ, తన ఈడువాడైనా ఆమెపిల్లవాడిని తన సోదరుడనిన్నీ అనుకునేవాడు. పన్న దాసియైనా చాలా ఉత్తమురాలు. కొన్ని తరాలనుండి నమ్మకంగా మేవాడు రాజవంశం వారి సేవచేస్తూ వున్నందువల్ల క్షత్రియుల సద్గుణము లలవడిన మంచి వంశములో పుట్టి పెరిగింది. ఆమెకు రాణాసంగుని వంశమంటే భక్తివిశ్వాసాలున్నవి. ఉదయసింగును తన కుమారుడికంటె ఎక్కువగా చూచుకుంటూ పెంచుతూవుంది.

వనవీరుడు విక్రమజిత్తును వధించాడని తెలియగానే రాజ్యకాంక్షచేత ఈపని చేసినవా డీయుదయసింగును మాత్రం బ్రతకనిస్తాడా అని పన్నకు తోచింది. ఒకమూల ఇంకా విక్రమజిత్తు భార్యలు ఏడుస్తున్నారు. అంతఃపురమంతా గగ్గోలుగా నున్నది. ఆలోచించడానికైనా వ్యవధిలేదు, అప్పుడే రాత్రియైనది. ఉదయసింగూ, తన పిల్లవాడూ ఒకరి ప్రక్క నొకరు పడుకొని హాయిగా నిద్రపోతున్నారు. వారిని చూడగానే పన్న గుండె నీరైంది. ఇప్పుడో ఇకనో వనవీరుడు వచ్చి ఈ ఉదయసింగును వధిస్తాడని ఆవిడకు

* బ్ర॥శ్రీ॥ చిలకమర్తి లక్ష్మీనరసింహ కవిగారు తమ రాజస్థాన కథావళిలో ఈమె పేరు 'పున్న' యని వాడినారు. చూడు : ఉదయసింగుకథ.

రూఢియైనది. అంతట ఆవిడ మనస్సుకు ఒక ఉపాయం తట్టింది. కాని ఆ ఆలోచన కలిగేటప్పటికి ఆవిడకు వళ్ళు ఝల్లుమన్నది. ఉదయసింగు, తన పిల్లవాడు ఒకే యీడువారు. ఒకే పోలికగా ఉంటారు. రాజకుమారుణ్ణి రక్షించాలంటే తన కుమారుణ్ణి బలియివ్వాలి! ఇంతకు తప్ప వేరే ఉపాయంలేదు! ఈ తలంపు కలుగగా వన్నగుండె కొట్టుకున్నది.

ఏమి చేద్దామన్న ఆలోచించడానికి వ్యవధిలేదు. అంతఃపురంలో హాహాకారాలు చెలరేగినవి. వనవీరుడు కత్తిపుచ్చుకొని వధించడానికి వస్తున్నాడని పన్నకు తోచింది. ఈ మేవాడు రాజ్యానికి కులదీపం ఈ ఉదయసింగు; అతడు బ్రతికివుంటే మళ్ళీ ఎప్పటికైనా చిత్తూరు రాజు కాగలడు. ఆ పిల్లవాడి ప్రాణం కాపాడాలి. పన్న తనగుండె రాయి చేసుకుంది. తన కన్నకొడుకును బలియిచ్చి రాజకుమారుణ్ణి రక్షించడానికి పూనుకుంది. వెంటనే నిద్రపోతున్న ఉదయసింగు బట్టలు తీసివేసి తన పిల్లవాడి బట్ట లతడికి తొడిగింది. ఉదయసింగు నిద్రలేవలేదు. అతణ్ణితీసి ఒక పెద్ద గంపలో పెట్టి కొన్ని ఆకులు కప్పి పైన కొన్ని పండ్లు పెట్టి రాజకుమారుడికి, తనకు అన్నం తెచ్చిపెట్టే వంటవాడైన మంగలిని పిలిచి ఆ గంప తీసుకొనివెళ్ళి తాను వచ్చేవరకూ ఊరిబయట నదీతీరాన యిసుక తిప్పలో కూర్చోమన్నది. జగన్నాథక్షేత్రంలో లాగనే రాజపుత్ర స్థానంలోని సంస్థానాలలో వంటవాళ్ళందరూ మంగలి కులస్థులు. వారు చాలా నమ్మకంగా వుంటారు. ఆ మంగలి పన్న చెప్పిన ప్రకారం ఆ గంపతీసుకొని బైలుదేరినాడు. మిగిలిన అన్నం, కూరలు తీసుకొని పోతున్నాడు కాబోలునని కావలివారు అటకాయించలేదు.

అక్కడ అంతఃపురంలో పన్న రాజకుమారుడి బట్టలూ, నగలూ తన కుమారుడికి తొడిగిందో లేదో ఇంతలో వనవీరుడు కత్తిపుచ్చుకొని వచ్చి "నీవు పెంచుతూఉన్న రాజకుమారుడేడీ?" అని అడిగాడు. పన్న నిలువునా నీరై పోయింది. తన కుమారుడికి ఆయువు చెల్లిపోయినదని అవగతమై అతనికి జవాబు చెప్పలేక కొంతసేపు నిశ్చేష్టురాలై తరువాత ధైర్యము తెచ్చుకొని నిద్రపోతూవున్న తన కుమారుడి వైపునకు చేతితో చూపించింది. వనవీరుడా పిల్లవాడి తల నరికివేశాడు. పిల్లవాడు ఆ తల్లి ఎదుటనే మరణించాడు. వనవీరుడు రాజ్యం నిష్కంటకమైనదనుకొని వెళ్ళిపోయాడు.

ఆ పిల్లవాడికి రాజకుమారుడి రీవికి తగినట్లుగా దహన క్రియలు జరిపారు. పన్న ఏడ్పుచూసి పాపం రాజకుమారుణ్ణి పెంచిన ప్రేమ అని అనుకున్నారేగాని ఆవిడ తన గర్భశోకమే అనుభవిస్తూ వున్నదని తెలుసుకోలేదు. తరువాత పన్న కోట వదలి ఊరి వెలుపలకు పోయి రాజకుమారుడిని తీసుకొని చిత్తూరు రాజ్యమున కిదివర కనేకమారులు అఖండమైన సేవచేసిన దేవలనగర రాజైన బాగ్జీగారి కుమారుడి దగ్గరకు తీసుకొనిపోయింది. అత డావిడను, పిల్లవాడిని ఆదరించాడు; కాని వనవీరుడు దగ్గరలో నున్నందువల్ల తనును బ్రతకనివ్వడని ఆవిడకు, రాజకుమారుడికి ఆశ్రయమివ్వలేక పోయాడు. అక్కడనుంచి తంజరుపురమునకు పోగా అక్కడకూడా అలాగే జరిగింది. చివరకామె కమలమియరు కోటలో కాపురం చేస్తూవున్న జైనమతస్థుడైన అస్సా యనే యొక కోమటి నాశ్రయించింది. అతడు సహజముగనే భయపడినాడు. కాని పన్న

సాహసౌదార్యములను, ప్రభుభక్తిని చూచి ఆశ్చర్యపడి ఆవిడ దుస్థితికి జాలి వహించి అస్సా తల్లి అతనికి ధైర్యము చెప్పి తమరాజైన రాణాసంగుని మూడవ కుమారుడైన ఈ ఉదయసింగును రక్షించమని బోధించగా ఉదయసింగును తన మేనల్లుడని చెప్పి తన వద్ద ఉంచుకొంటానని, పన్న అక్కడ ఉంటే అనుమానం కల్గుతుందనిన్నీ అతడు అన్నాడు. అంతట ఎక్కడనో అక్కడ రాజపుత్రుడు బ్రతికివుంటే చాలునని పన్న అతనిని వదలలేక వదలలేక విడిచిపెట్టి వెళ్లింది.

ఉదయసింగు కమలిమియరు కోటలో పెరుగుతున్నాడు. అతడి లక్షణములు, చర్యలు చూచి ఇతడు రాజపుత్రుడేకాని కోమటిబిడ్డడు కాడని క్రమక్రమంగా అందరికీ తెలిసిపోయింది (దీనిని గురించి రాజస్థాన కథావళిలో అనేక కథలున్నవి).

ఇలా వుండగా వనవీరునిచేత అవమానింపబడిన రాజపుత్రులందరూ ఉదయ సింగు బ్రతికివున్నాడనే సంగతి పన్నను, మంగలిని విచారించి తెలిసికొని అతనికి సహాయం చెయ్యడానికి పూనుకున్నారు. అయితే చిత్తూరు దుర్గం దుర్భేద్యమైనది. అందువల్ల దానిని పట్టుకోవడానికి ఉపాయాలు ఆలోచిస్తూ, వనవీరుడిచేత అవమానింపబడిన అతడి మంత్రితో కూడా ఆలోచించారు. ఇంతలో వనవీరుడి కుమార్తె పెళ్ళి వచ్చింది. ఆ సందర్భంలో కోటలోకి వచ్చే సరకుల బళ్ళలో రాజపుత్రులు కూర్చుని కోటలో ప్రవేశించి దానిని స్వాధీనం చేసుకొన్నారు. వనవీరుడు పారిపోయాడు. విక్రమశకం 1597 (క్రీ.శ. 1541) లో ఉదయసింగు రాజైనాడు.

'పన్న' యనే మాటకు హిందీ భాషలో వజ్రమని అర్థము. ఆ పేరు మన పన్న విషయంలో సార్థకమైంది. పన్నాబాయి చిత్తూరురాజ్య రమామణియైనది. ఆవిడపేరు చరిత్ర ప్రసిద్ధమైంది. హిందూ దేశమంతటా మారుమ్రోగింది. రాజస్థానంలో ఆవిడను గురించిన పాటల నిప్పటికి పాడతారు. ఆవిడ గతించిన కొన్ని వందల సంవత్సరాలకు కర్నల్ 'టాడ్' అనే ఆంగ్లేయుడు తాను రచియించిన 'రాజస్థాన కథావళి'లో నీమె చరిత్ర నతి రసవంతంగా వర్ణించాడు (Annals of Mewar - Tod's Rajastan Vol. 1 pp. 328-344).

## పెద్దపురం రాజవంశాన్ని నిలిపిన లక్ష్మీ సోదెమ్మ

ఈ హిందూ దేశము శాంతి సత్య త్యాగ ధైర్య సాహసౌదార్యాలకు పుట్టినిల్లు. పన్నాబాయిలాగ ధర్మరక్షణ కోసము తమ సర్వస్వము నర్పించిన స్త్రీ పురుషులును, ప్రాణము లర్పించిన స్త్రీ పురుషులుమకూడా ఈ దేశంలో అన్నికులాల వారిలోనూ, అన్ని కాలాలలోనూ ఉన్నారు. అందువల్లనే ఎన్ని రాజకీయ మత సాంఘిక క్షోభలు తటస్థించినా ధర్మమంటూ ఇంకా నిలిచియున్నది.

పన్నాబాయి గతించిన రెండువందల సంవత్సరాలలోనే మళ్ళీ అలాంటి పుణ్యచరిత యొకావిడ మన తెలుగు దేశంలో జన్మించి మన జాతికి కీర్తి తెచ్చింది. ఆమెపేరు కొంపెల్ల లక్ష్మీసోదెమ్మగారు.

మొగలు చక్రవర్తియైన ఔరంగజేబు క్రీ.శ. 1707లో చనిపోగా మొగలాయి సామ్రాజ్యంలో చేరిన వివిధ రాష్ట్రాలను పరిపాలించే నవాబులు క్రమక్రమంగా స్వతంత్రులై

పరిపాలించ సాగినారు. మొగలాయి సామ్రాజ్యాంతర్భాగమైన గోలకొండ రాష్ట్రానికి సుబేదారుడైన కమ్రుద్దీన్ అసఫ్‌జాగారు 'రాజ్యనిర్వాహకుడు' (Regulator of the Kingdom) అనే అర్థంగల 'నిజాం ఉల్‌ముల్క్' అను బిరుదును వహించి తన రాజధానిని గోలకొండనుంచి హైదరాబాదుకు మార్చి, 1724 మొదలు దక్షిణహిందూ దేశానికంతా రాజాధిరాజుగా పరిపాలించడం ప్రారంభించాడు. గోలకొండ రాష్ట్రం క్రిందనున్న ఆర్కాటు, కర్నూలు, రాజమహేంద్రవరం, చిక్కాకోలు పరగణాలను ఆయా ప్రాంతాల కధికారులుగా నియమింపబడిన నవాబులు పరిపాలించేవారు. తరువాత కొంతకాలానికి కర్నాటక నవాబు అని చరిత్ర ప్రసిద్ధుడైన మహమ్మదాలీ వాలాజా నవాబుగారితండ్రి అన్వరుద్దీను గారిని నిజాముగారు రాజమహేంద్రవరం, చిక్కాకోలు పరగణాలకు నవాబుగా నియమించారు.

అన్వరుద్దీను 1714వ సంవత్సరం వరకూ ఈ ప్రాంతాలను పరిపాలించాడు. తరువాత 1743లో నిజాముగా రాయనను ఆర్కాటు నవాబుగా నియమించగా అక్కడికి వెళ్ళిపోయినాడు.

అన్వరుద్దీనుగారు తన క్రింద ఫౌజుదారు (సేనాపతి)గా నున్న రుస్తుంఖానును ఈ ప్రాంతాలకు పరిపాలకుడుగా నియమించాడు. రుస్తుంఖానుడు 1732 సంవత్సరం నుంచి రాజమహేంద్రవరంలోనే ఉంటూ దేశపరిపాలన జరిగించాడు. అప్పట్లో ఆ ప్రాంతాల్లలో శిస్తులను వసూలుచేయడానికి నియమింపబడియున్న యిజారాదారులనే జమీందారులకు ఇతడు సింహస్వప్నంగా నుండేవాడు. శిస్తులు వసూలు చేయడంలో అక్రమాలు జరిపి ప్రజలను పీడించినారనిగాని, వసూలుచేసిన శిస్తును సర్కారుకు తిన్నగా జమకట్టక హరించారనిగాని నేరాలుమోపి వారిని పట్టుకొని అతిక్రూరముగా దండించేవాడు. కొందరిని వధించాడు. వారిస్థానే తురకలనే అమీనులుగా నియమించాడు. తాను వధించిన జమీందారుల పుర్రెలతో రాజమహేంద్రవరంలో ఒక స్తంభమును, బందరులో ఒక స్తంభమును కట్టించాడని చెప్పుకుంటారు. ఇలాగ ఆ కాలంలో రుస్తుంఖానుడి పేరు మారుమ్రోగింది. ఈ రుస్తుంఖాను మొదట పెద్దాపురం కాపురస్థుడైన తెలుగు ముసల్మానుడేనని, అతడు తన తెలివితేటలచేత పైకివచ్చి అన్వరుద్దీను దగ్గర ఫౌజుదారుడై, దేశపరిపాలకుడైనా డనిన్నీ చెప్పుకుంటారు.

పెద్దాపురం గోదావరిజిల్లాలో రాజమహేంద్రవరానికి ఈశాన్య దిక్కున కొంచెము తూర్పుగా 24 మైళ్ళ దూరములో నున్నది. ఈ సంస్థానంయొక్క ప్రశంస క్రీ.శ. 1571 నుంచి చరిత్రలో కనబడుతూఉన్నది. పెద్దాపురం జమీందారులైన వత్సవాయవారు క్షత్రియులు. వీరు విజయనగర రాజులకు దగ్గర బంధువులు. పూర్వం ఈ ప్రాంతాల నేలిన రెడ్డిరాజుల దగ్గర వత్సవాయవారు సరదారులుగా నుండి దేశాక్రమణలోనూ, దేశపరిపాలనలోనూ వారికి సహాయభూతులుగా నున్నందువల్ల రెడ్డిరాజులు వీరికి మొదట హిమ్మూరు పరగణాలోని కొన్ని భూముల నిచ్చి తరువాత ఆ పరగణానే జాగీరుగా నిచ్చినారనిన్నీ తెలుస్తున్నది. ఈ ప్రాంతాలలో శిస్తులు వసూలుచేసే యిజారాదారు దేశముఖులలో పెద్దాపురంవారే ముఖ్యులు. తరువాత వీరు పెద్ద జమీందారులై రాజలాంఛనాలతో దేశపరిపాలన చేస్తూ వచ్చినారు. ఈ వత్సవాయవారు తమ బాహుబల

పరాక్రమం వల్లను, రసికత వల్లను, దానధర్మాల వల్లను చాలా ప్రఖ్యాతిని పొందినారు.

పెద్దాపురం సంస్థానమును పరిపాలించిన వత్సవాయ పినరాజుగారి తండ్రిగారికి హైదరాబాదు నవాబుగారు 'జగపతిరాజు' అనే బిరుదునిచ్చినట్లున్నూ, అప్పటినుంచీ వీ రా బిరుదునామంతో వ్యవహరింపబడుతూ వున్నట్లున్నూ చెపుతారు.

1649 మొదలు 1688 వరకూ పెద్దాపురము నేలిన సార్వభౌమ తిమ్మ జగపతిరాజు గారి యనంతరము వారి సోదర పుత్రులైన శ్రీరాయ జగపతిరాజుగారు రాజ్యమునకు వచ్చి విభవసంవత్సర ఫాల్గుణబహుళ 14 లు మొదలు మన్మథ నామసంవత్సర జ్యేష్ఠశుద్ధ 4 వరకు 26 సంవత్సరములు పెద్దాపురాన్ని పరిపాలించినారు. వీరిని శ్రీమదుద్దండరాయ జగపతిరాజుగారని అనేవారు. వీరి భార్యపేరు రాగమ్మాదేవిగారు. వీరికి తిమ్మభూపతి, బలభద్రక్షితిపతి, సూరనృపతి యని ముగ్గురు కుమాళ్ళుండేవారు.

రాయజగపతిరాజుగారు చచ్చిపోయేటప్పటికి వారి కుమారులెవ్వరూ యుక్త వయస్సు వచ్చినవారు కారు. అంతట రాగమ్మాదేవిగారు తమ పెద్ద కుమారుడైన తిమ్మజగపతి రాజుగారిని పట్టాభిషిక్తులుగాచేసి తామే రాజ్యం చేయడం ప్రారంభించారు. ఈ తిమ్మజగపతిరాజుగారు కళలందు నిపుణులుగా నున్నందువల్ల కళా తిమ్మజగపతి యని పేరు పొందినారు. శ్రీ రాగమ్మాదేవిగారికి రాఘవమ్మగారని నామాంతరం వుండేది. ఆవిడ క్రీస్తుశకం 1714 మొదలు 1734 వరకూ పెద్దాపురాన్ని అతి సమర్థతతో పరిపాలించారు.

ఆ కాలంలో ఉత్తరసర్కారులు పేరుకు మొగలాయి చక్రవర్తిగారి ప్రతినిధిగానున్న హైదరాబాదు సుబేదారుడైన నిజాముగారి అధికారానికి లోబడి వుండేవి. హైదరాబాదు నవాబు గారి సేనాధిపతులు ఈ ప్రాంతాలను ఎప్పటికప్పుడు లోబరచుకోవలసివచ్చేది. రుస్తుంఖాను రాజమహేంద్రవరానికి 'షర్ లష్కరై' హైదరాబాదు నవాబుగారి అధికారం స్థాపించడానికి వస్తూవున్నసంగతి తెలియగానే అతడక్కడికి రాకుండా అరికట్టాలని మొగలితుర్రు పరిపాలకుడైన కలిదిండి రామరాజు గారున్నూ, నూజివీటి సుబ్బన్నగారున్నూ ఏలూరు దగ్గర అతణ్ణి అటకాయించారు గాని లాభంలేకపోయింది. పిఠాపురంవారుకూడా ఓడిపోయి మన్యంలోకి పారిపోయారు.

రుస్తుంఖాను పెద్దపురంమీదికి దాడిచేశాడు. కాని ఆ కోట పట్టుకోవడం అతనికి సాధ్యం కాలేదు. అంతట అతడు సామ దాన భేదోపాయాలు ప్రయోగించి కళా తిమ్మజగపతి గారిని, వారి సోదరులను తన గుడారంలోనికి రప్పించి మోసంచేసి వారిమీద సలసలకాగే వేడినూనె పోయించి చంపించాడు. ఈ దుర్వార్త వినగానే అంతఃపురంలో కళాతిమ్మ జగపతిగారి భార్యయున్నూ, ఆయన తల్లియైన రాగమ్మాదేవిగారున్నూ, తక్కిన రాణివాస స్త్రీలున్నూ అగ్నిప్రవేశం కావడానికి నిశ్చయించారు.

కళా తిమ్మజగపతిరాజుగారు దుర్మరణం పొందేనాటికి ఆయనకు జగపతిరాజుగారనే ఏడుమాసముల వయస్సుగల కుమారుడున్నాడు. ఈ పసిపాపడిని పెంచి పెద్దవాణ్ణి చెయ్యడానికై ఎవరూ మిగలకుండా శ్రీరాగమ్మాదేవిగారితో పాటు ఆవిడ కోడళ్ళూ, ఇతర రాణివాస స్త్రీలందరూకూడా అగ్నిప్రవేశం చెయ్యడానికి నిశ్చయించారు. విజయనగర

రాజైన పూసపాటి సీతారామచంద్రరాజుగారున్నూ, కళాతిమ్మజగపతి రాజుగారున్నూ తోడియల్లుళ్ళు. పిల్లవాణ్ణి విజయనగరానికి చేర్చి పినతల్లికి వప్పగిస్తే పెద్దాపురం రాజవంశం నిలుస్తుంది. అయితే ఇది చెయ్యడం ఎలాగనని రాగమ్మాదేవిగా రాలోచించారు. రుస్తుంఖాను క్రూరకృత్యాలను చూస్తూవున్న వారెవ్వరూ అంత ధైర్యం చెయ్యడానికి సాహసించలేరు. పెద్దాపురం రాజుగారి కొలువులోనున్న విశ్వాసపాత్రుడైన రాజసేవకులలో ఎవరైనా దీనికి సాహసించినా రుస్తుంఖానుడు వారినీ, పిల్లవాణ్ణీ బ్రతకనివ్వడు. అందువల్ల రాగమ్మాదేవిగారు కర్తవ్యం ఆలోచించారు.

ఆలోచించగా ఆలోచించగా పిల్లవాడిని విజయనగరానికి పంపి రక్షించే విషయంలో రాగమ్మాదేవిగారికి కొక ఉపాయం తోచింది. కొంపెల్లవారు పెద్దాపురం రాజుల కాశ్రితులైన పురోహితులు. అప్పటి రాజపురోహితుడి భార్య లక్ష్మీ సోదెమ్మ గారు చాలా దొడ్డ యిల్లాలు. ఆవిడమీద రాగమ్మాదేవిగారికి చాలా గౌరవం. తన మనుమడిని ఆవిడ కప్పగిస్తే తన కోరిక నెరవేరుతుందని రాగమ్మాదేవిగారికి తోచింది. అంతట ఆవిడ సోదెమ్మ గారిని తనకీ సహాయం చెయ్యవలసిందని అడిగింది. సోదెమ్మగా రావిడ కోరిక విని తెల్లపోయింది. తానేమో, తన యిల్లేమో, తన ఆచారాలేమో తప్ప ఆవిడకు ప్రపంచం సంగతే తెలియదు. భర్తయైనా కేవలమూ శిష్టాచారసంపన్నుడైన పరమఛాందసుడేగాని లౌకిక వ్యవహారాలు తెలిసినవాడు కాడు. అయితే కొన్ని పురుషాంతరాలనుంచీ తమకుటుంబాని కాశ్రయంగా నున్న పెద్దాపురం రాజకుటుంబానికి సంప్రాప్తించిన ఈ మహావిపత్తులో రాగమ్మాదేవిగారు అగ్నిప్రవేశమవుతూ తన నీమాత్రపు సహాయం చెయ్యమని కోరితే తానెలాకాదనగలదు? ఏమైనా సరే ఈ పిల్లవాడి ప్రాణానికి తన ప్రాణం అడ్డువేసి అతణ్ణి కాపాడడానికి పూనుకొని సోదెమ్మగారు రాగమ్మాదేవిగారి కోరిక చెల్లిస్తానని ఆవిడచేతిలో చెయ్యివేసి వాగ్దానం చేసింది. అంతట రాగమ్మాదేవిగారు, కోడళ్ళు అగ్నిప్రవేశం చేశారు.

ఆ క్షణంనుంచి ఆవిడకే ఆశ్చర్యం కలిగించేటంత ధైర్యసాహసాలు, ఉపాయాలు లక్ష్మీసోదమ్మె గారికి పుట్టుకొని వచ్చినవి. పిల్లవాడిని ఒడిలో వేసుకొని కోటవెలుపలికి వచ్చిందో లేదో రుస్తుంఖాను భటులావిడను అటకాయించారు, "ఈ పిల్లవాడెవరు? ఎక్కడకు తీసుకుని వెడుతున్నావు?" అని వాళ్ళు ఆవిడను ప్రశ్నించారు. అంతట ఆవిడకు అగ్నిపరీక్ష ప్రారంభమైంది. తానొక బ్రాహ్మణ స్త్రీననిన్ని, ఆ పిల్లవాడు తన పిల్లవాడనిన్ని, తాను రాగమ్మాదేవి గారిని చూసి వస్తున్నాననిన్ని, సోదెమ్మగారు వారికి చెప్పి వారికి నమ్మకం పుట్టడానికి పిల్లవాడిని ముద్దుపెట్టుకుని వాడి నోట్లో తన నోరు పెట్టి తన నోరు ఎంగిలిచేసుకొని తప్పించుకొని బయటపడి బ్రతుకుజీవుడా యని తన యిల్లు చేరింది. ఇల్లలుకగానే పెళ్లికాదుకదా! ఇల్లు చేరగానే తన భర్తతో సంగతులన్నీ చెప్పి భర్తను, కొందరు భటులను వెంటతీసుకుని బయలుదేరి చేబ్రోలు మార్గంగా విజయనగరానికి దారితీసింది.

ఈ సంగతి రుస్తుంఖానుడి చెవిని పడగానే తన సైనికులను పంపించి సోదెమ్మ గారిని, పిల్లవాడినిపట్టి తెప్పించాడు. అంతట సోదెమ్మగా రాపిల్లవాడు తన పిల్లవాడేగాని రాజుగారి పిల్లవాడు కాడని గోలచేసి యేడ్చింది కాని ఖానుడు వినిపించుకోలేదు. ఆ

పిల్లవాడి సంగతి కనుక్కుంటావని చెప్పి చంటిపిల్లవాడి ఎదుట కొన్ని పుస్తకములున్నూ, ఒక ఖడ్గమును పెట్టించి పిల్లవాడిని వదలగా వాడు ఖడ్గము వైపునకేపోయి దానిని పట్టుకున్నాడట. అంతట ఆ బాలుణ్ణిచూసి ఖానుడు "కూదకే షేర్, బక్రీకా బచ్చా నహీహై" (వీడు పులిపిల్లగాని మేకపిల్ల కాదు) అని పిల్లవాడిని ఖైదులోనుంచి చుట్టూకావలా వేశాడు; సోదెమ్మగారు ఎంతో గోలపెట్టి ఏడ్చింది. ఆవిడ ఖానుగారి భార్య దగ్గరకుపోయి తనకు పుత్రభిక్ష పెట్టవలసినదని యేడ్చింది. ఆఖరికి ఆవిడకూడా ఆ చెరసాలలో వుండి పిల్లవాడిని పెంచడానికి ఖానుడు అంగీకరించాడు. అయితే ప్రతిరోజూ ఉదయం తాను ముఖం కడుక్కునేటప్పు డాపిల్లవాణ్ణి తమ సమక్షానికి తీసుకుని రావాలని భటులకు ఉత్తర్వు చేశాడు. ఆ పిల్లవాడు రోజూ చూపించే విద్దెములనుచూసి వాడు క్షత్రియశిశువే, కాని బ్రాహ్మణుడుకాడని ఖానుఅంటూ, వీడు బ్రతికివుంటే తనకు ముప్పువస్తుందని ఆ బాలుణ్ణి వధించాలని ఎప్పటికప్పుడు అనుకునేవాడటకాని తన భార్య మాటలవల్ల అలా చేయకుండా వుపేక్షించేవాడు.

సోదెమ్మగారు రాత్రింబగళ్లు ఆ పిల్లవాడిని కనిపెట్టుకుని వుండి వీలైనప్పుడల్లా రుస్తుంఖాను భార్యదగ్గరకు పోయి కడుపు తరుక్కుని పోయేటట్లు చెప్పుకుని ఏడుస్తూ తనకు పుత్రభిక్ష పెట్టవలసిందని ప్రార్థిస్తూ వుండేది. రుస్తుంఖాను భార్యకు మనస్సు కరిగి తనభర్త ఆ పిల్లవాడికి ప్రాణాపాయం కలిగించకుండా కాపాడుతూ వుండేది.

ఇక్కడ పెద్దాపురంలో జరుగుతూవున్న సంగతి సందర్భాలన్నీ సోదెమ్మగా రెప్పటికప్పుడు తన భర్తగారి ద్వారా విజయనగరానికి తెలియపరుస్తూ వుండేది.

అక్కడ విజయనగరంలో సీతారామచంద్రరాజుగారి పినతండ్రి కుమారుడైన విజయరామరాజుగారి రాజ్యకాంక్షవల్ల అన్నగారికి విషప్రయోగంచేసి చంపించారు. అంతట రామచంద్రరాజుగారి భార్యయున్నూ భర్తతో సహగమనం చేసింది. రాజ్యకాంక్షవల్ల అన్నగారిని తుదముట్టించి సింహాసన మెక్కినా విజయరామరాజుగారు తన అన్నకుమారుడైన ఆనందజగపతిరాజుగారి మీదకూడా వారికి బంధుప్రేమ, సానుభూతి పూర్తిగానే ఉన్నవి. విజయరామరాజుగారిపట్ల విరోధ భావం వహించక దయగానే చూసేవారు. అక్కడ పెద్దాపురంలో ఖైదులోనున్న బాలుడైన రాయజగపతి రాజుగారి భార్య చంద్రయ్యమ్మాదేవిగారు దొడ్డయిల్లాలు. ఆవిడకు కూడా ఈ దిక్కులేని పిల్లవాడిమీద చాలా దయకలిగింది. అందువల్ల వా రీపిల్లవాడిని ఎలాగైనా చెరలోనుంచి విడిపించాలని చాలా ఆదుర్దాగానే ఉన్నారు. ఇలావుంటూ వుండగానే కొన్ని సంవత్సరాలు గడిచిపోయినవి. పిల్లవాడు చెరసాలలోనే పెరుగుతున్నాడు.

ఇంతలో రుస్తుంఖాను కుమారుడైన నూరుద్దీనుఖాను తన తండ్రిని వధించి తానే రాజమహేంద్రవరానికి షర్లష్కరై పెద్దాపురంలోనే మకాముగానుండి పరిపాలన ప్రారంభించాడు. అయితే చెరలోనున్న రాయజగపతి రాజుగారికి విముక్తి కలుగలేదు. పైగా క్రొత్తఖాను బందోబస్తు ఎక్కువచేశాడు. పిల్లవాడిని చంపిస్తాడనే భయం ఇంకా ఎక్కువైంది. ఎందుకంటే రాజవంశమువాడంటూ వుంటే అతణ్ణి సింహాసనం ఎక్కించడానికి కుట్రచేస్తారని అతనిభయం. బాలుణ్ణి ఖైదు చేసిన గదికిన్నీ, కోటయొక్క బయటిద్వారానికిన్నీ

మధ్య ఏడు పహారాలుండేవి. అక్కడ తురుష్కభటులు విచ్చుకత్తులతో పారా యిచ్చేవారు. కోటలోపలికి పోవడానికి సోదెమ్మగారికి తప్ప మరెవ్వరికీ అనుజ్ఞలేదు. అందువల్ల పిల్లవాణ్ణి తప్పించాలంటే ఆవిడ ఒక్కర్తే ఈ పహారావాళ్ళ నందిరినీన్నీ తప్పించుకోవాలి. లక్ష్మీ సోదెమ్మగారు అందుకోసం కొన్ని ఉపాయాలు ఆలోచించి అవకాశముకోసం చూస్తూవుంది. సోదెమ్మగారెప్పుడూ ముప్పైమూళ్ళ బట్టకట్టుకొని దానిని తన నడుముచుట్టూ చుట్టలు చుట్టలుగా అనేకమార్లు తిప్పిచుట్టుకునేది. పహారావాళ్ళా చీరచుట్టలు విప్పించి చూచి మరీ లోపలికి పోనిచ్చేవారు. ఇదేమిటని వారడిగితే ఇది మా యింటి ఆచారమనేది. వాళ్ళు నవ్వుకుని కొన్నాళ్ళు చీరె చుట్టలు విప్పించి ఆఖరికి విసిగి వేసారి ఈ ఆ చీరచుట్టలు విప్పించడము మానివేశారు. ఆవిడ బహుతరచుగా బైటకు వెడుతూ వుండడం చూసి వాళ్ళు ఆవిడను ప్రశ్నించగా అది తన శరీర ప్రకృతియని చెప్పేది. అది వాళ్ళు నమ్మి వూరుకున్నారు.

ఇలా వుండగా నూరుద్దీనుఖాను కళింగదేశ దండయాత్రకు బయలు దేరుతాడనే సంగతి తెలిసింది. అంతట తగిన సిబ్బందితో ఒక పల్లకీని పంపించవలసినదనిన్నీ, దారిలో అక్కడక్కడ అంచెలలో సైనికులను పెట్టవలసిందనిన్ని సోదెమ్మగారు విజయనగరానికి కబురుచేసింది. ఆ ప్రకారం పల్లకీ రాగా సోదెమ్మగారు బాలుణ్ణి తన ఒడిలో వేస్కుకొని ఆపైన తన చీరను చుట్టి కాపలావారికి అనుమానం కలుగకుండానే పిల్లవాణ్ణి బైటికి తీసికొనిపోయి సంకేతస్థలంలో ఉన్న పల్లకీలో ఎక్కి విజయనగరానికి దారితీసింది.

సోదెమ్మగారు పిల్లవాడిని తీసికొనిపోయిన సంగతి తెలియగానే ఈ సంగతి తెలిస్తే తమమీదికి వస్తుందని భయపడి రాత్రివేళ సోదెమ్మగారు తప్పించుకొనిపోయినదని కాపలావారు తమ ప్రభువుకు తెలియపరిచారు.

విజయరామరాజుగారి సైనికులు సోదెమ్మగారిని పల్లకిలో అంచెలమీద తీసికొనిపోతున్నారనే సంగతి చారులవల్ల తెలియగా నూరుద్దీనుఖాను వెంటనే తన సేనతో బయలుదేరిపోయాడు. చేబ్రోలుదగ్గర యుద్ధం జరిగింది. అక్కడ విజయనగరమువారి అనకాపల్లి బోయల ఫౌజు 2000 మంది నూరుద్దీనుఖాను ఎక్కిన ఏనుగును ముట్టడించి అంబారీ యొక్క కట్టుపగ్గాలు త్రెంపి ఖానుణ్ణి క్రిందికి లాగి అతనిని వధించగా అతనిసైన్యం చెల్లాచెదరైపోయింది.

విజయరామరాజుగా రీజగపతిరాజుగారిని సురక్షితంగా తీసుకొనిపోయి అక్కడ తన అన్నకుమారుడైన ఆనంత జగపతి రాజుగారితో సమానంగా చూస్తూ పెంచడం ప్రారంభించారు.

ఈ రాజమహేంద్రవరం షర్‌లష్కరు పైయధికారియైన అన్వరుద్దీనుకు రుస్తుంఖాను మీదను, నూరుద్దీనుమీదను కోపం వచ్చినందువల్ల అతడు విజయనగరం వారికీ, నూరుద్దీనుకు జరిగిన యుద్ధంలో విజయనగరంవారికే సహాయం చేశాడు. తరువాత పెద్దాపురం కోటను తానే స్వాధీనం చేసుకొని పరిపాలించసాగాడు. అందువల్ల కూడా పెద్దాపురానికి మోక్షం కలుగలేదు. కొంతకాలం తరువాత అన్వరుద్దీనుకు బదులుగా జాఫరల్లీఖాను ఈ నాలుగు పరగణాలకూ పరిపాలకుడైనాడు. అతడు విజయనగరం

మీదికి దండెత్తి వచ్చాడు. అప్పటికి యుక్తవయస్సు వచ్చిన జగపతిరాజుగా రతని నెదుర్కొని జయించగా వారికి రాజీ జరిగినది. తరువాత జగపతిరాజుగారు 1749లో పెద్దాపురానికి వచ్చి పట్టాభిషిక్తులై 1758 వరకూ పరిపాలించారు.

కొంపెల్ల లక్ష్మీసోదెమ్మగారు ఇలాగ ఎన్నో కష్టాలనుభవించి శ్రీరాయజగపతిరాజు గారిని రక్షించి విజయనగరమునకు సురక్షితముగా తీసికొనిపోయి వప్పగించి పెద్దాపురం వత్సవాయివారి రాజవంశం నిలిపి పుణ్యం కట్టుకుంది. ఈవిడ చూపిన అఖండమైన త్యాగమునకు, సాహసౌదార్యములకు మెచ్చి విజయనగరం రాజుగారైన శ్రీవిజయ రామజగపతి మహారాజుగారు లక్ష్మీసోదెమ్మగారి కుటుంబంవారికి తమ రాజ్యంలో ఒక అగ్రహారమిచ్చి దానికి లక్ష్మీపురాగ్రహారమని ఆవిడపేరు పెట్టించారు. రాయజగపతిగారిని రక్షించినందువల్లనే ఈ యగ్రహార మివ్వబడినందువల్ల దీనికి రాయభూపాల పురాగ్రహార మని కూడా పేరు. ఈ అగ్రహారాన్ని కొంపెల్లవారు చాలాకాలం అనుభవించారు.

కొంపెల్లవారు వత్సవాయివారికి చిరకాలంనుండి పురోహితులుగా ఉన్నట్లు గోదావరిజిల్లా మోడేకుర్తి వాస్తవ్యులైన బ్రహ్మశ్రీ కొంపెల్ల సుబ్బరాయశాస్త్రులవారు సిద్ధాంత శిరోమణికి వ్రాసిన ఆంధ్రపీఠికలో "శ్రీవత్సవాయ ప్రసిద్ధాన్వయ భూవరుల మన్ననఁ గులగురుతు గాంచి" అని వ్రాసినారు (బ్రహ్మశ్రీ కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారి పెద్దాపుర సంస్థానచరిత్ర విమర్శనము. 108-133).



# 5. వేంకటపతి దేవరాయ మహారాయలు

క్రీ.శ. 1585 మొదలు 1614 వరకూ కొంతకాలం పెనుగొండను, తరువాత చంద్రగిరిని రాజధానిగా చేసుకుని కృష్ణానదికి దక్షిణాన కావేరివరకూ గల దక్షిణహిందూ దేశాన్నంతా ఏకచ్ఛత్రంగా పరిపాలించిన వెంకటపతి దేవరాయ మహారాయలు ఆంధ్రభోజుడని ప్రసిద్ధిజెందిన విద్యానగరచక్రవర్తియైన కృష్ణదేవరాయల అల్లుడైన ఆరవీటి రామరాజుగారి తమ్ముని కుమారుడు. భుజబలపరాక్రమంలోను, సాహసౌదార్యాది సుగుణ సంపత్తిలోను, రసజ్ఞతలోను కృష్ణదేవరాయల తరువాత ఇతడంతవాడేనని ప్రఖ్యాతిని పొందినాడు. ఈయన కూడా సంగీత సాహిత్యాలను, చిత్రకళలను పోషించాడు. ఆంధ్రకవులను ఆదరించి అనేక గ్రంథాలను వ్రాయించినాడు.

### మహారాయలవారు పోర్చుగీసు ఫాదరీలకు దర్శనమివ్వడం

వెంకటపతి దేవరాయల కాలంలో చెన్నపట్నం దగ్గర శాంతోములోను, పులికాటు అనే ప్రళయ కావేరి దగ్గరను వర్తకస్థానాల నేర్పరచుకొనివున్న పోర్చుగీసువారు సముద్రం

పైనుంచి దేశంలోకి దిగుమతిచేసే సరకులమీద నూటికి ఒక రూపాయిలో నాలుగోవంతు చొప్పున ఈ చక్రవర్తికి సుంకం చెల్లించేవారు. ఇంతేగాక చక్రవర్తిగారి సామంతులున్నూ, ఆ ప్రాంతాలకు అధికారిన్నీ అయిన తంజావూరు ఆంధ్రనాయకుడికి కప్పంగూడా చెల్లించేవారు. డచ్చి, ఇంగ్లీషు వర్తకులుకూడా ఆ కాలంలో మన దేశానికి వర్తకం చెయ్యడానికి వచ్చి ఈ విజయనగర చక్రవర్తిగారి సామంతులనాశ్రయించి వ్యాపారం సాగించారు.

అప్పట్లో మనదేశంలో పశ్చిమతీరాన్ని పోర్చుగీసు జాతి క్రైస్తవమత ప్రచారకులు కొన్ని క్రైస్తవమఠాలను, దేవాలయములను స్థాపించుకొని మతప్రచారముచేస్తూ ఈ విజయనగర రాజ్యంలోకూడా కొన్నిచోట్ల దేవాలయాలు కట్టుకోవాలని ఆలోచించారు. ఆ ప్రకారం చక్రవర్తిగారిని దర్శించి చంద్రగిరిలో ఒక క్రైస్తవమఠాన్ని స్థాపించుకోవడానికి అనుజ్ఞను పొందాలని నిశ్చయించారు.

అప్పట్లో రాయలవారి మామగారైన ఓబరాయలు కాంచీపురానికి పరిపాలకుడుగా వున్నందువల్ల అయనద్వారా ప్రయత్నిస్తే ఇది సాధ్యమవుతుందని ఆలోచించి మెల్లగా ఆయనను ఆశ్రయించారు. ఆయన చక్రవర్తిగారి దర్శనం చేయిస్తామని సెలవిచ్చారు. అంతట మహారాయలవారి దర్శనం నిమిత్తం శాంతోము రెక్టారైన ఫాదర్ డీసాగారున్నూ, ఫాదర్ ఫ్రాన్సేస్కోరిచియో గారున్నూ కలిసి 1598వ సం. అక్టోబరు 10వ తేదీన చంద్రగిరికి బయలుదేరారు. అక్కడ ముందుగా ఓబరాయలుగారిని దర్శించి వారికి కొన్ని బహుమతులు సమర్పించగా ఆయన సంతోషించి తన మండలంలో నెక్కడనైనాసరే క్రైస్తవ దేవాలయం కట్టుకోవచ్చునని సెలవిచ్చి వీరిని సత్కరించి తరువాత కొద్దిరోజులకు మహారాయలవారి దర్శనం చేయించారు.

వీరు వెంకటపతి దేవరాయ మహారాయలవారి దర్శనం చేసిన దృశ్యాన్ని గురించి డుజారిక్ అనే ఫాదరీగారు ఇలాగ వర్ణించియున్నారు:

చాలా సోపానాలు ఎక్కి వెళ్ళగా ఒక చిన్న సభామందిరంలో ఒక రత్నకంబళము మీద మహారాయలవారు ఒక దిండుకు ఆనుకుని కూర్చుని ఉన్నారు. ఆయస ప్రక్కనే యువరాజుగారు కూర్చుని వున్నారు. అతడు చాలా చిన్నవాడు; స్ఫురద్రూపి. అవతలప్రక్క యువరాజు గారికి ఎదురుగా చక్రవర్తి మామగారైన ఓబరాయలవారు, వారి తమ్ముడూ కూర్చున్నారు.

మహారాయలవారు పసుపుపచ్చని దుస్తులను ధరించి వున్నారు. తక్కిన ప్రభువులందరు మామూలుగా చేసేలాగుననే ఈ ఫాదరీలు కూడా జోహారులుచేసి నిలిచి యుండగా వారిని గురించి ఓబరాయలవారివల్ల ఇదివరకే వినియున్నందువల్ల మహారాయల వారు, "సూర్యోదయమువలెనే ఈ ఫాదరీల రాక తమకు చాలా ఆనందకరముగా నున్నదనిన్నీ, వారిని తగినటుల సత్కరించి పంపవలసిన"దనిన్నీ సెలవిచ్చారు. అంతట ఫాదరీలు మహారాయలవారికి వందనము లర్పించి తాము తెచ్చిన బహుమతులను సమర్పించారు.

వారు తెచ్చిన వాటిలో గాజుతోను, బంగారుతోను పోర్చుగల్లులో తయారుచేసిన గుండెకాయలాంటి చిత్రమైన వస్తువు ఒకటి వుండగా దానిని రాయలవారు చూసి ఇదేమిటని ప్రశ్నించారు. ఇది వెండి బంగారులతో తయారుచేసిన గుండెకాయ యనిన్నీ, రాయలవారియందు తమకుగల ప్రేమను, రాజభక్తిని, కృతజ్ఞతను తెల్పగలందుకు దానిని బహుమతిగా సమర్పించుకుంటున్నా మనిన్నీ వారు మనవిచేశారు. అంతట మహారాయల వారు 'మహా సంతోషం' అని తమ మాతృభాషయైన తెలుగులో అన్నారు. తరువాత శ్రీవారు ఆ క్రైస్తవ ఫాదరీలలో రెక్టారుగారికి నాలుగు పట్టుతాపితాలున్నూ, ఫ్రాన్సిస్ రిచియోగారికి రెండు పట్టుతాపితాలున్నూ బహుమానం చేశారు. ఈ క్రైస్తవమత ప్రచారకుల జీవిత విధానాన్ని గురించి రాయలవారు దీర్ఘంగా ప్రశ్నించారు. వారి జవాబులన్నీ సావధానంగా విని తమ సభాసదులతో ఇలాగ అన్నారు. "వీరుకూడా మన సన్యాసుల వంటివారే. అందుకుతోడు వీరు విద్వాంసులుకూడాను!" అని రాయల వారు చాలా సేపు దర్శనం యిచ్చి క్రైస్తవులు జనన మరణాల విషయంలో అవలంబించే ఆచారాలూ, ప్రాయశ్చిత్తాలూ వివరంగా అడిగి తెలుసుకుని చాలాబాగున్నవని రాయలవారు సెలవిచ్చారు.

బ్రాహ్మణకర్మలు విధించే స్నానాలు శరీరాలనే శుద్ధి చేస్తున్నవి గాని ఆత్మలను శుద్ధిచేయడం లేదనిన్నీ, క్రైస్తవ ధర్మాలు విధించే జ్ఞానస్నానములు ప్రాయశ్చిత్తాలూ మానవుల పాపాలను కడిగివేసి ఆత్మలను శుద్ధిచేస్తున్నవనిన్నీ క్రైస్తవ మిషనరీ ఫాదరీలు చెప్పగా రాయలవారు విని అక్కడనున్న బ్రాహ్మణులను చూచి "ఈ విషయంలో మీరేమంటారు?" అని అడిగారు. రాయలవారీ మిషనరీ ఫాదరీల నింతగా గౌరవించి వారిపైన అనుగ్రహం చూపుతూ ఉన్నప్పుడు తామేమైనా అంటే రాయలవారికి ఆగ్రహం వస్తుందేమో అని అక్కడివారు 'స్వామి; స్వామి' (చిత్తం, చిత్తం) అని వూరుకున్నారు.

ఈ ఫాదరీలకు ఖర్చుల నిమిత్తమున్నూ, ఒక క్రైస్తవ దేవాలయం కట్టుకోగలందు కున్నూ రెండు గ్రామాలనూ, స్వాములున్నూ ప్రభువులున్నూ మాత్రం యెక్కితిరిగే బంగారు అడ్డపల్లకీ నొక దానినిన్నీ రాయలవారు దయచేసి నారనిన్నీ, తమ సామ్రాజ్యంలో ఎక్కడనైనాసరే వీరు తమ యిష్టంవచ్చినచోట క్రైస్తవ దేవాలయాలు కట్టుకోవడానికి మహారాయలవారు అనుగ్రహించారనిన్నీ ఓబరాయలవారు సెలవిచ్చారు.

ఈ ఫాదరీలు తిరిగి వెళ్ళేలోపుగా మహారాయలవారు మరియొక మాటు దర్శనం ఇచ్చి క్రైస్తవమత ధర్మాలను గురించీ, సిద్ధాంతాలాను గురించీ వీరివల్ల విన్నారు. తమ రాజధానియైన చంద్రగిరిలోనే ఒక క్రైస్తవ దేవాలయం కట్టుకోవడానికి అనుగ్రహించారు. అటుతరువాత ఈ క్రైస్తవ ఫాదరీలు శాంతోముకు తిరిగి వచ్చారు.

(Du jarric I pp. 654-675. Historical Fragments Orme P. 61 Aravidu Dynasty. H.Heras. pp. 464 – 467.)

## చంద్రగిరి తాలింఖానా

చంద్రగిరిలో వెంకటపతి దేవరాయ మహారాయలవారి కాలంలో (1585-1614 మధ్య) వారి ఆస్థానంలోనుండే రాజబంధువులు, సామంతులు, సరదారులు, ఉద్యోగులు మొదలైన తెలుగు ప్రభువులూ, శ్రీమంతులూ ఉపయోగించుకునే తాలింఖానా ఒకటి

వుండేది. అది పాశ్చాత్య దేశాలలో నుండే 'జిమ్నేసియం' వంటిది. ఫాదర్ డు జారిక్ అనే పోర్చుగీసు క్రైస్తవమత ప్రచారకుడైన జెసూటు మిషనరీసంస్థను చూచి ఇలాగ వర్ణించాడు

"ఈ తాలింఖానా కట్టివున్న ఆవరణలో మధ్య ఖాళీ స్థలము సన్నసున్నముతో నున్నగా అద్దములాగ పాలగచ్చు చేసివున్నది. దానిచుట్టూ విశ్రమించడానికి వీలుగా పరుపులాగ మెత్తగా వుండేటట్లుగా యెఱ్ఱని యిసుక ఒత్తుగ పోసియున్నది. ఇక్కడ శరీర వ్యాయామం చెయ్యడానికి వచ్చే శ్రీమంతులు దుస్తులన్నీ తీసివేసి లంగోటాలతోను, కచ్చడాలతోను నిలుచుని వుంటారు. అంతట జెట్టీలనే బలాఢ్యులైన యువకులు ఈ ప్రభువులకు చక్కగా ఒళ్ళు పట్టుతారు. తరువాత వారూ వీరు కలిసి దండెములు, బస్కీలు తీస్తారు; కుస్తీలు పడతారు; మల్లయుద్ధం చేస్తారు. ఇలాగ ఒళ్ళుగట్టిపడే అనేకరకాల కసరత్తులు, సాములు ఒళ్ళంతా చెమట పట్టేవరకూ చేస్తారు. తరువాత జెట్టీలు ఈ ప్రభువుల శరీరాలకు మెత్తనిమన్ను రుద్ది మళ్ళీ ఒళ్ళుపట్టి, కీళ్ళూ ఎముకలూ కదిలిపోయి ఊడి వస్తాయా అనేటట్లుగా కాళ్ళను, చేతులను అన్నివైపులకూ త్రిప్పి లాగి సాధకం చేసి తరువాత ఒళ్ళు దులుపుతారు. అటు తరువాత ఆ ప్రభువులు తమ శరీరానికి బాగా నూనెరాసుకుని మంచి వేడినీటిలో స్నానంచేసి ఒళ్ళు బాగా తుడుచుకొని తమ దుస్తులు ధరిస్తారు. ఇలాగ ఈ శ్రీమంతులందరూ ప్రతిరోజూ భోజనానికి పూర్వం శరీర వ్యాయామం చేస్తూ వున్నందువల్ల ఆరోగ్య దృఢగాత్రులైవుండి డెబ్బయియేళ్ళ వాళ్ళుకూడా ముప్ఫైయేళ్ళ వాళ్ళలాగ కనబడతారు.

చెన్నపట్నం దగ్గరున్న శాంతోము కాలేజీ రెక్టారు గారైన ఫాదర్ సైమన్ డి. సాగారు కూడా ఒకసారి చంద్రగిరిలో ఈ తాలింఖానాను చూశారు. (Aravidu Dynastry H. Heras. pp 313-314).

## మహారాయలవారు రాణివాసంతో వనవిహారానికి పోవడం

వెంకటపతి దేవరాయ మహారాయలవారికి వెంకటాంబ, రాఘవాంబ, పెద్ద ఓబమాంబ, పిన్న ఓబమాంబ అనే నలుగురు భార్యలున్నట్లు 1586వ సంవత్సరపు శాసనంవల్ల కనబడుతూ ఉంది. ఇంకొక శాసనంలో పిన్న ఓబమాంబకు బదులుగా కృష్ణమాంబపేరు కనబడుతూవుంది. 1598లో మహారాయలవారు రాణివాసముతో వనవిహారమునకు పోయిన దృశ్యాన్ని ఫాదర్ డు జారిక్ అనే జెసూటు క్రైస్తవమత ప్రచారకుడు ఇలాగ వర్ణించాడు.

"పోర్చుగీసు క్రైస్తవమత ప్రచారకులైన జెసూటు ఫాదరీలు క్రొత్తగా చంద్రగిరికి పోయియున్న రోజులలో ఒకనాడు మహారాయలవారు తమ మహారాజ్ఞులతో నగరానికి బయటనున్న ఉద్యానవనానికి విహరించబోయినారు. ఈ రాణివాసముతో వెళ్ళిన పరివార జనములో గొప ఆశ్వికదళం ఒకటి యున్నది. ఆ దళాధిపతి ఒక మహమ్మదీయుడు. ఈ దళానికి నాలుగువైపులా నలుగురు గొప్ప సరదారు లున్నారు. అందులో పట్టు కేతనాలు ఎగురుతున్నవి. దీని తరువాత పిల్లనగ్రోవులు, వీణలు వాయించే మేళ మున్నది. వాద్యములవా రందరూ ఒంటెల మీద నెక్కి పోతున్నారు. ఈ పరివారంతో మంచి కాల్బలము కూడా పోతున్నది. వీరి తరువాత ప్రధాన సేనానాయకులైన దళవాయిలు ఆయుధపాణులై,

పాదచారులై నడుస్తున్నారు. వీరి ప్రక్కను మహారాయలవారి పుట్టపుటేనుగు మీద విజయనగర రాజలాంఛనము ఎత్తియున్నది. చుట్టూ ఇంకా చాలామంది రాజకీయోద్యోగులున్నారు. తరువాత నలుగురు బోయీలు పెద్ద యినుప జేగంటలను మోస్తూ ఉండగా నలుగురు సైనికులు ఎడతెగకుండా దానిని మ్రోగిస్తున్నారు. అంతట తమచుట్టూ ఉద్యోగులు కొలుస్తూరాగా రాజసేవకులు నాలుగు తెల్లని గొడుగులను పట్టి యుండగా మహారాయలవారు ఒక బంగారు తంజాన్ పల్లకీలో కూర్చుని పోతున్నారు. ఈటెలమీద కేతనము లెగురుతున్నవి. ఒకదానిమీద పెద్ద తెల్లచామరము జీరాడుతున్నది. ఒక ధ్వజము మీద మత్స్యలాంఛనము, మరియొక దానిపైన సింహలాంఛనము, ఇదిగాక మరియొక గొప్ప ధ్వజము నున్నవి. వీటి తరువాత సామ్రాజ్య సర్వసేనానియైన ప్రధాన దళవాయి ఉన్నాడు. ఆఖరిని యువరాజైన రంగరాయలున్నూ, నలుగురు మహారాణులున్నూ రత్నాలతో పొదిగిన జలతారు బుటేదారీజాలరులుగల వెండి బంగారు తంజాన్ పల్లకీలలో కూర్చుని పోతున్నారు. ప్రతిపల్లకీకి సూర్యరశ్మి తగలకుండా రెండేసి గొడుగులు పట్టినారు. చాలామంది దాసదాసీజనము రెండు ప్రక్కలను విసనకర్రలతో విసురుతున్నారు. వింజామరలు వేస్తున్నారు. ఇలాగ నగరోపరిభాగాన్ని ఉన్న ఉద్యానవనానికి పోయి, అక్కడ కులాసాగా ప్రొద్దుపుచ్చి సూర్యాస్తమయం అయిన తరువాత రాత్రిని పగలుగా మార్చేటంత కాంతినిచ్చే దివిటీలతోను, కాగడాలతోను తిరిగివచ్చారు" (Aravidu Dynasty - H. Heras pp. 496-497).



# 6. రాణీ వెంకటాంబగారి దొంగకానుపు

1585 మొదలు 1614 వరకూ చంద్రగిరిని రాజధానిగా చేసుకొని విద్యానగర సామ్రాజ్యాన్ని పరిపాలించిన వెంకటపతి దేవరాయ మహారాయలవారికి వెంకటాంబ, రాఘవాంబ, పెద ఓబమాంబ, పిన ఓబమాంబ యనే నలుగురు భార్యలున్నట్లు 1586వ సంవత్సరపు శాసనంలో కనబడుతున్నది. అయితే ఆ సంవత్సరములోనే లిఖింపబడిన దళవాయి అగ్రహార శాసనములో పిన ఓబమాంబ పేరు బదులుగా కృష్ణమాంబ పేరు కనబడుతున్నది. కృష్ణమాంబతో కలిపి నలుగురు భార్యల పేరులున్నూ 1598వ సంవత్సరమునాటి శాసనాలలో కూడా ఉన్నవి. కృష్ణమాంబ ఓబమాంబకు మారుపేరో, లేదా ఆ పేరుగల యింకొకయామెను రాయలవారు మళ్లీ పెళ్లి చేసుకొన్నారో తెలియదు.

1601వ సం. విలపాక దానశాసనంలో పైన చెప్పిన నలుగురు భార్యల పేర్లుగాక కొండాంబిక అనే ఐదవభార్య పేరుకూడా కనబడుతున్నది. అయితే వెంకటపతి రాయలవారి రాజ్యకాలంలో చివరిభాగంలో రచయింపబడిన రామరాజీయమనే నరపతి విజయములో వెంకటమ్మ, ఓబమ్మ, కృష్ణమ్మ, కొండమ్మలనే నాలుగు పేర్లే కనబడుతున్నవి. అప్పటికి రాఘవమ్మగారు చనిపోయి వుంటుంది.

1614లో రాయలవారు చనిపోయినప్పుడు ఆయనతో ముగ్గురు భార్యలు సహగమనం చేశారనిన్నీ, అందులో పెద్ద యామెకు దరిదాపుగా రాలయవారి వయస్సే వుంటుందనిన్నీ, తక్కినిద్దరికీ చెరి ముప్పైయైదు సంవత్సరాలు వుంటాయనిన్నీ పోర్చుగీసు క్రైస్తవ ఫాదరీలు తమ అధికారులకు వ్రాసిన వుత్తరాల వల్ల కనబడుతున్నది. అప్పటి కిద్దరు భార్యలు చనిపోయి వుండాలి.

పెద ఓబమాంబ జిల్లేళ్ల రంగరాజుగారి కుమార్తె. కృష్ణమాంబ జిల్లేళ్ల కృష్ణరాజుగారి కూతురు. కొండాంబిక గొబ్బూరి ఓబరాయల కొమార్తె. ఓబరాయలు ఇంకొక కొమార్తెను కూడా రాయలవారికిచ్చి పెళ్లిచేసినట్లు కనబడుతున్నది. వెంకటాంబగారు ఎవరి కుమార్తె యైనదీ రామరాజీయములో నుదహరించలేదు. బహుశా జగ్గరాజు గారి కొమార్తె బాయమ్మ అని బర్రడస్ పేర్కొన్న రాణీగా రీమెయే అయివుంటుందని చరిత్రకారుల ఊహ.

రాయలవారి మామగారైన గొబ్బూరి ఓబరాయలవారు రాయలవారిక్రింద ఒక మహామండలేశ్వరుడైన సామంతరాజుగా నుండేవాడు. ఆయన కాంచీపురం రాజధానిగా ఆ ప్రాంతాలను పరిపాలించేవాడు. 1606 వరకూ వెంకటపతి దేవరాయల వారికి ఈ ఓబరాయలెంత చెపితే అంత ఓబరాయలవారి కుమార్తె రాఘవాంబ రాయలవారి కత్యంత ప్రేమాస్పదురాలైన భార్యగా నుండేది. ఆమె చనిపోయినతరువాత ఓబరాయలవారి పలుకుబడి తగ్గింది.

రాఘవాంబగారు చనిపోయిన తరువాత రాయలవారి ప్రేమకు పాత్రురాలైన రాణిగారిని గురించి పోర్చుగీసు క్రైస్తవ ఫాదరీలు తమ వుత్తరాలలో పైవారికి అనేక వివరాలు వ్రాశారుగాని పేరుమాత్రం వుదహరించలేదు. రాజకార్యాలన్నీ రాణీగారి యిష్టానుసారంగా జరుగుతున్న వనిన్నీ, ఈ నల్ల రాణీగారి వలపులో చిక్కి రాయలవారు ఆమెకు దాసులైనారనీ, శాంతోములో క్రైస్తవులకూ, గ్రామస్థులకూ వచ్చిన తగాదాలవల్ల రాణీగారు క్రైస్తవులపైన కోపంగా వున్నవారనిన్నీ ఆవిడకు సమర్పించవలసిన బహుమతులూ సొమ్మూ ఇస్తేనేగాని ఆవిడ ప్రసన్నురాలు కాదనిన్నీ ఫాదరీలు పై అధికారులకు వ్రాశారు. రాయలవారు తమ అధికారాలన్నీ ఈ రాణీగారికిన్నీ, ఆవిడ సోదరుడికిన్నీ వప్పగించారని 1611లో ఒక వుత్తరంలో వ్రాశారు. ఈమెను పులికాటురాణీ యని 1611లో ఒక ఇంగ్లీషు క్యాప్టెను పేర్కొన్నందువలనను పులికాటు రాణీగారు ఓబమ్మయని ఒక దచ్చివర్తకుడు వుదాహరించినందువల్లను జిల్లేళ్ల రంగరాజుగారి కుమార్తెయైన పెద ఓబమాంబయని చరిత్రకారులు ఊహిస్తున్నారు.

1607 నాటికే వెంకటపతి దేవరాయలవారు వయోవృద్ధులుగానున్నట్లు ఫాదరీలు వ్రాశారు. వెంకటపతి దేవరాయల తండ్రి తిరుమల రాయలవారు పెనుకొండలో 1569 నుండి రాజ్యపరిపాలన మారంభించగానే వెంకటపతి దేవరాయలను రాజప్రతినిధిగా నియమించినందువల్ల అప్పటికే ఈయనకు యుక్తవయస్సు వచ్చియుండాలి. 1508 మొదలు 1611 వరకూ ఫాదరీలు వ్రాసిన యుత్తరాలన్నింటిలోను రాయల వారి వార్ధక్యాన్ని గురించి వ్రాస్తూనే యున్నారు.

1613లో ఒక ఫాదరీ పోర్చుగల్లు రాజుగారికి వ్రాసిన యుత్తరములో రాయలవారు అతివృద్ధులై పోయినారనిన్నీ, ఇప్పుడో ఇకనో చనిపోతారని అందరూ అనుకుంటున్నారనిన్నీ వ్రాశాడు.

## కృత్రిమ గర్భధారణం

వెంకటపతి దేవరాయ మహారాయలవారి భార్యలలో ఎవ్వరికీ కూడా పుత్రసంతానం కలుగలేదు. రాయలవారికి వయసు మళ్ళింది. ఇక పిల్లలు కలుగుతారనే ఆశ నిరాశ అయిన తరువాత పెద్దభార్య వెంకటాంబగారు ఒక తంత్రము పన్ని తాను కడుపుతోనున్నట్లు నటించి రాయలవారిని మోసగించి ఒక బ్రాహ్మణశిశువును తెచ్చి తాను కన్నట్లు ప్రకటించింది. ఈ చిత్రకథను గురించి బర్రడస్ అనే ఫాదరీ ఇలాగ వర్ణించాడు.

"ఈ పెద్దరాణీగారు పిల్లలకోసం పరితపిస్తూవున్న సంగతిన్ని, పిల్లలు కలగక పోవడమున్నూ చూసి ఆవిడ తండ్రి గారికి ఆశ్రితులుగానున్న ఒక బ్రాహ్మణ కుటుంబములోని ఒక స్త్రీ తనకు నెలతప్పినదనిన్నీ, తనకు తప్పకుండా మొగపిల్లవాడు కలుగుతాడనిన్నీ ఇప్పుడే రాణీగారు కూడా తనకు నెలతప్పినదని ప్రకటిస్తే నెలలు నిండిన తరువాత తనకు కలిగే పిల్లవాడిని పొత్తిళ్ళలో నుండగా రెండవకంటివారికి తెలియకుండా తమప్రక్కలో వేసుకుని తాము కన్నట్లు చెప్పవచ్చుననిన్నీ సలహా చెప్పగా రాణీగారు ఆ ప్రకారం తాను కడుపుతో వున్నట్లు నటించారు."

## బ్రాహ్మణ పుత్రుడు

బ్రాహ్మణ స్త్రీకి నెలలనిండి పిల్లవాడు కలుగగా ఆ చంటిపిల్లవాడిని రహస్యముగా రాజభవనంలోనికి తెప్పించి తమకు కాన్పు వచ్చినట్లున్నూ, మొగపిల్లవాడు కలిగినట్లున్నూ ప్రకటించింది.

ఈ మోసం సంగతి ఎలాగో రాలయవారి చెవిన పడింది. అయితే దీనిని గురించి గడబిడచేస్తే తనకూ, రాణిగారికీ కూడా అపకీర్తి కలుగుతుందని తోచి ఏమీ ఎరగనట్లు ఊరుకుని పుత్రోత్సవం జరిపి కుర్రవాడికి చిక్కరాయలని నామకరణం చేశారు.

విద్యానగర చక్రవర్తులు తమ తరువాత రాజ్యానికి వచ్చే యువరాజులను చిక్కరాయలని వ్యవహరించేవారు. అందువల్ల రాయలవారీ బాలుణ్ణి యువరాజుగా అంగీకరిస్తారనే చాలామంది అనుకున్నారు. కాని క్రమక్రమంగా ఈ కుర్రవాడి విషయంలో రాయలవారి ప్రవర్తన చాలా వింతగానున్నట్లు కనపడింది.

రాజకుమారడికి జరగవలసిన ముద్దుముచ్చటలు జరపడంలో లోపం ఏమీ చేసేవారు కారు కాని రాయలవారు అతడిని తమ కడుపునపుట్టిన పిల్లవాడిని చూసినట్లు మాత్రం చూచేవారు కారు. ఆ కుర్రవాడిని ఎల్లప్పుడూ అంతఃపురములోనే వుంచేవారు. ఎక్కడికైనా రాణివాసముతో పోవలసినదేగాని ఒంటరిగా పోవడానికి వీలులేదు. విడిగా పోవాలంటే రాయలవారి అనుజ్ఞను ముందుగా పొందాలి. ఇలాగ అదుపు ఆజ్ఞలలో నుంచారు. పదునాలుగేళ్ళు రాగానే రాయలవారు తమ బావమరిది కూతుర్నిచ్చి ఈ పిల్లవాడికి వివాహం కూడా జరిగించారు. ఎన్నిచేసినా యువరాజు కిచ్చే మర్యాదలు

మాత్రం చిక్కరాయలకు జరిగించలేదు. తన కుమారుడు రాయలవారి తరువాత రాజ్యం చేస్తాడనే ఆశ వెంకటాంబగారికి కూడా 1610 నాటికే లేదు.

## రంగరాయలు

వెంకటపతి దేవరాయలవారి తరువాత ఎవరు రాజ్యానికి వస్తారనే విషయం 1600 నాటికే ఆలోచనలో నున్నది. రాయలవారి అన్నగారున్నూ, శ్రీరంగపట్నానికి రాజప్రతినిధిగా నుండినవారున్నూ అయిన రామరాయల వారికి తిరుమల రాయలనిన్నీ చామరాజనే రంగరాయలనిన్నీ ఇద్దరు కుమారులు. వారిలో రెండవ కుమారుని మీదనే వెంకటపతి రాయలవారికి ఎక్కువప్రేమ. రాయలవారు కూర్చునే రత్నకంబళము మీద చిక్కరాయలనే యువరాజు తప్ప ఇతరులెవ్వరూ కూర్చునే ఆచారంలేదు. 1598-99 సంవత్సరాలలో జెసూటు క్రైస్తవ ఫాదరీలు రాయలవారి దర్శనానికి పోయినప్పుడు రాయలవారు కూర్చున్న తివాచి మీద ఆయనకు దగ్గరగా ఈ రంగరాయలే కూర్చుని యున్నాడని ఫాదరీలు వ్రాశారు.

రామరాయల తరువాత ఆయన పెద్దకుమారుడైన తిరుమలరాయలు శ్రీరంగ పట్నానికి రాజప్రతినిధిగా నుండి పరిపాలించాడు. ఆ సందర్భంలో కొన్ని విషయాలలో అతడు జరిగించిన చర్యలవల్ల రాయలవారికి అతనిపైన అనుగ్రహం తప్పింది. మైసూరు దగ్గర చిన్న సామంతుడుగా నుండిన రాజఒడయరు 1610 లో ఈ తిరుమలరాయలను త్రోసిరాజన్నాడు. 1612 లో వెంకటపతిరాయలవా రీ రాజ ఒడయరును సామంతరాజుగా అంగీకరించారు.

## మరణ శాసనము

వెంకటపతి రాయలవారికి అవసానకాలం ఆసన్నం కాగానే ఆయన రంగరాయలనే తమ తరువాత సామ్రాజ్యాన్ని పరిపాలించవలసిన రాజుగా నియమించారు. ఆ ఘట్టాన్ని గురించి బర్రడస్ ఇలాగ వర్ణించాడు.

"ఇక మూడురోజులకు చనిపోతామనగా రాయలవారు తమ మంత్రులు, సామంతులు మొదలైనవారి సమక్షంలో వెంకటాంబగారు కన్నట్లు చెప్పేకొడుకును తృణీకరించి తమ అన్నగారి రెండవకుమారుడైన రంగరాయలను తమ దగ్గరికి పిలిపించి తమ చేతి ముద్దుటుంగరమును తీసుకుని తమ తరువాత రాజ్యం చేయవలసిందని చెప్పి తమ చేతిని ఆయన వైపునకు చూపినారు. అంతట రంగరాయలకు పట్టలేని దుఃఖము వచ్చి తలవంచుకుని తనకు రాజ్యం అక్కరలేదనిన్నీ, దాని నెవరికైనా ఇవ్వవలసిందనిన్నీ అని రాయలవారి పాదములమీద ప్రణమిల్లి ఏడవసాగినాడు. ఆయనను లేవదీయవలసినదని రాయలవారు అక్కడున్నవారితో చెప్పగా వారు రంగరాయలను లేవదీసి రాయలవారి కుడివైపున కూర్చుండబెట్టారు. అంతట రాయలవారు తమ ఉంగరమును తీసికొన వలసినదని అతనికి చెప్పి తమ కుడిచేతిని మళ్ళీ అతని దగ్గరకు చాపినారు. కాని రాజకుమారుడు తన చేతులను తన తలమీద పెట్టుకుని తన్ను క్షమించ వలసినదని రాయలవారిని వేడుకున్నాడు. అంతట వృద్ధరాయలవారు తమ వ్రేలి యుంగరమును

తామే తీసి వ్రేలిచివర వ్రేలాడేటట్లుంచి మళ్ళీ చిక్క (రంగ) రాయల కివ్వబోగా అక్కడ నున్న సామంతులందరూ చెప్పిన మీదట ఆ రాజకుమారుడు దానిని స్వీకరించి, శిరసావహించి కన్నీరు కారుతూవుండగా దానిని తన చేతివ్రేలికి పెట్టుకున్నాడు. తరువాత రాయలవారు రెండు లక్షల విలువ చేసే తమ చీనిచీనాంబరాలను, ఆరు లక్షల విలువచేసే తమ చెవిని ధరించే పెద్ద వజ్రముల జతను, రెండు లక్షల విలువచేసే మంచి ముత్యాలసరములున్నూ తెప్పించి ఈ రాజలాంఛనముల నన్నింటినీ రంగరాయల కిచ్చి ఆయనను రాజుగా ప్రకటించారు"

(The Aravidu Dynasty. H.Heras pp. 494 – 507).



# 7. రామదేవరాయల పట్టాభిషేకము

వెంకటపతి దేవరాయలవారు 1614లో చనిపోగా అయన అన్నకుమారుడైన శ్రీరంగరాయలవారు సింహాసనము అధిష్ఠించారు. అయితే వీరెంతో కాలం రాజ్యం చెయ్యలేదు.

రాణీ వెంకటాంబగారి సోదరుడైన గొబ్బూరి జగ్గరాజుగారు చాలా చండశాసనుడు, క్రూరుడు, స్వార్థపరుడు, దుర్మార్గుడు. ముందుగా తన మేనల్లుడుగా ప్రకటింపబడిన పిల్లవాడిపక్షం వహించినట్లు నటించి తరువాత తానే రాజు కావచ్చుననే ఆలోచన జగ్గరాజుగారికి కలిగింది. అంతట జగ్గరాజుగారు కొందరు దుర్మార్గులను చేరదీసి శ్రీరంగరాయలను సకుటుంబంగా చెరపెట్టించి ఆ పిల్లవానిని రాజ్యాన నిలిపినాడు. చాలామంది సరదార్లు బలవంతుడైన జగ్గరాజు పక్షాన చేరారుగాని ధర్మాత్ముడైన యాచమనాయుడుగారు (నేటి వెంకటగిరివారి పూర్వీకుడు) ఈ అన్యాయానికి ఒడిగట్టలేక జగ్గరాజుతో చేరలేదు. పైగా కులగోత్రాలు తెలియని ఆ పిల్లవాడిని రాజుగా అంగీకరించి అతడికి లోబడడం పరువు తక్కువ అని ప్రకటించి చెరలో నున్న రాజకుటుంబాన్ని విడిపించేటందుకు ప్రయత్నించసాగినాడు. అక్కడి చాకలివాణ్ణి తనవశంచేసుకుని వాడిచేతి ఒక చీటీ వ్రాసియిచ్చి ఖైదులోనున్న శ్రీరంగరాయలవారికి చూపించి ఎలాగైనా ఆయన కుమారుణ్ణి ఎత్తుకుని రావలసినదని చెప్పి పంపించాడు. శ్రీరంగరాయలవా రా చీటీ చూసుకుని చాలా సంతోషించి పన్నెండేళ్ళ వయస్సుగల తమ రెండవ కుమారుడైన రామదేవరాయ లనే బాలుణ్ణి తీసుకొనిపోవలసినదని అనుజ్ఞ నిచ్చారు. అంతట ఆ చాకలివాడా పిల్లవాణ్ణి తన ముతికి గుడ్డలమూటతో నొక గంపలో పెట్టి బయటికి తెచ్చి యాచమనాయుడి గారి దగ్గర సురక్షితంగా చేర్చినాడు.

రామదేవరాయలు బయటపడిన సంగతి విని చాలామంది సరదార్లు యాచమ నాయుడి పక్షాన చేరారు. ఈ సంగతి తెలిసేటప్పటికి జగ్గరాజు గుండెల్లో రాయిపడింది.

సరదార్లను నయానా భయాన లంచాలిచ్చి బెదిరించి తమపక్షాన నిలుపుకొంటూ రంగరాయల కుటుంబం వారు తప్పించుకునిపోకుండా చెరసాలకు బందోబస్తు ఎక్కువచేసి జాగ్రత్తగా కాపలాకాయించడం ప్రారంభించాడు. అక్కడ యాచమనాయడుగారున్నూ ఎలాగైనా రంగరాయలవారిని సకుటుంబంగా చెరలోనుంచి తప్పించాలని విశ్వప్రయత్నాలు చేస్తూ ఆ బందిఖానా మనుష్యులను కొందరిని వశపరచుకొని బయటి నుంచి చెరసాలలోకి ఒక నేల సొరంగము త్రవ్వించాడు. దానిగుండా రాయలవారిని బయటికి రప్పించాలని ప్రయత్నిస్తూ వుండగా బయట పారాయిచ్చే బంటువాడొకడు ఆ సొరంగం మీద అడుగువేసి దిగబడినందువల్ల గల్లంతు అయి ఈ రహస్యం బయటపడింది. ఈ సంగతి జగ్గరాజుకు తెలియగా అతడు మండిపడి శ్రీరంగరాయలను ఆయన భార్యను, కొడుకును, కోడలిని, చిన్న బిడ్డలను అందరినీ చంపించాడు. ఇది వినేటప్పటికి రాజధానిలోని జనులందరూ అట్టుడికినట్టు ఉడికిపోయారుగాని జగ్గరాజునకు భయపడి ఎవరూ మాట్లాడలేకపోయారు. యాచమనాయుడిపట్టున స్నేహభావం హెచ్చిందిగాని పైకి వచ్చి ఎవ్వరూ సహాయం చెయ్యడానికి సాహసించలేదు.

అక్కడ యాచమనాయుడికికూడా రామరాయలను సంరక్షించే భారం చాలా దుర్భరమైపోయింది. ఇంక జగ్గరాజు తనమీదికి వచ్చి పడకమానదని యాచమనాయుడికి తోచింది. అందువల్ల ఆ పిల్లవాడిని ఎక్కడికైనా పంపి కాపాడడం మంచిదనితోచింది. పిల్లవాడి పితృవ్యపుత్రుడు తిరుమలరాయలు శ్రీరంగపట్నానికి పరిపాలకుడుగా నుండిన యతడు ఇదివరకే వెంకటపతి దేవరాయలవారిపట్ల కొంత అసంతృప్తిని వహించి యున్నందువల్ల అతడాపిల్లవాడిని రక్షిస్తాడనే నమ్మకంలేదు. విజయనగర సామ్రాజ్యానికి సామంత మండలేశ్వరులుగానున్న మధుర జింజీల నేలే నాయకులంత విశ్వాసపాత్రులుగా లేరు. ఒక్క తంజావూరును పరిపాలించే అచ్యుతప్పనాయకుడు మాత్రం వెంకటపతి దేవరాయల వారిపట్ల భక్తివిశ్వాసాలు కలిగియున్నాడు. అచ్యుతప్ప నాయకుడి కుమారుడైన రఘునాధ నాయకుడు అప్పటికే తనతండ్రికి రాజ్యపరిపాలనలో తోడ్పడుతూ మహా శూరుడని, సాహసౌదార్యాది సద్గుణములను కలిగినవాడని పేరుపొందియున్నాడు. ఈ తంజావూరువారి సహాయంకోరితే వారు తప్పకుండా రాజకుమారుణ్ణి రక్షిస్తారని యాచమ నాయుడికి తోచింది. అంతట యాచమనాయుడు రామదేవరాయలతోను, కొద్ది పరివారము తోను బయలుదేరి మధుర జింజీల నేలే సామంతులకుకూడా తెలియకుండా ప్రచ్ఛన్నంగా ఇతరులు పోయేమార్గానగాక తూర్పు సముద్రతీరము వెంబడిని తంజావూరుకు ప్రయాణమై తామువస్తూవున్న కార్యమును గురించి ముందుగా రఘునాధనాయకుడికి చారులద్వారా కబురుపంపించాడు.

రఘునాధనాయకుడున్నూ జరిగిన సంగతులన్నీ విని చాలా విచారించి యాచమనాయుడి ప్రభుభక్తికీ, ఔదార్యానికీ మెచ్చి రామదేవరాయలకు తప్పకుండా సాయం చేస్తామని అభయమిస్తూ కబురు పంపించాడు. అక్కడ జగ్గరాజున్నూ వేగులవాళ్ళ ద్వారా సంగతులు తెలుసుకుని రఘునాధనాయకుడితో యుద్ధము తప్పదని గ్రహించి ఇందులో తనకు సహాయం చేయవలసినదని అప్పట్లో మధురను, జింజిని పరిపాలిస్తూవున్న ముద్దు

వీరప్పను, కృష్ణప్పను కోరినాడు. ఈ సందులో తంజావూరుమీద తమకక్ష సాధించుకో వచ్చుననే యూహతో వారు సరేనన్నారు.

యాచమనాయుడున్నూ, రామదేవరాయలున్నూ తంజావూరు చేరినట్లు రూఢిగా తెలియనందువల్ల వారు కావేరి నదిని దాటకుండా చెయ్యాలని సంకల్పించి జగ్గరాజు కావేరి అనకట్టను తెగగొట్టించాడు. ప్రజలందరికీ ఉపయోగించే అనకట్టను ఇలాగ నాశనం చేసినట్లు రఘునాధనాయకుడికి తెలియగా ఆయనకు చాలాకోపం వచ్చింది. ఇలాంటి దుర్మార్గాన్ని చేసిన ఆ జగ్గరాక్షసుని చేతులనునరికి అతణ్ణి వధిస్తానని రఘునాధనాయకుడు శపథం చేశాడు. తంజావూరు మహామంత్రియైన గోవిందదీక్షితులవారి కుమారుడున్నూ, రఘునాధనాయకుడి శిష్యుడున్నూ అయిన యజ్ఞనారాయణ దీక్షితులవారు సంస్కృతంలో రచియించిన సాహిత్యరత్నాకరంలో ఈ శపథాన్ని ఇలాగ వివరించారు :

*"భిన్నైర్జగన్నృపాదిబాహుజనుషాం నేతుం శిరఃకర్పరైః*
*కావేర్యాం యుధి బంధయామి సుదృఢం కామం తదాహం భటైః*
*స్పష్టం త్రైర్విధృతాభిరేవ లిపిభిః స్వాయంభువాభిర్యథా*
*కర్తవ్యం జయరేఖికా విరచనం కల్ప్యేత కల్పావధి"*

యాచమనాయుడు రామదేవరాయలతో వస్తూ వుండగా వారిని దారిలోనే అటకాయించాలని మధుర జింజీల నేలే నాయకులు ప్రయత్నిస్తున్నారని తంజావూరు మహా మంత్రియైన గోవింద దీక్షితులవారికి తెలిసింది. అంతట వారిని నిర్జించి జగ్గరాజుతో యుద్ధము చేయవలసిన బాధ్యతను వయసుమళ్ళిన అచ్యుతప్పనాయకునిమీద పెట్టడంకన్న నడివయస్సులోనున్న యువరాజైన రఘునాధునిమీదనే పెట్టడం యుక్తమని ఆయనకుతోచి ఈ సంగతిని అచ్యుతప్పనాయకుడికి చెప్పి రఘునాధుడికి వెంటనే పట్టము గట్టించాడు. రఘునాధనాయకు డంతట తనపరివారముతో యాచమనాయకుడికి, రామదేవరాయలకు ఎదురుగావెళ్ళి వారిని కుంభకోణము దగ్గర కలుసుకుని సబహుమానంగా కోటలోకి తీసికొనివచ్చి సురక్షితంగా ప్రవేశపెట్టినాడు.

రఘునాధనాయకుడు నేపాళమని వ్యవహరింపబడే జాఫ్నాలోనున్న పోర్చుగీసు వారితోను, పాండ్యతుండీరములని వ్యవహరింపబడే మధుర జింజీలనేలు నాయకులతోను, గొబ్బూరి జగ్గరాజుతోను యుద్ధములుచేసి జయించిన సంగతి అనేక కావ్యములలో రసవంతముగా వర్ణింపబడినది.

రఘునాధనాయకుడు 1616లో జరిగిన యుద్ధములో జగ్గరాజును వధించి రామరాయల వారికి పట్టాభిషేకము చేయించగా రామదేవరాయలవారు 1632 వరకూ చంద్రగిరిలో రాజ్యం చేశారు.

అందుగల వెంకన్న యనే కవి నరపతివిజయమనే నామాంతరముగల రామరాజీయములో రఘునాధుణ్ణి మహాభారత యుద్ధములోని శ్రీకృష్ణునితో పోలుస్తూ ఈ విషయమును ఇలాగ వర్ణించాడు.

---

(చూ: బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రులుగారు ప్రకటించిన తంజావూరి రాజుల చరిత్ర పీఠిక. పుటలు 15-18; బ్ర.శ్రీ. కురుగంటి సీతారామయ్యగారి తంజాపురాంధ్రనాయక రాజచరిత్ర 4వ ఉపన్యాసము.)

సీ. సింగప్పవతి భీమసేనుండు రాయప్ప
శ్వేతాశ్వుఁ డయ్యెన మెచ్చునృపులు
మాద్రేయు లితరభూమండలేశ్వరులు వి
రాట పాంచాలాది రథికవరులు
రఘునాథనాయకాగ్రణియగు కృష్ణ న
పాయమ్మగాఁగను నాఁటి కెంచు
వీరప్ప యాచన విభుమాక భూవ దు
శ్శాసన సౌబల శల్య కర్ణ

గీ. యుక్తముగ జగ్గరాజదుర్యోధనుని వ
ధించి సంతసమున రామదేవరాయ
ధర్మతనయుండు ప్రజలు మోదంబెలర్ప
ధరణిఁ బాలించె ధర్మవిస్ఫురణ మెఱయ.

★ ★ ★

# 8. వీరభోగ వసంతరాయడు

కలియుగం అంతమవుతుందనీ, కృతయుగం ప్రారంభమౌతుందనీ, యుగ పురుషుడొకడు పుట్టి ప్రపంచాన్ని ఉద్ధరిస్తాడనీ చెప్పే పోతులూరి వీరబ్రహ్మంగారి వాక్యాలను ఇప్పటికీ తత్వాలు పాడేవారి నోటంట వింటూ వుంటాము.

*"చెప్పలేదంటనక పొయ్యేరు, నరులార గురుని వేరి మ్రొక్కితె బ్రతుక నేర్చేరు ॥చె॥*
*తప్పదిదిగో, గురుని వాక్యము, తప్పు త్రోవ పోవువారల చప్పరించి మ్రింగు శక్తులు ॥చె॥*

* * *

*కేక వేసియు ప్రాణమిడిచేరు, రాకాసిమూకలు కాకబట్టి కలువరించేరు, ఆకాశం ఎఱ్ఱనౌను, అరుమతములు ఒక్కటౌను, లోకమందున జనులు అందరు, నీరునిప్పున మునిగిపోదురు ॥చె॥*

*అగలు విడిచి పొగలుదాటేరు, అదిగాక పట్టపగలు చుక్కలు మాచి భ్రమసేరు, ఘుగులు ఘుగులు ధ్వనులు మింటను పుట్టి యేగినపిమ్మటను దిగులు పడుచు ప్రజలు చాలా దిక్కులేని పక్షులౌదురు ॥చె॥*

* * *

*ఏమొయేమో యెరుగకున్నారు ఎందెందు జూచిన యమునిపురికే నడువమందూరు, భూతలంబున నిట్టి వింతలు, పుట్టి యణగినపిమ్మటను, నీతి కృతయుగధర్మమప్పుడు నిజము నిలకడమీద తెలియును ॥చె॥*

*కీడులయినను కూడదందురు, ఒనగూడినపుడు విడనాడిన వాడుకొందురు. వేడుకతో పోతులూరి వీరభోగ వసంతరాయలు, యేడుదీవులు ఏకచ్ఛత్రము నేలును బ్రహ్మాండమంతయు"*

*॥తె॥*

ఇలాంటి అభిప్రాయాలు అన్ని దేశాలలోను, అన్ని మతాలవారిలోనూ అనేక కాలాలలో వ్యాపించియున్నట్లు దాఖలా లున్నవి. ఇటీవల 1943వ సంవత్సరము ఆగస్టు 1వ తేదీతో కలియుగం అంతమై కృతయుగము ప్రారంభమగుననే జోస్యం చెపుతూ ప్రకటింపబడిన 'చేతావని' అనే గ్రంథంలో వీటి వివరాలున్నవి.

దక్షిణ హిందూదేశ చరిత్రలో తిరుమలనాయకుడని ప్రసిద్ధిజెందిన మహారాజమాన్య రాజశ్రీ తిరుమల శౌరి నాయని అయ్యలు గారు, మధురరాజ్యాన్ని పరిపాలిస్తూ వుండగా 1653లో ఇలాంటి వదంతులు బైలుదేరి దేశమంతా అట్టుడికినట్టు ఉడికిపోయిందని మధుర మండల చరిత్రను రచియించిన నెల్సన్ 1868లో వ్రాశారు. ఇలాంటి వదంతులు బైలుదేరడమే తడవుగా యివి దేశములో వ్యాపిస్తవి. విద్యాగంధములేని సామాన్య జనులేగాక విద్యావంతులుకూడా ఈ వదంతులను విశ్వసించి అలజడి చెందుతూ వుంటారు.

బ్రహ్మంగారి తత్వాలు పాడుతూ గ్రామాల వెంట అడుక్కుంటూ తిరిగే బిచ్చగాళ్ళు మనదేశంలో ఇప్పటికీ కనబడుతూ వుంటారు.

కొద్దిరోజులలో ఉత్తరాదినుంచి దైవాంశసంభూతుడైన రాజకుమారు డొకడు వస్తాడనిన్నీ, ప్రస్తుతము అమలు జరుగుతూఉన్న రాజకీయ, సాంఘిక, మత వ్యవస్థల నన్నింటినీ అతడు తారుమారు చేస్తాడనిన్నీ, అంతట పాడిపంటలతో తులతూగుతూ శాంతి సౌఖ్యములు కలిగియుండే కృతయుగము ప్రారంభమౌతుందనిన్నీ జోస్యాలు చెపుతూవుండే కొన్ని తత్వాలను పాడుతూ చాలామంది బిచ్చగాళ్ళు 1653లో మధురా మండలంలోని గ్రామాలవెంట తిరగటం ప్రారంభించారు. ఈ పాటలలో సూచించబడిన జోస్యాన్ని చాలామంది నిజమని నమ్మడం ప్రారంభమైంది. ఆ కృతయుగం ఎప్పుడు వస్తుందా అని ప్రజలు నోళ్ళు తెరచుకుని యెదురు చూస్తున్నారు. ఎవరైనా ఇది పుక్కిటిపురాణమని అనడానికి సాహసిస్తే వెంటనే నలుగురు పెద్దమనుష్యులు ఆ మాటలన్న వాళ్ళను మందలించి ఇలాంటి విషయాలలో కాదనడం అపచారమని వారించేవారు. దేశమంతటా తిరుగుతూ వుండే సన్యాసులు, గోసాయిలు, బైరాగులు ఈ నమ్మకాలను త్వరలోనే దేశంలో ప్రచారం చేశారు. కొందరు నేర్పరులైన మోసగాండ్రు అమాయకులను వంచించి రాబోయే మహాపురుషుడి కోసమని చందాలుకూడా వసూలు చెయ్యడం ప్రారంభించారు.

అంతట యుగపురుషుడు కాబోయే శిశువున్నూ, అతని తల్లిన్నీ ఉత్తరాదినుంచి బైలుదేరి మధురా నగరానికి వస్తున్నారనిన్నీ, బెంగుళూరు చేరుకున్నారనిన్నీ ఒక వార్త పుట్టింది. ఆ మహానుభావుణ్ణి దర్శించి తరించడం ఎప్పుడెప్పుడని ప్రజలు పట్టలేక తల్లడిల్లి పోతున్నారు. ఈ అవతారపురుషుడికి తామంతా తప్పకుండా కప్పాలు చెల్లిస్తామని మధురానగరం చుట్టుపట్ల పాళెగార్లందరూ స్పష్టంగా చెప్పారు. కాని ఆ మహాపురుషుడికి రావడంమాత్రం ఎప్పటికప్పుడు వెనిక్కి పోతూవుంది. ఈ వదంతులు వ్యాపింపజేస్తూ

వున్నవారు కొందరు గూడుపుఠాణీచేసి ఒక స్త్రీని, శిశువును బెంగుళూరులో ముస్తాబు చేసియుంచి వారిని దర్శించడానికి కొందరిని పంపించారు. కొందరు పోతూవుండడంచూసి ప్రజలలో వేలంవెర్రి పుట్టింది. ఆ సార్వభౌముణ్ణి చూడడానికి తండోపతండాలుగా ప్రజలు బెంగుళూరికి పోవడానికి పయనమైనారు. ఆ సమయంలో బెంగుళూరు ప్రాంతాలను పరిపాలించే మహమ్మదీయు లీ మూఢ ప్రజలదగ్గరనుంచి హాశ్శీలు వసూలుచేసి వారిదగ్గరున్న సొమ్మును తీసుకొని కొందరిని వధించి తక్కిన వారిని వెనక్కి పొమ్మని నిరోధించారు.

ఇంతజరిగినా ఈ వేలంవెర్రి పూర్తిగా తగ్గలేదు. అవతారమూర్తియైన శిశువు తాత్కాలికంగా పరమపదించినా మళ్ళీ పునర్జీవం జెంది త్వరలోనే అనుకున్న మహత్కార్యాలన్నీ సాధిస్తాడని కొందరు నేర్పరులు ప్రచారంచేస్తూ మధురానగర వాసులను నమ్మించి వారివల్ల అనేక విధాలుగా సొమ్ము కాజెయ్యడం ప్రారంభించారు. అప్పట్లో ఆ ప్రాంతాలలో నుండే పాశ్చాత్యు డొకడు ఈ సంగతులను గురించి ఒక ఉత్తరంలో వర్ణించాడు. అయితే వస్తాడనుకొన్న అవతార పురుషుడిపేరు మాత్రం ఆ వుత్తరంలో నుదాహరించలేదు. ఎప్పటికప్పుడు ఇలాగ అవతరిస్తాడని ప్రజ లనుకునే వీరభోగ వసంతరాయడే అప్పట్లో వస్తాడనుకున్న యుగపురుషుడై యుంటాడనిన్నీ, 1866 నాటికి కూడా విద్యావంతులైన దేశీయులలో ఇలాంటి నమ్మకం బాగావ్యాపించి యున్నదనిన్నీ నెల్సన్‌గారు వ్రాశారు*.



# 9. జోగిపంతులు - తిమ్మజగపతి

మచిలీబందరులో ఇంగ్లీషు వర్తకం కంపెనీవారి రాష్ట్రీయ కార్యాలోచన సంఘము వారి సభాపతి పరిపాలనలో చేరిన రాజమహేంద్రవరం సర్కారు జమీందారులు సాధారణంగా ఏదో పనిమీద బందరువచ్చి ఆ రాష్ట్రీయ సభాపతితో మాట్లాడవలసి వచ్చేది. 1762 మొదలు 1766 వరకూ జాన్ పైబస్ అనే దొర బందరులో రాష్ట్రీయ సభాపతిగా వున్నాడు. ఆయన దగ్గర కాంద్రేగుల జోగిపంతులుగారు ద్విభాషిగా నుండేవాడు. ఆ కాలంలో 'పంతులు' గారంటే జోగిపంతులు గారే. ఈయన చాలా పలుకుబడిని సంపాదించి 1763-65 మధ్య పైబసుగారి తరఫున హైదరాబాదు నవాబుగారితో రాయబారాలు నడిపినవాడు. ఇతడు కంపెనీవారికి చేసిన అమూల్యమైన సేవకు ప్రతిఫలంగా దీవిసీమలోని కొన్ని వూళ్ళలో హవేలీ భూముల నీయనకు జాగీరుగా ఇచ్చారు.

జోగిపంతులుగారి తరువాత ఆయన సోదరులైన వెంకట్రాయులుగారు బందరులో మరికొందరు రాష్ట్రీయ ప్రధానాధికారులదగ్గర ద్విభాషిగా పనిచేసి మెప్పుపొంది 1776లో దీవి తాలూకాలోని హవేలీ భూములన్నిటినీ పందేళ్ళకు కవులుకు పొందినాడు. ఆ భూములను ఆయన తమ్ముడి కుమారుడైన జగ్గప్పపేర మళ్ళీ కవులిచ్చారు. 1807వ

* (The Madura Country, J.H.Nelson Part III pp. 131)

సంవత్సరములో దీవి తాలూకాను కాంద్రేగుల జోగిపంతులుగారి మనుమడైన గోపాలరావు గారికి జాగీరుగా యిచ్చారు. ఈ గోపాలరావుగారు 1812లో చనిపోగా అయన చిన్న తమ్ముడు జగన్నాధరావుగారికిది సంక్రమించింది. తరువాత అయన వారసుడు గోపాలరావు దీవి జమీందారుడై తన భార్యకు దత్తత అధికారము నిచ్చి 1836లో చనిపోయినాడు. తరువాత 1853 వ సం॥మార్చి 25వ తేదీన దీవి జమీందారీ వేలము వేయబడి కంపెనీ గవర్నమెంటువారే ఖరీదు చేయడంతో ఈ జమీందారీ అంతరించింది (Krishna Dist. Manual p. 215).

బందరులోనున్న కాంద్రేగులవారి మేడ నిప్పటికి 'పంతులుగారి మేడ' అని అంటారు. వీరి సంతతి వారిప్పుడు రాజమహేంద్రవరంలో సంపన్నులుగా నున్నారు.

పైన చెప్పిన కాంద్రేగుల జోగిపంతులుగారు అఖండమైన రాజ్యతంత్రవేత్త. తన నేర్పుచేత రాజులను, జమీందార్లను తనకు దాసానుదాసులుగా చేసుకోగలిగినాడు. ఇతణ్ణి చూస్తే వారందరికీ చాలాభయం. వీరింటిదగ్గర ప్రతిరోజూ జమీందార్లు పడిగాపులుకాస్తూ పడివుండేవారు.

క్రమక్రమంగా జోగిపంతులుగారికి ధనము, గర్వము కూడా హెచ్చిపోయినవి. అందువల్ల అయన అప్పుడప్పుడు రాజులను అవమానించడం కూడా కద్దు.

పెద్దాపురం సంస్థానాధిపతియైన విద్వత్తిమ్మ జగపతి రాజుగారు చాలా తెలివైన వాడు; విద్యావంతుడు. అయన వ్యవహారరీత్యా బందరులో రాజుపేటలో వుంటూ వుండేవాడు. వత్సవాయి రాజులు, పూసపాటి రాజులు నివసించినందువల్లనే ఆ పేటకు 'రాజుపేట' అని పేరువచ్చినది. ఈ రాజులకు గొడుగుపట్టే పరిచారకుడు గాలివానలో చిక్కినట్లున్నూ, రాజుగారు ఒక చెట్లగుంపు క్రింద నిలబడగా అది గొడుగుగా కాచినట్లున్నూ, అందువల్ల దానికి 'గొడుగుపేట' అని పేరు వచ్చినట్లున్నూకూడా ఒక కథ ఉన్నది.

ఏది ఎలాగుఉన్నా తెలుగు జమీందార్లు, రాజులు బందరులో పడివుండి జోగిపంతులుగారి దర్శనంకోసం వేచియుండడం జరుగుతూ ఉండేది. ఆ సందర్భంలో ఒకమాటు తిమ్మజగపతి రాజుగారు ఏదో పనివుండి జోగిపంతులుగారి యింటికి వెళ్లారు. పంతులుగారు లోపల ఉన్నందువల్ల దర్శనానికి వీలులేకపోయింది. అంతట తిమ్మజగపతిగారు పంతులుగారి కచ్చేరీ చావడిలో పంతులు గారు కూర్చునే తివాచీమీద వారిదిండు నానుకుని కూర్చున్నారు. కొంతసేపటికి పంతులుగారు బయటికివచ్చి యిదిచూసి కోపోద్దీపితులై "మర్యాద ఎరగకుండా తమ దిండు నానుకొని కూర్చున్నందువల్ల తిమ్మనిం దిమ్మని చేస్తా"నని ప్రతిజ్ఞ పలికారు. మహారాజుగారామాట విని "సరే జోగిని జోగిని చేస్తాము లెండి" అని వెళ్ళిపోయారు.

తరువాత తిమ్మజగపతి గారు ఈ జోగిపంతులుగారు రాజులను చేసే అవమానాలను గురించి తోడి రాచవారికీ వెలమ వారికీ తెలియపరచి అక్కడ జరిగిన శపథాలను గురించి కూడా చెప్పి దీనినిగురించి అలోచించవలసిన దన్నారు. వారందరూ మీరేమి చెపితే అది చేస్తామన్నారు. అంతట తిమ్మజగపతిగారు రాజులను సమావేశపరచి

తమకు హిందూస్థానీ బాగా వచ్చివున్నందువల్లను ఇంగ్లీషుదొరలతో తాము హిందూస్థానీలో మాట్లాడగలమనిన్ని ఇకముందు జమీందారులకూ, ఇంగ్లీషు అధికారులకూ గల వ్యవహారాలలో జమీందార్లతరపున తిమ్మజగపతిరాజుగారి ద్వారానే జరిగించవలసినదనిన్నీ విన్నవింపజేశారు. అందుకు రాష్ట్రీయాధికారి అంగీకరించాడు. అంతట తిమ్మజగపతిరాజు గారు బందరులోనే ఉంటూ జమీందారుల తరఫున అతి సమర్థతతో ద్విభాషిగా వ్యవహరించ సాగినారు. అందువల్ల జమీందారులు జోగిపంతులు గారిదగ్గరికి పోవలసిన పని లేకపోయింది. అంతట జోగిపంతులుగారి కిదివరకు వచ్చే ఆదాయము సన్నగిల్లినది. ఉద్యోగ హోదాలుకూడా తగ్గిపోయినవి. ఆయన కొన్ని చిక్కులలో చిక్కుకున్నారు. ఆ కారణాలవల్ల జోగిపంతులుగారు తిమ్మజగపతిగారిమీద పగపూని ఆయనను చంపడానికి ప్రయోగం చేయించారట. అప్పుడు తిమ్మజగపతిగారు కూడా తమ మంత్రవేత్తలచేత దానిని త్రిప్పికొట్టగా అది జోగిపంతులుగారినే చంపినదట.

తిమ్మజగపతిగా రిలాగ జమీందారుల ప్రతినిధిగా ఇంగ్లీషు అధికారులతో వ్యవహారాలు జరపడంవల్ల అయనకు పలుకుబడి ఎక్కువై పెద్దాపురంలో ఆయన దర్బారులోకి చాలామంది రాజులు వస్తూవుండేవారు. ఆయనను గురించి చాలాకథలు చెప్పుకుంటారు*.



# 10. టిప్పూ సుల్తాన్ చేయించిన జపం

పూర్వం హిందూరాజులు చేయించినట్లే తురక నవాబులు కూడా తమ యిష్ట సిద్ధికోసం జపాలు చేయిస్తూ వుండేవారు. బ్రాహ్మణులచేత జపాలు, హోమాలు చేయించడంలో (1761-82) మధ్య మైసూరును పాలించిన హైదరాలీకి మంచినమ్మకం వుండేది. అతడికి హిందువులు విశ్వసించే అనేక విషయాలయందు నమ్మకం వుండేది అతడు శకునాలు, రక్షరేకులు, పూజలు పురస్కారాలు పూర్తిగా విశ్వసించేవాడు. అనేక దేవాలయాలకు మొక్కుబళ్ళు చెల్లించాడు. దానధర్మాలిచ్చాడు. ఇప్పటికీ అతడిచ్చిన వస్తువాహనాలు, కట్టిన గోపురాలూ కనబడుతున్నాయి.

1782 - 1799 మధ్య మైసూరు నేలిన టిప్పూ సుల్తానుకు హిందువుల ఆచారాలమీద అంతగా నమ్మకంలేదు. బ్రాహ్మణులంటే కూడా ఎక్కువ గౌరవంలేదు. అయినప్పటికీ తనమీదికి శత్రువులు దండెత్తి వచ్చినప్పుడు మాత్రం బ్రాహ్మణులచేత జపాలు చేయించేవాడు.

జపదీక్షవహించి, భోజనాలు మాని పాలు ఫలహారాలు మాత్రం ఆరగిస్తూ నియమంగా వుండే బ్రాహ్మణులు పదిమంది గాని, నూరుమందిగాని కావేరీ నదిలోనో, పెద్దచెరువులోనో రొమ్ముబంటిలోతు నీళ్ళలో నిలిచి మంత్రాలు చదువుతూ తమ చేతులతో

* బ్రా॥శ్రీ॥ కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రిగారి పెద్దాపుర సంస్థాన చరిత్ర విమర్శనము.

ఉదకాన్ని స్పృశిస్తూ సుల్తానుగారికి యిష్టసిద్ధి కలగగలందులకని తదేకనిష్ఠతో జపంచేస్తూ వుండేవారు. ఇలాంటిజపం చాలాసార్లు జరిగినట్లు చరిత్రకారులు వర్ణించారు.

గవర్నరు జనరలైన కారన్ వాలీసు శ్రీరంగపట్నం మీదికి రెండుసార్లు స్వయంగా దండయాత్రకు వెళ్ళినప్పుడు టిప్పు సుల్తాను బ్రాహ్మణులచేత ఇలాగ జపం చేయించాడు. ఆ రెండుసార్లూ కారన్ వాలీసు వెనుకకు పోవలసివచ్చినందుకీ జపమహాత్మ్యమే కారణమని అన్నారు. తరువాత మళ్ళీ జనరల్ హారిస్ శ్రీరంగపట్నం మీదికి వచ్చినప్పుడు కూడా ఇలాంటి జపం చేయించినా టిప్పు సుల్తానుకు అపజయము కలిగింది. దీనికి కారణం ఈ జపం చేయించిన పురోహిత బ్రాహ్మణుడిలో ఏదో లోప మున్నందువల్లనని కొందరన్నారు.



# 11. మహమ్మదాలీ చేయించిన మారణహోమం

బ్రాహ్మణుల జపాలయందూ, మంత్రబలమందూ ఈ దేశపు తురకలకుకూడా విశ్వాసముండడాని కిది యొక్కటే దృష్టాంతముకాదు. ఇంకా చాలా ఉదాహరణ లున్నవి.

1749 మొదలు 1795 వరకూ ఆర్కాటు నవాబుగా నుండి ఇంగ్లీషు వారికి స్నేహితుడైయుండిన మహమ్మదాలీ వాలాజా నవాబుకు కూడా ఇలాంటి నమ్మకం ఉండేది. చెన్నపట్నం కోటకు గవర్నరుగా నుండిన పిగట్టు తంజావూరు రాజ్యాక్రమణ విషయంలో నవాబు ఆటలు సాగనివ్వడం లేదని నవాబుగారికి కార్పణ్యం కలిగింది. అందువల్ల పిగట్టు గారిని పరిమార్చడానికని నవాబు ఐదువేల నవరసులు ఖర్చుపెట్టి అచ్చన్న పండితులనే బ్రాహ్మణుడిచేత ప్రయోగం చేయించాడట. అంతట పిగట్టు 1776లో పదభ్రష్టుడై చెరలోనే మరణించాడట. ఇలాగే మహమ్మదాలీ హైదరాలీతో యుద్ధం నిగ్రహించలేక పగపట్టి అతణ్ణి పరిమార్చడం కోసం కూడా జపాలు చేయించాడట.

బ్రాహ్మణులచేత జప తప హోమాదులు, మంత్ర తంత్రాలు చేయించడమేగాక మహమ్మదీయులలో కొందరు స్వయంగా కూడా యిలాంటి జపాలను, మారణహోమాలను చెయ్యడం నేర్చుకొని ప్రయోగించేవారట.*



# 12. "హైదరు లింగము"

క్రీ.శ. 1761–1782 మధ్య మైసూరు రాజ్యాన్ని పరిపాలించిన హైదరాలీ బహద్దరుగారు హిందువుల దేవాలయాలకు మ్రొక్కుబళ్లు చెల్లించినట్లు చాలా నిదర్శనములు కనబడుతున్నవి.

---

* Historical Sketches of South India - Col. Mark Wilks (1810) P 55.

మైసూరులో నంజనగూడులో నంజుండేశ్వరాలయం అనే ఒక గొప్ప దేవాలయం ఉంది. ఆ దేవాలయంలో తన పేరుతో ఒక లింగాన్ని ప్రతిష్ఠించవలసిందని హైదరాలీ అక్కడి స్థానాపతులను కోరి కొంతసొమ్ము ఇచ్చినందువల్ల 'హైదరు లింగం' అనే లింగాన్ని ప్రతిష్ఠించారు. ఈ లింగానికి ధూపదీప నైవేద్యాలకోసం హైదరాలీ చాలా సొమ్ము ఇచ్చి దేవాదాయాన్ని యేర్పాటుచేశాడు.



# 13. హైదరాలీ కట్టించిన దేవాలయ గోపురం

మైసూరు రాజ్యంలో శ్రీరంగపట్నంలో నున్న శ్రీరంగనాథ స్వామివారి దేవాలయం చాలా పురాతనమైనది. దీని గోపురం చాలా గొప్పది. మైసూరు రాజ్యాన్ని హైదరాలీ, టిప్పూ సుల్తానులు ఏలిన కాలములోగూడ ఈ రాజు లీ దేవాలయానికి ఎలాంటి హానీ గూడా కలగకుండా కాపాడారు.

ఈ దేవాలయానికి కొంత దూరంలో హైదరాలీ సర్కారువారి ఫిరంగులు మొదలైనవాటికి కావలసిన మందుగుండుసామాను తయారుచేసే కార్ఖానా యుండేది. ఒకమాటు ఆ కార్ఖానాకు నిప్పు అంటుకుని బ్రహ్మాండం బ్రద్దలు అయ్యేటంత చప్పుడుతో ప్రేలింది. ఆ అదటుకి దగ్గరలో నున్న రంగనాథస్వామివారి దేవాలయగోపురం విరిగి క్రింద పడింది. అప్పుడు మైసూరు రాజ్యాన్ని ఏలుతూవున్న హైదరాలీ వెంటనే తన సైనికులను పంపి వాళ్ళచేతనే ఆ గోపురాన్ని మళ్ళీ కట్టించాడు.



# 14. హైదరాలీ స్వామివారికిచ్చిన రత్నహారం

ఒకమాటు హైదరాలీకి చాలా ప్రియమైన ఒక ఏనుగు గున్నకి కంటిజబ్బు చేసింది. ఎన్ని మందులు వేసినా నయం కాలేదు. కన్ను పోతుందన్నంత భయం కలిగింది. ఎవరో నంజుండేశ్వరస్వామికి మ్రొక్కితే జబ్బు కుదురుతుందన్నారు. సరే మొక్కుకున్నాడు. ఏనుగు గున్నకి కొద్ది రోజులలోనే జబ్బు కుదిరింది. అప్పుడు హైదరాలీ సంతోషంతో నవరత్నాలు పొదిగిన హారాన్ని దేవుడికి సమర్పించాడు.

# 15. చాముండేశ్వరికి సుల్తానుగారి ఆభరణాలు

మైసూరు నగరంలో ఒక కొండమీద వెలసిన చాముండేశ్వరికి హైదరాలీయున్నూ, ఆయన తరువాత మైసూరు రాజ్యం ఏలిన ఆయన కుమారుడు టిప్పూ సుల్తానున్నూ కూడా చాలా విలువగల ఆభరణాలు, వస్త్రాలు సమర్పించారు. ఇప్పటికీ దేవికి అలంకారం చేసేటప్పుడు ఆ ఆభరణాలు, వస్త్రాలు తొడుగుతారు.



# 16. టిప్పూ సుల్తాన్ శృంగేరీ శంకరాచార్యులవారు

హైదరాలీ తరువాత ఆయన కుమారుడైన టిప్పూ సుల్తాను 1782 మొదలు 1799 వరకూ మైసూరు రాజ్యాన్ని ఏలినాడు. హైదరాలీ టిప్పూ సుల్తానులు ఇద్దరూ తమ రాజ్యంలో చేరిన శృంగేరీ మఠాధిపతియైన శంకరాచార్య స్వామివారిని గౌరవించేవారు. ఒకమాటు మరాఠీదండు శృంగేరీమీద పడి ఆ యూరినీ, ఆ మఠాన్నీ కూడా దోచుకున్నారు. అప్పుడు ఆ స్వాములవారికీ, వారిశిష్యులకూ అన్న వస్త్రాలకే కరువైంది. ఈ సంగతి టిప్పూ సుల్తాను వారికి తెలియగానే వారికి ఆహార పదార్థాలూ, బట్టలూ, కొంత రొఖ్ఖమూ పంపించి మరాఠీదండు మళ్ళీ వచ్చి పడకుండా కాపుదలకోసం కొంత సైన్యాన్ని కూడా పంపించారు. ఈ సందర్భంలో శృంగేరీస్వామివారికీ, టిప్పూ సుల్తాను వారికీ జరిగిన ఉత్తరప్రత్యుత్తరాలు యిప్పటికీ వున్నాయి. వీటివల్ల ఈ తురకరాజు హిందూ మతాచార్యుల పట్ల ఎంత మర్యాదతో ప్రవర్తించినదీ తెలుస్తుంది.

# కథలు - గాథలు

## • మూడవ భాగము •

త ముద్రణ : 1946

# పీఠిక

భారతదేశ చరిత్రకును, భారతీయ ప్రజా జీవనమునకును సంబంధించినట్టియు, భారత జాతీయాభ్యుదయమునకు తోడ్పడగలట్టియు చరిత్రాత్మకములైన కథలను గాథలను కొన్నిటిని ఇదివఱకు రెండు సంపుటములుగా ప్రకటించియున్నాను. ఇప్పుడు మఱికొన్నిటి నీ మూడవ సంపుటమున జేర్చితిని.

ఇందులో "ఢిల్లీ సుల్తానుల నాణెములపైన హైందవ చిహ్నములు", "ముసల్మానులు - హోలీ పండుగ" అను వ్యాసములు మాత్రము ఆంధ్ర పత్రికయం దొకమారు ప్రకటించియుంటిని. తక్కినవి ఎక్కడను ప్రకటించి యుండలేదు.

బెజవాడ,
25-10-1946.

దిగవల్లి వేంకట శివరావు

# 1. అతిరూపుని కథ

కటకము మొదలు కన్యాకుమారివరకును గల దక్షిణా పథమును విజయనగర చక్రవర్తులు పరిపాలించుచుండగా వారికి కప్పము చెల్లించు సామంతమండలేశ్వరులు రామేశ్వర ప్రాంతముల నేలుచుండిరి. వీరు సేతువునంటియున్న దేశమునేలు ప్రభువులు గనుక వీరికి వంశపారంపర్యముగ 'సేతూపతి' యను పౌరుష నామముండెను.

సేతూపతి రాజ్యములో నొక చిన్న గ్రామమునందు సత్యవాక్యుడను నొక బీద బ్రాహ్మణుడుండెను. అతడు చాల మంచివాడు, గొప్ప విద్వాంసుడు. అందు ముఖ్యముగా జ్యోతిష శాస్త్రమునందు ప్రజ్ఞావంతుడు. ఆయన గొప్ప వాక్శుద్ధి కలవాడనియు, ఆయన చెప్పు జోస్యమునకు తిరుగులేదనియు పేరు పొందినందున దూరదేశములనుండి కూడ చాలమంది ఆయన దగ్గరకువచ్చి తమ జాతకములు చూపించుకొనుచుండిరి. వచ్చిన వారివలన నొక చిల్లిగవ్వయైన బుచ్చుకొనక ఆయన వారికి గావలసినదెల్ల చెప్పి పంపు చుండును. వారు తన నెంత శ్రమ పెట్టిననుకూడ విసిగికొనడు.

సత్యవాక్యుని తెలివితేటలను మంచితనమును జూచి ఆ గ్రామము వారును ఆ దేశమువారును మాత్రమేగాక దూర దేశములవారు కూడ సంతోషించి ఆయనను వేనోళ్ళ పొగడి పోవుచుందురు. అందువలన నతడెంత ప్రతిభాశాలియైనను, ఆయనకు విద్యమూలమున నెట్టి యాదాయము లేకుండెను. ఆయన జీవనమునకు భూవసతిగాని, యితర విధమైన రాబడి కాని లేవు. సత్యవాక్యునికి భార్య తప్ప పోషించవలసిన యితర బంధువు లెవ్వరు లేనప్పటికిని తనకును, తన భార్యకును జీవనము జరుగుటకైన నెట్టి యాధారమును లేకుండెను. అందువలన నాయన పదియవ గడియ కాగానే భిక్షాపాత్రను చేతబూని, బయలుదేరును. తనకును, తన భార్యకును కావలసిన భోజన సామగ్రి దొరకగనే, యింటికి తిరిగివచ్చును. తమ కిరువురకు సరిపోవు దానికన్న యితరులిచ్చినను పుచ్చుకొనడు. ఇది చూచి చాలమంది యాశ్చర్యపడుచుందురు.

సత్యవాక్యుని భార్యయు చాల దొడ్డయిల్లాలు. ఆమె విద్యావతియు, గుణవతియునై, భర్త యిష్టప్రకారమె నడచుకొనుచుండును. ఇంట నిదియున్నది, యిది లేదని భర్తతో నెన్నడు పలుకక, ఆయన తెచ్చిన దానిని పుచ్చుకొని, గృహకృత్యముల నిర్వహించుకొను చుండును... చాల కాలమిట్లు గడచెను.

ఈ దంపతులిరువురు దారిద్ర్యము ననుభవించుచున్నను, చాలకాలము వఱకు సంతోషముగనే, జీవించుచుండిరి, ఒకనా డాయన భార్యకిట్లు తోచెను. "నా భర్త జ్యోతిష విద్యయందెంతో గొప్పవాడుగానున్నాడు. సేతూపతి మొదలు సామాన్య మనుష్యునివరకు, నాయన దగ్గరకు వచ్చుచున్నారు. ప్రతిదినము సూర్యోదయమునుండి పదియవగడియవరకు నాయన యితరులకు జ్యోతిషము చెప్పుటయందే వినియోగించును. పదియవ గడియ

మొదలు పదునైదవ గడియవఱకు యాచన నిమిత్తము తిరుగును. ఆయన తనకును, నాకును ఆ దినమునకు కావలసిన గ్రాసము మాత్రము పట్టుకొని వచ్చును. మరల సాయంత్రము జ్యోతిషము చెప్పుటయే వినియోగించును. ఎంతో కష్టపడి సంపాదించిన విద్యను ప్రతిఫలము పుచ్చుకొనకుండ వినియోగించుటలో నాయన యుద్దేశ్యమేమి? భార్య భర్తలము సంసారము చేయుచున్నాము కదా. మేము సుఖముగ జీవించుటకు సొమ్ము అక్కరలేదా? చాలా సొమ్ము నార్జించుటకును, విశేషధనమును కూడబెట్టి ధనవంతు డగుటకును, ఇంత యవకాశమున్నప్పుడు, ఆయన యెందుల కట్లు చేయుటలేదు? దీనికేదో బలవత్తరమైన కారణముండి తీరవలెను. నే నింతవరకు నాయన నడుగకుండ నోపిక పట్టగలిగితిని. ఈ రాత్రి యడిగివైచెదను – అని నిశ్చయించి యా రాత్రివఱకును వేచియుండెను.

సత్యవాక్యుఁ డెప్పటివలెనె ఆ రాత్రియు చాల శ్రమపడి నిద్రించు సమయమున, భార్యముఖమున నెప్పటి సంతోషం లేక చిన్నబోయి యుండుటచూచి, యాశ్చర్యపడెను. తామిరువురును చాల యన్యోన్యముగల దంపతులుగ నున్నారు. వారిలో నెట్టి యరమరలు లేవు. అభిప్రాయ భేదములేదు. తా నామె కనిష్టమైన పనిచేయలేదు. ఏ మాటను అనలేదు. ఎందువలన నామె చింతాక్రాంతురాలై యున్నది? అని వితర్కించి – 'ప్రేయసీ, నీ వీరాత్రి యిట్లున్నావేమి? మనము నిష్కళంకమును పవిత్రమునైన జీవనము చేయుచున్నాము. మన మొరులకు భయపడవలసిన యగత్యములేదు. ఇతరులు మన కెట్టి హానియు చేయవలసిన యవసరము లేదు. మనమెంత బీదవారమైనను, మనకు గొప్ప పేరు ప్రతిష్ఠలున్నవి. ఎవ్వరైన మన కపకారము చేసినచో వారిని తగురీతి శిక్షింపజేయగలము. నీవెందులకిట్లు అవనత వదనవై యున్నావు? నీ కెవ్వరేమి యపకారము గావించిరి?' అని భర్త యిట్లు గ్రుచ్చి గ్రుచ్చి యడుగగా నామె తన బేలతనమునకు తానే సిగ్గుపడెను. ఇంతటి దారిద్ర్యము ననుభవించుచున్నను, ఇంతటి మహోత్కృష్టములైన యుత్తమ గుణములను ప్రదర్శించు తన భర్తకు సంపదలు తృణప్రాయములని యామె యెఱుగును. ఆమె తన భావములను వెల్లడించుటకే సిగ్గుపడుచు, – "ప్రాణేశ్వరా, మీ భార్యనైన నా కితరుల వలన నెట్టిహానియు కలుగనేరదు. మీ దివ్యనామమే యంగరక్షగ నేను నిర్భయముగ ప్రపంచమంతటను తిరుగగలను. అగ్నికూడ నన్నంట వెఱచును. మీ ప్రభావమట్టిది. అయిన నొక విషయము నా మనస్సును బాధించుచున్నది. అమిత ధనమునార్జించి, మహారాజు వలె సుఖముగా నుండుట కనేక అవకాశములుగల మీరెందులకిట్లను దినము యాచన చేసికొనుచు కష్టపడి జీవింపవలె? మన మెందులకిట్లు బీదవారముగ నుండవలె? అను ఆలోచన, నాకీ దినమున కలిగినది –" ఈ మాటలు విని సత్యవాక్యుడు చిరునవ్వు నవ్వుచు – "ప్రేయసీ, నీవితర స్త్రీలకన్న వివేకవంతు రాలవనుకొంటిని. నా యావజ్జీవము జ్యోతిష విద్యయందే గడిపిన నేను, మన జాతకములను చూడలేదను కొంటివా? ధనార్జనము వలన మనకు సౌఖ్యము సంతోషము నుత్తమగతులు కల్గునని నాకు రూఢియైనచో, ధనార్జనము చేయకుండు నంతటి మూఢుడనా? ఇంతకును సంపాదన మగానేమి? ఒక క్షణమైనను స్థిరముగ నుండని బుద్బుదము వంటిది. కొంచెము

ధనమార్జింపగనే యింకను ఆర్జింపవలెనను తృష్ణను కల్పించును. తక్కిన ధర్మములన్నియు పరిత్యజించి, దాని నార్జించుటలోనే జీవితమంతయు గడచిపోవును. ప్రపంచమునం దెవ్వడును, ఈ యనంతమైన నిచ్చెనలోని కడపటి మెట్టును చేరినవాడు లేడు. ఇందుకొరకు ప్రయత్నించిన వారందరు, తమ తృష్ణను దీర్చికొని తృప్తిపొందు లోపలనే ప్రాణములను కోల్పోవుచున్నారు. జనులు ధనమును రాసులురాసులుగ ప్రోగుజేయుదురు. ఎంత ప్రోగుచేసినను, ఇంకను ప్రోగుచేయవలెననియే యుండును. తృష్ణతీరక విచార పడుచునే యుందురు. ఇది ప్రపంచమునందలి పెనుభూతములలో కెల్ల గొప్పది. ఇది యావేశించిన వాడెన్నో ఘోరపాపములను చేయును. పవిత్రమైన గంగానది జలమైనను, మహావిశాలమైన సముద్రోదకమైనను, గూడ, ఆ పాపములను కడిగివేయజాలదు. ఎంత న్యాయముగ నార్జించిన ధనమునందైనను, జాగ్రత్తగ శోధించినచో నక్కడక్కడ, కొంతకల్మషము కనబడితీరును. ధనార్జనములోని పాపమునుండి మనలను రక్షించుకొనుటకే నేనిట్టి నిష్కల్మషమును, నిరాడంబరమునైన జీవనము నవలంబించితిని. మానవునకు ఆనందము నొనగూర్చునది ధనసంపదయే అనియు, అంతకన్న శ్రేష్ఠతరములును, గొప్పవియునైన యితర సంపదలు లేవనియు, నను కొనుటలో నీవు సామాన్య స్త్రీలకుగల దుర్బలత్వమునే చూపితివి. జాతకరీత్యా మనకు వార్ధక్యమున నక్కరకురాగల సంతానము కూడ కలుగు నదృష్టము లేదని చెప్పమరచితిని. అందువలన నెంతధనమున్నను మనకానందమెట్లు కలుగ గలదు. ఇది అంతయు నెరిగియే యీ జన్మమందు మనకుగల దురదృష్టము మరుసటి జన్మయందింకను ఎక్కుడు కాకుండ నుండుటకొఱకే నే నీ జీవితపద్ధతి నవలంబించితిని. వింటివికదా, నేను చెప్పిన సంగతులు, నీవు బుద్ధిమంతురాలవు గనుక, నేను చెప్పిన సంగతులను హర్షింతువని నానమ్మకము. ఈ లోకములో మనము ముఖ్యముగ కాపాడుకొనవలసినవి, మన కీర్తిప్రతిష్ఠలే. మనకు సంతానము కలుగదని నే నన్న మాటల వలన నీ మనస్సులో నప్పుడే బాధకలిగినదని నీ ముఖములోని మార్పు వలన నేను గ్రహించితిని. నీవింత విచారపడవలసిన యవసరములేదు. మనకు వార్ధక్యమున నక్కరకు రాగల సంతానము కలుగదని చెప్పితినిగాని, కలుగనే కలుగదని చెప్పలేదు కదా. నా యరువదియవయేట నా కొక కుమారుడు కలుగును. కాని వాడు మనకంతగా నుపకరించడు. దీనిని గూర్చి నీవు నన్నేమియు నడుగవలదని సత్యవాక్యుడు చెప్పగా నాయన భార్య చాల వివేకవంతురాలై నందువలన, తమ ప్రస్తుతపు జీవిత విధానమునకు కారణముగా నతడు చెప్పిన సంగతులలోని యధార్థమును గ్రహించెను. తమకు కలుగబోవు కుమారుని భవిష్యత్తును గూర్చి యింకను ప్రశ్నించవలెనని యున్నను, భర్త యాజ్ఞను శిరసావహించి, దానిని దాచుకొని యూరకుండెను, అంతట నామె ప్రఫుల్లవదనయై తన బేల తనమునకు మన్నింపుడని భర్తను వేడుకొని, ఎప్పటివలె సంతోషముతో ప్రవర్తింపసాగెను.

కాలము గడిచినది... సత్యవాక్యుడు చెప్పినట్లుగనే ఆయన యరువదియవఏట నొక కుమారుడు పుట్టెను. ఆ పిల్లవాడు చాల అందముగానుండెను. అందువలన నాతని కతిరూపుడని నామకరణము చేసిరి. శైశవము చక్కగా గడచెను. పిల్లవాని కయిదవ ఏట

తండ్రి యక్షరాభ్యాసము చేసి విద్య నేర్పసాగెను. కొన్ని వత్సరములలోనే యతనికి సామాన్య విద్యయంతయు పట్టుపడెను. అంతట సత్యవాక్యుడా బాలుడికి తన యభిమాన శాస్త్రమైన జ్యోతిషవిద్యను నేర్పెను. పిల్లవాడు త్వరలోనే యందులో ప్రజ్ఞావంతుడయ్యెను. పదునారేండ్లు నిండునప్పటికి తండ్రికన్న గొప్పవాడని పేరుపొందెను. అందువలన వివిధ దేశములనుండి వచ్చినవారందరు నతిని తండ్రిచేతగాక యతనిచేతనే జాతకములు చెప్పించుకొనసాగిరి. ఇదిచూచి సత్యవాక్యుడెంతో సంతోషించెను. తాను వృద్ధుడగుచున్నందున తనకు శ్రమ లేకుండ పిల్లవాడే కడు సమర్థతతో తనకార్యముల నిర్వహించున్నందులకు సంతోషించెను.

ఇప్పటికికూడ సత్యవాక్యుని జీవితవిధానము నందెట్టి మార్పునులేదు. పదియ గడియ కాగానే యాయన భిక్షాపాత్రమును చేబూని తనకు తన భార్యకు తన కుమారునికి సరిపడు బియ్యమును మాత్రము సంపాదించుకొని వచ్చుచుండెను.

ఒకదినమున తండ్రి యెప్పటివలెనే బయటకుపోగా, తల్లియింటి పనులు చేసుకొనుచుండెను. కుమారుడు వీధి యరుగు మీద కూర్చుండి బృహజ్జాతకములో నొక ప్రకరణమును చదువుచుండెను.

ఇంతలో నా దేశమునేలు రాజైన సేతూపతి యాకస్మికముగ నక్కడికి వచ్చి నిలిచి, అబ్బాయీ మీతండ్రిగారింటి యొద్దనున్నారా, యని యడిగెను. అతిరూపు డారాజుగారిని గౌరవించి, మహాప్రభూ వారింతకముందే బయటకు పోయియుండిరి. అయితే తమరొక యత్యవసర కార్యమును గూర్చియడుగవచ్చినట్లు తమ ముఖారవిందమువలన నాకు తెలియుచున్నది. మనరాజ్యము మీదకి దండయాత్రచేయ వచ్చుచున్న శత్రుసైన్యము నెదుర్కొనినచో మనకు జయము చేకూరునా యని తమ రడుగవచ్చితిరి. ఇది క్షేమకరము కాదని నాకు తోచుచున్నది. తమ జాతకరీత్యా శని యెనిమిదవ యింటనున్నాడు. అందువలన తమ ప్రయత్నములు జయప్రదము కానేరవు. తమరు భార్యతోను, పిల్లలతోను వనవాసమునకు పోయియున్నచో మూడేండ్లయిన తరువాత తామెట్టి ప్రయత్నము జేయకయె తమ వశమగును. ఇక జాగుచేయుటకు వ్యవధిలేదు. అరగడియ క్రిందటనే మన నగరము యొక్క తూర్పు ద్వారమునుండి శత్రువు మన పట్టణములో ప్రవేశించినాడు. త్వరపడుడు అనెను.

ఇది వినుచున్న సేతూపతి నిర్విణ్ణుడై, నోరు మెదల్పలేక పోయెను. ఇంతలో నొక దౌవారికుడు పరుగెత్తికొనివచ్చి, మహాప్రభూ ఎవ్వరు నెఱుగకుండగనే శత్రువు మన తూర్పు ద్వారమున ప్రవేశించినాడు. ఏమిచేయుటకును తోచక పరుగెత్తికొని వచ్చితిని అనెను.

సేతుపతి తక్షణమే తన భార్యను పిల్లలను రక్షించుకొనబోయెను. ఆయన పోవుచుండగనే సత్యవాక్యుడింటికి వచ్చెను. అంతట అతిరూపుడు జరిగిన సంగతిని జెప్పెను. ఇది వినునప్పటికి సంతుష్టాంతరంగుడును శాంతచిత్తుడు నైన సత్యవాక్యుని మనస్సు కూడ కొంచెము చలించెను. ఆయన తన యక్షయపాత్ర నరుగుపై నుంచెను. ఆయన కన్నులనుండి బాష్పములు రాలజొచ్చెను. ఈతడు తన జీవితమునందెన్నడు నింత దుఃఖించి యెరుగడు, నాయనా ఎందు కేడ్చుచున్నావని కుమారుడెలుగెత్తి యడిగెను.

ఇదివిని లోపలనున్న యిల్లాలు పరిగెత్తికొనివచ్చి, తన భర్త దుఃఖమును జూచి, కారణమునైన అడుగకయే తాను కూడ యేడ్వసాగెను. ఇది చూచి కుమారుడు నేడ్వసాగెను. ఇట్లు కొంతతడవు ముగ్గురును దుఃఖించిన తరువాత కొంత యుపశమనము కలిగెను. అంతట నామె గద్గదస్వరముతోనే సత్యవాక్యుని దుఃఖకారణ మడిగెను. అతడిట్లనెను. "ఇంతకాలము నే నేమియు చెప్పకయే నా దుఃఖమును దిగమ్రింగి భరించుచున్నాను. ఇప్పుడది దుర్భరమైనది. మన కుమారుడు మనకు వార్ధక్యమున నక్కరకు రాడని నేను నీకు చెప్పి యున్నాను కదా! ఇటువంటి కఠోరమైన వార్తను నీకు చెప్పి నీ హృదయము పగులకొట్టుట నాకిష్టము లేకపోయెను. మన యతిరూపునికి జాతకరీత్యా పదునెనిమిది వత్సరముల యాయుర్దాయము మాత్రము కలదు. అప్పడే పదునారేండ్లు పూర్తియగుచున్నది. వానికింక రెండేడ్లు మాత్రమే యాయుర్దాయ మున్నది. మన కతడు దక్కడు. ఈతలంపులు నామనస్సులో కలుగగా నాకు దుఃఖము కలిగినది. వీడింతటి ప్రతిభాశాలియగుటయు నాదుఃఖము నినుమడించుచున్నది. ఇంతకు పూర్వ మే జ్యోతిషికుడైన తన దేశమునేలు రాజు భవిష్యత్తు నింత దృష్టాంతముగ జెప్పినవాడున్నాడా? మన యతిరూపుడింత యల్పాయుష్కుడైనందు వలననే పరమేశ్వరుడు వీనికింత బుద్ధిసూక్ష్మతను ప్రసాదించినాడు కాబోలు! ఆహా, పరమేశ్వరా! నీవు సృజించిన జీవిపైననే నీకింత నిర్దాక్షిణ్యమా, అని దుఃఖము చేత సత్యవాక్యుడిక మాటలాడ లేకపోయెను. ఈయన మాటలు వినగానే యాయన భార్య మొదలు నరికిన వృక్షమువలె నేలగూలెను.

ఈ వృద్ధ మాతాపితరుల దుఃఖమునకు తానే కారణమని, యతిరూపున కర్థమైనది. అంతట నతడు మెల్లమెల్లగా వారినోదార్చి, తన జాతకము నొకమారు చూపుమని తండ్రిని ప్రార్థించెను. దానిని పుచ్చుకొని, తలిదండ్రుల యెదుటనే యిటునటు త్రిప్పి, జాగ్రత్తగా పరిశీలించినట్లు చూచి యీ చక్రము వేయుటలో పొరబాటు జరిగినది. మీరు వృథాగా భయపడుచున్నారు. అని యీ జాతకము తప్పు అని చెప్పుటకు హేతువులు చెప్పసాగెను. అతడు చెప్పిన హేతువు లత్యద్భుతములుగనుండెను. అవి విన్న తరువాత సత్యవాక్యునికి కూడ అందులో పొరబాటుండెనేమో యని యనుమానము కలిగెను. అంతట నతిరూపుడు క్రమక్రమముగా తన వాదమునకు బలము కలిగించు నుపపత్తులను చూపి ఆ జాతక చక్రము దృక్సిద్ధము చేసి సరిగా వేసినచో నా జాతకునకు పూర్ణాయుర్దాయము కలిగి తీరవలయుననియు, నీ బాధయంతయు, చక్రము వేయుటలోని పొరబాటు వలన జరిగినదనియు, తాను నూరేండ్లు జీవించుట నిశ్చయమనియు గట్టిగా వాదించెను, తరువాత నతడు తన జాతకమును సవరించి, సరియైన చక్రముచేసి తండ్రిని నమ్మించెను.

అతిరూపుని తల్లిదండ్రులు అతని మాటలు నమ్మి ధైర్యము చెందియుండిరి కాని యతిరూపునికి మాత్రము లోపల చిత్తస్థైర్యము లేకపోయెను. తన తండ్రియొక్క పాండిత్యమునందు జాతక నిర్ణయమునందు అతనికి గట్టి నమ్మకముండెను. తన యాయుర్దాయము పదునెనిమిది వత్సరములేయని తన తండ్రి చేసిన నిర్ణయము సరియైనదేనని యతనికి రూఢియైనది. లెక్కను బట్టి తానిక రెండు సంవత్సరములకన్న జీవింపడు. ఈలోపుగనే పుణ్యక్షేత్రమైన కాశిపోయి తన తల్లిదండ్రుల కుత్తరగతులు

కల్పింపగల శాస్త్రోక్త కర్మములను నిర్వహించవలెనను కోరిక అతనికి కలిగెను. తాను కాశికిపోవలెనని తన తండ్రికి చెప్పినచో నతడనుమతింపడని యెఱుగును. మరియు ప్రాతభయము మరల కలుగును, దుఃఖము దుర్భరమగును, ఏమి చేయవలెనా యని యాలోచించెను. అతడు తొందరపడక, ఆరు నెలలు తన తల్లిదండ్రులతో నాప్యాయముగ గడపెను, అంతట నతడు తన యింటివీధి యరుగుపై కూర్చుని, యిట్లాలోచింపసాగెను. నేను నా జాతకము గురించి, చర్చించి నిర్ధారణ చేసినప్పటినుండియు నేను నూరేండ్లు జీవింతుననియే, వృద్ధులైన మానాయనగారు నమ్మియున్నారు, కాని జ్యోతిష మొక శాస్త్రమేయైనచో, నేను సంవత్సరమున్నరలో మరణించుట నిశ్చయము. నేనెక్కడికి పోయిన నది తప్పదు, నేను దానినాపజాలను. నేనింటిదగ్గరనేయుండి మరణించినచో, నా తల్లిదండ్రులు గుండెలు పగిలి చనిపోవుట నిశ్చయము. నేనింటినుండి పారిపోయిన యెడల నేను నూరేండ్లు బ్రతుకుదునని నమ్మియున్న నా తల్లిదండ్రులు, నేను తిరిగి వత్తునను ఆశతో జీవించి తుదకు కాలధర్మము నందుదురు. నేనెట్లును జీవించి తిరిగి వచ్చునది లేదు గనుక యిప్పుడే నేనింటినుండి వెడలిపోయి, వారికి కొంత యాదుర్దా కలిగించుటలో నష్టములేదు. ఇంతకు నేను వెడలిపోవుటయు వ్యర్థముకాదు. నేను కాశికి పోయి నా యవసానకాల మాసన్నమగు లోపలనే, నాతల్లిదండ్రులకును నాకు నుత్తగతులు కల్పించగల పుణ్యకర్మల నాచరింప గలుగుదును. అతిరూపు డిట్లాలోచించి ఆ మరునాటి తెల్లవారు జాముననే యిల్లు విడిపోవుటకు నిశ్చయించికొనెను. స్వగృహమున తల్లిదండ్రులతో నుండున దీ యొక్క దినమే గనుక అతడెప్పటికన్న నెక్కువ ఉత్సాహముతో ప్రవర్తించెను. ఆనాటిరాత్రి అనుదినము నిద్రపోవు వేళకే నిద్రపోవక, తండ్రితో నేవో మాటలు ప్రారంభించెను. వేళ యతిక్రమించెను. ఎట్టకేలకు వృద్ధులైన తల్లిదండ్రులు నిద్రించిరి. అతిరూపుడును కంటతడిపెట్టుకొని పండుకోనెను. కాని నిద్ర రాదయ్యెను. అంత నత డా రాత్రియెల్ల యింట నిటునటు తిరుగుచు, తనకు ప్రియములైన ప్రాత తాటియాకుల గ్రంథముల నొక్కొక్క దానినే చేతబుచ్చుకొని, దుఃఖించుచు వాని నెప్పటిచోట పెట్టసాగెను. తరువాత తన తండ్రి తనకు విద్యాబుద్ధులు చెప్పుటకు కూర్చుండు ప్రదేశమున కొంతసేపు నిలిచి దుఃఖించెను. తన చిన్ననాటి నుండి యిప్పటివరకును, తన జీవితమునందలి వివిధ ఘట్టములు నడిచిన యా ప్రాతయింటియందు పలుచోట్ల నిలిచి పూర్వకథను తలచుకొని దుఃఖించుచు నారాత్రియెల్ల జాగరణ మొనరించెను. రాత్రి చాలభాగము గడిచిపోయినది, ఇక కొలది గడియలలో బయలుదేరవలెను, అతనికి మరల నీ విషయమై జిజ్ఞాస కలిగెను. ఎట్టకేలకు తాను అనుకొనినట్లుగ వెడలిపోవుటకే నిశ్చయించెను.

బయలుదేరుట యొక కష్టమయ్యెనుగాని, తరువాత కష్టమనిపించలేదు. అతిరూపునకు, అతనికి మనస్సు కుదుటబడెను. ఒకటిన్నర సంవత్సరములలో తాను మరణింతుననియు తాను మరలి వత్తునను ఆశతో తన తల్లి దండ్రులు జీవించి యుందురనియు, నతడనుకొని యూరటజెందెను. అతడు త్వరితముగ నడువసాగెను. దారిలో తన జ్యోతిషశాస్త్ర సామర్థ్యమును చూపి యన్నము సంపాదించుకొనినచో, తాను

పోయినజాడ తనతండ్రికి తెలిసిపోవునని, యట్లుచేయక, దరిద్రుడైన యాత్రికునివలెనే యన్నము కొఱకు యాచించుచు పోవుచుండెను. ఎక్కడ ప్రొద్దుగ్రుంకిన నక్కడ నిద్రించును. ఇట్లు రెండు మాసములు ప్రయాణము చేసి చేసి విజయనగర చక్రవర్తి రాజధానియైన చంద్రగిరి* నగరమును చేరెను. చంద్రగిరిలో నందఱును తెలుగుభాషనే మాట్లాదురు. అతిరూపుడు దక్షిణ ద్రావిడదేశమునుండి వచ్చినందువలన నతనికి తెలుగురాదు. అత డన్నముకొఱ కరవములోను, సంస్కృతములోను యాచించగా నతని మాటలెవ్వరికిని యర్థముకానందున, నెవరును భోజనము పెట్టరైరి.

అతిరూపునకు కాశీయాత్రయందు కష్టములారంభమైనవి. ఈకష్టములను గడిచిగట్టెక్కుట యెట్లు పరమేశ్వరాయని యతడు యోజింపసాగెను. ఆ దినమెల్ల నాత డా నగరమున దిరిగినను అన్నము దొరకలేదు. సంధ్యాసమయమం దింకను ఆతడా మహానగర వీధులయందు తిరుగుచునేయుండెను. అప్పుడతనికొక గొప్ప తాటియాకుల పందిరి కనబడెను. అదియొక పెండ్లిపందిరి యై యుండుననియు అక్కడకుపోయిన తనకన్నము దొరకగలదనియు ననుకొనెను. ఇది నిజమేయయ్యెను. అది చంద్రగిరి రాజుగారి మంత్రియిల్లు. ఆయన కుమారునకు రాజుగారి కుమార్తెనిచ్చి, పెండ్లిచేయుటకు నిశ్చయమైనది. ఆపెండ్లి కొరకు కొన్ని దినములనుండి గొప్ప ప్రయత్నములు చేయుచుండిరి. వివాహమ్మింకను రెండుదినములున్నది. బీద బ్రహ్మణులకు సంతర్పణ చేయుట ప్రారంభించిరి. అతిరూపు డతి కష్టముపైన తనయవస్థ తెలియజెప్పెను. రాత్రి భోజనములు పదియవ గడియకు ప్రారంభమగుననియు, నంతవఱకు నెచ్చటనైన విశ్రమించవలసిన దనియు నొక పుణ్యాత్ము డతనికి చెప్పెను. అతడు తిరిగి తిరిగి అలసిపోయియుండెను. పండుకొనినచో నిద్రపట్టి భోజనము వేళ యతిక్రమించి అన్నము దొరకకుండ పోవునేమో యనుభయ మతనికి కల్గెను. కాని యతడు నిలువలేనంత నీరసస్థితిలో నుండెను. ప్రక్కకు చూడగ నా పెండ్లిపందిరి దగ్గరనే, యొక పెద్ద భవనము కనబడెను. దానిబయట యెవ్వరును లేరు. చీకటిపడినది. అతిరూపు డా యింటి యరుగుపైన జేరి, యొకమూల శరీరమును నేలపై వాల్చుటయే తడవుగా మైమరచి గాఢ నిద్రను జెందెను.

అక్కడ అతిరూపుని తల్లిదండ్రు లానాటి ప్రాతఃకాలమున, నత డగుపడకపోగా నదికి స్నానమునకు పోయెననుకొనిరి. పదిగడియలదనుక రాకపోగా ప్రక్కయూరిలో నే స్నేహితునైన చూడబోయెననుకొనిరి. మూడవనాడు కూడ రాకపోగా వారు తత్తరపాటు జెందిరి. చుట్టుప్రక్కల యూళ్ళకతడు వచ్చెనేమోయని వెదకిజూచిరి, కాని లాభము లేకపోయెను. అతడు కాశీయాత్ర చేయబోయెననియు, పుణ్యక్షేత్రములు సేవించి మూడు నాలుగేండ్లలో తిరిగివచ్చుననియు, వార్తలు తెలిసినది. ఈవార్తల నతిరూపు డుద్దేశ్య

* ప్రస్తుతము చెన్న రాజధానిలో చేరియున్న తెలుగు, అరవ, కన్నడ, మలయాళ ప్రాంతములును, మైసూరు, తిరువాంకూరు, కొచ్చి సంస్థానములును ఇంగ్లీషు పరిపాలనకు పూర్వము రమారమి మూడువందలేండ్లు తెలుగు విభులైన విజయనగర చక్రవర్తుల పరిపాలమున నుండెను. ఈ విశాల సామ్రాజ్యమునకు రాజధాని చాల కాలము వఱకును తుంగభద్రా నదీతీరముననున్న విజయనగరమే. క్రీ.శ. 1565లో తాలికోట దగ్గర మహమ్మదీయులతో జరిగిన యుద్ధమున కృష్ణదేవరాయలవారి అల్లుడును, పరిపాలకుడునైన అరవీటి రామరాజుగారు మరణించగా మహమ్మదీయులు ఆ మహానగరమును నాశనముజేసిరి. అంతట రామరాజుగారి వంశీయులు కొంతకాలము పెనుగొండను తరువాత చంద్రగిరిని రాజధానులుగా జేసికొని దేశము నేలిరి.

పూర్వకముగనే వ్యాపింపజేసెను. అతని తల్లిదండ్రులు వెదకి వెదకి యిక లాభము లేదని యూరకొనిరి. "ఓసీ మనవాడు మన వార్ధక్యమున మన కక్కరకు రాడని చెప్పలేదటే! మొదట నది యతని కాయుర్దాయము లేనందుననే యిది తటస్థించునని యనుకొంటిని. ఇది పొరబాటని వాడు రుజువుచేసినాడు. ఏమైననేమి? వాడు మనలకు విడనాడినాడు. ఎక్కడనో యొకచోట దీర్ఘాయుష్మంతుడై సుఖముగా బ్రతుకనిమ్ము మన యవసానకాలము లోపల వాడు తిరిగివచ్చిన జాలును. ఏమో మనమంత యదృష్టవంతుల మనుకొనను, అని సత్యవాక్యుడనుచు, తన భార్య నోదార్చుచుండెను.

అక్కడ చంద్రగిరిలో మన యతిరూపుని వృత్తాంతమేమైనదో చూతము. చంద్రగిరి రాజ్యము నేలు ప్రభువునకు అతి లావణ్యవతియు, గుణవతియు నైన కొమరితయుండెను. ఆమెకు పెండ్లియీడు రాగా రాజామెకు దగిన వరునికొరకు వెదుకసాగెను. ఎన్నాళ్ళకును తగిన వరుడు దొరకలేదు. పిల్లకాయేటి కాయేడు వచ్చుచుండెను. వరాన్వేషణమును గూర్చి మంత్రిని గట్టిగా హెచ్చరించగా మహాప్రభూ! నాకొక నెల గడువిండు. నేను దక్షిణ దేశమునకుపోయి, యక్కడగల రాజకుమారుల రూపపటములనెల్ల పట్టుకొని వచ్చెదను. వానిలో నందమైన వానిని మీ రేరుకొనవచ్చుననెను. రాజుగా రట్లే యనిరి. అయితే మంత్రి తాను చెప్పిన చొప్పున వరాన్వేషణము కొఱకు బయలుదేరిపోకుండా, చంద్రగిరి రాజ్యములో నొకమూల కొంతకాలముండి వచ్చి, దక్షిణదేశాధీశుల రాజకుమారుల వని, కల్పితములైన యూరు రూపపటములను తెచ్చెను. ఆ పటములలోని యువకుల ముఖలక్షణము లసహ్యాముగనుండెను. వానిని తెచ్చి "మహాప్రభూ! తమ యాజ్ఞప్రకారము నేను చాలా శ్రమపడి, దక్షిణ రాజ్యములన్నియు దిరిగివచ్చితిని, ఇదిగో, నేను చూచిన రాజకుమారుల పటములు. ఇది నేను చూచినవారిలోకెల్ల సుందరుడైన పాండ్యరాజ కుమారుని పటము. ఇది చేర రాజకుమారుని పటము. ఇది చోళభూపాల పుత్రుని పటము" అని చూపించెను. ఈ రూపపటములు తనకే యసహ్యాముగా నుండగా తన కుమార్తె కెట్లునచ్చునని రాజు వితర్కించి "అమాత్యవరా నాకీపటము లెవ్వియు బాగుగాలేవు. వానిని తీసికొనిపోయి యవతలపారవేయు" మనెను. అంతట మంత్రి శేఖరుడు రాజకుమారిత కొరకు తా నుత్తర దేశమునకుపోయి వరాన్వేషణ చేసివత్తునని చెప్పి కొంత కాలమునకు మరిలివచ్చి, మరికొన్ని యసహ్యారూప పటములను చూపెను. ఎక్కడను సలక్షణమైన వరుడు కనబడుటలేదేయని రాజు చింతాక్రాంతు డయ్యెను.

మంత్రి తాను తెచ్చిన రూపపటముల నెల్ల నుద్దేశ్య పూర్వకముగనే యసహ్యాముగ చిత్రింప జేయించెను. దీనికి కారణముండెను. చంద్రగిరి మహారాజున కా కొమరిత తప్ప వేరు సంతానములేదు. అందువలన నామెను పెండ్లాడిన భాగ్యశాలి కారాజ్యము కూడ లభించును. మంత్రికి కొంచె మందమైన కుమారు డొకడుండెను. అయితే వానికి విద్య యంటలేదు. ఏలాగుననైన రాజకుమారిని తన కుమారునకు దక్కించవలెనని మంత్రి యుద్దేశ్యము. అందువలననే ఈతంత్రము పన్నెను.

అట్లు తగినవరుడు లభించుటలేదని రాజు చింతాక్రాంతుడై దీనావస్థలోనుండగా నొకనాటి సాయంకాలమున మంత్రి తన చేత నొక రూపపటమును పుచ్చుకొని రాజు

సమక్షమునకు వచ్చెను. మహారాజాతని ముఖమున కొన్ని సంతోష చిహ్నములు కనబడుటచే "అమాత్య శేఖరా! తగినవరు డెవ్వడైనను దొరకినాడా యేమి?" అని ప్రశ్నించెను. అంతట మంత్రి, "మహాప్రభూ నేను తమ దర్శనమునకు వచ్చినపుడెల్ల తగినవరుడు దొరికినాడనియె చెప్పుచు వచ్చుచుంటిని. అందుచేత నీసారి తమరు తమ యభిప్రాయము సెలవిచ్చు వరకును, నాకృషి ఫలించినదని చెప్పను" అని వినయముతో ననెను. తన కొమరిత కెట్టిదైనను, మంచి సంబంధము కుదుర్పవలెనని యాతృతపడుచున్న మహారాజు మంత్రి చేతిలోని రూపపటమును తటాలున లాగికొని చూచి, యిదివరకు చూచిన రూపపటము లన్నిటి కన్నను బాగున్నట్లు కనుపడగా, చిరునవ్వుతో "ఎవరిపట మిది?" అని ప్రశ్నించెను.

మంత్రి కొంచెము నెమ్మదిగా, "మహాప్రభూ! మనవి చేసెదను. కాని యిది తమకు వచ్చినదా?" యని ప్రశ్నించెను.

మహారాజు: "నాకు బాగున్నది ఎవరి పటామో చెప్పుడు". అంతట మంత్రి యవనత వదనముతో, "మహాప్రభూ క్షమించగోరెదను. ఇది నా కుమారినిదే" అని చెప్పెను.

మహారాజు తన మనస్సునందిట్లనుకొనెను. రాజకుమారులలో లక్షణవంతుడైన వాడెవ్వడును, కనుబడలేదు. మంత్రి కుమారుడైనను యీపటములోని చిన్నవాని ముఖమున శుభ లక్షణములు కనబడుచున్నవి. ఇతనిని వధునిగ నేల నంగీకరింపరాదు, మరు క్షణములో నట్టి నిశ్చయమును చేసికొనెను. "అమాత్యవర్యా, ఇంట నవనీతము నుంచుకొని, నేతి కొఱ కూరంతయు తిరిగిన దాని సామెతగానున్నది మనపని. మీకింతయందమైన పిల్లవాడున్నాడని, నాకిదివఱకే యేల చెప్పకపోతిరి? ఇంత కష్టపడి యిన్ని దేశములు తిరుగకుండనే మా అమ్మాయిని, మీ పిల్లవానికిచ్చి చాలకాలము క్రిందటనే వివాహము జరిగించి యుండెడువాడను" అని మహారాజుగారు పలుకగా, మంత్రి నమ్రతతో "స్వామీ నా పిల్లవానికి మీ పిల్ల నిమ్మని కోరునంతటి సాహసము నేను చేయలేకపోతిని" తగిన వరుని కొరకు వెదకి వెదకి దొరకనందున తుదకు విధిలేక మా పిల్లవాని బొమ్మను మీకు చూపితి"ననెను.

మంత్రికుమారు డందమైన వాడనుట నిజమేకాని నిజముగా నతనకిగల దానికన్న రూపపటమునందెక్కుడు. లావణ్యముగా నుండునట్లు మంత్రి యాపటమును చిత్రింపజేసి యుండెను. కనుక మంత్రివేసిన పాచిక పారినది. అంతట మహారాజింక నాలస్యము చేయుట మంచిది కాదని వెంటనే వివాహ ముహూర్తమును పెట్టింపుమనిరి. అంతట కొద్ది రోజులలోనే వచ్చు శుక్లపౌర్ణమి నాడే వివాహ సుమూహుర్తమును దైవజ్ఞులు నిర్ణయించిరి.

అతిరూపుడు చంద్రగిరి చేరునప్పటికి జరుగుచున్న పెండ్లి ప్రయత్నములు, వేడుకలు నీవివాహము నిమిత్తమే జరుగుచుండెను. అతిరూపుడు పండుకొనిన యరుగుపైన చెప్పిన మహామంత్రిగారి యింటి యరుగే.

వివాహ ముహూర్తము దగ్గరించగా, మంత్రిగారు తప్ప చంద్రగిరిలోని స్త్రీ పురుషులందరును అమితోత్సాహముతో నుండిరి. మంత్రిగారికొక గట్టి చిక్కువచ్చెను. ఎన్నో తంత్రములు పన్ని యీ వివాహము నతడు కుదిర్చియుండెను. సుముహూర్తము

పరుగిడి వచ్చుచుండెను, ఇక రెండుదినములే వ్యవధి రెండుదినములు కూడకాదు, రెండు రాత్రులు నొక పగలు మాత్రమే. మూడవ దినమునాటి యుదయముననే, సుముహూర్తము జరుగవలసి యుండెను. ఇంతకష్టపడి సంధర్భ పఱచిన యీ సుముహూర్తము, దగ్గరించి నందులకు సంతోషమునకు బదులుగా మంత్రిగారికి తహతహ ఎక్కుడయ్యెను. తన కుమారునికి మూర్ఛవ్యాధి యుండెను. అది యాపిల్లవానికి దినము విడిచి మరుదినము వచ్చుచుండును. వచ్చినప్పుడది యతితీవ్రముగా వచ్చును. పిల్లవాడున్నట్లుండి విరుచుకొని పడిపోవును. మరణవేదనవంటి లక్షణములకు లోనగును ఆ దుర్లక్షణము లుదయమునే యారంభించి మధ్యాహ్నము కొంత ప్రొద్దుపోవువరకు నుండును. దినము విడిచి దినమీకుఁర్రవాడు, ఐదవగడియ మొద లిరువదియవ గడియవరకు నీలోకమున నుండుడు. ఇందువలననే యాపిల్లవానికి సరియైన విద్యాబుద్ధులు చెప్పుటకు కూడ వీలులేక పోయెను. మంత్రి తనయింటిలోని యాత్మబంధువులకు తప్ప ఇతరులెవ్వరికి నీపిల్లవాని వ్యాధిని గూర్చి తెలియకుండ చేయగలిగెను. వ్యాధినిగూర్చి తెలిసిన బంధువులను గూడ నయమునను, భయమునను, దీనిని గూర్చి యతిగోప్యముగ నుంచునట్లు కట్టడి పఱచెను. అందువలన మంత్రిగారికి భయపడి యింతవఱకును, వారునోరు మెదలుపలేదు. కాబట్టి యూరిలోని వారికిగాని రాజనగరులోని వారికిగాని యీ విషయము తెలియుట కవకాశములేదు. వివాహము నాలుగు గడియలు నెట్లో జరిపోయినచో తరువాత నిది బయల్పడినను భయములేదని మంత్రి యనుకొనుచుండెను. కాని యిప్పుడొక గొప్ప చిక్కువచ్చినది. వివాహ ముహూర్తము నిశ్చయింపబడిన దినము, పిల్లవానికి మూర్ఛవచ్చు వరుస దినమేయైనది. ఈ గొప్పచిక్కు నుండి బయటపడుటెట్లాయని మంత్రి దీర్ఘాలోచన చేయుచుండెను. ఈ సమయమున లగ్నము మార్పించవలసినదని కోరినచో నది యనుమానమునకు కారణమై వివాహమే భగ్నముకావచ్చును. తానింతకాలము కష్టపడి సంధానపఱచిన కార్యము వృధయైపోవును. ఇక తాను బ్రతికి యేమిలాభము? అని అతడాలోచించి యాలోచించి తన తెలివితేటలనన్నిటి నుపయోగించి యేదోవిధముగ విహావాము జరిగించుటయే కర్తవ్యమని నిశ్చయించెను. 'నా పిల్లవానికి మూర్ఛవచ్చినంత మాత్రమున, నీనివాహము జరుగకుండ నెందులకుండవలెను? ఆ సమయమున నెవనికో యొకనికి మావాని వేషమువేసి పెండ్లిపీటల మీద కూర్చుండబెట్టెదను. దొంగపెండ్లి కొడుకుచేత ఆ పని కొంచెము జరిపించి, వానిని మరునాడు పంపివేసెదను. పురోహితులకు బాగుగా లంచమిచ్చి వారినోళ్ళు కట్టివైచెదను. వారిలోకూడ నాపిల్లవానిని చూచినవారు చాల కొద్దిమంది మాత్రమేయున్నారు, గనుక భయములేదు' అని నిశ్చయించుకొనెను. అంతట నాయనకు ధైర్యము కలిగి కొంత ఆందోళన తగ్గినట్లే తగ్గినది. కాని తన కుమారునికి బదులుగా పెండ్లిపీటల మీద కూర్చుండ బెట్టుట కెవడు దొరకునా యను తలంపు కలుగునప్పటికి అతని కేమియుతోచక ముఖము వెలవెలపోయెను. ఈ పన్నాగము నెరవేరవలెనన్నచో తనపిల్ల వానికి సమాన వయస్సు గలవాడు స్ఫురద్రూపియైనవాడు ఈ యూరిలోను దేశముతోను సంబంధములేనివాడు దొరకవలెను. అట్టివాడెక్కడ లభించును? ఇంతకును సుముహూర్తము వాయువేగముతో పరుగిడి వచ్చుచుండెను. అందుకొరకు ప్రయత్నించుటకైన వ్యవధిలేదు.

అనాటిరాత్రి మన అతిరూపుడట్లు మంత్రిగారి యరుగుమీద పండుకొని నిద్రించుచుండగా, మహామంత్రిగారీ యాలోచనలతో వెర్రివానివలె అటునిటు తిరుగుచు, వీధి యరుగుమీదకి వచ్చెను.

ఈ మహామంత్రి చాలక్రూరుడు, కోపిష్ఠి. అందువలన నతడు కోపముగనున్న తరుణమునగాని, దీర్ఘాలోచనమునందు మున్గియున్న సమయముగాని, ఎవ్వరు నతనివద్దకు రా వెఱతురు. ఆయన సేవకులందరు ఆయన చిత్తవృత్తి నెఱిగిన వారైనందు వలన అతని మనస్సును కనిపెట్టి, అట్టి సమయములందతని దగ్గరకురారు. అందువలన నాటిరాత్రి పదియవ గడియయగు నప్పటి కతడొక్కడే, తన వీధియరుగుమీద అట్లు నిలచియుండెను. ఆ సమయమున చాలమంది సంతర్పణ భోజనము చేయుటకొరకు నలుప్రక్కలనుండియు, పందిరివెనుకనున్న భోజనశాలలోనికి పోవుచుండిరి. అల్ప కాలములోనే కలవరము కొంచెము సద్దుఅణగి భోజనములు ప్రారంభమయ్యెను. మంత్రి మనస్సులోని కల్లోలముమాత్ర మణగలేదు. అతనికి తాను పడియున్న చిక్కులనుండి బయటపడు మార్గము కనబడలేదు. అంతట అతనికి గొప్ప ఆశాభంగము కల్గెను. ఆపలేనంత దుఃఖము పొర్లివచ్చెను. ఈ మనఃక్లేశముతో చింతాక్రాంతుడై దుఃఖించుచున్న సమయమున, తనవీధి యురుగుమీద, నెవ్వడో గుఱ్ఱుపట్టి నిద్రించుచున్నట్లు, ధ్వని వినవచ్చెను. నా యింటి యరుగుపైన నిట్లు నిద్రించుచున్న మూర్ఖుడెవడు? బహుశా భోజనము నిమిత్తము వచ్చి నిద్రపోయిన వాడేమో, లేదా, నాగృహముకావాలి కాయవలసిన సేవకుడే యిల్లజాగ్రత్త వహించి నిద్రించుచున్నాడో, అటు లైనచో వానిపని పట్టించెదను. అని రోషముతో నా నిద్రించుచున్నవాని దగ్గరకు వెళ్ళెను. ఆపురుషుడు తన ముఖముపై నొక గుడ్డకప్పుకొనియుండెను. అంతట మంత్రిగారు అతని ముసుగును తొలగించిచూడగా నతిరూపుని దివ్యమంగళ విగ్రహము కనపడెను. మంత్రి యాశ్చర్యపడెను. ఒక్కతృటిలో నతని కుత్సాహముకల్గెను. ఆ పురుషుడచ్చముగ తన కుమారుని యాడువాడే. అంతకన్న నందమైన వాడుకూడ. అంతేకాదు-మహారాజుకు తాను చూపించుటకు మెరుగులతో, తయారు చేయించిన రూపపటమునకు దగ్గర దగ్గరగా సరిపోలినవాడు. ఇంకేమి కావలెను? దైవము తన పక్షమువహించి, యీ కుఱ్ఱవాని నిక్కడకు పంపినాడని మంత్రికి తోచెను. అంతట నతడాయువకుని నిద్రనుండి లేపి ఎవడవయ్యా నీవు? అని ప్రశ్నించెను. పిల్లవాడు ప్రత్యుత్తర మీయలేదు. నీకు తెలుగు తెలియునా? అని మంత్రియడుగగా తెలియదని అతడు తలత్రిప్పెను. సంస్కృతము తెలియునా? అని యడుగగా తెలియునని తలనాడించెను.

మంత్రి సంతోషమునకు మేరకు లేకపోయెను. వెంటనే యాపిల్లవానిని తన యింటిలోనికి తీసికొనిపోయి తాను చెప్పినట్లు విన్నచో వానికి తాను సర్వవిధములైన సహాయమును చేయుదునని వాగ్దానము గావించెను. అతిరూపునకు కావలసినది కాశికి పోవుటకును అక్కడ తాను తలపెట్టిన కర్మలకును అగు వ్యయమునకు సరిపడు ధనముమాత్రమే. అదియిచ్చుటకు మంత్రివాగ్దానము చేసి యారాత్రి వానికి మంచి భోజనము పెట్టెను.

ఆ మరునాటి యుదయము మంత్రి తాను తలపెట్టిన కార్యమును గూర్చి యతిరూపునకు చెప్పెను. తన కుమారుని పెండ్లిలో కుమారుని స్థానమున నతడు కూర్చుండి పని జరిగించవలెను. ఈరహస్య మెవ్వరికిని తెలుపగూడదు. పెండ్లికాగానే కాశికి ప్రయాణమై పోవలెను. దానికి కావలసిన యేర్పాటులనెల్ల మంత్రిగారే చేయుదురు. కావలసిన ధనమిత్తురు. అతిరూపుడు మరల తన జీవితకాలమున నీ ప్రాంతములకు రాగూడదు.

అతిరూపుడీ షరతుల కన్నింటికి నంగీకరించెను. ఈ పిల్లవాని కులగోత్రముల గూర్చియు, జన్మస్థానమును గూర్చియు, తండ్రిని గూర్చియు మంత్రి గ్రుచ్చిగ్రుచ్చి యడిగిన ప్రశ్నలకు అతడు ప్రత్యుత్తర మీయడయ్యెను. తానొక బీదబ్రాహ్మణుడనని మాత్రము చెప్పి యూరకొనెను.

మన కథానాయకుడు తలపెట్టిన కాశీయాత్ర మధ్యలో నొకటి రెండుదినము లిట్లొక వివాహ నాటకమునందు పాత్రధారిగ నిలువవలసివచ్చెను. ఈ పన్నాగమును పన్నుచున్నదొక మహామంత్రియనియు, తానిందుల కంగీకరింపనిచో తన ప్రాణము దక్కదనియు అతిరూపుడు గ్రహించెను. ఎందులకీ పన్నాగము పన్నుచున్నాడోయని విచారించుటకు గూడ వ్యవధిచాలదు. దానిని గూర్చి యోచించి ప్రయోజనమును లేదు. ఇందులోని పుణ్యపాపములు ఆ మంత్రివేకాని తనవికావు. కాశికిపోవుటకు నక్కడ శాస్త్రోక్త కర్మములు జరిగించుటకు తనకు కావలసిన సొమ్ము లభించును. ఈకపట వివాహము వలన తనకొక సంసారభారము తగుల్కొనకుండ గృహస్థాశ్రమ ధర్మము నిర్వహించుటకు మాత్రమవకాశమేర్పడును. కాశీ, ప్రయాగ మొదలగు తీర్థములందు, గృహస్థుడుతప్ప బ్రహ్మచారిచేయ వీలులేని కర్మలు కొన్నికలవు. అట్టివానిని కూడ తాను జరిగించి పితృఋణము తీర్చుకొనగల్గుదును అని అతిరూపు డాలోచించి, యీ విచిత్రనాటకమున పాల్గొనుట కంగీకరించెను.

అంతట వివాహ దినము వచ్చినది. చంద్రగిరి మహానగరమంతయు పచ్చతోరణములతోను, వాద్యములతోను నిండిపోయినది. మంత్రిగారి యింటిదగ్గరనుండి మహారాజుగారి నగరువరకును, పచ్చని పందిళ్ళు వేయబడినవి. ఈ పందిళ్ళనుండియే పెండ్లికుమారుని ఆడుపెండ్లివారింటి కూరేగింపుతో తీసికొని పోవుదురు. అక్కడనే వివాహ సంస్కారము శాస్త్రోక్తముగ జరుగును. ఆ దినమెల్ల పెండ్లికుమారుడు ఆ దీక్షాగృహము నుండి కదిలి యీవలకు రాకూడదు. ఈ నిబంధనల కనుకూలముగ నతిరూపుని పెండ్లి కొమరునిగ జేసి, యలంకరించుటలో నతనిముఖము కొద్దిగమాత్రమే కనబడునట్లు వివిధాభరణములు తగిలించి రాజనగరులోని వివాహమంటపమునకు తీసికొని వెళ్ళిరి.

రాజకొమరిత చాల తెలివైనది, ఆమె చక్కనిచుక్క. ఆమె తనకు కాబోవు భర్తను ఒక్కమారు క్రీగంటచూచినది. అతడు అందమైనవాడును, చురుకైనవాడునని గ్రహించి సంతోషించినది.

వివాహకార్యమునందలి వివిధఘట్టములెల్ల సక్రమముగా జరిగెను. అవియన్నియు శాస్త్రోక్తముగ జరుపబడినందున నా దినమంతయు పట్టినది. వధూవరు లి వురును అలసిరి. అతిరూపు డగ్నిహోత్రమునందు యథావిధిగ హోమము చేసెను.

వివాహమంటపమున చేరిన వారందరును పెండ్లికుమారుడు మంత్రికొమారుడే యనుకొనిరి గాని యితరుడని గుర్తింపలేక పోయిరి. నిజరహస్యము తెలిసిన యొకరిద్దరు నోరుమెదల్పక యూరకుండిరి వారికి చాల గొప్ప మొత్తములు లంచమిచ్చుటయేకాక రహస్యము బయల్పరచినచో తలలు కొట్టివేయబడునను భయముకూడ ఆ మంత్రిగారు కలిగించిరి.

ఇట్లు వివాహము సక్రమముగ జరిగిపోయెను. మేళతాళములతో, మంగళ వాద్యములతో, సాయంసమయమున మంత్రికుమారుడని యందరు నమ్మియున్న అతిరూపుడే రాజకొమరిత మెడలో మంగళసూత్రము కట్టి మూడుముళ్ళు వైచుటతో వివాహబంధము పూర్తియైనది. మిగిలిన కార్యకలాపములనన్నిటిని త్వరితముగనే ముగించిరి. రాజవంశాచార ప్రకారము, దంపతు లానాటిరాత్రి శయనగృహమునందు గడుపవలసి యుండెను. అందుకొరకొక దివ్యమందిరము నలంకరించియుండిరి. ఆ సుముహూర్తము సమీపించెను.

ఇది రాజనగరులోని రాణివాసస్త్రీల చేతులలోనిపని. ఇందులో పురోహితులుగాని, పురుషులుగాని, జోక్యము కలిగించుకొన వీలులేదు. ఆ సుముహూర్త సమయమున స్త్రీలచ్చటికి రాగానే పురోహితులును, పురుషులున్ను, అవలకు పోవలెను. ఇది ఆచారము. పురోహితులు గాని, మంత్రిగాని వారు వత్తురనియనుకొనక పూర్వమే రాణివాస స్త్రీలచటికి వచ్చి, పాటలు పాడుచు వధూవరులను శయనమందిరములోనికి తీసికొనిపోయి ప్రవేశపెట్టిరి. ఆచార ప్రకారము పెండ్లికొమరిత తల్లియైన రాణిగారు, తలుపు తాళమువేసి, బీగపుచెవిని తీసికొనిపోయిరి.

ఇట్లతిరూపున కొక రాజకుమార్తెతో నేకాంతవాసము చేయు భాగ్యము లభించెను. అతనికిది యంతయు విచిత్రముగనుండెను. ఇంతవరకెంతో ఓపికతో ధరించిన యాభరణముల నతడు దీసి నేలపైన పడవైచి మౌనముగ కూర్చుండెను. తన భర్త యిట్లు చింతాక్రాంతుడై యుండుట రాకొమరిత చూచి, వగచి, ఆగదిలో సిద్ధముగనున్న రకరకములైన పండ్లను, మిఠాయిలను తీసి ఆయన దగ్గరనుంచెను. అతిరూపుడు వానిని రుచి చూచి కొంచెము తినెను. కాని, అతని కాకలితీరలేదు. అంతట నతడొక సంస్కృత శ్లోకమును చదివెను. ఆ రాజకొమరిత విద్యావతియయ్యు నాశ్లోకార్థమును సులభముగ గ్రహింపలేకపోయెను. గంభీరమైన కంఠస్వరముతో నాశ్లోకము నతిశ్రావ్యముగా చదివిన యీతనితీరు ఆమెను ముగ్ధురాలిగ జేసెను. ఇతడు సామాన్యుడు కాడని యామె గ్రహింపగల్గెను. అతడెంత సుందరుడో, అంత సరసుడని యామె తెలిసికొనెను.

ఆ శ్లోకముయొక్క అంతరార్థమును, విశేషార్థములను తెలిసికొనుట కామె యత్నించినను, సాధ్యము కాలేదు. అంతట నామె యతని పాదములకు మ్రొక్కి, "ప్రాణేశ్వరా! ఈశ్లోకార్థము నాకు విప్పిచెప్పి, నన్ను గారవింపు"దని వేడ్కొనెను. అప్పుడతిరూపుడు ప్రసన్నత వహించి మృదుమధురమైన స్వరముతో, నా శ్లోకము నన్వయించి, చెప్పి యందలి విశేషములను గూర్చి కొంతసేవు బోధించి, తుదకు "జఠరాగ్నిచే దహింపబడు కడుపునకు మిఠాయిలును ఫలములును జారస్త్రీ సౌందర్యము వంటివి. సౌందర్యవతికి పాతివ్రత్య

మెట్లవసరమో, క్షుధాగ్నిచే బాధపడు నాకిప్పు డన్నమవసరము - అని ముగించెను. ఇదిచాల విచిత్రమైన కోరిక. ఆ శయన గృహమునం దప్పు డీ రాజకుమారిత యతని కన్నుమెట్లు వండిపెట్టగలదు? అట్లు చేయజాలనిచో భర్తకోరిక చెల్లింపలేదుకదా! శీలవతియైన, యా రాజకుమరిత మారుమాటాడక లేచి, గంధము, పన్నీరు, జవ్వాది మొదలైన సుగంధ ద్రవ్యములు పోసి యుంచిన, మూడు వెండిగిన్నెలను దీసి తలక్రిందులుగ చేసి పెట్టి, యొక పొయ్యిగా అమర్చి, యాగదిలో నొకమూలపోసియున్న యక్షతలను తీసి గిన్నెలోని పాలతోనేకడిగి, పాలలోపోసి ఆ పొయ్యిపైన గిన్నెనుంచి ఆగదిలో నున్న అగరువత్తులను ఆగదిలోనే యుంచబడియున్న గంధపుచెక్కను వంటచెరుకుగా నంటించెను. అంతటనొక గడియలోపలనే ఆ యక్షతల బియ్యము పరిశుద్ధమైన పాలతో చక్కగా నుడికి, పక్వాన్నమయ్యెను.

అంతట నామె యాయన్నమును వెండిపళ్ళెరమున వడ్డించి తనభర్త ముందరనుంచెను. ఆమె చాతుర్యమునకు అతడు మెచ్చుకొని యిట్టి యొప్పులకుప్పను తాను మరునా డెడబాయవలెను కదా యని వగచెను. అయినప్పటికిని స్వల్పకాలమైనను ఇట్టి కుశాగ్రబుద్ధియైన నారీమణిని భార్యగా పరిగ్రహింపగలిగిన భాగ్యము తనకుకల్గెను గదాయని సంతసించి, ఆ వెండిపళ్ళెరమును తనముందునకు తీసికొని, రాజకొమరిత వైపునకు హర్షముతో చూచి, నీవుకూడ ఆకలిగొనియుందువు గనుక, నాప్రక్కను కూర్చుండి యన్నమును తినుమని యహ్వానించెను. సాధారణముగా వివాహకార్యములందు వధూవరుల కాకలిదీర భుజించుటకు తగు అవకాశముండదు. అందువలన నామెకుకూడ ఆకలిగా నున్నమాట నిజమే. ఇంత సౌందర్యవంతుడును, బుద్ధిశాలియునైన భర్త పక్కన కూర్చుండు భాగ్యము తన కబ్బెను కదాయని ఆమె సంతోషించి యతని ప్రక్కను కూర్చుండెను గాని యామె యా సంతోషములో నేమియు తినలేకపోయెను.

అతిరూపుడు చదివిన శ్లోక మామెకెంతో బాగుండెను. అందువలన దాని నాతనిని మరల చదువుమని ప్రార్థించి, దానిని గోడమీద లిఖించెను. ఉభయులును విద్యావంతు లైనందున ఒండొరులకు తెలిసిన విషయములను గూర్చి చాల ప్రొద్దుపోవువఱకును ముచ్చటించుచు, తుదకు నిదురింపబోయిరి. తమ్మిరువురను భార్యాభర్తలుగ కూర్చిన పరమేశ్వరునికి నమస్కరించిరి, ఉభయుల యానందమునకు మేరలేదు.

ఈ దంపతు లిట్లు ఆనందించుచుండగా, మంత్రిగారేమి చేయుచుండిరో చూతము. తన కూమారుని స్థానమున వరునిగా నటించిన బీదబ్రాహ్మణ కుమారుని స్థానమున మరల తన కుమారుని కూర్చుచేయు లోపలనే రాణిగారును రాణివాస స్త్రీలను వచ్చినందున, అది జరుగలేదు. ఆ సమయమున జరిగిన పొరబాటును గురించి తానేమైన అనినచో తన మోసము బయల్పడును గనుక ఏమనక ఊరకొనెను. వివాహకార్యమెల్ల సక్రమముగా నడిచిపోయినందులకు మంత్రి చాల సంతోషించెను. వివాహమును చూడవచ్చిన పెద్దమనుష్యులెవ్వరును అనుమానపడక అందరునుకూడ వరుడు తన కుమారుడే యనుకొని నందుల కతడుబ్బిపోయెను. మరునాటి ప్రాతఃకాలముననే యా బీదబ్రాహ్మణ కుఱ్ఱవానిని, శయనమందిరమునుండి తన యింటికి దీసికొనిపోయి పంపివేయును. ఈ రహస్యము

వారిద్దరిలోనే యుండును.రేపటినుండి తన పిల్లవాడే, రాజకొమరితకు భర్తగానుండి చంద్రగిరిరాజ్యమున కనంతరకర్త కాగలడు అని సరిపెట్టుకొని యింటికిపోయెను. అమరునాడు తెల్లవారకుండగనే పెండ్లికొమారుని తెమ్మని రాజనగరునకు పల్లకిని పంపెను. ఆచార ప్రకార మాపల్లకిని శయనమందిరము దగ్గరనే యుంచిరి. రాణిగారువచ్చి తలుపుతీయగనే యతిరూపుడువచ్చి పల్లకిలో కూర్చుండెను. రాణిగారు శయనమందిరము లోనికిపోయి, రాజకొమరితను తన మందిరమునకు తీసికొనిపోయెను.

ఆ రాత్రి నూతన దంపతులు నిదురింప నెంతప్రయత్నించినను కంటికి కూర్కురాలేదు. వారొక విషయమును గూర్చి మాట్లాడు చుండగా, నింకొక విషయమును అందుడి మరియొక విషయమును వచ్చి యాసంభాషణమున కంతములేకుండ జేసెను. ఒకరు చెప్పుమాట లింకొకరువినుచు నానందించుచుండిరి. ఇట్లు గడియలన్నియు క్షణములుగా నెగిరిపోయెను ఇంతలోనే పల్లకివచ్చి వారి కాశ్చర్యము కలిగించెను.

ఆ రాత్రి యతిరూపుడు రాజకొమరితతో నింతయన్యోన్యముగ నుండినను తాను మంత్రి కుమారుడను కాననిగాని తన పుట్టుపూర్వోత్తరములను గూర్చిగాని చెప్పలేదు. మాటల సందర్భమున నొకమా ఱప్రయత్నముగ తాను కాశికి పోదలచిన మాటమాత్రము బయల్పఱచెను. రాజకొమరితయు సతిరూపుడు మంత్రికుమారుడేయని భావించియుండెను. ఇతర విషయములను మరునా డడుగవచ్చునని యామె యనుకొనెను. ఇట్లు వారొండొరులను వీడ్కోనిరి.

వివాహమైన రెండవనాడు జరగవలసిన కార్యకలాపము త్వరగానే ప్రారంభమగును. అందువలన కాలకృత్యములకు దీర్చికొని సిద్ధమగుటకు రాజకొమరిత త్వరపడెను. తన ప్రాణనాధునితో నంతమందిలో మాటలాడుటకు వీలులేకున్నను, కన్నుల కరువుదీర ఆతనిని చూచి యానందించవచ్చునని యువ్విళ్ళూరుచుండెను.

ఇక పల్లకీలో కూర్చుండివెళ్ళిన మన కథానాయకుని సంగతి యేమైనదో చూతము. పల్లకిదింపగనే మంత్రిగారు పెండ్లికుమారుని లోపలికి గొనిపోయి, తన గదిలోనికి తీసికొనిపోయి తలుపు బిగించిరి. జాతకమునందు కనబడునట్లు పదునెనిమిదేండ్లు యాయుర్దాయము కూడ తనకు లేకుండ, ఆనాడే యా మంత్రిచేతిలో దుర్మరణ యోగమున్నది కాబోలునని యతిరూపుడనుకొనెను. అయితే రాజకొమరి తను పెండ్లియాడ జేసిన యోగమే యతని నా దుర్యోగమునుండి తప్పించినది. అతిరూపుడు మౌనముగ నుండెను.

మంత్రి యిట్లు మాట్లాడుట ప్రారంభించెను, “ఓయీ నిర్భాగ్యుడా! నిన్నొక కొంతసేపు మాత్రమే యుపయోగింపదలచితిని. అయితే అనుకొనకుండ జరిగిన సంఘటనవలన నేనుద్దేశించిన దానికన్న యెక్కువ కాల మా పాత్రధారణము నీవు చేయవలసి వచ్చినది, ఇందులో నీతప్పులేదు. నీ ప్రయాణమునకు పల్లకి సిద్ధముగనున్నది. అన్దైదువందల మొహరీలుగల సంచు లైదింటి నుంచినాను. మధ్యమధ్య అంచెబోయీల నేర్పాటు చేసినాను. వారు రెండుదినములు రెండురాత్రిళ్ళు నిన్ను మోసికొనిపోయి మా రాజ్యపు మేరలు దాటింతురు. ఆ ధనమును నీవు తీసికొని నీయిష్టము వచ్చిన దేశమునకు

పారిపొమ్ము. నీవు వెనుకకు మరలి మారాజ్యమున మరల కాలు పెట్టినయెడల మాత్రము నీప్రాణము నీకు దక్కదు. నీవెక్కడనైన కనబడినచో శిరచ్ఛేదము చేయవలసినదని యుత్తర్వులు చేసియున్నాను. ఇప్పుడే నీతల కొట్టివేయవలెనని నాకున్నది. కాని, ఒకదినమైనను నిన్ను నాకుమారుని స్థానమున నుంచియున్నందున నాకు చేతులు వచ్చుటలేదు. ఇక పొమ్ము." ఈ మాటలువిని అతిరూపుడేదో బదులు చెప్పవలెనని ప్రయత్నించినను మంత్రి వినిపించుకొనలేదు.

అతిరూపు డసంతృప్తి చెందలేదు. ఏమియు గొణగికొనలేదు. తన కప్రయత్నముగా గృహస్థాశ్రమము లభించినదనియు విధ్యుక్త ధర్మములు నెరవేర్చి తన తల్లిదండ్రుల కుత్తరగతులు కల్పింపగలుగుదుననియు సంతోషించెను. తనకు కావలసిన ధనము లభించినది. తాను జీవించియున్నచో నెన్నటికైనను, తాను భార్యగా స్వీకరించిన యా రాజ కొమరిత తనను భర్తగా నంగీకరించి తీరునని యతనికి ధైర్యమున్నది. ఈతలంపు లతని మనస్సులో కలుగుచుండగనే మంత్రి యతనిని తీసికొనివెళ్ళి పల్లకిలో కూర్చుండబెట్టి బోయీలను తీసికొని పొమ్మని యాజ్ఞాపించెను, అంతట వారు పల్లకినెత్తుకొని పోవసాగిరి. అతిరూపుడు పెదవి మెదల్పలేదు. కాని యతని మనస్సు రాజకొమరిత వైపునకు పోవసాగెను.

ఇట్లీ దురదృష్టవంతుని పంపివేసిన తరువాత మంత్రి మనస్సు చల్లబడెను. తన కుమారుడు, పెండ్లిపీటల మీద కూర్చుండగా చూడవలెనని, తానింతవర కువ్విళ్ళూరు చుండిన సమయ మెట్టకేలకు వచ్చినది. అంతట అతడు తనపిల్లవానిని దీక్షాగృహమునకు తీసికొనిపోయెను. అచ్చట నప్పుడే పురోహితులు సుఖాసీనులై అగ్నికార్యమును ప్రారంభించుటకు మంత్రములు చదువుచుండిరి. హోమముముందు భర్తతో కలసి కూర్చుండుటకు, రాజకొమరితయు సిద్ధముగనుండెను. తన పతియొక్క సురుచిర రూపము, నైదుష్యము, ఔదార్యాది సుగుణసంపద, యామె మనస్సున నాటుకొని, క్రిందటి రాత్రి సంభాషణమును మఱల మఱల జ్ఞాపకమునకు తెచ్చుకొనుచుండెను.

సరిగా నయిదవగడియ యగునప్పటికి, పెండ్లికుమారుడు వివాహమంటపములో కాలిడెను. అక్కడివారందరు నాతని వంకకు చూచిరి. ఎవ్వరికిని యెట్టి యనుమానమును కలుగలేదు. రాజకొమరిత మాత్ర మతనిచూడగనే యాశ్చర్యముతో నిశ్చేష్టురాలయ్యెను. అచ్చముగ నా మధుపర్కములే, ఆయలంకరణములే, ఆ యెత్తు పొడుగులే ఆ ఛాయయే. కాని అతడు మాత్రము కాడు. అందరివలెనే యామె దృష్టియు పెండ్లికొడుకు వైపునకు మరలగా, అతని ముఖమున క్రిందటి రాత్రి యత్యంత క్లిష్టమైన సంస్కృత శ్లోకార్థమును వివరించిన బుద్ధివైభవము యొక్క దివ్యతేజము కానరాలేదు. ఆమె దిగ్భ్రమ చెందినది. ఆమెకు భయాశ్చర్యములు కలిగినవి. ఏదో మోసము జరిగినది యామెకు రూఢియైనది. ఇక తన బ్రతుకు దుర్భరమని యామెకు తోచినది. కాని వివేకవంతురాలు గనుక నంతలో ధైర్యము తెచ్చుకొని తానిప్పుడేదైన గడబిడ చేసినచో తనకును తన కుటుంబమునకును అవమాన దుఃఖములు కలుగ గలవనియు అంతేకాక తన ప్రాణేశ్వరునకు ప్రాణాపాయము కూడ కలుగవచ్చుననియు బ్రతికియున్న నెప్పటికైన తనపతిని జేరవచ్చుననియు తలచి

యప్పటికీ కపటనాటకయున పాల్గొనుటకు నిశ్చయించి గంభీరముగ పోయి మంత్రి కుమారుడైన పెండ్లి కుమారుని ప్రక్కనె కూర్చుండెను. అగ్నికార్యము యథావిధిగ జరుగుచుండెను.

అహా! రాజకొమరిత యెట్టియనుమానము చెందకయే తనకుమారుడే నిన్నటి పెండ్లికొడుకని యనుకొనుచున్నది. ఇక భయములేదు. రాజకొమరిత నాకు కోడలైనది. ఈ చంద్రగిరి రాజ్యము నా కుమారునికి దక్క గలదు! అని అనుకొని తనతంత్రము నెరవేరినది కదాయని మంత్రిగా రమితమైన సంతోషమును పొందెను. ఆ సమయముననే రాజకుమార్తెయు తన నిజేశ్వరుని తనకు ప్రసాదింపుమని పరమేశ్వరుని ప్రార్థించుచు, తన శీలమును సంరక్షించుకొనుటకు కృతనిశ్చయురాలయ్యెను. తన వంశగౌరవమును కాపాడుటకే తానిప్పుడీ కపటవరుని పజ్జను కూర్చుండినది కాని బుద్ధిపూర్వకముగ నిష్టపడికాదు. ఇతడు తన భర్తకాజాలడు. ఆమె త్రికరణ శుద్ధిగ తనపాతివ్రత్యము నిలువ బెట్టుకొనును. ఈ తలంపులతో నెట్లో ఆ దినము గడిచినది, ఆచారప్రకారము మరల వధూవరులను గదిలోని కంపి తాళమువేసిరి. ఈ దొంగపెండ్లికొడుకు నొంటరిగాచూచి నంతనే రాజకొమరిత యొడలు భగ్గుమనెను. అంతట నామె యతనితో "మీరా తలుపు దగ్గరనే యుండుడు. ఒక యడుగైన ముందుకు రావలదు. నా శయనమందిరము నపవిత్ర పఱుపవలదు. నిజము చెప్పుడు. ఎవరు మీరు? మీయంతట మీరే ఈవేషము వేసికొని వచ్చినవారు గాక ఎవరైన మీకీవేషము వేయగా వచ్చినవారై నిర్భాగ్యులరైనచో మీ యెడల దయదలచి వదలెదను" అనెను.

"నేను నీభర్తను" అని అని మంత్రి పుత్రుడనెను. ఆ మాటల నతడు పూర్తిగ నుచ్చరించు లోపలనే రాజకుమార్తె తన యొడ్డాణమున నిమిడ్చియుంచిన ఖడ్గము నీవలికి దీసెను. అది చూడగనే యా నిర్భాగ్యుడు భయపడి వడవడ వణకి పోయెను. అతడు విఱచుకొని క్రిందపడి గిలగిల కొట్టుకొనసాగెను. రాజకొమరిత యాశ్చర్యపడెను. అంతట నామె తన ఖడ్గమును యథాస్థానమున నుంచి తలుపు తట్టి కేకలువేయగా, రాణిగారు తలుపు తెఱచి లోనికి వచ్చిరి. "ఇదిగో, నీ అల్లుడు! మూర్ఛవచ్చి పడిపోయినాడు. తీసికొని పొమ్ము" అని రాజకుమార్తె యాగదిలో నొకమూల నిలిచి తన తల్లితో ననెను.

ఇదియంతయు చాల కొద్దికాలములోనే జరిగిపోయెను. వివాహమంటపమున నున్న వారందరు నింక నావలకుపోలేదు. మంత్రికూడ అక్కడనే యుండెను. ఇదివిని అందరు పరుగిడి వచ్చిరి. ఈ మూర్ఛ యిప్పుడెందుకు వచ్చినది దైవమా, యని వేనోళ్ళ దిట్టికొనుచు. మంత్రి తన కుమారు నావలకు మోయించుకొని పోయెను. రాణిగా రిది చూచి యాశ్చర్యపడి ఏమిది యని తమ కుమార్తెనడిగిరి. అంతట నామె, "అమ్మా నేనింకను యీ లోకములో నుండనలెనన్నచో, నాయంతట నేను చెప్పువఱకును, నీవేమియు నన్నడుగవలదు" అనెను.

రాజనగరు అల్లకల్లోలముగ నుండెను. వివాహము రెండవ దినముననే యిట్టి విపరీతములు జరుగుట యేమిటో, ఎవ్వరికినీ అర్థముకాదు.

తెల్లవారినది. ఏది యెట్లున్నను వివాహ సంస్కారము అసంపూర్ణముగ వదలుటకు వీలులేదు. మూడవ దినచర్య సక్రమముగ జరిగితీరవలెను. మఖల యథాప్రకారముగ వధూవరుల పీటలమీద కూర్చుండి యగ్నికార్యము జరిగించిరి, రాత్రి మరల వారిని పడకగదిలోనికి పంపించిరి. ఆ వివాహమున గదిలోనికి పోవుట పెండ్లి కుమార్తెకు మూడవ సారిగాని యీ పెండ్లికుమారునికి మాత్రము రెండవసారి.

గదితలుపులు వేయగనే, రాజకొమరిత యతనితో నిట్లనెను- "ఈ శయన గృహమునకు మరల వచ్చుటకు నీకు మొగమెట్లు చెల్లినది? నీకు సద్బోధచేయుటకే నేను నిన్నిక్కడికి రానిచ్చితిని. నిన్న నీవు నిలబడిన చోటనే నిలిచి నేను చెప్పుమాటలు వినుము. నీవు నా భర్త కావు. నా నిజభర్త యొక్క పాదధూళిని శిరమున దాల్చుటకైన నీకర్హతలేదు. అట్టి నీ వెట్లాయన వేషమును ధరింప సాహసించితివి? నీవు నిజము అంతయు చెప్పివేయుము. అట్లు చెప్పవైతివేని ఫలితము ననుభవించెదవు."

తన ప్రాణము లామెచేతులలో నున్నవని మంత్రి కుమారునికి తోచెను. తానామెను వంచలేడు. ఆమె తనకు భార్యగానుండుట దుస్తరము. భయముతో వడకుచు అతడు తనకు తెలిసిన సంగతులన్నియు ఆమెకు చెప్పివైచెను. ఆమె నిజేశుని గూర్చి మాత్రము అతడేమియు చెప్పలేకపోయెను. అతడొక బీద బ్రాహ్మణుడనియు తన తండ్రి అతని నెట్లో పట్టుకొనివచ్చి అక్కరను దీర్చికొని రాజ్యమునుండి వెడలగొట్టినాడనియు చెప్పెను.

మంత్రిపుత్రుడు చెప్పిన సమాచారమువలన రాజకొమరితయొక్క హృదయ పరితాపము కొంత యుపశమించెను. తన హృదయేశ్వరుడింకను జీవించి యున్నాడనియు ప్రస్తుత మాతని కెట్టి ప్రాణభయమును లేదనియు ఆమె తెలిసికొనగలిగెను. అటువంటి మహానుభావు డెక్కడనున్నను ఎట్టి కొఱతయు కలుగదు.

అంతట నామె మంత్రిపుత్రునితో నిట్లనెను. "నీవెప్పుడు నింక నామందిరమున నడుగు పెట్టవలదు. లోకమునందు నీవు రాజుగారి అల్లుడవుగ పరిగణింపబడుదువు గనుక, నీవు రాజసభలోనికి పోయి కూర్చుండి అక్కడ పొందదగిన మర్యాదలను పొందవచ్చును. అయితే నన్ను నీభార్యగా పరిగణించి వ్యవహరింప ప్రయత్నించిన యెడలగాని నీవు నాకేమైన వార్తలనంప ప్రయత్నించినగాని, నీప్రాణములు నీకు దక్కవుసుమీ యని గట్టిగా చెప్పెను.

మంత్రికుమారు డామెచేసిన యాజ్ఞాపనమువిని ఆరాత్రి కూడా తన ప్రాణమున కేమైన అపాయము తటస్థించునేమో యనుభయముతో తలుపుతట్టి, బయటనే నిలిచియున్న తన తండ్రినిపిలిచి యామందిరమును విడచి యావలికిపోయెను. అంతటితో నతనియాశ తీరినది.

ఆ దినము మొదలు రాజకొమరిత తన మందిరమును వదలి బయటకు వచ్చుటమానెను. భోజనమునకు మాత్రమీవలికివచ్చును. తన నిజేశ్వరుడు తిరిగివచ్చి తన్ను పరిగ్రహింపవలెనను కోరికతప్ప వేరుకోరిక యామెకులేదు. అతడు తప్ప యామె కితరము కనబడుటలేదు. ఆమె యందు కలిగిన మార్పు నామె తల్లిదండ్రులు గమనించిరి. ఆమె సాధారణముగా ధరించు విలువగల వస్త్రములను, నగలను తీసివైచెను. మోటైన

బట్టలను కట్టుకొనెను. ఆమెకు ప్రీతిగల పుష్పసుగంధాది ద్రవ్యములను వర్జించెను. ఎల్లప్పుడును పట్టుపరుపులపైన నిద్రించు సుకుమారి కఠిక నేలపైననే చెంగుపఱచుకొని పండు కొనసాగెను. ఆమెకు సుఖనిద్ర యనునది లేకపోయెను. కన్ను మూసినంతనే ఉలికిపడి లేచును. చంద్రకాంత శిలామండపములందు శీతలోపచారములందుచుండు రాకొమరిత ఎల్లప్పుడును పంచాగ్నిమధ్యమునందే యుండి తన పతికొరకు తపము చేయసాగెను. ఆమె తన వృత్తాంతమెవ్వరికిని చెప్పలేదు. ఎవ్వరు నామెనడిగి తెలుసుకొన సాహసింపలేదు. ఆమె తల్లిదండ్రులు కూడ ఆమె యోగనిష్ఠను చూచి భయపడసాగిరి.

రాజకొమరిత చేయు తపమెల్ల దేశాంతరగతుడైన నిజపతికొఱకే. ఈ సంగతి నెవరును గ్రహింపలేకపోయిరి. లోకమెల్ల మంత్రికుమారుడే యామె పతియని నమ్మి యుండిరి. ఏదో కారణమున భార్యాభర్తలకు మాటలులేవని అనుకొనిరి. రాజకొమరిత తనకు జరిగిన పరాభవమువలన మంత్రి కుమారుడు సిగ్గుపడిపోయి దానినిగూర్చి ఎవ్వరికిని చెప్పకొనక దాచివైచెను. దీనిని గూర్చి తండ్రియెన్ని విధములుగా ప్రశ్నించినను, నయముననను, భయముననను నిర్బంధించి అడిగిననుకూడా అతడేమియు చెప్పలేదు. అతడు రాజ్యసభకుపోయి రాజుగారి అల్లుడుగా గౌరవింపబడుచుండెను. అల్లునికి చెందవలసిన బహుమతులు అతనికి చెందుచుండెను. అతడు పైకి అందముగానే కనపడు చుండినందునను, అతని మూర్ఛరోగము సంగతి చాలమందికి తెలియనందువలనను ఎప్పటికైనను ఈ భార్యాభర్త లేకమగుదురని లోకులనుకొనుచుండిరి. అయితే ఎవ్వరును వారిని సమాధాన పఱచుటకు ప్రయత్నింప సాహసింపలేకపోయిరి. రాజకొమరిత పేరు చెప్పిననే మంత్రిపుత్రున కామె ఖడ్గము జ్ఞాపకమువచ్చి భయముచేత మూర్ఛ వచ్చుచుండును. అందువలన నతడెన్నడు మఱల నామెదగ్గరకు పోవ సాహసింపలేదు. ఆమె వచ్చుచున్నదని తెలిసినంతనే అతడు తొలిగిపోవును. ఇట్టి పరిస్థితులలో తాను రాజుగారి అల్లుడుగా పరిగణింపబడుటయే చాలునని అతడూరట చెందెను. ఏమైననేమి? ఎన్నడో ఒకనాడీ చంద్రగిరి రాజ్యము తన కుమారునికి వశమగును గదా యని మంత్రిగా రువ్విళ్లూరుచుండిరి.

ఇట్లొక సంవత్సరము రెండు మాసములు గడిచిపోయెను. రాజకొమరిత యింకను తన పూజలు, తపస్సుమానలేదు. ఆమె యెంతో గుణవతియు, మానవతియు, శీలవతియు నైనందున నామె నెవ్వరు నేమనలేకపోయిరి. ఒకనాడు రాజుగారామెను జూచి "అమ్మాయి! నీవు నాకేకైక పుత్రికవు. నావార్ధక్యమున నీవు సుఖముగా భర్తతో కాపురము చేయుచుండగ చూడదలచితిని. పెండ్లియైనప్పటినుండియు నీవు పూర్తిగా మారిపోయితివి. ఈ వైరాగ్యము రాజకుమార్తెకు తగునా? అమ్మా నీకుగల మనోవ్యధ యెటువంటిదో నాకు చెప్పుము" అని చాల దీనముగానడిగెను. అంతట రాజకొమార్తె "నాయనగారూ ! నేనిప్పుడు చేయునది యెల్ల నాపతి శ్రేయమును గూర్చిన వ్రతమే. ఇంతకన్న నన్ను మీరేమియు అడుగవలదు. నాయంతట నేనే మీకు చెప్పువఱకును మీరు నన్నీవిషయమై నిర్బంధింప వలదు. నాకు కొలది దినములలోనే కొంతధనము కావలసియుండును. దాని నిప్పించుడు" అనెను.

తన కుమార్తెయొక్క నిష్కల్మషమైన చరిత్ర నిష్కపట ప్రవర్తనము, ఆమె చేయుచున్న ఘోర తపమునం దామెచూపు ప్రవర్తనము, ఆమె తనకు చెప్పిన ప్రత్యుత్తరమును చూచి, తండ్రి ఏమియు ననలేక ఆమెకెప్పుడెంత సొమ్ము కావలసిన నంత సొమ్ము నివ్వవలసినదని తన భాండాగారి కుత్తరువు గావించెను. రాజకొమరిత తన తండ్రి యిచ్చిన ధనముతో చంద్రగిరి నుండి కాశీపట్టణము వఱకును పదిక్రోసుల కొక్కొకటి చొప్పున ననేక ధర్మసత్రములు నిర్మింపజేసి యాత్ర పోవువారికి కావలసిన సపర్యలనెల్ల చేయుటకు తగు మనుష్యులను నియమించెను.

అట్లు మంత్రియాజ్ఞచే నతిరూపుని మోసికొని పోయిన బోయీలు తమపల్లకిని చంద్రగిరిరాజ్యపు సరిహద్దును దాటగనే దింపివేసిరి. అతడును, తనకెట్టి అపాయమును చేయకుండ వదిలినందులకు సంతోషించుచు, పల్లకిలోని ధనమును దీసికొని కాశీమార్గమును పట్టిపోయెను. అతనికిప్పుడు చేతిలో ధనమున్నందువలన నెట్టికష్టమును లేకయే రెండునెలలలో గమ్యస్థానమును చేరెను. తాను పదునెనిమిది సంవత్సరములు దాటి జీవింపనను నమ్మకము పూర్తిగ కలిగినవాడైయున్నందువలన, అతడు తన భార్యయైన రాజకొమరితను గూర్చియాలోచించుట మానెను. మంత్రియొక్క క్రూరశాసనము నతడెఱిగి యున్నందువలన నామెను చూచుట దుర్లభమని చంద్రగిరి మాటనే తలపెట్టుట మానెను. అతడు కొన్ని నెలలలో కాశీలోనుండి అక్కడ చేయవలసిన పుణ్యకర్మలనెల్ల చేసి ప్రయాగకు పోయెను. అక్కడ తనదగ్గరనున్న ధనమునొక ముదుసలి యామె కిచ్చి, తనను కుమారునివలె కాపాడవలసినదని కోరెను. ఆమెయు చాల దొడ్డయిల్లాలైనందు వలన, నతిరూపుని చాల దయతో చూడసాగెను. అతిరూపుడు ప్రయాగలో చేయవలసిన పుణ్యకర్మలనెల్ల చేసెను. నిత్యకర్మలను పూజానుష్ఠానములను చేయగా మిగిలిన కాలము నతడు వృధాపుచ్చక, యోగాభ్యాసమునందును, వేదాంతశాస్త్రాభ్యాసమునందును వినియోగించి, అందు ప్రవీణుడయ్యెను. తన జ్యోతిషవిద్యను గూడ వ్యర్థము చేయక, యితరుల లాభముకొఱకు వినియోగింపసాగెను. శీఘ్రముగనే అతని ప్రఖ్యాతి నలుగడల వ్యాపించెను.

అంతట నతనికి పదునెనిమిదవ సంవత్సరము ముగియవచ్చుచుండెను. అందువలన నతడు కొంత వ్యాకులచిత్తు డయ్యెను. కాని, ఆరహస్యము నెవ్వరికిని చెప్పక తనలోనే దాచికొనెను. ఆ దినమున కాదినము, తనయందెక్కుడుగా పుత్రవాత్సల్యమును చూపు నాముదుసలి యవ్వగారికి సైత మా సంగతి చెప్పలేదు. అతడు తన యవసాన కాలము సమీపించుచున్నదని తోచినకొలది. రాజబాటలపైన పోవుటమాని, యడవిగా పెరిగి నిర్మానుష్యమైయుండు నొక మారుమూలనున్న కాలిదారిని గంగానదికి పోయి స్నానముచేయుట ప్రారంభించెను. తాను చనిపోవునప్పు డితరులెవ్వరును చూడకుండటకై యతిడిట్లుచేసెను. ఇతడిక్కడ నిట్లూర్ధ్వముఖుడై యుండగా, నక్కడ చంద్రగిరిలో రాజకొమరిత తన పతియైన యితని క్షేమలాభముల కొఱకు, తపము చేయుచునే యుండెను. మఱి యితని ఇంటిదగ్గర యితని ముదుసలి తల్లిదండ్రులను, వీడు నేడు వచ్చును. రేపు వచ్చునని. యాసపడుచు. కనిపెట్టుకొనియుండిరి.

అతిరూపునకు జాతకరీత్యా మారక యోగమున్న దుర్దినము వచ్చినది. అతడు తెల్లవారుజాముననే లేచి యీశ్వరధ్యానముచేసి నదీతీరమునకుపోయి నరసంచారము లేనిచోట నదిలో స్నానముచేసి కొంతసేపు యోగమునుబట్టి, సూర్యోదయమగుచుండగ లేచి, యీవలకు వచ్చుచుండగా పాచిపట్టిన మెట్లపైన నతని కాలుజారినది. తన కవసాన కాలము సమీపించినదని అతనికి మెఱపు మెఱసినట్లయినది. అతని శరీరము చైతన్య రహితమై క్రిందికిదొర్లి నదీతీరమునగల యిసుకలోపడెను. ఆచుట్టుపట్ల యెక్కడను జనసంచారము లేనందున, యీ దృశ్యము నెవ్వరును చూడలేదు. ఇతనిని రక్షించువారును లేరు.

ఆ దినము తెల్లవారుజామున నక్కడ చంద్రగిరిలో రాజకొమరిత కొక వింత కలవచ్చెను. ఆమె తపస్సునకు మెచ్చి పరమేశ్వరుడు ప్రత్యక్షమై యామె భర్తయైన యతిరూపుని తెచ్చియప్పగించి సుఖముగా నుండుమని యాశీర్వదించినట్లు సాక్షాత్కారము కాగా నామె యులికిపడిలేచి, యుప్పొంగి అగ్నిహోత్రము దగ్గర కూర్చుండి, జపము చేయసాగెను. తరువాత నామె తన ధర్మసత్రాధికారులకు, యాత్రికులపట్ల కొన్ని కట్టుబాటులతో ప్రవర్తించవలసినదని మఱలనుత్తర్వు చేసెను.

అక్కడ ప్రయాగలో నతిరూపుడు నదీతీరమున చైతన్యరహితుడై పడియుండెను. అతడు బసచేసిన యింటియవ్వగా రత డెంతసేపటికి నింటికి రాకపోగా తహతహజెందెను. ఇట్లతడెన్నడును జాగుచేసినవాడు కాడు. ఆదినమెల్ల గడచినది. మరునాటి యుదయము కూడ రాకపోగా నామె ప్రయాగలోని బ్రాహ్మణ తడల నాయకులతో చెప్పి గోలపెట్టెను. కొందరు పుణ్యాత్ము లతని కొఱకు వెదకిచూచిరి కాని యెవ్వరికిని అతడు కనబడలేదు.

మూడవనాటి తెల్లవారుజామున అతిరూపుడుపడియున్న ఘట్టమునకొక సిద్ధపురుషుడు స్నానము చేయవచ్చెను. అతడు హఠయోగి. ఇతరులకు కనబడకుండ యోగ సాధనము చేయదలచియే, అతడా నిర్జన స్థలమునకు వచ్చినాడు. అతడు తన సాధనలు చేసికొని మరలి వచ్చుచుండగా నాతనికాలికి అతిరూపుని శరీరము తగిలెను. అప్పుడతడాశ్చర్యపడి పరిశీలించిచూచెను. అంతట నతిరూపుడు మరణించలేదనియు, యోగ సమాధిలోపడి వెనుదిరిగి రాలేకున్నాడనియు నాయనక వగతమైనది. అంతట నతడు కొన్ని యోగప్రక్రియలను గావింపగా అతిరూపుడు నిద్రలేచినట్లుగా లేచి కూర్చుండెను. అప్పుడా సిద్ధపురుషుడు, "నాయనా' నీవు చిన్న వాడవు. ప్రవృత్తి నివృత్తి మార్గములను పూర్తిగా నెఱగకుండ నిట్టి యోగ సమాధిలో ప్రవేశింపవచ్చునా? నేను నిన్ను చూడనియెడల మఱల నీవు బ్రతికెడువాడవు కావుసుమీ! అని మందలించగా నతిరూపుడు ఆయనకు నమస్కరించి "మహానుభావా, నేను బుద్ధిపూర్వకముగా సమాధిలోనికి పోలేదు. నాకిది యప్రయత్నముగ కలిగినది" అనెను. ఇదివిని యోగి ఆశ్చర్యపడి, "నీవు అదృష్టశాలివి. ఎంతో కాలము సాధనచేసినగాని లభింపని యోగసిద్ధి నీకు కలిగినది. దీర్ఘాయుష్మంతుడవై పరోపకారివై బ్రతుకు"మని యాశీర్వదించి, తనదారిని పోయెను.

అతిరూపుని జాతకయోగము, రాజకుమారి తపము యీ విధముగా ఫలించెను. ఇది దైవసంఘటనము కాని వేరుకాదని అతిరూపుడనుకొని, మెల్లనలేచి నదిలో స్నానము చేసి తన బసదగ్గరకువచ్చి చేరెను. ఆముదుసలి యవ్వయు, చనిపోయినవాడు లేచి వచ్చినట్లు సంతోషించెను. తరువాత అతిరూపుడు కొన్ని దినములుండి, తన మారక యోగము గడిచిపోయినందున నిక యింటికిపోయి తనవృద్ధ మాతాపితరులను చూచుట న్యాయమని నిశ్చయించి యాయవ్వగారితో నామాట చెప్పెను ఆమెయు సంతోషించి "నాయనా! నీవిచ్చిన సొమ్ము నాదగ్గర నాలాగుననే యున్నది. నాకిది యవసరములేదు. దారిలో నీకక్కరకు వచ్చును. తీసికొనిపొమ్మని" చెప్పియిచ్చెను. అతడెంత వలదనినను ఆమె విననందున, దానినతడు స్వీకరించి దానిని తన పాతబొంతలో కుట్టుకొని, గంగకావడి పుచ్చుకొని బయలుదేరెను. అతడు మెల్లగా నడచుచు, యింటిదారిపట్టగా, ప్రతియడుగు నప్రయత్నముగ, తనభార్యదగ్గరకే యతనిని లాగుకొని పోవుచుండెను. దారిలోనతడు బసచేసిన మొదటి ధర్మసత్రము చంద్రగిరి రాజకొమరిత వేయించిన ధర్మసత్రమే. అక్కడి యుద్యోగస్థులతనినెంతో చక్కగా నాదరించి, మృష్టాన్నమిడిరి. శ్రమదీరిన తరువాత, నక్కడి సత్రాధికారి, యతిరూపుని దగ్గరకొక తాళపత్రగ్రంథమును తెచ్చి, "స్వామీ! దీనిని మీరు చదివి యర్థము చెప్పగలరా" యని అందులోని యొక శ్లోకమును తీసి చూపియడిగెను. అది చూడగనే అతిరూపున కాశ్చర్యము కలిగెను. "అయ్యా, దీని యర్థము నాకు తెలియునుగాని, చెప్పదలచలేదు" అనెను. అతని మనస్సు పరిపరివిధముల పోవసాగెను. ఆహా నేను కలగనుచున్నానా? మేల్కొనియున్నానా? నా వివాహమునాటి రాత్రి చంద్రగిరి రాజకుమార్తెకు వినిపించి యర్థముచెప్పిన శ్లోకమిది! నన్ను గుర్తించుట కామెచేసిన తంత్రమాయేమిటి? అని యతడు వితర్కించెను. ఇంతలో సత్రాధికారివచ్చి, "అయ్యా! పల్లకి సిద్ధముగానున్న" దనెను. ఇదివిని యతడు మరింత యాశ్చర్యముతో, "అయ్యా కాశికావడి పుచ్చుకొని యింటికిపోవుచున్న బీద యాత్రికునకీ పల్లకి యెందుల కనెను. అంతట సత్రాధికారి "స్వామీ, ఈ సత్రమును నిర్మించిన చంద్రగిరి రాజకొమరితగారి యాజ్ఞయిది. ఈ దారినివచ్చు యాత్రికులందరికిని మృష్టాన్నమిడి, వారు తృప్తులైన తరువాత, వారికీ తాళపత్ర గ్రంథముచూపి, శ్లోకార్థమునడుగ వలసినదనియు, అర్థముచెప్పిన యాత్రికుని తమ సమక్షమునకు తీసికొనిరమ్మనియు, ఆమె యుత్తర్వు చేసియున్నది. మేము చాలమందికి చూపితిమికాని యింతవరకు నెవ్వరు నర్థముచెప్పగల మనినవారు లేరు. తాము మాత్రము చెప్పగలము గాని చెప్పమని యంటిరి, అందువలన మిమ్ము మారాజకొమరిత దగ్గరకు తీసికొనిపోయెదము" అనెను.

అంతట నతిరూపునకు, సంగతి తెలిసిపోయెను. ఇదియంతయు తనను గుర్తుపట్టి రప్పించుట కాసాధ్విచేసిన పనియని యర్థమైనది. తన భార్య మహాపతివ్రత యనియు ఆమెను త్వరలోనే కలిసికొనగలననియు అతడు గ్రహించెను. అంతట నతనికి పరమానందమయ్యెను. ఆ మంత్రియేమైనాడు? తనకు ప్రాణభయము కలుగునేమోయను అనుమానము నతని కావంతయుకలుగలేదు.

ఇంతలో నీ ధర్మసత్రాధికారి యీసంగతిని రాజకుమారినికి తెలియపఱచుటకు ప్రత్యేకముగ మనుష్యుల నంపెను. ఇది వినునప్పటికి రాజకొమరిత మహదానందమును పొందెను. ఆ యాత్రికుడు వచ్చువఱకు పూర్తిగ నమ్మవీలు లేకపోయినను, ఆ వచ్చుచున్నది తన ప్రాణేశ్వరుడే యనియు, అది పరమేశ్వరుని యనుగ్రహ ఫలితమేయనియు. నామె దృఢవిశ్వాసము. అంతట నామె తన తండ్రిని పిలిచి "కాశీనుండి రెండుదినములలో నొక మహానుభావుడు వచ్చుచున్నాడు. ఆయనను మన రాజనగరున కాహ్వానించి పూజ చేయించవలెను. అందులకు వలయు సన్నాహముచేయించి, తామేపోయి, ఆయనను ఇక్కడకు తీసికొని రావలె"నని కోరెను. తనకుమార్తె కోరిన ప్రకారము, రాజు స్వయముగా యాత్రికున కెదురేగి, తన రాజనగరునకు దయచేయుడని యాహ్వానించెను ఈ వచ్చిన యాత్రికుని బ్రహ్మతేజమును చూచి, రాజాశ్చర్యపడెను. అతడొక పుణ్యమూర్తి యనియు తన కుమారిత కేవిధమునో ఇతడు గురువైనాడనియు, నిశ్చయించెను. అంతట నాయనకు సకల రాజోపచారములు గావించి గౌరవించెను.

ఆ వచ్చిన యాత్రికుడును మౌనము నవలంబించెను. తనను ఆహ్వానించినది తన భార్యయేయని రూఢియగు వఱకును తానేమియు మాట్లాడకూడదని అతడు నిశ్చయించెను. అంతట రాజుగారును. తన పరివారజనమును యీవింత యాత్రికుని వెంటబెట్టికొనివచ్చి, రాజనగరులో విడిది వేయించిరి. ఆయనవచ్చి దిగుచుండగనే రాజకుమారి దూరమునుండియే చూచి, తన హృదయేశ్వరుని పోల్చుకొని యుప్పొంగి పోయెను. ఆ క్షణమునుండి యామెలో మార్పుకలిగెను. ఆమె తన తండ్రిగారితో తన దీక్షాకాలము ముగిసినదనియు ఈ మహాత్ముని యనుగ్రహమున తనభర్తతో కలిసి సుఖించుకాలము వచ్చినదనియు ఈ మహాభావుడు చేయు గంగాపూజకు రాజోద్యోగులను, పౌరోహితులను, ఊరిలోని పెద్దలను ఆహ్వానించవలసినదనియు కోరెను. రాజుగారు, తక్షణమే కావలసిన యేర్పాటులన్నియు జేయించిరి.

ఆ యాత్రికుడు స్నానముచేసి యనుష్ఠానము చేసికొనుచుండగా, రాజకొమరిత పన్నీటజలక మాడి, తన యమూల్యములైన పట్టుపుట్టములు కట్టికొని, అమూల్యా భరణములను ధరించి పుష్పములను తలలో ముడిచికొని సుగంధద్రవ్యముల నలదికొనివచ్చి, పూజామందిరమును స్వయముగా నలంకరించి, పూజా ద్రవ్యములను సిద్ధపరచెను.

కాశీ, గయ, ప్రయాగలు సేవించుట అందరికిని సాధ్యముకాదు. గంగాజల మనుదినము లభించునదియుకాదు. అందువలన గంగాజల పూజను దర్శించి, ఆ పవిత్రోదకమును శిరస్సున జల్లుకొని, మూడు ఉద్ధరిణలు లోపలికిపుచ్చుకొని తీర్థయాత్రా ఫలమును పొందుటకు చంద్రగిరి రాజుగారి మంత్రి మొదలు సేవకుని వఱకును గల రాజోద్యోగులును, పౌరోహితులును, పట్టణములోని యన్ని వర్ణములలోని పెత్తనదారులును వచ్చిరి. అదియొక రాజసభవలెనే యుండెను.

మంత్రిపుత్రుడు రాజుగారి యల్లునిపదవి ననుభవించుచున్నందువలన, నీమహాసభలో చాల ప్రాముఖ్యమైనచోట కూర్చుండియుండెను. పూజామందిరమునం

దిటునటు తిరుగుచున్న రాజకుమారితయందు వచ్చిన మార్పునుచూసి అందరు నాశ్చర్యపడిరి. ఈ గంగాపూజ సందర్భమున నీమె భర్తయై మంత్రిపుత్రునితో సఖ్యతవడునని యందరు ననుకొనిరి. మంత్రియు నట్లే యనుకొనెను. కాని మంత్రిపుత్రునికి మాత్రమెట్టి యాసయు లేదు.

అంతట కాశీనుండి వచ్చిన మహానుభావుడు పూజామందిరములోనికి వచ్చెను. ఆయన మొగముపై తాండవించుచుండిన బ్రహ్మతేజమును చూచి యందురు నాశ్చర్యపడిరి. ఈయనను మంత్రి వెంటనే పోల్చుకొన లేకపోయెను. కాని అతనిముఖ మెక్కడనో చూచినట్లున్నదని యనుకొనెను. ఇంతలో పూజ ప్రారంభమయ్యెను. అతిరూపుడు శ్రావ్యమైన కంఠముతో మంత్రములను ధ్యాన శ్లోకములను చదువసాగెను. అక్కడి బ్రాహ్మణులందరు ముగ్ధులైపోయిరి. పూజ పూర్తియైన పిదప సభాసదులందరును తమ తమ కుడి అరచేతిని పైకిపెట్టి, దానిక్రింద తమ యెడమచేతి నుంచికొని గంగా జలమును స్వీకరించుట కొఱకు లేచి నిలిచిరి. అతిరూపుడు గంగచెంబు మూతనుతీసి, దానిని ఎడమచేతి నుంచుకొని, కుడిచేతిలోని యుద్ధరిణతో దానిలోనుండి గంగనుతీసి యొక్కొక్కరికే ప్రసాదించుటకై లేచెను. ఇంతలో "మహానుభావా, గంగజలమున్న ఘటమును మీ ధర్మపత్నినైన నేను చేతబుచ్చుకొని, మీకు తోడ్పడుట శాస్త్రవిధి. దానినిట్లు దయచేయుడు." అని యొక స్త్రీ కంఠము అతిరూపుని యెడమ ప్రక్కనుండి వినవచ్చెను. ఇంతలోనే, రాజకొమరిత యతిరూపుని యెడమచేతిలోని గంగచెంబును తీసికొని యతనియెడమప్రక్క నిలిచెను. మంత్రిముఖము వెలవెల పోయెను. రాజు దిగ్భ్రమచెంది "ఏమిది?" యనెను. అంతట రాజకొమరిత "నాయనగారూ! నేనీ మహానుభావుని ధర్మపత్నిని. ఆనాడు వివాహ మంటపమున నామెడలో మంగళసూత్రమును కట్టినదితడే కాని, యీ మంత్రి పుత్రుడు కాడు. తక్కిన నాటకమంతయు నీ మంత్రిపుంగవుడు చేసిన దుస్తంత్రమే. ముందుగా నీ మంత్రిని పట్టి బంధింపుడు – నిజమంతయు మీకు తెలియు"ననెను.

అంతట రాజునాజ్ఞవలన నామంత్రిని పట్టుకొని బంధించిరి. అప్పుడు రాజకొమరిత జరిగినకథ నంతయు వెల్లడించెను. ఆనా డతిరూపుడే పెండ్లిపీటలమీద కూర్చుండి తన్ను వివాహమాడుట, శయనమందిరమున నాతడు చదివిన శ్లోకము సంగతి తాను వండిపెట్టిన యున్నముసంగతి, మరునాడు మూర్ఛరోగియైన మంత్రిపుత్రునికి అతిరూపుని వేషము వేసి తెచ్చుట, అటుతరువాత జరిగిన వృత్తాంతమునెల్ల యామె బయల్పఱచెను. ఆనాడు తాను చేసిన వంటకు గుఱుతుగా నా వెండి సామానులను తెచ్చి చూపించెను. మంత్రి కుమారుడు బేలయై, తన దుఃస్థితిని ప్రదర్శించెను. సభాసదు లాశ్చర్యపోయిరి. అంతట నతిరూపుడే తన కొమరితకు నిజమైన పతియని రాజుగారు నంగీకరించి యతనిని గౌరవించిరి. మంత్రిచేసిన ఘోరాన్యాయమున కతనిని కొఱతను వేసిరి. ఈ దుస్తంత్రమున పాల్గొనినను, అమాయకుడైన యతని పుత్రుని క్షమించి పొమ్మనిరి. అంతట నతిరూపునికి రాజకొమరితకును అతివైభవముతో కల్యాణ మహోత్సవమును గావించిరి. అతిరూపుడు చంద్రగిరి రాజ్యమునకు యువరాజై, రాజ్యపరిపాలనమునందు రాజుగారికి తోడ్పడసాగెను. ఈ సంతోషసమయమున నతడు తన తల్లిదండ్రులనుకాని, ప్రయాగలోని అవ్వగారిని

కాని, మఱువలేదు. ప్రయాగ వర్తమానమంపి యామెను రప్పించెను. అతిరూపుడు రాజలాంఛనములతో దక్షిణదేశ యాత్రకు బయలుదేరి తన యూరికిపోయి, తల్లిదండ్రుల పాదములకు మ్రొక్కి, తన కథనెల్ల వారికిచెప్పి, వారిని చంద్రగిరికి తీసికొనివచ్చి రాజనగరునందుంచి పూజింపసాగెను,.

ఇక నతిరూపుడు తన పదునారవయేట సేతూపతి మహారాజుకు చెప్పిన జోస్యమును గూర్చి యొక్కమాట చెప్పవలయున్నది. అప్పుడు శత్రురాజువచ్చి కోటలో ప్రవేశింపగా, నతిరూపుడు చెప్పినచొప్పున, ఆ రాజు తన భార్యతోను, బిడ్డలతోను, రాజధానికి ప్రక్కనేయున్న ఒకయడవిలో తలదాచుకొనెను. కొంతకాలమునకు తన రాజ్యము మఱల తనకు వచ్చునని సత్యవాక్యుని కుమారుడు తనకు జోస్యము చెప్పియుండెనుగదా! అట్లు జరుగునను ఆశతో నతడు వేచియుండెను. అప్పుడే రెండేండ్లు గడచినవి. ఆ జ్యోతిష మిప్పుడు ఫలించినది.

సేతూపతి రాజ్యము చంద్రగిరి చక్రవర్తిగారి సామ్రాజ్యములో చేరిన యొక చిన్న సామంత రాజ్యము. సేతూపతి, చక్రవర్తికి చెల్లించవలసిన కప్పము సరిగా చెల్లించు చుండనందువలననే, చక్రవర్తిగారి మహామండలేశ్వరుడు సేతూపతిపై దండెత్తివచ్చి ఆయనను రాజ్యభ్రష్టుని చేసి యుండెను. అప్పుడు జోస్యము చెప్పిన యతిరూపుడే యిప్పుడు చంద్రగిరి చక్రవర్తియొక్క యువరాజైనందువలన, తన జన్మభూమికి రాజైన సేతూపతిపైన దయదలచి ఆయనరాజ్య మాయనకిచ్చివేసెను. ఇట్లు జోస్యముచెప్పిన రాజజ్యోతిషికుడే తాను చెప్పిన జ్యోతిషము నిజమగునట్లు చేయగలిగెను.

ఇట్లతిరూపుడు యువరాజై తరువాత చంద్రగిరి సామ్రాజ్యమునకు చక్రవర్తియై ప్రజానురంజకముగ చాల కాలము దేశమును పరిపాలించెను. *



# 2. అయోధ్య నవాబు

అయోధ్య మొగలాయి సామ్రాజ్యములో చేరిన ఒక పెద్దరాష్ట్రము. దానిని పరిపాలించు రాజప్రతినిధికి నవాబు వజీరు అనిపేరు. భారతదేశము నేకచ్ఛత్రముగా నతిసమర్థతతో నేలిన ఔరంగజేబు చక్రవర్తి క్రీ.శ.1707 లో చనిపోగా ఆయన సంతతివారు బలహీనులైనందున వివిధ రాష్ట్రములను పరిపాలించు సుబేదారులను రాజప్రతినిధులు స్వతంత్రులైరి. వారిలో అయోధ్యనేలు నవాబు వజీరొకడు. కొంతకాలమున కీతడు చక్రవర్తినే తనచేతిలో నొక కీలుబొమ్మగా నాడించెను.

1757 లో వంగరాష్ట్ర నవాబైన సురాజఉద్దౌలాకును ఇంగ్లీషు వర్తక కంపెనీ వారికిని ప్లాసీయనబడు పలాసిదగ్గర జరిగిన యుద్ధమునందు నవాబుగారి బందుగుడును,

* Folklore of Southern India By S.M. Natesa Sastri-The Indian Antiquary, Vol. XX. r89r.

సేనానియునైన మీర్జాఫరు ద్రోహము చేయగా, అంగ్లేయులు జయము పొంది, మీర్జాఫరునే వంగరాష్ట్రమునకు నవాబుగా చేసి అతనినొక కీలుబొమ్మగా నాడింపసాగిరి. తరువాత వారు చక్రవర్తియైన షాఅలంపాదుషా నాశ్రయించి వంగ రాష్ట్రమునకును బీహారు, ఒరిస్సాలకును దివానిగిరీ యధికారమును సంపాదించి పరిపాలింపసాగిరి. త్వరలోనే అయోధ్య నవాబుకూడా యింగ్లీషువారి రాజ్యతంత్రమున జిక్కి వారికి వశుడయ్యెను. వంగరాష్ట్రమునకు కొంతకాలము గవర్నరుగాను, మరికొంత కాలము గవర్నరు జనరలుగాను ఉండిన వారన్ హేస్టింగ్సు అప్పటి అయోధ్యనవాబు దగ్గరనుండి చాల ధనమును లాగికొనగలిగెను.

క్రీ.శ.1814 మొదలు 1827 వరకును అయోధ్యను పరిపాలించిన ఘాజీఉద్దీన్ హైదర్ దగ్గర అప్పటి గవర్నరు జనరలైన మార్క్విస్ ఆఫ్ హేస్టింగ్సు అప్పు అనుపేరున రెండు కోట్ల రూపాయిలు పుచ్చుకొని అయోధ్యకుత్తరమున హిమాలయ పర్వతముల వఱకును వ్యాపించియున్న ఊషరక్షేత్రము నాతని కిచ్చి "రాజు" అను బిరుదమును కూడా ప్రసాదించెను. ఘాజీఉద్దీన్ హైదరుగారిట్లు 1817 లో రాజయ్యెను.

అయోధ్యరాజ్యము ఇంగ్లాండు దేశమంత వైశాల్యముండెను. దాని జనసంఖ్య యేబది లక్షలుండును. ఆదాయము సాలుకు రమారమి ఒక కోటి రూపాయిలు.

ఘాజీఉద్దీన్ హైదరు 1827లో చనిపోవునపుడు తన రాజ్యము, తన ఉంపుడు కత్తెయైన ఒక బానిస స్త్రీవలన తనకు పుట్టిన నజీరుద్దీను హైదరుకు చెందునట్లు శాసించెను. ఈ నజీరుద్దీను ఘాజీఉద్దీనుకు పుట్టలేదనియు, రాజనగరులోని ఒక చాకలివానికి పుట్టెననియు ఒక ప్రతీతి యుండెను. నజీరుద్దీను ఆస్థానమున నుండిన ఒక అంగ్లేయుడతని రూపరేఖావిలాసములను వర్ణించియున్నాడు. నజీరుద్దీనుకు ముప్పది సంవత్సరము లుండును. అతడు పొడగరియు కాడు. పొట్టియుకాడు, అతడు బక్కపలుచనివాడు. అతని శరీరచ్ఛాయ పసిమివన్నెగ నుండెను. అతని కన్నులు చిన్నవైనను మిలమిలలాడుచు మెఱయుచుండును. అతని తల వెండ్రుకలు నల్లగానుండును. మీసములు తుమ్మెద ఱెక్కలవలెనుండెను.

నజీరుద్దీన్ హైదరుగారికి యింగ్లీషు వేషభాషలపైన వ్యామోహము. అతడు సాధారణముగా నొక దొరవలె నల్లని సూటు (కోటు పంట్లాములు దానికి తగిన వెస్టుకోటు మొదలైనవి) ధరించును. ఒక దొర టోపిని పెట్టుకొనును. ఒక్కొక్కప్పుడు నవరత్నములు పొదిగిన కిరీటమువంటి టోపిని ధరించును. నజీరుద్దీను హైదరుగారు ఐదుగురు తెల్లదొరలకు* జీతములిచ్చి తన వేడుక చెలికాండ్రగ నుంచుకొని యెల్లప్పుడును వారితో సరససల్లాపము లాడుచుండును. అతడు ఇంగ్లీషు ధారాళముగా మాటలాడలేడు, మధ్యమధ్య హిందుస్థానీ మాటల నుపయోగించు చుండును."బాప్‌రేబాప్" అనుచుండుట అయన కలవాటు. అతడు తన రాజనగరునిండ ఇంగ్లీషు బల్లలు, కుర్చీలు, ఇతర సామానులు తెచ్చి నింపివేసెను. అందమైన లస్తరులు (క్రొవ్వొత్తులను వెలిగించు పంగల దీపములు),

*1. డి.రస్సెట్ అను సీమమంగలి, 2. వైట్ లను ఇంగ్లీషు ఉపాధ్యాయుడు, 3. మంటేజ్ అను పాశ్చాత్య గాయకుడు, చిత్రకారుడు, 4. క్రూస్లే అను గ్రంథభాండాగారి, 5. మాగ్నెస్ అను సైనిక కెప్టెను.

మంచిలక్క వార్నీషు వనితనముగల ల్యాకర్ (Lacquer) వస్తువులు, ఇతరచిత్ర వస్తుజాలమును రాజనగరునిండ నుండెను. అయన భోజనశాల యొక ఇంగ్లీషు డైనింగ్ హాల్ వలె నుండెనని అంగ్లేయులే వ్రాసియున్నారు. అయన దగ్గరనున్న ఫ్రెంచిదేశపు వంటవాడనేక వంటకములు చేయుచుండును.

నజీరుద్దీను పాశ్చాత్య ఆహార పానీయముల నువయోగించును. అతడు ముసల్మానైయున్నను మధుపానము చేయుటకు వెనుదీయడు. అయన రాజసభలోని ఉమ్రావులను ప్రభువులను కూడా త్రాగునట్లు ప్రోత్సహించుచుండెను. ఖొరాను మధ్యపానము నిషేధించుట లేదనియు, అమితపానమును మాత్రమే నిషేధించు చున్నదనియు అయన వాదించు చుండును. ఏది అమితపానమో నిర్ణయించు అధికారము తనదేయని అతని తలంపు. అందువలన నతడు సాధారణముగా మైకముతో లేవలేనంత వఱకు త్రాగుచుండును. క్లారెట్, మెడీరా, షాంపేన్‌లను విలువగల సారాయిలను విరివిగా నుయోగించును.

నజీరుద్దీన్ భోజనపద్ధతిని గూర్చి అయన చెలికాడైన ఒక పాశ్చాత్యుడే యిట్లు వ్రాసెను: రాజుగారొక బంగారుమలాము చేసిన గిల్టుపడకకుర్చీలో కూర్చుండును. అది నేలమీద కొన్ని అంగుళముల యెత్తుమాత్రమె యుండెను. అయన బల్లకు ఒకప్రక్కగా కూర్చుండును. దీనివలన ఆహార పదార్థములను వడ్డించు సేవకులకు చాల వీలుగా నుండుటయెకాక విందారగించుచుండగా నెదుటజరుగు నృత్యగాన వినోదములను చూచుటకు కూడ వీలుగా నుండెను.

"మేము భోజనమునకు గూర్చుండగానే అరుగురు అందకత్తెలైన పరిచారికలువచ్చి వెనుక నిలువబడిరి. వీరు లోపల చక్కని యెరుపురంగు పట్టుషరాయిలను తొడిగికొనిరి. వాని పైన సన్నని దుస్తులను తొడిగికొని జిలుగు వలువలను పమిటలుగా వేసికొనిరి. వీరు మా వెనుక నిలిచి నెమలిపింఛముల విసనకఱ్ఱతో విసరసాగిరి. రాజుగారి భోజనపదార్థములు కలకత్తాలోని పాశ్చాత్యులు చేయుపద్ధతినే వండబడి వడ్డింపబడెను. పులుసు, చేపలు మృగముల శరీరములనుండి ఖండించివండిన మాంసములు (joints), అన్నము, కూరలు, పిండివంటలు, రొట్టెలు, బిస్కత్తులు (Pastry) వడ్డించిరి. వంట చాలా బాగుండెను. కలకత్తాలోని బెంగాల్ క్లబ్బులో పనిచేయు ఫ్రెంచి వంటవానినొకనిని రాజుగారు తమకు వంట చేయుటకొరకు నియోగించిరి. తరువాత వివిధజాతుల ఫలములను తెచ్చి వడ్డించిరి. అంతట ప్రతి సాయంత్రమును ఏర్పాటు చేయబడు వినోదములు ప్రారంభమగును, ఒక్కొక్కప్పుడు దొమ్మరివాండ్రు తమ విద్యలను ప్రదర్శింతురు. వారుచేయు పనులు చూచినచో వారికి యెముకలే లేవేమో యనిపించును, ఒక్కొక్కప్పుడు రాజుగారి దర్బారులోని హాస్యగాండ్రు వినోదములు చేయుదురు. ఒక్కొక్కప్పుడు కొందరు గారడీవాండ్రు, ఇంద్రజాలికులు వచ్చి తమ విద్యలను ప్రదర్శింతురు మరియొకప్పుడు కోడిపందెములు జరుగును. కోళ్ళు, పరిఘులు, కౌజులు పోట్లడును. ఒక్కొక్కప్పుడు తోలుబొమ్మలు నాడింతురు. సాధారణముగా బోగమువాండ్రు నృత్య వాద్యములతో నాడుచుందురు. నెలకొకమారు రాజుగారు బ్రిటీషు ఉద్యోగులకు విందులు

చేయుచుందురు. బ్రిటీషు రెసిడెంటు (ప్రతినిధి) కొఱకు, అయన స్నేహితుల గౌరవార్థము కూడా విందులు జరుగుచుండును. అప్పుడు వెదుళ్ళతో కట్టిన ఆవరణములో జింకలకును, ఖడ్గమృగములకు, ఏనుగులకు, పెద్దపులులకును ఘోరమైన ద్వంద్వయుద్ధములు జరుగును. అవి యొక్కొకప్పు డతిభయంకరముగా నుండును.

అయోధ్యరాజుగారి రాజనగరెల్లప్పుడును నృత్యవాద్య వినోదములతోను, విందులతోను కలకలలాడుచుండును. అయోధ్యరాజు కింగ్లీషు నేర్పుటకు నియమింపబడిన దొరకు సాలుకు 1500 నవరసులు జీతము. ఇదిగాక అతనికి బహుమతులు మామూళ్ళు నుండెను. సాలుకు మున్నూట యరువది దినములును రాజుగారిపంక్తిని భోజనము, మద్యపానము చేయు సౌకర్యమునుండెను. ఇతడు సాక్షాత్తుగా పాఠములు చెప్పువని దినమునకు పదినిముసముల కన్న పట్టదు. మిగిలిన కాలమంతయు వినోదములందు గడచును. ఆ పది నిముసములలో కూడా కొంతసేపు ఆపసోపాలతోను, మద్యపానముతోను జరుగును. దినమునకొక గంటయైన ఇంగ్లీషు పాఠము నిమిత్తము ఉపయోగింపవలెనని రాజుగారెప్పటికప్పుడు నిశ్చయించుచుందురు. కాని, ఇది సాగదు. బల్లపైన కొన్ని పుస్తకములుండును. ఇంగ్లీషు ఉపాధ్యాయుడును, రాజుగారును కుర్చీలలో కూర్చుందురు. "మాస్టరుగారు! మనమీదినమున సక్రమముగా పాఠము నారంభింపవలెను" అని రాజుగారనును. ఉపాధ్యాయుడు "చిత్తము మహాప్రభూ!" అని సుప్రసిద్ధాంగ్ల గ్రంథకర్తయైన అడిసను రచించిన స్పెక్టేటర్ అను వ్యాసముల సంపుటిలో నొక వ్యాసమునో, ఒక నవలనో తీసి చదువును. రాజుగారు కూడా ఆయన వెంబడినే చదువుదురు. ఉపాధ్యాయుడు తరువాత కొంతభాగమును చదువును. అంతట రాజుగారి వంతురాగా ఆయన "బాప్‌రేబాప్" అని ఆవులించి ఒళ్ళు విఱచికొని "ఇది చాలా శ్రమ కలిగించుపని. మన మొకగ్లాసు మధువును గ్రోలుదము" అని సారాయమును త్రాగును. ఉపాధ్యాయునకు. నిచ్చును. అంతట నేదో లోకాభిరామాయణము నారంభించును. ఆనాటికి పాఠము పూర్తియైపోవును. రాజుగారి వేడుక చెలికాండ్రైన గ్రంథభాండాగారి మొదలైన వారికికూడా యిట్లే పెద్దజీతములు, మామూళ్ళునుండెను. ఉచిత భోజనవసతులు, ఇతర సౌకర్యములు నుండెను. అయోధ్యరాజుగారి మంత్రికి "నవాబు" అని పేరు. రాజు పాశ్చాత్య స్నేహితులలో నొకడైన డి.రస్సెట్ అను సీమమంగలి వచ్చినప్పటి నుండియు మంత్రిగారి పలుకుబడి తగ్గిపోయినది. ఈ సీమమంగలియే సర్వాధికారియైనాడు. డిరస్సెట్ చిన్నప్పటి నుండియు మంగలి వృత్తియందు తర్ఫీదుపొంది యింగ్లాండు దేశమునకు రాజధానియైన లండన్ నగరములో తలవెంట్రుకలు దువ్వుట, వానికి నొక్కులు పెట్టుట, ముస్తాబుచేయుట మొదలైన వనులు చేయుచుండెను. హిందూదేశమునకుపోవు ఆంగ్లేయులు సులభముగా కోటీశ్వరులైవచ్చి సుఖపడుటచూచి ఇతడును ఒక ఓడలో కేబిన్‌బోయ్ అను కుర్రవాడుగా ప్రవేశించి, కలకత్తాచేరి అక్కడ తన వృత్తిని ప్రారంభించినాడు. అక్కడి దొరలకు తలలు దువ్వుట, గిరజాలు సరిచేయుట మొదలైన పనులుచేయుచు త్వరలోనే ఒక మంగలిషాపు పెట్టినాడు. ఇతడు తెలివైనవాడైనందువలన త్వరలోనే పేరు పొందినాడు. ఆ కాలములో గంగానదిపైన పెద్దపెద్ద పడవలలో ఇంగ్లీషు సరుకులమ్ము అంగళ్ళను పెట్టి కొందరు

వ్యాపారము చేయుచుండిరి. మన సీమమంగలియు తన వృత్తిని చాలించి యీ క్రొత్త వ్యాపారములో దిగి త్వరలోనే యొక పడవ వర్తకుడుగా మారిపోయెను. డి.రస్సెట్ లక్నో నగరమునకు రాగా అక్కడ అయోధ్యరాజుగారి ఆస్థానముననుండు రెసిడెంట్ అను ఆంగ్లేయ ప్రతినిధి దర్శనము చేసెను. ఆ కాలములో దొరలందరును విగ్గులను గిరిజాల సవరములను ధరించుచుందురు. అవి ఉంగరముల జుట్టువలెనుండెను. అవి ప్రాతపడినప్పుడు వాని నొక్కులు పాడైపోవును. ఈ రెసిడెంటుగారు తన విగ్గును బాగుచేయుంచుకొన దలచెను. అంతట మన సీమమంగలి తన ప్రావీణ్యమును గనబఱచి దానిని బాగుచేయుటయేగాక రెసిడెంటుగారి తలదువ్వి ఆయనకు ముస్తాబుచేయుగా ఆయన రూప మత్యంతాశ్చర్య కరముగా మార్పుచెందెను. ఇంద్రజాలికుని వంటి ఈ సీమంగలి యొక్క ప్రజ్ఞకాశ్చర్యము చెంది రెసిడెంటుగారు అతనినయోధ్యరాజుగారికి పరిచయముచేసిరి.

రాజుగారి తలవెంట్రుకలు చాలా బిరుసైనవి. అవి కొంచమైన వంకరదిరుగక నిక్కబొడుచు కొని అందవికారముగా నుండెను. ఆయనకు ఉంగరముల జుట్టు పైన చాలా ప్రీతి. ఆ భాగ్యమాయనకు కలుగునను నాసలేదు. ఈ సీమమంగలి సిద్ధహస్తుడై నందువలన తన చాతుర్యమునంతయు జూపి రాజుగారి జుట్టును వంచి, ఆయనకు నొక్కులుగల గిరజాలను తయారుచేసెను. రాజుగారికి పట్టలేనంత సంతోషము కలిగెను. అంతట ఆయన ఈ సీమమంగలికి "సొఫ్రాజ్ఖాన్" అనగా విఖ్యాతప్రభువు అను బిరుదు నిచ్చి తన దర్బారులో ఉమ్రావుగా చేసి గౌరవించును. అంతట అయోధ్యరాజుగారి దర్బారులోని వారందరు సీమంగలిఖానుగారికి సలాములు చేయసాగిరి.

ఓడలో చిల్లర పనులుచేయు మంగలికుర్రవా డిప్పుడొక గొప్పఅధికారియైనాడు. రాజుగారి అనుగ్రహమునకు పాత్రుడైన యదృష్టశాలికి భాగ్యముల కేమికొదువ? అతనికి ధనార్జనమున కన్నియు మార్గములే. లంచములుగా వచ్చిన యాదాయముగాక అతనికింక ననేక విధములైన యాదాయములుండెను. రాజుగా రుపయోగించు సీమ సారాయముల నెల్లఅతడే సరఫరా చేయసాగెను. రాజుగారి దర్బారుకు కావలసిన సీమసరకులెల్ల అతడే తెచ్చియిచ్చును. అసలు ధరలకు పదిరెట్లు వేసినను అడుగువారులేరు. అతనిదగ్గర రూపాయిలు మ్రోగుచుండెను.

ఈ సీమమంగలి రాజుగారి అంతరంగికు డయ్యెను. అతనిపైన నాయనచూపు అనుగ్రహమునకు మేరలేదు. అతనితో చెప్పని రహస్యములేదు. క్రమక్రమముగా సీమంగలి యొక్క దర్జాకూడా వృద్ధిజెందెను. క్రమక్రమముగా నతడు రాజుగారిపంక్తిని కూర్చుండి విందులారగింప సాగెను. మొదట చాల భయభక్తులతోను, తరువాత చనవుతోను, తరువాత చొరవతోను ప్రవర్తింపసాగెను. ఈ మంగలి స్వయముగా సీసా మూతులనుతెఱచి బిరడాలను తీసిన సీసాలనుండి తప్ప రాజుగారు సారాయమును త్రాగుటమానెను. తన బంధువులు సేవకులు కూడా తనకు విషము పెట్టుదురని యాయన భయము. అందువలన నతడు త్రాగు సారాయపు సీసాలన్నియు మంగలియింట మఱల శిఖాముద్రలు వేసిరావలెనని. యుత్తరువులు చేసెను. ఆముద్రలు సరిగానున్నవో లేవో చూచి అతడేతీసి గ్లాసులోపోసి ముందుగా తానుత్రాగి, తరువాత రాజుగారికి పోయవలెనని కట్టడిచేసెను. రాజుగారతని భుజముమీద చెయ్యివేసికొనియే భోజనమునకు వచ్చుచుందురు.

అయోధ్యరాజుగా రీ సీమమంగలిపైన నింత నమ్మకము నుంచిన సంగతి త్వరలోనే యా రాజ్యములోను, వంగదేశములోనుకూడా తెలిసిపోయెను. దేశీయులు, దొరలు కూడా రాజు వలన నే కార్యము కావలసినను మంగలివాని నాశ్రయింపవలసి వచ్చెను. అంతట నితనిపైన చాలమందికి అసహ్యము, ఓర్వలేనితనము కలిగెను. హీనకులజుడైన నీచపు సేవకుడు అని కలకత్తా రివ్యూ అను అంగ్లపత్రిక యొకమారతనిని గూర్చి వ్రాసినది. అతనిని గూర్చిన నిందాత్మకములైన పద్యములు బయలుదేరెను. అతని కనేకములైన మారుపేర్లుపెట్టి హాస్యముగా చెప్పుకొనసాగిరి. తనకు అమితమైన భాగ్యవైభవములు కలుగుచుండగా తనను గూర్చి యెవ్వరేమనుకొన్న నేమని ఈ మంగలి లెక్కసేయలేదు. మన సీమమంగలిని అతి తీవ్రముగా విమర్శించు పత్రికలలో, 'ఆగ్రా అక్బర్' అను పత్రికయొకటి. తన నాపత్రిక యెల్లప్పుడును. తిట్టుచు, హాస్యము చేయుచుండుట చూసి, సహింపలేక, ఇతడు కలకత్తాలోని ఇంకొక పత్రికయందు దానికి తగిన జవాబులు వ్రాయుటకొరకు నెలకు నూరురూపాయలిచ్చి యొక గుమాస్తా నేర్పరచికొనెను.

మన సీమమంగలి యిట్లు అయోధ్యరాజుగారి దర్బారులోని ఉమ్రావు (గొప్పప్రభువు) లలో నొకడైనాడు. రాజనగరులో గొప్ప పలుకుబడియు, అధికారమును సంపాదించినాడు. రాజుగారి మృగశాలకు అధికారియైనాడు. రాజుగారికి కావలసిన సీమసరకునెల్ల సరఫరాచేయు వర్తకుడైనాడు. అయితే రాజుగారికి ప్రతిదినము పగలు పండ్రెండు గంటల వేళ తలదువ్వి ముస్తాబు చేయుట మాత్రము మానలేదు. ఇదిగాక, ఆయనకు వేడుక చెలికాడై ఇతరులను హాస్యము చేయుచు నొక్కొకప్పుడు మోటు సరసమునకు గూడ దిగుచు రాజుగారి కానందము కలిగించుచుండును. రాజుగారి ముదుసలి పినతండ్రులను విందులకని పిలిచి వారికి మైకము కలిగించి, వస్త్రహీనులుగ జేసి వారితో నాట్యమాడును. వారి మీసములను దారముతో కుర్చీలకు గట్టును. ఇంక ఎన్నెన్నో కొంటెపనులు చేయును. రాజుగారికి భయపడి ఇతడేమి చేసినను ఎవ్వరు నేమియు ననలేరు.

మన సీమమంగలి నెలనెల తనకు రావలసిన సొమ్ముకు లెక్కను సన్నని పొడవైన కాగితముల మీద చిన్నయక్షరములతో వ్రాసి యాకాగితములను యొకదాని కింకొకటి యంటించి ఒక పొడవైన కవిలెగా చేసి దానిని చుట్టియుంచి రాజుగారు మధ్యాహ్నము ఫలహారముచేసి కులాసాగానున్న సమయము చూచి తెచ్చును. ఆయన నవ్వుచు "ఏమోయి ఖానూ, నీలెక్కను తెచ్చితివాయేమి?" అనగానే యతడు "చిత్తము మహాప్రభూ!" అని యతడా కాగితపు చుట్టను విప్పుచు వెనుకకు పోవును. రాజుగారొక గజముబద్దను తెప్పించి దానిని కొలిపింతురు. ఒక మారది నాలుగున్నర గజముల పొడవు తేలినది. దాని మొత్తము తొంభైవేల రూపాయిలు పై బడియుండుట చూచి రాజుగారు "అబ్బో! ఈ నెల చాలా తేలినదే!" అనిరి. అంతట నతడు "చిత్తము చిత్తము, వెండిసామానులును క్రొత్తయేనుగు ఖరీదును కలుపుటవల్ల ఎక్కువ తేలినది" అనెను. అప్పుడు రాజుగారు "సరి, సరి, నవాబు (మంత్రి) దగ్గరకు తీసికొనిపోయి నే నిమ్మంటినని చెప్పి ఆ సొమ్ము

తీసికొనుము"అని సెలవిచ్చిరి. అంతట నవాబుగా రాకాగితము మీదా మంగలిఖానుని దస్కతు చేయించి ఆ సొమ్ము చెల్లించివేసెను.

ఒక మారొక రాజోద్యోగి రాజుగారితో "మహాప్రభూ! ఈ ఖానుడు మిమ్ములను దోచుకొనుచున్నాడు" అనగా, అయన "నేనతనిని భాగ్యవంతుని చేయదలచితిని నీకేమి?" అని యనిరి.

ఇట్లు చాలాకాలము గడచెను. మన సీమమంగలి పలుకుబడియు, నధికారమును దినదిన ప్రవర్థమానము లయ్యెను. చేత తంటనముపట్టిన ఈ మంగలివాడే, అయోధ్యరాజ్యము నేలుప్రభువుగా నుండెను. కొంతకాలమున కతని యాగడములు మితిమీరి బ్రిటీషు ప్రతినిధియైన రెసిడెంటు చెవినికూడా పడెను. అయోధ్యరాజుగారి దర్బారువారితో నెవరి కేకార్యము కావలసియున్నను మంగలివాని నాశ్రయించి తీరవలెను. రాజుగారెట్టి నీతి నియమములను పాటింపక దుర్వ్యసనములకు లోనైపోవుట యీమంగలివాని స్నేహప్రభావముననేయని అందరకును తెలిసివచ్చెను. ఈ రాజు నీ యధోగతిలోనికి దింపి అమితలాభమును పొందసాగెను. ఈ మంగలి చాల తెలివైనవాడు. నిజముగా నన్ని విషయములందు రాజుగారి యిష్టమును బట్టి తాను నడుచుచున్నట్లు నటించు చుండును. కాని నిజమునకు రాజుగారిని తన చేతిలోని కీలుబొమ్మవలె నాడించును. సమయము గనిపెట్టి సలహానిచ్చును. ప్రత్యక్షముగా చెప్పనట్లు చెప్పి నచ్చచెప్పును. ప్రతివిషయముననను రాజుగారి కితడు తప్పనిసరియైన సహాయకుడయ్యెను. రాజుగా రుపయోగించు ప్రతిసారాయపు సీసావలన తనకు లాభమే గనుక సారాయపు వాడకము నెక్కుడు చేయగల 'జల్సా' లను ప్రోత్సహించును.

రాజుగారి దయకు పాత్రురాలైన ప్రతివేశ్యయు తనకు వచ్చిన ధనములో నుండి కొంత భాగమును మన మంగలికి కప్పముగా చెల్లించుచుండును. అందువలన రాజుగారెంత విషయలోలుడైన ఇతనికంత లాభము. రాజుగారి మంత్రులు, సేనా నాయకులు, ఇతర ఉద్యోగులు కూడా ఈ మంగలివానికి బహుమతులిచ్చి అతనిని మంచిమాట చేసుకొనుచుండిరి. అందువలన నితడెన్నో కుట్రలు చేయుచు యెన్నో దుర్మార్గములు చేయుచుండెను.

మంగలిని తొలగించవలెనని ఎవరెన్ని ప్రయత్నములు చేసినను సాగలేదు. అయితే దర్బారులోని దేశీయ పాశ్చాత్య ఉద్యోగులును, ఉమ్రావులును తనపైన పగబూని యున్నారనియు తనకెప్పుడోయొకప్పుడు హాని కలుగుననియు, బ్రిటీష్ రాజప్రతినిధివలన చిక్కులు రావచ్చుననియు, ఈ రాజానుగ్రహము శాశ్వతముగా నుండునది కాదనియు, తెలివిగల ఈమంగలివాడు గ్రహించినాడు. దీపముండగనే చక్కబెట్టుకొన దలచినాడు. సీమనుండి వచ్చిన తనతమ్ముని రాజుగారి దర్బారులోనుంచి తాను కలకత్తాకుపోయి వచ్చుటకు సెలవు అడిగినాడు. ఆ ప్రకారమతడు కలకత్తాకుపోయి తాను సంపాదించిన సొమ్ములో చాలాభాగము ఇంగ్లీషు వర్తక కంపెనీవారి వాటాలను కొనుటకు వినియోగించినాడు. అతడు లేని సమయములో రాజుగారిలో కొంత మార్పువచ్చెను. అప్పుడు జరిగిన సంగతులను మంగలివాని తమ్ముడు అతనికి చెప్పెను. అతని తమ్ముని

దర్బారులోనుంచి తాను సీమకుపోవచ్చునని అతడనుకొనెనుగాని ఇది సాగునట్లులేదు. అందువలన తానే మణుల రాజుగారికి అంతరంగికుడై ఎప్పటి యాటను సాగించినాడు.

అయోధ్య పరిపాలనము అధ్వాన్నముగ నుండెను. అయోధ్య రాజనగరులో నీతినియమము లేకుండా పోయెనని కలకత్తా రివ్యూపత్రిక వ్రాసెను. అప్పుడు బ్రిటీషు ప్రతినిధిగా నుండిన లోవ్ (Lowe) దొరగారికి అసహ్యముకలిగి రాజుగారిని చూచుటయె మానివేసెను. అయన అంతరంగికులతో మాటలాడుటకు నిరాకరించెను. మంగలిమాటలు విని రాజుగారు చేయు దుర్మార్గములను సహింపలేక అయనకు చెలికాండ్రుగా నున్న ఇరువురు పాశ్చాత్యోద్యోగులు పని మానుకొనిరి. అంతట మంగలినొక పాశ్చాత్యునిదెచ్చి ప్రధాన పాచకోద్యోగి (బట్లరు)గా నియమించెను. తాను తన తమ్ముడు నీ బట్లరును రాజుగారికి మంత్రాలోచనము చెప్పు చెలికాండ్రుగ నుండిరి.

రాజనగరులోని అక్రమములు మితిమీరెను. రెసిడెంటుగారిది విని సహింపలేక రాజుగారిని తఱుచుగా మందలింపసాగిరి. అంగ్లేయ ప్రభువులకు తనపైన నాగ్రహము కలుగునేమోయని రాజుగారి మనస్సు సంక్షోభము చెందెను. మంగలి యాగడములను గూర్చి రాజనగరులోని చాలమంది అయనకు చెప్పుచుండిరి. అయనలో కొంతమార్పు కలిగెను. తనను ఈమంగలివాడు కీలుబొమ్మగా నాడించుచున్నాడని గ్రహించెను. అంతట నాయన కతనిపైన కోపమువచ్చెను 'నీవును నీతమ్ముడును కలిసి నన్నాడించవచ్చునని అనుకొనుచున్నారు. ఇక్కడ దుర్మార్గములకెల్ల నీవే కారకుడవని రెసిడెంటుగారను మాట నిజమే'యని రాజు గారనునప్పటికి మంగలికి భయము కలిగెను. ఇతడు చేసిన ఏర్పాటులు కొన్ని మార్పుచేయబడగనే తనయాట యింక సాగదని గ్రహించెను. ఒకనాటి రాత్రి యతడు కాన్పూరునకు పారిపోయెను. అది కంపెనీవారి రాజ్యములో నున్నది గనుక రాజుగారు తన నేమియు చేయలేరు. తన అంతరంగికుడు పారిపోయెనని నజీరుద్దీనుగారికి తెలియగానే అయన తన యుద్యోగుల నతనియింటికి పంపి అతని తమ్ముని, కొమారుని పట్టుకొని ఖైదుచేసి అతని అస్తినంతయు వశపరుచుకొనుడని ఉత్తరువుచేసెను. రెసిడెంటుగారు అడ్డుపడనిచో అయన మంగలి తమ్ముని కొమారుని కూడ ఉరిదీయించి యుండును. వారిని పదిరోజులు ఖైదులోనుంచి అస్తియంతయు వశమైనపిదప వదిలివేసిరి. అప్పుడు ఒక లక్షరూపాయిల విలువగల అస్తిమాత్రమే పట్టుపడినది. మిగిలిన అమితమైన ధనమంతయు మంగలి యిదివరకే తరలించి యుండెను.

మన మంగలి సాధ్యమైనంత త్వరితముగానే కలకత్తాకు పోయి ఓడనెక్కెను. అతని తమ్ముడును కొమారుడును, తరువాత వచ్చి చేరిరి. అతడు తరలించిన సంపద యెంతయుండునో సరిగా చెప్పుటకు వీలులేదు. అది ఇరువదినాలుగు లక్షల రూపాయలకు తక్కువ యుండదని కొందరు చెప్పియున్నారు. అతడు ఇంగ్లాండు చేరిన తరువాత సారాయి వ్యాపారములను చేసి లాభమును సంపాదించెను. అతడొక సారాయిబట్టీ వ్యాపారమున భాగస్వామియై, వాటాల అమ్మకముచేసి, వర్తకుడుగా పేరుపొందెను. రైల్వనిర్మాణము క్రొత్తగా ప్రారంభమైన అకాలములో నా వ్యాపారమునందు చాలమంది పెట్టుబడి పెట్టసాగిరి. మనవాడు నందులో చాలసొమ్ముపెట్టి నష్టపడెను. సారాయిబట్టీలో కూడా కొంతనష్టముకలిగి ఇతడు 1854లో దివాలా తీసెను.

మంగలిమంత్రి వెడలిపోయిన తరువాత నజీరుద్దీన్ హైదరుగా రెంతో కాలము జీవింపలేదు. అయన నాలుగు నెలలలోనే 1837లో మరణించిరి. ఇతడును, మంగలి మంత్రియు కలిసి బాధించిన పినతండ్రులలో నొకడైన నజీరుద్దౌలా మహమ్మదాలిషా 1837లో అయోధ్యకు రాజై 1842 వరకును పరిపాలించెను.*



# 3. పందెపుటేనుగు మల్లీరు

అయోధ్య రాజుగారి వినోదము నిమిత్తము కోడిపుంజుల చేత, పరిఘల చేత, కౌజుల చేత ఇంకా ఇతరపక్షుల చేత జంతువుల చేత ద్వంద్వయుద్ధములు చేయించు చుండెడివారు. జింకలుపైకి ఎంతో సాధువులుగను బెదురుగుండెల జంతువులుగను కనబడినను పోరాటమునం దవి యెంతో ధైర్య సాహసములను జూపి ప్రాణములను గోల్పోవుచుండును. సాధారణముగా బరువులు మోయుచు ఎడారులలో సంచరించు సాధువులైన ఒంటెలకు కూడా పోరాడుట నేర్పుచుండిరి. ఒంటెకు కోపము వచ్చినప్పుడు దాని గొంతుకలో నుండి ఏదో ద్రవపదార్థమును వెడలగ్రక్కి తన విరోధిపైన నుమియును. ఈ ప్రయత్నములో నొక్కొక్కప్పుడు తన పొట్టలోనున్న తిత్తిని ప్రేగులనుగూడ వెలికి గ్రక్కుచుండును. ఒంటెల పోరాటములో నొకటి తన పండ్లసందున రెండవదాని క్రింది పెదవిని పట్టి నొక్కి చీల్చి వేయును. లేదా దానితలను కొఱకును. కంటిని పీకివేయును. దాని పెద్ద శరీరమున కెట్టిగాయమును లేకుండగనె ఇట్టి ప్రదేశములందు తీవ్రమైన గాయములు చేసికొనుటవలన వానిస్థితి చాల ఘోరముగా నుండును.

ఖడ్గమృగము చాల మోటుశరీరము కల పెద్దమృగము. దీనిని ఈటెలతో పొడిచినను భయములేదు. దానికి ముట్టపైన నొక బలిష్ఠమైన వాడిగల కొమ్ముండును. దానికి కోపము వచ్చినప్పు డది రెండవ మృగముయొక్క ముందుకాళ్ళ మధ్య తనముట్టెను దోపి ఆకొమ్ముతో దానిపొట్టను చీల్చును. అందువలన రెండవ మృగము తన ముట్టెనెల్లప్పుడును క్రిందికి వంచుకొనియుండి, స్వ సంరక్షణము చేసికొనును. తానుకూడా ఏదో విధముగా తన విరోధినే మఱచి దానికాళ్ళ మధ్య తన ముట్టెను జొన్పి కొమ్ముతో పైకి కుమ్ముటకు ప్రయత్నించు చుండును. ఖడ్గమృగముల శరీరములపైన నింకేవిధముగా పొడిచినను చెక్కుచెదరదు. ఖడ్గమృగమునకును, ఏనుగునకును, పెద్దపులికిని గూడా పోరాటము కల్పించుట అయోధ్య దర్బారులో నొక వినోదముగ నెంచుచుందురు. ఖడ్గమృగముతో పులి పోరాడునప్పుడది యామృగమును వాడియైన పంజాతో కొట్టును. తన పెద్దనోటిని తెరచి తన కోఱలతో దానిని కొఱకుటకు ప్రయత్నించును. ఏమిచేసినను ఖడ్గమృగమునకు లెక్కలేదు. ఏదో విధముగా దానిని పడద్రోసినచో మాత్రము అది అసహాయ స్థితిలో

* The Private Life of an Eastern King - William Knighton (1855) Oxford University Press Reprint (1921).

పడిపోవును. అంతట పులి దానిపొట్టను చీల్చివేయగలుగును. పులి ఎంతబలమైన మెకమైనను ఖడ్గమృగమును పడద్రోయుట సులభము కాదు. ఖడ్గమృగముకన్న పులి చురుకైన జంతువు గనుక అది దాని ననేక విధములుగా కవ్వించ గలుగును. ఖడ్గమృగ మేవిధముగనైన పులియొక్క ముందుకాళ్ళ మధ్య తన ముట్టెను దోపగలిగినా పులి పని దైయిపోవును. ఖడ్గమృగము తన కొమ్మునెత్తి పులిపొట్ట చీల్చివేయును. ఈ యాపద రాకుండ పులి అతిచురుకుగా ఎగిరి దాట్లువేయుచు తప్పించుకొనును. దెబ్బతినిన పులి నిలువలేక వాలిపోవును. ఇది చాల చిత్రమైన పోరాటముగా నుండును.

ఘాజీఉద్దీన్ అయోధ్య రాజుగానుండగా ఖడ్గమృగము నొక బండికి కట్టి దానిపైన నొక హౌదా నమర్చుచుండిరని కలకత్తాలో క్రైస్తవ మతాధికారిగానుండిన బిషప్ హెబరు గారు వ్రాసినారు.

(1827 - 1837 మధ్య) నజీరుద్దీన్ హైదరుగారి కాలములో అయోధ్యరాజుగారి మృగశాల యెంతపెద్దదిగా నుండెనో తెలిసికొనవలెనన్నచో అందులో పదునైదు ఇరువది ఖడ్గమృగములును నూట ఏబది ఏనుగులును, చాల పెద్దపులులును, నాలుగు సింహములును ఉండెనని చెప్పిన జాలును.

అయోధ్య రాజుగారి నూటయేబది యేనుగులలో రెండుదంతములలో నొకటి విఱిగిపోయిన ఏనుగొకటి యుండెను. అది నూరు పోరాటములు గెల్చిన మేటిగజము. దాని పేరు 'మల్లీరు'. దానిమీద రాజుగారికి చాలాప్రేమ. అనేకములైన ఏనుగులతో నిది పోరాడినందువలన దానిదంతము క్రమక్రమముగా విఱిగి ముక్కలైపోయినది.

ఏనుగులు పోరాడునప్పు డవి ఢీకొనుటలో నొక్కొక్కప్పుడు దంతములో కొంతభాగముగాని, దంతమంతయుగాని విరిగిపోవుటకద్దు.

మల్లీరు నల్లని ఏనుగు మదించినప్పుడిది అతిభీకరముగా నుండును.

ఒకమారు ఆంగ్లేయ సర్వసేనాని లక్నోనగరమునకురాగా ఈ మల్లీరుకు తగిన ఉజ్జీ ఏనుగుతో పోరాడించి వారికి వినోదము కలిగించవలెనని అయోధ్యరాజుగారి కొక కోరిక కలిగెను. అదృష్టవశమున నది మంచి ఋతుసమయమై యుండినందు వలన మల్లీరు మదించియుండెను. అటువంటి నల్లని ఏనుగునే ఇంకొక దానిని ఏరి ఉజ్జీగా తెచ్చిరి.

మదించిన మగ ఏనుగులు రెండు ఒకదాని నొకటి చూచుట తటస్థించిన యెడల వానిని పోరాటమునకు ప్రోత్సహింపనక్కర లేకుండగనే యవి ఢీకొనును. ప్రతియేనుగు మెడమీదను దాని మావటీడు కూర్చుండి యుండును. మదపుటేనుగు దగ్గరకు దాని మావటివాడు తప్పమరి యెవ్వరును పోవజాలరు. అతని చేతులలో మాత్ర మీ రక్కసి చాల సాధువుగ నుండును.

ఏనుగుల పోరాటమునకు ప్రత్యేకముగా నేమియు ఏర్పాటుచేయ నవసరములేదు. దానిమెడచుట్టునొక బలమైన మోకునుగట్టి దానిని తోకకు బిగింతురు. ఆ ఏనుగులు ఒండొంటితో పోరాడుటలో తాను క్రిందపడిపోకుండ మావటివాడా త్రాటిని రెండు చేతులతోను పట్టుకొని వ్రేలాడును. ఏనుగుల పోరాటమున మావటివాడు ప్రాణముల

నరచేత బెట్టుకొనవలసినదే. అయినను తన ఏనుగు గెలువవలెనను కోరికవలన వాడు ప్రాణములకు కూడ తెగించును. వాడు తన ఏనుగుపై నుండి క్రిందపడుట తటస్థించినచో రెండవ ఏనుగు వానిని పట్టుకొని త్రొక్కివేయును. అందువలన వాడు తన ఏనుగు త్రాటిని పట్టుకొని ప్రాణముల తీపికొఱకు వ్రేలాడుచునే యుండును.

సర్వసేనాని సమక్షమున మల్లీరును నల్ల ఏనుగులతో పోరాడించినప్పుడు గుంటీనదీతీరముననున్న ఒకరాజునగరులో మేడలపైన గల వసారాలో సర్వసేనానియు రాజుగారును వారి పరివారమును కూర్చుండిరి. అక్కడ నానది ఒక వందగజముల వెడల్పుండును. ఈరాజనగరు మేడ వసారా నది వైపునకు చొచ్చుకొని వచ్చినట్లుండును. నది కావలియొడ్డున సుందరమైన మైదానమొకటి యుండెను. అక్కడనే ఈ ఏనుగుల పోరాటము నేర్పాటుచేసిరి. మేడ వసారాలో కూర్చుండువారి కక్కడజరుగునదెల్ల చక్కగా కనబడును. రాజుగారి సౌజ్ఞచేయగానే మావటీవాండ్రు రెండు ఏనుగులను ఆ మైదానములోనికి నడిపించిరి.

బలిష్ఠమైన ఆ రెండవ ఏనుగుముందఱ విఱిగినదంతము గల మల్లీరు నిలువగలుగునాయని ఇతరు లనుమానము జెందిరి. ఆ రెండవ ఏనుగు యొక్క రెండు దంతములును చాలా భయంకరములుగ మారును. ఈ ఏనుగులు ఒకదాని నొకటి చూడగానే వారికి తగని యావేశము కలిగెను. అవి తమ తొండములను పైకెత్తిపెట్టెను. వానితోకలు నిక్కబొడుచుకొనెను. ఘీంకారము చేయుచు నివి యొండొంటిపైన గవియుటకు త్వరితముగా రాసాగెను.

ఆ రెండు ఏనుగుల కుంభస్థలములు నొండొంటిని ఢీకొనగా నాధ్వని ఒక అరమైలు దూరము వరకును వినిపించెను. అక్కడి భూమి దద్దరిల్లెను. అట్టి తాకిడిలోనే సాధారణముగా ఏనుగుయొక్క దంతములు విఱిగిపోవుచుండును. అట్లు విఱిగిన దంతము లాకసములోని కెగిరి దూరమున పడును. అట్లా రెండుమత్త గజములును ఢీకొని ఒండొంటిని వెనుకకు త్రోసికొనసాగెను. వాని తొండము లాకసమువంకకు పైకి ఎత్తిపెట్టికొనియె అవి తమ నోళ్ళతోను దంతములతోను కుమ్ముకొనుచుండెను. ముందుకాళ్ళను కదలకుండా నేలపై నూది, తమ బలమైన శరీరములను మాత్రము అడించుచు మరల మరల త్రోసికొనసాగెను. వాని తలలొకక్షణమైన పట్టు విడువలేదు. వీపులుమాత్రము విల్లులవలె వంగి సాగుచుండెను. వానిపైన కూర్చుండిన మావటీండ్రు తమ అంకుశములతో పొడుచుచు వాని కుత్సాహము కలిగించుట కఱచుచుండిరి. ఈ దృశ్యమును చూచుచున్నవారు ఏమిజరుగునో యని భయాశ్చర్యములతో ఊపిరి బిగబట్టి చూచుచుండిరి. వారిగుండెలు కొట్టుకొనుచుండెను. ఇటువంటి పోరాటములందు సాధారణముగా బలమైన జంతువు బలహీనమైన దానిని జయించును. ఒక్కొక్కప్పుడు బలహీనమైన జంతువైనను, చురుకుగల ఏనుగు రెండవదానిని జయించుట కూడకలదు. కాని అది అరుదు. ఈత్రోపుడులో నేదో యొక ఏనుగు క్రిందబడెనా, రెండవది తక్షణమే తన దంతములతో దానిని క్రుమ్మి చంపివేయును. పడిపోయిన ఏనుగు సులభముగా లేచి పారిపోవజాలదు. బలహీనమైనది పారిపోవుటకు వెనుదిరుగగా బలవంతమైన ఏనుగు దానిని త్రోసి

క్రిందపడవేయును. బలహీనమైన ఏనుగు తెలివితేటలతో తటాలున పారిపోయినచో బలవంతమైనది దానిని తరుమును. అప్పుడది ప్రాణములు దక్కించుకొనగలుగును గాని వెనుకనుండి దంతములతో కుమ్ముటవలన దానికి బలమైన గాయములు తగులవచ్చును.

మల్లీరును దానికి పోటీగావచ్చిన ఏనుగును అట్లు త్రోసికొనుచుండగా మల్లీరు ఒంటి దంతము గలదైనను రెండవదానిని అతి భీకరముగా ఢీకొని పోరాడసాగెను. అప్పుడా రెండవ ఏనుగు తన ముందు కాళ్లలో నొక దానిని ఎత్తెను. అది ముందుకు పోవుటకే అట్లుచేసినదో, వెనుదిరుగుటకే అట్లు చేసినదో చూపరులు గ్రహింపలేకపోయిరి. అయితే, అది వెనుదిరుగుటకే యిట్లుచేసెనని త్వరలోనే తెలిసిపోయెను. పైకెత్తిన కాలును దింపినదో లేదో, మరల రెండవకాలును కూడా అట్లే ఎత్తి దింపినది. దీని భావమును మల్లీరుయొక్క మావటీడు గ్రహించినాడు వాడు తన ఏనుగును ప్రోత్సహించుటకొరకు ఒడలెఱుగనంత ఆవేశముతో నొక దయ్యమువలె అఱచుచు, తన అంకుశముతో మల్లీరును పొడుచుచు, హెచ్చరింపసాగెను. మల్లీరు కీ హెచ్చరిక యవసరములేదు. తనతో పోరాడుచున్న ఏనుగు తోకముడుచుచున్నదని గ్రహించి, రోషావేశమునొంది దానిపై బడిన మల్లీరును దాని మావటివాడును అమితమైన యుద్రేకము చెందియున్నట్లు చూచువారందరికిని విదితమయ్యెను.

ఆ సమయమున నా రెండు ఏనుగులను గుంటీనదీ గర్భమునకు కొన్ని గజముల దూరములోనే పోరాడుచుండెను ఓడిపోవుచున్న ఏనుగు క్రమక్రమముగా నదివైపునకు జరుగుచుండెను. ఒక్కొక్క అడుగు వెనుకకు తగ్గుచు జరిగి తుదకొక యంగ వెనుకకు వేసి, ప్రత్యర్థిపట్టు తప్పించుకొని తన బరువైన శరీరమును నదిగట్టు మీదనుండి క్రిందకి మోసికొనిపోయి నదిలోపలికి దుమికెను. దాని మావటివాడు దాని వెన్నుమీది త్రాటినిపట్టుకొని వ్రేలాడుచునే యున్నందున వాని ప్రాణములు దక్కినవి గాని లేనిచో వాడు చచ్చియుండును. ఆ యేనుగు నదిలోపడి ఈదుకొనుచు పోయి ఆవలిగట్టు చేరుకొనెను.

తన ప్రత్యర్థి యిట్లు తప్పించుకొని పోగా మల్లీరుకు గొప్పరోషావేశము కలిగెను. దాని నెట్లైన నదిలోనికి దుమికించి పారిపోవుచున్న ఏనుగును వెంటాడునట్లు చేయవలెనని మల్లీరు యొక్క మావటివాడు ప్రయత్నించెను. గాని మల్లీరుకు మాత్రమెందువలననో నదిలోనికి దుముకుట కిష్టములేకపోయెను. మల్లీరుకు ఒడలు దెలియనంతకోపము వచ్చెను. తన కసిదీర్చికొనుటకు దేనిపైన బడుదునాయని యది చిందులు ద్రొక్కసాగెను. మావటివాడు మహోద్రేకముతో వెఱ్ఱికేకలు పెట్టుచు తన చేతిలోని అంకుశముతో దానిని పొడుచుచు పారిపోవుచున్న ఏనుగును వెంటాడుమని త్వరపెట్టుచుండగా మల్లీరునకు వెఱ్ఱికోపము వచ్చెను. అది యాకస్మికముగ నొకగంతువేసి వెనుదిరిగెను. ఆ క్షణమున మావటివాడు పట్టుకొన్న త్రాటిపట్టు తప్పిపోయి దాని వీపు నుండి జారి క్రింద పడిపోయెను. అట్లు పడుటలో వాడాయేనుగు కాళ్ళముందరనే తనకాలొకటి మణగిపోవగా రెండువకాలును చేతులను జాచుకొని యుండగా లేవలేని యసహాయ స్థితిలో వెల్లకిలబడి పోయెను. ఆ దురదృష్టవంతుని ఆయువు చెల్లిపోయెను. ఏనుగునకు పిచ్చియెత్తినది. ఆ

యుద్రేకములో తనకు మావటివాని యందుగల విశ్వాసముకూడ మరచిపోయినది. దానికి క్రౌర్యము హెచ్చినది. అది తన బలిష్ఠమైన కాలునెత్తివాని వక్షస్థలమునబెట్టి వాని ఎముకలు పటపట విరిగిపోవునట్లు మట్టివేసి వాని నొక మాంసపు ముద్దగా త్రొక్కివేసెను. ఆ నిర్భాగ్యుడు దుర్మరణము చెందెను.

అందరును జూచుచుండగనే ఎవ్వరును నోరు మెదల్చి కేక వేయుటకైన అవకాశము లేనంత త్వరితముగా నిదియెల్ల జరిగిపోయెను. ఆ ఏనుగు కంతటితో కోపము దీరలేదు. తనకాలిని యా నిర్భాగ్యుని శరీరము మీదనే యదిమియుంచి తన తొండముతో వాని రెక్కను పట్టి శరీరమునుండి చీల్చి దానిని గిరగిరత్రిప్పి అకాశములోని కెగురవైచెను. ఆ రెక్కలో నుండి రక్తము నలువంకలను చిందుచుండగా నది చాలదూర మునబడెను. తరువాత నా ఏనుగువాని రెండవరెక్కను కూడ చీల్చి యట్లే గిరగిర త్రిప్పికొట్టెను.

అక్కడ రాజనగరులో వసారాలో కూర్చుండియున్న వారందరును భయ విస్మయములతో నిశ్చేష్టితులైరి. తమవినోద మీరీతిగా పరిణమించునని వారు కలలోనైన అనుకొనలేదు. దానికంతకు ఆ యేనుగే కారణమైనను వారికి తీవ్రమైన విషాదముకలిగెను. ఇంతలో వారికి మహాఖేదము కలుగునట్లుగా మల్లీరు వచ్చినవైపునుండి యొక స్త్రీ విగ్రహము చరచర ఆ ఏనుగు వైపునకే పరుగెత్తుకొని వచ్చుట వారికంటికి కనబడెను. ఆ స్త్రీ చేతులలో నొక శిశువుకూడా ఉండెను.

అప్పుడక్కడనున్న ఆంగ్లేయ సేనాని కీ దృశ్యము దుర్భరమై అతడు లేచి 'ఓ రాజా! ఇంకను గొన్ని నిండు ప్రాణములు బలియైపోవుట నిశ్చయము. ఈ ఘోరమును నివారించుట కేమియు చేయజాలరా?" అనెను. "ఆ స్త్రీ మావటివాని భార్యయేయై యుండును. ఏమి చేయగలము" అని రాజుగారనిరి. ఈ లోపుగనే రాజాస్థానమున నుండు బ్రిటీషు ప్రతినిధియైన రెసిడెంటు దొరగారు తను ఉత్తర్వులను జారీచేసిరి. అయితే మత్తగజమును తోలుట సులభమైన పనికాదు. పొడుగైన ఈటెలను పుచ్చుకొని ఒక్కొకప్రక్కనుండి ఐదుగురు చొప్పున గుఱ్ఱములనెక్కిన రౌతులు బహుజాగ్రత్తగాపోయి దానిని తోలవలెను. అది లొంగనిచో ఈటెలతో దాని మృదువైన తొండమును పొడుచుచు దానిని తోలవలెను. ఈటెలను తప్పించుకొని ముందుకు వచ్చినచో దానికి బలికాకుండ ఒక్క క్షణములో తమ గుఱ్ఱములను దౌడు తీయించవలెను. ఇది చాల కష్టమైనపని ఇందులో అరితేరిన రౌతులున్నను వారు రెసిడెంటుగారి యుత్తరువు ప్రకారము గుఱ్ఱముల నెక్కిపోయి ఏనుగును తోలుటకు కొంతకాలము పట్టునుకదా! ఈ లోపుగా నా దురదృష్టవంతురాలు తన శిశువుతో ఎట్టిఆలోచనయు లేకుండా ఏనుగు కెదురుగా పోవుచుండెను. ఆమె ఎంతో దుఃఖముచే గద్గదికమైన గొంతుకతో "మల్లీరూ! మల్లీరూ! క్రూరమృగమా ఎంతపని చేసితివి! నీ వెంతోభయభక్తులుచూపు నీ మావటియైన నా భర్తను చంపివేసితివి. మా కొంప కూల్చితివి. ఇంక నన్ను నా కుర్రవానిని కూడ చంపివేయుము" అని యామె అఱచుచు ఏనుగ కెదురుగా పోయెను.

మావటి వాండ్రును వారిభార్యలును పిల్లలును ఏనుగుల దగ్గరనే కాపురము చేయుచుందురు. ఒక్కొకప్పుడు వానిని బుజ్జగించుచు, హెచ్చరించుచు, భయపెట్టుచు

తమ సుఖదుఃఖములను సంతోషమును కోపమును సూచించుచు వానితో మాటలాడుట వారి కలవాటు. వారిపిల్లలు ఆ ఏనుగుల కాళ్ళలోనే నిర్భయముగా నాడు కొనుచుందురు. ఏనుగులు కూడా పెంపుడు జంతువులవలె సాధువులుగానుండి తమ మావటీం(డ్రతోను వారి భార్యబిడ్డలతోను చనవుగానుండి వారిమాటలను మనుష్యులవలెనే అర్థము చేసికొనెనా యనునంత తెలివితేటలతో ప్రవర్తించుచుండును.

మల్లీరట్లు ఒడలుమరచి తన మావటివానిని వధించిన తరువాత దానికోపము పూర్తిగా చల్లారిపోయి దానికొక విధమైన పశ్చాత్తాపము కలిగెనో యనునట్లు తలవంచి చేటల వంటి తన పెద్దచెవులను వ్రేలవేసికొని తన కాలి నా దురదృష్టవంతుని శరీరముపై నుండి తీసివేసి, మావటివాని భార్య యిట్లు రోదనము చేయుచు వచ్చి యా మాంసపు ముద్దపైన పడియేడ్చుచుండగా ఏనుగు కదలిక మెదలక యక్కడనే నిలిచియుండెను. ఆ స్త్రీ యట్లేడ్చుచు మధ్యమధ్య ఏనుగువంకచూచి దానిని పలువిధములుగా నిందించుచుండగా ఏనుగు తానుచేసిన నేరమునకు పశ్చాత్తాపము చూపుచున్నదో యనునట్లుగా ఆమెవంక దీనముగా చూడసాగెను. అక్కడనే నేలపైన పండుకొన బెట్టిన యాశిశువునకు తన తండ్రి చావుగాని తల్లి యేడ్పుగాని తెలియవు. ఆచంటిపిల్లవా డొకటిరెండు సారులా ఏనుగుతొండమును తన చిన్నచేతులతో పట్టుకొని ఆడుకొనెను. మావటివాని పిల్లలను తన తొండముతో నాడించుట ఏనుగుల కొక క్రొత్త సంగతికాదు. ఇప్పుడు మాత్ర మీదృశ్యము చాల దీనముగా నుండెను.

ఈలోపుగా గుఱ్ఱపు రౌతులు రెండుప్రక్కల నుండియు వచ్చి తమ యీటెలతో ఏనుగును మెల్లగాతాకి నడుపుమని హెచ్చరించిరి. మల్లీరు తన చెవులను వెనుక కాడించి వారివైపునకు తీవ్రముగా చూచెను. తన మావటివాని భార్య తనను శాంతపరుచుట కిష్టపడదుగాని ఈ రౌతులు వచ్చి తనను తోలుటకి ఏనుగు ఇష్టపడదు. ఈ విషయము దాని కన్నులలోనే స్పష్టముగా చూపినది. అయితే వారూరకొనక తమ యీటెలతో దానిని మరల తాకిరి. ఈమారు గ్రుచ్చుకొనునట్లు తొండమును తాకిరి. అంతట మల్లీరు తన తొండమును పైకెత్తి ఒక్కమారు ఘీంకరించి కుడిఎడమలకు తిరిగి వారి నెదుర్కొనబోయెను. ఒక్క క్షణములో రౌతులు దౌడుదీసిరి. మల్లీరు వారిని తరిమికొట్టెను. ఏనుగునకు మఱల ఉద్రేకము కలుగుచుండెను. తాను తరిమిన రౌతుల దళము ఒక గోడను దాటియావలకు పారిపోగా ఆ ఏనుగు రెండవదళము వైపునకు దిరిగి వారిని కూడా తరిమెను. ఇదిచూచి రాజుగారు ఆ ఏనుగును వెనుకకు పిలువుమని యాస్త్రీకే చెప్పుడని ఉత్తర్వుచేసిరి. అంతట నా స్త్రీ ఆ ఏనుగును పిలువగా నది పెంపుడు కుక్కవలె వెనుకకు మఱలివచ్చెను. తరువాత రాజుగారామెను ఏనుగుపైకెక్కి దానిని తీసికొని పొమ్మని యుత్తర్వు చేసిరి. అంతట నామె హెచ్చరిక చేయగా నామె తన వీపుపై కెక్కుటకు వీలుగా నాఏనుగు తన కాలును వంచి క్రిందికి మోకరించెను. ఆమె దాని వీపుపై కెక్కగానే మల్లీరు మావటివాని శవమును దీసి పైకెక్కించెను. తరువాత శిశువును మెల్లగా పైకందుకొన నిచ్చెను. అంతట నాదురదృష్ట వంతురాలు ఏనుగు మెడమీద కూర్చుండి దానిని మెల్లగా తోలుకొనిపోయెను.

అనాటినుండి ఆఏనుగు ఆమెనె తనకు శిక్షకురాలిగను మావటిగను స్వీకరించెను. ఆమె మాటతప్ప మరియెవ్వరి మాటయు నది వినదు. అప్పటినుండి ఆ యేనుగు మదించి యుద్రేకముగా నున్నను మరి యేస్థితిలో నున్ననుకూడ ఆమె యాజ్ఞను శిరసావహించును. దానికెంతో కోపమువచ్చి చిందులు త్రొక్కుచున్నను కూడ ఆమెవచ్చి దానితొండమును తాకిన జాలును, అది వెంటనే శాంతము వహించును. ఆమె యెట్టి యొడుదుడుకులును లేకుండ ఆ ఏనుగును నడుపసాగెను. ఆ యేనుగుపై నామెకు కలిగిన ఈగొప్ప ప్రభావము తరువాత ఆమె తన చిన్న కుమారునికి సంక్రమింప జేయుటలో నాశ్చర్యమేమున్నది?*



# 4. న్యాయాధీశుడు రామశాస్త్రి ...

తుంగభద్రానదీతీరమున హంపివిజయనగరమును రాజధానిగా క్రీ.శ. 1335 మొదలు దరిదాపుగ మూడు వందలేండ్లు దక్షిణ హిందూదేశము నేకచ్ఛత్రముగా నేలిన తెలుగు ప్రభువులైన విజయనగర చక్రవర్తుల ప్రభుత్వ విధానమునే, తరువాత, మొగలాయి సామ్రాజ్యమును త్రోసిరాజని భారతదేశమునందు తమ యాధిపత్యమును స్థాపించిన మహారాష్ట్ర ప్రభువులును అవలంబించిరి.

మహారాష్ట్ర సామ్రాజ్యస్థాపకుడైన ఛత్రపతి శివాజీ మహారాజు (1674) కాలము నుండిపేష్వాల పరిపాలన మంతమొందువరకును రమారమి నూటయేబది సంవత్సరములు ప్రసిద్ధి వహించిన అష్టప్రధానుల ప్రభుత్వపద్ధతి మన విజయనగర చక్రవర్తుల కాలమునాటి మంత్రుల సభనుబట్టి నిర్మింపబడినదే.

తన దిగ్విజయములచేతను పరిపాలనా దక్షతచేతను విద్యా పోషణముచేతను విజయనగర చక్రవర్తులందరిలోను గొప్పపేరును పొందిన శ్రీకృష్ణదేవరాయలవారు తెలుగులో రచించిన ఆముక్తమాల్యదయందు ఆకాలమునాటి రాజనీతిని గూర్చియు ప్రభుత్వపద్ధతులను గూర్చియు వివరించియున్నారు. రాజు సాధారణముగా నీతిపరులును, అనుభవజ్ఞులును, విద్వాంసులునైన సద్బ్రాహ్మణులనే మంత్రులుగా నియమించవలెననియు అట్టివారు దొరకనప్పుడు తానే స్వయముగా పరిపాలించవలయుననియు ఆయన వ్రాసినాడు. రాచకార్యములను చక్కబెట్టు మంత్రులెందరుండవలెనో కృష్ణదేవరాయలవారు వివరింపలేదు. గాని ఆయన క్రింద నైదారుగురు మంత్రులున్నట్లు కనబడుచున్నది. మంత్రు లందరిలోను పెద్దయైన సర్వశిరః ప్రధానియొకడుండెను. అతనిని మహామంత్రియని కూడ అనుచుండిరి. కృష్ణదేవరాయలవారి సర్వశిరః ప్రధానియైన సాళువ తిమ్మరుసును గూర్చి యందరెరిగినదే. ప్రధానామాత్యునితోపాటు కొందరు ఉపప్రధానులుకూడా ఉండినట్లు తెలియుచున్నది. భాండాగారికుడను కోశమంత్రియు నేటి ఆంతరంగిక

* The Private Life of an Eastern King - William Knighton P P 166 - 173.

కార్యదర్శివంటి రాయసమను మంత్రియును దళవాయియను సేనాధిపతియు రాయలవారి మంత్రివర్గము నందుంచినట్లు కనబడుచున్నది.

ధర్మాసనాధికారియను నొక మంత్రి న్యాయపరిపాలన వ్యవహారములను దేవాదాయ ధర్మాదాయములను చక్కబెట్టుచుండినట్లు పూర్వకాలము నాటి వచన గ్రంథమైన రాయవాచకము చెప్పుచున్నది.

విజయనగరమునందు రాయలవారి రాజసభయే దేశములోని సివిలు క్రిమినలు వ్యవహారములన్నిటిపైన సర్వాధికారములుగల పరమోన్నత న్యాయస్థానముగ నుండెను. రాజసభయందు రాయలవారుగాని వారి ప్రతినిధిగాని అధ్యక్షత వహించుచుండిరి. వారికి న్యాయ విచారణలందు సహాయము చేయుట కొరకు ప్రాడ్వివాకుడను న్యాయాధిపతియు ధర్మనిర్ణయము చేయు ఇద్దరు ముగ్గురు సభ్యులునుండిరి. ఇప్పటి బెంచిగుమాస్తావంటి లేఖకుడును వ్యవహారములందు తటస్థించు లెక్కలనుగట్టు గణకుడును సభలోనుందురు. ఇదిగాక వాదిప్రతివాదులను సాక్షులను హాజరుపరచుటకు న్యాయసభవారి తీర్మానములను అమలు చేయుటకు నేటి అమీనావంటి యధికారి యొకడుండెను. అతనికి సాధ్యపాలుడని పేరు.

దేశప్రజలలో తటస్థించు సామాన్య వివాదములను నేరములను ఆయా ప్రాంతములందుగల పెద్దమనుష్యులే ధర్మాసనముండి విచారించి తీర్మానించుచుండెడు వారు. ఈ పంచాయతీ సభలవలన న్యాయపరిపాలనము ప్రజలకు సులభ సాధ్యమగుచుండెను.

## అష్టప్రధానులు

ఛత్రపతి శివాజీ మహారాజు క్రీ.శ. 1674వ సంవత్సరమున పట్టాభిషిక్తుడుకాగానే రాజ్యాంగమునందు కొన్ని సంస్కరణములను జేసెను. అష్టప్రధానుల యధికారములందును హొదాలయందును కొన్ని మార్పులనుచేసి వారి వార్షిక వేతనములను హెచ్చించినాడు.

| | మంత్రి పేరు | ప్రాత పేరు | వేతనము హొనులు (వరహాలు) |
|---|---|---|---|
| 1. | ముఖ్యప్రధాన | పేష్వా | 15000 |
| 2. | సంత్‌అమాత్య | ముజుందారు | 12000 |
| 3. | పంత్‌సచివ | సురనీస్ | 10000 |
| 4. | మంత్రి | వాకనీస్ | 10000 |
| 5. | సేనాపతి | సర్‌నోబత్ | 10000 |
| 6. | సుమంత | డబీర్ | 10000 |
| 7. | న్యాయాధీశ | న్యాయాధీశ | 10000 |
| 8. | పండితరావు | న్యాయశాస్త్రి | 10000 |

ఈ అష్టప్రధానులు రాజసభ యందీ క్రిందిక్రమమున గూర్చుండి ఆయా కార్యములను నిర్వహించుచుండిరి.

పేష్వా లేక ప్రధానామాత్యుడు రాజుగారి సింహాసనమునకు దిగువ కుడిప్రక్కను గూర్చుండును. ఇతను దేశము యొక్క సామాన్య పరిపాలనము నెల్ల చక్కబెట్టు సర్వాధికారి.

దేశ రక్షణమును సైనిక వ్యవహారములను జూచు సేనాపతి సింహాసనమున కెడమప్రక్క గూర్చుండును. అమాత్యుడును సచివుడును సింహాసనమునకు గుడిప్రక్క పేష్వాకు దిగువను గూర్చుందురు.

సచివునకు క్రిందుగా మంత్రియను నాతడు కూర్చుండును. ఇతడు రాజుగారి స్వంత వ్యవహారములను జూచు అధికారి. విదేశీ వ్యవహారములను జక్కబెట్టు సుమంతుడను ప్రధాని సింహాసనమున కెడమప్రక్క సేనాపతికి దిగువను గూర్చుండును. సుమంతుని తరువాత దేశముయొక్క సాంఘిక మత వ్యవహారములను జక్కబెట్టు న్యాయశాస్త్రియైన పండితరావు కూర్చుండును. ఆయన తరువాత ప్రధాన న్యాయమూర్తియైన న్యాయాధీశుడు కూర్చుండును. అప్పటి రాజకీయ పరిస్థితులను బట్టి, పండితరావును న్యాయాధీశుడును తప్ప తక్కిన మంత్రులందరును యుద్ధములందు సేనానాయకులుగా కూడా పనిచేయుచుండిరి.*

శివాజీ కాలములో నీ యష్ట ప్రధానుల యుద్యోగములు కేవలము శక్తి సామర్థ్యములను బట్టి యొసగబడుచుండెను. గాని వంశ పారంపర్యముగ ననుభవింపబడ లేదు. శివాజీ తరువాత రాజులు బలహీనులు కాగా షేష్వాబలవంతులై వంశ పారంపర్యముగ నా పదవి ననుభవించు నాచారము వచ్చెను.

## పండితరావు

అష్టప్రధానులలో న్యాయశాస్త్రి యనబడు పండితరావు యొక్క అధికారముల చరిత్ర చాలా చిత్రమైనది. దేశముయొక్క సాంఘిక మత వ్యవహారములపైన ప్రభుత్వమునకు గల అధికారముల నన్నిటిని పండితరావు పరముగ జరుపబడుచుండెను. శాస్త్రవిధులనుబట్టి ఆచార ధర్మములనుబట్టి ప్రతివ్యవహారము యొక్క క్రమాక్రమములను పరిశీలించి ధర్మా ధర్మములను నిర్ణయించి అవసరములైన పరిహారములను ప్రాయశ్చిత్తములను శిక్షలను కూడ ఇతడు విధించుచుండును. ఆచారవ్యవహార ప్రాయశ్చిత్త కాండమును ధర్మశాస్త్రము యొక్క మూడు శాఖలకును సంబంధించిన అన్ని రాజాజ్ఞలపైనను ఈతడు చేవ్రాలు చేయవలయును. అనగా మూడుశాఖలకు సంబంధించిన సివిలు క్రిమినలు వ్యవహారములును ప్రాయశ్చిత్తములు నీతడు శాసించును.

దేశక్షేమముకొరకు ప్రభుత్వము చేయు శాంతి హెూమములు యజ్ఞయాగాదికముల నితడే చేయించును. దేవాదాయములను ధర్మాదాయములను ఇతడే నిర్వహించును. ప్రభుత్వమువారు చేయు దానధర్మముల నితడే పంచిపెట్టును. పండితసత్కారమును చేయునదియు నితడే.

* Rise of the Maratha Power - Ranade - P.126.

## న్యాయాధీశుడు

శివాజీ మహారాజు కాలమునుండి పేష్వాల ప్రభుత్వకాలము తుది వరకును గూడా మహారాష్ట్ర దేశమునందలి న్యాయపరిపాలనా విధానము కేవలము సనాతన ధర్మపద్ధతి పైననే జరుగుచుండెను.

న్యాయ వరిపాలనమంతయు న్యాయాధీశుని వశముననుండెను. ధర్మ నిర్ణయమునందు ధర్మాచరణమునందు దండవిధియందు ఆయన సర్వాధికారి. దేశ ప్రజలేగాక ప్రభుత్వోద్యోగులు గూడ ఆయన అధికారమునకు లోబడి తీరవలెను. నేటి ఆంగ్లేయోన్నత న్యాయస్థానములందలి ప్రధాన న్యాయామూర్తులలో గల యధికారములు కన్న మహారాష్ట్ర ధర్మదండమును జేపట్టిన న్యాయాధీశుని కెక్కుడు అధికార గౌరవము లుండెనని చెప్పుట అతిశయోక్తి కానేరదు. స్మృతి స్మృతులును, సదాచారమును స్వబుద్ధిని ఉపయోగించి వివేచనద్వారా తనకు న్యాయమని తోచిన ప్రకారము న్యాయాధీశుడు చేయు ధర్మ నిర్ణయమునకు తిరుగులేదు. అతని ధర్మదండమునకు పేష్వాకూడా గడగడ లాడినందుకు న్యాయాధీశుడైన రామశాస్త్రియే సాక్షి.

### ౨.మ్ము

ఒక్క (ఘూర్జరము) గుజరాతు తప్ప ఇంచుమించుగా నేటి బొంబయి రాజధానిలోని మిగిలిన భాగమంతయు శివాజీ మహారాజు రాజ్యములో చేరియుండెను. శివాజీ 1680లో చనిపోగా నాయన సంతతివారు బలహీనులై పేరునకు మాత్రము రాజులుగ నుండిరి. ప్రధానామాత్యుడైన పేష్వా బలవంతుడై రాజ్యభారము వహించగా నాయనసంతతివారే మహారాష్ట్రమునకు ప్రభువులై పునహాపట్టణమును రాజుధానిగా దేశపరిపాలనము చేయసాగిరి. 1714 మొదలు 1818 వరకు పేష్వా బాలాజీ విశ్వనాధుని సంతతివారైన ఏడుగురు పేష్వాలు* రాజ్యముచేసిరి. వారికాలమున మహారాష్ట్ర సామ్రాజ్యము విస్తరిల్లెను.

ఔరంగజేబు సంతతివారైన మొగలాయి చక్రవర్తులు బలహీనులు కాగా మహారాష్ట్రులు క్రమక్రమముగా భారతదేశములోని వివిధ ప్రాంతములను జయించి తమ సామ్రాజ్యమును స్థాపించిరి. వారు దక్షిణమున కర్నాటకమును ఉత్తరమున గుజరాతు మాళవ మధ్య రాష్ట్రములను జయించిరి. ఢిల్లీ చక్రవర్తిని కీలుబొమ్మగా జేసిరి. మహారాష్ట్ర వేషభాషలు నాగరికత మర్యాదలు వర్ధిల్లి దేశమందంతటను వ్యాపించెను. ఇట్లు మొగలు సామ్రాజ్యము నిర్వీర్యమై మరల నొక హిందూసామ్రాజ్యము వెలసెను. కొన్నాళ్ళకదియు విచ్ఛిన్నమై దేశమరాజకముకాగా నాంగ్లేయులు తమ యాధిపత్యమును స్థాపించుకొన

---

| | |
|---|---|
| * 1714 - 1720 | బాలాజీ విశ్వనాథరావు |
| 1720 - 1740 | బాజీరావు |
| 1740 - 1761 | బాలాజీ బాజీరావు (నానాసాహేబు) |
| 1761 - 1772 | మాధవరావు |
| 1772 | నారాయణరావు |
| 1772 - 1795 | రెండవ మాధవరావు |
| 1795 - 1818 | రెండవ బాజీరావు |

గలిగిరి. మహారాష్ట్ర సామ్రాజ్యముతోపాటు వారు స్థాపించిన పరిపాలనా పద్ధతులను విచ్ఛిన్నములైనవి.

## న్యాయాధీశుడూ - రామశాస్త్రి

మహారాష్ట్ర సామ్రాజ్యమును పేష్వాలేలుచుండుగా క్రీ.శ.1759 మొదలు 1772 వఱకును న్యాయాధీశుడుగా నుండిన రామశాస్త్రిగారు నేటి బొంబాయి రాజధానిలోని కల్యాణి జిల్లాలో మాహులి యనుచిన్న గ్రామమున నొకబీద బ్రాహ్మణ కుటుంబమున జన్మించెను. రామశాస్త్రిగారి తల్లిదండ్రులు అయన చిన్నతనముననే దివంగతులైరి. అంతట నీబాలుడు తన పినతండ్రి పాలబడెను. ఈబాలునికి పదునైదు పదునారేండ్లు వచ్చువఱకును చదువుసంధ్యలే లేవు. అతడెల్లప్పుడును అటలాడుచు కృష్ణానదిలో నీదులాడుచు కాలము వ్యర్థపరచుచుండెను . అతడు, చెప్పినమాట వినుటలేదని పినతండ్రి కోపించి ఇంటినుండి వెడలగొట్టెను.

ఇట్లు లేబ్రాయముననే నిరాధారుడైన రామశాస్త్రి తన జీవనము నిమిత్తము సేవకావృత్తి యవలంబింప వలసివచ్చెను. అతడు సతారాపట్టణము నందుండిన అనగల్లను నొక ధనికుని దగ్గర ఊడిగము చేయుటకు గుదిరెను. రామశాస్త్రి తన పనులనెల్ల చాల అడకువతో నిర్వర్తించుచు చాల నమ్మకముగ నుండెను. ఒకనాడతడు తన యజమానుడు తన కాలుచేతులు కడిగికొనుచుండగా నీళ్ళుపోయుచుండెను. ఆ సమయముననే యొక ముత్యముల వర్తకుడు తన యజమానునకు గొప్ప మంచి ముత్యములను చూపుచుండెను. నీళ్ళుపోయుచున్న రామశాస్త్రి దృష్టి యామంచిముత్యముల మీదకిపోగా నీటిధార నూటి దప్పిక్రిందపడసాగెను. బాలుడు పరధ్యానముగా నుండుటను జూచి యజమాను డతనిని మందలింపగా తన దృష్టి యామంచిముత్యములపైకి బోయినదని అతడు నిజము నొప్పుకొనెను. యజమానుడు చిరునవ్వుతో శాస్త్రజ్ఞులైన పండితులును మహాశూరులైన యోధులును మాత్రమే మంచి ముత్యములు ధరింప నర్హులుగాని నీబోటి వానికి వానితో బనియేమనెను. అంతట రామశాస్త్రికి తాను విద్యావిహీనుడైనందు వలని లోపము మనస్సుకు నాటగా నతడు తానుకూడా కాశికిబోయి చదువుకొని పండితుడు కావలెనను గట్టి కోరిక కలిగెను. రాత్రింబవళ్ళాత డీకోరికతో బాధపడి పడి, తుదకు తన యజమానునకు జెప్పి సాయమడిగెను. యజమానుడును జాలిపడి అతనికి కాశీ ప్రయాణమునకు సహాయముచేసెను.

ఆ కాలములో కాశికిపోవు మార్గము చాల దుర్గమమైన అరణ్యములతో నిండియుండెను. కాశికిబోయినవాడును కాటికి బోయినవాడును తిరిగివచ్చుట దుర్లభమను సామెతవలన నదియెంతకష్టమో ఊహింపవచ్చును. రామశాస్త్రి ఎన్నోకష్టములుపడి కాశీనగరమును జేరెను.

అప్పుడు కాశీనగరమునందు మహావిద్వాంసుడని వ్యాకరణ శాస్త్రజ్ఞుడనియు ప్రఖ్యాతిజెందిన పయిగుండె బాలంభట్టుగారొక పాఠశాల నడుపుచుండిరి. మన రామశాస్త్రి బాలంభట్టుగారి దర్శనమునకుపోయి నమస్కరించి వారియెదుట నిలువగా నా మహావిద్వాంసు డీ బాలు నాశీర్వదించి ఊరు పేరులను కులగోత్రములును కాశికి వచ్చిన

కారణము నడిగిరి. అంతట నీ బాలుడు తన వృత్తాంతమును జెప్పి తనకు విద్యాదానము చేయుడని ప్రార్థించెను. "అబ్బాయీ నీ వెంతవఱకు జదివితి" వని బాలంభట్టుగా రడుగగా నతడు తలవంచుకొని ఏమియు చదువుకొనలేదని ప్రత్యుత్తరమిచ్చెను పంధొమ్మిది ఇరువది సంవత్సరముల వయస్సుగల యువకుడిట్లు చెప్పుట చూచి అప్పుడక్కడనున్న విద్యార్థులందరు గొల్లుమని నవ్విరి. రామశాస్త్రి కన్నులవెంట నీరు బొటబొటకారెను. బాలంభట్టుగారి హృదయము కరగి అతనినోదార్చి తామతనికి విద్యాదానము చేయుదుమని అభయప్రదానము గావించిరి.

కాశీలో బాలంభట్టుగారి పాఠశాల యాకాలమున జాలప్రఖ్యాతి వహించిన విద్యాపీఠముగ నుండెను. అందులో షట్ఛాస్త్రములు దెలిసిన మహాపండితు లనేకులుండిరి. భారత దేశమునందు నలుప్రక్కలనుండి విద్యనేర్చికొనుటకు వచ్చిన శిష్యులనేకులుండిరి ఇతర శాస్త్రములందు ప్రావీణ్యమును సంపాదించి కేవలము వ్యాకరణమును మాత్రమే అభ్యసించుటకు వచ్చి బాలంభట్టుగారి పాదసేవచేయు పండితులునుండిరి. ఈ మహా విద్యాలయమునందు విద్యాభ్యాసము చేయు వారందరికిని బాలంభట్టుగా రన్నవస్త్రములిచ్చి విద్యాదానము చేయు చుండిరి. ఇందుకొరకు సంవత్సరమున కొకలక్షరూప్యములు వ్యయమగుచుండెను. ఈవ్యయమునెల్ల జయపురాధీశుడైన సవాయి జయిసింగు మహారాజు* భరించుచుండెను. పునహాను రాజధానిగా మహారాష్ట్రము నేలు పేష్వాలీ విద్యాలయమునకు వార్షికము నిచ్చుచుండిరి.

బాలంభట్టుగారి మేనల్లుడును అల్లుడునైన అనంతభట్టను యువకుడు కూడా మన రామశాస్త్రివలెనే చిన్నతనమున విద్య సభ్యసింపక ఉపేక్షవహించి తరువాత నొకానొక చిన్న కారణమువలన బుద్ధితెచ్చుకొని, విద్వాంసుడు కావలెనను పట్టుదలతో నీపాఠశాలలో చదువుచుండెను. సహజముగనే అతనికి రామశాస్త్రికిని స్నేహము కుదిరెను. వారిరువురును ఒకరినిమించవలెనని యొకరు, కష్టపడి చదవసాగిరి.

కాలముగడచినది. రామశాస్త్రి క్రమక్రమముగా నన్నిశాస్త్రములందును అఖండ పాండిత్యమును సంపాదించి మహావిద్వాంసుడనిపించుకొని గురువుగారి యాశీర్వాదమును వడసి కాశివదలి తన గ్రామమగు మాహులికి మరలివచ్చెను. కాశీపండితుడై వచ్చిన రామశాస్త్రిగారు అధ్యయన అధ్యాపనములు జేసికొనుచు గౌరవముగ కాలక్షేపము చేయసాగిరి. ఎవరికే ధర్మసందేహము వచ్చినను ఆయన నడిగి తీర్చుకొనసాగిరి. ఆయన ఋజువర్తనము శాస్త్రజ్ఞానము నిర్భయత్వమును జూచి చుట్టుపట్ల వచ్చిన తగవులెల్ల ఆయనచే పరిష్కరింపచేసికొను చుండిరి. ఇట్లాయన కీర్తి మహారాష్ట్రము నందలి త్వరితముగా వ్యాపించెను.

అప్పుడు పునహానగరమునందు నానాసాహేబని వ్యవహరింపబడిన బాలాజీ బాజీరావుగారు పేష్వాగానుండిరి. రామశాస్త్రిగారి విఖ్యాతిని గురించి ఆయన వినెను.

---

* (క్రీ.శ. 1728లో జయపురమును స్థాపించిన మహారాజు, గొప్ప జ్యోతిష శాస్త్రజ్ఞుడు, విద్యాపోషకుడు. ఢిల్లీ, మధుర, ఉజ్జయిని, కాశీలలో నాలుగుచోటులలో 'జంతర్ మంతర్' లనబడు నక్షత్ర పరిశోధనాలయములను గట్టించెను).

ఒకమారొక కన్య నెవరో విక్రయించుచుండగా నామెను ప్రేమించినయాత డామెను గొనుటకు ఖరారుచేసి కొనెను. అప్పుడు మహారాష్ట్ర ప్రభుత్వోద్యోగి యొక డాకన్యను తన కివ్వవలసినదని బలవంతముజేసెనట. అంతట నాకన్య రామశాస్త్రిగారింటికి వచ్చి తలదాచు కొనగ, నాయన నామె ప్రియునికిచ్చిపెండ్లి చేసెనట. అంతట నా ప్రభుత్వోద్యోగి వచ్చి వివాహము చెల్లదని యామెను దీసికొని పోవుటకు ప్రయత్నింపగా రామశాస్త్రిగారు ఆ వివాహమును సమర్థించి అయుద్యోగి నతిధైర్యముతో నెదిరించెనట. ఈ వ్యవహారము పేష్వాయైన నానా సాహేబుగారిదాక పోయినట్లును పేష్వాగారు రామశాస్త్రిగారి వాదము సంగీకరించి యా స్త్రీనామెభర్తకు వశముచేసి న్యాయము జరిగించినట్లును, ఈ సందర్భము వలన రామశాస్త్రిగారి శక్తి సామర్థ్యములు నానాసాహేబుగారికి పూర్తిగా తెలియుటవలన అయన తమ న్యాయసభలో నాయననొక సభ్యునిగను ప్రాడ్వివాకునిగ నియమించెననియు, రామశాస్త్రిగారు క్రమక్రమముగా న్యాయశాస్త్రియై న్యాయాధీశుడైనట్లును చెప్పుకొందురు. ఏవిధముగనైన నేమి, రామశాస్త్రిగారి శక్తిసామర్థ్యములను అప్పటిపేష్వా నానాసాహేబుగారు గ్రహించి అయనకు తమ న్యాయసభయందుద్యోగమిచ్చి 1759లో న్యాయాధీశుడుగా నుండిన బాలకృష్ణశాస్త్రిగారు చనిపోగా రామశాస్త్రిగారికా యుద్యోగము నిచ్చిరి. ఇట్లు రామశాస్త్రి గారు మహారాష్ట్ర సామ్రాజ్య ప్రభుత్వమునందు ప్రధాన న్యాయమూర్తియై అష్టప్రధానులలో నొకడైనాడు.

రామశాస్త్రిగారి కింతటి మహోన్నతమైన పదివి లభించినను, అయన చేతిక్రింద నెందరో గొప్ప పండితులు ఉద్యోగులు పనిచేయుచున్నను, అయన కమితమైన అధికార శాసనములున్నను, అయన వేషభాషలలో గాని పద్ధతులలో గాని ఎట్టిమార్పును కలుగలేదు. అయన ఎప్పటివలెనే నిరాడంబరుడై నిగర్వియై సర్వజన సులభుడై యుండెను. ఏ వ్యవహారమునైనను తన ఇచ్చవచ్చినట్లు పరిష్కరించుట కధికారముకలిగి యున్నను ముఖ్యమైన వ్యవహారములందెల్ల అయన పునహా పట్టణములోని గొప్ప విద్వాంసులతో నాలోచించియే ధర్మ నిర్ణయము చేయుచుండును. సాధారణముగా నాయన యభిప్రాయము నందరు పండితులును శిరసావహించుచుండిరి.

దేశములోని గొప్పవారికిగాని గొప్పయధికారులకు గాని ఇష్టమనిగాని అనిష్టమని గాని రామశాస్త్రిగారెన్నడు నే వ్యవహారమునను అలోచింపక తన కేది ధర్మమని తోచునో దానినే నిర్ణయముగా చేయుచుండును. ఇట్లు నిష్పక్షపాతముగను నిర్భయముగను ధర్మదండమును ధరించి అచరించు నీన్యాయాధీశునిజూచి మహారాష్ట్ర సామ్రాజ్యమునందలి ప్రభువులును ప్రభుత్వోద్యోగులును తుదుకు సర్వాధికారియైన పేష్వాయును గూడా గడగడ వడకుచుండిరి.

నేరము రుజువైనప్పుడు రామశాస్త్రిగారు ఎవరిని లెక్కచేయక జంకుగొంకులు లేక దోషికి తగిన శిక్ష విధించును. అయన కేవలము పూర్వాచారమును బట్టి కన్నులు మూసికొని ప్రజాక్షేమమునకు భంగకరమైన ధర్మనిర్ణయములను చేయక దేశకాల పాత్రములను బట్టి యోచించి ప్రజలకు క్షేమలాభములు కలుగు రీతిగా ధర్మముగా నడిపించుచుండెను.

## పండిత సత్కారము

మొదటి బాజీరావుగారి కాలమునాటి నుండియు పేష్వాలు ప్రతి సంవత్సరము శ్రావణమాసములో పునహాపట్టణమునందు పండితసభలు జరిపి పండితసత్కారము చేయుచుండిరి. కాశీ, నవద్వీపములందు వేదశాస్త్రములు చదివిన మహావిద్వాంసులను కొంకణ మహారాష్ట్రములోనుండి మాత్రమేగాక ద్రవిడ, ఆంధ్ర, కర్ణాటక, అంగ, వంగ, కళింగ దేశములనుండియు కాశ్మీరము నుండియు కూడ పండితులు మినహా నగరమునకు వచ్చి తమతమ విద్యలను ప్రదర్శించి సమ్మానము నందుచుండిరి.* ఆయా పండితుల యోగ్యతలను బట్టి ఇరువది రూప్యములు మొదలు నూరు రూప్యముల వఱకును ఒక్కొక్క పండితునికి దక్షిణ లొసగబడుచుండెను. విద్వాంసులు కానట్టి సామాన్య బ్రాహ్మణులకు రెండు రూప్యములు దక్షిణగ నిచ్చిపంపెడువారు. ఈ పండిత సత్కారము కొరకు ప్రతియేటను ఐదులక్షల రూప్యములను వ్యయము చేయుచుండిరి. నానాసాహేబు అని ప్రసిద్ధిజెందిన పేష్వా బాలాజీబాజీరావుగా రొక యేట నీ సత్కారము కొరకు పందొమ్మిది లక్షలరూపాయలను వ్యయముచేసెనని తెలియుచున్నది.

అష్టప్రధానులలో నొకడైన న్యాయశాస్త్రి లేక పండితరావును, న్యాయాధీశుడని వ్యవహరింపబడు న్యాయాధిపతియు నీ పండిత సభలయందు విద్వాంసుల యర్హతలను నిర్ణయించి వారిని సత్కరించు నాచారముండెను పండితసత్కారములను జేయుటలో రామశాస్త్రిగారు చూపిన నిష్పక్షపాత బుద్ధిని గూర్చియు చాకచక్యమును గూర్చియు అనేక కథలు మహారాష్ట్ర దేశమున ప్రచారములో నున్నవి. పండితసత్కారము చేయు సమయమున మహామంత్రియైన నానాఫర్నవీసు బంగారు వెండినాణెములు పోసినసంచులు దగ్గరనుంచు కొని కూర్చుండియుండి రామశాస్త్రి గారి సమక్షమున పండితసభలోనున్న ఆయా పండితుల అర్హతలనుబట్టి దక్షిణలిచ్చుచుండును. ప్రాతపండితుల విషయములో నెట్టి చిక్కులును లేకుండ వారి వారి కేర్పడిన వార్షికము లిచ్చుచుండును, గాని క్రొత్తవారి విషయముననే శాస్త్రపరీక్ష జరుపబడి వారి వారి యర్హతలను నిర్ణయింపబడి అందుకు తగిన దక్షిణ యొసగబడు చుండును. రామశాస్త్రిగారి తెలివితేటలీ నిర్ణయముననందే కనబడుచుండును, అయన తీర్మానమునకు తిరుగులేక జరిగిపోవుచుండును.

ఒకమారు రామశాస్త్రిగారి అన్నగా రాసభలోనికి దక్షిణనిమిత్తము రాగా నానా ఫర్నవీసు గారాయనను గుర్తించి వెంటనే ఇరువది రూప్యములను తీసి ఇవ్వబోయిరి. అది గమనించి రామశాస్త్రిగా రాయనను వారించి "అయ్యా శాస్త్రజ్ఞునికి తప్ప మరెవ్వరికిని ఇరువది రూప్యము లిచ్చుటకు వీలులేదు. మాయన్నగారు నాకు పూజ్యులు. నన్నుబట్టి మీకు గౌరవ్యులు కావచ్చును. వారియందు నాకు గల భక్తిని చూపుసమయమిది కాదు. ఈ పండిత సభలో వారియర్హతను బట్టి వారి కివ్వవలసిన దక్షిణకన్న హెచ్చుమొత్తము నిచ్చుటకు మనకధికారములేదు. అట్లు చేసితిమేని పక్షపాతబుద్ధితో అధర్మమును చేసిన వారమగుదుము. అయనకు న్యాయముగా నివ్వవలసిన రెండు రూప్యములనిచ్చి పంపుడు"

* దీనినిగూర్చిన కథ లిప్పటికిని తెలుగుదేశములో ప్రచారములో నున్నది.

అనెను. నానాఫడ్నవీసు నిర్విణ్ణుడై తక్కిన రూపాయలను సంచిలో బడవేసి రెండు రూపాయ లాయన చేతిలో వేసెను. ఆయనయు సంతోషపూర్వకముగా నాదక్షిణను గ్రహించి వెడలిపోయెను.

రామశాస్త్రిగారికి గోపాలుడను కుమారుడొకడుండెను. అతనికి విద్యయంటలేదు. అతడు పనిలేక తిరుగుచుండెను. అంతట పేష్వామాధవరావుగా రొకమారు గోపాలుడట్లు నిరుద్యోగియై నిరాధారుడై యుండుటకు వగచి అతనికి జీవనాధారమును గల్పింపదలచి, అతనికొక మాన్యమును నివ్వదలచిరి. ఈ సంగతి రామశాస్త్రిగారికి తెలిసి మాధవరావు గారితో నిట్లనిరి. "మహారాజా! అట్టి తెలివితక్కువ వానికె జమిందారీ నిచ్చుటవలన నేమి ప్రయోజనము? అందుకు తగినవాని కెవనికైన దాని నిచ్చినచో నది సత్పాత్రదానమగును. మాగోపాలుడు నిత్యజీవనము జరుగుట కేపరిచారకుడుగనో పనిచేయతగినవాడేగాని జమిందారీ ననుభవించు యోగ్యతగలవాడు కాడు. అట్టివానికి మీరిచ్చినచో నది యపాత్రదానమగును" అని మందలించెను. మాధవరావుగా రేమనలేక అప్పటికి తమ ప్రయత్నము మానిరి. రామశాస్త్రిగారు తమకు న్యాయాధీశుడుగా రాతగిన వార్షిక వేతనము పదివేల వరహాలు తప్ప ఇక నేవిధమైన మడిమాన్యములుగాని బహుమానములుగాని స్వీకరించుట కంగీకరించలేదు. తన వారినట్టి యుపకృతులు పొందనివ్వలేదు. ఆయన చనిపోయిన పిమ్మట పేష్వా లాయన కుటుంబమునకు సాలుకు 3200 రూపాయిలు ఉపకార వేతనముగా నివ్వసాగిరి.

రామశాస్త్రిగారు కేవలము న్యాయసభయందు ధర్మనిర్ణయములను జేయుటయేగాక ప్రజల సాంఘికాచార వ్యవహారములందు వచ్చు వివాదములనుకూడ దిద్దితీర్చుచుందురు. జ్ఞాన ప్రకాశమను మహారాష్ట్ర వార్తాపత్రిక యందాయన తీర్పులు కొన్ని ప్రకటింపబడి యున్నవి. ఒకమారు పేష్వాల కొలువులో పనిచేయుచుండిన బ్రాహ్మణ సైనికోద్యోగియొకడు తన తుపాకిని పేల్చగా ప్రమాదవశమున నాగుండువెళ్ళి మరియొక బ్రాహ్మణునికి తగిలెను. అంతట నా రెండవ యాతడు మరణించెను. ఈ వ్యవహారములను గూర్చి విమర్శించుట కొక పంచాయతీసభ జరిగెను. బ్రాహ్మణ సైనికోద్యోగి బుద్ధిపూర్వకముగా నా బ్రాహ్మణుని జంపకపోయినను అతడు బ్రహ్మహత్యా పాతకముచేసి నందువలన నాతనిని సంఘము నుండి బహిష్కరించిరి. రామశాస్త్రిగారికిది యన్యాయమనితోచెను. అంతట నాయన యా బ్రాహ్మణు నాంక్షనుండి విముక్తునిగ జేయదలచి తానా బ్రాహ్మణుని పంక్తిని గూర్చొని భుజించెను. ఇది యేమని పలువురాయన నడుగగా "అయ్యలారా! మన ప్రభువులైన పేష్వాలు కూడా బ్రాహ్మణులే కదా. వారింతకన్న నెన్నో ఘోరపాతకములను చేయుచున్నారు కదా! చేసినవాడును చేయించినవాడును చూచి హర్షించినవాడును కూడా పంచమహా పాతకులలో చేరుదురుగదా! అట్టి పేష్వాల కొలువులో చేరి వారితో సాహచర్యము చేయుటకే ధర్మశాస్త్రమంగీకరించు చున్నడో ఈ బ్రాహ్మణుని పంక్తినిగూర్చుని భుజించుటకు గూడ ఆ ధర్మ శాస్త్రమే అంగీకరించుచున్నది సుడి"యని ప్రత్యుత్తరము చెప్పిరి. అంతట బ్రాహ్మణులందరును సిగ్గుపడి యాబ్రాహ్మణునిపై నాంక్ష తొలగించిరి.

నానాసాహెబుగారు 1761లో స్వర్గస్థుడు కాగా అయన రెండవ కుమారుడైన మాధవరావు పేష్వాయయ్యెను. మాధవరావుగా రప్పుడు 17 సంవత్సరములవాడు. రామశాస్త్రిగారి నీతడు గురుతుల్యునిగ భావించుచుండెను.* అందువలన నతడు అన్ని విషయములందును అయనతో నాలోచింపసాగెను. ఛత్రపతి శివాజీ మహారాజు స్థాపించిన పరిపాలనా విధానము చాలాకాలము చక్కగా జరిగెను. శివాజీ మహారాజు తరువాత రాజులందరును బలహీనులై పేష్వాలే నిజమైన ప్రభువులుగా నున్నందువలన రాజ్యాంగ విధానమునందు చాలా మార్పులు వచ్చెను. పూర్వపు కట్టుబాటులు సడలిపోయి పరిపాలనా విధానము లోపభూయిష్ఠముకాగా మాధవరావు దానిని సంస్కరింపదలచెను.

ప్రభుత్వ సంస్కారంలో రామశాస్త్రిగారు పేష్వా మాధవరావుకు తోడ్పడి ప్రభుత్వ విధానములోని తికమకలనెల్ల ఆయనకు అవగతముచేసి రాజ్యాంగమును చక్కగా సంస్కరింప జేసిరి. అంతట పరిపాలన కట్టుదిట్టముగ జరుగసాగెను. సైనిక వ్యవస్థ బలవంతమై దేశ రక్షణము చేయుచు దిగ్విజయము చేయసాగెను. మహారాష్ట్ర సామ్రాజ్యము సర్వవిధముల మహోన్నత స్థితియందుండెను. అప్పటి రాజ్యాదాయము రమారమి పదికోట్ల రూపాయిలుండెను. దేశము పాడిపంటలతో తులతూగుచు సంగీత సాహిత్యములు కళలు వృద్ధిజెందెను. అష్టప్రధానుల ప్రభుత్వము చక్కగా జరుగుచుండెను. రామశాస్త్రిగారి శక్తి సామర్థ్యములవలన న్యాయపరిపాలనము చాలా బాగుగానుండెను. ఈ వివరముల నన్నిటిని మహారాష్ట్ర చరిత్రను రచించిన గ్రాంట్ డఫ్ వ్రాసియున్నాడు.

మహారాష్ట్ర సామ్రాజ్యాభ్యుదయము కొరకు బ్రాహ్మణకర్మలు చక్కగా జరుపుట మంచిదని మాధవరావునకు తోచెను. అంతట నాతడు శాంతిహోమములందును ఉపాసనలందును నిమగ్నుడై కార్యముల నుపేక్షింపసాగెను. ఒకమారు రామశాస్త్రిగారు వచ్చునప్పటికి మాధవరావుగారు తమ అనుష్ఠానమునందు మునిగి అయనకు దర్శన మొసగుటయె మఱచెను. అంతట రామశాస్త్రిగారీ సందర్భములను జూచి మాధవరావు గారిని మాటలతో మందలించుటవలన ప్రయోజన ముండదని గ్రహించి దానికొక ఉపాయ మాలోచించెను. అమరునాడు రాజసభకువచ్చి, తన మహోన్నతపదవిని వదలుకొని కాశికి పోదలచితినని రామశాస్త్రిగారు మాధవరావుకు మనవిచేసిరి. ఆదేమని పేష్వా ప్రశ్నింపగా 'మహారాజా'! బ్రాహ్మణులైన పేష్వాలు తమ బ్రాహ్మణ ధర్మమును వదలి క్షాత్రధర్మము నవలంబించినప్పుడు దానినైనను ప్రజల క్షేమలాభములకొఱకు సక్రమముగా నిర్వహించుట వారి విధ్యుక్త ధర్మమై యుండగా అదికూడ చేయక ఉపేక్షించుట అధర్మము. అట్లు చేయలేనప్పుడు మీరు సింహాసనమును పరిత్యజించి నాతో కూడా వచ్చి శాస్త్రములు విధించు నాచారకాండనెల్ల అనుష్ఠించుట న్యాయము' అని రామశాస్త్రిగారు పలికి అందువలననే తనపదవిని వదలుకొన దలచితిననియు నిర్భయముగా చెప్పిరి. అంతట మాధవరావుగారు పశ్చాత్తాపముజెంది రామశాస్త్రిగారిని క్షమాపణ వేడి తన రాజకార్యములనెల్ల సక్రమముగా నిర్వహింపసాగిరి**.

---

* (Rise of the maratta power – Ranade p 294-2).
** History of the Maharattas - Grant Duff, P. 344, Rise of the mahatta Power - Ranade p 292.

ఒకమారొక వైష్ణవయువతి పేష్వా మాధవరావుగారి సమక్షమున చాలమంది సరదారుల యెదుట రామశాస్త్రిగారి నిల్లడిగెను. "అయ్యా! ఈ కలియుగమునందు స్త్రీలు పురుషులకన్న రెట్టింపు ఆహారమును భుజింతురనియు నాలుగురెట్లు కామముకలిగి యుందురనియు శాస్త్రకారులు చెప్పుచున్నారు కదా! అయినప్పటికిని దురదృష్టవశమున నీ స్త్రీలు వితంతువులైనప్పుడు వారు మరల వివాహమాడరాదను నిషేధమును కల్పించి నారేమి? ఇది కలియుగ ధర్మమునకు విరుద్ధముగాలేదా?" ఈ ప్రశ్నకు రామశాస్త్రిగారేమి, ప్రత్యుత్తరమిత్తురో యని అక్కడి వారెల్లరు చాలా కుతూహలముతో నుండగా నాయన నెమ్మదిగా "అమ్మా మీరు చెప్పినమాట వాస్తవమే. ఈప్రశ్నకు సరియైన సమాధానములేదు. అయితే నా బుద్ధికొకటి తోచుచున్నది. స్మృతికర్తలందరును పురుషులేయైనందువలన వారక్కడక్కడ స్త్రీలనుగూర్చి ఇట్టి అసంగతములైన నిబంధనలను జేసినట్లు తోచుచున్నది. ఈ స్మృతికర్తలలో నొక్క విదుషీమణియైనను ఉండినచో నామె కొంతవరకైనను స్త్రీలపక్షమున వ్రాసియుండెడిది" అనిరి. స్మృతికర్తలను గూర్చి మరెవ్వరైన నిట్లు విమర్శించి యుండినచో నాతనికి వెంటనే మరణదండనము విధింపబడియుండెడిదే. సద్ధర్ముడును మహా విద్వాంసుడునైన రామశాస్త్రి గారినెవ్వరు నేమనలేకపోయిరి.

పరశురామభావు పట్వర్ధనుడు పేష్వామాధవరావు గారి సేనాపతి, ఆయన మహావీరుడు, సనాతన ధర్మపరుడైన బ్రాహ్మణుడు, ఆయన పెద్దకొమార్తె బయాబాయి యనునామెకు ఏడెనిమిది సంవత్సరములు నిండక పూర్వమే బారామతి కాపురస్థులైన జోషిల పిల్లవానికిచ్చి వివాహముచేసిరి. పెండ్లియైన తరువాత పదునారు రోజుల పండుగయైన దిరుగకుండగనే పెండ్లికొమారుడు దుర్మరణము నందెను. ఇట్టి సందర్భములో కన్నుల తెరువని పసికూన యావజ్జీవమును వైధవ్యమనుభవింపవలసిదేనా? మన శాస్త్రము లింతయుక్తాయుక్త వివేచన లేని క్రూర విధులను శాసించుచున్నవాయని పరశు రామభావుగారు వితర్కించి రామశాస్త్రిగారి నడిగిరి. రామశాస్త్రిగారి హృదయము కరగెను. ఈ విషయమును గురించి ఆయన ఆలోచించి ఇటువంటి సందర్భములలో పునర్వివాహము శాస్త్రసమ్మతమే యని నిర్ణయము చేసిరి. రామశాస్త్రిగారి ధర్మనిర్ణయము సరియైనదే కాని శాస్త్రవిధులెట్లున్నను చిరకాలానుగతమైన ఆచారము లిందుకు విరుద్ధముగా నున్నందున నిది పనికిరాదని కొందరనిరి. పరశురామభావుగారి కొమార్తె విషయమును గూర్చి నానాఫర్నవీసు కొంకణ దేశములోని పండితుల యభిప్రాయము నడుగగా వారు రామశాస్త్రిగారి ధర్మనిర్ణయమును సమర్థించిరి. అంతటితో తృప్తిజెందక పరశురామభావు గారీ విషయమై కాశీపండితుల నడుగగా వారును రామశాస్త్రిగారి అభిప్రాయముతో నేకీభవించిరి. అయినప్పటికిని తుదకు పరశురామభావుగారు దేశాచారమును ధిక్కరించ లేకపోయిరి. ఈ వ్యవహారము వలన రామశాస్త్రిగారెంత ఉదారబుద్ధి కలవారో తెలియుచున్నది. మరియు మన దేశమునందు ఆచారధర్మమెంత బలమైనదో కూడా తెలియుచున్నది*.

* (Ranade p p 311 – 312)

రాజకార్యములను నిర్వహించుటలోనే గాక స్వంత వ్యవహారములను చక్కబెట్టుకొనుటలోను పరస్పర సంభాషణలలోను సామాన్య మర్యాదలలోను గూడ రామశాస్త్రిగారు యుక్తాయుక్త వివేచనతో బహుజాగ్రత్తగ ప్రవర్తించుచుండిరి. ఇతరులు పొరబాటు పనిచేయుటగాని పొరబాటు మాటలాడుటగాని సహింపకుండిరి.

ఒకమారు మహామంత్రియైన నానాఫర్నవీసు రామశాస్త్రిగారికొక పల్లకిని పంపెను. దీనినెవరు పంపినారని శాస్త్రులుగారు బోయిల నడుగగా నానాసాహెబు గారంపినారని వారు బదులు చెప్పిరి. రామశాస్త్రిగారి మనస్సు చివుక్కుమనెను. మహామహుండైన పేష్వాబాలాజీ బాజీరావుగారే 'నానాసాహెబు' అని వ్యవహరింపబడుచుండిరి. ఈపేరుతో నింకొకరిని బిలుచుట రామశాస్త్రిగారికి చాల అనుచితముగతోచెను. అంతట అయన "నానాసాహెబుగారా! వారెవ్వరో నేనెఱుగను. నేనెఱిగిన శ్రీమంతు నానాసాహెబుగారు చాలాకాలము క్రిందటనే స్వర్గస్థులైనారు. నాకీపల్లకి యక్కరలేదు" అని వారిని పొమ్మనిరి.

1772వ సంవత్సరము నవంబరు 18వ తేదిన పేష్వామాధవరావు తన 28వ యేటనే క్షయ వ్యాధివలన అకాలమరణము నొందెను. అతడు చనిపోవు నప్పుడు తన తమ్ముడైన నారాయణరావును మంత్రి సామంతుల కప్పగించిపోయెను. నారాయణరావు కప్పటికి 16 సంవత్సరముల వయస్సుండును. అతడు సతారా పట్టణమునకు బోయి రామరాజుగారి వలన పేష్వాదుస్తులను ముద్రికలను పుచ్చుకొని పునహాకు వచ్చి పేష్వాయయ్యెను. అప్పుడు సకారాంబాపు ప్రధానమంత్రిగాను నానాఫర్నవీసు మొదలైన వారితర మంత్రులుగాను ఉండిరి. నారాయణరావు ప్రధానమంత్రితోకన్న నానాఫర్నవీసుతో నెక్కుడు చనువుగానుండి అన్ని విషయములు నాయనతో నాలోచించుట ప్రారంభించెను. అంతట సకారం బాపు మనస్సులో అసంతృప్తి బయలుదేరెను. మంత్రివర్గమున వైషమ్యములు పుట్టి రెండుపక్షము లేర్పడెను. ఈ అవకాశమును జూచుకొని నారాయణరావు పినతండ్రియైన రఘునాధరావు నారాయణరావును త్రోసిరాజని తానే పేష్వాయగుటకు కుట్రచేసెను. నారాయణరావు మాధవరావుగారి కాలములోనే కుట్రాలోచనము చేసెనని మాధవరావతనిని కొంతకాలము బంధించి వదలెను. నారాయణరావు కూడా అయనను తన రాజనగరులోనే నిర్బంధించియుంచెను. రఘునాధరావు కన్న అయన భార్య ఆనందీబాయి మఱియు సాహసురాలు. నారాయణరావును పట్టి బంధింపుడని రఘునాధరావు గారు కొందరు దుండగీండ్రను నియోగింపగా నారాయణరావును వధింపవలసినదని యామె అతడు వ్రాసిన యుత్తరమును దిద్దించినదని ప్రతీతి. ఏమైననేమి రఘునాధరావు కుట్రయొక్క ఫలితముగా నారాయణరావు దుర్మరణమునందెను. అయితే రఘునాధరావు చేసిన కుట్రవెంటనే బయల్పడలేదు. ఈ ఘోరకృత్యము నతడు చేయించెనని పునహాలోని జనులెల్లరును చెప్పుకొనుచున్నను అందుకు సాక్ష్యము మాత్రము దొరకలేదు. ఈవిషయమై రామశాస్త్రిగారి కనుమానము తోచి విచారణచేయగా అరువారములకు రహస్యమంతయు బయల్పడెను. అంతట నారాయణరావును వధించి పేష్వాయగుటకు నీవు కుట్రచేసితివని రామశాస్త్రిగారు నిర్భయముగా రఘునాధరావుపైన నేరారోపణముచేసి నీవు శిక్షార్హుడవనిరి.

తాను నారాయణరావును పట్టుకొనుమంటినిగాని వధింపు మనలేదనియు తానంత వఱకైనను పురమాయించి నందువలననే యావధ జరిగినందున ఆ దోషమునకు ప్రాయశ్చిత్తము విధింపుడనియు రఘునాధరావనెను. "నారాయణరావును వధించుటకు నీవు కుట్రచేసినందువల్ల ఆ వధకు నీవే కారకుడవు. ప్రాయశ్చిత్తములచే నీవు పరిశు ద్ధుడవు కానేరవు. నీప్రాణముల నర్పించుటయే బ్రహ్మహత్యా దోషమునకు ప్రాయశ్చిత్తము. నీవు బ్రదికియుండిన నీకుగాని ఈరాజ్యమునకు గాని క్షేమము గలుగదు. నామటుకు నేను నీక్రిందయుద్యోగము చేయను. నీవు బ్రతికియుండగా నీ పునహానగరమున గూడ కాలుబెట్టను" అని రామశాస్త్రిగారు నిర్భయముగా చెప్పి తాను తన కుటుంబముతో బయలుదేరి వాయి (waee) గ్రామము దగ్గర నొకచోట నివసింపసాగిరి. ఆ మహానుభావుడు మఱల పునహానగరమున నడుగుబెట్టనేలేదు. అంతట రఘునాధరావు పేష్వాయయ్యెను గాని ఆ పదవి యెంతో కాలముండలేదు. త్వరలోనే రాజ్యము నందంతఃకలహములు బయలుదేరెను. దేశారిష్టము పట్టుకొనెను. అప్పటికి నారాయణరావు భార్య గర్భవతిగా నుండెను. ఆమె మొగపిల్ల వానిని కనగా నతడే తరువాత పేష్వాగా ప్రకటింపబడెను. మొత్తముమీద 1772వ సంవత్సరము మొదలు మహారాష్ట్ర సామ్రాజ్యమునకు చెడు దినములే వచ్చెను. క్రమక్రమముగా అరాజకము ప్రబలగా 1818 నాటికి ఇంగ్లీషువారు తమ యాధిపత్యమును స్థాపించుకొనిరి.

మహానుభావుడైన రామశాస్త్రిగారి జీవితము మహారాష్ట్రులకును భారతీయులకును గూడా మేలుబంతిగా నుండెను. ఆయన ధర్మనిర్ణయములు, అభిప్రాయములు, సూక్తులు, దేశమునందంతటను వ్యాప్తములై చరిత్ర ప్రసిద్ధములయ్యెను. ఆయన చేసిన తీర్మానములు సనాతన ధర్మపరులందరికిని పరమ ప్రమాణములైనవి. ఆయన మరణానంతరమునగూడా అనేక వివాదములందాయన తీర్పులు ప్రమాణములుగా గైకొనబడెను. ఆయన ధర్మనిరతి, నిష్పక్షపాతబుద్ధి, ధైర్యసాహసములు, ఋజువర్తనము నాకాలమునాటి ప్రభుత్వోద్యోగు లందరికిని ప్రత్యక్షమైన ఉదాహరణముగను అంకుశముగను ఉండెను. ఆయన ప్రజలపాలిటి ధర్మదేవతగా నుండి వారి క్షేమలాభములను గనిపెట్టి ధర్మపరిపాలనము చేయుచుండెను. దుర్మార్గులకు, దుష్టులకు నాయనపేరు సింహస్వప్నమై యుండెను. ధనవంతులును బలవంతులును ఆయన నేవిధముగనైన లొంగదీయవలెనని ఎన్నో విధముల ప్రయత్నించి విఫలమనోరధులై సిగ్గుపడి మఱలనట్టిపని చేయకుండిరి. రామశాస్త్రిగారు నిగర్వియు, నిరాడంబరుడు మాత్రమేగాక అతిసౌమ్యుడుగను సర్వజన సులభుడుగను ఉండెను. ఆయనకు భాగ్యభోగ్యములన్నరోత. తనకును తన కుటుంబమునకును ఏ దినమున కాదినము కావలసిన అన్న వస్త్రములకన్న ఎక్కువ సంబారముల నుంచుకొనుట అధర్మమని యెంచి ఆయన అట్లే చేయుచుండెను.

రామశాస్త్రిగారిట్లు జీవితమునంతయు గడపి యశఃకాయులైనారు. ఈ మహానుభావుని గురించి మహారాష్ట్ర దేశమునందిప్పటికి ననేక కథలు* చెప్పుకొను చుందురు. మహారాష్ట్ర చరిత్రను రచించిన గ్రాంట్ డఫ్‌దొర రామశాస్త్రిగారిని గూర్చి చేసిన ప్రశంసనుజూచి భారతీయులెంతయు గర్వపడ తగియున్నది.

---

* A Maharatta Chief Justice under the Peshwas – The Dawn Society's Magazine (October 1907) PP 33 – 44.

# 5. ఢిల్లీ సుల్తానుల నాణెములపైన హైందవ చిహ్నములు

*"కూరిమిగల దినములలో*
*నేరములెన్నడును గలుగ నేరవు, మఱి యా*
*కూరిమి విరసంబైనను*
*నేరములే తోచుచుండు నిక్కమున సుమతీ"*

అన్నట్లున్నది; మన హిందూ ముసల్మానుల మనోభావము. ఉభయులకును మాతృభూమియైన భారతదేశమును గూర్చిన "వందేమాతరం" స్తవము నిరాకారుడైన పరమేశ్వరుని ఆరాధనను బోధించు ఇస్లాము మతమునకు విరుద్ధమని అది వాడరానిదని వినరాదని అనుచున్నారు. కలకత్తా విశ్వవిద్యాలయ చిహ్నమైన నాగరలిపిలోని శ్రీకారమును, పద్మమునుకూడా హిందువుల మతచిహ్నములేయని అవి పనికిరావని యనుచున్నారు. మధ్యరాష్ట్రములందు కాంగ్రెసు ప్రభుత్వమువారు నెలకొల్పిన దేశీయ విద్యావిధానమునకు 'విద్యామందిర' విధానమను పేరు పెట్టుట తమకు గిట్టదనుచున్నారు. ఇంకనేమేమో యనుచున్నారు. తుదకు ఈ హిందువుల సంపర్కమే తమకు పనికిరాదని తమకు వేరింటికాపురముకొఱకు పాకిస్థానము గావలెననుచున్నారు.

పండ్రెండు వందల సంవత్సరముల క్రిందట భారతదేశమునకు వచ్చి ఈ దేశములో నెలకొని ఈదేశమునే తమ జన్మభూమిగానెంచి ఆహారవిహారములందు, వేషభాషలందు, ఆచారములందును హిందువులకు సన్నిహితులుగానుండి విదేశములందలి ముసల్మానులకు భిన్నముగా నున్న ఈ భారతీయ ముసల్మానుల పూర్వులందరికిని ఈ తరమువరకును గూడా హైందవాచారము లెంతో బాగున్నవి. ఎన్నిటినో వారవలంబించిరి. అప్పుడవి ఇస్లాముకు విరుద్ధము కాలేదు. రాజకీయముగా స్వార్థపరత్వము ధృవించిన తరువాత నవి పనికివచ్చుటలేదు. దేశచరిత్ర చూచినచో ఇది స్పష్టముగా కనబడగలదు.

## శ్రీకారము

(క్రీ.శ.1173-1450) హిజిరా సంవత్సరము 589 నుండి 964వరకు మూడువందల సంవత్సరములపాటు ఢిల్లీ రాజధానిగా మన దేశమును పరిపాలించిన పఠాను రాజులందరును కూడ తమ నాణెములపైన దేశ నాగరలిపి అక్షరములనే వేయించు చుండిరి. మఱియు తమ పేళ్ళకుముందు శ్రీ యను అక్షరమును వేసికొనుచుండిరి. అందులో కొందరు హిందువుల గౌరవవాచకమైన "శ్రీ హమీర" అను బిరుదును - వీరుడను అర్థముగల దానిని వాడుచుండిరి.

(క్రీ.శ.1173) 589-602 హిజిరా సంవత్సరముల మధ్య ఢిల్లీని పరిపాలించిన మహమ్మదుఘోరీయను పౌరుషనామముగల మహమ్మద్ ఇబిన్‌సాం సుల్తాను వేయించిన

నాణెములపైన ఒక చౌహాణ అశ్వికుని బొమ్మయు నాగరలిపిలో "శ్రీహమీరః" అను బిరుదమును, రెండవప్రక్క నంది విగ్రహమును నాగరలిపిలో శ్రీమహమ్మద్ సామె యని తన పేరును వేయించికొనెను. అతడే ఇంకొక నాణెముపైన సుఖాసీనయైన లక్ష్మీదేవి విగ్రహమును, నాగరలిపిలో శ్రీమహమ్మద్ వనే 'సామ్' అనిగాని 'శ్రీహమీర, మహమ్మద్ సామ్' అనిగాని రెండవప్రక్కన వేయించెను.

(క్రీ.శ.1211-36) హిజరా 607-633 మధ్యరాజ్యమేలిన షంసద్దీన్ అల్తమష్ తన నాణెములపైన చౌహాణ అశ్వికుని బొమ్మను నందివిగ్రహమును "శ్రీహమీర్ సురితాణా, సమసదీన్" అని నాగరలిపిలో తన పేరును వేయించెను. ఇంతేకాదు. హైందవ దైవములకు వలెనే తన పేరునకు ముందు "అసావరి"యను పదమును, పేరునకు చివర "దేవ" యను మాటను చేర్చికొని తాను వేయించిన నాణెమున కొకప్రక్క చౌహాణయాశ్విక విగ్రహమును నాగరలిపిలో "శ్రీచాహడదేవ"యను అక్షరములును రెండవ ప్రక్క నంది విగ్రహమును. అసావరి శ్రీనమసోరల దేవ" యని నాగరలిపిలో తన పేరును వేయించుకొన్నాడు. ఇంతటితో తృప్తిజెందక దానిపైన హిజరా సంవత్సరముగాక విక్రమశక సంవత్సరమునే ముద్రించినాడు. మహమ్మదుఘోరీ మొదలు అలాద్దీన్ మసుద్‌షా వరకును ఢిల్లీనేలిన ఆరుగురు పఠానురాజులు తమ నాణెములపైన శివుని వాహనమైన నంది విగ్రహమును వేయించినారు. శివునితోపాటు నందికూడా హిందువులు పూజింతురను సంగతి వారెఱిగిన విషయమే.

## విగ్రహములు

హిందువుల దేవాలయములను నేలమట్టముచేసి వారి విగ్రహములను పగులగొట్టు నంతటి ఇస్లాముమతావేశముగల మహమ్మదుఘోరీ తన నాణెము మీద కేవలము హిందువులు పూజించు భాగ్యదేవతయైన లక్ష్మీవిగ్రహమును వేయించుట చాలమంది కత్యంతాశ్చర్యకరముగా తోచక మానదు. ఈ నాణెములనుపయోగించిన ఆకాలములో మన దేశముననుండిన ముసల్మానులుగాని విదేశీయ ముసల్మానులుగాని నాగరలిపికిగాని, హిందూ బిరుదములనుగాని హిందూ దేవతా విగ్రహములకుగాని తమ అసమ్మతిని ప్రకటించినట్లు చరిత్రాధారము లేమియు కనబడుటలేదు. ఈ నాణెములలో చాల వానిపైనగల అరబ్బీ పారశీలిపి శాసనములు నాలుగు, ఐదు, ఆరు, ఎనిమిది రేకులుగల పద్మములయం దిమిడ్చబడియున్నవి. ఈ చతుర్దళ, షడ్దళ, అష్టదళ కమలములు కేవలము హైందవమంత్రశాస్త్ర సంప్రదాయమునకు చెందిన పద్మములే.

భారతదేశము నేకచ్ఛత్రముగా నేలిన మొగలాయి చక్రవర్తులు తమ నాణెములపైన భారతదేశపు వృక్ష జంతువర్గపు బొమ్మలను, హిందువుల దేవతావిగ్రహములను చాలా విరివిగా ముద్రించుచుండిరి. హిందువులు పూజించు సూర్యబింబము, సింహరూపము, మీనము, నక్షత్రములు, రాశిచక్రములోని ద్వాదశ చిహ్నములును తమ నాణెములపైన నిరాక్షేపముగా వేయించు చుండిరి. ఆనాణెములపైన వేయించబడిన పారశీ అక్షరముల చుట్టును రోజాపుష్పమాలలు, ఇతర పుష్పమాలలు చెక్కించుచుండిరి.

ఔరంగజేబు తప్ప తక్కిన మొగలాయి చక్రవర్తులందరును ఖురానులోని విధ్యుక్త ధర్మములను పాటించుటలో ఎక్కువ పట్టింపులు చూపువారు కారు. వారికి లలితకళలపైన చాల మక్కువ. ముఖ్యముగా చిత్రలేఖనము, శిల్పముల విషయములలో విధి నిషేధమును పాటింపక సౌందర్యకళోపాసనమునే ప్రధానముగా నెంచుచుండిరి.

హిజిరా 936 మొదలు 1014 వరకు భారతదేశమునేలిన అక్బరు చక్రవర్తి (క్రీ.శ. 1555–1605) సర్వమతముల పట్లను సమభావమును కలిగియుండెను. హిందువులు తన పరిపాలన కాలమును రామరాజ్యముగా పరిగణించునట్లు చేయవలెనని ఆయన ఆశయము. ఆయన 50 చాంద్రమాన వత్సరములు దేశపరిపాలనమును జేసిన తరువాత హిజిరా 1013 సంవత్సరమున వేయించిన నాణెములపైన కోదండపాణియైన శ్రీరాముని బొమ్మయు, సీతాదేవి బొమ్మయు వేయించినాడు!

అక్బరు కుమారుడైన జహంగీరు చక్రవర్తి ఖురానులోని విధి నిషేధమునకు విరుద్ధముగా కొన్ని బంగారు నాణెములపైన ఒక్కప్రక్క తనబొమ్మనే వేయించుకొన్నాడు. ఆ నాణెములకు రెండవప్రక్క సింహము, సూర్యుడు బొమ్మలు రెండును గాని, ఒక్క సూర్యుని బొమ్మ మాత్రమేగాని వేయించెను.

అక్బరు చక్రవర్తి కాలములో సూర్యారాధనము చాలా రాజాదరణమును పొందినది. జహంగీరు కూడా దానిని నిషేధింపక ప్రోచినాడు. ఉత్సవ సమయములలో రాజ సమ్మానమును పొందు హిందూ మహమ్మదీయ "ఉమ్రావులు" అను ప్రముఖుల కొసగబడు పతకముల క్రిందకూడా ఈ బొమ్మలు వేసి నాణెములే ఉపయోగింప బడుచుండెను. ఈ పతకములను వారు తమ తల పాగలపైన గాని మెడలలోగాని ధరించుచుండిరి.

హిజిరా 1027 మొదలు 1034 సంవత్సరముల వరకు ముద్రింపబడిన నాణెములపైన హిందువుల జ్యోతిశ్శాస్త్ర సంప్రదాయ ప్రకారము వారుపయోగించు రాశిచక్రములో ద్వాదశ చిహ్నముల బొమ్మలు వేయబడెను.

ఔరంగజేబు చక్రవర్తి యనంతరము అనగా క్రీ.శ. 1707 మొదలు 1857 వరకును పరిపాలించిన మొగలాయి చక్రవర్తుల కాలములోని నాణెములపైన గులాబి పువ్వుపద్మము, సూర్యబింబము, నక్షత్రము, సింహము, మీనము మాత్రమేగాక శివుని త్రిశూలముకూడా కనబడుచున్నది.

ప్రపంచములోని ముసల్మాను లందరికిని అర్ధచంద్రవంకయు నక్షత్రమును ధ్వజచిహ్నములై యుండగా – ముసల్మాను రాజ్యమైన ఇరాను దేశ రాజలాంఛనము సింహము, సూర్యుడు, బొమ్మలే. సూర్యచంద్రులు నక్షత్రములు వేలకొలది సంవత్సరముల నుండి హిందువులు ఆరాధించు దేవతల చిహ్నములుగా నున్నవి. సింహము వారి రాశిచక్రములో నొక చిహ్నముగ నున్నది.

ఇస్లాము స్థాపింపబడుటకు పూర్వము వేలకొలది సంవత్సరములనుండి వైదిక మతావలంబుల మత చిహ్నముగానున్న బొమ్మలనే ఇస్లాము మతావలంబుల పీఠాధిపతులైన కాలీఫులు తమ రాజలాంఛనముగా స్వీకరించిరి! ఇది విగ్రహారాధనమని అనుచితమని వారికి తోచలేదు.

పద్మము హిందువుల కతిపవిత్రమైన చిహ్నము. చాలమంది దైవములకు నివాస స్థానము. అందమున కిది పెట్టినది పేరు. మొగలాయి చక్రవర్తులు నిర్మించిన మశీదు లన్నిటిపైనను గల గుమ్మటములమీదను పద్మము కనబడుచున్నది. తుదకు ఔరంగజేబు నిర్మించిన వానిపైనను, హిందూదేశమంతటను అనేకులైన ముసల్మాను భక్తులు నిర్మించిన మశీదులపైనను గూడ పద్మము కనబడుచున్నది. కుతుబు, ఢిల్లీ, అజ్మీరులలో నిర్మింపబడిన మశీదులపైన కూడా మన దేవాలయముపైన నున్నట్లే వందలకొలది హిందూదేవతా విగ్రహములును, పైన దేవతముల విగ్రహములను అసంఖ్యాకములైన పద్మముల బొమ్మలును చెక్కబడియున్నవి.

వంగదేశములో నొక మశీదులో నున్న శిలాశాసనముపైన "కలీమా" యను హిజిరా సంవత్సరమును అప్పుడు పరిపాలించుచున్న చక్రవర్తి పేరును ఆ మశీదును కట్టించిన పుణ్యాత్ముల పేరును అరబ్బీ పారశీక లిపులలో లఖింపబడియుండుటయేగాక హిందువుల త్రిమూర్తులలో నొకరైన శ్రీమహావిష్ణువు యొక్క ముఖముకూడా చక్కగా చెక్కబడియున్నది. అది నేటికిని చెక్కు చెదరకయున్నది. ఏ ముసల్మానునికిని ఇది అనుచితముగా తోచలేదు.

క్రీ.శ. 1759-1782 మధ్య మైసూరును పరిపాలించిన హైదరాలీ బహద్దరు వేయించిన నాణెములపైన ఒక సింహాసనముమీద నాసీనులైన పార్వతీ పరమేశ్వరుల విగ్రహమున్నది. లక్నో పట్టణమును రాజధానిగా చేసికొని అయోధ్య రాష్ట్రమును పరిపాలించిన ముసల్మాను రాజుల నాణెములన్ని పైనను మత్స్య లాంఛనమే కనబడుచున్నవి*.

"శ్రీరస్తు శాకేపఞ్చపఞ్చా శదధిక చతుర్థ శశతాబ్ద్కితే మధౌ శ్రీ శ్రీమన్మహాముదసాహ నృపతేఃసమయే నృర బాజ ఖానపుత్ర మహాపాత్రాధిపాత్ర శ్రీమత్ ఫరాన ఖానేన సంక్రమోయమ్ వినిర్మిత ఇతి."

అనియున్న శిలాశాసన మొకటి కలకత్తా మ్యూజియములో నున్నది. 1455 శక సంవత్సరమున మహమద్‌షా మంత్రి శ్రీమత్ ఫరా ఖాన్‌గారు ఒక వంతెన కట్టించినట్లు చెప్పుచున్నది. అప్పుడు సంస్కృతముగాని శ్రీకారముగాని ముసల్మానులకు అసహ్యములుగ లేవు**



# 6. ముసల్మానులు - హెూలీ పండుగ

ఫాల్గున శుద్ధపౌర్ణమికి హుతాశన పౌర్ణమి యనికూడాపేరు. ఇది రాజపుత్రులకు పర్వదినము. దానినే వారు హెూలీపండుగయని యందురు. తెలుగుదేశములో నున్న

** నా వ్యాసమును చదివి నాకుపయోగింపగలదని బ్ర॥శ్రీ॥ శతావధాని వేలూరి శివరామశాస్త్రిగారు ఈ శాసనము గూర్చి నాకు తెలిపినారు.
** Images on Muslim Coins-Bahadur Singh Singhi – Modern Review Vol.LXII.

బొందిలీలను బుందేలుఖండమునుండి వచ్చిన క్షత్రియ కులమువారు కూడా హోలీ పండుగ నతివైభవముగ జరిపెదరు. అప్పుడు కామదహనమను ఉత్సవము జరుగును. ఇది వసంతకాలమున జరుగుచున్నందువలన దీనికి వసంతోత్సవమని కూడా పేరు. ఎఱ్ఱని వసంతపునీటిని చిమ్మనగొట్టములతో స్త్రీపురుషులొండొరుల పైన జల్లుకొని, తిరుగు చున్నందువలన నిది చాలా వినోదకరమైన పండుగగా మనకు గనబడును.

హోలీపండుగయొక్క చరిత్రయు దాని యాచరణ విధానములును చాలా చిత్రముగా నుండును. మన్మథుడు విష్ణుమూర్తి కుమారుడు. అతడు సౌందర్యమూర్తి. ఆయన వాహనము చిలుక. ఆయన ఆయుధములు పంచబాణములైన పుష్పములు. మన్మథుని భార్య మహాపతివ్రతయైన రతీదేవి.

మన్మథుడు తన బాణములతో బ్రహ్మను సైతము బాధించి చిక్కులు తెచ్చిపెట్టినాడు తరువాత నతడు పరమేశ్వరుడైన శివునిపైననే తన బాణములను ప్రయోగించినాడు. పరమశివుడు ఏకాకియై మహాతప మాచరించుచుండగా లోకములు తల్లడిల్లి పోవసాగెను. ఆ తపము నుండి ఆయనను మరలింపుమని దేవతలు మన్మథుని గోరిరి. పార్వతీదేవిపైన శివునకు మోహము పుట్టింపదలచి మన్మథుడు తన బాణముల నాయనపై విసరెను. అంతట మహేశ్వరుని మనస్సు చలించెను. తననిట్లు తపోభంగమును కలిగించిన వాడెవ్వడాయని శివుడు తన మూడవ కన్ను తెఱచి చూడగా ఎదుటనున్న మన్మథుడు భస్మమైపోయెను. అప్పుడు రతీదేవి పరమేశ్వరుని ప్రార్థించగా నాయన ప్రసన్నుడై మన్మథుని భౌతిక దేహములేని అనంగునిగా పునర్జీవితునిగజేసి యామెకు పతిభిక్షను పెట్టెను.

## మన్మథ పూజ

పరమేశ్వరుని యనుగ్రహమున మన్మథుడు బ్రదికి, కాముడై స్త్రీపురుషులనావేశించి బాధింపసాగినాడని అతనివలన బాధలు పొందకుండ నుండటకొఱకు సంవత్సరమున కొకమారు మన్మథుని పూజింపవలెననియు భారతీయుల విశ్వాసము.

మన్మథుడు విష్ణువు కుమారుడేయైనందున నీయారాధనము వైష్ణవపరమైన ప్రపత్తి మార్గముగా పరిణమించినది. వైష్ణవమతావలంబులైన క్షత్రియ కులములవారు ముఖ్యముగా రాజపుత్ర స్థానములోని రాజపుత్రులును బుందేలుఖండ వాసులైన బొందిలీలును, మహారాష్ట్ర దేశీయులును మన్మథుని విచిత్రగాథను కామదహనమను వసంతోత్సవమును తమ మతాచారములోనికి చొప్పించి "హోలీ" పండుగ జరుపుచున్నారు. హోలీ పండుగదినమున స్త్రీపురుషుల యుత్సాహమునకు హద్దు పద్దులుండవు. వావివరుసలుగాని పెద్దచిన్న యను తారతమ్యములుగాని చూడక కనబడి వారిపై నెల్ల వసంతమును పోయుదురు. సరస సల్లాపములాడుదురు. మోటైన హాస్యములను గూడ చేయుదురు. సామాన్య సమయములయందు అసభ్యములుగ పరిగణింపబడు అశ్లీలములను గూడ స్త్రీల పరమున బ్రయోగింతురు. ఎట్టి పనియునులేకనే ఏదో ముఖ్యమైన కార్యమును నిర్వహించుటకని చెప్పిపంపి గేలిచేయుదురు.

హెూలీపండుగ కడపటిదినము రాత్రి ప్రతియూరిలోను పెద్ద పెద్ద భోగిమంటలను వేసి అందులోననొక గోధుమరొట్టెను పూర్ణాహుతిగా సమర్పింతురు. ఇట్టి పూర్ణాహుతి నిచ్చుట యొక గౌరవముగానెంచి ఈహక్కుకొరకు తగవులాడుచుందురు.

శ్రీకృష్ణుడు గోపికలతో రాసక్రీడల నాడినదానికి తార్కాణముగా హెూలీపండుగలో బాలబాలికలు రాసనృత్యమున బాల్గొందురు.

## పఠానులు - హెూలీ

భారతదేశము నేలిన ముసల్మాను ప్రభువులు దేశీయుల పండుగలలో పాల్గొనిన యుదాహరణము లనేకములు భారతదేశ చరిత్రయందు కనబడుచున్నవి.

పఠానులుకూడా హెూలీపండుగలో పాల్గొనుటలోని అమితోత్సాహమున తమ క్షేమము నాలోచింపక దాని ఫలితమనుభవించిన యుదాహరణ మొకటి రాజస్థాన కథావళిని రచించిన కర్నల్‌టాడ్ గారు వివరించియున్నారు. ఈ కథనే మహాకవియైన రవీంద్రనాథ ఠాకూరు గారు రసవంతమైన ఖండకావ్యముగా రచించి ప్రఖ్యాత పరిచియున్నాడు (చూడు బ్ర॥శ్రీ॥ వేలూరి శివరామశాస్త్రిగారి కథలు-గాథలు). ధాకర్ కేషర్ ఖానులను పఠాను సేనాను లిరువురు రాజపుత్ర స్థానములోని కోటా సంస్థానమునేలు భోనాంగుని పదభ్రష్టుని చేసి రాజ్యాక్రమణచేయగా నతడు బూందిరాజ్యమున ప్రవాస మనుభవించుచుండెను. ఆయన భార్య గొప్పవంశమునకు చెందిన రాజపుత్ర స్త్రీ. ఆమె తనకు తోడబుట్టినవారి వరుసయైన కైతాను సంస్థానాధిపతి యింట తలదాచుకొని తన భర్తయొక్క శత్రువులను పారదోలి ఆయనను మఱల సింహాసనాసీనునిగ జేయుట యెట్లాయని ఆలోచింపసాగెను.

మహాబలవంతులైన యీ పఠానులతో యుద్ధముచేసి జయించుట దుస్తరమైన కార్యమని యీమె గ్రహించెను. అందువలన వారిని మాయోపాయము చేత నిర్జించి రాజ్యమును సంపాదింప నిశ్చయించెను. అందుకొరకామె పన్నినతంత్రము చాలా చిత్రమైనది. మహాసాహసవంతురాలైన యారాజపుత్రి ఇతరు లేమనుకొందురో యనియైన సంశయింపక అప్పటికి కొలది దినములలో జరుగునున్న హెూలీ యుత్సవము సందర్భమున తాను తనతోడి రాజకొమరితలు మూడువందల మందితో కోటాకోటకు వచ్చి పఠాను ప్రభువులతో హెూలీ క్రీడలందు పాల్గొనదలచినామని కబురంపెను. ఈ పుత్రికలతో సరససల్లాపము లాడి వినోదక్రీడలందు మునిగి తేలవచ్చుననియు వీలైనచో వారిని చెఱపట్టవచ్చుననియు పఠాను లుబ్బితబ్బిబ్బై మహానందముతో నంగీకరించిరి. అంతట భోనాంగుని యర్ధాంగి మూడువందల మంది హరవంశ రాజపుత్రయువకులను ప్రోగుచేసి వారికి తాను తలపెట్టిన కార్యము సంగతి చెప్పినది. వీరందరును స్త్రీ వేషములను వేసికొనిరి. భోనాంగుడే తన రాణివేషమును ధరించెను. వీరందరు పల్లకులలో నెక్కి రాణివాస జనము పరులకంట బడరాదు. గనుక నాపల్లకులకు గొసెనలు వేసి రాత్రిపడిన తరువాత కోటాకోట చేరిరి. ఈ సుందరాంగులెప్పుడు వత్తురాయని యువ్విళ్ళూరుచున్న పఠానులు పల్లకులతో వచ్చిన పరివార జనమును కోటసింహద్వారము దగ్గర నిలిపివేసి

పల్లకులను మాత్రము లోపలికి పట్టించుకొని వెళ్లిరి. ఈ స్త్రీ వేషధారులందరును పల్లకులలో నుండి దిగినంతటనే పఠాను లందరి పైనను బుక్కాగుండను జల్లిరి. అంతట హెూలీక్రీడలు ప్రారంభమయ్యెను. ఈ స్త్రీ వేషధారులు పఠానులతో సరససల్లాపములాడుచు క్రమక్రమముగా చాలా చొరవతో ప్రవర్తింపసాగిరి. రాణీ వేషమునున్న భోనాంగుడు పఠాను ప్రభువైన కేషర్ ఖానుతో సరససల్లాపము లాడుచుండగా తక్కినవారి తరులతో సరసమాడుచుండిరి. అవి మాటలుకావు పాటలుకావు. వీరి గంతులతోను కేరింతలతోను కోట ప్రతిధ్వను లిచ్చియల్లకల్లోలముగ నుండెను. అంతట కేషరఖానుడు తక్కిన పఠానులును కామపరవశులై మూర్ఖమునకు దిగు సందర్భము తటస్థించెను. మోటు సరసములు, అశ్లీలములు శృంగారచేష్టలు ప్రారంభమయ్యెను. ఇక మాటదక్కుట దుస్తరమని రాణి వేషమునున్న భోనాంగుడు అబీరమను సుగంధ ద్రవ్యములతో నిండిన వసంతపు కడవను కేషరఖాను తలపైన వేసి పగులగొట్టెను. ఇదియే రాజపుత్రవీరు లేర్పరచుకొనిన సంకేతము. అంతట నీస్త్రీ వేషధారులు తమతమ గాగరాలలోనుండి మూడవందల పదునుకత్తులను వెలికిదీసి ఝళిపించిరి. మరుక్షణములో కేషర్‌ఖాను దాదిగాగల పఠాను ప్రభువులును వారి అనుయాయులును నేలగూలిరి. ఈ పీనుగుల పెంటను రాజపుత్రులు కోట బురుజులపై నుండి యావల బారవైచిరి. కోటారాజ్యము మరల భోనాంగుని వశమయ్యెను. ఇప్పటికిని కోటారాజనగరులో కేషరఖానుడు కట్టించిన మశీదు చిహ్నములు కనబడునని చెప్పెదరు.

ఈ విచిత్రపు హెూలీ మహెూత్సవమును గూర్చిన గాథ కల్పిత కథగాక యథార్థమైన చరిత్రాంశముపైన నాధారపడినదే. ఆకాలములో మన భారతదేశమున నుండిన ముసల్మానులు హెూలీ యుత్సవమున బాల్గొనుట మతవిరుద్ధమనిగాని, అనుచిత మనిగాని ఎంచక కేవల హైందవ మతాచారములకు సంబంధించిన ఆ వినోదములందు స్వేచ్ఛగా పాల్గొనుచుండిరను విషయమే ఈ గాథలో ముఖ్యముగా మనము గమనింపవలసిన విశేషాంశము.

## ఔరంగజేబు మనుమడు

1659 మొదలు 1707 వరకు భారతదేశమును పరిపాలించిన మొగలాయి చక్రవర్తియైన ఔరంగజేబు కుమారుడు బహదూర్‌షా. ఇతని రెండవకుమారుడే అజీం ఉషాన్ ఔరంగజేబతనిని 1696 లో వంగరాష్ట్రమునకు సుబేదారుడు అనగా రాజప్రతినిధిగా నియమించెను. అజీం ఉషాన్ చాలా ఉదారాశయములు గలవాడు. అతనికి హిందువుల వేషభాషలపైన చాలాప్రీతి. అందువలన నతడు హిందువుల దుస్తులనే ధరించి కొన్ని హైందవచారములను కూడా అవలంబింపసాగినాడు. వంగరాష్ట్ర చరిత్రను రచించిన స్టీవార్టు, అజీం ఉషానును గురించి ఇట్లు వ్రాసినాడు. "హిందువుల సదభిప్రాయమును పొందుటకీ అజీం ఉషాను వారి పండుగలలో ఉత్సవములను చేయించుచుండెను. పసుపు పచ్చని దుస్తులను ఎర్రని దుస్తులను ధరించి వసంతోత్సవములలో పాల్గొనుచుండెను. హెూలీ పండుగలందు తన మనుమడిట్లు పాల్గొనుటయు హిందువుల యాచారముల

నవలంబించుచుండుటయు జూచి ఔరంగజేబు చక్రవర్తి యతనిని మందలించుచు నొక పెద్దలేఖను వ్రాసి దాని చివర నీక్రిందియర్థమువచ్చు పారశీవృత్తమును వ్రాసినాడు.

"తలపైన నొక పచ్చని తలపాగ శరీరముపై నొక ఎఱ్ఱనియంగీ - రాజకుమారులకు నలుబదియారేండ్లు నిండినవి కాబోలు - గడ్డము మీసములను పరువును ప్రతిష్ఠను కాపాడుకొనువద్ధతి చాలా బాగున్నది."

## స్యుదులు - హోలీపండుగ

ఔరంగజేబు తదనంతరము హిందూదేశము నేలిన అయన పుత్ర పౌత్ర ప్రపౌత్రుల కాలములో మహాబలవంతులుగా నుండిన నయ్యద్ సోదరులు తమ అచార వ్యవహారములలో కేవలము హిందువులుగనే యుండిరని తరువాత కాలమునాటి మొగలు చక్రవర్తుల చరిత్రను రచించిన ఇర్విక్ వ్రాసియున్నాడు.

నయ్యదు సోదరులలో పెద్దవాడును కుతుబ్ ఉల్‌ముల్కు అనుబిరుదును పొందినవాడును అయిన అబ్దుల్లాఖాన్ వసంతోత్సవమున పాల్గొని హిందువులవలెనే హోలీ బుక్కాను జల్లుచుండెనని సమకాలికుడైన ఒక చరిత్రకారునివలన తెలియుచున్నది. ఇంతేకాదు, ఈ కుతుబ్ ఉల్ ముల్కుకు హిందువుల వెఱ్ఱినమ్మకములు చాల ఉండెననియు అతడు దర్బారులో కొలువుదీర్చినప్పుడెల్ల తివాచీకి ముందుకొనలో ఇరువురు మనుష్యులు నిలచి సదావ విత్తులతో నిడిన ధూపహారతులనిచ్చి దృష్టి దోషపరిహారమును చేయుచుండిరనియు వ్రాసినాడు.

## మీర్జాఫరు - హోలీ యుత్సవము

మూర్షిదాబాదును రాజధానిగా జేసికొని వంగరాష్ట్రము నేలుచుండిన మొగలాయి రాజప్రతినిధి స్వతంత్ర నవాబుగానుండెను. సురాజ్ ఉద్దౌలాపట్ల స్వామి ద్రోహముచేసి ఇంగ్లీషు వారికి సహాయుడై 1757వ సంవత్సరమున జరిగిన ప్లాసీ యుద్ధమున సురాజుద్దౌలా ఓడిపోగా వంగరాష్ట్రమునకు నవాబైన మీర్జాఫరు, బేహేసూతూన్ ఉద్యాన వనమునందు హోలీయుత్సవము నతివైభవముతో జరుపుచుండెన సియర్‌ముతా ఖెరిన్‌లో నుదాహరింపబడియున్నది.*

## వంగరాష్ట్ర నవాబైన ముబారక్ ఉద్దౌలా - దీపావళి

పైన చెప్పిన సియర్ ముతాఖైరిన్‌లోనే మీర్జాఫరుఖాను మూడవ కొమారుడైన ముబారక్ ఉద్దౌలా హోలీపండుగనే గాక హిందువుల పండుగయైన దీపావళినికూడా అత్యుత్సాహముతో జరుపుచుండెనని వ్రాయబడియున్నది (చూడు. 3వ సం. పుటలు 143-144).

* భారతదేశము నేలిన కడపటి యారుగురు మొగలాయి చక్రవర్తుల కాలమునాటి రాజకీయ సాంఘిక స్థితిగతుల వర్ణించుచు గులాంహుస్సేన్ ఖాన్ గారు పారశీభాషలో రచించిన 'సియర్ ముతాఖెరిన్' అను గ్రంథమునకు హాజీముస్తఫా చేసిన భాషాంతరీకరణము 3వ సంపుటము 174 పుట. క్రిందిపాద వివరణము.

"హిందువుల పండుగయైన దీపావళి మహోత్సవమును జరుపుట కతడు ఐదారువేల రూపాయలను ఖర్చుపెట్టుచుండును. హోలీయనునది కూడా హిందువుల పండుగయేకదా! అయినను మన నవనాగరికులైన ముసల్మాను ప్రభువులు దానిని ముఖ్యముగా జరుపవలసిన పుణ్యకార్యముగా నెంచి నాట్యకత్తెల నిమిత్తము, ఇతర వినోదముల నిమిత్తమును హీనకులస్థులకిచ్చు బహుమానముల నిమిత్తమును చాల ధనమును వ్యయము చేయుచుందురు. ముబారక్ ఉద్దౌలా పిల్లల 'సుమీ' సందర్భమున నేను మూర్షిదాబాగులో నుండుట తటస్థించినప్పుడే ఈ హోలీ పండుగ వచ్చినది. ఈ యుత్సవ సందర్భములో తన బానిస స్త్రీలకును తన ప్రియురాంద్రకును బహుమతులు, బట్టలు నిచ్చుటకొరకు ముబారక్ ఉద్దౌలా 37 వేల రూపాయలను ఖర్చుచేసినాడు" అని గులాం హుస్సేన్ ఖాన్‌గారు తన సియర్ ముతాఖెరిన్‌లో వ్రాసినాడు!

## రెండవ షాలం చక్రవర్తి

1760-1806 మధ్య మొగలాయి చక్రవర్తిగా నుండిన రెండవ షాలంపాదుషా బలహీనుడై మహారాష్ట్రుల చేతులలో కీలుబొమ్మగానుండి తరువాత ఇంగ్లీషువారికి వశుడైనాడు. అతడు మహారాష్ట్రుల చేతులలో నుండగా ఢిల్లీలో మహారాష్ట్రులు ఆడినది ఆటగాను పాడినది పాటగాను చెల్లుబడి యగుచుండెను.

1780 వ సంవత్సరమున హోలీ పండుగలో జరిగిన వినోదముల సందర్భమున మహారాష్ట్రులు కొందరు, చక్రవర్తిని బహిరంగముగానే ఎగతాళిచేసిరి. కాని చక్రవర్తి చాలా సరసుడైనందువలన తనను పరిహసించినవారిపైన కోపింపక పోవుటయేగాక వారికి బహుమతులిచ్చి పంపెను. ఈ విషయమును గురించి ఫకీర్ ఖయిరుద్దీన్ మహామ్మద్ అలహాబాదీ రచించిన ఇబ్రత్ నామాలు వివరింపబడియున్నది. (చూడు. ఇలియట్ రచించిన హిందూదేశ చరిత్ర 8వ సంపుటము).

షా అలంపాదుషాగారి పరిపాలనలో 20వ సంవత్సరమున హిందువుల హోలీ పండుగనాడు ఆనందరావు నర్సి యను మహారాష్ట్రుడు, ఒకనికి షా అలం చక్రవర్తి వేషమును వేసి విలువగల సన్నని దుస్తులను తొడిగి అతనిపై పెదవులకు సన్నని మీసకట్టును అంటించి గడ్డమునకు కృత్రిమపు గడ్డమును తగిలించి ఒక ప్రాతమంచముపైన కూర్చుండ బెట్టినాడు. చక్రవర్తి తనకత్యంత ప్రేమాస్పదురాలైన కొమార్తె నెల్లప్పుడును దగ్గరనే యుంచుకొని తానెక్కడికి పోయిన నక్కడికి తంజానులోగాని ఏనుగుపైనగాని ఆమె నెక్కించుకొని పోవుచుండుటను అనుకరించుటకొరకా మంచముపైన చక్రవర్తి వేషము ప్రక్కనే స్త్రీవేషము వేసిన యువకునొకనిని కూర్చుండ బెట్టినాడు. ఈ వేషములతో నీ ప్రాతమంచమును చక్రవర్తిగారి తంజానుమోయు బోయీల వేషములు వేసిన నలుగురు మనుష్యులు మోయుచుండగా ప్రక్కను చక్రవర్తిగారి పరివార జనమువలె ఛత్ర చామరములతోను వెండి బంగారు వేత్రములు (బెత్తములు)తోను ధ్వజములతోను కొందరు హీనకులజులు వెంటరాగా మేళతాళములతో నూరేగుచు ప్రజలు విఱగబడి చూచుచుండగా పాదుషాగారు కూర్చునియున్న జహాన్ న్యూమా రాజనగరు దగ్గరనుండిపోయిరి. ఇట్లు తన్ననుకరించుచు వచ్చిన ఈ దుండ గ్రీంద్రను చూచి చక్రవర్తి కోపింపకపోవుటయే

గాక చిరునవ్వుతో ఈ ప్రదర్శనమును చేయించిన ఆనందరావుగారికి 500 రూపాయిలు బహుమతిగా పంపించెను.

అప్పుడు సర్వాధికారిగానుండిన మహారాష్ట్ర నాయకుడైన సింధియా మహారాజు గారికీ సంగతి తెలియగా అయనకు చాలా కోపమువచ్చినది. తన శిబిరములో నున్న సైనికాధికారియైన ఆనందరావిట్లు చేసినందులకు శిక్షగా అయన - అతని ఆస్తిని కొల్లగొట్టించి ఆనందరావును పట్టుకొని ఫిరంగిమూతికి కట్టించి ప్రేల్చివేయుటకు నిశ్చయించెను. ఈ సంగతి పరమదయాళుడైన పాదుషాగారి చెవినిపడగా ఆనందరావును వధింప వలదనియు తామతనిని క్షమించితిమనియు కబురంపిరి. అంతట సింధియా మహారాజుగారతనిని వదలిపెట్టిరి గాని తమ కొలువులోనుండి తొలగించి వెడలగొట్టిరి.

## హిందూ మహమ్మదీయ కలహములకు కారణమైన హెూలీ

ఇంతవరకును హిందూ మహమ్మదీయులు సోదరభావముతో కలసిమెలసి హెూలీపండుగను జరిపికొనిన యుదాహరణములను జూచితిమి. ఇక నీయుత్సవము మతకలహములకు కారణముగా పరిణమించిన యుదాహరణములను కూడ గొన్నిటిని చూతము.

1713-1715 మధ్య భారతదేశము నేలిన ఫరుక్సయ్యర్ చక్రవర్తి కాలములో ఘూర్జర (గుజరాతు) రాష్ట్రములో నహమ్మదాబాదు నగరమున, హెూలీయుత్సవ సందర్భమున హిందూ మహమ్మదీయులకు తగవులు వచ్చెను. దానిని గూర్చి సియర్ ముతాఖెరిన్‌లో వివరింపబడియున్నది. అహమ్మదాబాదులో రెండు ఇండ్లమధ్య కొంత ఖాళీ స్థలముండెను. ఒక యిల్లు హిందువునిది. రెండవది యొక ముసల్మానుది. హిందూ గృహస్థుడు స్థానిక వరిపాలకుని యనుమతితో కామదహనమును చేసినాడు. మహమ్మదీయుడైన పొరుగింటి వానికిది యిష్టములేదు. గాని హిందువు అతని మాటవినక బహిరంగముగా భోగిమంట వేసినాడు.

అంతట నా హిందువునకు శాస్తిచేయవలెనని మహమ్మదీయులొక ఆవును తెచ్చి ఆ ప్రదేశముననే చంపిరి. అయితే ఈ తగ వంతటితో పోలేదు. ఆ ప్రాంతములో హిందువుల జనసంఖ్యయే అధికముగా నున్నందువలన వారందరు నేకమై మహమ్మదీయులపైన బడిరి. అంతట వారు తమ యిండ్లను వదిలి పారిపోయిరి. హిందువులా యావేశములో ఒడలు మరచి యొక మహమ్మదీయుని ఆ ప్రదేశముననే వధించిరి. అంతట నగరములోని ముసల్మానులు నగరపాలకుని క్రిందనున్న అష్టను సైన్యము సహాయముతో వచ్చి హిందువుల ఇండ్లపైబడి దోచుకొనిరి. ఇండ్లు తగులబెట్టిరి. ఒకచోట హిందువులు ప్రాణములకు తెగించి తుపాకులతో పోరాడిరి. ఈ కొట్లాటలు కొన్నాళ్లపాటు జరిగినవి.

ఆ చక్రవర్తి పరిపాలన కాలములోనే హెూలీపండుగ సందర్భములోనే ఢిల్లీలో కూడా హిందువులకును మహమ్మదీయులకును కొట్లాట జరిగినది. హెూలీ యుత్సవమున జరిగిన గల్లంతులలో మక్కా నుండి వచ్చిన ముసల్మాను హాజీయాత్రికుడొకడు హిందువుల చేతులలో మరణించెను. బహుశా ఇది తలవనితలంపుగానే జరిగియుండును. అయితే నగరములోని పంజాబీలైన చెప్పులు కుట్టువాండ్రును ఇతర ముసల్మాను వర్తకులును

ఒక్కుమ్మడిగా తిరుగబడి పెద్దగలాటచేసిరి. అప్పుడు ఖాజీగామండిన యాతడీ విషయమున సరియైన శ్రద్ధతీసికొనలేదని యెంచి వారు వజీరు (ప్రధానమంత్రి) గారిని ఇంకొక మంత్రిగారిని కూడా వెంటాడిరి. వజీరుగారికి అంగరక్షకులుగానుండిన అష్టను సైనికులపై చెప్పులవర్షము కురిపించిరి. ఈ కల్లోలము కొన్నాళ్లపాటు జరిగెను.

## ఇంగ్లీషు గవర్నరు తీర్పు

సియర్ ముతాఖెరిన్ తర్జుమాచేసిన హాజీముస్తఫాగారిట్లు వ్రాసిరి. "నాకాలములోనే ఒకమారు మహమ్మదీయుల పితృదేవతలను గురించి విలపించు మహాపర్వమును, హిందువులు వినోదముగా కాలక్షేపముచేయు హెూలీపండుగయు నొకే సమయమున తటస్థించినవి. తమతమ మతాచారముల ప్రకారము జరుపుకొనుటకు గల హక్కులను గూర్చి న్యాయము చెప్పవలసినదని ఉభయులును, అప్పుడు దేశమును పరిపాలించు ఇంగ్లీషు గవర్నరు నడిగిరి.

ప్రతి సంవత్సరమును హెూలీపండుగ యెప్పుడు వచ్చునని గవర్నరు హిందువుల నడుగగా, వారది యెల్లప్పుడును ఆకాలములోనే వచ్చుననియు ఇతర కాలములందు రాదనియు బదులుచెప్పిరి. మీపర్వమెప్పుడు వచ్చుచుండునని యితడు ముసల్మానుల నడుగగా వారది యొక్కప్పుడొక ఋతువులోను ఇంకొకప్పు డింకొక ఋతువులోను వచ్చుచుండునని బదులుచెప్పిరి. అట్లయినచో మీది న్యాయపక్షము కాదని గవర్నరు వారితోనని ఆప్రకారము తీర్మానించెను.*



# 7. మహాసేనాని పేరు నిలిపిన భార్య

## వంగరాష్ట్రముపై మహారాష్ట్రుల దండయాత్ర

వంగదేశము మొగలాయి సామ్రాజ్యములో నొక రాష్ట్రముగా నుండెను. మూర్షిదాబాదును రాజధానిగా చేసికొని మొగలాయి చక్రవర్తి రాజప్రతినిధి ఆదేశమును పాలించుచుండెను. క్రీ.శ.1741 లో అలీవర్దీఖానుడు రాజప్రతినిధిగా నుండగా ఒక తెగ మహారాష్ట్రులు వంగ దేశములోనికి దండయాత్ర సాగివచ్చిరి. రఘోజీ భాంస్లేగారి ప్రధాని నలుబదివేల గుఱ్ఱపు దళముతో వచ్చిపడినాడు. అలీవర్దీఖాను వారిని ప్రతిఘటింప నిశ్చయించెను. గాని కొందరు సేనాధిపతులు వెనుకదీసిరి. సైన్యములోని అష్టనులు తిరుగుబాటు చేయు స్థితిలోనుండిరి. ఇట్టి పరిస్థితులలో మహారాష్ట్ర సేనానియైన భాస్కర పండితుడు రాజప్రతినిధియొక్క సైన్యములను తరిమి వారి సరంజామును చేజిక్కించుకొని

* Seir Mutaqherin By syed Ghulam Hussain Khan (Cambray & Co Calcutta 1902) Vol.I pp 72, 263 Mahamedan and Holi Festival. Romesh Chandra Banerjee Modem Review Vol XVII (1940) pp 708.

చుట్టుముట్టి ఒకకోటిరూపాయలను కప్పముగా చెల్లించినచో వెనుకకు పోయెదనని కబురంపెను. నాప్రాణముపోయినను నేను కప్పము చెల్లింపనని అలీవర్దీ ఖాను బదులుచెప్పి పోరాటము సాగించెను. అప్పటికి మూడు వేల గుఱ్ఱపు దళములో నైదువందలు మాత్రము అతనికి మిగిలియుండెను. సేనాధిపతులు అధైర్యముతో నుండిరి. అంతట అతడు తనవారికి ధైర్యము చెప్పి వారికి ఆవేశము కలిగించెను. మిగిలిన సైన్యముల నెల్ల కూడదీసెను. అతడత్యంత ధైర్యసాహసములతో తన్ను చుట్టుముట్టిన శత్రుసైన్యములనుండి చొచ్చుకొని పోవుటకు నిశ్చయించెను. ఆ ప్రకారమతడు ఘోరముగా యుద్ధము చేయుచు శత్రుసైన్యములలో నుండి పోవుచుండగా మహారాష్ట్రులతని నడ్డగించుచుండిరి. అప్పుడప్పుడు మీదికి వచ్చి పడుచుండిరి. ఒకమారు మహారాష్ట్రులు తెల్లవారు జామున వచ్చిపడిరి. రాజప్రతినిధికి తన ఏనుగు నెక్కుటకు కూడా వ్యవధిలేకపోయెను. ఎవరికివారే యమునాతీరె యనునట్లు పోరాడసాగిరి. భగవంతుని మహిమవలన నేదైన తటస్థించిన తప్ప అలీవర్దీఖాను బ్రదికిబయట పడునను నాసలేని పరిస్థితి కలిగెను.

## ఏనుగులు చేసిన చమత్కారము

అప్పుడొక విచిత్రము జరిగెను. సాధారణముగా రాజప్రతినిధి ఏనుగునకు ముందుగా రెండు పెద్ద ఏనుగులు అయన ధ్వజములతోను పతాకములతోను నడుచు చుండెను. వాని గొప్పదంతములకు లావైన గొలుసులు కట్టియుండును. ఈ ఏనుగులా గొలుసులను ఆడించుచు ధ్వనిచేయుచు వినోదించును. ఈ గొలుసులు పంద్రెండున్నర మణుగుల బరువును ఇరువది యడుగుల పొడవునుండును. అప్పుడట్లు ఆ మహారాష్ట్ర జనము వచ్చి పడగా వింతవేషములు ధరించియున్న ఇంతమంది క్రొత్తమనుష్యుల రూపములును వారి వాసనయు చూచి ఏనుగులు బెదరి కోపముతో తమ గొలుసులను చమత్కారముగా గిరగిర త్రిప్పసాగినవి. అంతట నా గొలుసులొక గొప్ప అస్త్రమువలె పనిచేసి శత్రుసైన్యములను నుగ్గునుగ్గు చేయసాగెను. ఈ విచిత్రమును జూచి మహారాష్ట్రులు భయవిస్మయములతో వెనుకంజవేసి పారిపోవసాగిరి.

ఇంతలో రాజప్రతినిధి అంగరక్షకులును తెలివిదెచ్చుకొని వచ్చి అయనను రక్షించిరి. అప్పుడు తక్కిన సైన్యములు వచ్చి అయనను కలిసికొనగా గండము గడిచి అతడెప్పటివలెనే శత్రుబలముల మధ్యనుండి ముందుకు పోవుటకు వీలుకలిగెను. అనేక కష్టములుపడి రాజప్రతినిధి మూర్షిదాబాదుకు రెండుదినముల దూరమునున్న కట్వా కోటను చేరగలిగెను.

ఇట్లు రాజప్రతినిధి తమ ముట్టడిని ఛేదించుకొని పోయి తన బలములను చేరదీసికొనుచుండగా మహారాష్ట్రులు వంగదేశమును జయించుట కష్టమని గ్రహించి దోపిడి ప్రారంభించిరి. మూర్షిదాబాదును ముట్టడించి జగత్సేటు అను కోటీశ్వరుని ఇంటిని దోచి రెండుకోట్ల రూపాయలను దోచిరి. రాజప్రతినిధి మూర్షిదాబాదు పట్టణమును రక్షించుట కొరకు వచ్చుచుండగా మహారాష్ట్ర సేనాధిపతి తీవ్రమైన వర్షములకు భయపడి కొంచెము వెనుకకు పోయెనుగాని మీర్‌హబీబు అనునతడు ప్రోత్సహింపగా నతడు మరల విజృంభించి హుగ్లీని పట్టుకొనెను. తరువాత మహారాష్ట్ర సైన్యములు గంగానది దక్షిణ ప్రాంతములను నాశనము చేసిరి. ఒరిస్సా, మిద్నపూరు, బర్ధవాను, రాజషాహి ప్రాంతములు

శత్రువుల వశమయ్యెను. మొగలాయి ఫౌజుదారు లెంతకష్టపడి పోరాడినను లాభము లేకపోయెను. మూర్షిదాబాదును గంగకుత్తరప్రాంతములును మాత్రము ఆలీవర్దీఖానుని వశమున నుండెను. అతడు అసాహాయ్యుడుగా నుండెను. ఇట్టి స్థితిలో మొగలాయి చక్రవర్తిగారి దగ్గరనుండి యొక ప్రభువు మూర్షిదాబాదుకు వచ్చి చక్రవర్తికి చెల్లవలసిన కప్పమిమ్మని యడిగెను.

ఆలీవర్దీఖాను తనస్థితిగతులను చక్రవర్తికి విన్నవించి సహాయము చేయుడని కోరెను. అంతట మహమ్మదుషా చక్రవర్తి అబ్దుల్ మన్సూరుఖానును సైన్యములతో పంపెను. ఇంతటితో తృప్తిజెందక చక్రవర్తిగారింకొక యుపాయము నాలోచించిరి. మహారాష్ట్రు లీవిధముగా వంగదేశముపైన దండయాత్ర చేయుటవలన తనకు రావలసిన కప్పము చెల్లుట లేదనియు, అందువలన తాను మహారాష్ట్రులకు చెల్లించుట కేర్పాటు చేసికొనిన చౌతుపన్నును చెల్లించుట దుస్తరమనియు పునహాలో మహారాష్ట్ర సర్వసేనానియైన పేష్వా బాలాజీరావు గారికి వ్రాసెను. ఈలోవుగా ఆలీవర్దీఖాను తన సైన్యముల నెల్లమఱల ప్రోగుచేసికొని మహారాష్ట్రుల నెదిరించి వారినోడించ గలిగెను. ఇంతలో చక్రవర్తిగా రంపిన సహాయమును వచ్చెనుగాని అట్లు సహాయమునకు వచ్చిన సేనాధిపతి కొంత స్వాతిశయమును చూపెను. ఆయన సైన్యములును దౌర్జన్యము చేయసాగెను.

మహారాష్ట్ర సైన్యములుకొన్ని వంగరాష్ట్రమునకు పోయి ఇట్లు దౌర్జన్యములు చేయుచున్నవను సంగతి సర్వసేనానియైన బాలాజీరావుగారికి తెలియగనే న్యాయముగా తమకు చెల్లవలసిన చౌతుపన్ను వసూలు అగుటకీ దౌర్జన్యము లాటంకము గలిగింపగలవని గ్రహించెను. దోపిడికివీలున్నచో మహారాష్ట్ర సైన్యము లెవ్వరిమాటను వినవనికూడ ఆయన తెలియును. అందువలన బాలాజీరావుగారు స్వయముగా బయలుదేరిపోయి వారిని వారింప దలచెను. ఆయన దావూదుపూరునుండి త్వరితముగా తికర్రీగయ మీదుగా అజీమాబాదు (పట్నా) నగరము వెనుక నుండి మనపూరు బేహారులద్వారా అడ్డముగా పోయి ముంగేరి (మాంఘీరు) భాగల్పూరుల దగ్గర రాజబాటలోనికి వెడలివచ్చి తన సైన్యములను నడిపించుకొని పోవసాగెను. బాలాజీ రావుగారింత కట్టుదిట్టములలో నుంచినను ఈ సైన్యములు పోవునప్పుడు వానివెంటనుండు పరివారజనము అందులోని దుర్మార్గులు, ఆకతాయులు కొందరు, ప్రక్కనున్న గ్రామములను దోచుకొనుచు ప్రజలను హింసించుచునే యుండిరి. దీనివలన మాంఘీరు, భాగల్పూరు ప్రజలుకూడ బాధపడిరి. ఈ సైన్యములు వచ్చుచున్నవని తెలియగానే ప్రజలు తమయిండ్లు వాకిండ్లు వదలి గంగానది కావలియొడ్డుననున్న గ్రామములకు పారిపోవసాగిరి.

## మహాసేనాని భార్యచేసిన సాహసము

ఇట్లు గ్రామవాసులందరును ఇండ్లు విడిచిపోవుచుండగా నొక స్త్రీ గొప్ప సాహసము చేసెను. ఆమె మహమ్మదుఘౌస్ అను సేనాధిపతి భార్య. ఈ సేనాధిపతి చాల గొప్పవాడు. ఇతడు, ఆలీవర్దీఖానుకు పూర్వము వంగరాష్ట్రమునకు నవాబైన సేర్ ఎఫ్రాజ్‌ఖాన్ గారి సేనాధిపతి. క్రొత్తగా వంగరాష్ట్రము నాక్రమించిన ఆలీవర్దీఖానుయొక్క సేనాధిపతితో ఇతడు ఘేరి లేక ఘేరియా అను గ్రామము దగ్గర జరిగిన యుద్ధమునందు ధైర్యముతో

పోరాడి తన ప్రభువు మరణింపగా తాను బ్రదుక నిచ్చగింపక తన ఇరువురు పుత్రులతోను రణరంగమున మరణించి వీరస్వర్గము నలంకరించిన మహావీరుడు. ఆయన భార్య యిప్పుడు నిరాధారయై అనహాయురాలై పాడువడి మరమ్మతులేని ఇంటిలోనే కాపురముండెను. గంగానదిని దాటి పోవుటకు ధనములేక ఇతరులందరును గ్రామము విడచిపోవుచుండగా ఆమె ధైర్యముతో తనయింటనే యుండి తన ప్రాణములనైన గోల్పోవుటకు తెగించెను.

అంతట ఆమె తన బందుగులను వారి పరివారజనమును ప్రోగుచేసి వారికి ధైర్యముచెప్పి తమ తమ స్త్రీలను పిల్లలను రక్షించుకొనుటలో ప్రాణముల నడ్డువేయుడని హెచ్చరించెను. ఆమె ధైర్యమును చూచి వారుకూడా ధైర్యము తెచ్చుకొని ఆమెకు సహాయులై నిలిచిరి. అంతట నామె తన యింటితలుపుల నెల్ల మూయించి చెట్లను రాళ్ళను తెచ్చిదారికి అడ్డముగా వేయించి త్రుప్పుపట్టిన ప్రాతతుపాకులను తీసి మగవారికిచ్చి మహారాష్ట్ర సైన్యములు తన యింటిపైన బడినప్పుడు వారితో యుద్ధము చేయుటకు సిద్ధపడెను.

ఆ యూరిలోని జనమిట్లు పారిపోయిన వారు పోగా మిగిలినవారు మహారాష్ట్ర సైన్యమునకు లోబడి వారిదోపిడికి అవమానములకును తలయొగ్గిరి. పాడుపడిన యీ ఇండ్లగుంపు నుండి మాత్రము తిరస్కారము ప్రతిఘటనము తుపాకిగుండ్లు వచ్చుట చూచి మహారాష్ట్ర దోపిడిగాండ్రు ఆశ్చర్యపడిరి. చాలావఱకు పాడుపడియున్న యీ యింటిని సులభముగా నేల మట్టము చేయవచ్చునని వారనుకొని దానిని ముట్టడించిరి గాని అందులోనుండి వచ్చిన తుపాకిగుండ్లు తగిలి తమలో కొందరు మరణించుట చూచి వారు ముందువెనుక లాలోచించుచుండిరి. ఈ విచిత్రమును గూర్చి మహారాష్ట్ర సైనికులు చెప్పుకొనుట వలన నీ సమాచారము మహారాష్ట్ర సర్వసేనాని చెవినిపడెను. ఆయన విచారించగా పూర్వము గొప్ప సేనాధిపతిగా నుండిన యొక మొగలాయి వీరుని భార్య దారిద్ర్యము ననుభవించుచు పారిపోవుటకు ధనములేక తన పాడుఇంటిలోనే యుండి దోచుకొన వచ్చిన మహారాష్ట్ర సైనికులను ప్రతిఘటించుచున్నదను సంగతి తెలిపెను. అంతట సద్ధర్ముడైన మహారాష్ట్ర సర్వసేనాని ఈమెయొక్క శీలమునకును ధైర్యమునకును మెచ్చుకొని తన సైన్యములోని వారెవ్వరు నామె నేవిధముగను బాధింపరాదని శాసించి ఆమెకు దయాపూర్వకమైన జాబునంపి దక్షిణాపథమున తయారైన విలువగల కొన్ని అమూల్యాంబరముల నామెకు కానుకగా పంపుటయేగాక తన సైన్యములెల్ల ఆప్రాంతముల నుండి వెడలిపోవువఱకును ఆమె యింటిదగ్గర కావలియుండి ఎవ్వరివలనను ఆమె కెట్టి యిబ్బందియు కలుగ కుండునట్లు రక్షించవలసినదని చెప్పి కొందరు రక్షక సైనికులను బంపెను. తన సైనికులుగాని సైన్యముతో వచ్చువారుగాని ఆమెకేదైన హాని కలిగించినచో కఠినముగ శిక్షింతుననియు ప్రకటించెను. ఇంక తన వారివలన గ్రామస్థులకెట్టి యిక్కట్లులు కలుగకుండునట్లు చేయుటకు తన సైన్యముయొక్క దారిని తప్పించి, కొండ ప్రదేశములలో నుండి ప్రయాణము సాగించెను. పేష్వాబాలాజీరావుగారి కావలివారు ఆయన చెప్పినట్లు సైన్యమంతయు సాగిపోవువరకు నావీరవనిత యింటిదగ్గరనేయుండి ఆమె సెలవుదీసికొని తమ ప్రభువు దగ్గరకు పోయి చేరిరి. ఆయన మహారాష్ట్ర సేనలు అడవులు, కొండలు

దాటి కొన్ని దినములు ప్రయాణముచేసి బీర్భూము దగ్గర విశాలమైన మైదానపు భూములలో మూర్షిదాబాదు దగ్గర విడిసెను.

ఇంతలో రఘోజీభోంస్లే కూడా తన సైన్యముతో మూర్షిదాబాదు వైపునకే వచ్చివిడిసెను. ఇట్లు వంగరాష్ట్రము రెండు గొప్ప మహారాష్ట్ర సైన్యముల కోరలలో చిక్కెను. అలీవర్దిఖానులు మహారాష్ట్ర సర్వసేనానిని గంగాతీరమున కలసికొని అయనకు కొన్నిమర్యాదలు చేసి రఘోజీని పారదోలమని కోరెను. అజీమాబాదు (పట్నా) పరగణానుండి తమకు చెల్లవలసిన "చౌతును" చెల్లించువఱకును తన మహారాష్ట్ర సైన్యములు వంగరాష్ట్రమును వదలిపోవుటగాని వారికి సహాయము చేయుటగాని జరుగదని బాలాజీరావుగారు నిష్కర్షగా చెప్పెను. సొమ్ము యిచ్చినతరువాత నతడు రఘోజీ నోడించి పంపివేసెను. ఇది యంతయు 1741లో జరిగెను*.

ఈ బాలాజీరావుగారే పునహా శ్రీమంతుడనియు 'నానాసాహేబు' అనియు ప్రసిద్ధిజెంది మహారాష్ట్ర సామ్రాజ్యమున కధీశుడైన పేష్వా బాలాజీరావుగారు.



# 8. గొల్ల హంపన్న

వెల్లింగ్టను నుండి శికందరాబాదుకు పోవుచున్న ఇంగ్లీషు సైనికుల పటాలమొకటి 1893వ సంవత్సరము అక్టోబరు నెల4 వ తేదీన ఉదయము గుంతకల్లు రైలుస్టేషను చేరినది. ఆ సైనికులను ఇంకొక రైలులోని కెక్కించి పంపవలసి యున్నందున వారిని రైలుస్టేషనుకు కొంత దూరములోనున్న విశ్రాంతి స్థలమునకు బంపిరి. అది ఒక మిలిటరీ బంగాళా, ఇప్పుడు రహదారీ బంగళాయున్నచోటున నుండెడిది. ఆ సాయంత్రము సైనికులు సాధారణముగా సాయంసమయమున పుచ్చుకొను బీరు అను సారాయమును పుచ్చుకొని కాబోలు కొంతమంది సైనికులు షికారు బయలుదేరి తిరుగసాగిరి.

రైలుస్టేషను దగ్గరనుండి గుంతకల్లు గ్రామమునకు పోవుబాట, ఈ సైనికులు దిగిన మిలిటరీ బంగాళా ప్రక్కనున్న పొలములలో నుండియే పోవును. ఆ సమయమున గుగ్గిళ్ళమ్ముకొని జీవించు వయసు మళ్ళిన గొల్ల స్త్రీ యొకతెయు, తనజొన్న చేనుకు కావలియుండి ఇంటికి తిరిగిపోవుచున్న పాతికముప్పది సంవత్సరముల వయస్సుగల లింగధారి కాపుస్త్రీ యొకతెయును ఆ బాటవెంట నడుచుచు ఊరిలోనికి పోవుచుండిరి. వారీ సైనికులున్న మిలిటరీ బంగాళాను దాటి కొంత దూరము పోవునప్పటికి యువకులైన అరుగురు సైనికులు వారిని వెంబడించుచున్నట్లు వారు కనిపెట్టి భయపడి వడివడిగా నడువసాగిరి. అంతట వారిని వెంబడించుచున్న ఆ సైనికులును వేగముగా నడువసాగిరి. ఇది చూచునప్పటి కాస్త్రీల ప్రైప్రాణములు పైకిపోయి ఆ బాటమీదనున్న రైలుగేటు దగ్గరకు పరుగెత్తి అక్కడ గేటు కావలివాడైన గొల్ల హంపన్న శరణుజొచ్చిరి.

---

* Sir Mutaqherin Vol. I pp 399 – 1.

హంపన్న ఈ స్త్రీలను రైలుగేటు దగ్గరనేయున్న తన చిన్నగదిలోనికి పోయి తలుపు వేసికొనుడనెను. వారట్లుచేసిరి. అంతట సైనికులు నక్కడకువచ్చి ఆ గది దగ్గరకు వెళ్ళి దాని తలుపును బలవంతముగా తీయుటకు ప్రయత్నించిరి. కాని ఆగది రాతితో కట్టబడి దాని తలుపు ద్వారబంధములు గట్టివైనందువలన ఆసైనికులు తమ 'బూట్సు' కాళ్ళతో తన్నినను అదిరాలేదు. ఈదౌర్జన్యమును మానుడని హంపన్న యాసైనికులకు సౌంజ్ఞచేసి వారిని వారింప జూచినాడుగాని వారది పెడచెవినిబెట్టిరి. అంతట హంపన్న అక్కడ చిక్కుడుతీగె నెక్కించుటకు పాతిన వెదురుకర్రలలో నొకటి తీసి దానితో నా సైనికులను కొట్టెదనని బెదిరించెను. అప్పుడా సైనికులు వెనుదిరిగి నడవసాగిరికాని అందులో నొకడు తన నడుము దగ్గర నుంచి ఒక చిన్న 'రివాల్వరు' తుపాకినిదీసి హంసన్న వైపునకు బారుచేసి కాల్చెను. ఆతుపాకి గుండువచ్చి హంపన్న కుడితొడలో దూరినది. హంపన్న దెబ్బతిని రైలు దారి దగ్గర పడిపోయినాడు. అంతట సైనికులు తత్తరపడి తమ మిలిటరీ బంగళా దగ్గరకు పారిపోయిరి. తుపాకి ప్రేలిన చప్పుడును మనుష్యుని యార్పునువిన్న యొక రోడ్డు మేస్త్రీయును మరికొందరును రైలుగేటు గదిలో తలదాచుకొన్న అయిద్దరు స్త్రీలును కేకలువేయుచు హంపన్నకు సహాయపడుటకు పరుగెత్తికొని వెళ్ళిరి.

ఈ తుపాకి ప్రేలుడు విని రైల్వేపోలీసు వారు అక్కడకువచ్చిరి. హంపన్న చాలా నీరసస్థితిలో నుండెను. ఆరాత్రియే ఆ సైనికుల పటాలము నింకొక రైలులోనెక్కించి శికందరాబాదు పంపివేయుదురు గనుక హంపన్నను అస్థితిలోనే మోసికొనిపోయి రైలుస్టేషను ప్లాటుఫారము మీదా నొక కుర్చీలో కూర్చుండబెట్టి సైనికులను వరుసగా నతని ముందు నడిపించి తనను కాల్చిన సైనికుని గుర్తింపుమనిరి. కాని హంపన్న తానున్న నీరసస్థితిలోను బాధలోను తన నెవరు కాల్చినారో గుర్తించలేకపోయెను. హంపన్న వ్యవహారమింకను అపాయస్థితిలోనికి దిగినది. అంతట అతనిని గుత్తికి తీసికొని వెళ్ళిరి. అక్కడ కర్రాపీట్ (Carrapiett) అనుపేరుగల ఒక ముదుసలి మిలిటరీ అసిస్టంట్ సర్జన్‌గా రతనికి కొంత చికిత్స చేయుటకు ప్రయత్నించినారు. కాని లాభము లేకపోయింది హంపన్న చనిపోయినాడు.

తుపాకిగుండు ఎక్కడ నున్నదోయని కోసిచూడగా నదియతని పొత్తికడుపు క్రింద గజ్జదగ్గర లోపల (groin) నున్నది. దానిని బయటకు తీసి హంపన్న శవమును పూడ్చిపెట్టినారు. పైన చెప్పిన మిలిటరీ డాక్టరు కర్రాపీట్‌గారు టెన్నిసుబంతి ఆటస్థలమున నీసంగతిని తన స్నేహితులతో చెప్పుచుండగా గుత్తిలో వకీలుగా నుండిన శ్రీపత్తి కేశవపిళ్ళగారు విని ఈ వృత్తాంతమును హిందూపత్రికకు పంపిరి. ఈ చిత్రకథను అప్పటి ప్రభుత్వ సభ్యులైన స్టోక్సుగారు జూచి దీనినిగురించి సమగ్రముగా విచారించవలసినదని యుత్తరువు చేసిరి.

చెన్నపట్టణముననుండు పోలీసు డిప్యూటీ ఇనస్పెక్టరు జనరల్‌గారు వెంటనే గుంతకల్లుకు పోయి ఈ విషయమై విచారణచేయుట ప్రారంభించిరి. బ్రహ్మాజెముడు ముండ్ల కంపలనెల్ల తొలగించి చుట్టుప్రక్కలనున్న నీటిగుంటలలోని నీటినెల్ల తోడించి తుపాకి యెక్కడనైనను దొరకునేమోయని వెదికించిరి. అప్పుడు శ్రీమాదిరెడ్డి పాపారావు నాయుడుగారు గుత్తిలో పోలీసు ఇనస్పెక్టరుగానుండిరి. వీరును పోలీసు సూపరింటెండెంటు

గారైన ములాలీగారును హంపన్న పొత్తికడుపులో నుండి తీసిన తుపాకి గుండు పుచ్చుకుని ఆచూకీ తీయుటకు శికందరాబాదుకు పోయిరి. వెల్లింగ్టన్‌లో చేయబడిన దర్యాప్తు వలన ఒక సైనికుడొక రివాల్వరు తుపాకి నొక యంగడిలో కొనినట్లు బయల్పడెను. ఆ సైనికుడు శికందరాబాదు పటాలముతో పోయినట్లును తేలినది. అంతట శికందరాబాదులోని పటాలములో నాసైనికుని పట్టుకొనగా నితడు గుంతకల్లులో రైలుగేటు కావలివానిపైన తాను తుపాకిపేల్చినట్లు ఒప్పుకొనెను. గాని ఆ "నేటివు" (దేశీయుడు) తనను తనతోడి సైనికులను ఒక పెద్దకఱ్ఱతో కొట్టవచ్చెననియు అందువలన ఆత్మరక్షణ నిమిత్తము తానతనిపైన తుపాకిని కాల్చితిననియు ఆసైనికుడనెను. అప్పటికా వ్యవహారమంతయు జరిగి ఒకనెల దాటిపోయినను ఆసైనికులలో నిద్దరు ముగ్గురు వీపులపైన కఱ్ఱదెబ్బల చారికలింకను తనకు కనబడినవని సూపరింటెండెంటుగారు సెలవిచ్చిరి!

ఆ గేటు కావలివాడొక తార్పుడుగాడనియు ఆ స్త్రీలలో చిన్నదానికి గాను వాడొక రూపాయి అడిగినాడనియు తాము నాలుగణాలను మాత్రమిచ్చెదమంటి మనియు ఈబేరముతెగక ఆపెనగులాటలో వాడొక పెద్దకఱ్ఱను చేతపట్టుకొని వచ్చి వారు వెళ్లిపోవుచుండగా వారి వీపులపైన కొట్టినాడనియు నీసైనికుల పక్షమున వాదింపబడెను. ఈ ఒప్పుదలతో ఈ వాదన సంజాయిషీలుకూడా శికందరాబాదులోనే లిఖిత మూలమును చేసి ఆ ముద్దాయిని రెండవతరగతి రైలుబండిలో నెక్కించి జిల్లా మేజిస్ట్రీటుగారైన మానవేన రాజాగారి ఎదుట హాజరుపరిచిరి.

ఈలోపుగా నీ యిరువురు అసహాయస్త్రీల మానములను రక్షించుటకు సాహసించి తన ప్రాణములను గోల్పోయిన ఈ బీదగేటుకావలివాని స్మారక చిహ్నము నొకదానిని ప్రజలు నెలకొల్పుట యుక్తమని హిందూ పత్రికయందొక సూచన గావింపబడెను. సూచన చేయబడుటయే తడవుగా చెన్నపట్టణములోని రాజధాని కళాశాలలో ఆచార్యులుగా నుండి ప్రఖ్యాతివడసిన ప్రొఫెసర్ పి.రంగనాధ మొదల్యారు, ఎం.ఏ గారును, ఐ.సి.ఎస్ శాఖలో పనిచేయుచున్న ఉదారుడైన ఒక ఆంగ్లేయ జిల్లాజడ్జిగారును, బళ్లారి జిల్లాలోని సభాపతి మొదాల్యారుగారును విరాళములను వేసిరి. హిందూపత్రికాధిపతి ఈ విరాళములను వసూలుచేయుచు అనుదినమును విరాళములనిచ్చిన వారిపేర్లు పత్రికలో ప్రకటింపసాగెను.

ఇట్టి స్థితిలో జిల్లామేజిస్ట్రీటుగారు హంపన్నను కాల్చిచంపిన సైనికుని హైకోర్టు సెషన్సులో విచారించుటకు పంపిరి. అప్పుడు హైకోర్టు ప్రధాన న్యాయమూర్తియైన కాలిన్సుగారి ఎదుట ఆంగ్లేయులైన ముద్దాయిలకు గల ప్రత్యేకహక్కుల ప్రకారముగా ఆరుగురు ఆంగ్లేయులును ముగ్గురు దేశీయులునుగల స్పెషల్ జూరీయను ప్రమాణ పురుషుల సహాయముతో విచారణ ప్రారంభమయ్యెను. ఈ జూరీలోని ముగ్గురు దేశీయులును ఆంగ్లేయ దొరల చెప్పుచేతలలో నుండు దుభాషీలే.

విల్లీగ్రాంట్ అను ఇంగ్లీషు బారిస్టరు ప్రాసిక్యూషను తరపునను వెడర్బరన్ అను నింగ్లీషు బారిస్టరు ముద్దాయి తరపునను న్యాయవాదులుగా పనిచేసిరి. ఈ విచారణ కొన్ని దినములు జరిగెను. ఇది చెన్నపట్టణములో చాలా సంచలనము కలిగించెను. ప్రతిదినమును ప్రజలు గుంపులు గుంపులుగా హైకోర్టుకు వచ్చి విచారణను చూడసాగిరి.

ఈ సందర్భములో కాలేజీ విద్యార్థులపట్ల పోలీసు సార్జెంట్లు అమర్యాదగా ప్రవర్తించి వారిపైన దౌర్జన్యములు చేయుచున్నట్లు మేజిస్ట్రేటుల దగ్గర కేసులు దాఖలు కాబడెను.

హంపన్న హత్యకేసులో విచారింపబడిన స్త్రీల నిరువురను వెడర్బురన్ గారతి చతురుతతో అడ్డునవాళ్ళు వేసి క్రాసుపరీక్ష చేసిరి. ఈ స్త్రీలలో నొకరైనా గేటు కావలివాడు సైనికుల కమ్మజూపెనని చూపుటకు ముద్దాయి పక్షమున పనిచేసిన న్యాయవాది ప్రయత్నించెను. ఒకవేళ నిది నిజమేయని యంగీకరించినను ఈ నేరమును చేయుటలోని ఘోరమునిది యేమాత్రమైన తగ్గింపగలదాయని యొక ఇంగ్లీషు ఉద్యోగియే అనినాడు.

హంపన్న యొక రూపాయి అడిగెననియు తాము నాలుగణాలకన్న ఎక్కువనివ్వమని అంటిమనియు, చనిపోయిన హంపన్న యొక పెద్దబడితను పుచ్చుకొని తమ్ముకొట్టి చంపవచ్చెననియు అంతట ముద్దాయి ఆష్ (ash) తన రివాల్వరు తుపాకిని దీసి ఆత్మరక్షణము కొరకు హంపన్న పైన గాల్చెననియు ముద్దాయి తోడిసైనికులు ముగ్గురువచ్చి సాక్ష్యమిచ్చిరి.

హంపన్న కేవలము తార్పుడుగాడని ముద్దాయి పక్షమున జేయుబడిన వాదనను గూర్చి గట్టిగానొక్కి చెప్పుచు ప్రధాన న్యాయమూర్తి జూరీసభ్యులను హెచ్చరించెను. ఒక మైదానములో నుండి పోవు బహిరంగమైన రాజబాటమధ్య రైలుగేటు దగ్గర నున్నట్టియు, పైకందరకును కనబడునట్టియు గదిలో నాచిన్న వయస్సుగల వితంతువును గేటు కాపలావాడా సైనికులకు తార్చుటకు బ్రయత్నించెనను ముద్దాయి వాదనను న్యాయమూర్తి జూరీసభ్యులకు విన్నవించెను. గాని ఈ చిన్నవితంతువుతో పాటు ఆ కుటీరములోనికి జొరబడి తలుపువేసికొనిన ముదునలి గొల్లదాని సంగతినిగూర్చి మాత్రము న్యాయమూర్తిగారు ఏమియు చెప్పకయె వదలెను! అంతట జూరీసభ్యులు ముద్దాయి నిర్దోషియని తీర్మానించిరి.

న్యాయముగా వదిలివేయుగూడని ముద్దాయిలను వదలివేయుచు భారతదేశ న్యాయస్థానములలో తీర్మానింపబడిన అసంఖ్యాకములైన కేసులన్నింటిని జేర్చి యొక బంగాళీ ప్రముఖుడొక గ్రంథమును ప్రకటించినాడు. అట్టి కేసులజాబితాలో నీ కేసుకూడా చేరినది. ఈతీర్పు చాలాబాగున్నదని మద్రాసు మెయిలుపత్రిక తన సంతోషమును వెలిబుచ్చినది. ఇది కేవలము జాత్యభిమానమునుబట్టి కలిగిన పక్షపాత బుద్ధికి యుదాహరణముగా నున్నదని హిందూపత్రిక వగచినది.

ఈ కేసు విచారణ పూర్తియైన యిరువదినాలుగు గంటలలో నొక ఇంగ్లీషు విలేఖరి న్యాయస్థానములో జరుగు విచారణ యొక ప్రహసనమని అతితీవ్రముగా విమర్శించినాడు. దీనిని గూర్చిన చర్చలు కొంతకాలము చెలరేగెను. ఈ బీదహంపన్న తార్పుడుగాడని ఆంగ్లేయులు చేయుప్రచారమునకును, హంపన్న సాహసౌదార్యములకు మెచ్చుకొని అతని స్మారక చిహ్నమును నెలకొల్పదలచిన వారిని జూచి వారు చేయు హేళనమునకును వీరు జంకలేదు.

హంపన్న యొక్క నీతినిగూర్చియు, ఒక నిరపరాధియైన స్త్రీయొక్క శీలమును గూర్చియు చేయబడిన అసత్యకల్పనమునకు పరిహారముగా గుంతకల్లు గ్రామజనులును

ఆ చుట్టుప్రక్కల గ్రామముల జనులును పవిత్రమైన కార్యమని హంపన్న స్మారక చిహ్నమును నెలకొల్పుటకు తమ యథాశక్తిని తోడ్పడదలచి విరాళము లివ్వసాగిరి.

"గుంతకల్లు విశ్రాంతి శిబిరముదగ్గర ఐరోపా సైనికుల బారినుండి ఇరువురు స్త్రీలను రక్షించుటలో నొక సైనికుని వలన 1893 అక్టోబరు 4వ తేదిన తుపాకితో కాల్చబడి 5వ తేదిన ప్రాణములను బాసిన గొల్ల హంపన్న అస్థిక లిక్కడ భూస్థాపితము చేయబడినవి" అను అక్షరములు చెక్కబడిన నల్లరాతిఫలకమును హిందూపత్రికా వ్యవస్థాపకుడు పూనమల్లి క్వారీలో తయారు చేయించి గుత్తికి పంపెను. ఈస్మారక చిహ్నమును నెలకొల్పుటకొరకు స్మారకసంఘమువారు తొమ్మిది చదరపుటడుగుల స్థలమును విక్రయముపొంది హంపన్న అస్థికలను ప్రోగుచేసి ఆస్థలములో పాతిపెట్టించి, దానిమీద పైన చెప్పిన ఏడడుగుల ఎత్తుగల రాతిఫలకమును నిలువబెట్టి రాతితోను సున్నముతోను గట్టిగా బిగించికట్టి ఆ సమాధిస్థలము చుట్టును అవరణగోడను కూడా కట్టించిరి.

ఈపని ఇంతపట్టుదలతో నింత చక్కగా జరుగుట అధికారులకు కొంచము కష్టమనిపించెను. ఈ స్థల విక్రయము నేలాగునైనను రద్దుపరిపించవలెనని చూచిరి. కాని స్మారక చిహ్నమును నెలకొల్పుటకే ఆస్థలము విక్రయము పొందబడుచున్న సంగతి విక్రయ దస్తవేజులో స్పష్టముగా నుదాహరింపబడి యుండినందువలన నేమియు చేయలేకపోయిరి.

పోలీసు డిప్యూటీ ఇనస్పెక్టర్ జనరలును సూపరింటెండెంటుగారైన లెగ్గట్ గారును వచ్చి ఈ స్మారక చిహ్నమును చూచి ఆయూరి పోలీసు ఇనస్పెక్టరుగారి మీదను ఇతరుల పైనను చాలా ఆగ్రహమును జెందిరి. ఈస్మారక చిహ్నమునకొక ఫోటోగ్రాపు దీయించి దానిని తీసివేయుటకు ఉత్తరువులు జారీజేయువలసినదని సిఫారసు చేయుచు చెన్నపట్టణ ప్రభుత్వమువారికి వ్రాసిరి. *

ఈ విషయములో పోలీసువారు చేసిన గడబిడనుగురించి శ్రీ కేశవపిళ్లగారు హిందూప్రతికలోను మద్రాస్ స్టాండర్డు పత్రికలోను వ్రాసిరి.

నూట ఎనిమిదిమంది బంధువుల కృష్ణారావుగారని ప్రఖ్యాతిని వహించిన ధార్వాడ కృష్ణారావుపంతులు గారప్పుడు జిల్లా శిరస్తాదారుగానుండెను. అయన ఈ గుత్తివిలేఖరియైన కేశవపిళ్ళగారిపైన ఇండియన్ పీనలుకోడ్డు 124 A సెక్షనుక్రింద రాజద్రోహనేరమును మోపవలసినదని జిల్లాకలెక్టరైన మానవేదన రాజుగారికి చెప్పిరి. గాని ఒక ఉత్తమ పురుషుని, కృపవలననట్లు జరుగులేదు. మద్రాసు గవర్నరైన వెన్లకుగారి ప్రభుత్వమువారు, హంపన్న స్మారక చిహ్నమును ఏమియు చేయవలదని ఉత్తరువు చేసిరి. ఈ విషయమైన కేశవపిళ్ళగారు, కలెక్టరు గారితో జరిపిన ఉత్తర ప్రత్యుత్తరములు 1896వ సం. ఆగష్టు 24వ తేదితో ముగిసెను.



* The last Fifty Years-My Reminiscence, by Dewan Bahadur P.Kesava Pillay. The Hindu Golden Jubilee Number, 1928. p 18.

# 9. 'పాదుషా బేగం'

క్రీ.శ 1842-1847 మధ్య అయోధ్యరాజ్యము నేలిన అంజిద్ ఆలీషాగారి 'పాదుషాబేగం' అనగా పట్టమహిషిని ఆంగ్లేయ గ్రంథకర్తలు 'జనాబ్ ఔలియాబేగం' అనిగాని ఆమె పూర్తి పేరుయైన 'మనిక్కెష్వర్ బహుసర్ ఫక్రుల్‌జమది నవాబ్ తాజ్ అరాబేగం.' ఈమె కల్పిప్రభువైన హసినుద్దీన్‌ఖాన్ గారి కొమారిత. ఢిల్లీ రాజవంశీయుల యాడుపడుచు. ఆమె అరబ్బీ ఫారశీ భాషలయందు మంచి విద్వాంసురాలు.

'పాదుషాబేగం' గారి యంతఃపురము చాలసుందరమైనది. ఆమె కూర్చుండు సభాభవనము (హాలు) లోపలి కప్పునకు అందమైన రంగువేయబడినది. గోడలకు నిలువుటద్దములు కట్టియున్నవి. గోడల మొత్తలకు బంగారు మొలాము చేయబడియున్నది. పై కప్పునుండి విలువయైన క్రొవ్వువత్తులుంచు పంగల దీపములు (Chandliers) వ్రేలాడుచుండెను. గదిలో నొక పెద్ద రత్నకంబళము (తివాచి) పఱచియుంచిరి. దాని మధ్యనొక తెల్లని వస్త్రమును పఱచిరి. ఈ తెల్లనిబట్టపైన నొక్కప్రక్క విలువయైన చిన్న తివాచి యొకటి వేయబడినది. దానిమీద మెత్తని పరుపులున్నవి. వెనుక ప్రక్క ఆనుకొనుటకు అంచుల చుట్టును దట్టముగా జరీకుట్టిన పెద్ద దిండొకటి యుండెను. ఆ పరుపు మెత్తలపైన బంగారు జరీ పువ్వులుకుట్టబడిన ఎఱ్ఱమొఖమల్ గుడ్డ వేయబడియుండెను. ఆ మస్నదు పైన గుండ్రని ఆపెద్దదిండు నానుకొని రాణిగారు హుక్కాత్రాగుచు కూర్చుండియుందురు.

లేతరంగు జిలుగువలువలన్న రాణిగారికి చాలాప్రీతి. ఆ వస్త్రములు అందమైన బుటేదారి పనితనము కలవి. ఆమె ముక్కుపుడకలను చెవులకు పోగులను చేతులకు పలువిధములైన గాజులును కాళ్ళకు అందెలను, బంగారుతో చేసి నవరత్నములు పొదిగిన ఇతర అమూల్యాభరణములను ధరించును.

రాణిగారు మంచి అంగసౌష్టవముగల అందకత్తె. బంగారువంటి పచ్చనిచాయ గలిగి కొంచెము బక్కపలుచగా నుండు శరీరము గలది. ఆమె ఎక్కుడు పొడగరికాదు. ఆమె పెద్దకన్నులు చాల కాంతివంతములైనవి. ఆమె తలవెండ్రుకలు నల్లని నలుపు రంగుకలవి కావు; నల్లగా ముదురువేపు గల గోధుమరంగువై యుండెను. ఆమె చేతులును కాళ్ళును చాల చిన్నవై నాజూకుగానుండెను. తరువాత కొంత కాలమున కామె కొంచెము స్థూలశరీరగా మారెను.

అంజిద్ ఆలీషాగారి కాలమున ఆయనయొక్క పట్టమహిషియైన ఈ రాణిగారు చాల సౌఖ్యము ననుభవించెను. ఆమె ఆయనయొక్క అనురాగమునకు పాత్రురాలై యుండెను. చాలకాలము తరువాత ఆయన రెండవ భార్యను పెండ్లాడెను. అంతట పట్టమహిషికి కోపమువచ్చెను. మొదట నీ రెండవ వివాహము సంగతి యామెకు తెలియునేలేదు. తరువాత కొంత కాలమునకు తెలియగా నామె రాజుగారికి మూడు దినములు దర్శనమివ్వక అన్నముతినక, మాటలాడక దుఃఖింపసాగెను. అప్పుడు ప్రధాన మంత్రియైన వజీరుగారును ఇతర ఉద్యోగులును వచ్చి, ఆమె ఇంకనిట్లు పట్టుబట్టినచో

అయోధ్య రాజ్యమునకే ముప్పువచ్చుననియు రాజుగారింకొక రాణిని పెండ్లాడినను తామే పాదుషాబేగం లేక పట్టమహిషిగా నుందురనియు, తమగర్భవాసమున జన్మించిన వజిద్ అలీగారే యువరాజుగా నుండి పెద్దరాజుగారి యనంతరము రాజు కాగలరనియు, అప్పుడు కూడా రాజమాతగా తమ గౌరమున కేకొఱతయు నుండదనియు విన్నవించి బ్రతిమాలిన పిమ్మట ఆమె తన పట్టు విడిచెను.

పట్టమహిషి చాల ఉత్తమురాలు, మంచి భగవద్భక్తికలట్టిది. ఈమె భర్తయందుగాని కొమారుని యందుగాని ఏలోపములున్నను వారెట్లు ప్రవర్తించినను, ఈమెలో మాత్రము తప్పు పట్టతగిన వంకలేదు.

లక్నో నగరమునగల చత్తర్ మంజిల్ అను అంతఃపురముపైన నీరాణిగారికి చాలప్రీతి. ఈ దివ్యభవనమునందొక బంగారు మొలాముచేసిన గొప్ప ఛత్రముండి నందు వలన దానికాపేరు వచ్చెను. రర్హత్‌బక్ష్ 'ఆనందదాయిన' అను రాజనగరుకు దగ్గరగా జనానావారి కొఱకిది నిర్మింపబడెను. లక్నోలో చౌలకి రాజమందిర మను నింకొక అంతఃపురమును ఈమె వేసవికాలమున నివసించుచుండును. లక్నోనగరమునకు దూరముగా నొక తోటలోనుండిన ద్వారకదాస్ తోట ఇంటిలో వర్షకాలమున నివసించును.

చత్తర్‌మంజిల్‌లో నున్నప్పుడామె రవాకులు (Venetians) తలుపులుగల కిటికి దగ్గర కూర్చుండి రవాకుసందులనుండి గుంతీ నదివైపునకును రాజబాట వైపునకును జూచుచు కాలక్షేపముచేయును. ఆదారిని పోవు దురదృష్ట స్త్రీలను పిలిపించి వారికేదైన నిచ్చి ఓదార్చి పంపుచుండును.

ఒకమారామె వరదలై పొంగిపొరలు నదివైపునకు చూచుచుండగా నందులో నొక తాటియాకుల యింటికప్పు కొట్టుకొని పోవుచుండుట దానిని పట్టుకొని యొక ముదుసలి స్త్రీ కొట్టుకొని పోవుచుండుట, యామె కంటబడెను. అంతట నామె పరిచారికయైన ఎలిహూ జాన్‌ను పిలిచి "ఒక ముదుసలిది నదిలో కొట్టుకొని పోవుచున్నది, సేవలకును పిలిచి ఆ స్త్రీని బయటకు తీసి ఇక్కడకు తీసికొనిరమ్మనుము"అని ఆజ్ఞాపించెను. అంతట నాపరిచారిక పరుగెత్తికొని పోయి సేవకులను పిలిచి రాణిగారి యాజ్ఞను దెల్పగా వారు పోయి యాముదుసలిని దానిని రక్షించి తెచ్చి రాణిగారి సమక్షమున నిలిపిరి. రాణిగారామె సంగతి నడుగగా నామె తానొక బీదరాలననియు తన కెవ్వరును లేరనియు చెప్పెను. అంతట రాణిగారామెకు నెలకు మూడు రూపాయల ఉపకార వేతనము నేర్పాటుచేసి పంపిరి. ఆ ముదుసలిది రాణిగారిని దీవించుచుపోయి చాలాకాలము సుఖముగా జీవించెను. లక్నో నగరములోని ప్రజలీమెను చూచినప్పుడెల్ల 'నదిలో కొట్టుకొనిపోయిన ముసలిది' అని యనుచుండిరేగాని ఆమెపేరు ఎవ్వరికిని తెలియదు. అయోధ్య ఇంగ్లీషువారి వశమైన తరువాత నీమెగతి ఏమైనదో ఎవ్వరు నెఱుగరు. రాజాధిరాజులు రాజ్యములు గోల్పోవు చుండగా నీదిక్కులేని దానిని గూర్చి యోజించువారెవరు?

లక్నో వెలవల తోటలోని రాజమందిరము కూడా చాలా అందమైనది. వర్షకాలములో వర్షము వెలసి చల్లగానున్న సమయమున రాణిగారు నూరుగురు స్త్రీ పరివారజనముతో అతోటలోని బాటలలో విహరింప బోవుచుందురు. అప్పుడక్కడి చెట్లను పువ్వులను చూచి యామె యొక చిన్న పిల్లవలె సంతోషించుచుండును.

## నిత్య జీవనము

రాణిగారు ప్రతిదినము ఉదయము పది పదునొకండు గంటలకు నిద్ర-మంచమునుండి లేతురు. లేవగానే పరిచారిక లామెకు దంతధావనముచేసి ఆమె చేతులను కడుగుదురు. అంతట ఆమె కొంచెము గోధుమరొట్టెయు పాయసమును పుచ్చుకొందురు. తరువాత నామె తన పెద్దగదిలోనికి పోవగా నక్కడ 'ముల్లా' యను షియా మహమ్మదీయ మతాచార్యుడు ఒక తెర యవతల కూర్చుండి ఖొరాను చదువును. ఆమెభర్త చనిపోయిన తరువాత రాణిగారు స్వయముగానే ఖొరాను చదువుచుండును. రాణిగారు బాగుగా చదువుకొన్న స్త్రీ ఆమె మాట లామె వైదుష్యమును తెలుపుచుండును.

వేసవికాలములో మధ్యాహ్న భోజనమునకు ముందుగ నామె కొక చల్లని పానీయమును తెచ్చియిచ్చుచుందురు. ఇది ఉశిరికకాయ మొదలైన ఊరవేసిన ఫలముతోను మంచి ముత్యముల భస్మముతోను తయారుచేయు షరబత్తు. రాణిగారు దుస్తులు వేసికొని 'మస్నదు' మీద కూర్చుండియుండగా మధ్యాహ్న భోజనమును తెచ్చి వడ్డింతురు. ఆమె యాహారము నామె వంటకత్తెలే యామె సువారములోనే తయారుచేయుదురు. రాజుగారి భోజనమును ఆయన సువారములో వారి వంటవాండ్రు తయారుచేయుదురు. అప్పుడప్పుడు రాజుగారు మధ్యాహ్న భోజనమునకు రాణిగారి అంతఃపురమునకు బాజా బజంత్రీలతో తరలివత్తురు. అప్పుడాయన వంటవాండ్రు వండిన వంటకములను వెండి పళ్ళెరములతో నిక్కడకి తెచ్చి యప్పగింతురు. కోటలో ప్రతిదినము రెండుజాములైన తరువాత 12 గంటలకొక ఫిరంగిని పేల్చుచుందురు. అదియే మధ్యాహ్న భోజన సమయము. ప్రతిదినము సూర్యాస్తమయమునగాని అది దాటినతరువాత గాని రాత్రి భోజనము చేయుదురు. అప్పుడు కూడా మధ్యాహ్నమువలెనే మూడురకముల పలావులు, కుర్మాలు, "కబాబ్"లను వేయించిన మాంసపు ముక్కలు, మేకమాంసముతోగాని గొఱ్ఱె తలకాయతో గాని కాచిన పులుసులు, రకరకముల కాయగూరలు, మిఠాయిలు మొత్తము ఇరువది ముప్పది రకముల వంటకములుండును. రాణిగా రెప్పుడును చెంచాలతోనే తిందురుగాని చేతివ్రేళ్ళతో కలుపుకొని తినరు. భోజనము కాగానే ఆమె హుక్కా పీల్చుచుందురు.

హుక్కా అనేక సుగంధద్రవ్యములతో తయారుచేయుదురు. దీనికి ప్రత్యేకముగా నొక సేవకురాలుండెను. రాజుగారిని గాని రాణిగారిని గాని దర్శింప దలచువారు. చక్కగా తయారైన హుక్కాను పీల్చి ఉత్సాహముగా నున్న సమయమున వారిని దర్శించిన చాలమంచిది. హుక్కా బాగుగలేనప్పుడు వారికి ఉత్సహముగాని మనశ్శాంతిగాని ఉండదు.

రాణిగారు పండుకొనబోవునప్పుడు సర్వసాధారణముగా నామెకు కథచెప్పు నామె యొకర్తె పడకగదిలో తెరవెనుక కూర్చుండును. ఆమెకు నిద్ర రావలెనన్నచో మొదలు తుదియులేని అతిదీర్ఘములైన కథలను చెప్పును. ఆమెకు వినోదము కలిగించి ఆనందోద్రేకములను కలిగింపవలెనన్నచో కథకురా లందుకు తగిన వినోదకథలను

చెప్పును. ఆమె రాత్రి చాల సేపటి వఱకును కథలు చెప్పుచుండును. కథబాగున్నచో నామెకు బహుమాన మివ్వబడుచుండును. అందువలన నామె ఎప్పటికప్పుడు క్రొత్తకథలను నేర్చుకొని వచ్చుచుండును. ఇట్లు కథలు చెప్పువారు రాణిగారి రాజనగరులో నలుగురు స్త్రీలుండిరి. కథ మొదలుపెట్టగానే పరిచారికలు మారుదురు. కథపూర్తియైన తరువాత మఱల నింకొక జట్టుమారుదురు. రాణిగారికి కథలన్న చాలప్రీతి. ముఖ్యముగా మత సంబంధములైన కథలు ఇష్టము. ఆమెకూడ కొన్ని కథలను తన పరిచారికలకు చెప్పుచుండును. కథకురాండ్రు చెప్పు కథలలో సాధారణముగా రాజులయొక్కయు రాణులయొక్కయు ప్రేమగాథలకు సంబంధించిన శృంగారకథలు, బిచ్చగాండ్రు రాజులైన కథలు, రాజులు బిచ్చకులైన కథలు, యక్ష గంధర్వ కిన్నర కింపురుషుల వంటి దేవతల కథలు, ఇంద్రసభ స్నానము సంబంధించిన కథలునుండెను.

రాణిగారు స్నానముచేయుట అంతఃపురములో చాల ముఖ్యమైన విషయము. దానికి చాల పెద్దప్రయత్నము చేయుదురు. చన్నీటి తొట్టెలలో "హమాం" అను సుగంధ ద్రవ్యమును కలుపుదురు. వేడినీటి గొట్టములలో వేడినీరు సిద్ధముగా నుండెను. తలయంటు దినమున రాణిగారును పరిచారకలును చాల ప్రయాసమును పొందుటకు సంసిద్ధులగుదురు. ఆకాలమున మన దేశములోని వారెవ్వరును సబ్బుల నుపయోగించెడు వారు కారు. సుగంధ ద్రవ్యములతో విసిరిన నున్నిపిండినే ఉపయోగించుచుండిరి. రాణిగారి చిన్నతనము నుండియు కొలువులోనుండిన పరిచారిక లిరువురు ముగ్గురు దినమొలలతో నామెకు తలయంటి పోయుదురు. ఆమె శరీరమునకు నూనెఱాచి ఆమె యొడలినిండ నున్నింపిండిని రాచిరాచి దానిని వేడినీటితో కడిగివేయుదురు. ఇట్లిరువదిసారులైనను పిండిని కడుగుదురు. స్నానము పూర్తియగు నప్పటికి రాణిగారును పరిచారికలునుగూడ అలసిపోవుదురు. అప్పటికి భోజన సమయమగును.

## రాజలాంఛనములు

రాణివాసమున ఖొజ్జాలు చాలమంది యుండిరిగాని రాణిగారికి వారియం దిష్టములేదు. ఉత్సవములందును ఊరేగింపులందును మాత్రమే ఈ ఖొజ్జాలు రాణిగారి పరివారమున హాజరుగా నుందురు. కాని రాణిగారి అంతఃపురములో స్వేచ్ఛగా తిరుగువారుకారు. స్త్రీ సైన్యము అనగా ఆయుధములు ధరించి సైనిక విధులను నిర్వర్తించు స్త్రీ పరిచారికలు రాణివాసమున ద్వారములవద్దను వసారాలలోను కావలి కాయుచుందురు. రాణిగారికీ స్త్రీ సైన్యముపైన కూడ ఇష్టములేదుకాని పూర్వాచారముల నామె తృణీకరింపక ఉపేక్షించెను. ఏనుగులు, గుఱ్ఱములు, ఒంటెలు, గుఱ్ఱపురౌతులు, అశ్వికదళము, పదాతులు, వెండికర్రలు పుచ్చుకొని నడుచు చోపుదారులు, అంగరక్షకులు మొదలైన పరివారమును డాబుదర్పములు నామెకు గిట్టకపోయినను రాజలాంఛనములు గనుక వాని నామె యంగీకరింపవలసి వచ్చెను.

రాజలాంఛనములకు సంబంధించిన పెద్దపెద్ద దుస్తులు నగలుకూడా నామెకు ప్రీతికరములుకావు ఆమెకు నాజూకు జిలుగు వలువలు అందమైన సున్నితపు టలంకారములు మాత్రమే ప్రీతికరముగ నుండెను. అందువలన గొప్పగొప్ప ఉత్సవ

సమయములందు అడంబరములైన అలంకారములు, దుస్తులు ధరించి, నప్పుడామెకు విసుగు కలిగి అదియైపోవగనే వానిని తీసివేసి ఉస్సురనుచు తన శయ్యపైన వ్రాలి విశ్రమించును.

భర్త చనిపోయిన తరువాత నామె ఎన్నడును ముక్కుపుల్లను ధరించలేదు. (మహమ్మదీయులలో నిది సువాసినీ స్త్రీలు తప్పక ధరించు నగ). తక్కిన నగలు మాత్ర మామె యుంచుకొనెను. అమె రాజమాత గనుక అమె పోవునప్పుడు బాజాభజంత్రీలు వాయించుచుండగా పరివారజనము సైనిక దళములు వెంట నడచుచుందురు.

రాణిగారికి విహరించుకొఱకు శరీర వ్యాయామము కొరకు లక్నోలోని రాజనగరుల ప్రక్కను ఎత్తైన గోడలతో మైదానములు ఉద్యానవనములు నేర్పరుపబడి యుండెను. అందులో నీరు పైకి ఎగజిమ్ము 'కారంజీలు' (Fountains), అందములైన కాసారములు, ఫలపుష్పభరితములైన చెట్లు, మంచి బాటలు, నేర్పాటు చేయబడి యుండెను. గుఱ్ఱపుస్వారి చేయుట రాణిగారికిష్టము లేదు. అది పురుషులు చేయదగినదని అమె యూహ. అమె సాధారణముగా వెండిహౌదాలలో కూర్చుని ఏనుగుస్వారి చేయును. లేదా పల్లకిలోనో తంజానులోనో కూర్చుండి పోవుచుండెను. ఈ తంజాన్ పల్లకులను ఎర్రదవాలీలు వేసికొనిన బోయీలు మోయుచుందురు.

రాణివానములో నొకగదిని ప్రత్యేకముగా భోజనము చేయుట కొఱకే వినియోగింతురు. అందులో పాశ్చాత్యపద్ధతిని ఎత్తైనబల్లలు కుర్చీలు గాక భూమిపైనసుండి కొన్ని అంగుళముల ఎత్తుగల పీటలు వేయబడి వానిపైన వెండిపళ్ళెరములందు భోజన పదార్థములు వడ్డింపబడు చుండెను.

రాణిగారు సామాన్యముగా దర్బారులో కూర్చుండు 'మస్నదు' అనగా కొంచము ఎత్తుగా అమర్చబడిన మెత్తని పరువుల పైననే వెనుకప్రక్కను బుటేదారి పనిచేసిన అందమైనదిండు నానుకొని కూర్చుండి, భోజనము చేయుదురు. అమె చేతులను, జబ్బలను ముఖమును పరిశుభ్రముగా కడుగుకొని చాల శుచిగా గూర్చుండును. భోజనపదార్థములు వడ్డించిన వెండి పళ్ళెరములుంచు పీటలుకూడా వెండితోనే చేయబడినవి. భోజనపు గదిలో నేలయంతయు విలువగల తివాచీపఱచియుండెను. గోడలకు నిలువుటద్దములు అమర్చియుండెను. పైకప్పునుండి క్రొవ్వువత్తులమర్చిన పంగలదీపములు లస్తరులు వ్రేలాడుచుండును. అంగ్లేయులు భోజనపు బల్లలపైన టేబిల్‌క్లాత్ అనునొక తెల్లని దుప్పటమును పరచుచుందురు. అయితే అయోధ్యరాజు మందిరమున నట్లుగాక భోజన సమయమున భోజనపదార్థములుంచు పీటలు మొదలైనవాని నమర్చుటకు ముందుగా ఒక తోలునుకప్పి దానిపైన దస్తర్ ఖాన్ అను దళసరి దుప్పటములు రెంటిని పఱతురు. అ దుప్పటముల పైన రకరకముల పువ్వులు నమోనాలు కుట్టబడియుండును. భోజన పరికరములన్నియు నీ దస్తర్ ఖాన్ పైననే ఉంచుదురు.

భోజనసమయమున షరబత్తులను చల్లబరచుటకు మంచుగడ్డను విరివిగా నుపయోగించు చుండిరి. హుక్కాబుడ్డిలోని నీటిని చల్లగా నుంచుటకు కూడా మంచుగడ్డ నుపయోగించు చుండిరి. రాణిగారెన్నడును మధుపానమును జేసి యెరుగరు. అమె

మత్తునెక్కించు పానీయమును దేనిని త్రాగరు. రాజుగా రితరసమయములం దేమి త్రాగినను రాణివాసమున మాత్రము షరబత్తులును, ముసల్మానులు త్రాగుట కర్హములైన పానీయములును తప్ప ఇతరములను త్రాగెడువారుకారు.

ప్రతి రాజనగరులోను పెద్దపెద్ద కచ్చేరి కావిళ్ళు (Drawing rooms) చాల ఉండెను. గదిమధ్య అపూర్వములైన దారువులతో చేసిన గుండ్రనిబల్లలుగాని చంద్రకాంత శిలతోగాని స్ఫటికములతోగాని చేయబడి వెండి బంగారు మొలాముచేసిన బల్లలుగాని ఉండును. వానిపైన రకరకముల అలంకారములుంచబడును. వెండి బంగారు చీనా లక్క లాకర్ (Lacquer) సామానులు పళ్ళెములు గడియారములు నుంచబడును. ఈ వస్తువులు చీనానుండిగాని ఢిల్లీనుండిగాని ఐరోపానుండిగాని తెప్పించుచుండిరి. ఇందులో ఇంగ్లాండులోని బర్మింగుహాము నగరమునుండి తెప్పించబడిన వస్తువులు చాలఉండెను. పాశ్చాత్యులుపయోగించు (Couches) శయ్యాసనములు డమాస్కువస్త్రముతోగాని పట్టుతోగాని కప్పినవికూడా ఈ పెద్దగదులలో నుంచబడుచుండును. ప్రతిగదిలోను పగలు విశ్రమింపదలచినచో నుపయోగించుట కొకమంచమును పరువును దానిపైన మంచిదుప్పటియు వేయబడియుండును.

రాణిగారు అలంకరించుకొను (Dressing room) గదులలో అలమారులును బీరువలును గాక గదిచుట్టును బట్టలును ఆభరణములునుంచుటకు పెట్టెలును మందసములును ఉంచబడెను. పడకటింటిలోను స్నానపు గదులలోను ఉండు సామానులన్నియు వెండితో చేయబడినవే. రాజనగరులో కొన్ని బంగారు పట్టెమంచములు కూడ ఉండెను.

## "తికాణా"

రాణిగారి ఖజానాగదిని స్త్రీసైనికులు కావలి కాయుచుందురు. దానిప్రక్కనే సాధారణముగా నామె ధరించుబట్టలను, నగలను ఉంచుకొను 'తికాణా' యను గదియొకటి యుండెను. ఈ తికాణాలో రూపాయిలును మొహిరీలును తిలతండుల న్యాయముగా పోసిన పెట్టెయొకటి యుండెను. అంజిద్ ఆలీషాగారి తండ్రిగారా పెట్టెనక్కడనుంచి అత్యంతావశ్యకమైన సమయముననే దానిలోని ధనమునుపయోగింపవలెనని శాసించిరి. అంజిద్ ఆలీషాగారు వారిశాసనమును పాలించిరి గాని ఆయన కొమారుడైన వజీద్ ఆలీగారా ధనమునెల్ల వ్యయముచేసి వైచెను.

ఒకమారు రాణిగారు తోట ఇంటికి వెళ్ళియున్న సమయమున రాణిగారి అడుబానిస సేవకుల కొందరు తికాణాలో ప్రవేశించి ఒక నగలపెట్టెను పగులగొట్టి కొన్ని నగలు హరించిరి. దానిని తీయుటలో కొన్ని నగలు పాడైనవి. రాణిగారు చాల దయగాచూచు పదునారేండ్ల బానిసపడుచే ఈ స్వామిద్రోహము చేసినది. మరునాడు దొంగతనము సంగతి తెలియగానే రాణిగారికి కబురు వెళ్ళినది. ఆమె లక్నోకు తిరిగివచ్చి ఈ బానిసపడుచుపైన అనుమానపడిరి. అంతట అధికారులు దానిని బెత్తములతో కొట్టగా నది నేరమును ఒప్పుకొనెను. చాలనగలు దొరికినవి గాని అవి పాడై నిరుపయోగములై విలువలేకుండ పోయినవి.

రాణిగారు సాధారణముగా మధ్యాహ్నము, సాయంకాల భోజనమునకు ముందు తనను దర్శింపవచ్చిన దురదృష్టవంతులైన స్త్రీలను చూచుచుందురు. వీరు వారనక అన్ని జాతులవారును, అన్ని తరగతులవారును తమ కేయిబ్బంది యున్నను రాణిగారికి చెప్పుకొని తమతమ కష్టములను దీర్చికొని పోవుచుందురు. రాణిగారికి ఫిర్యాదుచేయుటకును, విన్నపములు చేయుటకును వచ్చిన వారివలన రాణిగారి పరిచారికలకు చాల ధనము దొరకుచుండును. లంచమివ్వలేని వారిని సేవకులు చాల దినములు త్రిప్పితుదకు దర్శనమిప్పించుచుందురు.

## రాణిగారి సవతి

అంజిద్ అలీషా చాలకాలము యువరాజుగనేయుండెను. ఆయన తన నడివయస్సు దాటిన తరువాతనే 1842లో అయోధ్యకు రాజైనాడు. అప్పుడుకూడా ఆయన చాలా కాలము రాజ్యము చేయలేదు. ఐదేండ్లు మాత్రమే రాజ్యముచేసి 1847లో మరణించినాడు. ఆయన రాజ్యమునకు వచ్చిన తరువాతనే ముగ్గురు కొమాళ్ళును ఒక కొమార్తెయు కలిగిరి.

అంజిద్ అలీషాగారు రాజ్యమునకు వచ్చిన రెండు సంవత్సరములకో అటుతరువాతనో ఆయనకు రాణిగారి పరిచారిక యొకరిత పైన మనస్సు తగిలెను. ఈపిల్ల అందమైనదే. రాణిగారి మూడవపిల్లవానిని ఎత్తికొనుచు సంరక్షణ చేయుచుండుట వలన నామె తఱచుగా రాజుగారి దగ్గరకు వెళ్ళుట తటస్థించెను. అంతట ఆయన ఆపిల్లకు బహుమతులంపసాగిరి. మొదట, పిల్లవానిమీద ప్రేమచేతనే అట్లు బహుమతులంపిరని రాణిగారను కొనిరి, గాని రాణివాసములోని వారందరకును రాజుగారి అభిప్రాయము తెలిసిపోయెను. అంతట వారీపరిచారికను గౌరవింపసాగిరి. కొలది దినములలోనే ఆమెను రాజుగారాదరించుట చూచి రాజనగరులోని వారందరు నామెను గౌరవవాచకముతో పిలువసాగిరి. ఈ పిల్లను రాజుగా రేవిధిచేతనైనను పెండ్లిచేసుకొనిరో లేదో తెలియదుకాని త్వరలోనే ఈ సంబంధము సంగతియు, ఈ పరిచారిక నితరులు గౌరవించుటయు తాము లేని సమయమున నదికొంత 'దర్పా'ను చూపుచుండుటయు రాణిగారికి తెలిసిపోయెను. రాణిగారు సామాన్యురాలుకాదు. ఆమె పుట్టుకచేత ఢిల్లీప్రభువంశమునకు చెందిన రాజకొమరిత, వివాహమువలన నామె అయోధ్యరాజుగారి పట్టమహిషి, విద్యచేత అరబ్బీపారశీ సాహిత్యములందు విశారద. ఆమె చాల పట్టుదలగల మానవతి. తనకును తనభర్తకును మధ్య ఈనీచపు పరిచారిక యొకర్తె అడ్డుపడుట నీమె సహింపలేక పోయెను. ఆమె సాధారణముగా తన పంతము నెగ్గించుకొనుట కాహార నిద్రలను కూడ వర్జించును. అయితే తనపట్టుదలవలన రాజ్యముయొక్క క్షేమలాభములకు హానికలిగించుపని మాత్రము చేయదు.

రాణిగారికా పరిచారికపైన అసూయ కలిగెను. అంతట సాధారణముగా దయార్ద్ర హృదయమైన రాణిగారి మనసు కొంత కఠినమై ఆమె ఆ పరిచారికపట్ల కొంచెము క్రూరముగనే ప్రవర్తించెను. ఒకదినము మధ్యాహ్నము రాణిగారు తమ యంతఃపురమున లోపలిగదిలో నుండి దర్బారుగదిలోనికి పోవుచుండగా దారిలో నొక గదియందీ పరిచారిక ఎండవేడిమి వలనను వ్యాయామమువలనను అలసి, ఒడలెరుగుక నిద్రించుచుండుట

రాణిగారి కంటబడెను. రాణిగారు మరల తన లోపలిగదిలోనికి వచ్చువరకు నెవ్వరితోను ఏమియుననక, తరువాత ఢిల్లీనుండి తనతో వచ్చి తన చిన్ననాటనుండియు నమ్మకముగా నున్న ఒక ముదుసలి పరిచారికను పిలిచి దానితోనేమో చెప్పగా కొంతసేపటికొక విచిత్రము జరిగెను.

ఆ గదిలో నట్లు నిద్రించుచున్న యీ పరిచారిక దగ్గర నొక బాణసంచు (టపాకాయ) పడి ప్రేలుటయు దానివలన నామె ముఖమును మెడయు కాలగా నది గోలపెట్టుటయు నొక్క క్షణములో జరిగిపోయెను. ఇది తెలియగా రాణిగారికి చాల పశ్చాత్తాపముకలిగి ఆమె చాల విచారించి ఆ పిల్లకు తగు చికిత్సచేయించిరి. రాణిగారిది బేలగుండె. ఆ పిల్లను చూడగానే ఆమెకు దుఃఖమువచ్చెను. కాని జరిగిపోయిన దానికేమి చేయుదురు? తరువాత రాజుగారక్కడకు వచ్చి జరిగిన సంగతిని విని, మొగము ముడుచుకొని ఆ పిల్లకు తగు చికిత్స చేయుట కేర్పాటుచేసిరి. అది కొంతకాలము మంచముపట్టిన తరువాత దానికి కుదిరినది గాని దాని అందము పూర్తిగాపోయెను. తరువాత రాజుగారు దానిని మరచిపోయిరి. ఒక విధముగా నాలోచించినచో రాణిగారు చేసినపని అంత క్రూరమైనది కాదనియె అనవలసివచ్చును. ఆ కాలము అసూయచేతగాని మరియే కారణము చేతగాని రాజులును, రాణులను చేయు ఘోరకృత్యములలో నిది యొక్క లెక్కలోనిది కాదు. ఇంకొక రాణియైనచో తన భర్త మనస్సు నాకర్షించిన పరిచారికను చంపించి దాని కళేబరమును నదిలోనికి త్రోయించి యుండును. సామాన్య స్త్రీకూడా తన భర్తను తననుండి విడదీసిన సవతిపట్ల నింతకన్న క్రూరముగా ప్రవర్తించి యుండుననుటకు సందియములేదు.

రాణిగారు నిజముగా చాల దయదాక్షిణ్యములు గల స్త్రీ. ఆమె చాల పాపభీతి కలట్టిది. అనుదినమును ఆమె ఖొరాను గ్రంథశ్రవణమును చేయుచుండును. ఆమె భర్తగాని కొమారుడుగాని ఆమె యంత మంచివారె యైయున్నచో, అయోధ్య రాజ్యమునకీ గతిపట్టియుండదు అని ఈ రాణిగారి చరిత్రను చెప్పిన ఎలిహూజాక్ అనినది.

అయోధ్యరాజైన అంజిద్ ఆలీషాగారు షియాశాఖకు చెందిన ముసల్మానుడు, షియాలలో సాక్షులయెదుట చేసికొను 'నిక్కా' వివాహము శాస్త్రీయమైన వివాహము. శాస్త్రప్రకారము షియాలు నలుగురు స్త్రీలను నిక్కా కట్టుకొనవచ్చును. అయితే "ముటా" అను గౌణపద్ధతి ప్రకార మెంతమందినైనను కట్టుకొనవచ్చును. ఈ పద్ధతి పెండ్లి సాక్షుల యెదుట చేయనక్కరలేదు. ముటాభార్యకు భర్తయిచ్చు ఆస్తియందు తప్ప ఆయన తదనంతరము వారసత్వపు హక్కులుండవు.

పైన చెప్పినట్లు అంజిద్ ఆలీషాగారు తన పట్టమహిషి యొక్క పరిచారికను ప్రేమించి ఆ నాటకమంతమైన కొన్నాళ్ళకు ఆయన లక్నోనగరములో పువ్వులమ్ముకొను ఒక అందకత్తెపైన మనస్సుపారెను. ఆయన దానిని ప్రేమించి ముటా పద్ధతి ప్రకారమామెను పెండ్లిచేసికొని, ఆమె కొకమేడ కట్టించి అందులోనుంచిరి. అయితే ఆమె కొక పిల్లవాడు పుట్టగా ఫిరంగిని ప్రేల్చువరకును ఈ పెండ్లిసంగతి రాణిగారికి తెలియనేలేదు. అంతట ఆమె రాజుగారిని దీనినిగూర్చి నిందించెను. ఆయనయు ఖొరానులో చెప్పియున్న ప్రకారము తాను పెండ్లిచేసికొనుటకు వీలున్నంతమంది స్త్రీలను తాను గ్రహించనే లేదనియు, తానట్లు చేయదలపను లేదనియు, బదులుచెప్పిరి. అప్పుడక్కడ దగ్గరలో చాలమంది సేవకులుండిరి.

వారందరు వినునట్లుగా రాణిగారు బిగ్గరగా "నిజమే బహుభార్యలను వివాహమాడుటకు మీకధికారమున్న మాటనిజమే! అయితే మీ యౌవ్వన మంతయు గడచువరకును మీరట్లుచేయక ఉపేక్షించి, ఇప్పుడు మీవార్ధక్యమున మీరొక పువ్వులమ్ము దానిని కట్టుకొంటిరి. అందులో నిన్నటి వరకు బజారులో పువ్వులమ్ము స్త్రీయది. దానిదగ్గర పువ్వులుకొను మీసేవకులు మిమ్ముజూచినప్పుడెల్ల "ఇదిగో-నిన్నటిదాక మేము పువ్వులు కొనిన దాని మొగుడిడుగో! అని అనుకొనుచు నవ్వుకొందురు!" అని రాణిగారనునప్పుడికి రాజుగారు మొగము చిన్నబుచ్చుకొని ఏమియు అనలేక కోపముతో వెడలిపోయిరి. "అమ్మా మహాప్రభువునకు కోపము కల్గించితిరి. వారు మరల అంతఃపురమునకు రారేమో! అని యొక పరిచారిక అనగా "రాకుండపోనిమ్ము" అని రాణిగారు రోషముతో పలికిరి గాని తాము గదిలోపలికి పోయి ఒంటరిగా నున్నప్పుడు వెక్కివెక్కి యేడ్వసాగిరి. రాజుగారి హృదయమును చూరగొన్న ఆ పువ్వులమ్ము అందకత్తెకు పుత్రోదయము కాగానే అందురు నామెను ములికి, లేక రాజకొమరితయని పిలువసాగిరి. అయితే పట్టమహిషిగారి యెదుటమాత్రము ఎవ్వరు ఆమెనట్లు పిలువసాహసింపలేదు. ఆమెకు పుట్టిన పిల్లవానిని కూడా ఎవ్వరు నామె యెదుట సాహిబిలమ్ లేకషాజాదా అనగా రాజకొమరుడని పిలువ సాహసింపలేదు.

## రాణిగారి ఔదార్యము

అంజిద్ అలీషాగారు తరువాత కొద్దికాలము మాత్రమే జీవించిరి. ఆయనకు జబ్బుచేయగానే ఆయనకు అధైర్యము కలిగెను. అంతట ఆయన చనిపోవువరకును తమ పట్టమహిషి గారిపట్ల ఎంతో ప్రేమను గౌరవమును చూపింపసాగిరి. ఆయనకు భుజముపైన నొక పెద్ద వ్రణము వేసెను. అదిచాల బాధపెట్టుచుండుట వలన నాయన క్రమక్రమముగా బలహీనుడయ్యెను. ఆయన విరోధులాయనకు చికిత్సచేయు వైద్యునకు లంచమిచ్చి విషప్రయోగముచేసి చంపిరని తరువాత రాణిగారనుకొనిరి. రాణిగారికి తమ భర్తయందుగల ప్రేమమెల్ల ఆజబ్బులో వెల్లడియయ్యెను ఆమె ఎల్లవేళల నాయన సమక్షముననే యుండి ఆయన కనేక విధములుగా పరిచర్యలు చేయసాగెను. అంజిద్ అలీషాగారు కొలది దినములలో చనిపోవుదురనగా పువ్వులరాణియైన "ములిక" రాకొమరిత తాను రాజుగారి దర్శనమునకు వెళ్లినయెడల రాణిగారు రానివ్వరనియు తన చిన్న కొమారుని బంపిన యెడల దయార్ద్ర హృదయయైన రాణిగారు దయదలచి వానిని రానిచ్చుననియు తలచి ఆ పిల్లవానిని పంపించెను, ఆమె యూహ నిజమయ్యెను.

ములిక కొమారుడు రాజనగరు ద్వారముదగ్గరకు వచ్చెను. అప్పుడు రాణీగారు రాజసమక్షమున నుండిరి. అతడు వచ్చినాడని రాణీగారితో నెట్లు చెప్పవలెనాయని పరిచారకులు సందేహింపసాగిరి. వాని నేదైన గౌరవవాచకముతో పేర్కొనినచో నామెకు కోపమువచ్చును. అట్లు పేర్కొనక పోయినచో రాజుగారి కాగ్రహము వచ్చును. వారు సందిగ్ధావస్థలో పడిరి. తుదకు రాజుగారి ముసలి ఖొజ్జాయొకడు రాజుగారి దగ్గరకు వచ్చి "మహాప్రభూ, సార్వభౌమా, దీనజనరక్షకా ములిక అహ్రాద్ గారి పసిబాలుడు తమ దర్శనము కొరకువచ్చి వేచియున్నాడు" అని పలికెను. "సాహిబలంను (రాకొమారుని)

లోపలికి రమ్మనుము" అని రాజుగారనిరి. "సాహిబలమా? ఏ సాహిబలము? ఇతని తల్లి ఏ దేశపు రాజకొమరిత? ఏ రాణి కూతురు? ఎంత అరణము తెచ్చినది? ఎక్కడనుండి వచ్చినది?" అని రాణిగారు పలికి "ఆ పిల్లవానిని తీసికొనిరండు" అనిరి. పరివార జనులందరును ఏమి మునుగునోయని గడగడవడకుచుండిరి. పిల్లవానిని లోపలికి తెచ్చిరి. రాణిగారా బాలుని వైపునకు చూడనైన చూడదనియో, చూచినను వానిమీద ఉమియుననియో అక్కడివారనుకొనిరి. కాని వారనుకొనిని దంతయు పొరబాటు అవి స్పష్టమైనది. రాణిగారిది దయార్ద్ర హృదయము. ఆమె ఎంత కఠినురాలివలె కనబడునో లోపల నంత మెత్తని మనస్సు కలది. ఆ పిల్లవాడు లోపలికి రాగానే ఆమె వానిని దయతో పిలిచి తన మోకాళ్ళ దగ్గరకు జేర్చికొని "అబ్బాయిా మీ అమ్మ ఏమిచేయుచున్నది?" అని వానినడిగిరి. వాడును "మా తండ్రియైన రాజుగారు చాలా జబ్బుగానున్నారని మాయమ్మ ఏడ్చుచున్నది" అనెను. ఇది వినగనే రాణి గారి గుండె కరగిపోయెను. అంతట ఆమె కన్నుల నీరునించి యా పిల్లవాని బుగ్గపైన మెల్లగాతట్టి, వానిని ముద్దుపెట్టుకొనిరి. అక్కడ మంచముమీద పండుకొనియున్న రాజుగారిది చూచి కరిగిపోయిరి. ఆయన తన చేతినిజాచి రాణిగారి చెయ్యి పట్టుకొని "బేగం! నీవు వీని తల్లిని లెక్కచేయకుము. నేను వీనిని నీ కప్పగించుచున్నాను. నేను పోయిన తరువాత నన్ను తలచి వీరిని ప్రేమించుము" అని దీనముగా ననిరి. ఈ మాటలు వినగనే రాణిగారికి దుఃఖము పొర్లివచ్చెను. ఆమె వెక్కి వెక్కి యేడ్చి "మీరిటువంటి అధైర్యపుమాటల నాడవలదు. త్వరలోనే మీ జబ్బు కుదురగలదు" అని ఆమె ఆయనకు ధైర్యము చెప్పి ఆ పిల్లవాని విషయమై మనస్సులో నేమియు బాధపడవలదనియు తాను వానిని దయతో చూచి సంరక్షించెదననియు నామె వాగ్దానమము చేసెను. అంతట రాజుగారి మనస్సు శాంతి జెందెను. ఈ దృశ్యమును చూచి అక్కడి వారందరును ఆశ్చర్యపడిరి. తరువాత కొలది దినములలోనే అంజిద్ ఆలీషాగారు దివంగతులైరి.

## రాజమాత

అంజిద్ ఆలీషాగారి తరువాత నాయన పెద్దకుమారుడైన వజీద్ ఆలీషాగారు 1847లో అయోధ్యకు రాజైనాడు. తన కొమారుడు రాజైనాడను సంతోషము తప్ప రాణిగారికి మనశ్శాంతి లేకపోయెను. వజీద్ ఆలీగారు భోగలాలసుడై తారతమ్యములను గాని యుక్తాయుక్తములను గాని విచారింపక అన్ని జాతులవారిని, ఉత్తమ కులజనులను హీనకులజనులను గుణవంతులను గుణహీనులను కూడా తన యంతఃపురమున జేర్చసాగెను. కొన్నాళ్ళు రాజమాత ఇది హర్షింపక కోపించుచుండెను. గాని తరువాత నేమనినను లాభము లేదని చేయునది లేక మిన్నకుండెను. వజీద్ ఆలీ పట్టమహిషియైన ఖాష్‌మహల్ గారికినీ రాజమాతకును సరిపడకపోయెను. అందువలన కూడా ఆమెకు సంతాపము కలిగెను.

వజీద్ ఆలీగారు సుఖలోలుడై సంగీత సాహిత్య వినోదములందు ప్రొద్దుపుచ్చుచు ధనమెల్ల వ్యయము చేయుచు రాజకార్య నిర్వహణము నుపేక్షించెను. అతడు అడుదాని

వేషమును వేయుచు కాలమును వృథపుచ్చును. దేశమరాజకమై యల్లకల్లోలమయ్యెను. ఏదో నెపమున రాజ్యమును హరింపదలచిన ఇంగ్లీషు కంపెనీవా రీతనిని 1856లో పదభ్రష్టునిచేసి అయోధ్య రాజ్యమును వశపఱచుకొనిరి. అతడు తన రాజ్యమును మఱల సంపాదించుకొనుటకు అసమర్థుడగుట చూచి రాజమాత ఒక ఉపాయము నాలోచించెను.* ఆమె తానే ఇంగ్లాండునకుపోయి ఇంగ్లీషు రాణియైన విక్టోరియా మహారాజ్ఞిని దర్శించుతుననియు ఆమెకూడ పిల్లలుగల తల్లియె గనుక తన మొఱవిని న్యాయము జరుపక పోవదనియు రాజమాత తలచి అత్యంత ధైర్యసాహసములతో సీమకు ప్రయాణమయ్యెను. ఆమె రెండవ కుమారుడు ఆమెతో కూడ పోయెను. వారక్కడనుండగానే హిందూ దేశములో సిపాయిల తిరుగుబాటు అను ప్రజా స్వాతంత్ర్య విప్లవము తటస్థించెను. రాణిగారి మనోరథము నెరవేరలేదు. ఆమె ఇంగ్లాండులోనే మరణించెను.



# 10. హెూన్నూరు ఫకీరులు

అనంతపురము జిల్లాలోని పెనుకొండ గ్రామమున నుండిన మహమ్మదీయ మహాపురుషుడైన ఫీర్ ఫకృద్దీన్ బావాగారి శిష్యులమని చెప్పుకొను తెలుగు శూద్రుల కులమొకటి రాయలసీమలోను మైసూరు హైదారాబాదు సంస్థానములోను కనబడుచున్నది. వీరు జాతిమత విచక్షత లేకుండా సర్వజనులకును శ్రేయము కలుగవలెనను సిద్ధాంతమువారు. వీరిని హెూన్నూరు ఫకీరులందురు.

ఈ ముసల్మాను గురువు ఏకాలమువాడో సరిగా తెలియుటలేదు గాని కొన్ని సందర్భములబట్టి యతడు క్రీ.శ.1155వ సంవత్సర ప్రాంతమున తెలంగాణము నేలిన కడపటి కాకతీయరాజుల కాలములో పెనుకొండకు వచ్చినట్లు కొందరు చరిత్రకారు లూహించుచున్నారు.

మహాపురుషుడైన ఫకృద్దీను బావాగారిని గురించి చాలా కథలు చెప్పుకొనెదరు. ఆయన మొదట పారశీక దేశములోని శీయస్తానులో నొక చిన్నరాజుగా నుండినట్లును ఒకప్పుడతడు న్యాయపరిపాలన చేయుటకొఱకు కొలువుకూటములోనుండి యొక వ్యవహారమును పరిష్కరించుటకు విచారించుచుండగా వర్తకుడొకడు గుఱ్ఱముల నమ్ముటకు తీసుకొనిరాగా అతని మనస్సు ఆ గుఱ్ఱముపైకి పోయి నందున తాను పరిష్కరించవలసిన వ్యవహారమును న్యాయముగ తీర్మానించలేక పోయినట్లును అంతట నతడు పశ్చాత్తాపము జెంది తన రాజ్యమును పరిత్యజించి భిక్షాటనము చేయుచు దేశాంతరములపాలై తిరుగసాగినట్లును, ఆ దేశాటనములో హిందూ దేశమంతటను తిరిగి తుదకు పెనుగొండలో

* The Private Life of an Eastern King, together with Elihu Jan's Story of the Private Life of an Eastern Queen, By William Knighton.

స్థిరనివాస మేర్పరుచుకొనినట్లును చెప్పుకొందురు. "బాబయ్యగారని వాడుక పేరుగల పీర్‌బావా ఫక్రుద్దీనుగారికి చాలా మహత్తులుండెననియు అప్పుడీ దేశమును పరిపాలించు చుండిన రాజప్రతినిధి అయనకు శిష్యుడై అయన కోరికపైన పెనుగొండలోని హిందువుల దేవాలయమును శైవమతమును బాబయ్యగారి వశముచేయగా ఆ దేవస్థానమునకును మతమునకును చెందిన జంగము వారందరును బాబయ్యగారి శిష్యులైనారనియు బాబయ్యగారా దేవళము నొక మశీదుగా మార్చి మతమును ఫకీరులుండుటకొక సరాయిగా చేసినారనియు చెప్పుదురు. ఈ మశీదును సరాయియు నిప్పటికిని ఉన్నవి. ఇదిగాక ఇంకను చక్కని కట్టడములు కొన్ని అక్కడ వెలసినవి. బాబయ్యగారి దరగాలేక సమాధికూడా అక్కడనున్నది. ఇప్పటికిని అయన భక్తులక్కడ పూజా పురస్కారములను జేయుచున్నారు. అనేక ప్రాంతములనుండి వచ్చిన భక్తులక్కడ మ్రొక్కుబళ్ళను చెల్లించుచున్నారు.

పూర్వమీదేశము నేలిన హిందూ ముసల్మాను రాజులనేకులు బాబయ్యగారి దరగాకు భూదానముచేసినట్లును దానిని మరమ్మతు చేయుటకును దాని ఆరాధనకును విశేష ధనమునిచ్చి పోషించినట్లు తెలియుచున్నది. ఈ దరగా నాదరించిన వారిలో 1689 మొదలు 1706 వఱకును మధుర రాజధానిగా దక్షిణదేశమునేలిన తెలుగురాణి మంగమ్మ గారును, 1759 మొదలు 1782 వఱకును మైసూరు రాజ్యమును పరిపాలించిన హైదరాలీ బహద్దరును, అయన తరువాత 1799 వఱకును రాజ్యముచేసిన టిప్పూసుల్తానుగారును ప్రముఖులుగా నున్నారు.

బాబయ్యగారి ముఖ్యశిష్యులైన హెూనన్నూరు ఫకీరులను వారు తాము మొదట శూద్రకులజులమైన జంగముల మనియు ప్రస్తుతము నిజాము రాజ్యములునున్న హెూనన్నూరు నుండి పెనుగొండకు వచ్చినవారమనియు అప్పుడీ ప్రాంతముల నేలుచుండిన రాజప్రతినిధి యాహ్వానింపగా వచ్చినవారమనియు చెప్పుదురు.

హెూనన్నూరు ఫకీరులను నీ వింతకులమువారు తక్కిన శూద్రులవలెనే యుందురుగాని వీరు తక్కిన కులములకన్న సృరద్రూపులుగా నున్నారు. వీరు సాధారణముగా బక్కపలుచగా నుందురు. బహుశః వీరు నీతి నియమములు గల కష్టజీవులై యుండుటయె దీనికి కారణమైయుండును.

వీరిలో పురుషులు జాఫరా (కావి) రంగుధోవతిని కట్టుకొని పై మీద ఉత్తరీయమును వేసికొని వంగపండు రంగుగల తలపాగను పెట్టుకొందురు. కొందరు ఒక పాత చొక్కాయనుగాని 'కోటు'ను గాని సంపాదించుకొని ధరించుచుందురు. వారు తమ తలపాగపైన ముందుభాగమున వెండితోగాని ఇత్తడితో గాని చేసిన ఒక చిన్నచంద్రవంకయు దాని నావరించి యొక నెమలికంటి ఈక తురాయిని పెట్టుకొందురు వారు తమ ముఖములపైన పెట్టుకొను గంధపుగీరల అడ్డుబొట్టును దానిమధ్య నొక కుంకుమ బొట్టును వారిశైవమత సంప్రదాయమును సూచించుచుండును. ఈ హెూనన్నూరు ఫకీరులలో దార్ఢ్యవంతులైన పురుషులందరును తమపనులమీద నెక్కడికిపోయినను తమ గురువైన బావా ఫక్రుద్దీనుగారి కుడి అరచేతి చిహ్నముగా ఐదువ్రేళ్ళు జాచియుండు ఇత్తడిచేతి నొక దానిని తమ వెంటతీసికొని పోవుదురు. ముసల్మాను ఫకీరులందరివలెనే హెూనన్నూరు

ఫకీరులును తమ తలపైన జుట్టును కత్తిరింపక క్రిందికి పెరుగనిత్తురు. తమ మీసములను గడ్డములను కూడా పెంచుకొందురు.

హెరాన్నూరు ఫకీరు కులమువారి స్త్రీలు కూడా కావిరంగు బట్టలనే కట్టుకొందురు. వారొక జాఫరా చీరను రవికను ధరింతురు. అన్ని దుస్తులును కావిరంగువి సంపాదింపలేని వారు నడుమువరకునైన అరంగు దుప్పటిని కప్పుకొందురు. స్త్రీలు పురుషులు కూడా తమ మెడలలో మూడునాలుగు వరుసల గోధుమరంగు పూసలపేరులను, రెండు తాయత్తులను ధరించుచుందురు. ఆడువాండ్రు తమ ముఖములపైన కుంకుమతోనే అడ్డముగా రెండుబారుగీతలను దీర్చి వాటిమధ్య కుంకుమ బొట్టును పెట్టుకొందురు.

మన దేశములోని తక్కిన శూద్రజాతి స్త్రీలవలె ఈ హెరాన్నూరు ఫకీరుల స్త్రీజనమునకు విలువయైన బట్టలపైన మోజులేదు. వారు ధరించునగలు, మెడలో కట్టుకొను బంగారు మంగళ సూత్రమును చేతులను వెండిగాజుల జతయు నల్లగాజులును మాత్రమే వారు తమ తలవెండ్రుకలను వెనుకకు ముడివేసికొందురు. ఈ స్త్రీలలో చాలమంది చక్కని కంఠస్వరములు కలిగి శ్రావ్యముగా పాడగలరు. వీరు 'బంజు'లను సితారులను 'తంబురిన్'లను గిలక తప్పెటలను వాయించుచు పాడుదురు. మంచి దుస్తులుగాని నగలుగాని లేక పోయినను, దేశద్రిమ్మరులుగానున్నను, ఈ స్త్రీలు తక్కిన కులములవారికన్న చాలా నాజూకుగా నుందురు.

ఈ కులముల వారిలో పురుడు వచ్చినప్పుడును పెళ్ళిళ్ళప్పుడును చావులలోను వీరు అవలంబించు ఆచారములు తక్కిన శూద్రులములవారి యాచారములకు భిన్నముగా నుండవు. హెరాన్నూరు ఫకీరులు మహమ్మదీయులతో పెండ్లి పేరంటములు జరుపుకొనరు. సర్వమానవులు సమానులను ఇస్లాము సిద్ధాంతమున కిది విరుద్ధమైయైనను వారు తమ కులమువారితో తప్ప సంబంధ బాంధవ్యములను చేయరు. పెండ్లికుమారుడు పెండ్లికొమార్తెకు కన్యాశుల్కము క్రింద పండ్రెండు రూపాయిలివ్వవలెను. పెండ్లిఖర్చులు నతడే భరింపవలెను. ఇదివారి తాహతును బట్టి ఎక్కువగనే యుండును. కొన్ని వందలుకూడా ఉండును. వారు వివాహమహోత్సవము నతివైభవముతో జరుపుదురు. అప్పుడా కులములోని స్త్రీపురుషులు రెండువందల మంది ప్రోగై ఒడలెరుగని విధముగా ప్రవర్తింతురు. మతిలేకుండ విందులారగింతురు. వచ్చిన వారందరికిని అన్నమును మాంసమును వండిపెట్టి, కావలసినంత కల్లు, సారాయములను పోయుదురు. ఈ అతిథులలో చాలమంది పిలువకుండ వచ్చినవారుగనే యుందురు.

రాయలసీమలోని సంకరజాతి వారైన దూదేకుల కులము వారివలెనే ఈ హెరాన్నూరు ఫకీరుల కులమువారు కూడా చచ్చిన గొడ్లమాంసముగాని పందిమాంసము గాని ముట్టుకొనరు. 'అదిహారం' అనగా అపరిశుద్ధమైన పదార్థముగా పరిగణింతురు.

పెండ్లిభోజనముల కొరకు చేసిన ఖర్చులకైన ఋణమును దీర్చుటకు ఒక్కొక్కప్పుడు ఒకని యావజ్జీవమును సంపాదించు ధనమంతయు కావలసివచ్చును. అయితే ఈ హెరాన్నూరు ఫకీరులు బట్టల కొఱకును, నగల కొఱకును ఎక్కువ సొమ్ముఖర్చుచేయరు. అది

ఆశ్చర్యకరమైన విషయమే. సాధారణముగా వీరు తమ ఆడుపిల్లలకు యుక్తవయస్సు వచ్చువరకును పెండ్లిచేయరు. ఒక భార్యకన్న ఎక్కువమందిని పోషించుటకు శక్తియున్నచో ఎక్కువమందిని పెండ్లిచేసికొనుట కభ్యంతరము లేదు. వీరిలో వితంతువులు పునర్వివాహము జేసికొనుటకు వీలులేదు. విడాకులిచ్చుకొను ఆచారమును లేదు. యువతీ యువకులు పారిపోయి పెండ్లిచేసికొనుట యొక గొప్పనేరముగ నెంచబడి వారికి చాలా హెచ్చుమొత్తము జరిమానగా విధింపబడును. తమకులమువారితోగాని ఇతరులతో గాని వ్యభిచరించుట గొప్పతప్పుగా నెంచబడి వారిని శిక్షింతురు.

ఈ కులమువారు మరణించినప్పుడు శవములను దహనము చేయక పూడ్చి వేయుదురు. మూడవ ఏకాదశ తిథియు, సాంవత్సరికశ్రాద్ధములను తక్కిన హిందువులవలెనే జరుపుదురు. వీరు సాధారణముగా తమ శుభాశుభములను బ్రాహ్మణులచేతగాని ఖాజీచేతగాని చేయించుకొనక తమ కులపెద్దలచేతనే జరిపించుకొందురు. దీనికి కారణము వారిని పిలిచినచో ఖర్చుఅధికమగుననియే.

హొూన్నూరు ఫకీరులు సర్వసాధారణముగా ఊళ్లవెంటపోయి ఎఱుకచెప్పియు, మూలికల నమ్మియు పొట్టపోసుకొందురు. వీరిలో ఇంద్రజాల విద్యను, గారడి విద్యను అభ్యసించిన వారును, పాముల నాడించువారును కూడా చాలామందిఉన్నారు. కొంతమంది మాయలను మంత్రములను నేర్చి దయ్యములను పెట్టుట దయ్యములను వదలించుట మొదలైన కార్యములు చేయుదురు. ఈకులములోని పురుషులు తక్కిన దేశద్రిమ్మరి తెగలవారివలె బహిరంగముగా భిక్షాటనము చేయరుగాని వీరి స్త్రీజనము మాత్రము జంగము కథలు చెప్పు నెపమునను పాటలుపాడు, నెపమునను భిక్షాటనము చేయుచుందురు. వీరు చెప్పు జంగము కథలలో ముఖ్యమైనవి, శివుడు పార్వతీదేవికి సవతిగా గంగదేవిని వరించిన కథయొకటి; చాళుక్యరాజకొమరితయైన బాలనాగమ్మను ముసల్మాను ఫకీరు మాయచేసి తీసికొనిపోయిన కథయొకటి; విజయరామరాజును ఫ్రెంచిసేనానియైన బుస్సీ దొరయును బొబ్బిలికోటను పట్టుకొనిన కథయొకటి; దక్షిణమున తుండీర రాజ్యము యొక్క రాజధానియైన జింజికోటను కర్ణాటకరాజు పట్టుకొనుటకురాగా జింజిసేనానియైన దేశింగురాజు చేసిన మహాయుద్ధమును గూర్చిన కథయొకటియు; మొదలైన జంగము కథలను నవరసము లొలికించుచు పాడుదురు.

హొూన్నూరు ఫకీరు లిట్లు చాల విద్యలయందు ప్రవీణులుగా నుండి తాము నివసించు గ్రామముల కనేక విధములుగా సేవచేయుదురు. వీరిలో చాలమంది కొంచెముగనో గొప్పగనో డొక్కశుద్ధియై చదువుకున్న వారేగాని నిరక్షర కుక్షులు చాల తక్కువగానుందురు. వీరు హిందువుల పురాణములలో నుండియు శతకములలో నుండియు పద్యముల నతిశ్రావ్యముగా జదువగలరు. వారు సాధారణముగా పెద్దపెద్ద తాటియాకుల గ్రంథములను చేత బుచ్చుకొని తమ పాండిత్యమును ప్రదర్శించుచుందురు. తమ విద్వత్తును ప్రదర్శించుటలోను బహుమతుల కొఱకు ప్రాకుడులాటలోను వీరు బ్రాహ్మణులను, భట్రాజులను కూడా మించిపోవుదురు.

ఈ కులమువారు చాలా నీతిపరులైన సంసారులుగానున్నారు గాని అల్లరి చిల్లరగా తిరుగువారుకారు. వీరు దొంగతనములుగాని, మోసములుగాని చేయరు. తెలుగు దేశములోను, కన్నడ సీమలోకూడా చాలాచోట్ల ఇళ్ళు వాకిళ్ళు పొలములు బుట్రలు కలిగి స్థిరనివాసము చేయు సంసారులుగానున్నారేగాని వీరు తక్కిన దేశద్రిమ్మరి కులముల వారివలె నిలుకడ లేనివారుకారు. వీరు వ్యవసాయపు బనులు లేనప్పుడే దేశసంచారమునకు బోవుచుందురు. హెూన్నూరు ఫకీరులింకను ఇంగ్లీషు చదువులలోగాని రాజకీయాందోళమునగాని ప్రవేశింపలేదు. వీరింకను ప్రత్యేక నియోజకవర్గము లనగానేమో గ్రహింపలేదు.

ఈ కులమువారి మొత్తము జనసంఖ్య రమారమి ఒక లక్షయని అంచనా వేయబడినది. వీరిలో చాలమంది చెన్నరాజధానిలోని దత్తమండలములలోను చిత్తూరు జిల్లాలోను, మైసూరు హైదరాబాదు సంస్థానములోను ఉన్నారు. వారి కొక హిందూ గురువును ఒక మహమ్మదీయ గురువును ఉందురు. హిందూగురువు శ్రీశైలములోను, మహమ్మదీయ గురువు పెనుగొండలోను ఉందురు. హెూన్నూరు ఫకీరులందరును ఈ రెండు సంప్రదాయముల ప్రకారము శ్రీశైలమునను, పెనుగొండలోను కూడ ఉపదేశము పొందవలెను. ఇదిచాలా ముఖ్యమైన సంస్కారము. రెండుచోట్లను రెండేసి రూపాయలు చొప్పున రుసుము చెల్లించవలెను.* మత విషయము లందెల్ల హెూన్నూరు ఫకీరులు హిందూ ఆచారములనే యవలంబింతురుకాని వారు మతావేశపరులైన హిందువులు కారు. వారుపోవుదారిలో కనబడు అన్ని దేవాలయముల లోనికిని మశీదులలోనికిని దరగాల లోనికినికూడ వారు పోయి అర్చింతురు. వారికి వచ్చు కుల వివాదముల విషయములో హిందూ గురువు తీర్మానమే వారికి పరమ ప్రమాణము.

శ్రీశైలములోను పెనుగొండలోను ప్రతిఏటను జరుగు తిరునాళ్ళకును ఉత్సవములకును వీరు విధిగా పోవుదురు. ఈ తిరునాళ్ళకు వచ్చు హిందూ మహమ్మదీయ తీర్థయాత్రికుల గుంపులలో కావిరంగు దుస్తులు ధరించిన యీ హెూన్నూరు ఫకీరులు చేయు సంగీత సాహిత్య కాలక్షేపములు వినోదములు చూచి తీరవలెనేగాని వర్ణింపనలవి కాదు.



* The Disciples of Babayya- Article by Mr.K.A.Solomon, Modern Review for September, 1937.

చదవండి! చదివించండి!!

# మావద్ద లభించు జీవిత చరిత్రలు

| | | రూ. |
|---|---|---|
| 1. | మహాత్మాగాంధీ - డా॥ దాశరథి రంగాచార్య | 18 |
| 2. | వివేకానందుడు - డా॥ దాశరథి రంగాచార్య | 12 |
| 3. | మహా మనీషి డా॥ సర్వేపల్లి రాధాకృష్ణన్ - రావినూతల శ్రీరాములు | 25 |
| 4. | భగత్‌సింగ్ - డా॥ చాగంటి తులసి | 20 |
| 5. | మఖ్దూం మొహియుద్దీన్ సంక్షిప్త జీవిత పరిచయం - డా.రాజబహదూర్‌గౌర్ | 15 |
| 6. | సురవరం ప్రతాపరెడ్డి - డా॥ కె.యెస్. రమణ | 25 |
| 7. | తెలుగుతేజం - పురిపండా అప్పలస్వామి జీవితం-సాహిత్యం - డా॥ ద్వా.నా. శాస్త్రి, డా॥ బండి సత్యనారాయణ | 30 |
| 8. | మహనీయుల పాఠశాల జ్ఞాపకాలు - డా॥ ఎమ్. లక్ష్మణాచార్యులు | 15 |
| 9. | విశ్వనరుడు గుర్రం జాషువా - బోయ జంగయ్య | 12 |
| 10. | భారతరత్న మోక్షగుండం విశ్వేశ్వరయ్య - డా॥ జానమద్ది హనుమచ్ఛాస్త్రి | 25 |
| 11. | లాల్‌బహదూర్ శాస్త్రి - ఎ.వి. జనార్ధనరావు | 15 |
| 12. | కార్ల్‌మార్క్స్-మూలం: ఇ. స్తెపనోవా, అను. తుమ్మల వెంకట్రామయ్య | 35 |
| 13. | ప్రేంచంద్ జీవితం - మూలం: శ్రీమతి శివరాణీదేవి, అను : వాసిరెడ్డి సీతాదేవి | 40 |
| 14. | గాంధీజీ కథావళి - కోడూరి శ్రీరామమూర్తి | 60 |
| 15. | సుప్రసిద్ధుల జీవిత విశేషాలు - డా॥ జానమద్ది హనుమచ్ఛాస్త్రి | 40 |
| 16. | ప్లేటో -అను. నిడమర్తి ఉమారాజేశ్వరరావు | 60 |
| 17. | జవహర్‌లాల్ నెహ్రూ - మూలం: గోరోవ్ & జిమ్యానిన్ | 100 |
| 18. | నాట్యకళాప్రపూర్ణ బళ్లారి రాఘవ - జానమద్ది హనుమచ్ఛాస్త్రి | 25 |
| 19. | మదర్ థెరెసా - మూలం : నవీన్ చావ్లా, అను:ఆర్వియార్ | 90 |
| 20. | భగత్‌సింగ్ - కె. ప్రతాపరెడ్డి | 50 |
| 21. | చార్లీ చాప్లిన్ - వాసిరెడ్డి భాస్కరరావు | 30 |
| 22. | సోక్రటీస్ - నిడమర్తి ఉమారాజేశ్వరరావు | 40 |
| 23. | విశ్వవిఖ్యాత శాస్త్రవేత్తలు (భారతీయులు) - శాంతాభాస్కర్ | 25 |
| 24. | విశ్వవిఖ్యాత శాస్త్రవేత్తలు (విదేశీయులు) - శాంతాభాస్కర్ | 40 |
| 25. | మాడపాటి హనుమంతరావు (సంక్షిప్త జీవిత పరిచయం) - ఆకెళ్ళ రాఘవేంద్ర | 25 |
| 26. | అమరజీవి పొట్టి శ్రీరాములు సంక్షిప్త జీవిత పరిచయం - అల్లెన వెంకట జనార్ధనరావు | 25 |
| 27. | బాలల కోసం ప్రసిద్ధుల జీవితాలు - ఎల్లాప్రగడ సీతాకుమారి | 25 |
| 28. | వీరేశలింగం సంక్షిప్త జీవిత చరిత్ర - సంపాదకులు అక్కిరాజు రమాపతిరావు | 25 |
| 29. | భగత్ సింగ్ - అజయ్ ఘోష్, సోహన్ సింగ్ | 45 |

ప్రతులకు: 12, విశాలాంధ్ర బుక్ హౌస్‌లు

మరియు

ప్రముఖ పుస్తక విక్రేతలు

# కథలు - గాథలు

• నాలుగవ భాగము •

గత ముద్రణ : 1947

# పీఠిక

భారతదేశ చరిత్రకును, భారతీయ ప్రజాజీవనమునకును సంబంధినట్టియూ, భారత జాతీయాభ్యుదయమునకు తోడ్పడ గలట్టియు చరిత్రాత్మకములైన కథలను గాథలను కొన్నిటిని ఇదివఱకు మూడు సంపుటములుగా ప్రకటించి యున్నాను. ఇప్పుడు మఱికొన్నిటినీ నాలుగవ సంపుటమున జేర్చితిని.

ఇందులో కొన్ని యిదివరకు ఆంధ్ర వారపత్రికలోనూ భారతిలోనూ ప్రకటింపబడినవి; మరికొన్ని క్రొత్తవి.

నా రచనలను ఆదరించిన పాఠకులను నన్నాశీర్వదించిన పెద్దలకును కృతజ్ఞుడను.

దిగవల్లి వేంకటశివరావు

# 1. భారతవర్ష చరిత్ర సమీక్ష *

బ్రహ్మదేవుని యొక్క నాలుగు ముఖముల నుండి నాలుగు వేదములును ఉద్భవించినవని భారతీయుల విశ్వాసము. బ్రాహ్మణ ఋషిపుంగవుడైన భృగువు బ్రహ్మహృదయము నుండి యుద్భవించెనని చెప్పుటవలననే వైదిక సంప్రదాయము నందాతనికి గల ప్రాముఖ్యము వెల్లడియగుచున్నది. కార్తవీర్యుడను క్షత్రియరాజు భృగుకుల సంజాతుడైన జమదగ్ని మహర్షియొక్క గోవును హరించెననియు అందువలన జమ దగ్ని పుత్రుడైన పరశురాముడు క్షత్రియ కులముపై నిరువది యొక్కమారులు దండయాత్రచేసి క్షత్రియ కులక్షయము చేసెననియు భాగవతపురాణమున జెప్పబడినది. ఈ గాథలో చెప్పినట్లు కేవలము ఒక గోవు నపహరించుటవలననే ఇంతటి వైరము పుట్టెననుటకు వీలులేదు. యజ్ఞయాగాదికములను ప్రతి ఘటించు క్షత్రియోద్యమ మొకటి బయలుదేరి నందువలననే ఈవైరము పుట్టెనని యూహింప తగియున్నది. ఎట్టకేలకు సూర్యవంశ క్షత్రియరాజైన శ్రీరామచంద్రుడు పరశురాము నోడింపగా నతడారంభించిన ఘోరయుద్ధము లంతమయ్యెను. శ్రీరామచంద్రుడు కేవలమొక రాజమాత్రుడు గాక, అద్వైత వాదుల పక్షమునకు జెందిన భాగవతులకు దైవమైన శ్రీమహా విష్ణువుయొక్క అవతారముగా పూజింపబడుచున్నాడు.

సూర్యుడును అగ్నియు ఆర్యుల ప్రధానదేవతలు. అందులో బ్రాహ్మణులకు అగ్ని చాల ముఖ్యమైన దైవము. అనేక యజ్ఞయాగాదికము లాయనకు సంబంధించియున్నవి. క్షత్రియులకు సూర్యునితో ప్రత్యేక సంబంధము కనబడుచున్నది. స్మృతికర్తయైన మనువును శ్రీరామచంద్రుని వంశమునకు మూలపురుషుడైన రఘువును సూర్యుని యంశమందు జన్మించినట్లు చెప్పుదురు. తరువాత కొంతకాలమనకు సూర్యుడు భాగవతుల దైవమగు విష్ణువుగా పరిణమించెను. విష్ణువు క్షత్రియులకు ఇష్టదైవము. బ్రహ్మయెల్లప్పుడును మహామోగ నిద్రలో మునిగి యుండినందున ఆయన నాలుగు ముఖముల నుండి పుట్టిన వేదములు, అన్యులకు అలభ్యములైనవి అయితే శ్రీమహావిష్ణువు యొక్క నాలుగు భుజములును లోకకల్యాణమున కాధారభూతములై ధర్మము నేక చక్రమున నడిపి సమస్త ప్రాణులకు అమృతానందముల నొసగుచున్నవి.

పరతత్వసాధనకు మార్గమైన బ్రహ్మవిద్య వనమునందలి ఏకాంతవాసములందే యుద్భవించినది. అది రెండుమార్గముల బ్రవర్తిల్లినది. ఒక మార్గమునది చరాచరసృష్టి యొక్క అస్తిత్వమునే నిరాకరించి పరమాత్మయే సత్యమని అద్వైత పర బ్రహ్మమును బోధించినది. రెండవ మార్గమున నదిద్వైత పరముగా సాక్షాత్కరించుకొన్నది. అయినను నిజతత్వము నందీ రెండు నొక్కటే. ద్వైతము నంగీకరించినగాని భగవదారాధనము

* విశ్వభారతి మొదటి సంచికలో శ్రీ రవీంద్రనాథ ఠాకూరు మహాకవి రచించిన వ్యాసమునకిది స్వేచ్ఛానువాదము.

అసాధ్యమగును. అయితే పరతత్వము యొక్క అద్వితీయత్వము నంగీకరించినగాని ఆ యారాధనము పరమభక్తి యుతము* కానేరదు. వేదములందరి దైవములు మానవునితో సంబంధము లేనివారు. వారు భక్తి ప్రపత్తులతో నివిలీమిత్తము లేని నైమిత్తిక కర్మలద్వారా భజింపబడుచుండిరి. భగవంతునికిని మానవునికిని గల ఆధ్యాత్మిక సంబంధము తెలిసిన తరువాత భక్తిపరమైన ఆరాధనమునకు అవకాశము కలిగెను. గూఢమైన బ్రహ్మవిద్యనుండి విష్ణుపరమైన భాగవతమత మిట్లుద్భవించినది. యజ్ఞయాగాదికములతో నిండిన కర్మయోగమును బ్రాహ్మణు లెక్కుడుగా ననుష్ఠింపగా ప్రపత్తిపరమైన భక్తి యోగమును క్షత్రియు లవలంబించింది. అంతట నీయుభయ సంప్రదాయములకు వివాదములు తగవులు ప్రారంభము లయ్యెను.

క్షత్రియుడైన శ్రీకృష్ణుడు వైష్ణవమతమునకు అధిష్ఠాత మయ్యెను. తరువాత నామతము నందు పూజింపబడు దైవమయ్యెను. శ్రీకృష్ణభగవాను డుపదేశించిన భగవద్గీత యందు వైదికధర్మముల నిరసనముకొంత కాన వచ్చుచున్నది. ఈ క్షత్రియాచార్యుడు తన శిష్యుడైన అర్జునున కుపదేశించిన నిష్కామకర్మయోగమునందు మానవుడు మనోవాక్కాయ కర్మలందు నిష్కాముడై పరమేశ్వరునందు భక్తితోప్రవర్తింప వలెననునది పూర్వ రాజర్షి పరంపరనుండి వచ్చిన సంప్రదాయమనియు, కర్మకాండ మనస్సుయొక్క నిశ్చలత్వమునకు భంగముకలిగించి పరతత్వసాధన కడ్డు కలిగించుననియు శ్రీకృష్ణ భగవానుని అభిప్రాయము** ఇది శృతివిరుద్ధమని యంగీకరింపక తీరదు. అందువలన శృతిధర్మములను శిరసావహించు పూర్వాచారపరాయణులు శ్రీకృష్ణునకు వ్యతిరేక పక్షమున నుండిరని విదితమగుచున్నది.

కురుక్షేత్రమున జరిగిన మహాభారతయుద్ధము కేవలము కొంత భూమికొఱకైన తగవువలన వచ్చిందనుట హాస్యాస్పందము. శ్రీకృష్ణుని మార్గదర్శిత్వము నంగీకరించిన పక్షమువారికిని అది యంగీకరింపని పక్షమువారికిని జరిగిన యుద్ధముగా కనబడుచున్నది. శ్రీకృష్ణుడు అర్జునునకు సారథిగా నుండుటలో చాలా అంతరార్థము కనబడుచున్నది.

యాజ్ఞవల్క్యునివంటి గొప్ప బ్రాహ్మణుల చరిత్రల వలన నాటి బ్రాహ్మణుల యందుగల బుద్ధివైభవము, ఆధ్యాత్మజ్ఞానము వెల్లడియగుచున్నవి. ఆనాటి గొప్ప క్షత్రియుల చరిత్రలవలన వారి నైతికధర్మనిరతియు భాగవతలక్షణములును వెల్లడియగుచున్నవి.

భారతీయులు బ్రాహ్మణ ఋషులను మహాపురుషులని గౌరవింతురు. సత్యవ్రతులును ధర్మనిరతులునైన క్షత్రియ వీరులను దైవాంశసంభూతులని పూజింతురు. అవతార పురుషులలో చేర్చబడిన ఏకైక బ్రాహ్మణునికి భారతీయ హృదయ సీమ లందున్నత స్థానము లేదు. అందువలన భగవంతుని అవతారముయొక్క ప్రయోజనము, నీతి ధర్మానుష్ఠానముల చేత భిన్న జాతులలో సోదరభావమును కలిగించి ఏకముచేయుటయే గాని కేవలము బాహుబలపరాక్రమము జూపి ఇతరులను నిర్జించుట కాదనుభావము భారతీయులయందు

* భక్తి, శ్రవణము, కీర్తనము, స్మరణము, పాదసేవ, అర్చనము వందనము దాస్యము, సఖ్యము. ఆత్మనివేదనము అని భక్తి ఎనిమిది విధములు.

** శ్లో॥ శృతివిప్రతిపన్నా తే యదా స్థాస్యతినిశ్చలా।
సమాధా వచలాబుద్ధి స్తదాయోగమవాప్స్యసి॥ భగవద్గీత, అ. 2-53

నాటుకొనీ యున్నదను సంగతి దీనివలన తెలియుచున్నది. శ్రీరామచంద్రుని జీవితమె ఇందుకుసాక్షి. అస్పృశ్యుడైన గుహుని మానవులగా పరిగణింపబడని వానరజాతులను అదరించి ఉద్ధరించుటవలననే అయన పరమ దయాళుత్వము వెల్లడి యగుచున్నది. శ్రీమహా విష్ణువుయొక్క అవతారమైన బుద్ధునికూడా రామకృష్ణుల యందు వలెనే నీతిధర్మములు ప్రబలముగా కనబడుచున్నవి.

నిజమునకు బ్రాహ్మణులకును క్షత్రియులకును ఆశయము లందు భేదమున్నది కాని జాతియందెట్టి భేదమునులేదు. వసిష్ఠ విశ్వామిత్రుల వైరముకూడా మనః కల్పితమైనదేగాని జాతికి సంబంధించినది కాదు. ఈ వైరములందు బ్రాహ్మణు లందఱు నొకేపక్షము నవలంబించినవారును కాదు. క్షత్రియులు నట్లే ఇరుపక్షములకును చెందియుండిరి.

మాతంగకన్యకల రూపమున బ్రాహ్మణవిద్యలు విశ్వామిత్రునిచే నవమానింపబడగా క్షత్రియరాజైన హరిశ్చంద్రుడు వారిని రక్షింవ బ్రయత్నించెను. అందుకొఱకు తనసర్వస్వమును గోల్పోయెను. ఘోరాచారమునుండి క్షత్రియ యువకులను రక్షించుట కొఱకు శ్రీకృష్ణుడు పాండవుల సహాయమున జరాసంధుని వధించెను. జరాసంధుడు ప్రతిపక్షమునకు చెందిన క్షత్రియుడు. అనేక రాజకుమారులను చెఱపట్టెను. కృష్ణుడును పాండవులును అతనిపురికి బ్రాహ్మణవేషములలో పోవలసి వచ్చెనని చెప్పుటవలననే క్షత్రియ మండలిలో అప్పుడెంతవైరము ప్రబలియుండెనో తెలియగలదు. అకాలమునాటి ఇతర గాథలు నీసంగతిని తెల్పుచున్నవి. పూర్వాచారములకు వ్యతిరేకముగా శ్రీకృష్ణుడు ప్రారంభించిన మతమునకు వీనితో కొంత సంబంధమున్నదనుటకు సందేహములేదు.

శ్రీకృష్ణుని మతధర్మములు ఆర్యావర్తమునందలి జన సంఘమును రెండు చీలికలుగ చేసివైచెను. రారాజైన యుధిష్ఠరుడు కృష్ణుని పక్షమువాడు. అతడు రాజమండలిని రాజసూయయాగమున కాహ్వానించి అక్కడచేరిన బ్రాహ్మణ క్షత్రియ మండలిలో కృష్ణున కగ్రస్థాన మిచ్చుటను గూర్చి శిశుపాలుడు కోపించి శ్రీకృష్ణుని బహిరంగముగనే అవమానించెను. అంతట శ్రీకృష్ణుడతనిని వధించెను. అందువలన అనాది అర్యజన సంఘమునందు ప్రబలిన వైరముల ఫలితమే కురుక్షేత్రయుద్ధము. శ్రీకృష్ణునకు వ్యతిరేక పక్షమువారి సేనలకు బ్రాహ్మణ మహారథుడైన ద్రోణుడును అయనవారైన కృపాశ్వద్థామలును సేనానాయకులైరి. ద్రోణుడు పరశురాముని శిష్యుడు. కౌరవపక్షములో ప్రముఖుడైన కర్ణుడుకూడా పరశురాముని గురువుగా సేవించియుండెను.

రామాయణ కాలమునకును మహాభారతకాలమునకును యుగభేదమున్నది. రెంటిలను పరశురాముడు కనబడుచున్నాడు. అందువలన పరశురాముడు క్షత్రియ కులమును ధ్వంసముచేయుటకు ప్రయత్నించిన గాథ కేవలము వ్యక్తిగతమైన కథగాక క్షత్రియులకు వ్యతిరేకముగా బయలుదేరిన బ్రాహ్మణోద్యమమునకు సంబంధించినదేయని యూహింప వచ్చును. ఈతగవులందు తుదకు విజయులైన రామకృష్ణుల నీతి ధర్మములే ఇందుకు నిదర్శనము.

ఆర్యసమాజమునందు పూర్వాచారములకును నవీనాచారాములకును జరిగిన సంఘర్షణలకు సంబంధించిన గాథ లెన్నేని ఈ రెండు మహాకావ్యములందును గనబడుచున్నవి. రామాయణకాలమున నీనూతన సంప్రదాయములకు నాయకుడు శ్రీరామచంద్రుడే. శ్రీరాముడు పూర్వ సంప్రదాయములకు బుట్టినిల్లుగానుండు వసిష్ఠుడు కులగురువుగానున్న రాజవంశమున జన్మించెను. కాని త్వరలోనే వశిష్ఠునికి విరోధియైన విశ్వామిత్రుని వంశములోనికి వచ్చెను. విశ్వామిత్రుడు బ్రాహ్మణపక్షమునకు వ్యతిరేకుడు శ్రీరాముని యడవులకు పంపుట కిది కొంతకారణమై యుండి తీరవలయును. కైకేయి వరము కథ అంతగా నమ్ముటకు వీలులేకున్నది. అది అటు తరువాత కల్పింపబడినదై యుండును. జనకమహారాజు క్షాత్రధర్మము మూర్తీభవించిన రాజర్షియని ప్రతీతి రామాయణకథ చుట్టును తరువాత చేరిన కల్పనలును ప్రక్షిప్తములును విడదీసి చూచినచో శ్రీరాముడు జనకునే తన ఆదర్శముగా గైకొని చరించినట్లు కనబడగలదు. సీత స్వయంవర కథ ఆకాలమునాటి క్షత్రియ మండలికి చేయబడిన పరీక్షవంటిదిగా తోచుచున్నది.

సీత సామాన్యకన్యకకాదు. నాగేటి కాలువ నుద్భవించిన భూపుత్రి. శివధనువును విఱువగల యోధునికే ఈభూపుత్రి నిచ్చెదనని జనకుడు ప్రకటించెను. జనకుని చిత్తవృత్తుల కిది తార్కాణముగానున్నది. అతడు అంతరంగమున బ్రహ్మవిద్యోపాసకుడు; బహిరంగముగ భూపతి. ఆర్యులు మొదట వనములలో ఆశ్రమములందు వైదికారాధనలను చేసికొనుట మూలముగా బ్రహ్మవిద్య నుపాసించుచుండిరి. వారికి పశుపాలనమే ప్రధానవృత్తిగా నుండెను. తరువాత క్షత్రియుల బాహుబలమున పట్టణములు నగరములు నిర్మింపబడగా పెద్దజనసమూహము లొక్కచోట నివసించుట వలన ప్రశాంత పరిస్థితులు పోయినవి. బ్రహ్మవిద్యోపాననము నందును జీవనము నందును కూడా మార్పులు కలిగెను.

జనకుడు మిథిలను పరిపాలించు చుండెను. అందువలన ఆర్యావర్తము యొక్క ఎల్లలు తూర్పున వీలైనంత దూరమునకు వ్యాపించెను. దక్షిణమున వింధ్యాచల మింకను దుర్గమమై యుండెను. దక్షిణదేశమున ద్రవిడసభ్యత వ్యాపించి యుండెను. దాని అధిపతి రావణుడు. ఇంద్రుని వైదిక దైవములను ఓడించిన ద్రవిడుల దైవమైన శివుని ఆధిపత్యము సుస్థిరముగ నుండెను. ఇందువలననే శివునిధనువును విఱచి ద్రవిడసభ్యతను జయించి బ్రహ్మవిద్యనక్కడ స్థాపింపగల మహావీరుడే ఆర్యజన సంఘమున కప్పుడు కావలసి యుండెను.

శ్రీరాముడు విశ్వామిత్రునితో పోయి చేసిన మూడు గొప్ప కార్యములు, అడ్డువచ్చిన రాక్షసులను వధించుట, శిలవలె నిరుపయోగమైన భూమిని సజీవము జేయుట (అహల్యగాథ) పరశురాముని ఆధిపత్యమున క్షత్రియులకు వ్యతిరేకముగా బయలు దేరిన ఉద్యమమును అణచుట.

రామాయణము నందున మహాభారతము నందును కూడ నాయకుల వివాహమున స్వయంవరము ప్రకటింపబడి అందులో నొక గొప్ప పరీక్ష నియమింపబడినది. రామాయణమున శివధనువును విఱుచుట నియమింపబడగా మహాభారతమున మత్స్య యంత్రమును భేదించుట నియమింపబడినది. మహాభారతములోని మత్స్యయంత్రము

ఆకాశమునందు నెలకొల్పబడినది. అది సూర్యబింబమువలెనుండి ఒక చక్రమునం దమర్చబడి యుండెను. అది గిరగిర తిరుగుచుండును. దాని ప్రతిబింబమును నేలమీదనున్న ఒక పాత్రలోని నీటియందుచూచి దానిని కొట్టవలెను. దీనికి మనస్సు నేకాగ్రమ్ముచేసి లక్ష్యము చూచుట అవసరముకదా! ఇది భౌతికమైన పరీక్ష కాదనియు ఆధ్యాత్మికమైన పరీక్షయనియు చెప్పక చెప్పుచున్నది.

సదాతిరుగుచుండు సంసార (సృష్టి) చక్రము నందమర్చబడియున్న కేంద్రమైన సత్యము మనలోనే చాలా లోతున ప్రతిబింబించు చుండును. ఏకాగ్రచిత్తమున యోగమువలన దానిని లక్ష్యించుకొనవచ్చునని దీనిభావము. ఇది భగవద్గీతలో బోధింపబడిన యోగముయొక్క ప్రత్యక్షరూపకల్పనమని చెప్పవచ్చును. లక్ష్యమును భేదించుటయను ఉపమానము ఉపనిషత్తులయందే చెప్పబడియున్నది.

*"ప్రణవో ధనుఃశారోహ్యాత్మా బ్రహ్మతత్ లక్ష్యమ్ ఉచ్యతే"*

విల్లు ఓంకారము; ఆత్మయే బాణము; బ్రహ్మమే లక్ష్యము; అని దీని భావము.

ఈ పరీక్షలో నెగ్గి కృష్ణయనుపేరుగల ద్రౌపదిని అర్జునుడొక్కడే గెలుపొందెను. అయితే ఆమె యైదుగురన్నదమ్ములకును భార్యయైనది. బహుభర్తృకత హిమాలయముల కావల నుండిన యాచార మనియు పాండవులక్కడనుండి వచ్చిన విజాతీయులనియు చెప్పి సమర్థింపజూచుట హాస్యాస్పదము. ఇది ఐదుగురన్నదమ్ములను పాల్గొనిన మానసిక సంబంధమైన బహుభర్తృకృత్యము గాని భౌతికమైనది కాదు. ఈ కృష్ణ నామక ద్రౌపది శ్రీకృష్ణుని యుపదేశముల చేతనరూపము. ఇది విష్ణుపరమైన సూర్యోపాసనమునకు సంబంధించినది. సూర్యునుపాసింపగనే ద్రౌపదియొక్క భోజనపాత్ర అక్షయ మగుచుండు ననియు ఆమె అతిథి అభాగతులను సంతృప్తి పరుపగలుగుచుండెననియు మహాభారతమున నున్న గాథయొక్క అర్థము ఆధ్యాత్మికమైన భోజనమునకు సంబంధించినదే.

క్షత్రియ నాయకత్వమున బయలుదేరిన వైదిక సంస్కరణోద్యమమునకు ముఖ్య కేంద్రములలో పాంచాల దేశ మొకటి కాబోలును. పాంచాలములో బ్రాహ్మణకుమారుడైన శ్వేతకేతువు గూఢవిద్యనేర్చుకొనుటకు ప్రవాహణ జాబాలియను క్షత్రియరాజుదగ్గరకు వెళ్ళెను. ఖగోళభూగోళములందరి సృష్టి క్రమమును చరాచర జీవసృష్టియును మానవ జీవితమును కూడ ఒక శాశ్వతమైన యజ్ఞమనియు ఈ యజ్ఞమునకు కావలసిన హోమాగ్ని యనేక రూపములం దుద్భవించుచుండుననియు ఈరాజు బోధించెను. తనకు రాజగౌరవము నిచ్చి సమానముగ జూడలేదను కారణమున బ్రాహ్మణ గురువైన ద్రోణాచార్యులకు పాంచాలరాజుపైన నొకపగయుండెనని అందఱకును తెలిసిన విషయమే. ఈగాథవలన కూడా బ్రాహ్మణులు లౌకికవైదికములందు సమానగౌరవము నాశించిన సంగతి వెల్లడి యగుచున్నది. మధురానగరమునకు చాల దగ్గరగ నున్న పాంచాల రాజ్యము నందుండియె శ్రీకృష్ణుని క్రొత్తమతమును పాండవులు స్వీకరించిరని యూహింపవచ్చును. ద్రుపదునితో తగవు ప్రారంభించిన ద్రోణాచార్యుడే కౌరవ పక్షముయొక్క మొదటి సేనా నాయకుడై యుండుటయు గమనింపదగిన విషయమే.

రావణుడు సీతను పరిభవించినట్లే కౌరవసోదరులు కృష్ణను పరిభవించిరి. రాముడు సీతను రక్షించినట్లే కృష్ణుడు ద్రౌపదికి అక్షయవలువల నిచ్చి రక్షించెను. రావణుడుకూడా సీతను బలాత్కరింప సాహసింపలేదు. సత్యము కొంతకాలము దుస్థితి యందు పడియున్నను రక్షితమైనది. సీతనురక్షించిన రామాయణనాయకుడును ద్రౌపదిని రక్షించిన మహాభారత నాయకుడును తరువాత వైష్ణవమతమునం దత్యున్నతస్థానము వహించుట కేవలము యాదృచ్ఛికమైన సంగతికాదు. ఈ రెండు కావ్యములును ఒక మహాదాదర్శనమును నిలువబెట్టుటకు జరిగిన యుద్ధములనే సూచించుచున్నవి.

క్షత్రియ రాజవంశమునకు జెందిన శ్రీరామచంద్రుడు చండాలుడైన గుహుని తనస్నేహితునిగా పరిగణించి అతనిని కౌగలించుకొని ఆదరించినందు వలనను, కోతి, ఎలుగుబంటి, ధ్వజములు గల ఆటవికులనుకూడ ఆదరించినందువలనను సర్వమానవుల యందున ఆయనకుగల దయాళుత్వము వెల్లడియగుచున్నది. ఇట్టివాడు, తరువాత, శూద్రుడైన శంబుకుడు తపస్సు చేయుచుండెనను కారణమున నతనిని వధించెనని వ్రాయబడిన ఉపాఖ్యానము ఉదారభావములు గిట్టనివారివలన చేర్చబడిన ప్రక్షిప్తభాగమని ఊహింపవచ్చును.

తమ ఆత్మగౌరవము నిలువబెట్టుకొనుటకు బ్రాహ్మణులు పడినపాట్లును తమగౌరవము పెంపొందించుకొనుటకు క్షత్రియులు చేసిన ప్రయత్నములును బాగుగా గ్రహించిన గాని ఆర్యుల పురాణేతిహాసములను సరిగా అర్థము చేసికొనలేము.

జనసంఘము నేకము చేయుటకు ప్రయత్నింపవలసిరాగా ఆర్యులకు అనార్యులమతమును కూడా గ్రహింపవలసిన యావశ్యకత కలిగెను. శివారాధకులకును, వైదికదేవతారాధకులకును మొదట వైరములును యుద్ధములును కలిగెను. ఒకమారు వీరును ఒకమారు వారును జయించుచుండిరి. ఒకమారు శ్రీకృష్ణుని శిష్యుడైన అర్జునుడు కూడా కిరాతకుల దైవమగు శివునికి ఓడిపోయెను. దక్షుడు చేయుచున్న మహాయజ్ఞమున నతడుశివుని ఆహ్వానింపకపోగా అనార్యులాయజ్ఞమును ధ్వంసము జేసిరి. ఎట్టకేలకు శివుడు వైదిక దైవమగు రుద్రుడేయని యంగీకరించి ఈ వివాదము నంతమొందింప బ్రయత్నించిరి. ఐనను మహాభారతమునందు రుద్రునికిని విష్ణువునకును యుద్ధము జరిగినట్లును అందు రుద్రుడోడిపోయి విష్ణువుయొక్క ఆధిక్యత నంగీకరించి నట్లును. ఒక కథ కనబడుచున్నది. శ్రీకృష్ణారాధనమునందు బ్రహ్మకూడా శ్రీకృష్ణుని తృణీకరింప బ్రయత్నించినట్లును తుదకార్యుల పూర్వవంశ దేవతయైన బ్రహ్మ ఆయనను జన సామాన్యముయొక్క దైవముగ నంగీకరించి నట్లును కలదు.

జనకుడు రాజ్యముచేసిన దేశమునందే ఇరువురు క్షత్రియులుద్భవించి బౌద్ధజైనములను రెండు క్రొత్తమతములను స్థాపించిరి. అప్పుడు కలగలపుగ నుండిన మతధర్మము లందును ఆచారము లందును వేదాంత సిద్ధాంతము లందును గమ్యస్థానము తెలియ తడవుకొనుచున్న జనసామాన్యమునకు వీరు మార్గమును జూపిరి. ప్రజాశ్రేయమునకు తోడ్పడని మతధర్మములును కర్మములును వృథాలనియు మానవులలో హెచ్చు తగ్గులు స్థిరములు కావనియు నీతిమతధర్మములను ఆచారములను పాటించుట

వలనను ఉల్లంఘించుటవలనను గాక సత్యమును గ్రహించుట వలననే ముక్తి కలుగుననియు నీక్షత్రియసన్యాసులు బోధించిరి.

బౌద్ధమతముయొక్క ప్రభావము తగ్గులోపల ఆర్యమత ధర్మముల నంతవరకు రక్షించిన గోడలవంటి మర్యాదలు సడలిపోయి శిథిలములైనవి. బౌద్ధమతము అంతరించునప్పటికి దేశములోని అనాది సిద్ధములైన భేదములు తలలెత్తినవి. ఈ కల్లోలములో బ్రాహ్మణులు మాత్రమే తమ ఆచార ధర్మములను కాపాడుకొని నిలువ గలిగిరి. క్షత్రియులు సామాన్య జనములో కలిసిపోవసాగిరి. అందువలననే తరువాత దేశమునేలిన రాజులు చాలామంది క్షత్రియ కులమునకు చెందని వారైరి. ఇదిగాక శాక్యులు, హూణులు, నను విజాతీయులు దేశములోనికివచ్చి జనులలో లీనమైరి. ఈ సాంఘిక మత విప్లవములలో ఆర్యుల ప్రత్యేకత లీనమై భారతీయ జాతీయత యొకటి బయలుదేరినది. ఈ దేశమును పాలించినట్లు ప్రతీతి గల భరతుడను చక్రవర్తి పేరిట దీనిని భారతవర్షమని పిలువసాగిరి.

నీతిమత ధర్మములను ఆచారవ్యవహారములను క్రోడీకరించి సూత్రీకరించుటయె ప్రధాన కార్యమయ్యెను. ఇదిచేసిన బుద్ధిశాలియైన ఋషిని వ్యాసుడందురు. అతడొక్కడో అనేకులో తెలియదు. వ్యాసుడనునది ఒకపేరు కాదనియు తెలియు చున్నది. ముందుగా వేదములు క్రోడీకరింప బడినవి. ధర్మములు సూత్రీకరింపబడినవి. ఇతిహాసములన్నియు ప్రోగుచేయబడినవి. ఇది చాలాకాలము పట్టెను. ఇట్లు చిత్రింపబడిన ఆర్యనాగరికత యొక్క రూపమే మహాభారతము. అనేక కథలు గాథలు ఇతిహాసములు నీతి ధర్మములు చేర్చుటలో వానికి కథా సందర్భములు కల్పించుట యవసర మయ్యెను. ఇట్లు మహాభారతము నేటి ఆధునిక చరిత్రలవంటి చరిత్రకాకపోయినను ఆ కావ్యము రచింపబడు నాటికి ఆర్యుల మనోవీథియందు స్థిరరూపము దాల్చియుండిన చరిత్రేతిహాసముల క్రోడీకరణమే ఇది. ఈ ఇతిహాసమునందు కనబడు రూపురేఖలలోని స్ఫుటాస్ఫుటములు పరస్పర భేదములు రచయితల జ్ఞాపకశక్తిని బట్టియు కాలగతి వలన మారిన ఆదర్శములను బట్టియు ఏర్పడినవైయున్నది. మహాభారత నిర్మాతయైన వ్యాసుడు అప్పటికి స్మృతి పథమున నిలిచియున్న వివిధ విషయములకు గల పరస్పర సంబంధములను గూర్చి విమర్శించుటయె గాక పరస్పర భేదములు గల విషయములను సిద్ధాంతములను పరిశీలించి వేదములందలి వేదాంతచర్చలతో సమన్వయము చేయుటకు గూడ ప్రయత్నించెను.

ఈ మహాభారతేతిహాస రచనా కాలమునాటి విశేషమేమనగా బ్రాహ్మణుల పవిత్రతను బ్రాహ్మణ విజ్ఞానము యొక్క పవిత్రతను పలుమారు నొక్కి వక్కాణించుట. దీనికి కారణము ప్రజలలో అవిశ్వాసము ప్రబలియుండుటయె యని ఊహింప వచ్చును. ఆర్యసభ్యతలో బ్రాహ్మణులును క్షత్రియులును ఆధిపత్యమునకై తగవులాడి ఒక్కొక్క రొక్కక్క మారు అధిపత్యము వహించినప్పుడుకూడా ఆర్యనీతిమతధర్మము యొక్క ప్రధాన సూత్రములకు మాత్రము భంగము వాటిల్లలేదు. కాని బౌద్ధయుగమునందు భారతదేశములోని ఆర్యులును అనార్యులును, విజాతీయులును కూడా కలిసిపోవుటవలన ఆర్యసభ్యత యొక్క పరిశుద్ధతను నిలువబెట్టుట యవసరమయ్యెను. జాతుల కలయిక.

వివిధ నీతిధర్మముల కలయిక, ప్రబలమగుట ప్రారంభమయ్యెను. అంతట ఆర్యులీ సాంకర్యము నరికట్టుటకు సరిహద్దు గోడలవంటి నిషేధములను కల్పింపసాగిరి. ఈ అడ్డంకులు దాటివచ్చి చొరబడి తప్పని సరియైన క్రొత్త ఆచార ధర్మములు మాత్రము నిలిచిపోయినవి.

ఇంత మాత్రమున నిట్లువచ్చి కలిసిన అనార్యసంప్రదాయములు పనికిమాలిన వనుకొనరాదు. ముఖ్యముగా పురాతన ద్రావిడ నీతి మత ధర్మములలో కొన్ని ఉత్కృష్టమైనవే యున్నవి ద్రావిడులు ఆర్యులవలె జిజ్ఞాసవులుగాకాపోవచ్చును. గాని వారు లలితకళలందు నిపుణులు. ఆర్యద్రవిడ సంప్రదాయముల మేలుకలయికవలన నొక హైందవ సభ్యత యేర్పడెను. ఈ రెండు సంప్రదాయములు చక్కగా సమ్మేళనమై నంతవఱకును చక్కగానే నడిచినది గాని అట్లు కుదరి పట్ల మాత్రము పరస్పరవిరుద్ధములైన దురాచారములు మూఢ విశ్వాసములు ప్రబలినవి.

కేవలము ద్రావిడ సంప్రదాయములే గాక ఆదిమ వాసులైన ఇతర అనార్యుల సంప్రదాయములు కూడ ఆర్య సంప్రదాయమున బ్రవేశించినవి. దీని ఫలితమే మననీతి మత ధర్మములలోని వైపరీత్యములు.

అనార్యదేవతలు, ఆర్యదేవతాగణమున చేర్చికొనబడగా ఆర్యులారాధించు పరతత్త్వము త్రిమూర్త్యాత్మకమైనది. పూర్వాచార సంప్రదాయములకు సంజ్ఞగా బ్రహ్మ యేర్పడెను. వైదిక దైవమైన సూర్యుడు స్మృతిధర్మములలో నుండి లోకములోనికి వెలువడి భాగవతుల దైవమైన విష్ణువయ్యెను. ఆర్య సభ్యతలోనికి ప్రవేశించిన అనార్యుల దైవమైన శివుడు మూడవ మూర్తియైన మహేశ్వరుడయ్యెను.

శివుడు ఆర్యదైవముగా పరిణమించినను ఆయన ఆరాధనమున ఆర్య అనార్య సంప్రదాయములు వేరువేరుగా నిలిచిపోయినవి. ఆర్యసంప్రదాయమున నతడు కోరికలను జయించి ప్రపంచ బంధములతోపాటు వస్త్రములను కూడ వర్జించి నిర్వాణానందమున మునిగిన మహావిరాగి. అనార్య సంప్రదాయముననతడు రక్తసిక్తమైన పచ్చి యేనుగు చర్మమును ధరించి భంగుమత్తునుద్రావిన మహారుద్రమూర్తి. మొదటి సంప్రదాయమున నీతడు బుద్ధుని ప్రతిరూపము. అందువలన అనేక బౌద్ధమతములను వశపఱచుకొన గలిగెను. రెండవ సంప్రదాయమున నతడు భూత ప్రేతపిచాచ గణములకు అధినాధుడు. అతనిస్థావరము శ్మశానము. అందువలన లింగమును సర్పములను వృక్షములను ఇతర చిహ్నములను పూజించువారికి దైవమైనాడు. మొదటి సంప్రదాయమున నతనిని కేవలము ధ్యాననిష్ఠద్వారమున నారాధింతురు. రెండవ సంప్రదాయమున వీరావేశముతో తమ శరీరములను హింసించుకొను క్రూరకర్మలతో నారాధింతురు.

ఇట్లే వైష్ణవమతమునందును అనార్యుల దైవముగా నంగీకరింపబడిన శ్రీకృష్ణుడు అర్జునసారథియు సచివుడును గురుడును దైవమునైన ద్వారకావాసుడైన ప్రభువుకాడు. ఉపనిషత్సారమైన భగవద్గీతతోపాటు గోపాలకుల కథలు అల్లిబిల్లిగానల్లుకొనినవి.

ఎన్ని కష్టములు పడినను ఆర్యమత ధర్మములు అనార్య జాతులయొక్క వివిధాచారముల నెల్ల తమలో లీనముచేసికొనలేకపోయెను. పరస్పరవిరుద్ధములును

అనాగరకములునైన సంప్రదాయములను కూడా హర్షించి వారి వారి యధికారములను బట్టి వారి వారి ఆచార ధర్మముల ద్వారముననే ముక్తిని బడయవచ్చునను సిద్ధాంతమును ప్రతిపాదించిరి. అందువలన సనాతన ధర్మము కేవలము పైపెత్తనము వహించి ఏవో కొన్ని ఆచార వ్యవహారములను మాత్రము ప్రధానములని నిర్ణయించి వానిని ఆచరింపజేయుటతో తృప్తిజెందు స్థితికి వచ్చినది.

బలహీనమైనబుద్ధికి ఆచారమే పరమధర్మమైనది. అందువలన భారతదేశమున ఆచారము యొక్క కట్టుబాటులు గట్టిగాబిగిసి కదలుటకు వీలులేకుండ చేసినవి. దీనివలన ప్రజానీకమును విడదీయు కులాచారములే ప్రధానములుగా నెంచబడుచున్నవిగాని సృష్టియొక్క ఏకత్వమునకు తోడ్పడు అంతశ్శుద్ధి ప్రధానముగా నెంచబడుటలేదు.

బౌద్ధమతము క్షీణించుచున్న కాలము బ్రాహ్మణులు నిర్వీర్యులై పడియున్నందువలన మతాచారములు అల్లకల్లోలముగ బెరిగెను. బౌద్ధుల మహాయానమునందు ఆదికాలము నాటి పరిశుద్ధధర్మములు సడలిపోయి మహాయానము తెచ్చి పెట్టిన కర్మకాండ వలనను తాంత్రికకర్మల వలనను అనేకములైన సాంకర్యములు మతములో ప్రవేశించెను. అనేక సంకర మతములు వింతలైనదురాచారములు మూఢవిశ్వాసములును చెలరేగెను. బౌద్ధధర్మములు ఉత్కృష్టమైన తత్వజిజ్ఞాసను దయాళుత్వమును గోల్పోయెను.

ఈ స్థితిలో బ్రాహ్మణులలో మఱల చైతన్యముకలిగి ఈ కల్లోలమునుండి పరస్పర విరుద్ధములైన నీతి మతాచారముల నుండి ఒక విధమైన అద్వైత వాదమును ఏకవాక్యతను బయటకు తీయుటకువారు ప్రయత్నించిరి. భిన్నజాతీయ విరుద్ధజీవనవిధానముల వంకిలమునుండి తమ ఆదర్శములను రక్షించుకొనుటకు బ్రాహ్మణులు కఠిన నియమములను నిర్మించిరి. దీని ఫలితముగా వారి ఆదర్శములు జడములై కాలగతి వలన వచ్చిన మార్పులకు అనుగుణములు కాకపోయెను. అందువలన దేశములో ప్రబలిన వివిధజాతుల వారికి సరియైన మార్గమొకటిలేక 'ఎవరికివారే యమునాతీరే' అనునట్లు యథేచ్ఛముగా అభివృద్ధి చెందసాగిరి. అందువలన లెక్కలేనన్ని నీతిమత ధర్మములు ఆచారవ్యవహారములు ప్రబలినవి. అందులో కొన్ని పూర్వకాలమునాటి ఆచారముల విరూపములు. కొన్ని వాని యంతటనవిగా వచ్చినవి.

భారతదేశము మొదటినుండియు పుణ్యభూమియై ఇందలి ప్రజలందు గాఢమైన ఆస్తికత ప్రబలియున్నందున ఇంత కల్లోలములోనుండి మఱల నొక అఖండమైన పరతత్వ జిజ్ఞాస బయలుదేరినది. ఆర్యమతారంభకాలమున విజృంభించిన క్షత్రియులు నేడు నిర్వీర్యులైపోగా నిజిజ్ఞాస తక్కినకులములందు – అందు ముఖ్యముగా తక్కువకులములందు బయలుదేరినది.* మధ్య యుగమునందు ఈజిజ్ఞాస నుద్బోధించిన ప్రథమ వేదాంతి రామానందుడు. ఆయన బ్రాహ్మణుడేయైనను ఒక మహమ్మదీయ సాలెవానిని చెప్పులు కుట్టువానిని ఉన్నతకులములవారి మంచి నీటినైన ముట్టుకొనగూడని ఇతరులైన తక్కువ కులముల వారిని తన శిష్యులుగా జేసికొనుటవలన రామానందుని బ్రాహ్మణునిగా

* A Vision of India's History by Sri Rabindranath Tagore. Viswa Bharathi Vol. I. (1923) pp 1-21.

నంగీకరించక వెలివేసిరి. అంతట నీమార్గముననే "కబీరు పంథ"యు సిక్కులమతమును బయలుదేరినవి.

ఈ ధర్మజిజ్ఞాస ఇప్పటివరకును ప్రబలుచునే యున్నది. ఇటీవల బయలుదేరిన ఆర్యసమాజము బ్రహ్మసమాజము మొదలైన సంఘములు సనాతన మతధర్మమునందలి సత్యమును తెలిసికొనుటకు పుట్టినవే.

*సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ*
*శాంతం శివం అద్వైతమ్.*

అను ఉపనిషద్వాక్యములే భారతీయులకు తరణోపాయములై యున్నవి.



# 2. మహాభారతేతిహాసము

మహాకావ్యమైన మహాభారతము భారతీయేతిహాసమేయని డాక్టర్ వింటర్నిట్జ్ (Dr. Winternitz) గారిట్లు వ్రాసియున్నారు. కౌరవకుల యుద్ధచరిత్ర చుట్టును అపారమైన సాహిత్యము అల్లిబిల్లిగ అల్లుకొనినది. అనేక కథలు దానికి లంకెపెట్టబడినవి. ఈ కావ్యమునందు గొప్ప కవిత్వవాహిని యున్నది. ఇందులో బ్రాహ్మణ లేక వైదిక సాహిత్యము మెండుగా నున్నది. పూర్వఋషులకు సంబంధించిన అమానుషములైన చర్యలు మహాత్మ్యములుగల అనేక కథలు గాథలు నున్నవి. యమనియమముల వలనను యజ్ఞయాగాదికముల వలనను వారు మానవులపైననే గాక భగవంతుని పైనకూడా పలుకుబడిని సంపాదించిన యుదాహరణములు వివరింపబడినవి. బ్రాహ్మణుల వేదాంత తత్వమును నీతిమత ధర్మములనుగూర్చిన అనేక ఉపాఖ్యానములు నీ మహాకావ్యమున జేర్చబడి యున్నవి.

ఈ మహాకావ్యమునందలి కొన్ని భాగములలో కొన్నిటికి వైదిక వాఙ్మయముతో నొక విధమైన సంబంధ మున్నది. మరికొన్ని భాగములతో పురాణపద్ధతితో విష్ణువును గూర్చి నట్టియు శివునిగూర్చి నట్టియు కథలును గాథలును చెప్పబడినవి. ఇతర పురాణము లందు వలెనే దీనిలోకూడా భూగోళ ఖగోళ ప్రపంచోత్పత్తి విశేషములు, పూర్వ రాజవంశముల పట్టికలును కలవు. అందువలన మహాభారతము నందలి వైదిక బ్రాహ్మణ భాగములను పురాణబ్రాహ్మణ భాగములను విడదీయ వలసియున్నది.

మహాభారతమునందు శివుని గూర్చిన గాథలకన్న విష్ణువును గూర్చిన గాథలే హెచ్చుగానున్నవి. అందువలన నిది వైష్ణవ సంప్రదాయమునకు చెందిన మత గ్రంథముగా కనిపించుచున్నది.

పైన చెప్పినట్లు వైదిక సాహిత్యమును పురాణసాహిత్యమును గాని భాగములు కూడా మహా భారతమున కనబడుచున్నవి. ఇవి బౌద్ధజైన ధర్మములకు సంబంధించినవి.

సంసార దుఃఖములను గూర్చి వివరించి వైరాగ్యమును నీతిని బోధించుచు అహింసను దయను ఉపదేశించు ఉపాఖ్యానములెన్నో మహా భారతమున గానవచ్చుచున్నవి. మహాయజ్ఞముల ప్రాశస్త్యమును వివరించి వాని యాచరణము నుద్బోధించు బ్రాహ్మణ సంప్రదాయమున కివి కేవలము విరుద్ధములు. ఈ భాగమునందు నీతికథలు, ఉపాఖ్యానములు అఖ్యాయికలు, ఉపమలు, సూక్తులు ననేకములున్నవి. అందువలన మహాభారత మొక మహాకావ్యమే గాక ధర్మశాస్త్రమును నీతిశాస్త్రమును వేదాంత శాస్త్రమునై పంచమవేదముగా పరిగణింపబడుచున్నది." *



# 3. అల్బెరూనీ - మహాభారతము

అల్బెరూనీ రష్యాదేశానికీ ఆసియా దేశానికీ మధ్యనున్న నేడు 'ఖైవా' అని వ్యవహరింపబడే "ఖ్వారిజీం" లేక "చోరాస్మియా"దేశపు రాజుకు అంతరంగిక మంత్రిగా నుండేవాడు. అఫ్గను రాజైన ఘజనీమహమ్మదు ఆరాజ్యాన్ని జయించి ఆరాజు కుటుంబాన్ని ఆల్బెరూనీ మొదలైనవారినీ రాజకీయఖైదీలుగా పట్టుకుని అప్పట్లో తాను దండయాత్రలు చేస్తూఉన్న హిందూ దేశానికి ప్రవాసమంపాడు.

అల్బెరూనీ క్రీస్తుశకం 1017 మొదలు 1030 వరకూ 13 సంవత్సరాలు హిందూదేశములో పశ్చిమోత్తర భాగంలో బహుశా కాశ్మీర ప్రాంతాలలో ఉన్నాడు. మహమ్మదు చనిపోయిన తరువాత ఆయన కుమారుడు ఆఫ్గనీస్థానానికి రాజైనప్పుడు ఆల్బెరూనీ చాలా గౌరవం పొందాడు. అల్బెరూనీ అరబ్బీ భాషలో మహావిద్వాంసుడు, జ్యోతిషశాస్త్రంలో అఖండుడు. హిందూ గ్రీకు జ్యోతిషసిద్ధాంతాలు ఆయనకు కరతలామలకాలు. ఆయన హిందూ దేశంలో ప్రవాసం అనుభవిస్తూ వూరికే కూచోలేదు. ఈ దేశపు పండితులతో స్నేహంచేసి వారి ద్వారా మన వేదశాస్త్రపురాణేతిహాసాలను వేదాంతమార్గాలను ఆచారవ్యవహారాలను బాగా తెలుసుకుని అనుమానాలు కలిగినప్పుడు, మళ్లీ పరిశోధించి, తర్కించి, హిందూదేశ విజ్ఞానాన్ని గురించి అరబ్బీభాషలో ఒక ఉద్గ్రంధాన్ని రచించాడు. దానిని ఎడ్వర్డునచావు అనే జర్మను విద్వాంసుడు ఇంగ్లీషులోనికి అనువదించాడు. హిందూదేశ పూర్వచరిత్ర రచన కుపయోగించే ప్రమాణగ్రంథాలలో ఇది ఒకటి.

మహాభారతాన్ని గురించి ఆల్బెరూనీ తన గ్రంథంలో వ్రాసిన సంగతులనుబట్టి చూడగా ఆయన తరువాత మహాభారతంలో కొన్ని మార్పులు జరిగినట్లు స్పష్టంగా కనబడుతున్నది.

అల్బెరూనీకూడా మహాభారతంలో 18 పర్వాలున్నట్లు చెప్పి వాటిజాబితాను ఇచ్చాడు గాని అందులో ఆదిపర్వం పేరులేదు. ఆయనయిచ్చిన జాబితాలో మొదటిపర్వము

* విశ్వభారతి 1వ సంపుటము పుట. 343.

సభాపర్వమే! తరువాత అరణ్య విరాట ఉద్యోగ భీష్మ ద్రోణ కర్ణశల్య పర్వాలదాకా ఇప్పటి వరసలోనే ఉన్నవి. వాటితరువాత "గదాపర్వము"నే ఒక పర్వాన్ని పేర్కొన్నాడు. ఇది భీమ దుర్యోధనులమధ్య జరిగిన గదాయుద్ధాన్ని వర్ణించే పర్వం. ఇప్పుడిది శల్యపర్వంలో ఒక అశ్వాసంగా ఉంది. ఈ మార్పు ఎప్పుడు జరిగిందో తెలియదు. దీని తరువాత ఇప్పటి సౌప్తికపర్వం ఉన్నది. దాని తరువాత మళ్ళీ "జలప్రదానిక పర్వం" అనే ఒక కొత్తపర్వం పేరు కనబడుతూ ఉంది. యుద్ధంలో హతులైనవారికి తర్పణాలు ఉదకదానాలు చెయ్యడాన్ని గురించిన పర్వం ఇది. ఇప్పుడీభాగం స్త్రీపర్వంలో ఒక అశ్వాసంగా ఉంది. దీని తరువాత ఆయన జాబితాలో కూడా ఇప్పటిలాగనే స్త్రీ పర్వమూ శాంతిపర్వమూ ఉన్నవి. కాని శాంతిపర్వం తరవాత ఆయన జాబితాలో అనుశాసనిక పర్వంలేదు. అశ్వమేధ పర్వం ఉంది. దాని తరవాత ఇప్పటిలాగ ఆశ్రమవాస పర్వమూ మౌసలపర్వమున్ను కాక అల్బెరూనీ జాబితాలో ఆశ్వమేధపర్వం తరవాత మౌసలపర్వం దాని తరవాత ఆశ్రమవాస పర్వము ఉన్నవి. తరువాత మహా ప్రస్థానికపర్వము స్వర్గారోహణపర్వము అల్బెరూనీ జాబితాలో కూడా తేడాగాలేవు.

అల్బెరూనీ శాంతిపర్వములో 24 వేల శ్లోకాలు ఉన్నవని, రాజధర్మ - దానధర్మ అపద్ధర్మ - మోక్షధర్మాలనే - నాలుగు అశ్వాసాలున్నవనిన్ని కూడా పేర్కొన్నాడు. ఈ అశ్వాసాల పేర్లు సరిగ్గా పర్వానుక్రమణికలో ఉన్న అశ్వాసాలకు సరిపోతూవున్నవి. అందువల్ల ఇప్పటి అనుశాసనికపర్వం అల్బెరూనీ నాటి శాంతిపర్వంలో చేరివున్న దనడానికి వీలులేదు. అప్పటి శాంతిపర్వంలో మెల్లిగా అనేక విషయాలు చేర్చి ఈ మార్పులతో పెద్దదైనదాన్ని శాంతి అనుశాసనికపర్వాలు అని రెండుగా విడదీసినట్లు ఎంచుకోవాలి. గదాయుద్ధపర్వాన్నీ జలప్రదానిక పర్వాన్నీ పర్వాలలోనుంచి తగ్గించి ఆశ్వాసాలుగా మార్చివుండాలి.

బ్రహ్మశ్రీ వేదం వేంకటాచలయ్యగారు చాలా కష్టపడి మహాభారతాన్ని పరిశోధించి ఈ మార్పులను గురించి ఇంగ్లీషులో ఒక ఉద్గ్రంథం వ్రాశారు.

మహాభారతం ప్రారంభంలోను ప్రతిపర్వం చివరనూ పర్వానుక్రమణికలనే విషయసూచిక లున్నవి. అయితే ఇప్పటి మహాభారతములో కొన్ని పర్వాలలో ఈ పర్వాను క్రమణికలకూ పర్వాలలో కనబడే విషయాలకూ సంబంధం లేకుండా ఉన్నది.

గ్రంథంలో కనబడే ఇలాంటి సందర్భాలను బట్టి వేంకటాచలయ్యగారు ఈ క్రింది నిర్ణయాలకు వచ్చారు.

1. వ్యాసులవారే రచించినట్లు కొన్ని పర్వాలలో వుదాహరింపబడియున్నా అంతమాత్రంచేత అది నిజమని చెప్పడానికి వీలులేదు.
2. వ్యాసుని కర్తృత్వం సంగతి ఉదాహరించిన పర్వాలు మాత్రం వ్యాసకృతం కాదని నిశ్చయించవచ్చును.
3. అరణ్య కర్ణ పర్వములు అనుశాసనికము మొదలు స్వర్గారోహణము వరకున్నూ దరిమిలాను చేర్చబడినవని ఎంచవచ్చును.
4. అసలు గ్రంథం ఇప్పటి స్త్రీ పర్వంవరకూ గల పర్వాలలోఉన్న విషయాలతో ముగిసినట్లు ఎంచుకోవలెను.

5. విరాటపర్వం చాలా భాగం సవరించబడినది.
6. అరణ్య కర్ణ అనుశాసనికపర్వాలు దరిమిలా సృష్టించబడినవే.
7. ప్రథమంలో గ్రంథము పర్వాలుగా గాక ఆశ్వాసాలుగానే విభజించబడి యుండినది.
8. మొదటినుంచీ 18 పర్వాలుగానే ఉన్నదనడానికి వీలులేదు.
9. పర్వాలుగా విభజించినప్పుడు గ్రంథం చాలా వరకు సవరించబడినది. చివరి ఏడు పార్వలలోనూ ఈ సవరణలకు దాఖలా లున్నవి.
10. రెండవ ప్రకరణంలో ఇప్పుడు కనబడుతూ ఉన్న అధ్యాయాల సంఖ్య శ్లోకాల సంఖ్య అందులో నుదాహరింపబడి యున్న సంఖ్యతో సరిపోవడం లేదు. ఉత్తర హిందూస్థానంలోను దక్షిణాదిలోను ప్రచారంలో నున్న సంస్కృతభారత ప్రతులను 10వ శతాబ్దంలో రచింపబడిన తెనుగు భారతప్రతిని పోల్చి చూస్తే ఈ తేడా కనబడుతుంది.



# 4. నాగ - లింగ ప్రతిమారాధనము

జీవజంతువు లన్నిటిలోను సూక్ష్మబుద్ధి గలట్టిది. అది త్వరగానూ సొంపుగాను జరిగిపోవునట్టిది సర్పము. తక్కిన జంతువుల కుండే కాలుచేతులు దానికి లేవు. దానికి నడకపద్ధతియే వేఱు. దాని శరీరము అతిలావణ్యమైనది; వన్నెచిన్నెలు గలట్టిది. కృష్ణ సర్పముయొక్క యొయ్యారము అందరు చూచుచున్నదే. అది చిరజీవి. చాలాకాలము ఆహారమే లేకుండా జీవించగలదు. వాయుభక్షులంటే మనవారికి చాలా గౌరవం. సర్పం అలాంటి సంప్రదాయంలోనిది. అన్నిటికన్నను దానికిగల విశేషమైన లక్షణము తన విషముచేత ఇతర జంతువులను అవలీలగా చంపగల శక్తి. అమానుషములైన ఇన్ని శక్తులు గల సర్పము మనుష్యులచేత పూజింపబడుటలో ఆశ్చర్యం ఏమున్నది? ప్రపంచములో చాలా దేశాలలో సర్పము నొక దేవతగా ఆరాధిస్తున్నారు. ముఖ్యముగా జుడెయా, ఫోనీషియా, మెసపొటేమియా, గ్రీసు, ఇటలీ, స్కాండినేవియా, బ్రిటీషుదీవులు, ఆఫ్రికా, అమెరికా, పారశీక, కాశ్మీర దేశాలన్నింటిలోనూ సర్పము నారాధించిన చిహ్నములు నేటికిని కనబడుచున్నవి.

భారతదేశమునకు ఆర్యులు వచ్చునాటికే దేశమంతటను నాగులను ఆరాధించే నాగరికప్రజ లుండినట్లు చరిత్రాధారములున్నవి. ఆర్యుల సంపర్కము వలన నీదేశములోని పూర్వపు ప్రజల సాంఘిక మతాచార వ్యవహారములలో చిత్రచిత్రములైన మార్పులు కలిగిన నిదర్శనములు కనబడుచున్నవి. ఉత్తర హిందూస్థానములోను, దానికి తూర్పున ఉన్న బర్మా అ బ్రహ్మదేశములోను, దానికి తూర్పునగల సయామనే శ్యామదేశములోను, కాంబోడియా అనే కాంభోజ దేశములోను దక్షిణ హిందూ దేశములోను, సింహళ

ద్వీపములోను కూడా ఈ నిదర్శనములు కనబడుచున్నవి. బౌద్ధమతము స్థాపించబడు నాటికి సింహళద్వీపములో నాగులను పూజించే జాతి ఒకటి ఉండేదని బౌద్ధగ్రంథమైన "మహావంశము" తెల్పుచున్నది.

బౌద్ధమతమునకును, జైనమతమునకును సంబంధించిన గాథలలో నాగపూజకు సంబంధించిన కథలున్నవి. ఈ మతములవారు చెక్కించిన శిల్పములలో నాగములు కనబడుచున్నవి. మన గుంటూరు జిల్లాలో బౌద్ధమతానికి పట్టుగొమ్మగా నుండిన అమరావతిలో బుద్ధప్రతిమలతోపాటు నాగప్రతిమలు కూడా ఉన్నవి. చెన్నపట్నానికి 40 మైళ్ల దూరములో నున్న మహాబలిపురములోకూడా బౌద్ధ చిహ్నాములతోపాటు నాగప్రతిమలున్నవి.

క్రీస్తుకు మూడువేల సంవత్సరములకు పూర్వము సింధు నదీతీరమున వర్ధిల్లిన నాగరికి చిహ్నాములు త్రవ్వియెత్తబడిన మొహెంజోదరో, హరప్పలలో కూడా సర్పారాధనకు సంబంధించిన చిహ్నాములు కనబడుచున్నవి. హరప్పలో ఒక ముద్రికపైన రెండు నాగముల పెనవేసికొనియుండగా వాటికి పైగా ఒక పుష్పమున్నూ, ఈ దృశ్యానికి రెండు ప్రక్కలను రెండు వైపులకు వెనుకకు తిరిగియున్న రెండు మేకలునుగల ప్రతిమయొకటి ఉన్నది.

ఈ సర్పారాధన మనేది హిమాలయ పర్వతముల కావల నున్న 'టిబెట్టు' అనబడే త్రివిష్టపదేశము బర్మా అనే బ్రహ్మదేశము నయా మనే శ్యామదేశము మొదలైన మంగలియా తురేనియా జాతుల ప్రజలు గల దేశాలకు సంబంధించినదేగాని కొందరణుకొనునట్లు భరతఖండములోని ద్రావిడ జాతికి సంబంధించినది కాదు. అయినప్పటికీ సర్పారాధనము మన దక్షిణాపథమునందలి ప్రజాజీవనంలో బాగా అల్లుకొనియున్నది. నాగులచవితి, సుబ్బారాయుడి షష్ఠి మొదలైన దినములలో నాగులనిప్పటికీ ఆరాధిస్తున్నారు. సుబ్రహ్మణ్యం మొదలైన పుణ్యక్షేత్రములలో సర్పమునే దైవముగా అరాధిస్తున్నారు. అన్ని కులాలలోను స్త్రీ పురుషులకు నాగుల పేర్లు పెట్టి వ్యవహరిస్తున్నారు. నాగయ్య, నాగమ్మ, సుబ్బమ్మ, సుబ్బయ్య మొదలైన పేర్లు సర్వసామాన్యములైనవి.

ఈ దేశములోని చిత్రమేమనగా ఆర్యుల వైదిక ధర్మము తక్కిన ధర్మాలను తనలో లీనము చేసికొని దేశములోని ఆచార వ్యవహారములలో ఏవి సనాతనములో, ఏవి అధునాతనములో తెలిసికోవడానికి వీలులేనంతటి మార్పులు కలిగించినది. భారతదేశములో ఎన్నివిధములైన మతాచార వ్యవహారములు కనబడుతున్నను, ఎన్ని సంప్రదాయములు కనబడుతున్నను భగవంతుని యెన్ని పేర్లతో పేర్కొన్నను సృష్టి స్థితి లయకారకుడైన పరమేశ్వరు డొక్కడే యనే పరమార్థము మాత్రము అన్నిటిలోను కనబడుతున్నది. ఇది సనాతన ధర్మముయొక్క ప్రభావము.

## పురాణ గాథలు

సర్పజాతిని గురించిన పురాణ గాథలవల్ల కొన్ని విశేషములు తెలియుచున్నవి. కశ్యపప్రజాపతి మరీచుని కుమారుడు; సూర్యుని మానసపుత్రుడు. ఇతడు

* (Manual of the Administration of Madras Presidency - C.D.Maclean, Vol.I.p 72)
(Survivals of Harappa Culture -T.G.A. Arravamudan, p.2.)

పుత్రసంతానమును గోరి కశము (మద్యము)ను త్రాగగా దక్షుడితనిని శపించినాడు. ఇందుకు బ్రహ్మ కోపించి దక్షుని తన కొమారితలను కశ్యపుని కిమ్మని ఆజ్ఞాపించినాడు. కశ్యపుడు దక్షపుత్రికలైన అదితి, దితి, దనువు, పృథ, విశ్వ, వినత, కద్రువ మొదలైనవారిని పెండ్లాడి సృష్టిని పెంపొందించినాడు. దేవతలు, దానవులు, నరులు, మృగములు వృక్షములు కశ్యపుని సంతానమే యని భారతము చెబుతున్నది.

కశ్యపప్రజాపతి భార్య కద్రువ కడుపున వేయి సర్పములు పుట్టినవి. శేషుడు, వాసుకి, ఐరావతము, తక్షకుడు మొదలైనవారీమె పుత్రులు. కద్రువ సవితియైన వినతను కద్రువ వంచిందించి ఆమెను దాసిగా చేయగా వినత కొమారుడైన గరుత్మంతు డమృతము తెచ్చి ఆమె దాస్యవిముక్తి చేసినాడు. కద్రువ చేసిన అన్యాయమునకు శేషుడు అసహ్యపడి ఇల్లువెడలి పోయి బ్రహ్మనుగూర్చి తపస్సు చేయగా బ్రహ్మ ప్రత్యక్షమై 'నీవు భూభారమును వహింపు' మని శేషునికి చెప్పి యాశీర్వదించినాడని భారతము చెప్పుచున్నది.

శేషుడు స్వర్గములో మహావిష్ణువు ద్వారమును కాచుచుండేవాడు. వాయువుతో పోరాడి ఓడినాడు. శేషుడు మేరు పర్వతముయొక్క కుమారుడైన వెంకటాద్రిని జుట్టుకొని యుండగా వాయుదేవుడాపర్వతమును దూరముగా విసిరివేసినాడు. శేషుడాపర్వతము పైననే యున్నందున అది శేషాద్రియైనదని వెంకటాచల మహాత్మ్యము. ఆదిశేషుడనగా ఆద్యంతములు లేనివాడని అర్థము.

ఉలూచి యొక నాగకన్యక. అర్జునుడు తీర్థయాత్రలు చేస్తూ ఒక కొలనులో స్నానము చేయుచుండగా ఉలూచి ఆయనను చూచి మోహించి యాతనివలన ఐరావంతుడను పుత్రుని బడసినదని భారతము. ఆర్యులు నాగులతో సంబంధబాంధవ్యము చేయుటను, ఆర్యనాగరికత నాగులనాగరికతను తనలో లీనము చేసికొనుటను ఈకథ సూచిస్తున్నదని కొందరియూహ.

భూమికి, సూర్యచంద్రులకు సంబంధించిన సర్ప గాథ గ్రహణములను కలిగించే రాహుకేతువుల పుట్టుక కథ. కద్రువ కుమారుడైన వాసుకి యనే మహాసర్పమును త్రాడుగా జేసి, మంథరపర్వతమును కవ్వముగా జేసి, దేవదానవులు క్షీరసముద్రమును మథించగా అమృతము పుట్టినది. దానికొఱకు దేవదానవులు పోరాడుతుండగా శ్రీమహావిష్ణువు మోహినీ రూపమును ధరించి దానిని పంచుతానని చెప్పి దేవతల నొక పంక్తిలోను, దానవుల నొక పంక్తిలోను కూర్చుండబెట్టి ముందుగా దేవతలకు దానిని పంచియిస్తూవుండగా రాహువనే దానవుడు దేవతావేషము ధరించి వారి పంక్తిలో కూర్చున్నాడు. ఈ సంగతి సూర్యచంద్రులు చెప్పగా విష్ణువు తన చక్రాయుధంతో రాహువు తల ఖండించాడు. అమృతం సోకినందువల్ల తల, మొండెము వేరైనను సజీవమై సర్పరూపంతో రాహువు కేతువులుగా నుండి గ్రహణములలో సూర్య చంద్రులను మ్రింగుతూ వుండును. ఇవి ఛాయలని

## సర్పచిహ్నము

సర్పము భారతదేశములో బుధచిహ్నంగాను, ఈజిప్టు దేశంలో హెర్మిసు చిహ్నంగాను, గ్రీసు దేశంలో మెర్క్యురీ చిహ్నముగాను ఉన్నది. బుధు డొక గ్రహము.

బుధుడు చంద్రాంశమున జన్మించినవాడు. బుధుడు బృహస్పతి భార్యయైన తారయందు చంద్రునికి పుట్టిన కుమారుడు చంద్రుని భార్య రోహిణి బుధుని పెంచినది.

వైవస్వతమనువు పుత్రసంతానమును కోరి యజ్ఞము చేయగా 'ఇల' అనే కొమార్తె పుట్టినది. వశిష్ఠుడు ప్రార్థింపగా ఇర పురుషుడై సుద్యుమ్నుడని వ్యవహరింపబడినాడు. అతడు ఒక కొలనులో స్నానము చేయగా శాపమువలన మళ్లీ స్త్రీయైపోయెను. ఆమె 'ఇల' అని వ్యవహరింపబడినది. పైవిధముగా ఆమె వైవస్వత మనువు కూతురైనది. ఆమె చాలా రూపసి. బుధుడామెను చూసి ఇంటికి తీసికొనిపోయి భార్యగా స్వీకరించినాడు. వారికి పురూరవుడు జన్మించినాడు. బుధుడు తపస్సు చేసి గ్రహపథమందు నిలిచినాడని భాగవతము.

ఇలాదేవి మనువుకుమారుడైన ఇక్ష్వాకు కుమార్తెయనిన్ని, సర్పరూపముననున్న బుధుడామెతో రమింపగా మనుష్యజాతి పుట్టిన దనిన్ని ఇంకొక పురాణగాథ యున్నది.

పైన చెప్పిన విధముగా చంద్రాంశమునందు జన్మించిన బుధుడు మానవుల బుద్ధితత్వమునకు ఆధిదేవతయైనాడు జీవ జంతువులలోకెల్ల సూక్ష్మబుద్ధియైన సర్పమే అతని చిహ్నమైనది. 'సర్ప'మనే మాటకు 'కాల' మనికూడా అర్థమున్నది.

మానవుని మనస్సు - శరీరముల బంధమును విడగొట్టి ఆత్మను పరమాత్మతో ఐక్యముజేయుట కేర్పడిన యోగసాధనలో నుత్తేజింపబడవలసిన కుండలినీ శక్తికికూడా సర్పమే చిహ్నముగా చేయబడినది.

## కుండలినీ స్వరూపము

యోగసాధకులు సర్పాకారముగల కుండలినీ శక్తిని గురించి చెపుతారు. మనుష్యుని శరీరములో వీణాదండమునకు రెండు ప్రక్కలను ఇడ, పింగళ అను నాడులును, మధ్యసుషుమ్నపారు సన్నని కాలువయున్నూ ఉన్నవి. ఈసుషుమ్న కాలువ క్రింది భాగముకు చివర యోగులు చెప్పే కుండలిని యున్నది. ఈ కుండలిని మూలాధారమనే చక్రమున ఉంటుంది. అందులో కుండలిని యనే మహాశక్తి సర్పములాగ చుట్టచుట్టుకొని ఉంటుంది. దాని పగడ ముడుచుకని ఆచుట్టక్రింద అణగి వుంటుంది. యోగసాధనచేత ఈశక్తిని మేలుకొలుపగా నది సుషుమ్న కాలువ ద్వారా క్రమేణ పైన గల చక్రము లన్నిటిని దాటి పైకిపోవుటకు దారిచేసుకొన ప్రయత్నిస్తుంది. ఇది ఊర్ధ్వాభిముఖియై పైకి పోవుకొలది మెల్లమెల్లగా సాధకుని మానసవుపొరలు వీడి పలువిధములైన దివ్యదృక్కులును, అద్భుతశక్తులును కలుగుతవి. చివర కీశక్తి మెదడులో సహస్రారచక్రమున జేరగానే సాధకుని శరీరమానసములతోడి బాంధవ్యమును త్రెంపి ఆత్మకు స్వేచ్ఛను చేకూర్చి పరమాత్మతో ఐక్

## సూర్యారాధనము - లింగప్రతిమలు

మన పూర్వ ఋషులు సూర్యదేవుని పెక్కురూపములతో వర్ణించియున్నారు. అతడు సకల దేవతా తేజః పుంజరూపమై యున్నందువల్ల అలా వర్ణించి యుండడంలో

* చూడు వివేకానందస్వామి వారి రాజయోగము పుట 57.

ఆశ్చర్యంలేదు. ఋగ్వేదమునందు దేవతా తత్త్వవేత్తలైన మేధావులాదిత్యునే ఇంద్రునిగాను, మిత్రునిగాను. వరుణునిగాను, అగ్నినిగాను, దివ్యుడు సువర్ణుడునైన గరుత్మంతునిగాను, యమునిగాను, మాతరిశ్వునిగాను జెప్పుచున్నారు. పృథివీ స్థానము, అంతరిక్షస్థానము, ద్యుస్థానములందు గల దేవతాత్మత్వ మాదిత్యుని కారోపింపబడినది*.

మన స్తవములందు సూర్యభగవాను డుదయమున బ్రహ్మ స్వరూపుడును, మధ్యాహ్నము మహేశ్వర స్వరూపుడును, సాయంకాల నదావిష్ణు స్వరూపుడునని వర్ణింపబడినాడు. విష్ణువనగా సర్వవ్యాపి.

సూర్యుడుకూడా అదితికశ్యపులకుమారుడే అని బ్రహ్మాండ పురాణము చెపుతున్నది. బుధుని భార్యయైన ఇల సూర్యుని మనుమరాలు.

ఒక్క భారతదేశంలోనే కాదు, ప్రపంచములో క్రీస్తుకు పూర్వము రెండువేల సంవత్సరముల కిందట నాగరికత ననుభవించిన సిరియా దేశంలోకూడా సూర్యుడు 'బాల్' అనే పేరుతో ఆరాధింపబడేవాడు. అక్కడను, మన దేశమున గంగాతీరముననుగూడా సూర్యభగవానుని చిహ్నములుగా లింగాకారము గల శిలాస్తంభములు నెలకొల్పబడి దానికి సంబంధించిన ప్రతిమారాధనము, అర్చనలు. కార్యకలాపములు వర్ధిల్లినట్లు చరిత్రాధారములు కనబడుతున్నవి. ఋగ్వేదకాలమునాటి ఆదిత్యుడే రుద్రుడుగను, శివుడుగను ఆరాధింపబడినందువల్ల ఈ లింగాకార ప్రతిమలు శివుని బింబములుగా ఆరాధింపబడడంలో ఆశ్చర్యం ఏమున్నది?

## శివలింగము

ఋగ్వేదమునందు ఆదిత్యుడే యగ్నిగా నిరూపింపబడి ప్రచండస్వరూపమున రుద్రుడని పేర్కొనబడినాడు. శివుని పేరు కనబడదు గాని తరువాత శివునికి గల చాలా పేర్లు ఈ రుద్రశివునికి కనబడుతున్నవి. ఈశానుడని, యువనుడని ఉగ్రుడని వర్ణింపబడినాడు. యజుర్వేదములో త్రిపురాసురులను నిర్జించుట చెప్పబడినది. శతరుద్రీయములో నీ వర్ణనములన్నియు క్రోడీకరింపబడినవి. శ్వేతాశ్వతరోపనిషత్తులో శైవ సిద్ధాంతము వివరింపబడినది. శివుడు తక్కినదేవత లందరికంటె అధికుడనే భావముతో ఇతడు మహాదేవుడని, ఈశానుడని, గిరీశుడని వర్ణింపబడి శివభక్తి బోధింపబడినది. తరువాత రచింపబడిన ఉపనిషత్తులలోను, శైవపురాణములోను శివుని కథలు విపులీకరింపబడినవి.

ఇటీవల సింధునదీ తీరాన మొహెంజోదరో హారప్పలలో కనబడిన క్రీస్తుకు పూర్వము మూడువేల సంవత్సరముల నాటి శిథిలములలో నొక ముద్రికమీద కుడిప్రక్క ఏనుగు, ఎడమప్రక్క ఖడ్గమృగమున్నూ ఎనుబోతున్నూ, మధ్యమూడు ముఖముల దిగంబరమూర్తిన్నీ చిత్రింపబడియుండుట చూచి సర్ జాన్ మార్షల్ గారది బ్రహ్మ విష్ణు మహేశ్వరుల యంశములను సూచించు పశుపతీశ్వరుడైన శివుని విగ్రహమే యని చెప్పినారు. ఆచ్ఛాదనము లేని పురుషచిహ్నము నొక నిదర్శనముగా చూపినారు. కాని

---

* చూడు. బ్రః॥శ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారి సంస్కృత వాఙ్మయచరిత్ర - 1వ భాగం, పుట10.

అంతమాత్రముచేత అది అలాగ నిర్ణయించడానికి వీలులేదు. అసలు శివలింగము పురుషచిహ్నమేనా అనేది ముఖ్యంగా ఆలోచించవలసిన విషయము. ప్రపంచములో కొన్నిచోట్ల స్త్రీపురుషచిహ్నము లర్చింపబడిన వనుమాట నిజము. భారతదేశములో కూడా కొన్ని అనాగరక జాతుల వారిలో పురుషచిహ్నారాధన యున్నందుకు నిదర్శనములు కనబడుతున్నవి. శాక్తేయములోని కొన్ని ఆచారములలో యోనిపూజ మొదలైనవి కనబడుతున్నవి. అందువల్ల శివలింగము పురుషచిహ్నమేయని పాశ్చాత్య విద్యావంతు లూహించినారు. కాని ఈ శివలింగము విష్ణు చిహ్నమైన సాలగ్రామములాంటి రూప రహితమైన చిహ్నమే యైయుండవచ్చు నని మన చరిత్ర పరిశోధకుల యభిప్రాయము. నిజమునకు ఇతర దేశాలలోని పురుషచిహ్నమువలె గాక భారతదేశములోని లింగములు చూడడాని కేమాత్రము అసహ్యముగా నుండవని భారతదేశ మతముల చరిత్రను వ్రాసిన బార్తు (Barth) వ్రాసినాడు. *

"స్థాణూ రుద్ర ఉమాపతీ" యనునవి శివునకుపేర్లని అమరము. ఇక్కడస్థాణు వనగా ఎండిపోయిన చెట్టుబోదె యని బ్ర॥శ్రీ వావిలికొలను సుబ్బారావు పంతులుగారు శ్రీమదాంధ్రవాల్మీకి రామాయణమునకు వ్రాసిన మంథర మనేవ్యాఖ్యానములలో నుదాహరించి యున్నారు. (చూ: బాలకాండ, పుట 33) స్థాణువనగా కొమ్మలు లేని చెట్టుమ్రోడు అనిన్నీ, స్థిరమైన దనిన్నీ అర్థము.

## ప్రకృతి పురుషారాధనము

స్త్రీ పురుష చిహ్నముల ఆరాధనలో కూడా అంతరార్థము లేకపోలేదు. అది ప్రకృతి పురుషారాధనమే యని చాలామంది పరిశోధకుల అభిప్రాయము. ప్రకృతి పురుషులను పరతత్వముగా నారాధించుటలో ప్రజలు ప్రకృతియొక్క సృష్టి తత్వమునకు చిహ్నముగా లింగమును గ్రహించి పూజించుట ప్రారంభించిరి. బుద్ధిమంతులు కేవలసృష్టితత్వము నారాధించుటతో తృప్తిచెందక దానికి బుద్ధితత్వమును చేర్చి యారాధింపసాగిరి. అసందర్భములో సృష్టితత్వచిహ్నమైన లింగమునకు బుద్ధితత్వచిహ్నమైన సర్పమును జతపరచిరి. దీనికి తార్కాణముగా శివాలయములందు లింగమును జుట్టుకొనియున్న ఇత్తడి సర్పములు నెలకొల్పబడి యున్నవి.

మనువు కుమారుడైన ఇక్ష్వాకుపుత్రికయైన ఇలతో సర్పరూపముననున్న బుధుడు రమింపగా మనుష్యులు పుట్టినారను గాథకూడా దీనినే సూచించుచున్నది. దక్షిణ హిందూదేశములో దిగంబరయైన యొక స్త్రీ కుడితొడకొకపాము చుట్టుకొనియున్నట్లుగా చెక్కబడిన పురాతన శిల్పములు చాలా చోట్ల కనబడుచున్నవి. ఈ విగ్రహము ప్రక్కనే భక్తితో నమస్కరిస్తూ ఉన్న ఇంకొక విగ్రహము చలికాలములో ధరించి నట్లుగా ఒంటినిండా బట్టలు ధరించినది యుండును. ఇలాంటి విగ్రహములు కృష్ణాజిల్లాలోకూడా కనబడినవి. ఇవి చాలా పురాతనమైన జైనశిల్పములుగా నెంచబడుచున్నవి. ఈ శిల్పములు పైన చెప్పిన గాథలకు అనుగుణములుగా నున్నవి.

---

* A Historical Sketch of Saivism, By. K.A.Nilakanta Sastri, Cultural Heritage of India, Vol. IIp.p. 18-34.

ఇటలీదేశములో అగ్నిపర్వతమువలన నాశనమైన పురాతన నగరముగు పాంపేలో 'ఇసిస్' అనే దేవతయొక్క దేవాలయమునుండి తెచ్చిన లింగప్రతిమయొకటి 'పోర్టిసి' (Portici) లో నున్నది. ఈ లింగమును ఇత్తడిసర్పము చుట్టుకొనియున్నది. అక్కడియిళ్ళ చపటామీద ఇలాంటి లింగములే చిత్రింపబడి యున్నవి. ముఖ్యముగా పాంపే నగరములో నున్న చిన్న 'ఇసిస్' దేవాలయపు తలుపులమీద లింగముల తోరణము, యోని (పానవట్ట) రూపమును ముఖ్యముగా గమనింపతగినవి. అక్కడనే ఇంకొక వైపున ఇలకు ప్రతిరూపమైన 'వీనస్' దేవతతో బుధుని ప్రతిరూపమైన మెర్క్యురీ రమించుచుండుట చిత్రింపబడినది.*

## శ్రీకృష్ణుడు - బుధుడు

భారతదేశములో శ్రీకృష్ణునొక యవతారముగా నెంచి పూజించుట ప్రారంభింపక పూర్వము బుద్ధుడినే ఆరాధించేవారు. శ్రీకృష్ణమూర్తికూడా బుధుణ్ణి ఆరాధించినట్లు కనపడుతూ ఉన్నది. ద్వారకలో బుధుడి దేవాలయం ఉండేది. అది యుండినచోటనే ఇప్పుడు శ్రీకృష్ణుడి దేవాలయం నిర్మించబడినది. ఇప్పటికీ అక్కడ బుధత్రివిక్రముడి ఆలయం ఒకటి యున్నది. ద్వారక సౌరాష్ట్ర ద్వీపకల్పములో 'జగత్ యొక్క అంత'మని ప్రతీతి గల ఒకచోట నున్నది.

గయలో నొక గుహలో కనబడిన శాసనములో "బుధుడైన శ్రీహరి" యని శ్రీకృష్ణ బుధుల యభేదము సూచింపబడినది.

పురాతనములైన పాశ్చాత్య దేవాలయములలో కూడా శ్రీకృష్ణుని ప్రతిరూపమైన అపోలో (Apollo) చిహ్నమునూ, బుద్ధుని ప్రతిరూపమైన మెర్క్యురీ చిహ్నమునూ ఒక్కప్పుడొక్కటిగానే కనబడుతూ ఉన్నది.

బుధుడి దగ్గరనుండి శ్రీకృష్ణుడు వేదరహస్యములను సంగ్రహించినాడనే భారతీయ పురాణగాథ, ఆయాదేశాలలో కూడా ప్రచారంలో ఉన్నది. శ్రీకృష్ణుడు గరుడధ్వజుడు కాళీయుడనే సర్పరాజు (కద్రువ కుమారుడు) గరుడునికి వెఱచి కాళింది మడుగులోదాగి దానిని విష కలుషితముగ చేసెను. శ్రీకృష్ణుడతనిని మర్దించి అతని భార్యలు వేడుకొనగా ప్రాణదానము చేసి పాతాళమున బ్రతకమని విడిచినట్లు భాగవతమున చెప్పబడినది.**

శ్రీకృష్ణుడు యదువంశజుడు. ఇతడు భూమండలాధిపతి యైన స్వాయంభువు మనువు యొక్క మూడవ కొమారుడయిన యయాతి సంతతివాడు. మనువు కొమార్తె యయిన ఇల, అనగా భూదేవిని చంద్రతనూజుడైన బుధుడు వివాహమాడగా వారి సంతతివారైన యదువంశజులు మొదలైన వారందరూ చంద్రవంశమువారైనారు. ఇప్పటికీ ఈ చంద్రవంశీయులందరూ బుధుణ్ణి పిత్రేశ్వరుడైన దేవునిగా అర్చిస్తున్నారు.

జైనుల మతగ్రంథమువలన కొన్ని విశేషములు తెలుస్తున్నవి. జైనతీర్థంకరుడైన నేమినాథుడి అసలుపేరు అరిష్టనేమి. ఇతడు బుధదేవుడి ప్రధాన పురోహితుడు. ఇతడు శ్రీకృష్ణుని కాలంనాటివాడు. పైగా యదువంశజుడు. ఇద్దరి పేర్లలోను శ్యామల వర్ణము

---

* Annals of Raiasthan - Tod, Vol. I.P.557.

** ఇదికూడా కుండలినిని లేపుటకు గూర్చిన గాథయే అని కొందఱియూహ.

సూచింపబడుచున్నది. అరిష్టమనే పదములో నీల వర్ణమున్నదని రాజస్థాన కథావళిని రచించిన జేమ్సు టాడ్‌గారు వ్రాసినారు.*

## సూర్యచంద్ర వంశములు

చంద్రవంశమునకు మూలపురుషుడైన బుధుని భార్య ఇల, సూర్యుని మనమరాలు. అందువల్ల ఆర్యావర్తములోని రాజులందరూ చంద్రవంశజులుగానో, సూర్యవంశజులుగానో ఉండడంలో ఆశ్చర్యం ఏమున్నది? ఈ కారణమువల్లనే సూర్యచంద్రుల ఆరాధనము జరుగుటలో కూడా ఆశ్చర్యం లేదు. ఈసూర్య చంద్రవంశములకు చెందిన రాజపుత్రులు ఉత్తర హిందూస్థానములో, ముఖ్యంగా రాజపుత్రస్థానంలో బలనాధుడనే సంజ్ఞతో, సూర్యునినీ, బుధుడనీ సజ్ఞతో చంద్రుణ్ణి ఆరాధిస్తూ వుండేవారు.

ఒక్క భారతదేశంలోనివారే కాక అరేబియాదేశంలోని దేశద్రిమ్మరులును, తార్తారీ ప్రాంతములలోని ప్రజలును సూర్యచంద్రుల నారాధించేవారు. ఇంకా ఆరాధిస్తున్నారు.

## శ్రీమహావిష్ణువు అవతారమైన శ్రీకృష్ణుడు

ఋగ్వేదములో విష్ణు వొక ప్రత్యేక దేవుడుకాడు. సకలలోక స్రష్టగా, లోకరక్షకుడుగా ధ్యానింపబడిన ఋగ్వేద విష్ణువు సూర్యుడే. ఋగ్వేదములో భాగనారాయణులని పేర్కొన బడిన దేవతలు కూడా సూర్యుడే. తరువాత పౌరాణిక యుగములో వైకుంఠవాసుడగు శ్రీమహావిష్ణువును గూర్చిన భాగవతభక్తి ప్రబలినది. సాత్వత యాదవ వంశీయుడు, వాసుదేవుడు, దేవకీసుతుడు అని వ్యవహరింపబడి శ్రీమహావిష్ణువు యొక్క అవతారముగా నెంచబడిన శ్రీకృష్ణమూర్తి వలన నీభాగవత మతమభివృద్ధి గాంచినది. ఛాందోగ్యోపని షత్తులో దేవకీసుతుడైన కృష్ణుడు ఘోరఅంగీరసుని శిష్యుడుగా పేర్కొన బడినాడు. అతడు భాగవతభక్తిని బోధించినాడు. కొద్దికాలములోనే కృష్ణుడే భగవదవతారముగా పూజింపబడినాడు.

ద్వాపరయుగాంతమున కృష్ణావతారము ప్రవర్తిల్లెనని పురాణములు చెప్పుచున్నవి. క్రీ.పూ. 1200లో శ్రీకృష్ణుడుండినాడని కొందరి యూహ. ఏది ఎలాగనున్నా శ్రీకృష్ణుడు చారిత్రపురుషుడేననినీ, తరువాత అవతారముగా ఆరాధింపబడినాడనినీ కొంతమంది చరిత్రకారులు వ్రాసిన కొన్ని సందర్భములవల్ల కనబడుతున్నది.

మధురాపురము రాజధానిగా మాధురము, శూరసేనము లనే రాజ్యభాగములు నేలు శూరసేను డనే యదువిభుడు మధురకు చుట్టూ 80 మైళ్ల విస్తీర్ణము గల దేశానికి అధిపతి. శూరసేనుని కుమారుడు వసుదేవుడు. అతడు దేవకుని కొమార్తెయైన దేవకిని పెండ్లియాడినాడు. దేవకీదేవికడుపున బుట్టిన ఎనిమిదవ శిశువువలన తనకు మరణము కలుగునని విని, కంసుడు దేవకీదేవిని, వసుదేవుని చెఱసాలలో నుంచినాడు. శ్రీకృష్ణుడు కారాగారములోనే జన్మించగా వసుదేవు డాశిశువును మెల్లిగా బయటికి తీసుకొనివెళ్లి నందునింట వదలగా నతడక్కడ పెరిగి పెద్దవాడై కంసుని వధించి, రాజై అవతార పురుషుడైన కథ అందరికిని తెలిసిన విషయమే.

---

* చూ. 1వ సంపుటం, 20వ ప్రకరణము.

శ్రీకృష్ణమూర్తికి, వాసుదేవుడు, హరి, నారాయణుడు మొదలైనవి చాలా పేర్లున్నవి. ఆయన భారతదేశానికి ఏకచ్ఛత్రాధిపత్యము వహించి, 56 ఛప్పన్న రాజ్యాలను స్థాపించి అనేక అమానుష కార్యములను చేసి శ్రీమహావిష్ణువు యొక్క అవతారముగా పూజింపబడినాడు.

## వ్రజము

మధురా నగరమును కేంద్రముగా తీసికొనినచో దానికి 80 మైళ్ల దూరము (వ్యాసార్థము) చుట్టూ గల ప్రాంతమంతా వ్రజము. ఈ భూభాగము భారతదేశములోని కంతా సర్వవిధములా శ్రేష్ఠమైనది. అక్కడి భాష వ్రజభాష. ఇది భారతదేశంలో కల్లా స్వచ్ఛమైన దేశభాష. తరువాత తులసీదాసు తన రామాయణమానస మనే ఉద్గ్రంథాన్ని ఈ భాషలోనే రచించాడు. శ్రీకృష్ణుని వంశమునకు మూలపురుషుడైన శూరసేనుని పేరునుండి శూరసేని యనే దేశము, భాష, పుట్టినవి. ఈ దేశము వ్రజము. ఈ దేశానికి రాజధాని సురపురి. ఇది మధురానగరానికి దక్షిణమున యమునాతీరమున నుండేది. దీని శిథిలములను రాజస్థాన కథావళిని రచించిన జేమ్సు టాడ్‌గారు కనుగొన్నారు. (చూ : 1వ సంపుటము పుట 542) శూరసేన రాజ్యపు హద్దులు మనుస్మృతిలో వివరింపబడినవి. క్రీ.పూ. 323లో భారతదేశానికి దండెత్తి వచ్చిన గ్రీసుదేశపు మహావీరుడైన అలెగ్జాండరు ఆస్థానములోని చరిత్రకారు లీసురపురిని పేర్కొని యున్నారు.

## బృందావనము

కృష్ణభగవానుని అర్చించే దేవాలయాలుగల బృందావనము యమునానదీ తీరాన మధురానగరానికి కొన్నిమైళ్ల దూరములో నున్నది.

యమునానదికి 'కాలయమున' యనికూడా పేరు. ఆ నది నీరు నల్లగా ఉండేది. యమునానది సూర్యుని శ్యామలపుత్రికయని జయదేవ కవి వర్ణించాడు.

## మొగలు చక్రవర్తుల కృష్ణభక్తి

క్రీ.శ. 1658లో ఢిల్లీ సింహాసనము నధిష్ఠించి 1707లో దివంగతుడైన మొగలుచక్రవర్తి ఔరంగజేబుకు పూర్వం రెండువేల సంవత్సరాలనుంచి వ్రజములో కృష్ణదేవునారాధనలు మహావైభవంగా జరుగుతూ ఉన్నట్లు తెలుస్తున్నది. మహమ్మదీయ దండయాత్రల కాలంలో శ్రీకృష్ణభగవానుని ఆరాధన ఒకచోటనుండి ఇంకొకచోటికి జరిగి కాలక్షేపము చేయవలసివచ్చినది. మొగలాయి చక్రవర్తులకాలంలో ఈ ఆరాధనకు ఇబ్బంది కలుగలేదు. పైగా కొందరు చక్రవర్తులు తమ మతముతో పాటు వైష్ణవమతమునుకూడా ప్రోత్సహించినట్లు చరిత్రాధారాలున్నవి. 1555 నుండి 1605 వరకు చక్రవర్తిగానుండిన అక్బరుపాదుషాకు జయదేవుడి గీతగోవిందమంటే చాలాప్రీతి. గీతగోవిందములో రాధాకృష్ణుల శృంగారమును భక్తిపరంగా చెప్పే అర్థం విని ఆనందించి అతడు తన్మయు డయ్యేవాడు. అక్బరు చక్రవర్తికి భార్యయైన ఒక రాజపుత్ర స్త్రీ వలన జన్మించిన పుత్రుడు జహంగీరు. ఇతడు కూడా శ్రీకృష్ణభక్తిని, ఆరాధనను ప్రోత్సహించేవాడు. ఇతనికి రాజపుత్ర

భార్యవలన జన్మించిన షాజహాను చక్రవర్తి సిద్ధరూపుడనే సన్యాసివల్ల శైవసిద్ధాంతము నుపదేశము పొందినాడు. శివభక్తులకు, విష్ణుభక్తులకు స్పర్థలు, విరోధములు బయలు దేరినందువల్ల శ్రీకృష్ణుని ఆరాధన వ్రజదేశమునుండి దేశాంతరమునకు పోయి తల దాచుకొనవలసి వచ్చినది. కాని ఉదయపుర రాజపుత్రియైన ఒక రాణియొక్క ప్రార్థనవలన మళ్ళీ వైష్ణవమతము. శ్రీకృష్ణభక్తి వ్రజములో నెలకొల్పబడినవి. ఇంతలో 1658లో ఔరంగజేబు చక్రవర్తియై కృష్ణభగవానుని ఆరాధనలు వ్రజములో నెక్కడను జరుగకూడదని నిషేధించినాడు. అంతట మధురలోని కృష్ణదేవుని విగ్రహాన్ని రక్షించడానికి రణరాజసింగు గారిచ్చిన లక్షరాజపుత్రుల సహాయముతో ఆ కృష్ణవిగ్రహాన్ని తీసుకొని కోట రామపురముల మార్గంగా బైలుదేరి పోతూవుండగా 'నాధద్వారము' దగ్గర రథచక్రములు భూమిలోకి దిగిపోయి రథము కదలలేదు. అంతట అక్కడనే నాధజీస్వామిని ప్రతిష్ఠించారు. అప్పటినుంచీ అది మహాక్షేత్రమైనది.

## "ఇందు స్థానము"

1817 మొదలు కొన్ని సంవత్సరములు రాజపుత్ర స్థానములోనే యుండి రాజస్థాన కథావళిని రచించిన జేమ్సుటాడ్ భారతదేశములోని వైదిక ధర్మములను, మతాచార వ్యవహారములను జాగ్రత్తగా పరిశీలించి పురాణ గాథలను తరచి పాశ్చాత్య దేశాలలో వీటిని పోలినవన్నీ ఇక్కడనుండి అక్కడికి వ్యాపించినవే అని నిర్ణయించినాడు. హిందుస్థానమనేది నిజంగా "ఇందు" స్థానమే అనిన్నీ చంద్రారాధనకు పుట్టినిల్లు గనుక నిది ఇందు స్థానమైనదనిన్నీ "ఇందు – సిధియా" అనేది పూర్వం గంగా నదీ తీరంనుంచి ఐరోపాదేశంలోని కాస్పియను సముద్ర తీరం వరకూ వ్యాపించియున్నట్లు దృష్టాంతరాలు కనబడుతున్న వనిన్నీ టాడ్ వ్రాసియున్నాడు.

శ్రీకృష్ణుడు మురళీధరుడై సంగీత వేదమునకు అధినాధుడుగా నున్నాడు. ఆయన వేణువు వెదురుగొట్టము. ఇప్పుడుపయోగములోనున్న ఛత్తార (చితార్) కు పూర్వ మీ వేణువే వాడుకలో ఉండేది. 'ఛత్తార్' అనే పదంలోని తార అనేదానికి తీగ అని అర్థం. దీనికి ఆరు తీగలుంటవి. 'షట్‌తార'లో నుంచే 'ఛత్తార్' వచ్చింది. ఇది ఐరోపాలో వ్యాపించిన కథ చాలా చిత్రమైనది. గ్రీసుదేశపు సితెర (Cithera) అనే ఆరు తీగల వాద్యమును "అపోలో" అనే దేవుడే మొదట నిర్మించినాడని అంటారు. ఈ సితార భారతీయుల 'ఛత్తార'లో నుంచి వచ్చింది. దానినుండి ఇంగ్లీషు (Cithera) స్పెయిను దేశపు Guitar పుట్టినది. ఈజిప్టు దేశీయులకు స్వరములు ఆరు. గ్రీసు దేశీయులకూ ఆరే. క్రీ.శ. 13వ శతాబ్దంలో ఒక ఇటలీ దేశపు క్రైస్తవ సన్యాసి ఏడవస్వరం చేర్చాడు. భారతీయుల సప్తగ్రహాలనుండి సప్తస్వరాల నేర్పరచుకొన్నారు.

—

'పీటర్ సైమన్ పల్లాస్' అనే జర్మనీదేశపు ప్రకృతి శాస్త్రజ్ఞుడు (Naturalist) ఐరోపా ఖండములోని వివిధ ప్రాంతాలను తిరిగి చూసి అక్కడి విశేషాలను గురించి వర్ణించాడు. ఇతడు బెర్లిను నగరంలో 1741లో జన్మించి 1811లో దివంగతుడైనాడు. 1798లో

రష్యాదేశపు రాజధానియైన సెంట్‌పీటర్సుబర్గులో శాస్త్రపరిశోధన పరిషత్తులో ఆచార్యుడైనాడు. సైబీరియాలో నుండి రష్యాదేశంలోని దక్షిణప్రాంతాలను దర్శించి 1793-94 మధ్య క్రిమియాలో పర్యటనం చేశాడు. ఇతడు తాను చూసిన విశేషాలను గురించి అనేక వ్యాసాలను వ్రాసి ప్రకటించాడు. అతడు వ్రాసిన సంగతులను టాడ్‌గారు తమ రాజస్థాన కథావళిలో ఉదాహరించారు. ఐరోపా ఖండములో వోల్గానది దక్షిణానికి ప్రవహించి కాస్పియన్ సముద్రంలో సంగమం అయ్యేచోట అస్త్రఖాన్ అనే మహానగరం ఒకటి ఉన్నది. అక్కడ భారతీయ వర్తకులు నెలకొని యుండి మన దేవుళ్లను, ముఖ్యంగా శ్రీకృష్ణుని ఆరాధిస్తున్నారు. వారు సింధునదీతీరమునకు దగ్గరగానున్న ముల్తాను పట్టణం నుంచి అక్కడికి వెళ్ళినందువల్ల వారిని 'ముల్తానీ' లని అంటారు. ఈ తెగ వర్తకులు సింధునదీతీరం నుంచి కాస్పియన్ సముద్రంయొక్క పడమటితీరం వరకూ బాగా వ్యాపించి యున్నారు. వారి బొమ్మలని పల్లాస్‌గారు చిత్రించి ప్రకటించిన బొమ్మలలోని దుస్తులవల్ల కాని, రూపములవల్లకాని వారి జాతీయత యేదైనది తెలియడంలేదు. కాని వారి దేవుళ్ళు, దేవతలు మాత్రము గంగానదీ తీరాన ఉన్న పుణ్య క్షేత్రాలలోని వానివంటివే. అస్త్రఖానులోని భారతీయుల పేట (Indeskoi Devor) లోనున్న ముల్తానీల దేవతార్చనలో జగన్నాథస్వామి యొక్కయు, రాములవారు, ఆయన తమ్ముల యొక్కయు, విగ్రహాలు వెనక నుండగా శ్రీకృష్ణ భగవానుని విగ్రహము ముందున్నది. మధ్య శివుడును, అష్టభుజములుగల దేవి విగ్రహమును ఉన్నవి. ఈ మధ్యవరుసలో కృష్ణుని మురళి యున్నట్లు పల్లాసు వ్రాతవల్ల తెలుస్తున్నది. అయితే అత డామురళి నొక దండమన్నాడు. ఈ దేవతార్చనలోని ప్రధాన విగ్రహమును పల్లాస్ ఈ విధంగా వర్ణించాడు :

"మధ్య గుపాలెడ్షి (Gupaledshi) అనే పేరుగల పెద్ద 'కుల్లాయి' ('bonnet') ధరించిన చిన్నవిగ్రహ మున్నది. దాని కుడిప్రక్క ఒక నల్లని పెద్దరాయి ఉన్నది. ఎడమప్రక్కను హిందువులు పవిత్రమని ఎంచే గంగానదినుండి తెచ్చిన అదే రంగు చిన్నరాళ్లు మరి రెండున్నవి. ఇవి (సాలగ్రామ) శంకరులనే రకమువి"

పల్లాస్ చిత్రించిన బొమ్మనుబట్టి టాడ్‌గారి కీ కింది సంగతులు రూఢియైనవి. పల్లాస్ 'గుపాలెడ్షి' అని వ్రాసిన మాట 'గోపాల్జీ' అనే హిందీమాటయే. ఈ విగ్రహము వ్రజములోని గోపాలకృష్ణ విగ్రహమే. విగ్రహంయొక్క శిరోవేష్టనము చూస్తే మధురలో నృత్యముచేసే గోపాలకృష్ణ విగ్రహము శిరముపైన కనబడేదే. ఈ విగ్రహంలోని తక్కినవన్నీ దానికి సరిపోతున్నవి. ఆఖరికి చేతిలోని చక్కెరముద్ద కూడా కనబడుతున్నది. గోవర్ధనగిరికూడా కనబడుతున్నది. పల్లాసు పేర్కొన్న నల్లని రాళ్ళు వైష్ణవులందరూ భక్తితో పూజించే సాలగ్రామములే.

"పల్లాస్ వ్రాసినదానిలో 'నందిగణగోరి' అనే పదాలున్నవి. మొదటిది సింహ వాహనమనిన్నీ, రెండవది ఒక పురుష దైవమనిన్నీ అతడు పొరపాటుపడ్డాడు. ఇవి పరమశివుని నంది వాహనమును, పరదేవతయైన గౌరీవిగ్రహమునని మనము సులభముగా గ్రహింపగల్గుచున్నాము. పల్లాసుగారిలాగనే ఇతర చరిత్ర కారులును, గ్రంథకర్తలును తాము చూసిన విషయములను యథార్థంగా వివరిస్తే లోకానికెంత ఉపకారం చేసిన

వారయ్యేదరు!" అని టాడ్‌గారు సెలవిచ్చారు. అస్త్రఖానులో హిందువులతో కలిసిమెలసియున్న ఒక పెద్దమనుష్యుడితో టాడ్‌గారు మాట్లాడగా వారు భారతదేశము వదలి ఇంతదూరము వచ్చినా వారి ఋజువర్తనములో అవంతయైనా మార్పురాలేదని అతడు చెప్పినాడట. ఇలాంటి సంగతులనేకాలు టాడ్‌గారు తమ గ్రంథములో ఉదాహరించారు.*



# 5. ఋగ్వేదమునాటి సనాతనధర్మము

భారతదేశమునకు వచ్చిన ఆర్యులు మొట్టమొదట తూర్పు ఆఫ్గనిస్థానములోను పంజాబులోను నివాస మేర్పరచుకొన్నారని చాలామంది చరిత్ర కారులంటున్నారు. అక్కడ నుంచి వారు తూర్పువైపునకు జరిగి వచ్చినారు. కొంతకాలము వరకూ వారు తూర్పున బ్రహ్మావర్తమనే ప్రాంతములోనే ఉన్నారు. ఇది, ఇప్పుడు 'నరసుతి' అని పిలువబడుతూ ఉన్న సరస్వతీనదికిని, దృషద్వతీనదికిని మధ్యగల థానేశ్వర ప్రాంతము, ఈ నదులు సింధునది శాఖయైన సట్లేజి (శుతుద్రి) నదికిని యమునానదికిని మధ్య నున్నవి. అక్కడనుండి ఆర్యులు ఉత్తరమున హిమాలయ పర్వతములకు, దక్షిణమున వింధ్య పర్వతములకు మధ్యగల దేశమునంతా ఆక్రమించారు.**

క్రీస్తుకు పూర్వము 700 సంవత్సరముల ప్రాంతమునందుండినట్లు చరిత్రకారులు చెప్పే పాణిని రచించిన వ్యాకరణములోను క్రీస్తుకు పూర్వము 300 సంవత్సరముల నాడుండినట్లు చెప్పే పతంజలి రచించిన మహాభాష్యములోను మనుస్మృతిలోను కూడా ఈ పర్వతముల మధ్యగల దేశమే ఆర్యావర్తమని వర్ణింపబడినది. బ్రహ్మావర్తము లేక కురుక్షేత్రము అని వ్యవహరింపబడే థానేశ్వరమును మత్స్యదేశమని వ్యవహరింపబడే తూర్పు రాజపుత్రస్థానమును గంగా యమునా నదీతీరముల మధ్యభాగమును శూరసేనమని వ్యవహరింపబడే మధురా మండలమును కలిపి బ్రహ్మఋషి దేశమనేవారు.***

ఆర్యుల గ్రంథములలో ఋగ్వేదము బహు ప్రాచీనమైనది. అది అపౌరుషేయమని భారతీయుల విశ్వాసము. వేదములు సత్యమునుగూర్చి చెప్పు గ్రంథములైనందువల్ల అవి పరమ ప్రమాణములైనవి.

## ఋగ్వేదములోని ఆర్యసంఘము

"ఋగ్వేదముయొక్క దశమ మండలములో బ్రాహ్మణ రాజన్య వైశ్య శూద్ర శబ్దములు నాలుగు చతుర్వర్ణ వాచకములుగా నొక ఋక్కునమాత్రము ప్రయోగింపబడి యున్నవి.

* Annals of Rajastan, By James Tod. Vol.1, pp. 549-550.
** చూ. భండార్కరుగారి దక్షిణాపథ పూర్వచరిత్ర.
*** Oxford History of India.By Vincent A. Smith P.13.

అందే బ్రహ్మశబ్దము మఱికొన్ని ఋక్కులలో బ్రాహ్మణవర్ణ బోధకముగా గనవచ్చుచున్నది. తక్కిన మండలములలో సర్వత్రయిది. ఋత్విఙ్మంత్ర కర్మపరముగానే యున్నదని చెప్పవచ్చును. అట్లే రాజశబ్దము గూడ నితర మండలములలో సంఘపాలకుడు ప్రభువు కులనాయకుడు అనెడి యర్థములను తెలుపుచున్నదిగాని క్షత్రియవర్ణ వాచకముగా గనబడదు. వైశ్య శూద్రశబ్దములా యొక చోట దప్ప మఱెక్కడను ఋగ్వేదములో గనరాకున్నవి. కావున బ్రాహ్మణ క్షత్రియాది చతుర్వర్ణ వ్యవస్థ ఋగ్వేదకాలము కడపట నేర్పడినదిగాని మొదటి నుండియు నున్నదికాదని చరిత్రకారు లూహించుట యుచితమనియె తోచుచున్నది. అందుచే వర్ణము లేర్పడిన పిదప బయలుదేఱిన, నిరుక్తము, ఋగ్వేదములో సర్వత్ర గనవచ్చు, పంచజన పంచక్షితి శబ్దములకు నిషాద పంచములైన చతుర్వర్ణములను నర్థమును నిరూపించుటబట్టి భాష్యకారు లాశబ్దముల శబ్దార్థము వ్రాసినను, దానినిబట్టి వైదికార్యులలో మొదటినుండి వర్ణభేదమున్నదని తలంపరాదుగాని ప్రథమ మండలాదులనితరార్థములందు ప్రయుక్తములైన బ్రహ్మరాజ శబ్దములచే దశమ మండలమున క్రమముగా బ్రాహ్మణ క్షత్రియ వాచకములైనట్లు మాత్రము విశ్వసింప వచ్చును. మఱియు వృత్తి ప్రవర్తనాధులను బట్టి వర్ణభేద సూచకమైన యుత్తమ మధ్య మాధమ వివక్ష ఇంచుక నడుమ వచ్చియుండునని చెప్పవచ్చునుగాని విద్యావివేకాదులున్న చోట నదియును గణనీయముగా లేదనవచ్చును" అని బ్రహ్మశ్రీ మల్లాది సూర్యనారాయణ శాస్త్రులవారు తమ సంస్కృత (వైదిక) వాఙ్మయ చరిత్రయందు వ్రాసి దానికి రెండు ఉదాహరణము లిచ్చినారు.

"ఆర్షసంప్రదాయమున బ్రహ్మర్షియని ప్రసిద్ధికెక్కినవాడు దీర్ఘతముండు. ఇతడంగ రాజ మహిషికడ దాసిగా నున్న'ఉశిక్కు' అను దానియందు కక్షవంతుడను సుతుని గనెను. ఈ బాలుడు బీజమునుబట్టి దైర్ఘతమను దాంగీరసుఁడు నయ్యెను. క్షేత్రమునుబట్టి యౌశిజుడు దాసుడు నయ్యెను. అయినను రూప సంపన్నుడు విద్యాపూర్ణుడయిన యితనికి భావయవ్య పుత్రుడైన స్వనయుడనురాజు తన తనయల నిచ్చి పెండ్లి గావించెను. సూక్తద్రష్టలయిన మహర్షులలో నొకఁడై విఖ్యాతిగన్న యితఁడు రచియించిన సూక్తములు ఋగ్వేద (ప్రథమ) నవమ మండలములలో గలవు."

"కవషుడను ఋషి దర్శించిన నాలుగు సూక్తములు ఋగ్వేద దశమమండలమున నున్నవి. అందు మొదటిసూక్త మపోనప్త్రీయమను ప్రసిద్ధి వహించినది. ఈ ఋషి మహాత్వమును సూచించెడి యీ సూక్తమును బట్టియు, నార్షసంప్రదాయమును బట్టియు నైతరేయ కౌషీతకి బ్రాహ్మణములు రెండునుగూడ నితని వృత్తాంతము నిట్లు వర్ణించి యున్నవి. ఋషులందఱు కలిసి సరస్వతీనదీతీరమున సత్రయాగము చేయుచుండ నిలూష పుత్రుడైన కవషుడు వచ్చి వారినడుమగూర్చుండెను. వారతనిని జూచి 'నీవు దాసీపుత్రుడవు, కితవుడవు, అబ్రాహ్మణుడవు. మానడుమ గూర్చుండ తగవు' అనిపలికి వానిని తీసికొనిపోయి నీళ్ళులేనిచోట విడిచిపెట్టిరి. అతఁడపుడు పిపాసార్థితుడై యబ్దేవతను బ్రార్థించుచు నొక సూక్తము రచియించెను. అదే యపోన ప్త్రీయము. ఆ స్తుతికి సంతోషించి సరస్వతీనది యతఁడున్న చోటికి బ్రవహించెను. అదిచూచి ఋషులాశ్చర్యపడి యతనికి

గితవత్వదోషములేదని నిర్ణయించి వెంటనే యచ్చటకేగి కవషుని దోడ్కొనివచ్చి తమలో గూర్చుండబెట్టుకొని యతనిమంత్రములు వినియోగించి యాగము సాగించిరి. కవషు దున్న చోటికి నలుఁగడల సరస్వతీనది పరిసరించుటం జేసి యాచోటికి బరిసారకమను పేరు వచ్చినదట.

"పై రెండు కథలనుబట్టి యాకాలమున బాటింపఁదగిన వర్ణభేదము లేదని తెలియకపోదు. కాని ఋగ్వేద పరిసమాప్తి కాలమందా భేదము స్పష్టముగా నేర్పడెననుట నిజము."*

వైదిక యుగారంభములోనే హింస – అహింసల విషయమైన తగాదా ఒకటి ప్రారంభమైనట్లు కనబడుతూ ఉన్నది. ఏ జీవజంతువును హింసింపవలదు అనే అర్థంగల 'మా హింస్యాత్ సర్వభూతాని' అనే ధర్మంతోపాటు సర్వమేధయాగము నందన్ని జంతువులను వధింపవచ్చుననే అర్థంగల 'సర్వమేధే సర్వం హన్యాత్' అనే ధర్మముకూడా కనబడుతూ ఉన్నది.

విశ్వామిత్రునికిని వసిష్ఠునికిని వచ్చిన తగాదాలను గూర్చిన గాథలున్నూ శునస్సేపుని యజ్ఞపశువుగా తీసికొని పోతూవుండగా విశ్వామిత్రుడు రక్షించినట్లు చెప్పబడిన గాథయున్నూ ఆ కాలములో హింసాత్మకములైన యజ్ఞయాగాదికములను హర్షించని సంప్రదాయమొకటి తలయెత్తి యుండుటను సూచిస్తున్నదని తత్వవేత్తల యభిప్రాయము.

విశ్వామిత్రునిగాథ కొన్ని పురాణములలో విపులముగా వివరింపబడినది. ఇతడు గాధిపుత్రుడు. క్షత్రియుడు. కాని బ్రాహ్మణ స్వభావము కలవాడు. అతడొకమారు వేటకుపోయి వసిష్ఠాశ్రమమున విశ్రమించి వసిష్ఠుని హోమధేనువును చూచి దాని ప్రభావమున కాశ్చర్యపడి దానిని తన కిమ్మని వసిష్ఠు నడిగినాడు. అతడివ్వకపోగా దానిని బలవంతముగా తీసికొని పోవుటకు ప్రయత్నించాడు. వసిష్ఠుడు స్వసంరక్షణము జేసికొనుమని ఆ గోవుకు చెప్పగా అప్పుడా గోవువల్ల పుట్టిన వివిధ జాతుల సైనికులు విశ్వామిత్రుని బలముల నోడించినారు. వసిష్ఠుని ప్రభావమునకు తపమే కారణమని విశ్వామిత్రుడు గ్రహించి తాను తన రాజ్యమును వదలి ఘోరమైన తపస్సు చేసి గొప్ప శక్తులను సంపాదించినాడు. రుచికుని (అజీగర్తుని) కుమారుడైన శునస్సేపుడు యాగపశువుగా వ్రేల్వబడుటకై హరిశ్చంద్రునివలన తీసికొని పోవబడుట విశ్వామిత్రుడు చూచి, శునస్సేపునికి మంత్రోపదేశము చేసి రక్షించినాడు. విశ్వామిత్రుడు బ్రహ్మర్షి యనిపించుకొనగోరి ఘోరతపము చేయగా ఆయన కనేక సిద్ధులు కలిగినవి. సృష్టికి ప్రతిసృష్టి కూడా చేయగలిగినాడు. ఆయన తపస్సును చూచి దేవతలాయనను బ్రహ్మర్షి యని పిలుచుట కంగీకరించినారు గాని వసిష్ఠుడు కూడా అందుకంగీకరిస్తే గాని విశ్వామిత్రునికి తృప్తి లేదు. విశ్వామిత్రుడు వసిష్ఠుని దగ్గరకు పోగా ఆయన అతనిని ఓ రాజర్షీ! యని పిలిచినాడు. విశ్వామిత్రునికి కోపము వచ్చినది. ఇంకను ఘోరమైన తపస్సుచేసి వెళ్ళినాడు. అప్పుడు కూడా ఆయన అలాగే పిలిచినాడు. విశ్వామిత్రుడు

* చూడు: బ్రహ్మశ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రి గారి సంస్కృత (వైదిక) వాఙ్మయ చరిత్ర 1వ భాగం పుటలు 141–3.

వసిష్ఠుని కుమారుని చంపివేసినాడు గాని వసిష్ఠుడు చలించలేదు. ఇలాగ చాలాసార్లు జరిగినవి. చివరకు వసిష్ఠుని కొక కొడుకు మిగిలినాడు అప్పుడు విశ్వామిత్రుడు మళ్ళీరాగా వసిష్ఠుడతని నెప్పటిలాగనే రాజర్షీ యనే పిలిచినాడు. విశ్వామిత్రు డీసారి వసిష్ఠకుమారుని చంపలేదు. వెనుకకు తిరిగిపోతున్నాడు. అంతట వసిష్ఠు డాయనను ఓ బ్రహ్మర్షీ! ఇలాగ రమ్మని పిలిచినాడు. విశ్వామిత్రు డాశ్చర్యముతో వెనుకకు తిరిగి వచ్చినాడు. అరిషడ్వర్గములలో క్రోధమును జయించిన గాని బ్రహ్మర్షి కాడనే సత్యమును గ్రహించినాడు.

## క్షాత్రము - బ్రాహ్మ్యము

యుద్ధములలో రక్తము కాలువలై పారడము చూడడానికి సందేహించని క్షత్రియులు జీవహింసను ప్రతిఘటించడము, క్షాత్రధర్మము నెఱుగని బ్రాహ్మణులు యజ్ఞయాగాది కములలో జీవహింసను సహించడమే గాక దానిని సమర్థించడము వైదికయుగ చరిత్ర విశేషాలలో నొకటి. వేదముల కాలమునుండి బ్రాహ్మణముల కాలము నాటికి వచ్చేటప్పటి కీయభిప్రాయ భేదములు ఆర్యసంఘమునందు మరింత తీవ్రములైనట్లు కనబడుతున్నవి.

## కురుపాంచాలము - తూర్పు దేశములు

ఆ కాలములో బ్రాహ్మణ పురోహితుల ప్రాబల్యము గల కురుపాంచాల దేశములోని ఆర్యులు పశుయజ్ఞములను యథాక్రమముగా ఆచరించే సనాతన ధర్మవాదులుగా నుండే వారు. ఇందుకు విరోధులైన అహింసావాదుల పక్షమువారు క్షత్రియ ప్రాబల్యము గల గంగానదీతీరమునగల తూర్పు దేశములవారు. బ్రాహ్మణములలో పేర్కొనబడిన ఈ తూర్పు దేశములవారు. ఈ తూర్పు దేశములనునవి, కాశీ, కోసల, విదేహ, మాగధ రాజ్యములు.

కురుపాంచాలములోని బ్రాహ్మణ పురోహితులు తూర్పుదేశములైన కాశీ కోసల విదేహ, మాగధములలోని కీ క్రింది కారణములవల్ల పోరాదని శతపథ బ్రాహ్మణము నిషేధించినది.

1. తూర్పు దేశముల ఆర్యులు తమ పరిశుద్ధతను గోల్పోయి వేదవిహితములైన యజ్ఞములను చేయుట మానివేసి తమ ధర్మమును విడనాడినారు. అంతేకాదు; పశు యజ్ఞము చేయకపోవుటయే సరియైన ధర్మమని వాదించే ఒక క్రొత్త సిద్ధాంతమును ప్రతిపాదిస్తున్నారు. అందువల్ల సనాతన ధర్మపరులైన కురుపాంచాలదేశ బ్రాహ్మణులక్కడకు పోయి అక్కడి అనాచారదోషమును, అక్కడివారివలన అవమానమును పొందవలదు. (ఈ కొత్త సిద్ధాంతము బౌద్ధ జైనములే యనుకోనక్కరలేదు. వైష్ణవమతము కూడా అహింసనే బోధించినది.)

2. తూర్పు దేశములలోని సంఘాచార వ్యవహారములు కురుపాంచాల దేశములోని వానికి భిన్నముగా నున్నవి. కురుపాంచాలములో బ్రాహ్మణుల యాధిక్యమును తక్కిన మూడు వర్ణములవారును అంగీకరించి బ్రాహ్మణులు చెప్పినట్లు వింటున్నారు. తూర్పు దేశములలో అనగా కాశీ, కోసల, విదేహ, మాగధములలో క్షత్రియులే అగ్రస్థానమును వహించి బ్రాహ్మణులతోసహా తక్కిన మూడువర్ణముల వారిని తక్కువ పఱచినారు.

ఇందువలన కూడా కురుపాంచాల దేశ బ్రాహ్మణు లాదేశములకు పోవుట తమ ఆత్మగౌరవమునకు భంగకరము.

3. వాజసనేయ సంహితలో నింకొక విషయము కూడా ఉదాహరింపబడినది. తూర్పుదేశములలోని ఆర్యజన సంఘములు వేదవిహితములైన యజ్ఞములను విడనాడి బ్రాహ్మణులను ధిక్కరించి ధర్మచ్యుతిని పొందడమేగాక వారి భాషకూడా అపభ్రంశముగా నున్నది. ఈ తూర్పుదేశములలోని ఆర్యులు పరిశుద్ధమైన సంస్కృతభాషను మాటలాడ లేరు. కురుపాంచాల దేశములోని ఆర్యులు చేయు శబ్దోచ్చారణమును వారు చేయజాల కున్నారు. సంస్కృత పదములను సరిగా నుచ్చరించలేరు. వారెల్లప్పుడును అపభ్రంశ సంస్కృత భాషనే మాటలాడుతారు. "ర"కు బదులుగా "ల" లని పలుకుతారు. (అందువల్ల వారు ప్రాకృతములను మాట్లాడేవారని మనము ఊహించవచ్చును.)

ఉపనిషత్తుల కాలములో హింస, అహింస యనే రెండు సిద్ధాంతములయొక్క భేదము బాగా స్పష్టముగా కనబడుతున్నది. ఉపనిషత్తులలో చెప్పబడిన ఆత్మవిద్యయున్నూ దానికి దగ్గర సంబంధముగల తపస్సున్నూ పరమధర్మములుగా నంగీకరింపబడి, పూర్వకాలమునాటి యజ్ఞకర్మ లంతకన్న తక్కువైనవిగా చెప్పబడినవి. ఈ కాలములో రాజుల ఆస్థానములు విజ్ఞాన కేంద్రములుగా నుండినందున కురుపాంచాలములోని బ్రాహ్మణులు ఆత్మవిద్యాన్వేషణము జేయుచు తూర్పుదేశములకు పోవసాగిరి. అదివరకు కురుపాంచాల దేశీయులు 'కుధర్మము'గా నెంచినదానికొరకే వారిప్పుడూ ప్రాకులాడ సాగినారు. ఆ కాలమునాటి ప్రతిభాశాలి యాజ్ఞవల్క్యుడు. ఇతడు తూర్పు దేశములోని బ్రాహ్మణుడే. కురుపాంచాలములోని బ్రాహ్మణు లీయనను అసహ్యించుకొనుచుండిరిగాని ఆయన కేమి తక్కువ? యాజ్ఞవల్క్యుడును ఆయన నాదరించిన ప్రభువైన జనకుడును ఆత్మవిద్య నభివృద్ధి చేయడానికి తమ శక్తిని, విద్యను ధారపోసినారు. హింసాత్మకమైన పశుయజ్ఞమును కర్మకాండను నిరసించి అహింసావాదమునకు ప్రోద్బలము కలిగించిన ఈ ఆత్మవిద్యయే వైష్ణవ, జైన, బౌద్ధమతములకు దారిచూపినదని చెప్పవచ్చును.

## బౌద్ధ జైనమతములు

గౌతమబుద్ధుడు దశవరమితములను సంపాదించి స్వర్గమున నుండగా భూలోకమున నవతరించి ప్రజలకు తరణోపాయము కలిగించవలసినదని దేవతలు ఆయనను కోరగా ఏదేశమున నేకులమున జన్మించవలెనని ఆలోచించగా కురుపాంచాల దేశీయులు నిరసించే తూర్పుదేశములో నొకటైన మగధదేశములో క్షత్రియకులమున జన్మించుటకు నిశ్చయింపబడినదనే గాథ కురుపాంచాల దేశపు బ్రాహ్మణులకన్న తూర్పుదేశపు క్షత్రియులే ఉత్తములనే విషయమునే సూచించుచున్నది. ఇలాగే ఋషభుడు మొదలు మహావీరునివరకును గల జైనతీర్థంకరులలో నెవ్వరును కూడా బ్రాహ్మణులు లేరు.

మహావీరుడు మొదట నొక బ్రాహ్మణ స్త్రీ కడుపున పడగా జైనతీర్థంకరుడు కావలసిన శిశువు బ్రాహ్మణ స్త్రీ కడుపున పుట్టుట తగదని ఇంద్రుడు నిశ్చయించి ఆ

పిండమును క్షత్రియ రాజభార్యకడుపున పడవేసినాడనే శ్వేతాంబరజైనగాథకూడా ఈ విషయమునే సూచించుచున్నది.

జైనధర్మములు వేదములనాటికే యున్నట్లు కనబడుచున్నది. ఇటీవల త్రవ్వియెత్తబడిన మొహెంజోదరో, హరప్పలలో కనబడిన ముద్రికలపైన జైనతీర్థంకరులను బోలిన బొమ్మలు త్రిముఖబౌద్ధుని బోలిన బొమ్మలును కనబడుచున్నవి.

23వ తీర్థంకరుడైన పార్శ్వనాథుడు చరిత్రపురుషుడే యని చరిత్రకారు లంగీకరిస్తున్నారు. ఇతడు మహావీరునికి 250 సంవత్సరముల పూర్వమువాడని జైనుల నమ్మకము. మహావీరుడు క్రీస్తుపూర్వము ఆరువందల సంవత్సరములనాటివాడు. ఋషభుని గురించీ, అరిష్టనేమిని గురించీ ఋగ్వేదములో కొన్ని ఋక్కులున్నవి. ఋషభుని కథ విష్ణుపురాణములోను భాగవతములోను కనబడుతున్నది. ఋషభుడు పూర్వయుగములోని శ్రీమహావిష్ణువుయొక్క నారాయణావతారమే యని భాగవత పురాణము చెపుతున్నది. ఋషభుడు యోగీశ్వరేశ్వరుడని కూడా ఆ పురాణములందు వర్ణింపబడినాడు. జైన గ్రంథములలో ఋషభుని గూర్చినవర్ణనల కివి సరిపోతున్నవి. అందువలన జైన మతమునకును, వైష్ణవమతమునకును మొదటినుండి దగ్గరసంబంధమున్నదని దీనివలన తెలుస్తున్నది. ఈ విషయమై రామకృష్ణ పరమహంసగారి శత వార్షికోత్సవము సందర్భమున ప్రకటింపబడిన "Cultural Heritage of India అనే గ్రంథము మొదటి సంపుటములో ప్రొఫెసర్ అప్పాస్వామి చక్రవర్తిగా రొక వ్యాసమును వ్రాసియున్నారు.

## వర్ణభేదముల పుట్టుక

"ఋగ్వేదారంభకాలమునం దార్యులలో జాతిభేదము లేకపోయినను అందఱు నన్ని వృత్తులు సామాన్యముగా నాచరించుచున్నను, కాలక్రమమునఁ గొందఱు కొందఱు కొన్ని కొన్ని వృత్తులయందు స్థిరపడిన ట్లాయా వర్ణనలవలన గోచరింపకపోదు. అందు యజనయాజన మంత్రదర్శన మంత్ర పఠన పాఠాదులు నియతముగా నాచరించువారు పురోహితవర్గముగాను, సంఘపాలన దేశరక్షణ శత్రుహింసన జైత్ర యాత్రాదు లాచరించువారు నాయకవర్గముగాను, కృషి గోరక్షణ వాణిజ్యాదు లాచరించువారు కృషీవల వర్గముగాను, పురోహితాదులకు ధర్మాచరణమునందును నాయకులకు యుద్ధ కార్య నిర్వహణమునందును పరిచర్య లొనర్చుచుఁ బరిచారకులుగాను భటులుగాను నుండువారు, దాసవర్గముగాను నేర్పడి పరస్పరమైకమత్యమున దేశహితములు సంఘ హితములు నగు తమతమ కృత్యములు నిర్వహించుచు వచ్చిరి. అట్లాయా వృత్తులయందు స్థిరపడినవారే కాలక్రమమున బ్రాహ్మణక్షత్రియ వైశ్యశూద్ర జాతులుగా విడివడిరని దశమ మండలములోని యర్వాచీన ఋక్కులనుబట్టియుఁ దరువాత వెలువడిన బ్రాహ్మణేతి హాసాదులను బట్టియు మనకు విదితమగుచున్నది. అట్లేర్పడిన ఈ నాలుగు వర్ణములుగాక మఱియొకటి నిషాదవర్ణ మనుపేర నగపడుచున్నది. అందు దురాచారముల పాల్పడి భ్రష్టులైనవారును, ఆర్యులకు లోబడిన యాదినివాసులయిన యనార్యులును జేరి యుందురని యూహింపనగును"* ఆ కాలమున నదియే పంచమజాతి.

* దీనికి కొన్ని యుదాహరణము లివ్వబడినవి. చూడు : సంస్కృత వాఙ్మయచరిత్ర 1వ భాగం. పుటలు 139-141.

ఈ కాలమునందలి పంచమజాతివారివలె నప్పటి పంచమవర్ణమువారత్యంత గర్వ్యులుగాక పైజాతులవారి యాదరమునకు బాత్రులైనట్లుగా నిషాదపంచములైన చతుర్వర్ణములకు శ్రేయము గలిగింపుడని ఇంద్రాది దేవతలను బ్రార్థించిన ఋషుల వాక్యములవల్లనే బోధపడుతున్నది. దశమమండలములోని సాంఘికాచార వర్ణనలు గుణకర్మ విభాగమునుబట్టి చతుర్వర్ణము లేర్పడిన పిదపనే బయలువెడలినవనుట కందందు పేర్కొనబడిన బ్రహ్మ క్షత్ర శబ్దములు తోడ్పడుచున్నవి గాని వైశ్య శూద్ర శబ్దము లెందును గంఠోక్తిగాఁ బేర్కొనబడినట్లు కన్పించకపోవుటచే నవి యన్నిజాతులకు సంబంధించినవా? లేక పైజాతులు రెంటికే సంబంధించినవా? అట్లయినచో తరువాతి కాలమున వెలువడిన ధర్మశాస్త్రాదులందు ద్విజశబ్దవాచ్యులుగాఁ గనఁబడుచున్న వైశ్యులకు వైదికాచారములు ఉన్నట్లు తెలియవచ్చుచుండగా దొలుత లేకుండగాఁబోవునా? యనెడి సందేహములు ఉదయించుచున్నవి"* అని బ్రహ్మశ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రులుగారు తమ సంస్కృత వాఙ్మయ చరిత్రలో వైదిక వాఙ్మయమును గూర్చిన మొదటి భాగమున వ్రాసినారు.

పైన చెప్పిన సందర్భములనుబట్టిచూడగా ఆర్యసంఘములో మొట్టమొదట బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులనే విభజనము కేవలము ఆయా మార్గములవారు చేసే వృత్తులను బట్టి వచ్చినదేగాని పుట్టుకవల్ల వచ్చినదికాదని స్పష్టముగా తెలుస్తున్నది. వర్ణాంతర వివాహముల కడ్డులేదు. భోజన ప్రతి భోజనముల కడ్డులేదు. దృష్టిదోషములేదు. తరువాత కొంత కాలమున కీలాంటి ఆచారములు వచ్చినవి. ఆర్యఋషులు ధర్మచ్యుతికి సహించేవారుకారు. ఆర్యఋషులు తమ సంఘము నెప్పటికప్పుడు పరిశోధించి సంస్కరించేవారు. ధర్మమును మీరిన వారిని వేఱుపరచేవారు. వీలైనచో ప్రాయశ్చిత్తములు విధించి మళ్ళీ వారిని సంఘములో కలిపేవారు. అలాగ ప్రాయశ్చిత్తములు విధించి సంస్కరించడానికి వీలులేని వారిని సంఘము నుండి వెలివేసి వారిని అనార్యులుగా పరిగణించేవారు. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యశూద్రులలో హెచ్చుతగ్గులు లేవని అందరును బ్రహ్మవిద్య నభ్యసించి బాగుపడుటకు వీలున్నదని చూపే ఇతిహాసములు పురాణ గాథలు లెక్కలేనన్ని కనబడుతున్నవి. వేదశాస్త్రములు చదివిన బ్రాహ్మణులు, అధర్మవర్తనులై భ్రష్టులై రాక్షసులైన కథలు వేదశాస్త్రములు చదువక శూద్రులుగా నుండినవారు సద్ధర్ములై పరిశుద్ధులై బ్రహ్మజ్ఞానమును పొంది బ్రాహ్మణులకు నీతిని, ధర్మమును బోధించిన కథలు పురాణములలో కనబడుతున్నది. వేదశాస్త్రము లెఱిగిన రావణుడు రాక్షసుడైన సంగతి, క్షత్రియుడుగా జన్మించిన శ్రీరామచంద్రు డవతారమూర్తియై బ్రాహ్మణులచేత పూజింపబడుతూ ఉన్న సంగతి అందరికీ తెలిసిన విషయమే. దేశములో అధర్మము ప్రబలి సంఘము సంకరమై సంస్కారము లేక వెఱ్ఱి మొర్రి సిద్ధాంతములు రకరకాల మతాచారములు ప్రబలిన సంగతి చరిత్రవలన తెలుస్తూనే ఉన్నది. శంకర రామానుజులు మొదలైన వారీ మతాచారములను సంస్కరించి ధర్మసంస్థాపన జేయుటకు ప్రయత్నించిన సంగతులుకూడా అందరికిని తెలిసిన విషయమే.



* (చూ. పుట 155-6).

# 6. గయాసురుని గాథ

గయాసురు డొక రాక్షసుడు. అతడు మహాకాయుడు. నూటిరువది యోజనముల పొడవుగలవాడు. ఇతడు విష్ణు భక్తుడై మహాతపముజేసి సకల తీర్థములకన్నను తన దేహము అతిపవిత్రముగ నుండునట్లు వరమును పొందినాడు. అతనిని స్పృశించినవారు చూచినవారు బ్రాహ్మమును పొందుచుండిరి. వైదిక కర్మలు నశింపసాగెను. దేవతలును, ఋషులును బ్రహ్మదేవుని దగ్గరకుపోయి మొఱపెట్టుకొనిరి. అంతట బ్రహ్మ గయాసురుని యొద్దకుపోయి 'నేను యజ్ఞము చేయదలచితిని అందుకు నీ శరీరముకన్న పవిత్రతరమైన ప్రదేశము నాకు కనబడుటలేదు' అని పలుకగా గయాసురుడు ఉబ్బిపోయి సరే నా శరీరముపైన యజ్ఞము చేసికొనుడని గయలో తన శిరము నుంచి పండుకొనెను.

అంతట బ్రహ్మదేవుడు ఋత్విక్కులను సృష్టించి యజ్ఞమారంభించెను. దేవతలందఱును వచ్చిరి. అయితే యజ్ఞ వేదిక యున్న గయాసురుని శిరస్సు కదలసాగెను. అది కదలకుండ చేయుటకు బ్రహ్మ పెద్దపెద్ద శిలలను దానిపైన నుంచెను. గాని అవి చెదిరి పడిపోయెను. ఆ శిలలే రామపర్వతము ప్రేతపర్వతము మొదలైనవని చెపుతారు. అంతట బ్రహ్మ, శాపవశమున శిలారూపమున బడియున్న దేవరూపిణియను మహాపతివ్రత యొక్క శిలను దెచ్చి గయాసురుని శిరస్సుపైన బెట్టెను. అది అతిపవిత్రమైన శిలయైనందువలన గయాసురుడు దానిని త్రోసివేయలేకపోయెను గాని శిరమును కదలించుట మాత్రము మానలేదు. అప్పుడు బ్రహ్మదేవుడు శ్రీమహావిష్ణువును ప్రార్థింపగా ఆయన గదాధరుడైవచ్చి తన కుడి కాలును గయునిశిరస్సుపైన బెట్టి నిలిచెను. అంతట గయాసురుడు నిశ్చలుడై విష్ణుమూర్తిని స్తుతించి తన శిరస్సు ఉన్న ప్రదేశ దివ్యక్షేత్రముగా నుండునట్లును అది తనపేరుతో వ్యవహరింపబడునట్లును అక్కడ పిండప్రదానములు చేసినవారి పితృదేవతలు తరించునట్లును వరమును పొందెను. గయాసురుని పాదములు మన తెలుగు దేశము నందలి పిఠాపురమున నుండెననియు అందువలన దానికి పాదగయ అనిపేరు వచ్చినదనియును చెప్పెదరు.

గయామహాత్మ్యము వాయుగరుడ పురాణములందు చెప్పబడియున్నది. దేహమే బ్రహ్మమని వాదించు బౌద్ధుల మతధర్మములు ఆర్యావర్తమునందును దక్షిణాపథము నందును వ్యాపింపగా సనాతన ధర్మము దానిని రూపుమాపి మఱల వైదిక కర్మలను వ్యాపింపజేసిన గాథయే పురాణ పద్ధతిలో చెప్పబడినట్లు కనబడుచున్నది. "బుద్ధగయ" యను శీర్షికతో శ్రీమాన్ కే.నరసింహాచార్యులవారు అక్షయ సంవత్సర పుష్యమాస భారతిలో నొక వ్యాసమును వ్రాయుచు గయాసురక్షేత్ర మహాత్మ్యములోని అంతరార్థమును గూర్చి చక్కగా చర్చించియున్నారు.

గయదగ్గర ప్రస్తుతము బ్రహ్మయోనిపర్వతమని వ్యవహరింపబడు కోలాహల పర్వతము పైననే గయాసురుడు తపమాచరించెనని చెప్పబడినది. దీని నిడివి రమారమి మూడు మైళ్ళు. ఇంత చిన్న పర్వతముపైన 120 యోజనములు లేక 576 మైళ్ళ

పొడవును 60 యోజనములు లేక 268 మైళ్ల నడుమ చుట్టు కొలతలు గల అసురుడు తపముచేయుట అసంభవముకదా! అందువలన దీనికేదో అంతరార్థ ముండి తీరవలెను. గయుడు అసురుడె యైనను రాక్షసులకు నైజమైన జీవహింస మొదలైన క్రూర దురాచారములు కలవాడని చెప్పబడలేదు. పైగా అతడు విష్ణుభక్తుడని మహాతపస్సుచేసి సిద్ధులను సంపాదించినవాడని చెప్పబడినది. అతని శరీరమును స్పృశించినను చూచినను జనులు బ్రహ్మమును పొందుచుండిరని కూడ చెప్పబడినది. ఈ వర్ణనములన్నియు బౌద్ధమతమునకు అన్వయించుచున్నవి. బౌద్ధమతమున జీవహింస నింద్యము. తపము ప్రధానము. యజ్ఞయాగాదికములు మోక్షప్రదములు కావు. ఇట్టి దేవబ్రహ్మవాదుల మతము హిమాలయమునుండి కళింగము వఱకును 576 మైళ్ళ పొడవు 268 మైళ్ళు వైశాల్యముగల దేశమున వ్యాపించెను. అందువలన గయాసురుని శరీర పరిమాణము గుణగణాధికమును బౌద్ధమతమునకు అన్వయించుచున్నవి. బుద్ధగయ బౌద్ధమతమునకు బుట్టినిల్లుగనుక అది గయాసురుని శిరః ప్రదేశముగా వర్ణింపబడినది. బ్రహ్మాదులు గయుని శరీరమును గూర్చి శ్రద్ధవహింపక శిరఃప్రదేశమునందే యజ్ఞము చేసి ఆ వాదమును రూపుమాపిసట్లు ఈగాథ సూచించుచున్నది.

బౌద్ధమతమున జనులు కర్మకు బద్ధులుగా నుందురు. అందు దైవికమనునది లేదు. రాక్షసునిదిగూడ దైవమనునది లేక విచ్చలవిడిగా సంచరించు స్వభావముగనుక బౌద్ధమతమునకు రాక్షసత్వ మారోపింపబడినది. గయాసురుని నాశనము చేయుటకు పూనుకొనిన దేవతలు అతనికి వరప్రదాతలైరనుటలోని భావమేమనగా బౌద్ధమత వినాశమునకు పూనుకొనిన హిందువులు బౌద్ధ విగ్రహములను సర్వనాశముచేయక వానిని తామే స్వీకరించి నామభేదముల బూజించిరనుటయే. ఇందులకు నిదర్శనము, హిందూదేశమునం దెచ్చటను విష్ణుపాదములకు మాత్రము ఆలయముగట్టించి పూజించుట కానబడదు. బౌద్ధులుమాత్రము బుద్ధుని పాదములను, శిరోజములను, నఖములను, శల్యములను పూజించుట విశేషముగా కలదు. బౌద్ధులచే ప్రతిష్ఠింపబడి పూజింప బడుచుండిన బుద్ధపాదము లిపుడు గయ యందు విష్ణుపాదములని హిందువులచే పూజింప బడుచున్నవి. ఇదిగాక విష్ణుపాదములందు పితృపిండముల నర్పించుటకు పూర్వము బుద్ధగయ కేగి బోధిద్రుమమునకు నమస్కరింపవలయునని వాయుపురాణమున గలదు"

పైన చెప్పిన సంగతులవలన గయాసురగాథయొక్క అంతరార్థము తెలియగలదు.



# 7. గురుశిష్య సంప్రదాయము

గురుశిష్య సంప్రదాయమనేది కేవలము బౌద్ధధర్మమునకు చెందిన ఆచారమేయని రుజువు చెయ్యడానికి అనేక నిదర్శనము లిప్పటికిని కనబడుతున్నవి. నేపాళదేశములో

ఇప్పటికిని హిందువుల సనాతనధర్మమును, బౌద్ధులధర్మమును ఒకదాని ప్రక్కనొకటి కనబడుతున్నవి. అక్కడ హిందువులను "దేభజు"లనిన్నీ బౌద్ధులను "గుభజు"లనిన్నీ అంటున్నారు. "దేభజు"లనగా దేవుని భజించువారనిన్నీ "గుభజు"లనగా గురువును పూజించువారనిన్నీ అర్థము.

బౌద్ధసంప్రదాయము నందున్నటువంటి గురుపూజ వేదములందు లేదు. వైదికమంత్రమైన గాయత్రి నుపదేశించునది బ్రహ్మవిద్యారహస్యము దెలిసిన ఆచార్యుడేగాని దాసులకు ప్రభువైన గురువుకాడు.

బౌద్ధులు స్థాపించిన గురుశిష్య సంప్రదాయమునందలి గురువు సత్యపథమునందు నడిపించు మార్గదర్శియైన ప్రభువు. అతడు కేవలము దైవముయొక్క అంశమే! ఇతడు హిందువుల యొక్క కులదేవత లేక ఇష్టదైవము కన్నను ఉన్నతస్థానము నధిష్ఠించి యున్నాడు. హిందువుల యిష్టదైవము ఆరాధకులేర్పరచుకొనిన బింబము లేక అర్చ్యప్రతిమ (Symbol) గాని వేఱుకాదు. బౌద్ధులగురువు సృష్టియొక్క పరాకాష్ఠయే. (Acme) అతని మాట యొక ధర్మశాసనము. అతని యాజ్ఞలు శిష్యులు శిరసావహించవలసిన పరమ ప్రమాణములు. మంచి చెడుగులను నిర్ణయించు సామాన్య నీతి నియమములు దీనికి వర్తింపవు.

వేదములందలి గురువు ఇటువంటివాడుకాడు. అతడు కేవలము విద్యాదానము చేయు ఉపాధ్యాయుడు మాత్రమే. అందువలన జాతి, కుల, వర్గ, వివక్షత లేక గురువును భూమిమీద నొక అపరదైవముగా పరిగణించు శాఖవారు గాని కులము వారుగాని హిందువులలో నెక్కడనైనను కనపడిన యెడల వారుగాని వారి పూర్వులుగాని బౌద్ధ సంప్రదాయమునకు చెందినవారే అని గ్రహింపవచ్చును.

బంగాళాదేశమునందు గురుశిష్య సంప్రదాయము చిరకాలానుగతముగా చాల ప్రాముఖ్యత చెందియున్నది. అది ఇప్పటికిని అక్కడ ప్రబలముగా నున్నది. శాక్తేయశాఖలం దైననేమి వైష్ణవ శాఖలం దైతేనేమి, బంగాళీ జనసంఘము నందు గురువు అత్యున్నతమైన స్థానమును కలిగియున్నాడు. అతడు కోర తగని కోరికయేలేదు. అతడు ఆచార వ్యవహారము లకును నీతిధర్మములకును గూడ అతీతుడుగా నున్నాడు.

బంగాళాదేశముయొక్క గురుశిష్య సంప్రదాయమునకు కులభేదమెన్నడును అడ్డురాలేదు. వంగదేశమునందు బ్రాహ్మణ, వైశ్య, కాయస్థ గురువులేగాక కార్తభజులు కిషోరిభజులు, సహజీయులునైన గురువులును, దేశద్రిమ్మరులై తిరుగు బైరాగి గురువులును కూడా ఉన్నారు. ఇందులో అన్నిజాతులవారును కులములవారును కలిసి యుంటారు. గురువుయొక్క కులగోత్రముల నడుగుట మహా అపచారముగా పరిగణింపబడి నిషేధింపబడుతున్నది.

మొహార్పూరులో నుండిన బలరామ్ హాదీ తానొక హీనకులజుడైన హాదీయనే సంగతిని కప్పిపుచ్చేవాడుకాడు. అయినప్పటికిని అయనకు అన్ని కులములవారును తుదకు బ్రాహ్మణులును కూడా శిష్యులుగా నుండేవారు. ఆయన ననుసరించిన వారినిగాని వారి సంతతివారిని గాని ఎవ్వరును కులములో నుండి వెలివేయలేదు. ఇప్పటికిని వారి సంతతి వారున్నారు.

దీనిఫలితముగా వంగదేశంలో, ఒక్కమత గురువులనేగాక మంత్ర తంత్రజ్ఞులైన గురువులను, శిల్పకళలను విద్యలను నేర్పు గురువులనుకూడా ఎక్కువగా గౌరవించి పూజించే ఆచారము వచ్చినది. ఏ గురువునైనను సక్రమముగా నేర్పరచుకొని ఆయన వలన దీక్షను పొంది విద్యనేర్చుకొనే పద్ధతియున్నూ అప్పటినుండి ఆ గురువును దైవసమునిగా చూచే పద్ధతియున్నూ వచ్చినవి.

నాడు శూద్ర, పొడబాగ్ది, అగురి, కులముల వస్తాదుల వలన మన పూర్వులు ఛడీ, బాణా మొదలైన మల్లవిద్యలను నేర్చుకొనేవారు. ఇలాగ దీనిని నేర్చుకోవడానికి వెళ్ళిన వారిలో బ్రాహ్మణులైనవారు, రంగస్థలంలోనికి పోవుటకు ముందుగా తమ యజ్ఞోపవీతములందుకు అడ్డురాకుండా వానిని తొలగించుకొనవలసి యుండిరి. వారు ముందుగా తమ ఆయుధములను గురువు పాదముల యొద్దనుంచి, వంగి ఆయన మోకాళ్లను స్పృశించి, గురువునకు వందనముచేసి, "జేయ్‌గురూ! "అని పలికి తరువాత ఆయన అనుజ్ఞను పొందిన పిమ్మట తమ సామును ప్రారంభించవలెనను నియమము ఉండినది. బ్రాహ్మణు డెవ్వడును ఇది తనకు పరువు తక్కువయని భావింపలేదు. తోడివారెవ్వరును, ఇందులకతనిని తక్కువపరచలేదు.

పాఠశాలలందు చదువుచెప్పే ఉపాధ్యాయులు కూడా ఎల్లప్పుడును బ్రాహ్మణులు గానే ఉండేవారు కారు. సాధారణముగా కాయస్థకులమువారే ఎక్కువమంది యుండేవారు చంద్రనగరములో నొకబాగ్ది యుపాధ్యాయుడుండెను. ఆయన దగ్గర చదువుకొను వారాయనను బాగ్ది మహాశయుడని అనేవారు. బర్ధవాను తాలూకాలోని చాలా గ్రామములందు ఆ గురి సద్గోప లేక క్రైస్తవకులముల యుపాధ్యాయులుండేవారు. ఆ పాఠశాలలకు బ్రాహ్మణులు కూడా ఎట్టి అనుమానమును లేకుండా తమ పిల్లలను పంపేవారు. ఈ బ్రాహ్మణ బాలురు కూడా తమ యుపాధ్యాయునిపట్ల చాలా భయభక్తులతో ప్రవర్తించేవారు. ఇటువంటి యుపాధ్యాయుల యొక్క ప్రభావమువల్లనే వంగదేశములలో స్పృశ్యతా అస్పృశ్యతలను గూర్చిన పట్టింపులు హెచ్చుగా పెరుగలేదని తోస్తున్నదని పంచకౌరీ బెనర్జీగారు విశ్వభారతి పత్రిక మొదటి సంచికలో నొక వ్యాసమునందు వ్రాసియున్నారు.



# 8. తిరుపతి జైనక్షేత్రమా?

హిందూదేశచరిత్రలో జైనబౌద్ధమతాలు వైదికమతాన్ని త్రోసిరాజనడమూ, జైనబౌద్ధమతాలను మళ్లీ వైదికమతం అణగద్రొక్కడమూ, వైదికమతంలోనే శైవ వైష్ణవాలు ఒకదానితో ఒకటి పోరాడడమూ, ఇంకా శాఖోపశాఖలు బయలు దేరడమూ కనపడుతూనే ఉన్నదికదా! ఈ మార్పులనుబట్టి జైన ఆలయాలు, బౌద్ధ ఆరామాలు, విష్ణు శివక్షేత్రాలుగా మారడంకూడా జరిగింది. ద్రాక్షారామం గర్భగుడిలో బౌద్ధ స్థూపంయొక్క గుర్తులు స్పష్టంగా

కనబడుతున్నవని అంటారు. భీమేశ్వరుడు జైనదేవుడిలాగ పైకి పెరిగి పోతూవుంటే నెత్తిమీద చీలకొట్టారనే గాథ ఒకటి ఉన్నది. అందువల్ల బౌద్ధజైన ఆలయం భీమేశ్వరాలయంగా మారినట్లు తోస్తుంది. అలాగే, అమరావతికూడా బౌద్ధజైనక్షేత్రమై యుండి తరువాత శివక్షేత్రంగా మారింది. పంచారామాలన్నీ ఇలాగ మారినవే నంటారు - పరిశోధకులు. ఆరామం అనేది బౌద్ధుల ఆరామమై యుండడంలో ఆశ్చర్యం లేదు. ఈ విషయం బాగా చర్చించతగినది.

మన పురాణాలలో జైనబౌద్ధ శైవ వైష్ణవగాథలు ఆచార వ్యవహారములు విడదీయలేనంతగా కలిసిపోయినవి. జైనుల తీర్థంకరులలో ఋషభుడు ఆది తీర్థంకరుడు. భాగవతంలో విష్ణ్వంశలో జన్మించిన ఋషభచక్రవర్తిగాథ ఒకటి యున్నది. భాగవతంలో పేర్కొనబడిన పాషండమతం జైనమో బౌద్ధమో అయివుంటుందనడానికి సందేహంలేదు. జైన ఋషభునికిని భాగవతఋషభునికిని సంబంధమున్నట్లు తోస్తుంది. జైనులకు కేవలజ్ఞానులందరూ పూజ్యులే. శైవ వీరవైష్ణవుల లాగ వారు విష్ణువును అల్పంగా చూడరు. వైష్ణవులు, ఋషభునియందు విష్ణువు అంశను జైనులు తీర్థంకరలక్షణములను గమనించి యుంటారు. వైష్ణవులు పేర్కొనే ఏకవింశత్యవతారాలలో ఋషభునిది ఒకటి. ఈ యూహకు తిరుపతిక్షేత్రం యొక్క స్థలపురాణము, ఆచారాలు ఉపబలంగా ఉన్నవి.

తిరుపతి వేంకటాచలానికి కృతయుగంలో ఋషభాచలం అని పేరుండేదని శ్రీనివాసకల్యాణంలో చెప్పబడియున్నది. ఋషభచరిత్రమును గురించి జైనవైష్ణవ కథాంశములలో భేదాలు కనబడుతూఉన్నా వేంకటాచలం కింద బలరామక్షేత్రం వుండడము, అందులో బలరామకృష్ణులు వుండడము, పద్మావతీ దేవి వుండడము, కొండపైన క్షేత్రస్వామియైన శ్రీ భూవరాహమూర్తి యుండడము, అందులో శ్రీనివాసమూర్తి తరువాత వాసము చేయడము, క్రమేణా వృషభాచలము అంజనాద్రి మొదలైనవి కావడము, నేటికిన్నీ మ్రొక్కులు చెల్లించే భక్తులు కాషాయాంబరములు ధరించి కొండ నెక్కడము, కేశఖండనము చేసుకోవడము, కొండపైన తీర్థప్రసాదములు జాతి కులభేదములు లేకుండా అందరూ ఆరగిస్తూవుండడము, మహంతులు ధర్మకర్తలుగా వుండడము, వారు సమాధిని పొందడము, జైనతీర్థక్షేత్రసంప్రదాయమును తెల్పుతూ వైష్ణవదైవ సంబంధములనుకూడా తెల్పుతున్నవి.

వైష్ణవదైవముయొక్క ఏకవింశత్యవతార పురుషులలో ఒకడైన కపిలమహాముని యొక్క తీర్థముకూడా అక్కడనే కొండ కింద నున్నది. వృషభాసురుని జంపి శ్రీమన్నారాయణుడు అక్కడ వెలసినాడను పురాణోక్తులవల్ల ఆ స్థలము జైనవైష్ణవ కలహాలలో వైష్ణవక్షేత్రంగా మారినదని ఊహించవచ్చును.

నిజానికి జైనులకూ శైవులకూ మూలమతసిద్ధాంతాలలో భేదం లేదు. అహింసనే పరమధర్మంగా గ్రహించి వేదప్రమాణాలను నిరసించినందున జైనము పాషండమత మనిపించుకున్నది కాని జైనులు ద్వైతాద్వైతులలాగనే త్రిమూర్తులను పూజిస్తారు. వైష్ణవ వైరంవల్ల శైవము జైనమతాన్ని నిరసించినది.

శ్రీనివాసమూర్తి శివనారాయణ చిహ్నాలు కలిగి యున్నాడని భక్త లోకోక్తి. తిరుపతిలో శైవసంబంధమైన అర్చనలు కొన్ని జరుగుతున్నాయని అందరికీ తెలుసును. శైవులకును ఋషభుడున్నాడు. ఈ వృషభునికి గణపతిస్థానం విధించబడినది. ఇతనిని గురువుగా గైకొన్నవారు వీరశైవులు. వీరశైవులు జైనులలాగ శివనారాయణుల సామ్యాన్ని అభేదాన్ని అంగీకరించరు; సంహించరు. వీరశైవులు వెంకటాద్రికి యాత్రకు పోవడం వల్లనే ఇప్పుడు ఈ వెంకటాచలం కేవలం వైష్ణవక్షేత్రంగా వుండి వైష్ణవులవల్ల భూవైకుంఠంగా పరిగణింపబడుతూ ఉంది. ఈ విషయాన్ని గురించి శ్రీ కురిగనూరి నరసింగరావుగారు ప్రజోత్పత్తి సం॥ చైత్రమాస భారతిలో 'కన్నడిగలు తెలుగలు' అనే వ్యాసంలో వ్రాశారు.



# 9. అర్చనలు, ఆరాధనలు, కొలుపులు

తరలము॥ *వరమ పూరుషుఁడొక్కఁడాద్యుఁడు పాల నోద్భవ నాశముల్*
*సొరిదిఁజేయ ముకుంద పద్మజ శూలిసంజ్ఞలఁ బ్రాకృత*
*స్ఫురిత సత్వరజస్తమంబులఁబొందు నందు శుభస్థితుల్*
*హరి చరాచర కోటికిచ్చు ననంత సత్వ నిరూఢుఁడై.*

*శ్రీమదాంధ్ర మహాభాగవతము స్కం. 1-60*

మనదేశము వివిధమతాలకు అనేక ఆచారాలకు పుట్టినిల్లుగా వుంటూవున్నది. శైవ వైష్ణవములు, శాక్తేయ మంత్రతంత్రములు ఇంకా అనేకములైన చిల్లర మతములుకూడా వేదమంత్రములలోనుంచే పుట్టినవంటారు ఆయా మతావలంబులు. వేదముల నంగీకరించిన బౌద్ధజైన మతాలు కూడా వైదిక మతధర్మాలలో నుంచే పుట్టినవనడానికి సందేహము లేదు.

ఈ పుణ్యభూమిలో ఎన్ని కొత్త మతాలు తలలెత్తినా, ఎన్ని కొత్త ఆచారాలు పొడసూపినా అవి ఎన్ని వెఱ్ఱితలలు వేసినా ప్రజలు ఆధ్యాత్మిక ఆధిభౌతిక, ఆధి దైవిక ధర్మాల యందలి భక్తివిశ్వాసములను మాత్రము వదలక ఆ మతాలను, ఆచారాలను సమన్వయము చేసుకుంటూ వచ్చారు. కొత్త మతాలు కొన్నాళ్ళపాటు ప్రజల నాకర్షించి రాజాదరణము వల్లనో బలము వల్లనో దేశంలో వ్యాపించినా, అవి త్వరలోనే పట్టుతప్పి పూర్వపు మత సిద్ధాంతాలకును ఆచారాలకును కట్టుపడి నామమాత్రావశిష్టములై పోతూవచ్చినవి. ఇన్ని కొత్త మతాలు ఆచారాలు తనలో లీనంచేసుకొన్నందువల్లనే ఈదేశ ప్రజల సనాతనధర్మము వైదికమతము బహుముఖములై పరిణమించినది. ఈకారణము వల్లనే ఉపనిషత్తులలో నుంచి పుట్టిన శైవ, వైష్ణవ, శాక్తేయ మూలధర్మాలు త్వరలోనే అనేకరూపాలు దాల్చి రకరకాల సాకారపాసనలుగాను ఆరాధన విధానములుగాను మారి తామస పూజలకు విపరీతపుటాచారములకు పుట్టినిల్లైనవి.

ఇలాగే మొదట తమతమ మూలధర్మముల ప్రకారము నడిచిన బౌద్ధ జైన మతములు కూడా త్వరలోనే మార్పుచెంది ఆచారకాండను మంత్రతంత్రాలను అవలంబించి రకరకాల అర్చనలతో ఆరాధనలతో వెల్లితలలు వేసినవి. మంత్రతంత్రాలకు తావులేని బౌద్ధమతములో శాక్తేయ తంత్రవిధానాలు వచ్చి చేరినవి. కేవల జినధర్మమునకు బద్ధమైన జైనమతము శివకేశవుల ఆరాధనమును వైదిక దేవతలను పురాణాలను వర్ణాశ్రమ ధర్మాలను కూడా అంగీకరించి వైదిక మతశాఖయైనది. జైన పురాణాలు మన పురాణాలకు అనుకరణము లైనవి. అందువల్లనే ఇప్పుడు మనదేశంలో కనబడే మతాచారాలలో ఏవేవి ఏమతాలకు చెందినవో చెప్పడం కూడా చాలా కష్టమైపోయేటంత కలగలవుగా నున్నవి.

## తామస పూజలు

నేడు మన దేశములో కనబడే వివిధ మతాచారములకు ఆరాధన విధానములకు కొన్నిటిలో కనబడే భయానకములైన బలులకు క్రూరాచారములకు కూడా కొంత చరిత్ర పరిణతి కనబడుతూ ఉన్నది. భయంకరములైన యుద్ధములందు వీర విహారముచేస్తూ శత్రుసంహారము చేసేవారికిని, ఘోరారణ్యములందు వేటలాడి క్రూరమృగములతోపాటు సాధు జంతువులను కూడా వధించే వారికిని – హింస గాని రక్తపాతము గాని అసహ్యా కరములుగా నుండవు. ఇక క్రూర స్వభావులైన కొండజాతుల వారిమాట అనాగరకులైన ఆదిమవాసుల మాట చెప్పవలెనా? ఇలాంటివారికి ఈశ్వర ప్రీతికోసం కూడా నరవధ, జంతువధ చేయుట చాలా ఉచితమైన కార్యంగా తోచడంలో ఆశ్చర్యం ఏమున్నది? ఈశ్వరప్రీతి కొఱకు మనుష్యులను జంతువులను బలియిచ్చుట, తమశరీరములోని భాగములనే కోసియిచ్చుట, శరీరములో నారసములు గ్రుచ్చుకొనుట, నిప్పులగుండము త్రొక్కుట మొదలైన ఆచారములన్నీ ఇటువంటి మనః ప్రవృత్తితోనే చేసేవారు. ఈ స్థితిలో నుండి కేవలము రాక్షస కృత్యములతోను మద్యమాంస మైధునములతోను దైవము నారాధించే వామాచార పద్ధతులు బయలు దేరుట, వానిని సమర్థించి వానికి చిలువలు పలువలు కల్పించి మతాచారములుగా చేయు స్వార్థపరులైన పురోహితులు కూడా బయలు దేరుట, యొక వింత సంగతికాదు. ఇలాగ కాపాలిక గాణాపత్యమతములు, భైరవార్చనలు మొదలైన పద్ధతులు బయలుదేరి సనాతన ధర్మము వెల్లితలలు వేసినది.

ఈ విపరీత మతాచారముల నన్నిటిని సంస్కరించి, వైదిక మతముతో సమన్వయముచేసి సనాతన ధర్మము నుద్ధరించుటకు మన పూర్వఋషులును, వివిధ కాలములందుద్భవించిన శ్రీ శంకరాచార్యులవారివంటి మహానుభావులును ప్రయత్నించినారు. వ్రేళ్లుపారి పాదుకొనిన దురాచారములను విపరీతభావములను ఒక్కసారిగా నిర్మూలించుట సులభమైన పనికాదు. కనుక ఆ యాచారములలోను నమ్మకములలోను కేవలము హేయకరములైన వానిని నిషేధించి కొన్నిటిని సంస్కరించి వైదికధర్మములతో సమన్వయముచేసి వివిధ జాతి, మత, కులములందుగల స్త్రీ పురుషుల ఆచార వ్యవహారములను చిత్తవృత్తులను అధికారమును బట్టి వారి వారికి ఉచితమైన విధి నిషేధములను కల్పించినారు. వివిధములైన ఆరాధన విధానములన్నియు ఒకే

పరతత్వసాధన కొఱ కేర్పడినవని స్పష్టీకరించినారు. ఈ సంస్కర్తలెంతకష్టపడి తత్వబోధచేసి నను ఎంత జాగ్రత్తతో సనాతన ధర్మమును సుప్రతిష్ఠితము చేసినను జనసామాన్యము యొక్క ఆచారములు, భావములు పూర్తిగా మారక ఏదో రూపములో నిలిచియే యున్నవి.

## గ్రామ దేవతలు

భయానకములైన క్రూరాచారములకును రక్తపాతముతోను జంతుబలులతోను కన్నులుచెదురు దృశ్యములతోను చెవులు గింగురులెత్తు ధ్వనులతోను నిండియుండు గ్రామదేవతల యారాధనములును కొలువులును రక్తమాంసముల నసహ్యించుకొనువారికిని పాశ్చాత్యనాగరికత కలవాటుపడిన వారికిని అర్థరహితములైన దురాచారములుగను మూఢవిశ్వాసములుగను కనబడునుగాని ఇవి యాచరించువారి సాంఘికాచార వ్యవహారములను బట్టిగాని మనఃప్రవృత్తులనుబట్టికాని అధికారమునుబట్టిగాని యోజించిన యెడల ఇందులో కొంత అంతరార్థమును పరమార్థమునుకూడా ఉన్నవని తెలియగలదు.

ఈయారాధనములు చేయువారి కివి వింతగాగాని అనుచితములుగాగాని కనబడకపోవుటేకాక అవి కేవలము భగవత్ప్రీతికొఱకు చేయు ఆరాధనములుగానే తోచి వారి మనస్సులను పరమాత్మ యందు లగ్నముచేసి వారికి మనశ్శాంతిని కలిగించు చుండును. ఈ యారాధనములందు వారుకొలుచు దైవములను క్షుద్రదేవతలని యనుకొనుటకూడా పొరపాటు సంగతి. గ్రామదేవతల స్వరూప స్వభావములను సాక్షాత్కరింప జేసికొనుటకు ఆయా ప్రాంత జనులు వారి వారి చిత్తవృత్తులనుబట్టి ఎన్నో రూపములైన అర్చన ప్రతిమలను జేసికొని ఎన్నిపేళ్లతో వానిని భజిస్తూ ఉన్నప్పటికిని ఈ మూర్తులన్నీ పరాశక్తియొక్క మారురూపములే కాని వేఱుకావు. ఆ మహాశక్తియొక్క సత్వ రజ స్తమోగుణములనే ఈ మూర్తులనుకూడా అనేక విధములుగా ఆరోపించి భావన చేయుచున్నారు. కొంచె మాలోచించినచో లలితా సహస్రనామములందు పేర్కొనబడిన దైవమే ఈ రూపకల్పనము లందును ఆరాధనము లందును నిగూఢమై యున్నట్లు తెలియగలదు. ఎన్ని భిన్న రూపములతో సాక్షాత్కరించినను పరతత్వమొక్కటేయను భావముకూడా ద్యోతకమగుచునే యుండును ఆధ్యాత్మిక ఆధిభౌతిక ఆధిదైవిక భావములు అధికారి భేదమునుబట్టి అనేక విధములుగా బోధింపబడుచునే యుండును. అధికారియొక్క మనస్సు పరిపక్వమైనకొలది ఈతత్వమును గ్రహించి తరించును. మన సనాతన ధర్మమందుగల గొప్ప విశేషమే యిది.

గంగానమ్మ, పోలేరమ్మ, దుర్గ మొదలైన గ్రామదేవతలను కొలుచు గ్రామజనులను చెట్టుపుట్టలను కొలుచు కోయలను కొండజాతులవారిని జూచి పరిహసించుచు తామేమో అధికులమని విఱ్ఱవీగుచు వారికి క్రైస్తవమతబోధ చేసి వారి నుద్ధరింపదలచు మిషనరీ మతబోధకుల యహంభావమును జూచి గాంధీమహాత్ముడు సహింపడు. ఎటువంటి అపరిణతమైన మతములనైనను, ఎటువంటి అనాగరకమైన అర్చనలనైనను అసహ్యించుకొని త్రోసిపుచ్చుటకు వీలులేదని ఆయన అభిప్రాయము. మిస్. ఎవిలిట్. అండర్‌హిల్ అను గ్రంథరచయిత కూడా ఈ అభిప్రాయమునే కలిగియుండి ఇట్లు వ్రాసియున్నది.

"అది యెట్టి ఆరాధనమైనను - దైవారాధనమెల్ల పవిత్రమైనదే. ఎటువంటి నీచ పద్ధతులలో చేయబడు ఆరాధనలందైనను, ఎటువంటి మూఢులు తెలివితక్కువవారు చేయు ఆరాధన లందైనను, భగవంతుని గూర్చిన అన్వేషణము కొంచెముగనో గొప్పగనో ఉండితీరును. దీనికిని, నాగరికులు చేయు ఉత్కృష్టారాధనలకును, వేదాంత జిజ్ఞాసలకును మధ్యగల తార తమ్యము బహు స్వల్పమైనది. దీనిని జూచి దేవతలు చిరునవ్వు నవ్వగలరు"

"అస్సాము దేశపు కొండజాతుల వారిదగ్గరకును ఆదిమ వాసుల దగ్గరకును భేషజము లెవ్వియు లేకుండపోవుటకన్న నేను చేయగలదేమున్నది? నా భజనములందు వారిని పాల్గొనమని కోరుటకన్న వారిభజనలయందు నేను పాల్గొనుటయే యుక్తమైన కార్యము." అని గాంధీ మహాత్ముడు పలికి యున్నాడు. వారికి క్రైస్తవ మత బోధచేయదలచు మిషనరీల ప్రయత్నము అహంకారపూరితమైన యుద్యమమని ఆయన యభిప్రాయము.

## ఆంధ్రదేశపు మతములు

ఆంధ్రదేశములో బౌద్ధమతము కొన్ని వందల సంవత్సరాలు ఒక్క వెలుగు వెలిగి మాటుమణిగినది. తరువాత శాక్తేయ, శైవ, వైష్ణవ వామాచార, చార్వాక మతములేగాక భైరవార్చనము మొదలైన చిల్లర మతశాఖలుకూడా విజృంభించినవి. జంతువధలు నరవధలు, మద్య మాంసముల ఉపయోగము, స్త్రీ పురుష సంబంధములందు అవినీతి మొదలైన విపరీతపు ఆచారాలు మతాచరణలోనికి వ్యాపించినవి. మతావేశంతో హింసలు చేయడము సాహసకృత్యాలు గావించడము ప్రబలినవి. అగ్ని గుండాలలో దూకడము, నాలుకలలో నారసాలు గుచ్చుకోవడము, గండకత్తెరలు వేసికొని చావడము, ముక్తికి మార్గాలుగా ఎంచుకోవడం ప్రారంభించారు. ఈ పద్ధతులలో కొన్ని జనసామాన్యాన్ని ఆకర్షించగా అవి గ్రామదేవతల అర్చనలలోను కొలువులలోను కూడా వ్యాపించినవి.

ఇంతలో దేశంలో జైనమతము తలయెత్తింది. దక్షిణ దేశాన్ని పరిపాలించిన రాజులు జైనమతావలంబులు కావడంతో జైనమతం దేశంలో బాగా వ్యాపించింది. ఇతర మతాలను అణగద్రొక్కింది. దేశీయమతాలను ఆచారాలను జైనులు నిరసించి వాటిని అవలంబించే వారిని రాజదండనకు పాత్రులుగాచేసి బాధించారు. ఈ సందర్భంలో జైనులైన రాజులకును శైవవైష్ణవ మతావలంబులైన రాజులకును యుద్ధాలు జరిగినవి.

క్రీస్తుశకము పదవ శతాబ్ది మొదలు పన్నెండవ శతాబ్ది చివరవరకూ దేశంలో మతయుద్ధాలు చెలరేగినవి. దేశమంతటా మతవిప్లవం బయలుదేరింది. కర్నాట కాంధ్రదేశాలలో శైవవైష్ణవాలు విజృంభించి జైనమతాన్ని అణచివేసినవి. వీర శైవము అతి తీవ్రమైన మతయుద్ధంచేసి గెలిచినది. *"జినసమయస్థుల శిరములు దునిమి మును విష్ణుసమయుల ముక్కులుగోసి యద్వైతులను హతహతము గావించి విద్వేషబౌద్ధుల విటతటమాడి చార్వాకవాదుల గర్వంబులణచి"* వీరశైవులు తమ మతాన్ని దేశములో స్థాపించినట్లు పాల్కురికి సోమనాథుని బసవపురాణము చెప్పుతున్నది. ఈ వీరశైవులు ఇతర మతాలను అణచివేయడానికి అనేక క్రూరకృత్యాలు చేశారు. దేశంలో రక్తపాతం గావించారు. కొందరు శివభక్తులు మతావేశంతో ఒళ్లు తెలియక నిప్పులగుండాలు త్రొక్కారు. తమ కనుగుడ్లు పీకివేసుకున్నారు. తమ తలలు కోసుకుని లింగైక్యము పొందినారు.

ఇలాంటి సాహస కార్యాలను గురించిన వర్ణనలు బసవ పురాణంలోనూ, పండితారాధ్య చరిత్రలోనూ కూడా కనబడుతున్నవి. జైనమతము, జైనాచారములు, వాఙ్మయము పూర్తిగా నశించి ఆంధ్రదేశములో ఎక్కడచూచినా ఇప్పటికీ జైనుల దిబ్బలు బౌద్ధశిథిలాలూ కనబడుతున్నవి. ఇది వీరశైవులు చేసినపని.

క్రీస్తుశకము 14వ శతాబ్దములో తెలుగు దేశంలో బ్రాహ్మణేతర జాతులలో భైరవార్చనముతో పాటు మైలారదేవుని పూజలుకూడా జరిగేవి. వీరశైవులు భక్త్యావేశపరులై యున్నప్పుడు శివుడు ప్రమథగణముతో కలిసి నృత్యముచేస్తూ ఉన్నట్లు భావించి భయంకర వీరనృత్యములు చేసేవారు. క్రీడాభిరామమనే వీథినాటకములో శ్రీనాథ కవిసార్వభౌముడు (1385–1475) ఏకశిలా నగరవీధులలో మైలారవీరభటులుచేసే వీరకృత్యాలను గురించి ఇలాగ వర్ణించాడు.

సీ॥ *అవఘవమందు నెత్తురు చంద్రమల్లెల*
*వోద్యంపు గుండాలు చొచ్చువారు*
*కరవాడి యలుగుల గనవ పోంతళ్లలో*
*నుట్టివేరులుగోసి యుఱుకువారు*
*గాలంపుగొంకిc గంకాళచర్మము గ్రుచ్చి*
*యుడువీథి నుయ్యేల లూగువారు*
*కటిక యౌనాళంబు గండగత్తెరవట్టి*
*మిసిమింతులునుగాక మ్రింగువారు*
*నందులను నారసంబులు నలువువారు*
*యెడమకుడిచేత నారతులిచ్చువారు*
*సాహసము మూర్తిగైకొన్న నరణివారు*
*ధీరహృదయులు మైలార వీరభటులు*

క్రీస్తు శకము 1415 శతాబ్దములలో కూడా మన తెలుగు దేశములో శాక్తేయము, వీరశైవము, భైరవార్చనలు మొదలైన మతసంప్రదాయములు ప్రబలంగా ఉన్నట్లు క్రీడాభిరామము చెప్పుతున్నది. అయితే అప్పటికే పూర్వకాలపు తామసపూజలు సాహస కృత్యాలు కొంత తగ్గినట్లు కనబడుతూఉంది.

## ఇష్టసిద్ధికోసం చేసే ఘోరకృత్యాలు

ఇష్టసిద్ధికోసం భక్తులు అనేక సాహస కృత్యాలు చేస్తూ వుండడం ఆచారంగా వుండేది. వారి ఉపయోగం కోసం దుర్గ గుడి దగ్గర రకరకాల ఆయుధాలు పెద్దగోరు గల్లులు, నారసములు, సురియలు, గండకత్తెరలు మొదలైన వాటిని సిద్ధంగా వుంచేవారు. దివ్యదృష్టిని పొంద దలచినవారు గోరుగల్లుతో తమ కనుగ్రుడ్లను పీకివేసి కోవాలి. దూరశ్రవణం కాంక్షించేవారు అక్కడి బాణపు మొనతో తమచెవి గూబలను పొడుచుకోవాలి. పరవిద్యను దివ్యజ్ఞానమును సంపాదించ దలచినవారు తమ నాలుకలను సురియతో కోసికోవాలి. తన కేపోని లేకుండా శత్రుసంహారము చేయదలచినవాడు తన మెడను

గండకత్తెరతో ఉత్తరించుకోవాలి. ఇలాంటి సాహస కృత్యాలను చేస్తే అయాసిద్ధులు కలుగుతాయనే నమ్మకం కృష్ణదేవరాయలవారి కాలంనాటి ప్రజలలో బాగా వ్యాపించి ఉన్నట్లు ఆ కాలంనాటి ప్రబంధాలవల్ల కనబడుతూ ఉంది. లోకోత్తర గానయుతయు లోకోత్తర రమ్యాకృతియునైన నొక వారవధూటిని మృగేంద్రవాహన మనేశక్తికి బలియిస్తే తనకు మహారాజ్యలక్ష్మీ పదవి లభిస్తుందనే నమ్మకంతో ఒక కపటసిద్ధుడు కలభాషిణి యనే చక్కని చుక్కను మోసగించి బలియివ్వడానికి గుడి దగ్గరకు తీసుకుని వెడతాడు. అక్కడ చచ్చిపోయిన ముసలివారికి మళ్లీ యౌవ్వనం వస్తుందనే నమ్మకంతో సుముఖాసత్తి అనే ముదుసలి స్త్రీ అక్కడ ఉంటుంది. ఆవిడ అక్కడ జరిగే బలివిధానాలను గురించీ సాహసకృత్యాలను గురించీ కలభాషిణికి చెప్తుతుంది. ఆ శక్తి గుడిలో అందుకోసం యేర్పడిన ఆయుధాలన్నీ సిద్ధంగా అమర్చియుంటవి. అక్కడ ఏయే పనులుచేస్తే ఏయే సిద్ధులు కలుగుతవో ఒక శిలాశాసనంమీద వ్రాసియుంటుంది. ఈ వివరాలన్నీ పింగళి సూరన తన కళాపూర్ణోదయంలో 3వ ఆశ్వాసంలో 100-110 పద్యాలలో కళ్లకు గట్టినట్లు వర్ణించాడు.

ఇలాంటి కోరికలతో తమకంఠ్లను పొడుచుకొని వికలాంగులైనవారును ప్రాణములను గోల్పోయిన వారునుకూడా కృష్ణదేవరాయలవారి కాలంలో వుండేవారన దానికి సందేహం లేదని విజయనగరసామ్రాజ్య చరిత్రను గురించి పరిశోధన చేసిన డాక్టరు నేలటూరి వెంకటరమణయ్యగారి యభిప్రాయము.*

## సాత్వికారాధన

గ్రామదేవతల ఆరాధనలలోను కొలువులలోను పూర్వపు తామసారాధనలూ, వీరావేశపు సాహసకృత్యాలూ క్రమక్రమంగా తగ్గిపోయి సాత్వికారాధనపద్ధతులు వచ్చినా, ఇప్పటికీ పూర్వపుసంప్రదాయాలు కొన్ని కనబడుతూనే ఉన్నవి. కొంత జీవహింస జరుగుతూనే ఉన్నది. మన మతాచార వ్యవహారాలలో జరిగేతంతులోను పాడేపాటలలోను పూర్వకాలపు వీరావేశం కొంత ఇప్పటికీ కనబడుతూనే ఉన్నది. ఇది యిప్పుడు అనేక రూపాలు దాల్చింది. ఇప్పుడు మనదేశంలో వీరభద్రపళ్లెము పట్టే కుటుంబాలలోనూ వీరశైవజంగముల కుటుంబాలలోనూ ఉద్రేకపూరితములయిన ఆచారాలు కనబడుతన్నవి. భేతాళుడి కొలువుసంగతి చాలామంది ఎఱిగేయున్నారు. ఇప్పటికీ మిగిలిన ఆరాదాలు కూడా చాలా భీకరంగాను ఉంటున్నవి.

ఏడుగురు అక్కలని ప్రసిద్ధిజెందిన శక్తులను ఆరాధించే పద్ధతిలోకూడా కొన్ని మార్పులు వచ్చినవి. పూర్వము జరిగే జాతరలు జంతుబలులు మొదలైనవి ఇప్పుడు లేవు. ఈ అక్కలకొలువు మన తెలుగుదేశంలో అష్టాదశ వర్ణాలవారిలోనూ ఒకచక్కని రూపంలో వ్యాపించియున్నది. ఈ అక్కలలో కడగొట్టుశక్తియైన 'కామవల్లి మహాలక్ష్మి'కి కామేశ్వరి అనికూడా పేరు. ఈ కామేశ్వరి మన తెలుగు వారిలో చాలామందికి యిష్టదైవంగా

* Studies in the History of the third Dynasty of Vijayanagar By Dr. N.Venkataramanaiah M.A., Ph.D.pp 335-339.

వుంటూవుంది. క్రీ.శ. 15వ శతాబ్దినాటికే ఈ ఆరాధన మన తెలుగుదేశంలో ఉన్నట్లు క్రీడాభిరామంవల్ల కనబడుతూఉంది.

ఇప్పుడు మన తెలుగువారి యిళ్లలో ఏమైనా శుభకార్యాలు జరిగిన వెంటనే ఈ కామేశ్వరిని కొలుస్తారు. దీనికే "అక్కలకొలుపు' అని అంటారు. ఆనాడు ఏడుగురు ముత్తైదువుల కర్చన జరుగుతుంది. అప్పుడు ఉద్రేక జనకమైన కామేశ్వరిపాటను వీరణవాద్యములతో పాడతారు. ఈ వీరావేశంలో కొందరికి శివమెత్తుతుంది. ఈ అర్చనము పూర్తియయ్యే వరకూ భోజనాలు చెయ్యరు. "అక్కలు లేచేటప్పటికి నక్కలు కూస్తవి" అని ఒక సామెతకూడా ఉన్నది.

క్రీడాభిరామం యొక్క పీఠికలో బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రులవారు కామేశ్వరి యారాధనను గూర్చిన విశేషాలను వ్రాసియున్నారు.

## చరిత్ర దృష్టాంతాలు

గ్రామదేవతల ఆరాధన మనదేశంలో అనాదిసిద్ధంగా వస్తూవున్న సంప్రదాయంగా కనపడుతూవుంది. కలరా, మశూచి మొదలైన అంటువ్యాధులు ప్రబలినప్పుడు ఇప్పుడు మన పల్లెలలోనూ పట్నాలలోనూ జాతరలు జరిపేట్లే పూర్వంకూడా జరుపుతూ ఉండినట్లు శాసన దృష్టాంతాలు కనపడుతున్నవి.

దక్షిణహిందూ దేశాన్నంతా ఏకచ్ఛత్రంగా పరిపాలించిన విజయనగర సామ్రాజ్య చక్రవర్తుల కాలంలో గ్రామదేవతల కొలువులకోసం 'జాతరపన్ను' అనే ఒక పన్ను వసూలు చేసేవారు. గ్రామదేవతల నిత్యారాధనకోసము, ప్రతిసంవత్సరమూ జరిగే జాతరలకోసమూ ఉత్సవాల కోసమూ వినియోగపడగలందులకు "మహారాజ ప్రయోజనాలపన్ను" అనే ఇంకొక పన్నుకూడా ఆ కాలంలో వసూలు చేయబడుతూ వచ్చినట్లు శాసనాలవల్ల కనపడుతూ ఉంది.

క్రీ.శ. 1520 మొదలు 1529 వరకూ విజయనగర సామ్రాజ్యాన్ని పరిపాలించిన కృష్ణదేవరాయల కాలంనాటి శాసనాలవల్లను ఆ కాలంలో వివిధ భాషలలో రచింపబడిన గ్రంథాలవల్లను ఆకాలంనాటి కవిలెల్లవల్లను ఆకాలంలో మన దేశానికి వచ్చిచూచివెళ్లిన విదేశ యాత్రికుల వర్ణనలవల్లను ఆ కాలంనాటి రాజకీయార్థిక సాంఘిక మత పరిస్థితులు మనకు బాగా తెలియుచున్నవి. ఆ వర్ణనలలో గ్రామదేవతల ఆరాధనలను గూర్చిన వివరాలుకూడా కనపడుతున్నవి.

విజయనగర సామ్రాజ్యానికి రాజధానియైన విద్యానగరంలోనే ఒక గ్రామదేవత గుడివుండేది. అక్కడ ప్రతిరోజూ చాలా గొఱ్ఱెలను వేటపోతులను వధించి దేవికి బలియివ్వడాన్ని పోర్చుగీసు చరిత్రకారుడైన పేయస్ స్వయంగా చూసి వర్ణించాడు. ఆ గుడిదగ్గరతప్ప మరెక్కడనూ జంతువులను వధించకూడదని రాజాజ్ఞవుండేదట. అక్కడ వధించే వేటపోతుల రక్తాన్ని ఆ దేవికి నైవేద్యం పెట్టేవారట. ఆ గుడిదగ్గర జంతుబలి యిచ్చేటప్పుడొక జోగి హాజరుగా వుండి ఒక్కొక తలతెగి నప్పుడల్లా ఒక బూరా వూదేవాడట. ఆ బలిని దేవి అంగీకరించినందుకు దాఖలాగా అలా వూదేవాడని

అనుకునేవారు. ఈ దేవి "ఏడుగురు అక్కల"ని ప్రసిద్ధిజెందిన శక్తులలో ఒకశక్తియై వుంటుందని చరిత్ర పరిశోధకుల యభిప్రాయము. ఏడుగురు అక్కలకును మూల స్వరూపమైన దుర్గను విజయనగరంలో చాలా భయభక్తులతో ఆరాధించేవారు. మహర్నవమి దినాలలో అక్కడ చాలా వైభవంగా పూజలు ఉత్సవాలు జరిగేవి. అప్పుడు లెక్కలేనన్ని ఎనుబోతులను వేటపోతులను ఇతర జీవాలనూ వధించి ప్రతిరోజూ బలియిచ్చేవారు. ఇలాగ బలి ఇచ్చేటప్పుడు రాయలవారు తమ బంధుమిత్ర పరివారజనముతో అక్కడ పరివేష్టించి వుండేవారు. విద్యానగరంలో లాగనే ప్రతిపట్టణంలోనూ, గ్రామంలోనూ కూడా ఒక్కొక్క గ్రామదేవతగుడి వుండేది. ఆయా దేవతల నక్కడిజనము ఆరాధించేవారు.

## కొలుపులు - జాతరలు

గ్రామదేవతల జాతర జరుగుతుందంటే ఆ గ్రామంలోని వారందరికీ అది ఒక మహాపర్వంలాగ వుండేది. ముఖ్యంగా స్త్రీలు తమ తలలకు గోరువెచ్చని నూనె రాచుకొని వంటికి పసుపు పూసుకొని స్నానముచేసి కొత్తబట్టలు కట్టుకుని వేపాకుమాలలతో గ్రామపొలిమేరలను ఉన్న గ్రామదేవత గుడికి వెళ్ళేవారు. చుట్టుప్రక్కల గ్రామాలనుంచి రెడ్లు, గొప్ప రైతులు, గ్రామాధికారులు తమ భార్యలతో వేడుక చూడటానికి వచ్చేవారు. గ్రామ దేవతలకు వేటపోతులను బలి యిచ్చేవారు. అక్కడ ఒక తీర్థంలాగ వుండేది. పాటకజనానికి కల్లు, సారాయి విచ్చలవిడిగా దొరికేది. మాలమాదిగలు మొదలైన పాటకపు జనము యొక్క రణగుణధ్వనితో మిన్ను ముట్టేది. చాలా మంది స్త్రీలు మ్రొక్కుబళ్ళు చెల్లించడానికి గుడిదగ్గరికి వచ్చేవారు. ఒక స్త్రీ తన నడుము దగ్గర ప్రక్కకండరములలో నుంచి ఇనుపగాలమున గుచ్చుకొని సిడిమ్రాను మీదికెక్కి తిరిగేది, ఇంకొకర్తె ఎఱ్ఱగా కాలి మండుతూ ఉన్న చింతనిప్పులుగల పొడుగు పాటి గాడిపొయ్యిలో దూకి ఆ నిప్పులమీద నడిచేది. ఇంకొక యామె గుండ్రముగా తవ్విపైన పందిరివేసియున్న ఒక అగ్ని గుండములోకి దూకి చిందులుదొక్కేది. ఇంకొకావిడ లేతయరిటి యాకులమీద నృత్యం చేసేది. మరియొకావిడ తన మూవులోనుంచి కండలను కోసి దేవికర్పించేది. ఒక స్త్రీ తన నోటికి తాళాలు వేసుకునేది. బలియివ్వడానికి వధించిన పశువుల రక్తం పెద్దకాల్వలాగ ప్రవహించేది. ఇలాగ అనేక విధాలుగా దేవతను కొలిచేవారని పాండురంగ మహత్మ్యంలో 3వ ఆశ్వాసంలో వర్ణించబడియున్నది.

## గాలపుసిడి

సిడి తిరుగుతామని మ్రొక్కుకున్నవారి వీపులలోనుంచి ఇనుపగాలమునుదూర్చి సిడిమ్రానుకొయ్యకు కట్టిత్రిప్పేవారు. సిడిమ్రానుకొయ్య అనేది సిడుల జాతరకోసం నాటిన స్తంభము మీది యడ్డమ్రాను. ఒక మనిషి నడుములో గాలమునుగుచ్చి దీనికి కట్టి త్రిప్పడానికే గాలపుసిడి అనేవారు. ఇది చేయలేని వారిని గంపలో కూర్చుండబెట్టి అలాగే త్రిప్పే గంపసిడి అనేది కూడా ఒకటి వుండేది. సిడి అనగా మొద్దులాంటి యాటె అని బ్రౌణ్యనిఘంటువులో నుదాహరించబడియున్నది.

"అంబోధరము క్రింద నసియాడు నైరావతియుఁబోలె సిడిఁ వ్రేలెఁ దెఱవయోర్తు"

అని పాండురంగ మహాత్మ్యములో 3వ అశ్వము 77వ పద్యములో అమ్మవారి జాతరలో ఒక స్త్రీ సిడి తిరుగుటనుగురించి వ్రాయబడియున్నది.

క్రీ.శ. 1511లో మన దక్షిణ హిందూదేశంలో పర్యటనము చేసిన పోర్చుగీసు చరిత్రకారుడైన బార్బోసా (Barbcssa) గ్రామదేవత కొలువులో జరిగే సిడిని చూపి ఇలాగ వర్ణించాడు. "ఈ దేశపు స్త్రీలు దేవతలను కొలవడంలో అతిఘోరమైన సాహస చర్యలు చేస్తారు. ఒక స్త్రీ యేపురుషుడి నైనా ప్రేమించి అతణ్ని పెళ్ళిచేసుకోదలచినట్లైతే అతణ్ని తనకు భర్తగా ప్రసాదిస్తే తాను ముందుగా వచ్చి ఒక గొప్ప మ్రొక్కుబడి చెల్లిస్తానని ఒక దేవతకు మ్రొక్కుకుంటుంది. ఆమెకు యిష్టసిద్ధియై ఆమె వరించిన పురుషుడామెను పెళ్ళి యాడడానికి అంగీకరించినట్లైతే తా నతనిని వివాహం చేసుకోవడానికి ముందుగా తనరక్తాన్ని ఫలానా దేవతకు ధారపోస్తానని తాను మ్రొక్కుకున్నాననిన్నీ ఆ మ్రొక్కు చెల్లించి రావాలనిన్నీ చెప్పుతుంది. అంతట ఆ అమ్మాయి ఆ మొక్కును చెల్లించడానికి ఒక సుముహూర్తం ఏర్పరుస్తారు. ఆ రోజున ఒక సిడిమ్రానును తయారుచేస్తారు. ఒక పెద్ద మ్రానులాంటి స్తంభానికి ఏతములాంటి ఒక వాసాన్ని కట్టి దానిచివర ఇనప కొక్కెముల లాంటి రెండు గాలములు తగిలిస్తారు. ఒక పెద్ద ఏతంలాగ కనబడే ఈ విచిత్రపు యంత్రాన్ని ఒక రెండెడ్లబండిమీదికెక్కించి గుడిదగ్గిరికి తోలుకొని వెడతారు. ఆ మ్రొక్కుకున్న అమ్మాయి తన బంధువులతోను ఇరుగు పొరుగువారితోను బాజాభజంత్రీలతోను ఊరేగుతూ గుడిదగ్గిరికి వస్తుంది. అక్కడ ఒక తిరునాళ్లలోలాగ ప్రజలు చేరి వుంటారు. రకరకాల అంగళ్లు, ఆటగాళ్లు, పాటకులు మూగివుంటారు. ఆ అమ్మాయి స్నానంచేసి తలవిరియబోసి కొని వుంటుంది. కట్టుకున్న బట్టతప్ప ఆవిడపై మీద ఇతర బట్టలుండవు. గుడిదగ్గిర సిడిమ్రాను పెట్టిఉన్న బండిదగ్గిరకి ఆవిడరాగానే ఏతాముకొయ్యను కిందికి దింపుతారు. దాని చివరనున్న గాలము కొక్కెమును ఆ అమ్మాయి డొక్కలో నుంచి గ్రుచ్చి పైకి లేవనెత్తినప్పుడు కండవూడి రాకుండా డొక్కలోపలదిగియున్న గాలము కొక్కెము పైభాగాన్ని ఆవిడ నడుముకు చీరె చెంగును గట్టిగా బిగించి కడతారు. ఆ అమ్మాయి ఎడమచేతి కొక పొట్టికత్తినిస్తారు. కుడిచేతిలో నిమ్మపళ్లు వుంటాయి. అంతట ఆ సిడిమ్రాను కొయ్యను పైకి లేవనెత్తుతారు. దానితోపాటు ఆ అమ్మాయి శరీరమంతా గాలపుకొక్కెమునకు వ్రేలాడుతూ పైకిలేస్తుంది. ఈ దృశ్యాన్ని చూసి అక్కడనున్న జనమంతా జయజయధ్వానాలు చేస్తూ గొల్లున అరుస్తారు. ఆ సిడిమ్రాను త్రిప్పుతూవుంటే ఆ అమ్మాయి గాలానికి తగులుకొన్న చేదలాగ వ్రేలాడుతూ వుంటుంది. ఆవిడ డొక్కలోనుంచి కాళ్లవెంబడిని రక్తం కారుతూ వుంటుంది. చూసేవారికిది చాలా భీకరంగా వుంటుందిగాని ఆ అమ్మాయి మాత్రం కిక్కురుమనదు. నొప్పియని యేడవదు సరికదా చాలా ఉత్సాహంగా తనచేతి లోని కత్తిని ఇటూఅటూ ఝళిపిస్తుంది. తనకు కాబోయే భర్తమీదికి తనచేతిలోని నిమ్మకాయలను విసురుతుంది. ఇలాగ కొంతసేపు ఆ సిడిమ్రానుకొయ్యను గిరగిర త్రిప్పి ఆ తరువాత ఆవిడను కిందికి దింపుతారు. ఆ రక్తపు గుడ్డలతోనే ఇంకా రక్తం కారుతూవుండగానే ఆవిడ ఆ గుడిలోనికి వెళ్లి దేవతాదర్శనం చేస్తుంది. తరువాత ఆవిడ

గాయానికి కట్టు కడతారు. ఆ అమ్మాయి తాహతును బట్టి ఆ గ్రామదేవతకీ అక్కడచేరిన బ్రాహ్మలకూ దానాలు యిస్తుంది. బీదవాళ్లకు అన్నప్రదానం చేస్తుంది. అక్కడికి వచ్చినవాళ్ల నందరినీ సత్కరిస్తుంది" ఇలాంటి సిళ్లు సాధారణంగా దుర్గగుడిదగ్గర జరిగేవి.

వంగరాష్ట్రంలో దుర్గకు ప్రీతిగా చేసే చరత్కుపూజ యనే ఉత్సవాలలో ఇలాగ సిళ్లు తిరగడం చిరకాలంనుంచీ జరుగుతూ వుంది. 1823-26 మధ్య కలకత్తాలో ప్రధాన క్రైస్తవ మతాధికారిగా ఉన్న బిషప్‌హెబరుగారు దేశములో తాను చూచిన సంగతుల నన్నిటినీ తన దినచర్యలో వర్ణిస్తూ 1824వ సంవత్సరం ఏప్రియలు 9వ తేదీన చూసిన చరత్కు పూజ జాతరలో తాను చూసిన ఒక సిడిని వర్ణించాడు.*

1824వ సంవత్సరం ఏప్రియలు 9వ తేదీన ఏనుగుల వీరాస్వామయ్యగారు తమ కాశీయాత్ర చరిత్రలో కూడా కలకత్తాలో "చరత్కుపూజా భానుపోడా" అనే ఉత్సవ సందర్భంలో సిడు లాడడం చూసినట్లు వ్రాసియున్నారు.**

ఇప్పటికీ అరవజిల్లాలలో ఇలాంటి గాలపు సిడి అక్కడక్కడ జరుగుతూనే ఉంటుంది. దానిని "Hook-Swinging" అని అంటారు. దీనిని అధికారులు నిషేధిస్తూ వుంటారు.

## కుంభాలు చెల్లించడం

ఒక డెబ్బై సంవత్సరాల కిందట ఇళ్ళుకాల్చేగ్రహమును పారదోలడానికని జరిగే తంతును శ్రీ వీరేశలింగంగారు తమ రాజశేఖర చరిత్రలో బహుచక్కగా వర్ణించియున్నారు. పెద్ద కుంకుమ బొట్టు పెట్టుకొని ఒకచేతిలో వేపమండ, ఇంకొక చేతిలో బెత్తము పుచ్చుకొని ఒక మంత్రజ్ఞుడు ఇంటికొకటికి రెండేసి చేరల బియ్యము చొప్పున ఏడిండ్లలో అడిగి పుచ్చుకొని క్రొత్తకుండ తెప్పించి గ్రామము నడుమ వీధిలో పొయ్యిపెట్టి అడిగిపుచ్చుకొన్న బియ్యము మునుగకూర తెలికపిండి కలిపి జామువరకు వంటచేసి ఆ కుండను దిగువ దించియుంచి నడివీధి నలికి యెఱ్ఱముగ్గు , నల్లముగ్గు, పచ్చముగ్గు, ఆకుపసరు ముగ్గు, తెచ్చి వానితో భేతాళుని స్వరూపము వ్రాసి భేతాళుని యంత్రమువేసి పూజచేసి ధూపదీప నైవేద్యములు సమర్పించి ఏడేసి రావియాకులతో కుట్టిన ఏడువిస్తళ్లలో వండిన కుంభమును వడ్డించి నడివీథిలో ఒక కొయ్యను పాతి దానికి భేతాళయంత్రమునకు గ్రహమును వ్రాసిన యాజ్ఞను కట్టుతాడు. అంతట గ్రామపెద్దలు కుంభమును బండిమీదికి ఎత్తించుకొని తుడుములు, డప్పులు మ్రోగుచుండగా గ్రామదేవత గుడికి పోతారు. ఆ బండి ముందర మంత్రజ్ఞుడు నడుస్తూ వుంటే అతనివెనక కొందరు త్రాగి కేకలువేస్తూ నడుస్తారు. వారి వెనక జనసమూహము తమ చేతులలో కర్రలతో త్రోవపొడుగున ఇళ్ళమీద కొట్టుతూ పోతారు.

ఆ ఉత్సవం గ్రామదేవత గుడిచేరిన తరువాత మంత్రజ్ఞుడు బిగ్గరగా గ్రామదేవత వ్రాసిన యాజ్ఞను ఈ ప్రకారంగా చదివినాడు. "మంత్రజ్ఞుడైన వీరదాసుగారు పెద్దాపురం గ్రామ దేవతయైన మరిడి మహాలక్ష్మికి చేసిన యాజ్ఞ, ఈ గ్రామంలో ఏదో గ్రహముచేరి

---

* చూడు. బిషప్ హెబరు గారి జర్నల్ 1వ సంపుటం పుటలం 98-100. దీనిని గురించి నేను 26-3-1941 తేది ఆంధ్ర పత్రికలో వ్రాసి యున్నాను.

** చూ. కాశీయాత్ర చరిత్ర 3వ ముద్రణం పుట. 269.

ఇండ్లు కాల్చుచుండగా ఈ గ్రామమునకు దేవతవయి యుండియు నీవూరకే చూచుచుండుటకు నిమిత్తము లేదు, ఆగ్రహామునకు నీతరపున కుంభము కట్టుబడి చేయించినాము. ఆకుంభము గ్రహాముని కిచ్చి మాఋమన్యమైన కొండలమీదికి దానిని పంపివేయవలసినది. అలాగున పంపించని పక్షమున శ్రీభేతాళునిచేతగాని శ్రీహనుమానుల చేతగాని కఠినమైన తాళీదును పొందగలవు.

*శ్లో॥ యక్షరాక్షస దుష్టానాం మూషికా శ్శలభాశ్శుకః*
*క్రిమికీట పతంగానా యజ్ఞా ఉ సిద్ధి ర్విభీషణః.*

అని చదివి తరువాత మంత్రజ్ఞుడు ఏడువిస్తళ్ళను ఏడు చోట్ల వేయించి ఆ యేడింటిలోను కుంభముపోయించి, బండి తోలుకుని, వచ్చినవానిచేత ఒక నల్లకోడిని కోయించి దాని రక్తమును కుంభముమీద పోయించి "ఓ గ్రహామా! నీవీ కుంభమును పుచ్చుకుని కొండలమీదికి పో" అని యాజ్ఞాపించినాడు. అక్కడికి వెళ్ళినవారందరూ చెఱువులో స్నానముచేసి ఇండ్లకు వెళ్ళిపోయారు"

గ్రామంతో విషూచి, మశూచి మొదలైన అంటువ్యాధులు చెలరేగినప్పుడుకూడా ఆయా అంటువ్యాధులను వ్యాపింపజేసే దుష్టశక్తులను పారదోలడానికని ఇలాంటి తంతునే జరిపేవారు. ఆ సందర్భాలలో జరిగే కొలుపులూ జాతరలూ ఇంకా ఎక్కువ గడబిడగానూ భయానకంగానూ వుండేవి. పసుపురాచుకుని తలలు విరియబోసుకుని కత్తులు కఠారులు పుచ్చుకుని వేపమండలు ఆడిస్తూ శివశక్తులు బయలుదేరి గుగ్గిలం పొగలో మైమరచి శివమెత్తి చిందులు తొక్కుతూ రాగా బండిమీద పెద్దరాశిగాపోసిన కుంభాలతో పసుపు కుంకుమలతో అలంకరించిన మేకపోతులతోను గ్రామదేవత గుడిదగ్గరికి వెళ్ళి అక్కడ పోతులను వధించి ఆ రక్తంతో కుంభాన్ని తడిపి దేవతకు నైవేద్యం పెడతారు. ఇలాంటి కొలుపులు జాతరలు ఇప్పటికీ బస్తీలలోకూడా అప్పుడప్పుడు జరుగుతూనే ఉన్నవి.

కలకత్తాలో కాళికాశక్తి గుడిదగ్గరను ఇంకా ఉత్తర హిందూస్థానములో మరికొన్ని చోట్లను ఉన్న శక్తిగుళ్ల దగ్గరను జరిగే తామసపూజల లాంటివి మన తెలుగుదేశంలో జరపడంలేదు. బెజవాడ కనకదుర్గ మొదలైనశక్తి సన్నిధిలో ఆలయముదగ్గర జంతు బలికూడా ఇవ్వడం లేదుగాని గుడి దగ్గరలోనే ఒకచోట ఇప్పటికిని వేటపోతులను బలియిస్తూ వుంటారు.



# 10. సంస్కృతానికి గ్రీకు మాతృక

క్రీస్తుకు పూర్వం ఐరోపాదేశంలో ఒక్క వెలుగు వెలిగి మాటుమణిగిన గ్రీకు రోమకనాగరక సామ్రాజ్యాలకాలంలో భారతదేశముతో వాణిజ్య వ్యాపారములు జరుగుతూ వుండినందువల్ల మన దేశముయొక్క అర్యవిజ్ఞానము నీతి మతధర్మములు సంస్కృత భాషలో నుంచి గ్రీకు ల్యాటిను భాషలలోకి ప్రవేశించి వాటిద్వారా ఐరోపా దేశంలో నలుదెసలా

వ్యాపించినవి. కాని క్రీస్తుశకారంభం అయిన తరువాత ఆ సామ్రాజ్యాలు అస్తమించగా ఈ విజ్ఞానమున్ను విస్మృతమైపోయినది.

క్రీస్తు తరువాత అయిదారువందల సంవత్సరాలకు మళ్లీ ఈ విజ్ఞానజ్యోతిని అరబ్బీ దేశీయులు గ్రహించి తమ భాషద్వారా ప్రాక్పశ్చిమాలకు ప్రసరింపజేశారు. సంస్కృత సాహిత్యము ఖగోళ, భూగోళ, గణితశాస్త్రములు, వైద్యవిద్య, శాస్త్రవిజ్ఞానము అరబ్బీ విద్వాంసులు అరబ్బీ భాషలోని కనువదించగా అరబ్బీదేశములో నుంచి ఆఫ్రికాలోనికి పారశీక తురుష్కదేశాలకూ ఐరోపా దేశాలకు కూడా అది ప్రాకింది.

క్రీస్తుశకము 13వ శతాబ్దము మొదలు స్పెయిను, ఇటలీ దేశములలోనుంచీ పారశీక తురుష్క దేశములనుంచీ వర్తకులు వచ్చి హిందూదేశముతో విరివిగా వ్యాపారం చేయడం ప్రారంభించారు. ఈ మార్గముల వెంబడిని మనదేశపు వస్తువులు ఐరోపాలోని దేశాలకు ఎగుమతి అవుతూ ఉండేవి. తురుష్కులీవ్యాపార మార్గమును అరికట్టగా ఐరోపా దేశాల వర్తకులు కష్టపడి 15వ శతాబ్దంలో హిందూదేశానికి సముద్రమార్గములను కనుగొని వ్యాపారం చెయ్యడం ప్రారంభించారు.

అప్పటికి హిందూదేశము మొగలాయి చక్రవర్తుల పరిపాలనములో శాంతిని అభివృద్ధిని కలిగి సుభిక్షంగావుంటూ భాగ్యభోగ్యములతో తులతూగుతూ వుండేది. ఐరోపాలోని వివిధ దేశాల ప్రజలు తమ దేశాలనుంచి యిక్కడికి వచ్చి తిరిగివెళ్లిన వర్తకుల ద్వారా ఇది చాలా భాగ్యవంతమైన దేశమని విన్నారేగాని ఇక్కడి మతధర్మములను గురించిగాని సంస్కృత వాఙ్మయములోని ఉద్గ్రంథములను గురించిగాని వేదశాస్త్రములను గురించిగాని వారు వినలేదు. గ్రీకు, అరబ్బీ భాషలద్వారా ఐరోపాలో వ్యాపించిన శాస్త్ర విజ్ఞానములో మూడువంతులు హిందూదేశం నుంచి సంస్కృత భాషలోనుంచి తమకు సంక్రమించినదే ననే సంగతిని ఇక్కడికి వచ్చిన పాశ్చాత్య వర్తకులుగాని ఆ దేశవాసులుగాని గ్రహించలేకపోయారు.

క్రీస్తుశకము 16వ శతాబ్దము మొదలు ఈ దేశానికి వచ్చిన మిషనరీలకు ఈ దేశంయొక్క మతగ్రంథాలను గురించీ శాస్త్రగ్రంథాలను గురించీ తెలిసినా వారికి మనయందుగల అసూయాభావంవల్ల వాటిని గురించి ప్రచారం చెయ్యలేదు.

అబ్రహాం రోజర్ అనే అతను 1615లో భర్తృహరి సుభాషితాన్ని డచ్చిభాషలోనికి అనువదించాడు. ఇంకా కొంతమంది కొన్ని విషయాలను తమ భాషలలోనికి అనువదించారు కాని అసలు సంస్కృత వాఙ్మయం సంగతి వారికి తెలియలేదు.

కొందరు స్వార్థపరులు ఈ దేశాన్ని గురించి లేనిపోని సంగతులు కల్పించి ప్రచారం చెయ్యడం ప్రారంభించినారు. ఒక జెసూటు మిషనరీ పదిహేడవ శతాబ్దంలో ఒక గ్రంథాన్ని రచించి అదే హిందువుల వేదమని ఐరోపాలో ప్రచురించగా కొందరు మోసపోయి నిజమని నమ్మారు.

ఇలాంటిస్థితిలో పద్దెనిమిదవ శతాబ్దంలో కొందరు ఐరోపాదేశ విద్వాంసులు ఈ దేశానికివచ్చి సంస్కృతభాషను గురించి కొంత పరిశ్రమచేసి అదియొక గొప్పభాష అనిన్నీ అందులో అనేక విషయములనుగూర్చిన అమూల్యగ్రంథాలు ఉన్నాయనిన్నీ చెప్పేసరికి ఐరోపా ప్రజలు దిగ్భ్రమచెందారు. ఇది నిజమని నమ్మలేకపోయారు.

సంస్కృత భాషనుగురించీ వాఙ్మయాన్ని గురించి గట్టి కృషిచేసి దీనిని ఐరోపా దేశంలో ప్రచారం చెయ్యడానికి ఒక శతాబ్దం పట్టినది. ఆఖరికి జర్మనీ మొదలైన దేశాల పండితులు తమ యావజ్జీవమూ కృషిచేసి సంస్కృతాన్ని సాధించి సంస్కృత వాఙ్మయంలోని ముఖ్యగ్రంథాల నన్నింటినీ చదివి ఆయా భాషల లిపులలో ప్రచురించారు. గ్రీసు, రోము దేశాల రెంటిలోనూ కలిపి ఎంత అమూల్య వాఙ్మయము ఉన్నదో అంత వాఙ్మయము ఒక్క సంస్కృతభాషలోని పూర్వ వాఙ్మయంలోనే ఉన్నదనే సంగతి రుజువు అయినది. ఇంకా యిప్పటికీ కొత్తపుస్తకాలు కనబడుతూనే ఉన్నవి.

ఈకృషి జరగకపూర్వము నూటయాభై సంవత్సరాల కిందట మొట్టమొదటిసారి సంస్కృతము ఒక గొప్పభాష అనిన్నీ, అందులో అనేక విషయాలను గూర్చిన అమూల్య గ్రంథాలున్నాయనిన్ని, అది ఒక గొప్ప వాఙ్మయమనిన్నీ, ఇక్కడనుంచి వెళ్ళినవారు ఐరోపాలో వెల్లడించేసరికి చాలామంది హేళన చేశారు. ఎక్కడనో మారుమూలభూమిలో ఈ హిందూదేశంలో ఒక గొప్పభాష, వాఙ్మయమూ ఉన్నమాట సర్వాబద్ధం అన్నారు. బహుశా పొరపాటుపడి వుంటారన్నారు.

సంస్కృతి లిపిని అందులో ఉన్న గ్రంథాలలోని కొన్ని విషయాలను చూపించగా ఐరోపాదేశంలో కల్లా నాగరికతకు విజ్ఞానానికి పుట్టినిల్లయిన గ్రీసుదేశంలో పూర్వకాలం ప్రవర్తిల్లి వర్ధిల్లిన గ్రీకుభాషను గురించీ గ్రీకు వాఙ్మయాన్ని గురించీ అలెగ్జాండరు దండయాత్ర తరువాత (అనగా క్రీస్తుకు పూర్వం 326 తరువాత) తెలుసుకుని తెలివి తేటలు గల హిందూదేశపు బ్రాహ్మణు లీ సంస్కృత భాషనూ, సంస్కృత వాఙ్మయాన్నీ గ్రీకు మాతృకనుబట్టి సృష్టించారని కొందరు తెలవిగలవారన్నారు! ఇలాగ వాదించిన వారిలో 'డుగాల్డు స్టీవార్టు' అనే తత్వశాస్త్రజ్ఞు డొకడు.

క్రమక్రమముగా పాశ్చాత్య విద్వాంసులు సంస్కృతమును గురించి ఐరోపాలో ప్రచారం చేస్తూఉన్నా చాలాకాలం వరకూ ఈ అపోహ పూర్తిగా అంతరించలేదు. ఐర్లాండు దేశంలో డబ్లిను నగరంలో ఒక ప్రొఫెసరుగారు 1838లో ఉపన్యసిస్తూ చాలా హేతువులు చూపుతూ ఆ వాదమును సమర్థించుటకు ప్రయత్నించాడు. *



# 11. పంచతంత్రం కథల దిగ్విజయము

పశుపక్ష్యాదులనే కథానాయకులుగానూ కథానాయికలుగానూ పాత్రలుగాను కల్పించి రచించిన నీతికథలూ ఉపన్యాసాలూ అఖ్యాయికలూ మనదేశంలో చాలాకాలం నుంచి ప్రచారం ఉన్నవి.

---

* A History of Sanskrit Literature A.A. Macdonell p.p. 1-2.

యజ్ఞముదగ్గర చేరిన బ్రాహ్మణుల గోల కప్పల యరవులాగున నున్నదని ఋగ్వేదములో చెప్పిన సంగతి ఛాందోగ్యోపనిషత్తులో చెప్పబడిన శునకముల ఉద్గీథము, ఇలాంటి రచనకు బీజములుగా కనబడుచున్నవి. *

## బౌద్ధుల జాతకకథలు

క్రీస్తుకు పూర్వము కొన్నివందల సంవత్సరముల క్రిందట రచియింపబడిన బౌద్ధగ్రంథాలలో ఇలాంటి కథలు చాలా కనపడుతున్నవి. గౌతమబుద్ధుడే ఈ కథలను చెప్పినాడనే నమ్మకమువల్ల బౌద్ధులు వాటిని శ్రద్ధాభక్తులతో వింటారు. పైగా సాక్షాత్తు బుద్ధభగవానుడే తన పూర్వజన్మంలో ఈ కథలలోని ఉత్తమపాత్రలుగా జననమొంది యుండెననే నమ్మకము వల్ల వాటిని మరీ పవిత్రంగా ఎంచుతారు. అందువల్లనే వీటికి 'జాతకకథ"లని పేరువచ్చింది. క్రీస్తుపూర్వము 380వ సంవత్సరం "వేసవి"లో జరిగిన బౌద్ధసంఘ సమ్మేళనము నాటికే ఇలాంటి జాతకకథలు క్రోడీకరింపబడినట్లు కనబడుతూ వుంది.

క్రీస్తుతరువాత ఐదవశతాబ్దంలో పాళీ భాషలో రచింపబడిన సుత్తపిటకమనే బౌద్ధగ్రంథంలో ఈకథలు సంపుటీకరింపబడినవి. చీనాదేశంలో క్రీస్తుశకము 668లో పూర్తియైన విజ్ఞాన సర్వస్వంలోనూ తరువాత కొంతకాలానికి పూర్తియైన ఇంకొక విజ్ఞాన సర్వస్వములోనూ కూడా ఇలాంటి కథలు చాలా ఉన్నవి. రమారమి 202 బౌద్ధగ్రంథాలలో నుంచి వీటిని సేకరించినట్లు ఆ విజ్ఞానసర్వస్వములలో నుదాహరించబడివుంది.

## సంస్కృత పంచతంత్రం

పంచతంత్రమని ప్రపంచమంతటా ప్రసిద్ధిజెందిన సంస్కృతవచన కావ్యములోని కథలలో చాలాభాగము పైన చెప్పబడిన బౌద్ధజాతక కథలలో కనబడుతున్నవి. పంచతంత్రం లోనే కనబడే ఇంకా కొన్ని నిదర్శనాలవల్లకూడా అందులోని కథలను చాలా వరకూ బౌద్ధ గ్రంథాలలో నుంచి గ్రహించినట్లు కనబడుతూవుంది. బ్రాహ్మణులనూ వర్ణాశ్రమ ధర్మాలను విమర్శించి నిరసించే భాగాలను వదలివేసి కొన్ని సంగతులు మార్చి, కొన్ని సంగతులు చేర్చి యీ సంస్కృత పంచతంత్రం రచింపబడినందువల్ల దీనిని రచించినది ఆ కాలంనాటి బ్రాహ్మణ విద్వాంసులేనని స్పష్టపడుతూ ఉంది.

దేశంలోని సామాన్యజనులు చెప్పుకునే విడికథలను పోగుచేసి, కథలను చెప్పడంలోనే అనేక గుణపాఠాలు స్ఫురించేటట్లుగా వాటి నన్నిటినీ ఒక కథాక్రమంలో గుదిగుచ్చి చక్కనిశైలిలో ఒక వచనకావ్యంగా రచింపబడిన పంచతంత్రము ఆ కాలంనాటి బ్రాహ్మణ విద్వాంసుల గొప్పశక్తి సామర్థ్యాలను మేధాసంపత్తిని చాటుతున్నదనిన్నీ, ముఖ్యంగా నీ బ్రాహ్మణులు తమ శక్తి సామర్థ్యాలను తమ స్వార్థంకోసం గాక దేశక్షేమం కోసం రాజులు నేర్చుకోవలసిన నీతి ధర్మాలను బోధించడానికే వినియోగించి యుండడము చాలా గొప్ప సంగతి అనిన్నీ సంస్కృతకావ్య వాఙ్మయ చరిత్రను రచించిన ఏ.బీ.కీత్‌గారు వ్రాశారు.

* History of classical Sanskrit Literature - A.B. keith.

ఇప్పుడు మనదేశంలో కనబడే సంస్కృత పంచతంత్ర గ్రంథం ప్రతులలో కాశ్మీర దేశములో దొరికిన "తంత్ర్యాఖ్యాయిక" అనే పేరుగల గ్రంథమే పురాతనమైనదిగా కనబడుతూ వుంది. ఇది యెప్పుడు రచింపబడిందో తెలియడం లేదు గాని ఇందులో మౌర్య సామ్రాజ్య స్థాపనాచార్యుడైన చాణక్యుని ప్రశంస యున్నందువల్లనూ, కౌటిల్యుని అర్థశాస్త్రములోని విషయము లీ గ్రంథంలో కనబడుతూన్నందు వల్లనూ అసలు సంస్కృత పంచతంత్రము క్రీస్తుకు పూర్వము 300వ సంవత్సరమునకు ఇటీవలనే రచింపబడి వుంటుందని ఊహించవచ్చును.

క్రీ.శ. 531-579మధ్య పారశీకదేశాన్ని పరిపాలించిన ఖొస్రూ అను షర్వన్ అనే రాజు కాలంలో ప్రాచీన పారశీక భాషయైన 'పహ్లవీ' భాషలోకి మన పంచతంత్ర కథలు అనువదింపబడివుండగా క్రీస్తుశకము 570 ఆ ప్రాంతంలో ఆ పహ్లవీ గ్రంథంలోనుంచి సిరియా భాషలోకి ఆ పంచతంత్ర కథలు అనువదించబడినవి. తరువాత క్రీస్తుశకము 750 ఆ ప్రాంతంలో అరబ్బీ భాషలోకికూడా అనువదించబడినవి. ప్రాచీన పహ్లవీ గ్రంథము కనబడడం లేదుగాని పైన చెప్పిన సిరియా అరబ్బీ అనువాదాలు దొరికినవి.

ఈ సిరియాభాష పంచతంత్ర కథలు కాశ్మీర తంత్రాఖ్యాయిక కథలకు చాలా దగ్గరగా నున్నవి. అందువల్ల క్రీ.శ. 570కి పూర్వం కొంతకాలం క్రిందటనే సంస్కృతంలో నుంచి పహ్లవీభాషలోకి అనువదింపబడి వుంటాయనిన్నీ అంతకుపూర్వం చాలాకాలం క్రిందటనే మన సంస్కృత వచనకావ్యము తంత్రాఖ్యాయికరూపంలో వుండివుండాలనిన్నీ స్పష్టం అవుతూవుంది.

మన దేశంలో దొరికిన శాసనాలనుబట్టి క్రీ.శ. 2వ శతాబ్దంలో సంస్కృతభాష రాజాదరణనొంది రాజభాషగా ఉన్నట్లు కనబడుతూవున్నందువల్ల మన పంచతంత్రం కూడా ఆకాలంలోనే వచనకావ్యరూపము దాల్చియుంటుందని కీత్‌గారి అభిప్రాయము.

సంస్కృత పంచతంత్రంలో ఇప్పుడు ఐదుభాగాలే ఉన్నవిగాని పూర్వమొకప్పుడు పన్నెండు భాగాలు వుండినట్లు కనబడుతూఉంది. ఈ పంచతంత్రం పూర్వ మేపేరుతో వ్యవహరింపబడేదో చెప్పలేము. కాశ్మీర ప్రతిలో ఉన్నట్లు తంత్రఖ్యాయిక అనే పేరుతోనే వుండినప్పటికీ ఇది రాజులకు అర్థశాస్త్ర ధర్మములనూ రాజనీతినీ బోధించే గ్రంథంగానే వుండేదనడానికి సందేహం లేదు.

దక్షిణదేశంలో మహిలారోప్యమనే పట్నంలో అమరశక్తియనే రాజు తన ముగ్గురు కుమాళ్ళు విద్యావిహీనులై దుర్మార్గులై మూర్ఖులుగా వుండడము చూసి దుఃఖించి వారికి విద్యాబుద్ధులు చెప్పి బాగుచేయగల విద్వాంసు లెవరైనా దొరుకుతారేమోనని చూస్తుండగా విష్ణుశర్మ యను బ్రాహ్మణుడు ఆరునెలలో వారికి విద్యాబుద్ధులు నేర్పుతానని ప్రతిజ్ఞచేసి పంచతంత్రమనే గ్రంథాన్ని రచించి దానిని వారికి బోధించి కృతకృత్యుడైనట్లు పంచతంత్రం పీఠికలో నుదాహరించబడి ఉన్నది.

పంచతంత్రం ఐదు భాగాలుగా విభజింపబడినది. మొదటి భాగములో కరటక దమనకు లనే రెండు నక్కలు ఒక వృషభమునకూ, సింహామునకూ స్నేహము కుదురుస్తవి.

అవి రెండూ అన్యోన్యంగా వుంటూవుండగా అందులో ఒక నక్కకు తన ప్రాముఖ్యత తగ్గిపోయినదని యీర్ష్య కలుగుతుంది. అంతట ఆ వృషభానికి సింహానికి మిత్రభేదంచేసి ఒక దాని నింకొకటి చంపడానికి కుట్రచేస్తూ ఉన్నట్లు దుర్బోధలు చేయగా అవి పోరాడుకోవడంలో వృషభము చచ్చిపోతుంది. అంతట ఆ సింహానికి ఆ నక్క మంత్రి యవుతుంది. మిత్రభేదతంత్రాన్ని బోధించే ఈ భాగములో మొత్తం 17 కథలున్నవి.

రెండవభాగంలో ఒక తాబేలు, ఒక దుప్పి, ఒక కాకి, ఒక ఎలుక స్నేహంగా వుండి పరస్పరలాభం పొందుతవి. మిత్ర సంప్రాప్తియనే నీతిని బోధించే ఈ భాగములో అయిదు కథలున్నవి.

మూడవ భాగంలో సహజశత్రుత్వముగల కాకులూ, గుడ్లగూబలూ స్నేహము చేయగా వాటికి విరోధమువచ్చి నష్టపడిన కథ వర్ణింపబడినది. ఇందులో మొత్తం 11 కథలున్నవి.

నాలుగవ భాగంలో కేవలమూ పొగడ్తకు ఉబ్బిపోయి తెలివిహీనుడేలాగున సంపాదించిన దానిని పోగొట్టుకొనునో తెలుపుటకొక మొసలిని, కోతిని, గూర్చిన కథయున్నూ ఇంకొక కథయున్నూ మొత్తం రెండు కథలు చెప్పబడినవి.

ఐదవభాగములో ఆలోచన లేకుండా చేసే కార్యముల వలన ముప్పుకలుగుననే నీతిని బోధించు మంగలికథయును ఇంకో కథయు నుదాహరించబడినవి.

పంచతంత్రములో పశుపక్ష్యాదులు మానవుల లాగనే ప్రవరిస్తూ ఉన్నట్లూ, వేదములు చదివినట్లూ, యజ్ఞయాగాదికములు, పూజలు పురస్కారములు జరిపినట్లూ, బ్రహ్మ పదార్థాన్ని గురించీ, దేవతలను గురించీ, పురుషార్థాలను గురించి చర్చలు జరిపినట్లూ, నీతిధర్మాలను సూత్రీకరించినట్లూ వర్ణించబడుతుంది. ఇంతలోనే వాటి నైజగుణము బయటకు వచ్చి పశుపక్ష్యాదులలాగనే మళ్లీ ప్రవర్తిస్తాయి. ఇది చాలా వినోదం కలిగిస్తుంది.

ఒకకోతికి పిచ్చికకూ తగవులు రాగా ఒక పిల్లి మధ్యవర్తిగా వుండి తగవు దిద్దుతుంది. ఈ పిల్లి మొదట ఎంతో ధర్మబుద్ధిని వైరాగ్యమును ప్రదర్శిస్తూ శ్రీరంగనీతులు చెవుతుంది. వాటికి బాగా నమ్మకం కలిగిన తరువాత దీనిబోధలు ఇంకా బాగా వినాలని పిచ్చిక దీని చెవిదగ్గరికి రాగా పిల్లిదానిని తన గోళ్లతో చటుక్కున పట్టుకొని చీల్చి చంపుతుంది. ఒక గాడిద దోసతోటలో ప్రవేశించి తన సంగీతప్రావీణ్యమును చూపవలెననే ఉత్సాహంతో ఓండ్రపెట్టగా కాపువాడు మేలుకొని దానిని పట్టుకొని చావగొడతాడు.

పంచతంత్రం మానవుల దుష్టస్వభావమును దుర్వ్యసనములను నిర్భయముగానూ నిర్మొగమాటంగానూ ప్రదర్శిస్తుంది. ప్రతి విషయములోను తాము అధికులమని నటించు బ్రాహ్మణుల కపటనటనలు, రాజులనాశ్రయించి తిరిగేవారి కుట్రలు, స్త్రీల చపలత్వమూ కన్నులకు గట్టినట్టు వర్ణిస్తుంది. మానవ జీవితముయొక్క పరమార్థాలను చక్కగా బోధిస్తుంది.

పంచతంత్రమును ఆధారపరచుకొని రచింపబడిన గ్రంథము హితోపదేశము. అందులో నుదాహరింపబడిన నలభైమూడు కథలలో ఇరవైయైదు పంచతంత్రములోనివే.

ముఖ్యంగా పంచతంత్రములోని మొదటి మూడు పుస్తకములలో నుంచే చాలాకథలు గ్రహింపబడినవి. పులితోలు కప్పుకొన్న గాడిదకథ మాత్రమే నాలుగవ పుస్తకంలో నుంచి తీసుకొన్న కథ. అయిదవ పుస్తకంలో నుంచి మూడు కథలు మాత్రమే గ్రహింపబడినవి.

పంచతంత్రంలోలాగునే దీని ఉపోద్ఘాతంలోకూడా ఒకరాజు మూర్ఖులైన తన కుమారులకు విద్యాబుద్ధులు నేర్పడానికి ఒక విద్వాంసుడికోసం వెదుకుతూ వుంటే ఒక బ్రాహ్మణుడు తటస్థించి ఈ కథలు చెప్పి వారిని విద్యావంతులుగా చేస్తాడు. అయితే ఈ కథలలోని రాజు పాటలీపుత్రరాజు. అతనిపేరు సుదర్శనుడు. హితోపదేశము నాలుగు భాగములుగా విభజింపబడింది. మొదటి రెండు పుస్తకముల రచనావిధానమూ పేర్లూ, పంచతంత్రంలో లాగునే యున్నది. కాని రెండవ భాగము ఇందులో మొదటిగా ఉంది. మూడవభాగముకు నాలుగవభాగముకు సంధివిగ్రహము లని పేర్లు. ఈ హితోపదేశమును రచించినవారెవరో తెలియదంలేదు. ఇది ఇప్పటికి 600 సంవత్సరాలకు పూర్వమే దేశంలో ప్రచారంలో ఉంది.

## పంచతంత్రకథల దిగ్విజయము

పశుపక్ష్యాదులు మానవులలాగ చరించేటట్లు వర్ణింపబడిన నీతికథలసంపుట మొకటి క్రీ.శ 6వ శతాబ్దము (500 ఆ ప్రాంతములో హిందూదేశంలో ప్రచారంలో వుండేది. క్రీ.శ. 531-539 మధ్య పారశీకదేశాన్ని పరిపాలించిన సస్సానియన్ వంశరాజైన ఖుస్రూ అను షర్వన్ కోరికపైన ఈ కథలను బర్జోయ్ అనే పారశీక వైద్యుడొకడు పహ్లవీ అనే ప్రాచీన పారశీకభాషలోకి అనువదించాడు. పైన చెప్పిన మాతృకగాని ఈ పారశీక తర్జుమా గ్రంథంగాని ఇప్పుడు కనబడడంలేదుగాని ఈ పారశీక తర్జుమానుంచి సిరియా అరబ్బీభాషలలోకి చేయబడిన అనువాదములు మాత్రము కనబడుతున్నవి.

క్రీ.శ. 570 ఆ ప్రాంతములో అరబ్బీ దేశమునకు పశ్చిమోత్తరముగా నున్న సిరియాదేశపు భాషలోకి "కలిలగ్, దమనగ్" అనే పేరుతో ఈ కథలు అనువదింపబడినవి. దీని వ్రాతప్రతి క్రీ.శ. 1870లో బయల్పడగా ఇది 1876లో అచ్చొత్తించ బడినది. మహమ్మదీయ మతాన్ని స్వీకరించి క్రీ.శ. 760లో చనిపోయిన పారశీకుడొకడు పహ్లవీ భాషలో నుంచి ఈ కథలను అరబ్బీ భాషలోకి అనువదించాడు. ఇది పిల్పే (Pilpay) విరచితమైన "కలిలహ్" దిమ్నహ్ నీతికథలు అని ప్రసిద్ధిచెందింది. సంస్కృత పంచతంత్ర కథలోని కరటక దమనకుల పేర్లే సిరియాభాషలో కలిలగ్ దమనగ్ అనిన్నీ అరబ్బీభాషలో కలిలహ్ దిమ్నహ్ అనిన్నీ రూపాంతరం చెందినవి.

ఈ తర్జుమాలో బిద్‌బహ్ అనే బ్రాహ్మణ విజ్ఞాని దుష్టుడైన ఒకరాజును సన్మార్గములోనికి త్రిప్పినట్లు చెప్పబడినది. ఈ బిద్ బహ్ అనే శబ్దము విద్యాపతి అనే సంస్కృత పదంలో నుంచీ పహ్లవీభాషద్వారా ఏర్పడిన వికృతి యని శబ్దశాస్త్రజ్ఞులు కనిపెట్టారు. సంస్కృతములో విద్యాపతియనగా విజ్ఞాన వేత్తయని అర్థము. ఈ బిద్‌బహ్ అనే శబ్దములో నుంచే ఇటీవలి బిద్‌పెయ్, పిల్‌పే, అనేశబ్దాలు పుట్టినవి. అందువల్ల పిల్పే విరచితమనే మాటలోని 'పిల్పే' ఒక గ్రంథకర్తకాదు.

ఈ అరబ్బీభాషలోనుంచి ఐరోపాఖండంలోని వివిధదేశ భాషలలోకి ఈకథలు అనువదింపబడినవి. క్రీస్తుశకము 1000లో మళ్ళీ సిరియాభాషలోకి 1180లో గ్రీసుభాషలోకి, 1250లో పారశీకభాషలోకి, 1251లో, స్పెయినుదేశపు భాషలోకి 1250లో యూదుల హిబ్రూ, భాషలోకి అనువదింపబడినవి.

హిబ్రూ భాషానువాదములో నుంచి జాన్ ఆఫ్ కావువా అనే అతడు 1270లో (డైరెక్టోరియం హ్యూమనే విటే) Directorium Humanae Vitae అనే పేరుతో ల్యాటిన్ (ఇటలీ దేశపు సంస్కృత భాషలోకి అనువదించాడు. ఈ గ్రంథము 1480 ప్రాంతములో అచ్చు వేయబడినది.

జాన్ ఆఫ్ కావువా అనే యతడు రచించిన గ్రంథంలో నుంచి జర్మనీలో వర్టెంబర్గు ప్రభువైన డ్యూక్ ఎబర్ హార్ట్ కోరికపైన "Das Buch der Byspel der Alten Wysen" అనగా పూర్వ ఋషుల నీతికథల పుస్తకము అనే పేరుతో జర్మనీ భాషలో రచింపబడి 1481లో ముద్రింపబడినది. ఇది 1483 - 1485 మధ్య ఉల్మ్ (ulm) లో నాలుగుసార్లు ముద్రింపబడి ప్రకటింపబడినది. 1582 నాటికి పదమూడుసార్లు అచ్చుపడినది. దీనివల్ల 15-16 శతాబ్దాలలో ఈ కథలు ప్రజలు యాదరణ కెంత పాత్రమైనవో గ్రహించవచ్చును. పైనచెప్పిన డైరెక్టోరియం అనే ల్యాటిన్ అనువాదంలోనుంచి ఇటలీదేశపు వాడుకభాష యైన ఇటాలియనులోకి అనువదింపబడి వెనీసు నగరంలో 1552లో ముద్రింపబడినది. ఈ తర్జుమాలోనుంచి సర్‌తామస్ నారత్ గారు 1570లో ఇంగ్లీషు భాషలోకి అనువదించారు. ఇలాగ ఒక భాషలో నుంచి ఒక భాషలోకి ఐదుసార్లు అనువదింపబడి ఈ హిందూదేశపు గ్రంథము వెయ్యి సంవత్సరాలకు ఇంగ్లాండు చేరింది.

ఈ ప్రకారంగా వివిధభాషలలోకి వ్యాపించడంలో ఈ కథలలో కొన్ని మార్పులు జరగడంలో ఆశ్చర్యమేముంది? 1578లో ప్రకటింపబడిన నీతికథల రెండవ ముద్రణము నందు ఫ్రెంచి గ్రంథకర్తయైన లాఫాయింటెయిన్ తన గ్రంథములో చాలా భాగము భారత దేశతత్వవేత్తయైన 'పిల్పే' ఋషి రచనలోనుండి గ్రహించినట్లు వ్రాశాడు. ఈ ఫ్రెంచి గ్రంథములో ఒక గొల్లభామ తలమీద పాలకుండ పెట్టుకుని సంతకు వెడుతూ ఆపాలను అమ్మితే తనకు లాభంవస్తే తాను సంపన్నురాలై అనుభవించే అనందాన్ని ఊహిస్తూ ఒక్క గంతువేస్తుంది. అంతట ఆకుండ కిందపడి బ్రద్దలై పాలు ఒలికిపోతవి. దీని మాతృక యైన అసలు పంచతంత్రం కథలో ఒక ముసలి బ్రాహ్మణుడు తాను సంపాదించిన పేలపిండి భాండమును తానుపరున్న చోటికి పైన ఒకమేకకు తగిలిస్తాడు. దేశంలో క్షామం కలిగినప్పుడు ఈ పేలపిండిని అమ్మితే తనకు అమితధనం వస్తుందనిన్నీ దానితో తాను పశువులను గృహమును సంపాదిస్తాననీ, అంతట తనకు పెద్ద కట్నమిచ్చి రంభలాంటి పిల్లనిచ్చి పెళ్లిచేస్తారని, తనకు పండులాంటి పిల్లవాడు పుడతాడనీ వాడు అల్లరిచేస్తూ వుంటే పిల్లవాణ్ణి తీసుకువెళ్ళమని పెళ్ళాన్ని పిలిచిచెప్పుతాననిన్నీ అవిడ వినిపించుకోకపోతే తనకు కోపంవచ్చి ఇలాగ ఒక్కతన్ను తన్నుతా నిన్నీ అనుకుంటూ ఆ పేలపిండి కుండ నొక్కతన్ను తన్నుతాడు. అది అతని నెత్తిమీద పడిపగిలిపోయి పిండి అంతా క్రిందా మీదా పడిపోతుంది.

లాఫాంటెయిన్ రచించిన గ్రంథములో ఇంకొక పంచతంత్ర కథ ఇది: ఒక అడవిలో ఒక అడవిపంది కళేబరము, దాని దగ్గరలోనే ఎక్కుపెట్టిఉన్న విల్లు అమ్ములూ, వాటిపక్కను చచ్చిపడిఉన్న ఒక వేటకాని శవమూ ఒక నక్కకు కనబడుతవి. ఈ అడవిపంది కళేబరము తన కొక నెలకు సరిపోతుందనీ వేటగాని శరీరం మొకవారమునకు సరిపోతుందనీ ఆలోచించి అప్పటికి ఆ వింటినారిని రుచిచూద్దామని పేరాశగల ఆ నక్క దానిని కొరుకుతుంది. అంతట ఆ విల్లులోని బాణం వచ్చి గుచ్చుకుని అది చస్తుంది.

క్రీ.శ. 753-774 మధ్య ప్రస్తుతపు ఇరాకు దేశంలో బాగ్దాదును రాజధానిగా మహమ్మదీయ రాజ్యాన్ని పరిపాలించిన కాలీఫ్ అల్మన్సూర్ కాలంలోనే పహ్లవీభాషలో నుంచి "కలిలహ్, దిమ్నహ్" అనే పేరుతో పంచతంత్ర కథలు అరబ్బీ భాషలోకి అనువదింపబడినవి.

ఆ కాలంలోనే సిరియా దేశంలో "డమాస్కస్" నగరం కాపురస్థుడైన జాన్ అనే క్రైస్తవు డొకడు క్రైస్తవమత ధర్మాన్ని బోధించే ఉద్దేశ్యంతో బర్లాంజోన ఫట్ అనే కథనొక దానిని రచించాడు. ఈ కథ ప్రాచ్య, పాశ్చాత్యభాషలలో చాలా ప్రసిద్ధి చెందినది. ఇందులో ఒక్కొక్క ధర్మాన్నీ నీతినీ బోధించడానికి ఒక్కొక్క కథ, ఉపాఖ్యానము, చెప్పబడింది. ఈ కథలయొక్క మాతృకలన్నీ చాలావరకు హిందూదేశపు కథలే. దీని కథానాయకుడైన జోసఫట్ రాజకుమారుడెవరో కాదు; సాక్షాత్తు గౌతమబుద్ధుడే! ఈ జోసఫట్ శబ్దము బోధిసత్వమనే శబ్దంయొక్క రూపాంతరమే. గ్రీకు రోమక క్రైస్తవ మతసిద్ధాంతాలలో ఈ జోసఫట్ దేవాంశ సంభూతుడైన మహాత్ముడుగా పరిగణింపబడుతున్నాడు. గ్రీకు క్రైస్తవులు ఆగష్టు 29వ తేదీన ఈయన పుణ్యదినముగా పరిగణించి ఆరాధనలు జరుపుతారు. రోమక క్రైస్తవులు నవంబరు 27వ తేదీ ఆయన పుణ్యదినముగా ఎంచి ఆరాధనలు చేస్తారు. ఎక్కడనో తూర్పున హిందూదేశంలో ఒక నాస్తిక మతస్థాపనాచార్యుడు ఇలాగ ఒక క్రైస్తవ మహాత్ముడుగా పరిణామం చెందటము ప్రపంచ మత చరిత్రలో అత్యంతాశ్చర్యకరమైన ఇక విశేష విషయము.*



# 12. "కథ కంచికి వెళ్లింది"

*సీ॥ వేలిలో వెన్నముద్ద వెంగల్వపూబంతి రంగైన ముత్యాల రావిరేక*
*వచ్చులుదాఁచిన పతకంబు పులిగోరు మేలైన ముత్యాల మేలు నరము*
*నీలాలప్రోఁగులు నిగ్గులు మెఱియంగఁ దీరుగైకొన్న కస్తూరి బొట్టు*
*ధగధగద్ధగ కాంతిమిగులు రత్నకిరీట మలరారు పసిడిదువ్వలువ వెలువ*

* A History of Sanskrit Literature A.A. Macdonell M.A. Ph. D. pp 368-370, 417-420.

*గీ॥ మానవులారింప వైశాఖ మాసమందు పసిడిరథమెక్కి తిరువీథులయందు వెడలు*
*నిన్నుఁగంటి నాకోర్కులన్నియును గంటినరగుణనమాల! శ్రీకంచివరదరాజ*

తెలుగుదేశంలో ఆబాలగోపాలమూ చదివే పద్యానికి పాఠాంతరమైన చాటువద్య మిది.

"కథ కంచికి వెళ్ళింది మనమింటికి వచ్చాము" అని చెప్పి కథ ముగించడము తెలుగు వారికి చిరకాలం నుంచి అలవాటు. 'కంచికి వెళ్ళి మంచి మొగుణ్ణి తెచ్చుకుంటా"నని చెప్పి బయలు దేరిన ధోమసానికథకూడా చాలామంది ఎఱిగినదే! ఇవిగాక కంచికి సంబంధించిన అనేక కథలు గాథలు, పాటలు, పదాలు, సామెతలు మన తెలుగుదేశంలో వ్యాప్తిలోనున్నవి.

ప్రస్తుతము అరవము మాట్లాడేదేశం మధ్యలో నెక్కడనో ఉన్న ఈ కంచికిని మనకును ఇంతదగ్గర సంబంధం ఎలాగ ఏర్పడినది? అది ఎప్పుడేర్పడినది? అనే ఆలోచనలు అప్పుడప్పుడు కలుగకమానవు. ఇది తెలిసికోవాలంటే దక్షిణాపథ చరిత్రను పరిశీలింపవలసి యుంటుంది.

చరిత్ర ప్రసిద్ధమైన కాంచీపురమే కంచి. ఇది బహుపురాతనమైన పుణ్యనగరము. ఇది కాశి, గయా ప్రయాగములతో సమానమైన దివ్యక్షేత్రముగా పేర్కొనబడియున్నది. క్రీస్తుకు పూర్వము మూడువందల సంవత్సరములక్రిందట నుండిన పతంజలి దీనిని ప్రశంసించియున్నాడు.

కంచిలో సుప్రసిద్ధములైన దేవాలయము లున్నవి. ఇది శివక్షేత్రమేగాక విష్ణుక్షేత్రము కూడ. మూకకవి తన పంచశతిలో స్తుతించిన కామాక్షీదేవి ఇక్కడి అమ్మవారు.

ఒక కాలమునందీ పట్టణము బౌద్ధమయంగానుండేది. క్రీ.శ. 640 సం॥ ప్రాంతమున చీనాదేశమునుండి వచ్చిన బౌద్ధసన్యాసి హ్యూనిత్సాంగు కంచికివచ్చి అక్కడి బౌద్ధారామాలను దేవాలయాలను వర్ణించినాడు.

శ్రీ శంకర భగవత్పాదుల వారు కంచిలోనుండి సనాతన ధర్మమును సుప్రతిష్ఠితము చేసినారు. శ్రీరామానుజులవారు కూడా ఇక్కడ కొంతకాలమున్నారు.

ఒకప్రక్క శివకంచి – ఇంకొకప్రక్క విష్ణుకంచి, శైవ వైష్ణవముల మేలుకలయికను దెలుపు స్మార్త వైష్ణవులు నిక్కడి గొప్ప విశేషములు.

క్రీస్తుశకము ఐదవ శతాబ్ది మొదలు తొమ్మిదవ శతాబ్దివఱకును రమారమి ఐదువందల సంవత్సరములు రాజకీయముగా ద్రావిడాంధ్ర దేశములనేకముజేసి ఆంధ్ర ద్రవిడ నాగరికతలను మేళవించి బౌద్ధ, జైన, వైదికమత ధర్మములను సమన్వయము చేసి సనాతన ధర్మము నుద్ధరించి దక్షిణాపథమునందొక మహాసామ్రాజ్యమును స్థాపించి సుమత్రా, జావా, బాలి, బోర్నియో ద్వీపములందును శ్యామ కాంభోజములందును కూడా 'ద్రావిడాంధ్ర' నాగరికతను స్థాపించి ప్రఖ్యాతులైన పల్లవ రాజుల రాజధాని యీ కాంచీపురము.

దక్షిణ దేశమునందు వారు నిర్మించిన గొప్ప దేవాలయములును, వారు పోషించిన సంగీత సాహిత్య శిల్ప కళలు, వారు పునరుద్ధరించిన మతధర్మములు ద్వీపాంతరములందు

వారు స్థాపించిన బ్రాహ్మణ సంప్రదాయములును పల్లవరాజుల చరిత్రను వేనోళ్ల జాటుచున్నవి.

పల్లవ రాజులు మహాబలవంతులై యుండగా వారి రాజ్యమున తూర్పున చోళ మండల తీరము వెంబడిని చోళరాజు లేలిన రాజ్యభాగమంతయు చేరియుండుటయే గాక ఉత్తరమున ఆంధ్ర శాతవాహన చక్రవర్తులేలిన కృష్ణానదికి దిగువగల తెలుగు సీమయంతయు చేరియుండెను. ఈ విశాలసామ్రాజ్యమున కంతకును రాజధాని కాంచీపురమే.

క్రీస్తుశకము మూడవ శతాబ్దములోని పల్లవ శాసనము లన్నియు శాతవాహనుల శాసనములవలెనే ప్రాకృతములో నున్నవి. 5,6 శతాబ్దులనాటి శాసనములు సంస్కృతములో నున్నవి. 7, 8, 9 శతాబ్దుల నాటివి కూడా సంస్కృతములోనే ఉన్నవిగాని వీనికీ తమిళ ప్రతులు కూడా చెక్కబడియున్నవి.

క్రీస్తుశకము 3వ శతాబ్దినాటికి దక్షిణాపథము నేలిన శాతవాహన వంశము బలహీనముకాగా వారి సామంతులు స్వతంత్రులు కాజొచ్చిరి. అట్టి వారిలో నొకడైన పల్లవ ప్రభువు అమరావతినే రాజధానిగా జేసికొని కొంతకాలము తెలుగు సీమనేలినట్లు కనబడుతున్నది. చరిత్రరీత్యా మనకు తెలియుచున్న మొదటి పల్లవ రాజు క్రీ.శ. 225–50 మధ్య కృష్ణానది దిగువ ప్రాంతములనేలిన బప్పదేవుడు. ఇతని కైదవ తరమువాడైన విష్ణుగోపుడను పల్లవరాజు కాంచీపురమును రాజధానిగా జేసికొని 325–350 మధ్య ఒక విశాల రాజ్యము నేలుచున్నట్లు సముద్రగుప్త చక్రవర్తి శాసనమున చెప్పబడినది.* క్రీ.శ. 575–600 మధ్య కాంచీపురము నేలిన సింహవిష్ణువు పశ్చిమ చాళుక్య రాజైన దుర్వినీతునికిని తూర్పు చాళుక్యరాజైన విష్ణువర్ధనునికిని సమకాలికుడు. ఇతని యాస్థానముననే మహాకవి భారవి యున్నట్లు చరిత్రాధారములు కనబడుతున్నవి.

ఆ కాలమున కాంచీపురము బౌద్ధులకుమాత్రమేగాక బ్రాహ్మణులకు కూడా ముఖ్య స్థానముగా నుండెను. వేదవేదాంగ విదులైన బ్రాహ్మణోత్తములనేకులు కాంచీ పురమును జేరి పల్లవ రాజుల పోషకత్వమున బరిషత్తులను వేదవిద్యాలయములను నెలకొల్పి స్వమత వ్యాప్తికై కృషిచేయుచు కృతార్థులగు చుండిరి. ఇక్కడనుండి బ్రాహ్మణులు పల్లవరాజులచే నగ్రహారములను సర్వమాన్య భూములను బడసి బ్రాహ్మణులు లేని దేశభాగములకు బంపబడుచుండిరి దేశములో బ్రాహ్మణేతర మతముల నవలంబించిన ప్రజలే విశేషముగా నున్నను బ్రాహ్మణులు తమ విద్యా ప్రభావముచే రాజుల నాకర్షించి కేవలవైదిక వృత్తులందు మాత్రమేగాక లౌకిక వృత్తులయందును బ్రవేశించి మంత్రిత్వాధి కారములను సహితము పొంది మతాంతరులతో వైరము బెట్టుకొనక సహనముతో నుండిరి.

క్రీ.శ. 640వ సంవత్సరప్రాంతమున దక్షిణాపథ దేశములందు సంచరించిన చీనాదేశపు బౌద్ధయాత్రికుడైన హ్యూనిత్సాంగు మొదట వేంగీపురమునకు వచ్చినాడు. దీనికి దక్షిణమున మహాంధ్రములేక ధాన్యకటక దేశమున్నదని, దాని నాగరికతను వైభవమును వర్ణించినాడు మహాంధ్రదేశమునకు నైఋతిమూలనుండిన చోడదేశము (కడప

* Cambridge Shorter History of India pp. 165 - 201.

మండలము)నకు బోయినాడు. ఆంధ్ర చోడదేశమునుండి కాంచీపురము రాజధానిగా నున్న దేశమునకు పోయినాడు. దానినతడు ద్రావిడ దేశమని వర్ణించినాడు.

కాంచీపురము ఐదారుమైళ్ళ విస్తీర్ణముగల పట్టణమనిన్నీ దేశములో నూరు బౌద్ధ సంఘారామములున్న వనిన్నీ అందు పదివేలమంది బౌద్ధమతాచార్యులున్నారనిన్నీ హిందువుల దేవాలయములు 80 మాత్రమే కలవనిన్నీ దిగంబర జైన సన్యాసులుకూడా వేనకువేలుండిరనిన్ని అతడు చెప్పి యున్నాడు.

ఇట్లు కాంచీపుర మా కాలమున చాల ప్రాముఖ్యత వహించిననగరమై దక్షిణాపథమునకు నాయికమణిగా నుండెను.*

క్రీస్తుశకము 600 సం॥ ప్రాంతమున కాంచీపురము రాజధానిగా జేసికొని పల్లవ రాజ్యము నేలిన మహేంద్రవర్మ చాలా గొప్పవాడు. మహాబలిపురమున అతని మనుమడు కట్టించిన ఆదివరాహమూర్తి దేవాలయమునం దీయన చిత్రములున్నవి. క్రీ.శ 610 సం॥ర ప్రాంతమున చాళుక్యులు మహేంద్రవర్మ నోడించి వేంగిరాష్ట్రమును లాగికొన్నారు. అప్పుడు మహేంద్రవర్మయొక్క సోదరుడే వేంగికి రాజప్రతినిధిగా నుండినాడు. ఆ యుద్ధములలో చాళుక్యులు పల్లవుల నోడించి దక్షిణమునకు తరిమినట్లు కనబడుచున్నది.

మహేంద్రవర్మ రసికుడు. సంగీత సాహిత్యములందు ప్రవీణుడు. ఇతడు మత్తవిలాసమను ప్రహసనమును సంస్కృతములో రచించి సుప్రసిద్ధుడైనాడు. అం దాకాలము నాటి రాజకీయ సాంఘిక మతపరిస్థితులు అన్నియు వర్ణింపబడి యున్నవి.

పల్లవుల చరిత్ర అగాధముగా నున్నది. ఇందనేక రాజవంశములవారు. కనబడుతున్నారు.

క్రీ.శ 625-60 మధ్య రాజ్యమేలిన నరసింహవర్మ కాలములోను 715-17 మధ్య రాజ్యమేలిన పరమేశ్వరవర్మ కాలంలోను కూడా చాళుక్యులు పల్లవరాజ్యము పైకి దండెత్తి వచ్చినారు. క్రీస్తుశకము 875-85 మధ్య రాజ్యముచేసిన అపరాజితునితో పల్లవ రాజ్యమంతరించెనని చెప్పవచ్చును. చోళరాజైన మొదటి ఆదిత్యుడు అపరాజితునోడించి అతని రాజ్యమైన తొండమండలమును జయించి చోళ రాజ్యమును స్థాపించినాడు.**

శాతవాహనుల కాలములోనే బ్రాహ్మణమతము దక్షిణదేశమున ప్రచారము కాజొచ్చినది. పల్లవుల కాలములో బ్రాహ్మణులు రాజాదరణమును పొంది బౌద్ధమతమును రూపుమాపి వైదికమతమును పునరుద్ధరించిరి. అనేక దేవాలయములు నిర్మింపబడెను. పల్లవుల దేవుడు ఈశ్వరుడు. అతడు నందివాహనుడు. జటాజూటములు ధరించువాడు. శిరోభాగమున జ్ఞానమయమగు చంద్రకళను ధరించి యిందుశేఖరుడైనాడు. మహాయాన బౌద్ధుల బుద్ధభగవానుడే కైలాసగిరిపై తపోముద్రలో నున్న నందివాహనుడైనాడు. కాని ఈయన బౌద్ధసన్యాసివలె కుటుంబము లేనివాడుకాడు. భిక్షుకుడేగాని భార్యయగు దాక్షాయణితో కాపురము చేయుచున్నవాడు. మ్రొక్కిన వారికి పాపపరిహారము చేయువాడు. అందుచే వెంకటేశ్వరుడై ఆంధ్రభూమిని వెలసియున్నాడు. ఈయన మంత్రమహిమచే

* శ్రీ చిలుకూరి వీరభద్రరావు పంతులుగారు - ఆంధ్రుల చరిత్ర - 1.240.

* Cambridge Shorter History of India, pp 200-201.

పల్లవుల యావుల మందనునాశము చేయకుండా వ్యాఘ్రములకు వాకట్టు కట్టువాడు. అందుచే నాయన భార్య వ్యాఘ్రవాహిని. వేంగియనగా వ్యాఘ్రము. బ్రాహ్మణులు మంత్ర ప్రభావముచేత బౌద్ధవ్యాఘ్రమును అరికట్టిరి. వైదికమతమును మఱలస్థాపించిరి. జైన బౌద్ధమతములు వానప్రస్థ సన్యాసాశ్రమ ప్రధానములు. బ్రాహ్మణమతము గృహస్థాశ్రమ ప్రధానము. జైనబౌద్ధములు వైరాగ్య ప్రధానమైనవి. బ్రాహ్మణమతము కర్మప్రధానమైనది. జైనబౌద్ధములు కష్టసాధ్యమైన అహింసను బోధించునవి. బ్రాహ్మణమతము మంత్రబోధితమైన హింసను, యజ్ఞముగా బోధించునది. అందుచే నీ కాలములో బ్రాహ్మణమతము, సంఘమును సరియైన మార్గమగు ధర్మమున నిలువబెట్టినది. యజ్ఞయాగాది క్రతువులు జరుగసాగెను.*

ఈ వైదికధర్మ విజృంభణమునందు కాంచీపురముననొక గొప్ప విశేషము జరిగినది. ఎక్కడను గానబడని శైవ వైష్ణవముల మేలుకలయిక ఇక్కడ జరిగినది. ఇక్కడి స్మార్త వైష్ణవుల సంప్రదాయమే దీనికొక నిదర్శనముగా నున్నది. ఇది సనాతన ధర్మ విజయమని చెప్పవచ్చును.

క్రీ.శ. 1022 మొదలు 1063 వఱకును రాజమహేంద్రవరమును రాజధానిగా వేంగిదేశమును బరిపాలించి ఆంధ్రమహాభారతము కృతిపొందిన చాళుక్యరాజైన రాజరాజ నరేంద్రుడు చోళరాజుల యల్లుడు. ఈయన కుమారుడైన రాజేంద్రుడు వేంగికి ప్రభువు అగుటయేగాక తన మాతామహుని రాజ్యమైన చోళరాజ్యమునకుగూడ వారసుడై కులోత్తుంగ చోళుడను బిరుదువహించి కాంచీపురమును రాజధానిగా జేసికొని 1063 మొదలు 1112 వరకును రాజ్యము చేసినాడు. అతడు కాంచీపురము నందేయుండి పరిపాలించు వేంగికి విజయాదిత్యుని రాజప్రతినిధిగా జేసినాడు. అతడు తన తండ్రి కాలములోనే మహావీరుడై గోదావరి కుత్తరమున వింధ్యాచలమునంటి ప్రస్తుతము మధ్యమాగాణములని వ్యవహరింపబడు చక్రకూట రాజ్యమును జయించియుండెను. అందువలన నితడు తెలంగాణమునకెల్ల చక్రవర్తిగా నుండెను. రాజేంద్రచోళుని తరువాత రమారమి ఒక వంద సంవత్సరము లీరాజవంశము వారీ విశాల సామ్రాజ్యమును బరిపాలించినారు.

ఇట్లు కాంచీపురము మన ఆంధ్రచక్రవర్తికి రాజధానియైనందువలన ఆంధ్రదేశము నుండి వేదశాస్త్ర పారగులైన వైదికులు, రాజ్యనీతి విశారదులైన నైయోగికులు, రణనీతి కోవిదులైన క్షత్రియులు, వాణిజ్యనిపుణులైన వైశ్యులు, వ్యవసాయమునందు ప్రవీణులైన తక్కిన కులములవారును కాంచీపురమునకు నిరంతర ప్రవాహముగాపోయి రాజాదరమును పొంది ధనమును గౌరవమును సంపాదించుట సర్వసామాన్యమైనది.

మహాపుణ్యక్షేత్రములలో నొక్కటై బహుపురాతనమై చరిత్ర ప్రసిద్ధమై, ఆంధ్ర సామ్రాజ్య రాజధానియై దక్షిణ దేశమునందలి రాజకీయ సాంఘిక మతధర్మములకెల్ల చాల కాలము కేంద్రస్థానమైయుండిన కాంచీపురము తెలుగువారికి కొట్టినపిండియై

---

* ఆంధ్రదేశపు చరిత్ర – శ్రీ చిల్లరిగె శ్రీనివాసరావుగారు పుటలు 23–25.

తెలుగువారి కథలలోను, గాథలలోను, సామెతలలోను, పాటలలోను, పదములలోను ఇప్పటికిని వినవచ్చుచుండుటలోనూ మన తెలుగుకథలన్నీ "కంచికి వెళ్లడం"లోనూ ఆశ్చర్యం ఏమున్నది?



# 13. దేశాంతరాలలో ఆంధ్ర నాగరికత

మనకు చిరపరిచితమైన దేశములలో కాంభోజము ఒకటి. భారతవర్షమునందు చెప్పబడు మహాసంకల్పములో అంగ వంగ కళింగ కాశ్మీరాది 56 సుప్రసిద్ధ దేశాలలో ఇదికూడా పేర్కొనబడుతూ ఉన్నది.

కాంభోజమనేమాట ఆ దేశపు గుఱ్ఱమునకు, ఏనుగునకు శ్రేష్ఠమైన శంఖమునకు పర్యాయపదముగా నున్నది. సంగీతములోని గొప్పరాగములలో నొకదానికి కూడా ఈపదాన్ని వాడుతున్నారు. కాంభోజరాజు కథలని తెలుగులో కొన్ని కథలు కూడా కనబడుతూఉన్నవి.

కాంభోజులు యవన, శక, పహ్లావాదులతోపాటు రామాయణములోను, హరివంశములోను పేర్కొనబడియున్నారు. వీరు మొదట క్షత్రియులేయైనను వైదిక ధర్మములను కర్మలను విడనాడినందువల్ల శూద్రులైనారని విష్ణుపురాణములోను మను స్మృతిలోను చెప్పబడియున్నది.

కాంభోజులు, కాశ్మీరానికి పడమరగా ఒక దేశములో నుండే మ్లేచ్ఛజాతి వారని అనుకొనడమేగాని ఈ కాంభోజమెక్కడ నున్నదో చాలామందికి తెలియదు. ఇది మన భరత ఖండమునకు తూర్పునగల సముద్రమునకవతల కొన్ని ద్వీపకల్పాలు. ద్వీపాలు దాటిన తరువాతనున్నది. ఆశియా ఖండము యొక్క ఆగ్నేయ భాగమున ఇప్పుడు కాంబోడియా అని వ్యవహరింపబడుతూ ఉన్నదేశమే మన కాంభోజము.

ఇది ప్రస్తుతము ఇండోచీనా అని పిలువబడే దేశములో నయాము, లాఓ, కొచిన్ చీనా, అన్నాము, రాజ్యములమధ్యనున్నది. దీని విస్తీర్ణము 65000 చదరపుమైళ్లు ఇందిప్పుడు 24 లక్షల ప్రజలున్నారు. వీరు ఆర్య – మంగోలియా జాతుల లక్షణములను కలిగియున్నారు. ఇది ఫ్రెంచివారి సంరక్షిత రాజ్యముగా నున్నది. స్వాతంత్ర్యమును పొందుటకు పెనగులాడుచున్నది.

కంబుజమనే పదములో నుండి కాంభోజమనే పేరు వచ్చినది. కాంబోడియా అనేది దీనికి వికృతి. క్రీస్తుకుపూర్వము కొన్ని వందల సంవత్సరముల క్రిందటనే హిందూ దేశపు తూర్పు సముద్రతీరముల నుండి బ్రాహ్మణమత ధర్మములును సంస్కృతభాషయున్నూ ఈ దేశమునకు వ్యాపించియుండెను. క్రీస్తుశకము ఐదవ శతాబ్దములో నివి ఈ దేశమునందు మఱింత ప్రబలమైనవి. ఈ సంగతులు ఎన్‌సైక్లోపీడియా బ్రిటానికా అను ఆంగ్ల విజ్ఞాన సర్వస్వములో వ్రాయబడియున్నవి.

ఇంతదూరమున ఉన్న ఈ కాంభోజానికీ తెలుగువారికీ ఇంత సన్నిహిత సంబంధం ఎలాగ ఏర్పడినది అనేది ఒక చిత్రమైన కథ. కొంచెం జాగ్రత్తగా పరిశీలిస్తే ఒక్క కాంభోజముతోనే గాక ఈ తూర్పు సముద్ర తీరాన ఉన్న అనేక దేశాలతోను ద్వీపాంతరాల తోను కూడా మనకు చాలా సంబంధం ఉండినట్లూ మన నాగరికత ఆ దేశాలకు చాలాకాలం క్రిందటనే వ్యాపించినట్లూ తెలుస్తుంది.

## కౌండిన్యుని 'ఫ్యూనాన్' రాజ్యము

ఆసియా ఖండము యొక్క ఆగ్నేయ భాగమునగల ఇండోచీనా (Indo-china) లోను మలయ ద్వీపకల్పములోను, జావా, సుమత్రా, బలి, బోర్నియో మొదలైన ద్వీపములలోను భారతదేశ నాగరికత వ్యాపించిన చరిత్రను గూర్చిన వివరములు కొన్ని చీనాసామ్రాజ్య చరిత్రవలన తెలియుచున్నవి. ఈ ప్రాంతములకు పోయిన చీనాదేశపు రాయబారుల వ్రాతలవలన క్రీ.శ. మొదటి శతాబ్దిలో కౌండిన్యుడను బ్రాహ్మణుడొకడు భారతదేశము నుండి వచ్చి, ఇండోచీనా దేశమధ్యమున చీనా వారు ఫ్యూనాన్ (Funan) అని వ్యవహరించిన గొప్పరాజ్యమును స్థాపించినట్లు తెలియుచున్నది.

ప్రస్తుతము 'అన్నామ్' అని పిలువబడుచున్న చంపదేశములో కనబడిన క్రీ.శ. 7వ శతాబ్దినాటి యొక సంస్కృత శాసనములో ఇండోచీనాలో "ఫ్యూనాన్"కు రాజధానియైన భావపురస్థాపన విషయము గూర్చి వివరింపబడి యున్నది.

ఈ కౌండిన్యుడు ఇండోచీనా దేశపు రాజకొమరితను పెండ్లియాడి యొక రాజవంశమునకు మూల పురుషుడైనట్లు కూడా చెప్పబడుచున్నది. తరువాత నీరాజవంశమును భారతదేశములోని చంద్రవంశముతో ముడిపెట్టినారు. తరువాత భారతీయ నాగరికతను క్రమక్రమముగా ఇండోచీనాలో నంతటను వ్యాపింపజేసి ఇతర రాజ్యములో కూడ స్థాపించినారు. ఇప్పుడు, కాంబోడియాయని వ్యవహరింపబడు కాంభోజ రాజ్యము వానిలో నొకటి. ఇది మొదట ఫ్యూనాన్ రాజ్యమున కొక సామంత రాజ్యముగా నుండెను. ఇప్పుడు అన్నామ అని పిలువబడు చంప రాజ్యమింకొకటి. దక్షిణసయాము (తాయిభూమి) లోని ద్వారవతి ఇంకొకటి. బర్మాలో పెగూ రాష్ట్రములోని హంసావతి మరియొకటి ఆ రాష్ట్రములోనే యుండిన అరిమర్దనపుర రాజ్యము మరియొకటి.

## భారతీయ సంస్కృతి

బర్మానంటి క్రిందికిపోయిన మలయ ద్వీపకల్పములో భారతీయ సంస్కృతి చాలాకాలము క్రిందటనే నెలకొనినది. బోర్నియోలో క్రీ.శ. 4వ శతాబ్దినాటి సంస్కృత శాసనములో మూలవర్మన్ అనురాజు వైదికాచారాముల ప్రకారమొక యజ్ఞమును చేయించినట్లు చెప్పబడియున్నది.

జావాలో పశ్చిమభాగమున పూర్ణవర్మయను రాజు కాలువ నొకదానిని త్రవ్వించినాడు. తాను శ్రీమహావిష్ణువుయొక్క అంశమున జన్మించితినని చెప్పుకొనుచు అట్లు ప్రవర్తింపసాగినాడు. బలిద్వీపమున నిప్పటికిని భారతీయ నాగరికత కనబడుచున్నది. సుమత్రాద్వీపము పూర్వము సువర్ణద్వీపమని వ్యవహరింపబడుచుండెను. తరువాత జావా

(యవ) ద్వీపము నందలి మధ్యభాగముననుతూర్పుభాగముననుకూడా హిందువుల నాగరికతగల రాజ్యము లేర్పడెను.

## శ్రీవిజయ సామ్రాజ్యము

సుమత్రా ద్వీపముయొక్క ఆగ్నేయ భాగమున శేంద్ర రాజవంశమువారు స్థాపించిన "శ్రీవిజయ" సామ్రాజ్యము, చీనాకును హిందూదేశమునకును మధ్యగల పూర్వ పశ్చిమ సముద్రమునెల్ల కొన్ని వందల సంవత్సరముల పాటు అతివైభవముతో నేలిన రాజ్యముగా నుండెను. క్రీ.శ. 8వ శతాబ్దములో సుమత్రా రాజ్యములోని కొన్ని భాగముల పైనను జావా మలయ భూభాగముపైనను ద్వీపకల్పము దగ్గరను గల యనేక చిన్న ద్వీపముల పైనను శ్రీ విజయ సామ్రాజ్యాధీశులు తమయధికారమును వదలివేసిరి. ఈ శ్రీవిజయ సామ్రాజ్యము సంస్కృత విద్యకు నిలయముగా నుండెనని చీనాదేశపు యాత్రికుడైన ఇట్సింగు వ్రాసియున్నాడు.

## మజాపహిత రాజ్యము

క్రీ.శ. 14వ శతాబ్దమున నీ మలయ ద్వీపకల్పములోను మలయ భూభాగము (Peninsula) శైలోను బిల్వతిక్తమను సంస్కృత నామముగల మజాపహిత్ రాజ్యము వ్యాపించి యుండెను. ఇది బౌద్ధ సంప్రదాయములు గల హిందూ రాజ్యము. దీనికి గొప్ప నౌకా బలముండెను. ఉత్తరమున ఫిలిప్పీను ద్వీపములవరకును తూర్పున ఆస్ట్రేలియా ఖండము వరకును గల సముద్రములో వీరి నౌకలు శాంతి భద్రతలను స్థాపించుచుండెను.

అన్నాము అనబడు చంపదేశములోను కాంబోడియా యనబడు కాంభోజ రాజ్యముననుబోర్నియో జావా సుమత్రా బలిద్వీపములలోను కనబడుచున్న శాసనముల వలన విశాల భారతదేశచరిత్రను నిర్మించుట కవకాశము లేర్పడినవి.

ఇండోచీనాలోనున్న ఫ్రెంచి విద్వాంసులును జావాలో నున్న డచ్చి పురాతత్వ శాస్త్రజ్ఞులు (Archaelogists) ను ఈ శాసనములను పరిశోధించి వానిచారిత్రక ప్రాముఖ్యతను తమ భాషలలో వివరించియున్నారు. ఈ విషయములనుగూర్చి ఇంగ్లీషుభాషలో నేమియు వ్రాయబడనందున ఆ ప్రాంతములందు వ్యాపించియున్న భారతీయ రాజకీయ వైజ్ఞానిక విశేషములను గూర్చి మన కంతగా తెలియుటలేదు.

క్రీ.శ. 6వ శతాబ్దిమధ్య కాంభోజము ఫ్యూనాన్ రాజ్యముయొక్క సార్వభౌమత్వము నుండి వెలువడి స్వతంత్రమై మహాశూరులైన రాజులవలన పరిపాలింపబడసాగెను. క్రీ.శ. 6వ శతాబ్దమునుండి 14వ శతాబ్దమువరకును, హైందవ నాగరికతా ప్రాబల్యముగల ఈ రాజ్యముయొక్క వైజ్ఞానిక చరిత్రయు కొంతవరకు దాని రాజకీయ చరిత్రయు గూడ తెలియగల 500 శాసనములు అక్కడ దొరికినవి. వానిలో చాలవరకు సంస్కృతములోనే యున్నవి.

## చంప

కాంభోజ రాజ్యమునకు తూర్పున చంపయను హిందూ రాజ్యమొకటి యుండెను. ఈ రాజ్యమునకు చీనావారితోను అన్నాము రాజ్యమువారితోను నిరంతరపోరాటము తటస్థించు చుండినందువలన దీనిచరిత్ర చిక్కులతో నిండినది. ఇక్కడ దొరికిన 150 శాసనములును చీనా అన్నాము చరిత్రలలోని అధారములును గలిసి ఈ రాజ్యముయొక్క సమగ్రచరిత్ర నిర్మాణమునకు వీలు కలిగించుచున్నవి. ఇండోచీనాలోని హిందూరాజ్య ప్రభుత్వయుగ చరిత్రను బయటికి తీసి మనకుపకారముచేసినవారు ఫ్రెంచి పురాతత్వ శాస్త్రజ్ఞులే.

## జావా, సుమత్రా, బలి

జావా, సుమత్రా, బలి ద్వీపములలో కూడా కొన్ని సంస్కృత శాసనములును, జావాలోని పూర్వపుభాషయైన "కవి" భాషలోని శాసనములు కొన్నియు కనబడినవి. ఇందులో కవి భాషలోనివి రెండుచరిత్ర గ్రంథములు (Chronicles) క్రీ.శ. 13-14 శతాబ్దాలనాటి వైభవమును చాటుచున్నవి. క్రీ.శ. 9, 10 శతాబ్దులనాటి అరబ్బీ వర్తకుల వృత్తాంతములు, ఈ ద్వీపములలోని రాజకీయ సాంఘిక ప్రజాజీవనమును గూర్చిన కొన్ని విశేషములను తెలుపుచున్నవి. డచ్చి పురాతత్వశాస్త్రజ్ఞులు శాసనములను పరిశోధించి హిందూయుగ చరిత్ర నిర్మాణమునకు తోడ్పడుటయె గాక అక్కడి హిందూ దేవాలయములను స్మృతి చిహ్నములను (monuments) జాగ్రత్తగా కాపాడి మనకు మహోపకారమును చేసినారు.

## అంకోర్‌వాట్

కాంబోడియా యనబడు కాంభోజ రాజ్యమున క్రీ.శ.12వ శతాబ్ది పూర్వార్థముననున్న రెండవ సూర్యవర్మ యనురాజు నిర్మించిన "అంకోర్ వాట్" విష్ణ్వాలయము ప్రపంచమునందు చిత్రనిర్మాణములలో నొకటిగా పరిగణింపబడుచున్నది. ఇది మొన్నమొన్నటివరకు నొక ఘోరారణ్యమున కప్పువడియుండినందువలన చాలకాలము వరకును ఎవరికిని దీనిసంగతియె తెలియకుండెను. దానిని ఫ్రెంచి విద్వాంసుడైన హెచ్.మోహో (H.Mouhot) 1860లో కనుగొని ఆశ్చర్యము జెంది అది ప్రపంచములోకెల్ల అద్భుతమైన గొప్ప నిర్మాణమని తన దినచర్య పుస్తకములో వ్రాసికొన్నాడు. అంకోరువాట్‌లోని నిర్మాణము లన్నియు చాలా గొప్పవే. అక్కడి కందకము వెడల్పు 700 అడుగులు. దేవాలయము చుట్టునున్న ప్రాకారము తూర్పు పడమర్లకు ఒక మైలులో మూడింట రెండువంతులు పొడుగును ఉత్తర దక్షిణములకు అరమైలు పొడుగును ఉన్నది. ఈ దేవాలయము మూడు అంతస్తులుగా నున్నది. దానికి గొప్పగొప్ప గోపురములున్నవి. దానిలోపలిగోడలపైన రామాయణములో నుండియు మహాభారతములో నుండియు హరివంశములో నుండియు అనేక ఘట్టములను సూచించు బొమ్మలు చిత్రింపబడి యున్నవి.

## శిల్పములు

జావాలో 'బోరోబొదూరుస్తూపము' అను నొక బౌద్ధస్తూపమున్నది. ఒక కొండనే యొక స్తూపముగా మలచినారు నేర్పరులైన శిల్పులు! జావాలో మధ్యభాగమున ప్రాంబనన్ అను చోట రాతి గోడలపైన రామాయణములోని మొదటి యైదు కాండలలోని కథను బొమ్మలుగా చెక్కినారు. కాంబోడియాలో నున్న అందమైన దేవాలయములు జావాలో లేవు గాని ఇక్కడి దేవళముల శిల్పము కాంభోజములోని వానికన్న చాలా అందమైనది. జావాలోని బౌద్ధశిల్పములలోని విగ్రహములలో కొన్ని ప్రపంచములోని శిల్పములన్నిటి కన్నను అందమైనవిగా నున్నవి. ఈ పై సంగతుల నన్నిటిని డాక్టర్ బి.ఆర్. చటర్జీగారు మీరతుకాలేజి మ్యాగజీన్‌లో ఒక వ్యాసముగా వ్రాసియున్నారు. *

## ఆంధ్రుల ప్రశంస

క్రీస్తుశకారంభము నాటికే ఆంధ్రులు దక్షిణ హిందూదేశపు తూర్పు సముద్ర తీరమున కృష్ణా గోదావరి నదీప్రాంతములందు రాజ్యముల నేలుతూ వర్తక వ్యాపారములు చేస్తూ వుండినట్లు చీనాదేశపు చరిత్రలవల్ల తెలుస్తున్నది.

క్రీస్తు శకారంభమునాటి రోము గ్రీసు చరిత్రకారులైన ప్లినీ టాలమీ మొదలైనవారు దక్షిణ హిందూదేశపు తూర్పు సముద్రతీరమున పాలూర, మైసోలస్, కొంటకశైల, కొద్దూర మొదలైన రేవుపట్టణములున్నట్లు పేర్కొనియున్నారు. దూబ్రాయిదొర చేసిన చరిత్ర పరిశోధన వలన కృష్ణాజిల్లాలోని గూడూరే కొద్దూరని తేలినది.

నాగార్జున కొండదగ్గర బయల్పడిన బౌద్ధశిథిలముల వలనను, శాసనముల వలనను క్రీస్తుశకారంభమునాటికి కృష్ణానది వెంబడిని సముద్రయానము చేయు గొప్పనౌకలు వచ్చుచుండేవని, ద్వీపాంతరములతో గొప్ప వ్యాపారము జరుగుచుండెనని కాశ్మీర కాంభోజములనుండి చీనానుండి బౌద్ధయాత్రికులనేకు లిక్కడికి వచ్చుచుండిరని స్పష్టపడినది.

నాగార్జునకొండ బౌద్ధుల పుణ్యక్షేత్రము. మహాయాన స్థాపనాచార్యుడైన నాగార్జునుని వాసస్థలము. దీనిని బౌద్ధులు శ్రీనగరమని శ్రీక్షేత్రమని, వ్యవహరించుచుండిరి.

## ద్వీపాంతరములలో తెలుగు పేళ్లు

బర్మాలోని పెగూ దేశములోనున్న ప్రోమ్ అనే పట్టణముయొక్క పూర్వపు పేరు కూడా శ్రీక్షేత్రమే! ఇది కేవలము కాకతాళ న్యాయమా లేక భారతీయ సంపర్కమువలన కలిగినదా? అనే ప్రశ్నవేస్తే ఇలాంటివి చాలా కనబడుతున్నవి. బర్మాదేశములోని అరకాన్ రాష్ట్రము యొక్కరాజధానిపేరు త్రైలింగము. ఈ పెగూ దేశమును పూర్వము స్వర్ణభూమి యనే వారు. దానినేలిన తైలింగురాజవంశము తెలుగు రాజవంశమే. పూర్వము బర్మా రెండు విభాగములుగా నుండెనట. ఒక భాగమును కళింగమనిన్నీ ఇంకొక భాగమున ఉత్కళమనిన్నీ అనేవారట జావా, సుమత్రా ద్వీపములలో చీనా వారికి మొదట కనబడిన

---

* Modern Review for March, 1929 pp. 337-338.

హిందూదేశీయులు కళింగులైన తెలుగువారే. అంతట వారు హిందూదేశీయుల నందరినీ కళింగులని వ్యవహరింప సాగినారు.

ప్రస్తుతం కొచిన్‌చీనా, దక్షిణ అన్నాం అనే దేశముల దగ్గర పూర్వముండిన చంపా దేశములో నొక రాష్ట్రము పేరు అమరావతి. ఇంకొక రాష్ట్రము పేరు విజయ. ఇవి మన ఆంధ్రచరిత్రలో ప్రసిద్ధములైన పేర్లేకదా? సయాము సింధుశాఖమీద నున్న కాకుళమనే రేవు పట్టణము మన చరిత్ర ప్రసిద్ధమైన శ్రీకాకుళమునకు ప్రతిరూపమే అనడానికి సందేహం లేదని డాక్టర్ పుట్టపర్తి శ్రీనివాసాచార్యులవారు వ్రాసియున్నారు.

ఇలాగ మన తూర్పు సముద్రతీరమున కవతలగానున్న ద్వీపాంతరాలలో దేశాల పేర్లు పట్టణాల పేర్లు వీనిని పరిపాలించిన రాజులపేర్లు కూడా మనకు చాలా సన్నిహిత సంబంధం గల పేర్లుగానే ఉన్నందువల్ల ఒక కాలంలో ఆంధ్ర నాగరికత అక్కడ వ్యాపించియుండినదనుకోవడానికి చాలా అవకాశం ఉన్నది.

## శాసనములు - గాథలు

అలాంటి సంబంధం ఉండేదనడానికి కొన్ని శాసనములు, గాథలు, శిల్ప సంప్రదాయములు కూడా తోడ్పడుతున్నవి. క్రీ.శ. 248 సం॥లో ఇండోచీనా దగ్గర చంపా దేశమును పరిపాలించుచుండిన చండవర్మ యనేరాజు అప్పుడు ఆంధ్రదేశము నేలుతూవుండిన రాజుకు రాయబారమును పంపినాడు. అది తిరిగి రావడానికి నాలుగేళ్ళు పట్టినది. అప్పుడు నాగార్జున కొండదగ్గర విజయపురిని రాజధానిగా జేసికొని ఇక్ష్వాకు వంశీయుడైన వాసిష్ఠీపుత్ర బాహుబలశాంతమూల మహారాజు ఆంధ్రదేశము నేలుచుండెను. ఇప్పుడు నాగార్జున కొండదగ్గర శిథిలావస్థలోనున్న విజయపురి అనేది ఒక మహాపట్నం అక్కడ దొరికిన శాసనం ఒకటి బౌద్ధ ఉపాశికబోధిశ్రీ అనేయామె వ్రాయించినది, చూస్తే చీనా దేశం మొదలు కాశ్మీరం వరకునుండే నానా దేశాలవారు వర్తకులు, మతవ్యాపకులు తీర్థవాసులు ఆంధ్రదేశానికి తరచుగా వస్తూపోతూ ఉండేవారని తెలుస్తుంది. అంతేకాదు; చంపాదేశంలో కనబడే ప్రాచీన లిపి ఆంధ్రదేశంలో ఆ కాలంలో అనగా క్రీ.శ. 1,2 శతాబ్దాలనాటి ప్రాచీన బ్రాహ్మీలిపి.*

చంపాదేశమునందు వోకన్ అనే పట్టణములో ఇటీవల కనబడిన 3వ శతాబ్దమునాటి శాసనము ఆంధ్రవంశజుడైన వాసిష్ఠీపుత్ర శాతకర్ణి శాసనలిపి యని శాస్త్రజ్ఞులంటున్నారు.

జావా, సుమత్రా, బలి, ఇండోచీనా, సయాం, బర్మాదేశములందు కనబడిన పురాతన శాసనములన్నియు గోదావరి, కృష్ణా, గుంటూరు, నెల్లూరు మండలములందు కనబడిన 5, 6, 7 శతాబ్దములనాటి పురాతనలిపిలోనే ఉన్నవి. పరిశోధకులు దీనిని వేంగిలిపి యని "తెలుగు కన్నడలిపి" యని యంటున్నారు. ఈ దేశాలన్నింటిలోను శాలివాహనశకమే వాడుకలో నుండినది. కేవలము తెలుగువారును కన్నడులును మాత్రమే వాడుచుండిన శకమిది. దీనిని ద్రావిడులైన అరవ వారెన్నడును వాడినవారుకారు. ఉత్తర

---

* చూ. ప్రాచీనాంధ్రులు - వలసరాజ్య చిహ్నలు. శ్రీ భావరాజు వెంకట కృష్ణారావుగారు, భారతి ప్రమాది, శ్రావణము.

హిందూ దేశీయులు విక్రమ శకమునే ఉపయోగించేవారు. అందువల్ల నీ దేశాలతో తెలుగువారికే ఎక్కువ సంబంధముండినట్లు నిశ్చయించవచ్చునని డాక్టర్ పుట్టపర్తి శ్రీనివాసాచార్యుల వారిట్లు వ్రాసియున్నారు.*

"ప్రస్తుతము ఇండోచీనా అనే దేశము దగ్గర పూర్వము ఫ్యూనాన్ రాజ్యమును స్థాపించిన కౌండిన్యుడను బ్రాహ్మణుడు దక్షిణహిందూ దేశమునుండి అక్కడకు వచ్చినాడని, అక్కడ నొక నాగకన్యకను పెండ్లాడినాడని, అతడు ద్రోణుని పుత్రుడైన అశ్వత్థామవలన ఒక కుంతమును వరప్రసాదముగా పొంది నాడనిన్నీ గాథయొకటి అక్కడ వాడుకలో నున్నది. ఇది ఈ ద్వీపాంతరములోని రాజ్యమునకును దక్షిణహిందూ దేశము నేలిన పల్లవ రాజవంశములకును గల సంబంధమును సూచించుచున్నది." తాము అశ్వత్థామ సంతతి వారమనిన్నీ, బ్రహ్మవంశమువారమనిన్నీ పల్లవులు తమ శాసనములందు వ్రాసికొని యున్నారు. యవన పహ్లవ కాంభోజులు మొదట క్షత్రియులైయుండినను వైదిక ధర్మములను తప్పి చరించి నందువలన శూద్రులైనట్లు విష్ణుపురాణమునందు చెప్పబడిన గాథ యీసంగతినే సూచించుచున్నది.

మలయా ద్వీపకల్పములో తూర్పుతీరమునగల "లిగో" పట్టణమును అశోక వంశజుడైన దంతకుమారుడు స్థాపించి నాడనిన్నీ అతడు దంతపురమునుండి వచ్చుచుండగా ఓడపగిలి యాతీరమును జేరినాడనిన్నీ అక్కడ నొక గాథ ఉన్నది. ఈదంత పురము కళింగ దేశపు పూర్వరాజధాని. "స్వస్తిశ్రీ విజయదంత పురాత్" అని అనేక శాసనములు దీనిని పేర్కొని యున్నవి. దీనివలన ఆంధ్రులకీ ద్వీపాంతరములతో చిరకాలమునుండి దగ్గర సంబంధమున్నట్లు తెలియుచున్నది.

క్రీస్తుశకము 3వ శతాబ్దినుండి తొమ్మిదవ శతాబ్ది వరకును ద్రావిడాంధ్ర దేశముల నేలిన పల్లవుల కాలములోను వారి తరువాత 12వ శతాబ్దమువఱకు నాంధ్రదేశమునేలిన చాళుక్యుల కాలములోను వేంగి దేశము, దక్షిణమున కాంచీపురము నుండి ఉత్తరమున మహానది వఱకును పడమర బళ్లారి వఱకును వ్యాపించియుండెనని శ్రీ చిలుకూరి వీరభద్రరావు పంతులుగారు తమ ఆంధ్రుల చరిత్రలో వ్రాసియున్నారు.

## సంస్కృతాంధ్ర సంప్రదాయము

క్రీ.శ. 405-411 సం॥ల మధ్య భారతదేశమున పర్యటనము చేసిన చీనాదేశపు బౌద్ధసన్యాసియైన ఫాహియాను అనేక బౌద్ధగ్రంథములను దీసికొని దక్షిణ హిందూ దేశమునుండి సింహళమార్గముగా ఓడనెక్కి తన దేశమునకు పోతూవుండగా తుపాను వచ్చినదనిన్నీ అప్పుడా యోడమీదనున్న బ్రాహ్మణు లావిపత్తున కతని బౌద్ధగ్రంథములే కారణములని నిందించి వానిని సముద్రమున బారవేయ ప్రయత్నించిరనిన్నీ వ్రాసినాడు. ఇంతేగాక తన మార్గమధ్యమున జావాలో కూడా పాషండులును బ్రాహ్మణులును ఉన్నారని అతడు వ్రాసియున్నాడు. దీనినిబట్టి ఆ కాలమున బ్రాహ్మణులు సముద్రయానము చేయుచూ దేశాంతరములందు కూడా నెలకొని వైదికమతమును ప్రచారము చేయు చుండినట్లు స్పష్టపడుచున్నది.

* చూ: ఆంధ్రులు సంస్కృతి సంబంధములు, భారతి, ప్రమాది, భాద్రపదము.

శాతవాహనుల కాలములోను పల్లవుల కాలములోను చాళుక్యుల కాలములోను కూడా ఆంధ్ర నాగరికత సముద్రములుదాటి దేశాంతరములలోను ద్వీపాంతరములలోను వ్యాపించినట్లు అనేక దృష్టాంతములు కనబడుచున్నవి. బ్రాహ్మణ బౌద్ధమతధర్మములు, ఆచార వ్యవహారములు, వేదశాస్త్ర పురాణేతిహాసములు, సంగీత సాహిత్యములు నృత్యనాటకశిల్పకళలు, దక్షిణ హిందూ దేశమునుండి బర్మా, మలయా, ఇండోచీనా, కాంబోడియా దేశములకును జావా సుమత్రా బోర్నియో, బలి, ఫిలిప్పీను ద్వీపములకును కూడా వ్యాపించెను.

ఇప్పుడు ఇండోనేషియా అని పిలువబడు ప్రాంతములందు పూర్వకాలము వర్ధిల్లిన చంప, అంకోరు, శ్రీవిజయ, మజాపహాత మొదలైన ప్రదేశములన్నియు సంస్కృత విద్యా కేంద్రములుగా నుండినవి, ఆ ప్రాంతములందలి రాజ్యముల పేళ్ళు నగరములపేళ్ళు వానినేలిన రాజులపేళ్ళును భారతీయ సంస్కృత నామములే. అక్కడి రాజసభలందలి యాచార వ్యవహారములన్నియు భారతీయ సంప్రదాయము ప్రకారము సంస్కృతమునందే జరుపబడుచుండెను. రాజోద్యోగులు కందఱకును సంస్కృత పౌరుషనామములే యుండెను. ఎన్నో రాజవంశములు మారినను ఆ బిరుదులిప్పటికిని సయాం (థాయి) దేశములో నిలిచియున్నవి. తుదకు మహమ్మదీయ రాజ్యముగామారిన మలయా ద్వీపకల్పములోకూడా ఇప్పటికిని అవి నిలిచియున్నవి.

ఇండోనేషియా దేశములన్నిటిలోను మన పురాణేతి హాస కథలు వ్యాపించియున్నవి. మన రామాయణ భారత గాథలకు సంబంధించిన బొమ్మలు శిల్పములు ఆటపాటలును కొద్ది మార్పులతో అక్కడ కనబడుతున్నవి. జావా, బాలి ద్వీపములలోని నృత్యకళ కేవలము మన భరతనాట్యము నుండి వచ్చినదే. మన వీధినాటకముల వంటివే అక్కడ కనబడుతున్నవి. అక్కడి తోలుబొమ్మలాటకు వయాంగ్ అనిపేరు. దానిలోని బొమ్మలు, కథలు పాటలు రాగములు మన తెలుగు తోలుబొమ్మలాటలలో నున్నట్లే ఉన్నవి. అందువలన అది మన ఆంధ్రదేశము నుండి అక్కడకు వ్యాపించినదనడానికి సందేహములేదు.

బలిద్వీపము చాలా చిన్నదైనను ఇప్పటికిని అక్కడ సనాతనధర్మ సంప్రదాయములు నిలిచియున్నవి. హిందూదేశములోని సంస్కృతలిపి ఫిలిప్పైను దీవులకు కూడా వ్యాపించినవి. ఆ భాషలో మన తెలుగు మాటలు కూడా కొన్ని ఉన్నవని తెలుస్తున్నది. కాంభోజములోని లిపి కేవలము మన దక్షిణ హిందూదేశము నుండి అక్కడికి వ్యాపించినదే. అందనేక సంస్కృత పదములు చాలా కొద్ది మార్పులతో నున్నవి. అక్కడి సివిలు, క్రిమినలు ధర్మశాస్త్ర విధులు మన మనుస్మృతి పైన నాధారపరుపబడి బౌద్ధమతమున కనుగుణములైన మార్పులతో క్రోడీకరింపబడినవి. ఈ నాగరికతను గురించి శ్రీ జవహర్‌లాల్ నెహ్రూగారు తమ గ్రంథములలో వ్రాసినారు.

ఈ వలసరాజ్యములందలి శిల్ప సంప్రదాయములన్నియూ భారతీయములై యుండుట ముఖ్యముగా గమనింపదగిన విషయము. పూర్వము కాంభోజ రాజ్యమునకు రాజధానియైన అంకోర్‌తోమ్‌లోను అంకోర్‌వాట్‌లోను గొప్ప గొప్ప దేవాలయములున్నవి. వీనిలో మనదేశపు శిల్ప సంప్రదాయములు కనబడుతున్నవి. ఆదేశంలో కూడా అయోధ్య

ఉన్నది. అక్కడకూడా మన రామాయణ భారత గాథలున్నవి. అక్కడను మన విఘ్నేశ్వరుడు, శివుడు విష్ణుమూర్తి మొదలైన దేవుళ్లు ఉన్నారు.

ఇండోచీనాలోని "స్వాన్‌కోలాక్"లోని దేవాలయము చాలా పురాతనమైనది. అది రెండువేల సంవత్సరముల నాటిదని అంటారు. అది హిందూదేశపు దేవాలయము వలెనున్నదట. అక్కడనున్న కంచు విగ్రహములలో గుంటూరు జిల్లా 'బుద్ధాం'లో నుండే విగ్రహముల లక్షణములు కనబడుతున్నవని స్యూయల్ దొర వ్రాసినాడు.



# 14. పూర్వకాలపు తెలుగు నాటకాలు

*"భ్రమరులు జాళెముల్ బయనముల్ మెఱసి*
*రమణఁ బలచాంగ పేరణి యాడువారు*
*ప్రమథపురాతన పటు చరిత్రములు*
*క్రమమొంద బహునాటకము లాడువారు*
*లలితాంగ రసకళాలంకారరేఖ*
*లలవడబహురూప మాడెడువారు*

* * *

*అమరాంగనలు దివినాడెడుమాడ్కి*
*నమరంగ గడలపై నాడెడువారు*
*అవియద్గతి యక్షులాడెడునట్టి*
*భావనమ్రోకులపై నాడువారు*
*భారతాథి కథలు చీరమఱుఁగు*
*నారంగబొమ్మల నాడించువారు*
*కడునద్భుతంబుఁగ గంభమాత్రంబు*
*అడరంగ బొమ్మలనాడించువారు*
*నారట గంధర్వ యక్షవిద్యాధ*
*రాదులై పాత్రల నాడించువారు"*

అని నన్నయభట్టారకునికి రెండువందల సంవత్సరముల తరువాత క్రీస్తుశకము 13వ శతాబ్దిలో నుండిన పాల్కురికి సోమనాథుడు తన పండితారాధ్య చరిత్రమునందు పర్వత ప్రకరణములో వ్రాసియున్నాడు.

నేడు మనము జూచు దొమ్మరియాటలు తోలుబొమ్మలాటలు, పగటివేషములు, వీథిభాగవతములు, మనదేశము నందు చిరకాలమునుండి యున్నవనుట కీ ద్విపదలే సాక్షి.

సోమనాథుని తరువాత నూరునూటయేబది సంవత్సరముల తరువాత క్రీ.శ. 1385–1475 మధ్య నుండిన కవి సార్వభౌముడైన శ్రీనాథుడు కూడా తన కాలమునాటి జక్కుల సానులను వేశ్యలును వేషములువేసి నాటకము లాడుటను నృత్యములు చేయుటను పేర్కొని వర్ణించియున్నాడు.

*"కోణాగ్ర సంఘర్షఘుమఘుమధ్వని తార, కంఠస్వరంబుతో గారవింప*
*మసిబొట్టుబోనాన నసలుకొల్పినకన్ను కొడుపువేఁదాటించు సెడవదడవ*
*శృతికి నుత్కర్షంబుఁ జూపంగవలయుతో, జెవిత్రాడుబిగియించు జీవగఱ్ఱ*
*గిల్కు గిల్కునమ్రోయు గింకిణీ గుచ్ఛంబు, తాళ మానంబుతో మేళవింప*
*రాగముననుండి లంఘించురాగమునకు, నురుమయూరుద్వయంబుపై నొత్తిగిల్ల*
*కామవల్లీ మహాలక్ష్మి కైటభారి, వలపువాడుమవచ్చె జక్కులపురంధ్రి."*

అని క్రీడాభిరామమను వీధినాటకమునందు కాకతీయ ప్రతాపరుద్ర చక్రవర్తి రాజధానియైన ఓరుగల్లులో కళావంతుల కులమునకు జెందిన జక్కులసాని యొక్క ఆటపాటలు వర్ణింపబడినవి. ఈ గ్రంథమును వల్లభామాత్యునిపేరిట శ్రీనాథకవి సార్వభౌముడే రచియించినాడని బ్ర॥శ్రీ॥ వేటూరి ప్రభాకరశాస్త్రిగారి యభిప్రాయము:

ద్రాక్షారామ భీమేశ్వర మహోత్సవమున వేశ్యలు వేషములు వేసి నాటకము లాడుటను నృత్యము చేయుటను శ్రీనాథుడిట్లు వర్ణించినాడు :

*"విరుల దండలతోడి వేణుకాభారంబు, పొంకంబు పిఱుదులఁ బొంలియాడ*
*మణి తులాకోటి కోమల ఝణత్కారంబు, రవలిమట్టెలమ్రోత యవ ఝళింపఁ*
*గుదురునిండిన చిన్ని గుబ్బలచన్నులమీద, ముత్యాలత్రిసరంబు మురువుఁ*
*జూవ వలమాన తాటంక వజ్రాంకు రచ్ఛాయ, లేఁతవెన్నెలఁ*
*బుక్కిలించియుమియ సాని యీశానియై మహోత్సవమునందుఁ, గేల*
*నవచంద్రకాంతపు గిన్నెబూని వీథిభిక్షాటన మొనర్చు వేళఁజేయు,*
*మరులునృత్యంబుజగముల మరులుకొలుపు."*

*– భీమఖండము ఆశ్వా 1–105*

*"వ॥ ..... మహోత్సవ మండపమునందుఁ బేరోనగంబుండి కుండలీ*
*దండలానక ప్రేరణీ ప్రేంఖణ బిందు కందుక ధమాళిచేల మతల్లి హల్లీన*
*కాది నృత్యంబు లవలోకించుచు,* *– భీమఖండము ఆశ్వా 1–118*

## కురవంజి - యక్షగానము

రుద్రకవి విరచితమైన సుగ్రీవ విజయమను యక్షగానమునకు బ్ర॥ శ్రీ॥ వేటూరి ప్రభాకరశాస్త్రి గారు వ్రాసిన పీఠికలో యక్షగానముల పుట్టు పూర్వోత్తరములను గురించి చర్చించియున్నారు.

ఆంధ్రకర్నాటకద్రవిడ దేశములందలి అరణ్యములలో నివసించు చెంచులు, కురవలులేక కొఱవలు మొదలైనవారు శ్రీశైలము అహోబిలము వెంకటాచలము మంగళగిరి మొదలైన పుణ్యక్షేత్రములలో జరుగు తిరునాళ్ళలో చేయుచుండిన నృత్యవిశేషమే (కురవల

అంజె లేక అంగకురవంజి లేక కొఱవంజి అనబడిన దనిన్నీ కాలక్రమమున అది ఆయా క్షేత్ర మాహాత్మ్య కథలతోను శివవిష్ణులీలల కథలతోను కలిసి గేయరూపము దాల్చిన దనిన్నీ వారు వ్రాసినారు. నృసింహస్వామి చెంచెతను బెండ్లాడినకథ చెంచెత కథయనిన్నీ, మాయాకిరాతవేషమున నున్న పార్వతీ పరమేశ్వరులకథ కిరాతార్జునీయ కథ యనిన్నీ, కురవంజులై నటీనటులవంటి సింగి, సింగడు అను రెండుపాత్రలు వచ్చిచేరినవి. తరువాత కొన్నిటిలో కథాసంధాయకుడు లేక సంధి వచనములు చెప్పువాడైన విదూషకునివంటి కోణంగి యనే మూడవ పాత్రకూడా వచ్చి చేరినది. కోణంగినే తరువాత బోడి గాడనిరి.

ఈ కురవంజులు క్రమక్రమముగా పట్టణములందు కూడా ప్రదర్శింపబడి నాగరికత జెందగా కవులు తమ తెలివి తేటల నుపయోగించి అందులో ఛందోబద్ధములైన గేయములను అనేక విధములైన దేశీరచనలను చొప్పించి వానిని సలక్షణములైన యక్షగానములుగా మార్చినారు. అప్పకవి యక్షగానమునకు లక్షణమును చెప్పినాడు. ఈ యక్షగానములలో బహువిధములైన పురాణకథలు చేర్చిరి. కురువంజులలోని సింగి సింగడు పాత్రలు రామ నల హరిశ్చంద్ర సీతాదమయంతి చంద్రమతి పాత్రలుగా మార్చిరి. అయితే పూర్వకాలపు ఆటవికుల కురవంజి సంప్రదాయ సూచకమైన ఎఱుకతసాని పాత్రను మాత్రము తప్పక ప్రవేశపెట్టి దానిచేత ప్రపంచజ్ఞానవేదాంత బోధకములైన ఉపన్యాసములను జేయింపసాగిరి.

యక్షగానములలో ఏలలు, జోలలు, సువ్వాలలు, ఆరతులు, ధవళములు, శోభనములు, చందమామ సుద్దులు, వెన్నెల పదములు, చిలుక పదములు, అల్లోనేరేళ్లు, త్రిభంగులు, సీసకందార్థములు, ద్విపదులు, త్రిపదలు, చౌపదులు, షట్పదలు, మంజరులు, జక్కులరేకులు మొదలైన అనేక దేశీ రచనలున్నవి.*

చాలాకాలము వఱకును యక్షగానములను జక్కులవారను కళావంతులే ప్రదర్శించు చుండేవారు.

కొఱవంజి యనగా ఎఱుకలసాని అని అర్థము. దీనికి కురవంజి అని కూడా రూపాంతరం ఉన్నది. పూర్వము రాజులును రాణులను ఎఱుక చెప్పించుకొని ఎఱుకల సానిని యథోచితముగా బహూకరించేవారు. కదిరీపతి రచించిన శుక సప్తతిలో నొక కొరవంజి రాజుగారి దర్శనమునకు వస్తుంది. అది చాలా అందమైనది. "ఇది దారికట్టిది మొనకట్టిది కాంతావశ్య కరణమిది నీమది కింపొదవించునో నరేశ్వర పదిలంబ"ని తెల్పి కొన్ని బదనిక లొసగినది.

దివ్యౌషధము లమ్ముటేగాక కొరవంజి చేతులుచూచి భవిష్యత్తుకూడా చెపుతుంది.

ఈ కొరవంజి తెలుగు వాఙ్మయంలోనేగాక కన్నడ అరవ సాహిత్యములలో కూడా ప్రాముఖ్యత వహించినది. మన ప్రబంధములలో అక్కడక్కడ కొరవంజియున్నది. యక్షగానములనే పాత తెలుగు నాటకములలో కొరవంజి ఒక ముఖ్యమైన పాత్రగా ఉంటున్నది. 'కొరవంజి పాత్ర ప్రవేశముగల యక్షగానములకు కొరవంజులని పేరు' అని ఆంధ్రవాఙ్మయ సూచిక నిర్వచించినది.

---

* చిందు, గంతు, గొండ్లి, అంజ, అంగ, ఇత్యాదులు నృత్య విశేషములు.

భామాకలాపంలో ఏవిధంగా గొల్లది వేదాంతోపన్యాసము చేసి ప్రేక్షకులను రంజిస్తుందో ఆ విధంగానే కొన్ని కొరవంజులలో యెఱుకలసాని వేదాంత బోధచేస్తుంది. యక్షగానములలో కొరవంజి వేషము వేసుకుని వచ్చేది సామాన్యమైన ఎఱుకలసాని కాదు. భారతీదేవిగాని, పార్వతీదేవిగాని కొరవంజి వేషము ధరించి వస్తుంది.

తెలుగులో జ్ఞానకొరవంజి జీవకొరవంజి నాటకములు రాజమోహన కొరవంజి సత్యభామ కొరవంజి మొదలైనవి ఉన్నవి. కన్నడములో కూడా పార్వతీ కొరవంజి, అర్జున కొరవంజి, కృష్ణ కొరవంజి మొదలైనవి ఉన్నవి.

గోగులపాటి కూర్మనాథకవి వ్రాసిన మృత్యుంజయ విలాసములో పార్వతి శివుని గురించి తపస్సు చేస్తుంది. శివుడు సమాధిలో నుంటాడు. మన్మథుడు తపోభంగం చేసిపోతాడు. శివుడు విరహవేదన పడతాడు. పార్వతిని హిమవంతుడు తీసుకొనిపోతాడు. శివుడు కొరవంజి వేషము వేసికొనివెళ్లి చమత్కారముగా ఎఱుక చెపుతాడు.

రంగాజమ్మ వ్రాసిన మన్నారుదాసవిలాస నాటకములో కూడా ఎఱుకలసానివచ్చి ఎరుక చెపుతుంది. *

## కూచిపూడి భాగవతులు

జక్కుల సానులు, వేశ్యలు మొదలైన కళావంతులు వేషములు ధరించి నాటకము లాడుచుండుట వల్ల నాట్యకళకు గౌరవము లేకుండపోయెను. గాయకులు నటకులు అపాంక్తేయులుగ పరిగణింపబడసాగిరి.

ఇట్టి స్థితిలో సిద్ధేంద్రయతియను నొక మహానుభావుడు బయలుదేరి నాట్యకళ నుద్ధరించి ఒక గొప్ప భాగవత సంప్రదాయమును స్థాపించినాడు. ఇదే కూచిపూడి భాగవతుల సంప్రదాయము. సిద్ధేంద్రుడు భాగవతకథయైన పారిజాతాపహరణమును భామాకలాపమును యక్షగానముగా రచించి శాస్త్రీయమైన భరతనాట్య సంప్రదాయములతో స్త్రీల ప్రవేశము లేకుండా పురుషులే అందు ముఖ్యముగా సంస్కారులైన బ్రాహ్మణులే అన్ని వేషములు ధరించి నాటకములాడి నృత్యగానములను చేయు సంప్రదాయమును స్థాపించినాడు. కృష్ణానదీ తీరమున కూచిపూడిలో పుట్టిన బ్రాహ్మణ బాలురందఱు విద్యాబుద్ధులతోపాటు భరతశాస్త్రమునుగూడా నేర్చుకొని ఒకమారైననూ కాలికి గజ్జెకట్టి స్వామి సన్నిధానమున నృత్యము చేసి తీరవలెనను నియమమేర్పడినందువల్ల నాట్యకళా నిపుణుల జనసంఘమొకటి యేర్పడినది.

ఈ సిద్ధేంద్రయోగి కృష్ణలీలా తరంగిణిని రచించిన శివ నారాయణతీర్థులవారి శిష్యుడని ప్రతీతి. ఏమైననేమి తరతరముల నుండి ఆయన శిష్యులమని చెప్పుకొనుచూ కూచిపూడిలోని బ్రాహ్మణులు సంగీత సాహిత్యములందు భరతశాస్త్రమందు ప్రవీణులై పగటివేషములను వేస్తూ యక్షగానములను ప్రదర్శిస్తూ భరతశాస్త్రానుసారముగా నృత్యాభినయములను చేస్తూ దక్షిణహిందూ దేశమందంతటను ప్రసిద్ధులైయున్నారు.

---

* కొరవంజి – శ్రీ చింతాదీక్షితులుగారు
ఆంధ్రపత్రిక ప్రమాది సంవత్సరాది సంచిక పుటలు 33–3.

## పగటి వేషములు

మన దేశములో పగటివేషములు చిరకాలమునుండి యున్నట్లు కొన్ని నిదర్శనములు కనబడుచున్నవి. వేములవాడ భీమకవి శాపమువలన కళింగగంగు అను రాజు పదభ్రష్టుడై పగటివేషగాండ్రతో కలిసితిరుగుతూ మళ్ళీ ఆ కవి యనుగ్రహమును పొంది కళింగగంగు వేషముతో వెళ్ళి శత్రురాజును సంహరించి రాజ్యమును సంపాదించు కొన్నట్లు ఒక కథ చిరకాలం నుంచి మన దేశంలో వాడుకలోనున్నది.

ఇప్పుడు మనదేశంలో చాలాకాలంనుండి కూచిపూడి వారును గడ్డిపాడువారును పగటివేషములు వేస్తున్నారు. కాంచీపురము మొదలైనచోట్లకూడా కొందరు బ్రాహ్మణులు పగటివేషములు వేస్తున్నారు. కూచిపూడి భాగవతులు రమారమి 30 వేషములు వేస్తారు. అందులో ముఖ్యమైనవి బుడుబుడుక్కల వేషము, సోమిదేవి సోమయాజులు, కాశీకావడి, జంగం వేషము, కోమటి - లింగ బలిజ, బైరాగి - బాలక వేషములు. అన్నిటికిని చివర వీరు శారదావేషమును వేయడం ఆచారము. ఆ వేషమున వీరు శారదా రామాయణము లోని దరువులను పాడతారు. ఈ రామాయణము నెవరు రచించారో తెలియదు. గాని ఇది బహుపురాతనమైనదిగా కనబడుతూ ఉన్నది. ఇందులోని భాషను చూస్తే ఇది పదవ శతాబ్దము నాటి తెలుగు శాసనముల భాషలాగ కనబడుతుందని బ్రహ్మశ్రీ పెండ్యాల వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రి గారు ఈ క్రింది యుదాహరణము నిచ్చినారు. రావణుడు ప్రాణములు విడుచుచు శ్రీరామునితో ఇలాగ అంటాడు.

"నీతో పోరక విధిలేదు. దైవమని తెలియకున్నానుగాదు. లోకమాత సీతమ్మయని నాదు మనమున నెరుగుచున్నానుగాదు. లేకపోతే మీకు కాకరాదు. మీచేతిలో జచ్చుటలేదు. చచ్చితేగాని మోక్షములేదు - ఓ శారదా కరుణానిధీ!"*

## వీథి భాగవతములు

కూచిపూడివారు, భామాకలాపము, గొల్లకలాపము, ఉషాపరిణయము, ప్రహ్లాద మొదలైన అనేక వీథినాటకములను ప్రదర్శిస్తూ ఉంటారు. తరంగములు, అష్టపదులు జావళీలు పాడి అభినయిస్తారు. నృత్యము చేస్తారు. వీరి భరతనాట్యము సుప్రసిద్ధమైనది. కూచిపూడివారు ప్రదర్శించే యక్షగానము లనేకములున్నను దేశమంతటను ప్రఖ్యాతి గాంచినవి వీరి భామాకలాపము, గొల్లకలాపములే. మొదటిది సిద్ధేంద్రయోగి విరచితమైనట్లు ప్రతీతి. ఇది పారిజాతాపహరణ కథ. ఇందులో దూతికా లాలనము, సత్యభామ విరహము, దూతికా రాయబారము, శ్రీకృష్ణుని నాయక భార నిర్వహణము, సత్యభామా ప్రతిజ్ఞాపాలనము, రసవంతములైన ఘట్టములు. ఈ పారిజాతాపహరణమును ఇందులోని సవతుల కయ్యమును పండితులను పామరులను స్త్రీ పురుషులను రాజాధి రాజులను కవులను గాయకులనుకూడా ఆకర్షించి దేశమంతటా ప్రఖ్యాతి గాంచినది. అందువల్ల ఈ పారిజాత కథను అందులోని ఘట్టములను ఇతర యక్షగానములలోనికి కూడా చొప్పింపసాగిరి. అప్పటి నుండి యక్షగానములకు 'పారిజాతము"లనిపేరు వచ్చినది.

* తారణ సం॥ జ్యేష్ఠమాస భారతిలో శ్రీ పెండ్యాల వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రిగారు వ్రాసిన రంగనాథరామాయణ పీఠికా విమర్శనము. పుట 512.

కూచిపూడివారి యక్షగాన ప్రదర్శనములు నవరస భరితములై గొప్ప వేదాంత బోధ చేయదగినవై యున్నందువల్లను అందలి కథలన్నీ భాగవత కథలై భక్తి ప్రధానములైనందు వల్లను వీరి యక్షగానములకు "భాగవతముల"నిన్నీ వీరికి కూచిపూడి భాగవతులనిన్నీ పేరువచ్చినది.

## ప్రశస్తి

గొల్లకలాపములోని హాస్యరసప్రధానములై వేదాంత బోధకములైన సంవాదములును భామాకలాపములోని సవతుల కయ్యపు బట్టులును యక్షగానములనుండి కవులు తమ ప్రబంధములలోని కెక్కించినారు.

'అంతమదింపకునే యని పల్కిన, నంతమ దింపకు వేయనుచున్
గంతు లడంచెద లెమ్మని పల్కిన, గంతులడంచెద లెమ్మనుచున్
రంతులనేమి ఫలంబనిపల్కిన, రంతుల నేమిఫలంబనుచున్
బంతముచూడఁగదే యని పల్కిన, బంతము చూడగదే యనుచున్'

సీ॥ ఒట్టుసుమీ యన్న నొట్టుసుమీయంచు, నేనేమియనిన నేనేమియనుచు
గానీ గదేయన్నఁగానీగదేయనుచు, నింకేల యనిన నింకేల యనుచు
నోసి పోవేయన్న నోసి పోవేయంచు, నౌనంటిననిన నౌనంటిననుచు
మఱువకుమిదియన్న మఱువకుమిదియంచు, నీవెంతయనిన నీవెంతయనుచు
నొకతె మగనికినాసించుటొప్పదనిన, నొకతె మగనికి నాసించుటొప్పదనుచుఁ
బట్టియాడె నారంభతోఁ బ్రథమరంభ, ప్రియుఁడు నిలుమన్న నిలువక
(ఫెద్ద రొదగ)

అని పింగళి సూరన తన కళాపూర్ణోదయమున 3వ అశ్వాసమునందు భామా కలాపములోని సవతుల కయ్యము ననుసరించినాడు.

ఆంధ్రదేశమున వెలసిన కూచిపూడి భాగవతుల సంప్రదాయము దక్షిణదేశమునకు కూడా త్వరలోనే వ్యాపించెను. ఇప్పటికిని అరవదేశంలోని బ్రాహ్మణులు తెలుగు యక్షగానములను ప్రదర్శించుచున్నారు.

క్రీస్తుశకము 1335 నుండి మూడుశతాబ్దములు తుంగభద్రానదీ తీరమున హంపి విజయనగరమును రాజధానిగా దక్షిణహిందూదేశము నేకచ్ఛత్రముగానేలిన విజయనగర చక్రవర్తుల సామ్రాజ్యములో అందుముఖ్యముగా వారి సామంతరాజులై తంజావూరు మధురల నేలిన తెలుగునాయక రాజుల ఆస్థానములలో యక్షగానములు వీథినాటకములు రాజాదరణమును ప్రజాదరణమును పొందినవి.

భగవత్కథలతోను,పురాణకథలతోను ప్రారంభమైన యక్షగానములు తంజావూరు తెలుగు నాయకరాజుల కాలములోను 1673 తరువాత అక్కడ రాజ్యముచేసి తెలుగు నభిమానించిన మహారాష్ట్ర రాజుల కాలములోను శృంగారజీవితవర్ణనలతో నిండినవి.

కురవంజులలోను యక్షగానములలోను ముఖ్యముగా పేర్కొనతగినవి, కిరాతార్జునీయము, గంగా గౌరీవిలాసము, అలమేలుమంగావిలాసము, ఎరుకలవేషకథ,

కపోత వాక్యము, గరుడాచలము, త్రిపురసంహారము, దారువనక్రీడ, నలచరిత్ర, నిజలింగ చిక్కయ్యకథ, కన్యకాచరిత్ర, పారిజాతాపహరణము, పార్వతీపరిణయము, మృత్యుంజయ విలాసము, శివపారిజాతము, సముద్రమథనము, విజయరాఘవ చంద్రికా విహారము, రఘునాథాభ్యుదయము, మన్నారుదాసవిలాసము, సుగ్రీవ విజయము కృష్ణలీలా తరంగిణి కృతికర్తయైననారాయణ తీర్థులవారును త్యాగరాజస్వామి వారును కూడా భక్తిరసప్రధానములైన పారిజాతాపహరణము, నౌకాచరిత్రము అను యక్షగానములను రచించినారు. ఆంధ్రదేశమున రెండువందలును దక్షిణదేశములో మూడువందలును యక్షగానములు కనబడుచున్నవి.

"భిన్న పాత్రవేషధారణము లేక, సింగి సింగదును కొన్నిచోట్ల కోణంగి పాత్రలతోను వెలసిన వీథినాటకములనబడు కురువంజులు, వేషభేదములు గల శ్రవ్యరచనలై యక్షగానములైనవి. సంధివచనములు చెప్పు కోణంగి సూత్రధారుడై 'వచ్చేనమ్మా సత్యభామ" ఇత్యాదివిధములను "అంతట హనుమంతుడేమనుచున్నాడు" ఇత్యాది విధములను పాత్రలను బేర్కొనగా తద్వేషధారులు ప్రవేశించి తమ యాటపాటల నెఱుపుదురు. ఇట్లు పెంపొందిన యక్షగానములు కాలక్రమమున పాత్రబాహుళ్యము, రంగభేదములు కూడ గలవై కొంత సంస్కృత నాటకచ్ఛాయ చొప్పడగా నాటకములను పేరను గూడఁ బేర్వెలసినవి" అని పూర్వకాలపు నాటకములయొక్క పరిణామమును బ్రా॥శ్రీ॥ వేటూరి ప్రభాకరశాస్త్రులవారు చక్కగా చెప్పినారు.



# 15. పూర్వకాలపు నాటక ప్రదర్శనము

క్రీస్తుశకం పన్నెండవ శతాబ్దిలో నుండిన పాల్కురికి సోమనాథుడు రచించిన పండితారాధ్యచరిత్రలో పర్వత ప్రకరణములో శివరాత్రినాడు శ్రీశైలంలో జరిగే తిరునాళ్లను వర్ణిస్తూ, "ప్రమథపురాతనపటుచరిత్రములు, గ్రమమొందబహునాటకము లాడువారు... భారతాది కథలఁ జీరమఱుంగు నారంగ బొమ్మల నాడించువారు, ...గంధర్వ, యక్ష, విద్యాధరాదులై పాడెడు నాడెడువారు విధమునం బ్రచ్ఛన్న వేషముల్ దాల్చి యధికోత్సవము దులుకాడ నట్లాడువారు" అని ప్రారంభించి వారి వేషధారణ పద్ధతులు, వారు వేసుకునే రంగులు, ధరించే దుస్తులు, ఆభరణములు మొదలైన విశేషాలన్నీ వివరించాడు.

ఈ వేషధారులు తెరలోపలినుండి బయటికిరావడము, ఆడడము, పాడడము, అభినయించడము, భరతశాస్త్రమును ప్రదర్శించడము కన్నులకు కట్టినట్లు వర్ణించాడు. వీరు శైవ కథలకు గాథలకు సంబంధించిన అనేక వేషములు వేసి "వెండియు భవు బహువిధ చరిత్రము లఖండితగతి నాటకములాడి"నట్లున్నూ సోమనాథుడు వర్ణించాడు*

* చూడు : పండితారాధ్య చరిత్ర రెండవభాగం – పుటలు436–443.

ఈ వర్ణనలను బట్టి చూస్తే సోమనాథుడి కాలంనాటికి పూర్వనుంచీకూడా మన గడ్డిపాడు భాగవతులువేసే పగటివేషముల లాంటివీ, కూచిపూడి భాగవతులాడే నాటకాలలాంటివీ ఉన్నట్లు, అప్పటి నాటకాలలో జరిగే నృత్యము, గీతము, వాద్యము, అభినయము, ఇప్పటిలాగునే యుండినట్లూ కనబడుతూ ఉన్నది.

పాల్కురికి సోమనాథుని పండితారాధ్య చరిత్రకు పీఠికను వ్రాసిన శ్రీ చిలుకూరి నారాయణరావుగారు సోమనాథుడు క్రీ.శ. 1300లో ఉన్నట్లు వ్రాశారు గాని కర్నాటక కవి చరిత్రను రచించిన శ్రీమాన్ ఆర్.నరసింహాచార్యులు గారు సోమనాథుడు క్రీ.శ. 1195 ఆ ప్రాంతంలోనే ఉన్నట్లు ఖండితంగా వ్రాశారు. దీనికి ఉపబలంగా క్రీ.శ. 1220 లో నున్న సోమరాజనే కన్నడకవి తనుద్భటచరిత్రలో "సముదంచద్వృషభస్తవా మరమహీరామనం సోమనం" అని వృషాధిప శతక గ్రంథకర్తయైన పాల్కురికి సోమనాథుని స్తుతించి యున్నందువల్ల సోమనాథుడంతకు పూర్వమువాడై యున్నట్లు రూఢియగుచున్నదని వ్రాసినారు.

అందువల్ల ఇప్పుడు మన కూచిపూడి భాగవతులు ప్రదర్శించే నాటకపద్ధతులు, భరతశాస్త్ర అభినయాలు క్రీస్తుశకము 1195 నాటికే మన తెలుగు దేశంలో బాగా వ్యాప్తిలో నుండినట్లు చెప్పడానికి వీలవుతున్నది.

క్రీ.శ. 1385-1475 మధ్య నుండిన శ్రీనాథ కవిసార్వభౌముడి కాలంనాటికి యక్షగానాలను చూసి ప్రజలానందించేవారనీ వీధినాటకాలు బాగా వ్యాప్తిలోనుండేవనీ రుజువు చెయ్యడానికి క్రీడాభిరామంలోని వర్ణనలే చాలును.

## రాయలవారి నాటకశాల

1509 మొదలు 1529 వరకూ విద్యానగరం రాజధానిగా కటకం మొదలు కన్యాకుమారి వరకూ గల దక్షిణ దేశాన్నంతా ఏకచ్ఛత్రంగా పరిపాలించిన శ్రీకృష్ణదేవరాయల వారికాలంలో విజయనగరం చక్రవర్తుల రాజనగరులోనే ఒక నాట్యశాల, ఒక నృత్యశాల వుండేవి. అందులో నాటకాలను ప్రదర్శించేవారు. రాయలవారే సంస్కృతంలో జాంబవతీ కళ్యాణం అనేనాటకాన్ని రచించి శ్రీ విరూపాక్ష స్వామివారి వసంతోత్సవ సమయములో ప్రదర్శింపజేశారని ఆ నాటకంలోనే వుదాహరింపబడింది.

రాయలవారి రాణివాస స్త్రీలు ఇతరులకు కనబడకుండానే అక్కడ ప్రదర్శింపబడే నాటకాలను చూచి ఆనందించడానికి తగిన ఏర్పాటులుండేవి.

ఆకాలంలో సంస్కృత నాటకాలను రాజనగరులోనే ప్రదర్శించేవారు. జన సామాన్యాన్ని ఆకర్షించే యక్షగానాలను పట్నాలలోనూ, పల్లెలలోనూ ప్రదర్శించేవారు.

ఈ యక్షగానాలనేవి దేశభాషలలో నుండేవి. వీటిలో ఎక్కువగా పాటలుంటవి. అందులోని నటీనటులు అనేక వాద్యవిశేషాలమధ్య ఆ పాటలను పాడుతూ నృత్యంచేస్తూ అభినయించేవారు. ఒక పాత్ర ప్రవేశిస్తూ తాను ఎవరో చెప్పుకుంటూ ఒకపాట పాడేపద్ధతి ఇప్పటి వీధినాటకాలలో కూడా కనబడుతూనే ఉంది.

కృష్ణదేవరాయలవారి కాలంలో రచించబడి ప్రదర్శించబడే యక్షగానా లేవీ ఇప్పుడు కనబడడం లేదుగాని "తాయి కొండనాటకమ"నే ఒక నాటకమున్నూ, "గంగావతరణమ"నే ఒక నాటకమున్నూ ఆ కాలంలో ఉన్నట్లు చరిత్రాధారాలు కనబడుతున్నవి.*

తరువాత ఒకవంద సంవత్సరాలకు తంజావూరును పరిపాలించిన తెలుగు నాయకుల ఆదరణక్రింద రచించబడిన యక్షగానాలు మాత్రం ఇప్పటికీ నిలిచియున్నవి. అలాంటివి ఒక వందదాకా తంజావూరు సరస్వతీ మహల్గ్రంథాలయంలో కనబడుతున్నవి.

ఆ కాలంలో నాటకాలను ఆడేవారిలో స్త్రీలు పురుషులుకూడా వుండేవారు. సర్వసాధారణంగా ఈ నటీనటులు కళావంతులుగా వుండేవారు. ఇలాంటి నాటకాలాడే వారి "మేళా"లున్నట్లు కూడా అప్పటి గ్రంథాలవల్ల కనవడుతూ ఉన్నది.

## రంగస్థలము

రంగస్థలంమీద ఇప్పటిలాగనే ఒక తెరవుండేది. తెరలో నుంచి పాత్రధారులు వెలువడి వచ్చేవారు. వారు రకరకాల వేషాలనువేసేవారు. రంగస్థలముమీద గంగానది, కైలాస పర్వతము, ఉద్యానవనములు, అడవులు, వన్యమృగములు, పశుపక్ష్యాదులు కన్నులకు కట్టినట్లు ప్రదర్శించేవారట. స్త్రీపురుష పాత్రధారులు తమతమ వేషాల కుచితములైన దుస్తులు ఆభరణాలు ధరించేవారు. నవరత్న కుచితములైన బంగారు నగల లాగ కనబడేటట్లు లక్కతోను, రంగుతోను, వరకురేకుతోను ముచ్చిపని చేసిన దుస్తులను తయారుచేసి వాటిని ధరించేవారు. వీణ మొదలయిన వాద్యములతో కొందఱు స్త్రీలు గానం చేయడంతో నాటకం ప్రారంభమయ్యేది. తరువాత సూత్రధారుడు రంగస్థలం మీదికి వచ్చి నాందీపద్యములను చదివి, నాటకం పేరు, నాటకాన్ని రచించిన కవిపేరు చెప్పి తెరవెనుకకు వెళ్లగా పాత్రధారులు ప్రవేశించేవారు. నాటకప్రదర్శనం ముగిసిన తరువాత సభాసదులు నాటక మాడినవారిని సన్మానించేవారు.

ఈ వివరాలన్నీ పింగళి సూరనార్యుని ప్రభావతీ ప్రద్యుమ్నంలో ఉదాహరించ బడినవి. పింగళి సూరన కృష్ణదేవరాయల తరువాత కొంతకాలంవరకూ జీవించియున్నట్లు శాసన దృష్టాంతాలున్నవి.

ప్రభావతీప్రద్యుమ్నంలోనే గాక ఇంకా ఆ కాలంనాటి అనేక ప్రబంధాలలో కూడా నాటక ప్రదర్శనాలను గురించిన వివరాలున్నవి. కందుకూరి రుద్రకవి రచించిన నిరంకుశోపాఖ్యానంలో "తరుణ యౌవనలక్ష్మి" నర్తనము సూపె, నధికతరమైన తెర తీసినంతలోనె, బిత్తరముఁజూపు పాతరకత్తెవోలె" అనే పద్యభాగంలో రంగస్థలంమీది తెర వర్ణింపబడింది. మనుచరిత్రలోను, వసుచరిత్రలోనూ కూడా నాటకశాలలు పేర్కొనబడి యున్నవి.

1514వ సంవత్సరం నాటి ఒక శాసనములో "తాయికొండ నాటకము"ను బహురమ్యంగా ప్రదర్శించే చేగయ్యకుమారుడైన "నట్టువ నాగయ్య" పేరు పేర్కొనబడి యున్నది. పోతవరగ్రామ కాపురస్తుడు నట్టువ తిమ్మయ్య కొమార్తెయైన ఒకనర్తకిపేరు

* చూడు : కర్నాటక కవి చరితె 2వ సంపుటం పుట 292.

కూడా వుదాహరించబడియున్నదని డాక్టరు నేలటూరి వెంకటరమణయ్యగారు విజయనగర రాజ్యము యొక్క మూడవ రాజ వంశ చరిత్రలో వ్రాసి యున్నారు.*

★ ★ ★

# 16. క్రీ.శ. 1509 నాటి కూచిపూడి భాగవతులు

శ్రీకృష్ణదేవరాయలవారి సవతి అన్నగారైన వీర నరసింహదేవరాయలు వారు కృష్ణదేవరాయలవారికి పూర్వం అనగా 1506 మొదలు 1509 వరకూ విజయనగర సామ్రాజ్యాన్ని పరిపాలించారు. ఆయన సమక్షంలో కూచిపూడి భాగవతులొక నాటకాన్ని ప్రదర్శించినట్లున్నూ వారు ప్రదర్శించినది సామాన్యమైన నాటకముగాక, అప్పట్లో ఆ సామ్రాజ్యంలో ఒక సామంతుడు చేస్తూవుండిన ఘోరకృత్యాలను గురించిన నాటక ప్రదర్శనమనిన్నీ, దానిఫలితంగా రాయలవారు అక్కడి అన్యాయం సంగతి విచారించి ఆ సామంతుడి శిరచ్ఛేదం చేయించి నట్లున్నూ, మెకంజీదొరగారు సేకరించియుంచిన "లోకల్ రికార్డ్సు" అనే కవిలెలలో మాచుపల్లి కైఫీయతులో నున్నది. ఈ కవిలెలలన్నీ సంపుటములుగా కట్టబడి ఇప్పుడు చెన్నపట్నం ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారములో నున్నవి. ఈ కైఫీయతులో కొంతభాగమును డాక్టరు నేలటూరి వెంకటరమణయ్య గారు రచించిన విజయనగర సామ్రాజ్య మూడవ రాజవంశచరిత్రకు ఒక అనుబంధముగా చేర్చినారు. దానినీ క్రిందనుదాహరిస్తున్నాను.

"ఆయన (సంబెట గురవరాజు) చాలాదినములు జీవించి ప్రభుత్వము చేసినందున ఆయనను తాత గురవరాజు అని చెప్పుకొనేవారు... ఆ గురవరాజు ప్రభుత్వములో ప్రజలకు అతిదారుణశిక్ష చేయిస్తూ వుండేవారు. ప్రజలవద్ద ద్రవ్యఆకర్షణ చేసేయెడల త్వరగా సొమ్ము ఇవ్వకపోతే స్త్రీలను తీసుకవచ్చి స్తనాలకు చిరతలు** పట్టించేవారు. అలాగంటి దినములలో వినుకొండ, బెల్లంకొండ తట్టున కూంచిపూడి అనే గ్రామం నుంచి బ్రాహ్మణులు భాగవతులనే వేషధారులు కీర్తన నిమిత్తమై యీ స్థలమునకు వచ్చివుండి సంబెట గురవరాజు యొక్క దారుణ ప్రభుత్వం చూచి ఇక్కడనుంచి లేచిపోయి విద్యానగరమునకు పోయి, అక్కడ వీరనరసింహరాయలు రాజ్యపరిపాలనం చేస్తూవుండగా భాగవతులు దర్శనం అయి కేళిక (ఆట) అడుగగా శలవు యిచ్చినారు. కూచిపూడి మేళంవాండ్లు చాలా విద్యావంతులని ప్రసిద్ధిగా వినుకడి వున్నందున రాయలవారు స్త్రీలు సహా చూడవలెనని నగర్లవద్ద దివాణములో కీర్తనకు శలవు యిచ్చినారు. అక్కడ కీర్తన

* Studies in the History of the Third Dynasty of Vijayanagara, pp 412.

** రెండు కర్రలనుచేర్చి ఒక ప్రక్కకొనలు చేర్చికట్టి రెండవ ప్రక్కకొనలను విడదీసి రెండు చేతులతో పట్టుకుని ఆ కర్రలనందున చేతివ్రేళ్లను అడకత్తెరలో ఒత్తినట్లు ఒత్తుటకే చిరతలు పట్టించడము అనేవారు.

వినికి చేసే టప్పుడు సంబెట గురవరాజు వేషం వేసికొని వొకడు, యిద్దరు బంట్రౌతుల వేషంవేసుకొని, వొకడు స్త్రీవేషం వేసుకొని, సంబెట గురవరాజువలెనే ఆవేషగాడు కూర్చుండి, రాయల సమక్షమందు ఆ స్త్రీయొక్క స్తనాలకు చిరతలు పట్టించి సొమ్ము యివ్వమని తహాశీలు చేసినట్లు వినికిచేసినారు.

అప్పుడు రాయలవారు చూచి 'అదియే' మని అడుగగా ముఖస్తులయినవారు భాగవతులముఖతా ఆ వర్తమానము తెలిసి "శిద్ధవపటం శీమలో సంబెట గురవరాజు అనే అయన ప్రజల వద్దనుంచి ద్రవ్యాకర్షణచేసే యెడల స్త్రీలను తీసుకపోయి యీ ప్రకారముగానే తహాశీలు చేస్తున్నారు గనుక యేలినవారికి తేటపడేటందులకై ఈప్రకారం వేషములు కట్టి వినికిచేశినా"రని విన్నవంశాయగా చాలా తీక్షణంచేసి, మరునాడు ఉదయమందు ఆ సంగతితిరుగా జ్ఞాపకం సేయమని ముఖస్తులైన వారికి అజ్ఞయిచ్చినారు. ఆ రాత్రి కీర్తన సాంతనమయినవెనుక తెల్లవారిన పిమ్మట రాయలవారు కాలోచిత కృత్యములు తీర్చుకుని, అస్థానమునకు వచ్చి పేరోలగమున నుండి తమవద్ద కార్యభారకులు వచ్చి సంబెట గురవరాజుగారి వర్తమానం జ్ఞాపకంచేయగా వినిప్రధానులను సేనా నాయకులను పిలిపించి ముహిముకు* సైన్యము సిద్ధంచేయించవలసిందని శెలవు యివ్వగా ఆస్థానపంజరములో చిలుక "జయం, జయం, జయం" అని మూడుసార్లు పలికినది. ఆపలుకులు మహారాజువిని 'యిదేమనకు శకునము' అని అప్పుడే పేషుఖానే బయట వేయించి, కోట పశ్చిమద్వారమువెలుపట భానుజండా వేయించి శిబ్బందీ బట్టువాడాలుగ చేయించి సైన్యం యావత్తుకు ఖర్చు వెచ్చములకు యిప్పించి ఆ మొహిముకు, రాయల కొమారుడు అనిపించుకొనిఉన్న యిసుమాలుఖానుడనే తురకసర్దారుడుగా మొకర్రరు (నిర్ణయం) చేసి, అతనిని పిలిపించి సమక్షమందు వలసిన బుద్ధిమంతులు శలవుయిచ్చి తాంబూలం యివ్వగా ఆ సరదారుడు తాంబూలం అందుకొని, సంబెట గురవరాజు తల తెస్తున్నానని ప్రతిజ్ఞపలికి సైన్యమును వెంటబెట్టుకవచ్చి గురవరాజుగారు ఉన్న కోటకు పశ్చిమంవైపున ఉన్న బంఢ్లకనమమీద లడాయిచేసి, కనమపై ఉన్న చౌకి (కావలిస్థలము) విరగబొడిచి, కనమఫారు అయివచ్చి కోటకు పశ్చిమ భాగమందు దిగివుండి ఆ దినంరాత్రి కోటకు పశ్చిమంవైపున ఉన్న గుండ్లకట్ట అనే సన్న కొండమీదను దమదమాలు యెత్తి, మొహర్జాలు** ఖాయంచేసి, కోటమీద లడాయిషురువు చేసినంతట శక్తి ఉన్నంతమట్టుకు కోటలోనుంచిన్నీ వేటువాడు జవాబు యిచ్చినారు. అంతట కోటలో నిభావు*** చెయ్యలేక కౌలు**** మీద కోట యివ్వగా అప్పుడు గురవరాజును పట్టుకొని తల కోసి తీసుకొని పోయినారు. కోటలో స్త్రీలు బాలురు అందరు దేహత్యాగము చేసినారు.*****



* ముహిము = ఒకముఖ్య కార్యము, అగత్యమైనపని, ** మొహర్జా (మోర్చా) = బత్తేరి; ఫిరంగిపెట్టే దిబ్బ (The kaifiyat of Machupalli Local Records No-56 pp 66 ff. **** నిభావుచెయ్యలేక (నిభాయించలేక) తాళలేక, ***** కవులు శత్రువుకు లోబడేటప్పుడు పుచ్చుకునే అభయము.

# 17. తెలుగు ప్రబంధముల ప్రామాణ్యం

మన తెలుగు ప్రబంధ కవుల రచనలన్నీ కేవలం కల్పనా కథలేననే ఒక దురభిప్రాయం మనలో బాగా నాటుకున్నది. ఈ ప్రబంధాలలో దేశచరిత్రను నిర్మించడానికి పనికివచ్చే సంగతులున్నవనే విషయాన్ని చాలాకాలంవరకూ మనవాళ్ళు గమనించలేదు. ప్రబంధములను రచించిన కవుల వంశములను గురించీ కృతిపొందినరాజులను గురించీ ప్రబంధములలో నాయికానాయకుల చిత్తవృత్తులను గురించీ కథా సందర్భంలోవచ్చే వివిధ పాత్రల స్వరూప స్వభావాలను గురించీ కథలకాలంనాటి దేశాచార వ్యవహారాలను గురించీ కూడా అనేకవర్ణనములున్నా, అవన్నీ ప్రబంధరచనల కవసరములని లక్షణ గ్రంథములు నిర్ణయించిన కవిత్వ సంప్రదాయమునుబట్టి వ్రాయబడినవేగాని చరిత్ర ప్రమాణములుగా స్వీకరించ తగ్గవికావని అనుకుంటూ వచ్చారు. పైగా రసాలంకారము లకు ప్రాముఖ్యమునిచ్చే కవిత్వధోరణిలోనున్న ఈ వర్ణనలోని సత్యాసత్యములను విడదీయడం చాలాకష్టతరమైన పనియైనది.

శ్రీ గురజాడ శ్రీరామమూర్తిగారి ఆంధ్రకవి జీవితములు, శ్రీ వీరేశలింగంగారి ఆంధ్రకవుల చరిత్ర రచించబడినప్పటి నుండి తెలుగులో చరిత్ర పరిశోధనా పద్ధతులు అభివృద్ధియై ప్రబంధములలో కూడా చరిత్రరచనకు పనికివచ్చే యదార్థాంశాలున్నవనే సంగతి తెలిసివచ్చినది. అనేక శిలాశాసనాలను విదేశయాత్రికులు చరిత్రకారులు వ్రాసిన యంశములను దేశంలో ప్రచారంలోనున్న గాథలను పూర్వులు వ్రాసిన కవిలెలను పరిశోధించగా మన ప్రబంధకవులు తమగ్రంథాలలో వ్రాసిన కవివంశ వర్ణనలలోను కృతిపతులైన రాజులవంశవర్ణనలోను చరిత్ర నిర్మాణానికి పనికివచ్చే అంశాలున్నట్లు తెలిసినది. అంతేగాక ఆయా ప్రబంధకవులు తమ కాలంనాటి రాజకీయార్థిక సాంఘిక పరిస్థితులు, ప్రజల ఆచార వ్యవహారాలు, దేశ స్థితిగతులు తమ ప్రబంధాల కథాసందర్భంలో చూపించియున్నట్లుకూడా బయల్పడినది.

ప్రబంధాల నీదృష్టితో పరిశోధించి అందులోని అంశాలను విడదీసి చరిత్రను నిర్మించిన వారిలో ఆంధ్రులచరిత్రను రచించిన శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారు ప్రముఖులని చెప్పవచ్చును. బ్రహ్మశ్రీలు వేదం వెంకట్రాయశాస్త్రులువారు రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు, వేటూరి ప్రభాకరశాస్త్రులగారు మొదలైనవారు చాలా శ్రమపడి ప్రబంధములలోని అసాధారణ ప్రయోగములను తరచి దేశాచార వ్యవహారాలలోని అనేక విషయాలను విశేషాలను బైటికి తీసినందువల్ల మన చరిత్ర పరిశోధకుల పని చాలా సులభమైనది.

ఆంధ్రదేశ చరిత్రలో విజయనగర సామ్రాజ్యయుగము చాలా ప్రాముఖ్యమైనది. ఆ కాలంలో రచింపబడిన తెలుగు ప్రబంధాలు చాలా ఉన్నవి. అప్పటి రాజులు, ప్రభువులు అనేక శిలాశాసనాలను వేయించారు. ఆ కాలంలో మన దేశానికి వచ్చిచూచిన విదేశ యాత్రికులు చరిత్రకారులు తాము చూచిన సంగతులను గురించి విపులంగా వర్ణించి

యున్నారు. ఆ కాలంనాటి రాజకీయార్థిక సాంఘిక స్థితిగతులను వర్ణించే కవిలెలు 'కడితము'లు కూడా చాలా ఉన్నవి. అందువల్ల ఆ కాలంనాటి చరిత్రను బాగా పరిశోధించడానికి వీలైనది.

ఈ దృష్టితో విజయనగర సామ్రాజ్య చరిత్రను పరిశోధించి ఇంగ్లీషులో "Studies in the History of the Third Dynasty of Vijayanagara అనే ఉద్గ్రంథాన్ని రచించిన డాక్టరు నేలటూరి వెంకటరమణయ్యగారు కృష్ణదేవరాయలవారి కాలంలోను అచ్యుత దేవరాయలవారి కాలంలోను మన దేశానికి వచ్చిన పోర్చుగీసు యాత్రికులు రచించిన గ్రంథములలోని చరిత్రాంశాలనే సాక్ష్యముగా తీసికొని ఆ కాలంనాటి తెలుగు ప్రబంధాలలోని అనేక చరిత్రాంశాల యథార్థ్యమును స్పష్టీకరించి మనభాషకు మన చరిత్రకూ మహోపకారము చేసి యున్నారు. వారు తమ గ్రంథములో మొదటి ప్రకరణము ననే మన ప్రబంధములలోని ఈక్రింది చరిత్రాంశములకు పోర్చుగీసు చరిత్రకారుల సాక్ష్యమును చూపించి మన ప్రబంధాలు చరిత్రరచన కాధారములైన ఉద్గ్రంథాలని నిరూపించి యున్నారు.

## జలక్రీడ

మన ప్రబంధము లన్నింటిలోనూ జలక్రీడ వర్ణించబడి యున్నది. ఒక్కొకప్పుడు కేవలము స్త్రీలే జలక్రీడలాడినట్లున్నూ ఒక్కొక్కప్పుడు పురుషులుకూడా ఆ జలక్రీడలలో పాల్గొన్నట్లున్నూ వర్ణించబడినది. అలాగ జలక్రీడలో పాల్గొన్న పురుషుడు ప్రబంధనాయకుడుగా వుంటాడు. ఇది కేవలమూ ఆ కాలంనాటి ప్రబంధకర్తయొక్క స్వకపోలకల్పితమైన వర్ణనకాదు. క్రీ.శ. 1510లో దక్షిణ భారతదేశంలో తిరిగిచూచిన బార్బోసా అనే పోర్చుగీసు యాత్రికుడు విజయనగరరాజ నగరువందియున్న ఉద్యాన వనములలోని సరోవరములను అందులో జరిగిన జలక్రీడలను స్వయంగా చూసి వర్ణించాడు. అతడు వ్రాసిన మాటలివి. "సామ్రాజ్యములోని గొప్ప సామంత మండలేశ్వరుల కొమార్తెలు మొదలయిన గొప్ప ఇంటి ఆడుబిడ్డలు చాలామంది రాజుగారి రాణివాసములో నున్నారు. కొందరు రాజుగారికి ఉంపుడు కత్తెలుగా ఉంటున్నారు."

రాయలవారికిని రాణులకును పరిచర్యలు చెయ్యడానికిన్నీ వారికి చెలికత్తెలుగా నుండి సంగీత సాహిత్యములతోను, సంభాషణలతోను వారిని రంజింపచెయ్యడానికిన్నీ అంతఃపురంలో చాలామంది స్త్రీజనం వుండేవారు. మన సంప్రదాయాలను బాగా ఎఱుగనందువల్ల పాశ్చాత్యులు వీరినందరినీ ఉంపుడుకత్తెలనుకునేవారు.

"స్త్రీజనంకోసం ప్రత్యేకింపబడి యున్నట్లు నేను పేర్కొనియున్న సరోవరములలో వీరందరూ అనుదినము స్నానము చేస్తారు. వీరు స్నానము చేస్తూన్నప్పుడు రాజుగారా వేడుకలు చూడడానికి అక్కడకు వెడతారు. వారు జలక్రీడలాడుతూ ఉన్నప్పుడాయన నాకర్షించిన యామె నాతడు పరిగ్రహిస్తాడు" అని బార్బోసా, 1వ సంపుటము 208 పుటలో వ్రాసినాడు.

## సుగంధ ద్రవ్యములు

ఆ కాలంలో గొప్పవారిలోను సామాన్యులలోనూ కూడా స్త్రీపురుషులందరికిని సుగంధద్రవ్యాలంటే చాలాప్రీతియనే విషయం మన ప్రబంధాలవల్ల తెలుస్తున్నది. అగరు, కస్తూరి, కుంకుమపువ్వు, పచ్చకర్పూరము, పన్నీరు, గంధము, పునుగు, జవ్వాది మొదలైన లేపనములను స్త్రీపురుషులందరూ విరివిగా ఉపయోగించేవారు. పురుషులు తమ యొడలికి చందనము పూసికొనేవారు స్త్రీలు తమ వక్షస్థలమునకు, స్తనములకు అగరు, కైస్తూరి, పునుగు, జవ్వాజి, కుంకుమపువ్వు, పన్నీరు గంధములను పూసికొనేవారు. "తెల్లచందన గంధము అగరు పచ్చకర్పూరము కస్తూరి కుంకుమపువ్వు పన్నీరుతో మెత్తగా నూరి స్త్రీపురుషులు ఒడళ్లకు పూసికొంటారు. స్నానముచేసిన తరువాత వారు వీటిని రాచుకున్నందువల్ల ఘుమఘుమలాడుతూ వుంటారు" అని బార్బోసా 1వ సంపుటం 205 పుటలో వ్రాశాడు.

## వారకాంతలు

ప్రబంధములన్నిటిలోనూ వారకాంతల వర్ణనములున్నవి, వారి సౌందర్యము, తెలివితేటలు, విద్య; సంగీత సాహిత్యములందును నృత్యమందును వారికిగల ప్రావీణ్యము; సరసములైనవారి సంభాషణములు రమ్యముగా వర్ణించబడియున్నవి. రాజాధిరాజులు గొప్ప గొప్ప ప్రభువులు విద్వాంసులు వారవనితలతో సాంగత్యము చేసేవారు. అయినప్పటికీ వారి మాయలను తంత్రములను వర్ణించి వారి కపట ప్రేమాలాపములను నమ్మరాదని కూడా ప్రబంధములలో చెప్పబడియున్నది.

1520లో విద్యానగరాన్ని దర్శించిన పోర్చుగీసు చరిత్రకారుడైన పేయను ఆ కాలంనాటి వారవనితలనుగురించి ఇలాగ వర్ణించాడు. "ఈ స్త్రీలు జార స్త్రీలు. వీరు నగరములోని గొప్ప వీధులలోనే కాపురం వుంటారు. వారి గృహములు చాలా అందమైనవి. ఈ తరగతివారు చాలా గౌరమును ప్రజాదరణమును పొందుతున్నారు. వీరిలో కొందరు మహాదండనాయకుల యుంపుడుకత్తెలుగా నున్నారు. వారింటి కెంత మర్యాదస్థుడైనా యథేచ్ఛముగా వెళ్లవచ్చును. అలాగ వెళ్లిన వారికి ఏలాంటి గౌరవలోపమూ కలుగదు. రాజాంతఃపురములోకి కూడా వారవనితలు యథేచ్ఛగావెళ్లి అక్కడ తాంబూలము స్వీకరించి రాణులతో కొంతసేపు ముచ్చటలాడి మర్యాదపొందుతున్నారు. ఎంత గొప్పవారికైనా సామాన్య సంసారుల స్త్రీలకిది సాధ్యంకాదు."

## జాతరలు - మొక్కుబళ్ళు

పాండురంగ మహత్యములో గ్రామదేవతగుడి దగ్గర జాతర వర్ణించబడియున్నది. అందులో నిప్పుల గుండాలుతొక్కడమూ, గాలపుసిడి, మొదలైనవి వర్ణింపబడినవి.(చూడు. 3వ ఆశ్వాసం పద్యము 77) కళాపూర్ణోదయములో దివ్యదృష్టి, దూరశ్రవణము మొదలైన సిద్ధులు పొందగోరేవారు శక్తిగుడి దగ్గిరచేసే సాహసకృత్యాలు వర్ణించబడియున్నవి. (చూడు. ఆశ్వా 3, పద్యము 108) శ్రీశైలములో వీరుల మంటప మొకటియుండేదనిన్ని దివ్యసిద్ధులు

పొందదలచిన శివభక్తులు అక్కడ తమ నాలుకలను కోసికొని శిరములర్పించే వానిన్ని పండితారాధ్య చరిత్రలో చెప్పబడియున్నది (చూడు. ఆశ్వా 5, పుట 53).

శ్రీశైలములోని వీర శిరోమండపములో 'కొంగవీరులు' భక్త్యావేశంలో తమ నాలుకను కోసికొని తమ తలలు నరికికొని తమ శరీరాలను పరమేశ్వరున కర్పించి దివ్య శరీరాలను పొందినారనే విషయము అక్కడనున్న శిలాశాసనములో వ్రాయబడి యున్నది.

## వెలిగుడారము

ప్రపంచ దిగ్విజయానికి బయలుదేరేముందు మన్మథుడు కొంతకాలము వెలిగుడారములో విడిసియున్నట్లు పాండురంగ మాహాత్మ్యములో చెప్పబడినది. (చూడు. 4వ అధ్యాయము పద్యము 44) ఇప్పటికి రమారమి 300 సంవత్సరముల క్రిందటి "విజయనగర సామ్రాజ్యపు" అనే కన్నడపు పేరుతోవ్రాయబడిన తెలుగు కడితము (కవిలె)లో కృష్ణదేవరాయలవారు మహమ్మదీయులపైకి దండయాత్రకు పోయేముందు కొన్నాళ్ళు నగరము వెలుపల వెలిగుడారములో విడిసియున్నట్లు వ్రాయబడియున్నది. (చూ. భారతి 6వ సంపుటము 1929, అక్టోబరు నెల 622 పుట) విజయనగర సామ్రాజ్య కాలము నాటి సంగతులను వర్ణించే రాయవాచకమనే వచన గ్రంథములో కూడా వెలిగుడారము సంగతి యున్నది. (చూడు. ఆంధ్రసాహిత్య పరిషత్తువారి రాయవాచకము పుట. 83).

పోర్చుగీసు చరిత్రకారుడైన బార్బోసా రచించిన గ్రంథము 1వ సంపుటము 204 పుటలో వెలిగుడారమును గురించి ఇలాగ వివరించబడినది. "ఎక్కడికైనా దండయాత్రకు బయలుదేరే ముందు ఒకరోజున రాయలవారు విహారం కోసం బయలుదేరినట్లుగా నగరి వెలుపల ఒక మైదానం ప్రదేశానికి పోతారు. రాయలవారి దగ్గరికి ఒక గుఱ్ఱాన్ని తెస్తారు. ఆయన ఒకచేతిలో విల్లు అమ్ములను ధరించి ఆ గుఱ్ఱాన్నెక్కిపోతూ తాము దండయాత్ర చేయదలచిన దేశంవైపునకు బాణాన్ని వదులుతారు. తరువాత తాము ఎన్ని దినాలలో దండయాత్రకు బయలుదేరేదీ సెలవు యిస్తారు. అక్కడనుంచి ఆయన ఆ వెంటనే తమ పరివారంతో బయలుదేరి ఒక విశాలమైన ప్రదేశంలో తమ శిబిరాన్ని నెలకొల్పుతారు." ఇలాగ రాయలవారు యుద్ధానికి తరలడానికి ముందుగా ఊరు వెలుపల విడిసిన శిబిరానికే వెలిగుడార మనేవారు. వెలిగుడార మనగా వెలుపల వేసిన డేరాలు లేక గుడారము.

## సైనిక శిబిరాలు

యుద్ధం చెయ్యడానికి పోతూవున్న ఒక సైన్యమును గూర్చిన వర్ణన కళాపూర్ణోదయంలో నున్నది. సైన్యము నడవడానికి ముందుగానే కొందరు వర్తకులు బయలుదేరి ఆ శిబిరము విడిసేచోటికి దగ్గరగా "అసిమి గొల్లెన" లనే చిన్న గుడారములను వేసుకొని దారిలో సైనికులకు కావలసిన సరకులనన్నింటిని సరసమైన ధరలకు సరఫరాచేస్తారు. సైన్యాలు యుద్ధానికిపోతూన్నప్పుడు దారిలో ఏవస్తువుబడితే ఆ వస్తువు దొరుకుతూ ఉన్నందువల్లనూ మంచి అందమైన పల్లకులలో స్త్రీజనము కూడా ఆ

సైన్యాలవెంట ప్రయాణం చెయ్యడానికి సౌకర్యాలు ఉన్నందువల్లనూ రాయలవారు సైన్యంతో యుద్ధానికిపోతూ ఉన్నప్పుడు అది ఒక మహానగరమంతా కదిలి పోతూఉన్నదా అనేటట్లుగా వుండేది. మామూలుగా నగరాలలో ధనికులనుభవించే సౌఖ్యాలను అనుభవించడానికి ఆటంకాలు లేనందువల్ల ధనవంతుల కందరికి అది ఆనందమును కలిగిస్తూ వేడుకగా వుండేదని కళాపూర్ణోదయములో 8వ ఆశ్వాసం 42, 43 పద్యాలలో వర్ణించబడినది.

1520-1540 మధ్య రెండుసార్లు విజయనగరాన్ని స్వయముగాచూచిన 'న్యూనిజు' అనే పోర్చుగ్రీసు చరిత్ర కారుడు రాయలవారి సైనిక దండయాత్రను ఇలాగ వర్ణించి యున్నాడు. "రాయలవారి సైన్యము విజయనగరమునుండి తరలినది. కావలసిన సరకులను పట్టుకుని చాలామంది వర్తకులున్నూ ఇంకా ఇతరులున్నూ సైన్యంకన్న ముందుగానే బయలుదేరి వెళ్లినందువల్ల సైన్యాలు వెళ్లే దారిలో ఎక్కడబడితే అక్కడకావలసిన సాధన సామాగ్రులన్నీ పుష్కలంగా దొరుకుతవి. ఒక్కొక్క దండనాయకుడికింద సైనికదళానికి కావలసిన సామాగ్రి యావత్తు సరఫరా చేయగలందులకు ప్రత్యేకముగా వర్తకులుంటారు. ఇలాగే ఇతరులకు కావలసిన సమస్త సంబారములను కూడా తీసుకుపోతారు." అని న్యూనిజు వ్రాశాడు.*

ఆ కాలంనాటి సైనిక శిబిరాలలో మహానగరాలలో లాగనే విశాలమైన రాజబాటలవంటి వీధులు, సైనికులకు కావలసిన వివిధ వస్తువుల నమ్మే అంగళ్లుకూడా బారులుతీర్చి యుండేవనిన్నీ ఆ శిబిరాలలోని గుడారములలో తమప్రియుల రాక కోసం వేచియుండి అలసి నిద్రించిన వారవనితలుండేవారనీ కూడా కువలయాశ్వచరిత్రలో వర్ణించబడియున్నది (చూ. 2వ ఆశ్వాసం. పద్యములు 85 - 110).

ఈ విషయమై న్యూనిజు ఇలాగ వర్ణించియున్నాడు. నగర వీధులలో నిర్మించబడిన ఇళ్లలాగునే సైనిక శిబిరాలలోని పాకలు గుడారాలు వేయబడినందువల్ల ఆ శిబిరంలో కూడా వీధులు ఏర్పడివుండేవి. ఒక్కొక్క దండనాథుడికిందవుండే సైనికదళం విడిసిన శిబిరానికి కావలసిన సరకులమ్మే ఒక్కొక్క బజారు వుండేది. అక్కడ అన్నిరకాల మాంసము దొరికేది. అది చూస్తూ నడుస్తూవుంటే విజయనగరంలోనే ఉన్నామా అనిపిస్తుంది. రకరకాల బియ్యము, అపరదినుసులు, జొన్నలు (Indian corn) అలచందలు, అనుములు, (Vetches minguo) మొదలైన అపరదినుసులన్నీ అక్కడ కనబడినవి. ఇలాంటి జీవితావసరాలే గాక ఇదీ అదీ అనే వివక్షత లేకుండా ఎవరికెలాంటి వస్తువు కావలసినా దొరికే ఇంకొక పెద్దబజారు కూడా వుండేది.** రాయలవారు దండయాత్ర చేస్తూఉన్న సమయములో ఆసైన్యముతో ఉన్న స్త్రీజనంలో ఇరవైవేలమంది వారకాంతలున్నారనికూడా న్యూనిజు వ్రాసియున్నాడు.***

---

* Forgotten Empire p. 329; 1 bid p.p. 23 – 3;

** ఆ కాలంనాటి సైనిక శిబిరాలనుగూర్చి "మరాఠీ సైనిక శిబిరాలు" అనే శీర్షికక్రింద 9-4-44 తేదీ ఆంధ్రపత్రికలో నేను వ్రాసియున్నాను.

*** Forgotten Empire bid 328.

## కొన్ని వింత సంగతులు

కాలము మారిపోయినందువల్ల పోర్చుగీసు చరిత్రకారుల వ్రాతలలో ఇప్పుడు మనకు అర్థముకాని కొన్ని సంగతులు ప్రబంధములలోని వర్ణనలవల్ల మనకు అవగతం అవుతున్నవి. ఈ ఉదాహరణ చూడండి: "రాజనగరు కోటకొత్తళములు, దేవాలయము లున్నూ, హెరితోనేయని కొందరు ప్రభువుల తాలూకు ఇళ్లున్నూ తప్ప, తక్కిన నిర్మాణాలతో సహా ఆ నగరం యావత్తున్నూ తక్షణమే తగులబెట్టవలసినదని రాయలవారు ఉత్తర్వుచేస్తారు. అందరు మనుష్యులూ తమ భార్యలతోనూ, పిల్లలతోనూ గృహోపకరణాలతోనూ హాజరు భాషీగా నుండగలందులకీ విధంగా ఉత్తర్వుచేస్తారు" అని బార్బోసా వ్రాసినట్లు స్పెయిను దేశంలో ఒక ప్రతియందున్నది. ఇది చదివితే రాయలవారు తమరాజధాని నగరానికి నిప్పుపెట్టించేవారా అనే అపోహ కల్గుతుంది. పైకి చూడదానికి ఎంతో అసందర్భంగా కనబడే ఈ వ్రాతను గురించి లాంగ్‌వర్తుదేము అనే ఆయన ఇలాగ వ్రాసినాడు. 'బార్బోసా వ్రాసినట్లు స్పెయినుదేశపు ప్రతిలో కనబడే అంశము, పోర్చుగీసు ప్రతిలోలేదు. ఇది విషయం అర్థం చేసుకోలేని లేఖరివ్రాసిన పొరబాటు వ్రాతయై యుంటుంది. రాయలవారు తమరాజధాని నగరాన్ని తగులబెట్టించేవారని బార్బోసా యభిప్రాయ మెంత మాత్రమూకాదు. ఒకచోట విడిసియున్న తమ సైనిక శిబిరాన్ని కదిలించి అక్కడనుంచి మరు మజిలీకిపోయే సందర్భంలో తమ సైన్యంకోసం నిర్మించిన తాత్కాలిక నగరులలోని పూరిపాకలను ఇతర నిర్మాణములను తగుల బెట్టించేవారని దీని యభిప్రాయము (చూడు. బార్బోసా 1వ సంపుటము పుట 225).

లాంగ్‌వర్తుదేముగారి ఊహ సరియైనదే ననేసంగతి ముక్కు తిమ్మనార్యుని పారిజాతాపహరణములోని 2వ ఆశ్వాసములోని 65వ పద్యంవల్ల తెలుస్తున్నది!

*తే.గీ. రాజు వీడెత్తి చనినఁదారక భటాలి*
*యంబరా భోగ నిజ శిబిరాంగణమున*
*గాలుగొల్పిన పావక జ్వాల లనగఁ*
*బ్రాచిఁ గనుపట్టె నవసాంధ్యరాగ రుచులు.* *పారి. 2వ ఆశ్వా 65*

ఆకాశములో చంద్రుణ్ణి, ఆయనచుట్టూఉన్న నక్షత్రములను ఒకరాజుయొక్క సైనిక శిబిరముతో పోల్చి సూర్యోదయమవుతూ ఉన్నప్పుడు ఆకాశములో కనపడే ఎఱ్ఱనికాంతి దండయాత్ర చేస్తూఉన్న ఆరాజు తన శిబిరాన్ని ఎత్తివేసి ఇంకొకచోటికి పోతూఉన్నప్పుడు ఆయన సేవకులు శిబిరములోని పూరిపాకలు మొదలైనవాటిని తగులబెట్టగా లేచే అగ్ని హోత్రముయొక్క ఎఱ్ఱని కాంతిలాగ వున్నదని ఆ పద్యంలో ముక్కుతిమ్మన చమత్కరించాడు.

"ఇలాంటి ఉదాహరణల నెన్నింటినో పేర్కొనవచ్చును గాని ఇప్పటి కివిచాలును. మనప్రబంధములను రచించిన కవులు కేవలమూ తమ స్వకపోలకల్పితములైన అసత్య విషయాలతో తమ ప్రబంధాలను నింపలేదనిన్నీ తమ కాలంనాటి రాజకీయ పరిస్థితులు సాంఘికాచార వ్యవహారములను తమ అనుభవ సిద్ధములైన అనేక యథార్థ విషయములనే ఆ ప్రబంధరచనలోకి చొప్పించినారనిన్నీ రుజువుచెయ్యడాని కీయుదాహరణములే చాలును.

అందువల్ల జాగ్రత్తగా నుపయోగించుకునే యెడల మన ప్రబంధములలోనుంచి అనేక చరిత్రాంశాలను బయటికి తీసి మన చరిత్రను పునర్నిర్మాణము గావించుకోవచ్చును" అని డాక్టరు నేలటూరి వెంకటరమణయ్యగారు తమ గ్రంథములో వ్రాసియున్నారు.*



# 18. కర్ణాటక కవిత్రయము

# నన్నయ భట్టారకుడు

కన్నడ కవిత్రయమని ప్రఖ్యాతి గాంచిన ఆదిపంపకవి, పొన్నకవి, రన్నకవి మన నన్నయ భట్టుగారికి చాలా పూర్వులు. క్రీస్తుశకం పదవ శతాబ్దంలో నున్నవారు. పంపకవి వేంగీదేశమునుంచి కర్ణాటకమునకు వచ్చిన ఒక ఆంధ్ర బ్రాహ్మణుని కొడుకు. ఈ కవి క్రీస్తుశకం 902లో జన్మించినాడు. పంపకవి తండ్రి వైదికమతాన్ని వదలి జైనమతం స్వీకరించినాడు. పంపకవి అరికేసరి యనే పశ్చిమ చాళుక్యరాజు దగ్గర మంత్రి గానూ, ఆస్థానకవిగానూ వుండేవాడు. ఈరాజు రాష్ట్రకూటులకు సామంతుడు. లక్ష్మేశ్వర మని నామాంతరముగల పులిగెరె, అరికేసరి రాజధాని. పంపకవి ముప్పై సంవత్సరాల ప్రాయంలో క్రీ.శ. 941లో 'ఆదిపురాణము' అనే పేరుతో ప్రథమ జైన తీర్థంకరుని చరిత్రను, విక్రమార్జునవిజయము అని నామాంతరముగల పంపభారతమును, కన్నడంలో రచించినాడు.

వ్యాసకృతమైన మహాభారత కథకూ పంపకవి రచించిన భారతకథకూ కొన్ని తేడాలున్నవి.

1. ఈయన భారతంలో ద్రౌపది పంచపాండవులందరి భార్యకాదు. అర్జునుడికి ఒక్కనికే భార్య.

2. అర్జునుడే పంపభారతానికి కథానాయకుడు. తుదకు హస్తినాపురంలో అర్జునుడికీ సుభద్రకూ పట్టాభిషేకం జరుగుతుంది.

3. భారతము అర్జునుడి పట్టాభిషేకంతోనే అంతమవుతుంది. తరువాతి పర్వాలు వుండవు.

4. తన యేలికయైన అరికేసరియే అర్జునుడని పంపకవి తనకృతిలో వర్ణించాడు.

పంపకవికి సమకాలికుడైన పొన్నకవి సంస్కృతంలోనూ, కన్నడంలోనూ కవిత్వం చెప్పి 'ఉభయకవిచక్రవర్తి' అనే బిరుదును పొందినాడు. ఈయన తండ్రికూడా వేంగీ దేశమునుంచి వచ్చిన ఆంధ్రుడే. ఈ కవిని పోషించినరాజు ఆ కాలవర్షుడు అనుపముండు అని పేరుపడిన రాష్ట్రకూట రాజైన కృష్ణరాజు. ఇతడు క్రీ.శ. 939-968

* Studies in the Hisotry of the Third Dynasty of Vijayanagara Madras university Series (1935) pp xvi-xxii.

మధ్య మాన్యఖేటమును పరిపాలించాడు. పొన్నకవి వ్రాసిన కృతులలో పదహారవ తీర్థంకరుని జీవితమైన శాంతిపురాణము అనేది సుప్రసిద్ధ గ్రంథము. ఇతడు జినాక్షరమాల అనే గ్రంథాన్ని కూడా రచించాడు.

కర్ణాటక కవిత్రయంలో మూడవవాడు రన్నకవి. ఇతడు మన తిక్కన సోమయాజివంటి ప్రతిభాశాలి. క్రీ.శ. 973-997 మధ్య పరిపాలించిన పశ్చిమ చాళుక్య రాజైన తైలవుని దగ్గరను, ఆయన తరువాత 997 - 1008 మధ్య రాజ్యముచేసిన ఆహవ మల్లుడనురాజు దగ్గరను ఆస్థానకవిగా నుండేవాడు. ఈయన 'అజితపురాణము' అనే పేరుతో రెండవ జైనతీర్థంకరుని జీవితకథను క్రీ.శ. 993లో ఒక కావ్యంగా రచించాడు. భీముడు దుర్యోధనుని గదా యుద్ధములో ఓడించిన కథను "సాహసభీమ విజయము", "గదాయుద్ధము" అని నామాంతరములుగల కృతిగా రచించాడు. ఆ కృతిలో తన యేలికయైన ఆహవమల్లుని భీమునిగా చిత్రించాడు.

తెనుగులో శ్రీ వీరేశలింగంపంతులుగారు కవులచరిత్ర రచించిన పద్ధతిలోనే కన్నడంలో శ్రీమాన్ ఆర్. నరసింహాచార్యులవారు "కర్నాటక కవి చరితె" అనే గ్రంథాన్ని వ్రాశారు. ఈ.పీ.రైస్ అనే దొరగారు ఇంగ్లీషులో నొకకన్నడ వాఙ్మయ చరిత్రను రచించారు. వీటివల్ల ఈ కవులను గూర్చిన విశేషాలు తెలుస్తున్నవి.

## కవిత్రయానికి పూర్వులు

ఇప్పటివరకూ కన్నడ వాఙ్మయంలో కాలనిర్ణయం చేయటానికి వీలైనగ్రంథాలలో 'కవిరాజమార్గము' అనేదే పురాతనమైనది. క్రీస్తుశకం 814 మొదలు 871 వరకు మాన్యఖేటమును పరిపాలించిన రాష్ట్రకూటరాజైన నృపతుంగుడు దీనిని రచించినట్లు చెపుతారుగాని ఆయన ఆస్థానంలో నుండిన శ్రీ విజయకవియే దీనిగ్రంథకర్త అని ప్రతీతి. ఈ కవి రాజమార్గము, ఒక లక్షణగ్రంథము. సామంతభద్ర, కవి పరమేష్ఠి, పూజ్యపాద, శ్రీవర్ధదేవ, విమలోదయ, నాగార్జున, జయబంధు, దుర్వినీత, శ్రీవిజయ మొదలైన మహాకవుల లక్ష్యలక్షణ గ్రంథాల ననుసరించి ఈ కవిరాజమార్గమును రచించినట్లు ఆ గ్రంథకర్తయే వ్రాసియున్నాడు. కాబట్టి అంతకు పూర్వము కన్నడ భాషలో ఉద్గ్రంథాలున్నట్లు స్పష్టమగుచున్నది.

## కన్నడము - తెలుగు

కన్నడమునకూ, తెలుగునకూ మొదటినుండీ చాలా దగ్గర సంబంధము ఉన్నది. ఈ రెండు భాషలూ మాట్లాడే దేశాలకు రాకపోక లుంటూవుండేవి. వీటిని వేఱుపఱచే నైసర్గికమైన హద్దులుగాని దుర్గమములైన అడవులూ, కొండలూ గాని లేవు. ఈ రెండు భాషలకూ లిపి ఒకటే. ఒక్కొక్కప్పుడు ఈ రెండు ప్రాంతాలూ ఒకే రాజుల పరిపాలన క్రిందగాని రాజబంధువుల క్రిందగాని ఉండేవి. వేంగిదేశాన్ని క్రీస్తుశకములో 7వ శతాబ్దంనుండి 12 శతాబ్దంవరకూ పాలించిన తూర్పు చాళుక్యులు, పశ్చిమ చాళుక్యుల వంశంవారే.

పూర్వసముద్రతీరాన్ని ఉన్న తెలుగు వారిని గెలిచి వారిచెంతనున్న కన్నడిగలతో చేర్చి తూర్పు చాళుక్యులు వేంగీ మండలాన్ని పరిపాలించారు. రాజరాజ నరేంద్రుడు క్రీ.శ. 1022 మొదలు 1063 వరకూ రాజమహేంద్రవరములో రాజ్యం చేసినాడు. ఆయన ఆస్థానకవి నన్నయభట్టు. ఆయన ఆంధ్రమహాభారత కృతికర్త.

జైనమత ప్రాబల్యమునకు ఉనికిపట్టు అయిన పశ్చిమ కర్ణాటమును వదిలి వైదికమత సానుభూతిగల చాళుక్యరాజశాఖ వెంబడి వైదిక మతవిద్వేషులగు జైనులతో మతయుద్ధము చేయుటలోను కవిత్వరంగమున గూడ జైనపురాణములకు ప్రతిగా వైదిక పురాణములను రచించుటలోనూ నారాయణభట్టును నన్నపార్యుడును నడుము గట్టినారు. రాజరాజ నరేంద్రుడు బహుభాషలలో చాలా భారతములను వినినట్లు నన్నయగారి భారతములోనే వుంది. ఆ భారతాలలో కన్నడంలో ఆదిపంపకవి రచించిన జైనభారతం ఒకటి అని అనడానికి సందేహం లేదు.

## నన్నయగారి కన్నడపోకడలు

"కావ్యముల కుండవలసిన శబ్దాలంకారాది కావ్యశృంగారమును నన్నయ, రన్నని గ్రంథములనుండి చూసివ్రాసినాడని తోచుచున్నది. రన్నని అజితపురాణములోని రీతులు ఎన్నో నన్నయలో కనబడుతున్నవి" అని శ్రీ కురిగనూరి నరసింగరావుగారు ప్రమోద సంవత్సర భాద్రపదమాసం మొదలు భారతిలో "కన్నడిగలు తెలుగలు"అనే శీర్షికతో వ్రాసిన ఐదువ్యాసాలలో ఒకచోట వ్రాశారు. అందులో నన్నయభట్టు మొదలు పాల్కురికి సోమనాథుని వరకూ తెలుగు కవులు కన్నడకవుల రచనలను చదివి వాటికి మెఱుగు పెట్టి తెనుగులో కవిత్వం చెప్పినదానికి ఉదాహరణము లిచ్చారు.

## నన్నయభట్టు గారి పద్యాల కన్నడమాతృకలు

వ. *నకలక్ష్మావర ఖేచరాంచితమహా మాణిక్యగాణిక్యహా*
*స్తికరశ్రేణ్యర్థిత చక్రవర్తి విభవం మన్నంబలిక్షేంద్రయై*
*హికపారత్రిక భోగమంకుడు వినం మాణిక్యభట్టారకాం*
*తికమంసారె వినేయరాజిగెజయం భద్రాం శుభం మంగళం"*
*పంపని ఆదిపురాణము, ఆశ్వాసం 16 పద్యం 8.*

మ. *మదమాతంగతురంగ కాంచనలసన్మాణిక్య గాణిక్య సం*
*పద లోలిన్ గొనితెచ్చి యిచ్చి ముదమొప్పన్ గాంచి సేవించి ర*
*య్యుదయాస్తాచలసేతు శీతనగ మధ్యోర్వీపతు ల్సంతతా*
*భ్యుదయున్ ధర్మజు తత్సభాస్థితు జగత్పూర్ణప్రతాపోదయున్*
*నన్నయ మహాభారతం, సభాపర్వం, ఆశ్వా. 1. పద్యం 8.*

మ. అలర్థదిముసత్తైపూత పానమ్మిగె కుమన వుంకుతిర్పతం
చెరువివం గెలల్చు గెవ తుం బిగతధ్వనియుంకుశిల్పకో
గిలెవ నెదోతి నుత్రె నెవమా మరుహార్మాదల్ల యుబ్బవ
య్యాల పానగావరంపుగిలో శేనెనెదత్తో జనంతమూవదోళ్.
పంపభారతము, ద్వితీయ అశ్వాసం, పద్యము 12

లయగ్రాహి :

కమ్మనిలతాంతములు కుమ్మెనని వచ్చు మధు
పమ్ముల సుగీతనినదమ్ము చెనగం జూ
తమ్ములలనల్కి నలయమ్ముల సుగంధి ముకు
ళమ్ములను నానుచు ముదమ్మెనరవాహా
లమ్ములగుకోకిలకులమ్ముల రవమ్ము మధు
రమ్మగుచు వీచె ననిశమ్ము సుమనో భా
రమ్మున నశోకనికరమ్ములును జంపక
చయమ్ములును గింశుకవనమ్ములునునొప్పెన్
నన్నయభారతం, ఆది పర్వము - అశ్వా 6వ, 134.

మ॥ మొదలొళ్ళంతనమాను పత్తుదివసం చాపాగమాచార్య న
య్యుదినం భాన్కరనందనం దినయాగం శల్యంభరంగెయ్యుదా
దదివార్ధం దినదర్థదిందినగదా యుద్ధం పరిచ్ఛిన్న మిం
తుది నంగళ్ పదినెంట రింసమెదు దారుద్రాహవం భారతం"
- రన్నని గదాయుద్ధము లేక సాహసభీమవిజయము, అశ్వా 6వ. 39.

తరలము : పదిదినంబులు భీష్ముడాహవభారకుండు గురుండు పం
చదివసంబులు గర్ణుడున్ దివసద్వయంబు దినార్ధమం
దుదితతేజుడు శల్యుడత్యధికోగ్రవీరగదా రణం,
బది దినార్ధము గాగ నిట్లు భయంకరప్రవృత్తితోన్॥
- నన్నయభారతము, ఆదిపర్వము అశ్వానం. 1. పద్య 68.



# 19. ఓనమాలలో జైన సంప్రదాయము

మన ఆచార వ్యవహారాలలో జైనసంప్రదాయము లెన్నో ఉన్నవి కాని వానిని మనము గమనించడం లేదు. ఈ జైన సంప్రదాయం మనలో ఓనమాలతోనే ప్ర [illegible] ధాతనామ సంవత్సరాది సంచికలో నొక అమూల్య వ్యాసమును వ్రాసియున్నారు.

"మనవారు బాలురకు మొట్టమొదట నక్షరస్వీకార మొనరించుట వేదవిహిత సంస్కారముగా నొనర్చిరి. అదియే అక్షరాభ్యాసమను పేరుతో ప్రసిద్ధమయియున్నది. తండ్రి చేతనో బడిపంతులు చేతనో బియ్యములో బంగారపు టుంగరముతో ఓంనమఃశివాయ సిద్ధంనమః అని వ్రాయించి అది పిల్లవాని చేత ప్రథమమున పలికించెదరు. పిల్లవాని చేత పలికించుటలో కాఁబోలు అది క్రమముగా "ఓనమః శివాయః సిధం నమః"గా పరిణమించినది. అది అంధ పరంపరగా వాడుకలో నిలిచి యున్నది. ఈయవ భ్రష్టోచ్చారణను సమర్థించుటకు ఓంకారాదుల యుచ్చారణము బాలురకు నిషిద్ధము కావున ఇది ఇట్లు రూపాంతరముతోను దేశించుట పరిపాటియని కొందఱనవచ్చును. అది యుక్తముగాదు. తదుచ్చారణ మెల్లరకును లభ్యమగునట్లే అప్పటి మతబోధకులు గావించిరి కాని మఱుగుపరిచి మాఱుత్రోవను అపభ్రంశముగానుపదేశింపఁబూనినవారు కారని అప్పటి మతచరిత్ర తెలుపును. అ ఆ. మొదటగల అక్షరవర్గము నకు 'అ ఆ'లనియు, క ఖ మొదటగల అక్షరవర్గమునకు 'కాఖా' లనియు పేర్లు వచ్చినట్లు "ఓంనమఃశివాయ సిద్ధంనమః" అను దాని మొదటి యక్షరములను బట్టి "ఓనమాలు" అనిపేరు ఏర్పడినది. వర్ణసమామ్నాయమునందలి యక్షరముల సంయోగముచే ఏర్పడినదే యీ 'ఓంనమః" ఇత్యాది వాక్యము. ఇది వేఱుకాదు. అయినను ఇదియొక ప్రత్యేక వర్గముగా ఏర్పడి పోయినది.

అకార ఉకార మకార సంయోగరూపమగు "ఓమ్" అనునది సృష్టిస్థితిలయ కారణమగు పరమాత్మను తెలుపునని ఉపనిషత్తు తెలుపును. వేదారంభమున బయలు వెడలిన యక్షరమదియే. కావుననే ఇది సామాన్యముగా ప్రారంభ పర్యాయమైనది. ఇట పరమాత్మనయినను ప్రప్రథమ ప్రారంభమునయినను తెలుపుననవచ్చును. "శివాయ నమః " శివుని కొఱకు నమస్కారము అనగా శివునికి నమస్కారము; "సిద్ధం నమః" సిద్ధుని గుఱించి నమస్కారము - అనగా సిద్ధునికి నమస్కారము. వీనిలో మొదటిదగు శివ నమస్కారము శైవ సంప్రదాయమున వచ్చినది. రెండవదగు సిద్ధ నమస్కారము జైన సంప్రదాయమున వచ్చినది. సిద్ధుఁడు జైనమతమున పంచపరమేష్ఠులలో నొకడు. జైనగ్రంథముల యాద్యంతములందు "సిద్ధంనమః" అనునది వ్రాయఁబడు చుండును. జైనమతమున దీనికి "సిద్ధమాతృక" అనిపేరు.

*"తతోభగవతో వక్త్రాన్ని స్సృతామక్షరావలీమ్*
*సిద్ధంనమ ఇతి వ్యక్తమంగలాం సిద్ధమాతృకామ్॥*

అని యాదిపురాణమునఁగలదు. (అ. 8.59.) "ఓం సిద్ధంనమః" "ఓం నమోసిద్ధం," "నమఃసిద్ధం" అని జైన గ్రంథములయందు గలదు. శివాయనమః అనునట్లే 'సిద్ధాయ నమ' అని యనఁదగును గాని జైన సంప్రదాయము ననుసరించి "సిద్ధంనమఃఅనునదే గ్రహింపఁబడినది. ఈ వాక్యద్వయ సమ్మేళనము ఆకాలమందు మన దేశమందున్న శైవజైనమతముల సమరసతను సమప్రధానతను చాటుచున్నది.

వైష్ణవ మత ప్రాబల్యము గలచోట 'శ్రీహరిః ఓంనమః" అని అక్షరాభ్యాసము చేయుదురు. కొందఱు తమిళదేశమున తద్భాషోచ్చారణానుసారముగా "హరిః నమోత్తు

చిందం" అని యుపదేశింతురు. 'చిందం, అనునది సిద్ధం అనుదానికి అపభ్రంశరూపము. ఇది వైష్ణవ జైనమతముల సమ ప్రాధాన్యమును తెలుపును మలయాళ దేశమువారు "హరిః శ్రీగణపతయే నమః" అని యక్షరాభ్యాసము చేయుదురు. ఇందు వైష్ణవ గాణాపత్యమతముల సమప్రాధాన్యము తెలుపబడినది. ఆ దేశమున శైవ జైనమతముల వ్యాప్తిహెచ్చుగా లేదు కదా! పై వాక్యమున వారొక విశేషమును దెలుపుదురు. అక్షర సంకేతము ననుసరించి అక్షరము లేబదియాఱు అనియు అక్షరస్వరూపమైన సరస్వతియొక్క ధ్యాన మందుఁగలదనియు చెప్పుదురు. అది యెట్లనిన 'హరిః' యను దాని నొక భాగముగాను శ్రీగణపతియేనమః అను దాని నొకభాగముగాను గ్రహించి అందు హ = 8, రి = 2, అంకానాం నామతోగతః అనుప్రకారము = 28,+ శ్రీ = 2; గ = 3, న = 5, ప = 1, త = 6,* యే = 1, న = 5,** మ = 5 మొత్తము 28; వెరశి = 56 అక్షరములు అనిరి. ఘుణాక్షర న్యాయమున నీ యక్షర సంఖ్య సరిపడుచున్నది. దీనినిట్లు సమన్వయింపఁ జేయుట బుద్ధిప్రావీణ్యమును స్పష్టపఱచును. యాథార్థ్యము మాత్రము వైష్ణవ గాణాపత్య మతములనే యీ మంత్రము కంఠోక్తముగా తెలుపుచున్న దనక తప్పదు.

కన్నడ దేశమునను ఈ సంప్రదాయము కలదు.'సిద్ధం' అను దానికి వర్ణ సమామ్నాయ మర్థమనివారు నిర్వచనము చేసికొనిరి. ఈ నిర్వచనము బలాత్కారముగా తెచ్చిపెట్టినది. అదియు జైనమతవ్యాప్తి తగ్గిన తరువాత కల్పింపబడినదే కావచ్చును. జైనమత వ్యాప్తి గలిగిన కాలమున శైవమంత్రమునకు ప్రక్కనుజేరి పరంపరగా వచ్చుచున్న 'సిద్ధం నమః' అనుదానిని నివారింపజేయజాలక సహింపనొప్పక మనస్తృప్తికై యిట్టి నిర్వచనమును కల్పించికొని యుండవచ్చును.

మన యాంధ్రదేశమున మొన్నమొన్నటి వఱకును జైనమతము వ్యాపించి యుండుటయేగాక, ఇతర మతముల సామరస్యముతో వెలయుచుండుట గలదు. ఏ మతము వచ్చినను అందలిగుణమును గ్రహించి, అందు గ్రహింపదగిన భాగమును గ్రహించి కలయికతో ప్రవర్తించుట ఆంధ్రులకు లక్షణము. కావుననే ద్రావిడాది దేశములకంటె ఆంధ్ర దేశమున బహురూప దేవతారాధనమును, తదనుయాప వేషాది ధారణమును హెచ్చుగాఁ గలదు. పరధర్మానుకరణము నేఁటికిని ప్రాయికముగా మనదేశమునఁ గానబడుచున్నది.

శైవమతము, వీరశైవమనియో, అద్వైతమనియో ఏదో యొక రూపమున మనలో ననుగతమగుచునేయున్నది. కాన "ఓం నమః శివాయ" యనుభాగము మనకు ప్రధానము. జైనము నామమాత్రావశిష్టమగు నేఁటికాలమున గూడ జైన సిద్ధమాతృకను మన మంత్రముతో కలిపి యక్షరాభ్యాస కాలమున బాలుర కుపదేశించుట మనలో నిలిచిపోయినది. ఇది ప్రాచీన చారిత్ర విషయస్ఫోరకము. అవిచారమూలకముగా దానిని మన మనుసరించు చున్నామనియు నొప్పుకొనక తప్పదు."



* ఇట 'టాదివన' అను దాని ననుసరించి గ్రహింపబడినది.
** ఇట 'త' దగ్గరనుండి గ్రహింపబడినది.